# మహోదయం

## జాతీయ పునరుజ్జీవనంలో గురజాడ స్థానం

కె. వి. రమణారెడ్డి

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
ఏలూరురోడ్డు విజయవాడ-2

# మహోదయం

★

బ్రతికి, చచ్చియు, ప్రజల కెవ్వడు
ప్రీతి గూర్చునో, వాడె ధన్యుడు.

— డాయన్ పితియన్.

★

కీర్తిశేషులైన
అవసరాల సూర్యారావు
స్మృతికి నివాళిగా అర్పిద్దామనుకొని
అప్పారావు పాదులోని మొలకై ఇప్పుడో రేపో అంటూన్న
శ్రీ గురజాడ వెంకట రామదాసు పంతులుగారికి
అర్పిస్తున్నా నీ పుస్తకాన్ని ఆయన జీవితంలో తుదికానుకగా.

1969 మే 1.

# పితృస్మరణ

వన్నెకెక్కిన కవులు మువ్వురు
నన్నయాదులు వెలుగు దివ్వెలు —
వారి దారిని వీడ రాదని
వ్రాసినా రస్యత్.

కాలగతితో క్రొత్త రీతిని
కాంచనేరక పాత ఛందపు
అంచమనియెడు వెర్రి భ్రాంతుల
నాంధ్రకవు లుండస్.

భావ విప్లవ మొకటి దెచ్చితి
నవ్యతకు భవ్యతను గూర్చితి
తెలుగు కవితల తీగ లల్లితి
వెల్లరసు తొలిగా.

క్రొత్త పాతల మేళవించుచు
మత్తుదుల్చెడి క్రొత్తత్రోవల
కెక్కి జాతికి తెలియ జెప్పితి
వెక్కుడగు విద్యత్.

ముద్దులొలికెడు ముత్తెసరులను
మురువు గూర్చెడు మంచి కతలను
నాటకమ్ముల మణికిరీటము
నగలు భారతికిన్.

గురజాడ వెంకట రామదాసు.

# వి ష య సూ చి

# కాలక్రమణిక



| | | |
|---|---|---|
| పుట్టుక | ... | 21-9-1862 |
| అక్షరాభ్యాసం | ... | 1867 |
| ఇంగ్లీషు భాషాభ్యాసం | ... | 1869—1870 |
| చీపురుపల్లి పాఠశాలలో | ... | 1870—1872 |
| ఉపనయనం | ... | 1870 |
| విజయనగరం మిడిల్ స్కూల్లో | ... | 1872—1882 |
| గిడుగు రామమూర్తి పరిచయం | ... | 1875 |
| విజయనగరంలో సెకండ్ గ్రేడ్ కాలేజి స్థాపన | ... | 1877 |
| అది ఫస్ట్ గ్రేడ్ కాలేజీగా మార్పు | ... | 1879 |
| **Cuckoo** గేయరచన | ... | 1882 |
| మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థత | ... | 1882 |
| కాలేజీలో యఫ్. యే. చదువు | ... | 1882—1884 |
| **Sarangadhara** కావ్యరచన | ... | 1883 |
| చదువులో అంతరాయం | ... | 1884 ఏప్రెల్ నుండి కొద్దికాలం |
| కాలేజీలో బి. యే. చదువు | .... | 1884—1886 |
| పెళ్ళి | ... | 1885 |
| కాలేజిఉద్యోగం; లీవు; డిప్టీకలెక్ట రాఫీసులో హెడ్‌గుమాస్తాగిరీ | ... | 1886 |
| నాలుగో అసిస్టెంటు లెక్చరరు ఉద్యోగం, ఆనందగజపతి దర్శనావకాశం | ... | 1887 |
| స్థానిక కాంగ్రెసు మీటింగులో పాల్గోడం, విక్టోరియారాణి ప్రశంసా పద్యాలు(ఇంగ్లీషు) | ... | విజయదశమిరోజు 1887 |
| జ్యేష్ఠపుత్రికా జననం | ... | 1887 |
| విశాఖ మండల 'స్వచ్ఛందసేవాదళ' సభ్యత్వం | ... | 1888 |
| ఆస్థానంలో గోష్ఠిక ఉపాధ్యక్ష పదవి | ... | 1889 |
| పుత్రోదయం | ... | 12-10-1890 |
| మూడవ లెక్చరరుగా ప్రమోషను | ... | 1891 |
| తమ్ముడు శ్యామలరావు మరణం | ... | 1891—1892 |
| 'జగన్నాథ విలాసినీ' సభ చే 'కన్యాశుల్క' ప్రదర్శనం | ... | 1892 ఆగస్టు |
| "సత్యవ్రతి" శతక రచన | ... | 1892—1894 |
| అనారోగ్యం. మద్రాసుకు వెళ్ళి వుండటం | ... | 1895 |
| సంస్థాన శాసన పరిశోధకుడుగా నియామకం | ... | 5-6-1896 |
| "ప్రకాశిక" పత్రికకు సంపాదకుడుగా 'డిక్లరేషన్' | ... | 1896 |
| ఆనందగజపతి భార్య వనజకుమారీదేవి మరణం | ... | 16-5-1896 |

| | | |
|---|---|---|
| 'కన్యాశుల్కం' నాటకం ఆనందగజపతికి అంకితం | ... | 1-21-1897 |
| 'కన్యాశుల్కం' తొలి కూర్పు ముద్రణ | ... | 1897 |
| 'హరిశ్చంద్ర' నాటక పీఠిక | ... | 4-1-1897 |
| ఆనందగజపతి మరణం | ... | 23-5-1897 |
| రీవారాణి ఆంతరంగిక కార్యదర్శిగా నియామకం | ... | 1898 జూన్ |
| కుమార్తె పెళ్లి; కుమారుని ఉపనయనం | ... | 12-5-1898 |
| విజయరామగజపతికి వధూ నిర్ణయం కోసం కాశీ ప్రయాణం | ... | 1898 మే |
| సంస్థానానికి సంబంధించిన చిల్లర వ్యాజ్యాలు | ... | 1898 — 1903 |
| కలకత్తా వకీలు రసవిహారిఘోష్ కోసం కలకత్తా ప్రయాణం | ... | 29-11-1900 |
| రీవారాణివెంట మద్రాసులో వైస్రాయి దర్శనం | ... | 12-12-1900 |
| 'శ్రీరామవిజయ వ్యాయోగ' (సంస్కృతం) నాటకానికి పీఠిక | ... | 1-1-1901 |
| రెండవ కుమార్తె జననం | ... | 1902 |
| సంస్థానం పెద్దదావా ప్రారంభం; యస్. శ్రీనివాసఅయ్యంగారు పరిచయం | ... | 1903 |
| తండ్రి మరణం | ... | 24-4-1905 |
| నీలగిరి కొండలపై 'కొండుభట్టీయం' తొలిరచన | ... | 1906 వేసవి |
| 'నీలగిరి పాటలు' ముద్రణ | ... | 1907 |
| మద్రాసు కాంగ్రెసు మహాసభ సందర్శనం | ... | 1908 డిసెంబరు |
| 'కన్యాశుల్కం' రెండవ కూర్పు పీఠిక | ... | 1-5-1909 |
| "కన్యాశుల్కం" రెండవ కూర్పు ముద్రణ | ... | 1909 |
| బరంపురం సహపంక్తి విందులో పాల్గోడం | ... | 1910 |
| 'దేశభక్తి' గేయ రచన | ... | 1910 |
| "ముత్యాలసరాల లక్షణము" వ్యాసరచన | ... | 1910 |
| 'దిద్దుబాటు' కథ ప్రచురణ | ... | 1910 ఫిబ్రవరి (ఆంధ్రభారతి) |
| 'పూటి చోద్య మేమి చెపుదు' గేయ ప్రచురణ | ... | 1910 మార్చి ,, |
| 'మీ పే రేమిటి?' కథ ప్రచురణ | ... | 1910 ఏప్రిల్-జూన్ ,, |

'తోకచుక్క' (ముత్యాలసరం) గేయ ప్రచురణ ... 1910 జూలై (ఆంధ్ర భారతి)

'కాసులు' గేయ ప్రచురణ ... 1910 ఆగస్టు ,,

'డామన్ పితియస్' గేయ ప్రచురణ ... 1910 సెప్టెంబరు ,,

'లవణరాజు కల' గేయ ప్రచురణ ... 1911 జనవరి ,,

'ఉమాపతి అర్చన' గేయ ప్రచురణ ... 1911 ఆగస్టు ,,

'కన్యక' గేయ ప్రచురణ ... 1912 అక్టోబరు ,,

'బిల్హణీయం' ప్రథమాంకం ప్రచురణ ... 1910 (ఆంధ్ర పత్రిక)

,, ద్వితీయాంకం ప్రచురణ ... 1911 ఏప్రిల్ ,,

'కవిశేఖర' బిరుదు ? ... 1912 ?

'పూర్ణమ్మ' గేయ రచన ... ?

'గ్రామ్యశబ్ద విచారణము' వ్యాసరచన ... 24-11-1910 (అవసరాల సూర్యారావు నిర్ణయము)

'ఆకారాదున్న ఉక్తదాలు' వ్యాసరచన ... 29-12-1910 (రామానుజాచార్య విద్యాసమితివారి ప్రచురణ ప్రకారం)

'కవిత్వము,వద్దుపద్దు' వ్యాసరచన ... 1909 ?

'బాలికా హారకాల' వ్యాసరచన

'వంగీయ సాహిత్య పరిషత్తు' వ్యాసరచన ... 1912

'రవీంద్ర కవి' వ్యాసరచన

రీవారాణి స్మృతి ... 14-12-1912

పెద్దదావాలో రాజీ ... 1913

మద్రాసు యూనివర్సిటీలో బోర్డాఫ్ స్టడీస్ సభ్యత్వం బి. ఏ పరీక్షాధికారం ... 1911 నుంచి

ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపన ... 12-5-1911

మద్రాసులో పండిత సభలో పాల్గోడం ... 15-5-1912

'కళింగదేశ చరిత్ర'ను విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' వారికి ఇవ్వనిరాకరించడం ... 1912

మద్రాసు యూనివర్సిటీ 'ఫెలో' గా నియామకం ... 1913 జనవరి

'ఆధునిక ఆంధ్ర వచన రచన' నివేదిక రచన, సమర్పణ ... 1913 — 1914

'సుభద్ర' కావ్యరచన ... 1913

'విశ్వవిద్యాలయాలు-సంస్కృత, మాతృ భాషలు' నివేదిక ... 1913 — 1914

| | | |
|---|---|---|
| THE MINUTE OF DISSENT TO THE REPORT OF THE TELUGU COMPOSITION SUB-COMITEE నివేదిక | ... | 1914 |
| సంస్థానంలో పింఛనీ ఏర్పాటు | ... | 12-2-1913 |
| కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్సభలో పాల్గోడం | ... | 1914 |
| సుస్త్రీ | ... | 20-11-1914 |
| 'దించులంగరు' గేయరచన | ... | 1914 ఏప్రెలి |
| విశాఖపట్నంలో డా. ఎల్లింగ్టన్‌వద్ద ఆరోగ్య పరీక్ష | ... | 1915 |
| 'లంగరెత్తుము' గేయరచన | ... | 1915 సెప్టెంబరు |
| నూతన గృహప్రవేశం | ... | 1915 |
| మరణం | ... | 30-11-1915 |
| తల్లి కౌసల్యమ్మ మరణం | ... | 1916 జనవరి |
| భార్య అప్పలనరసమ్మ మరణం | ... | 1923 |

# "ఆదిత్య హృదయం"

పెక్కు లోకటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే ?

ఆంధ్ర దేశంకంటె ఎంతో బాగుంటుందనుకొని ఆత్మహత్య చేసుకొని నరకానికి వెళ్ళిన శ్రీశ్రీకి, అక్కడ వరాండాలో చుట్టగాల్చుకొంటూ అసిరిగాడు కనిపించాడు. వాడిచేతిలో ఒక రూపాయిపెట్టి గురజాడ వేంకట అప్పారావుపంతులు ఉంటూన్న ఇంటి నెంబరు అడిగి తెలుసుకొనివెళ్ళి, ఏఁరా అంటే ఏఁరా అంటూ సంభాషణకు ఉపక్రమించినట్టు, శ్రీ శ్రీ ఒక ఊహాచిత్రం నిర్మించాడు.1 మహామహా కవులనందరినీ దర్శించుకోవాలంటే నరకానికి వెళ్ళవలసి ఉంటుందని అనటోల్ ఫ్రాఁస్ చమత్కారంగా రాసిన మాటలు, బియాట్రిస్ చెయ్యిపట్టుకొని నరకంలోని వింతలను చూస్తూన్న డేంటీ మహాకవికి వెర్జిల్ మహాకవి కనిపించినట్లు డేంటీ చేసిన వర్ణన, గుర్తుకు వస్తాయి. ఇఁతకూ "స్వర్గ నరకముల ఛాయా దేహాళి" భూప్రపంచకంలోని మనుషుల నివాసాలలోనే ఉన్నదని అప్పారావు చెప్పి ఉండేవాడు; శ్రీశ్రీ ఒప్పుకొని ఉండేవాడు.

శ్రీశ్రీ పుట్టిన ఐదేళ్ళలోనే గురజాడ అప్పారావు దాటుకొన్నాడు. శ్రీశ్రీ అక్షరాభ్యాసంలో అప్పారావుది కాదు మేలుబంతి. ఇరవయ్యేళ్ళప్రాయాన భావకావ్యావరణంనుంచి స్వతంత్రించి విప్లవించి ఆగొన్న అలగా సందుగొందులగుండా అభ్యుదయ ఘంటాపథానికి వచ్చి చేరుకొన్న శ్రీశ్రీకి గమ్యం నిర్దేశించింది మాత్రం ("భావికి బాట") గురజాడ గురుపే. సాహిత్యానికీ ప్రజాజీవితానికీగల బ్రహ్మముడిని గురించి వివరించిందీ ఆయనే. 'అభ్యుదయ' కవిత్వంతోటి అలాకలిసింది అప్పారావుకు పొత్తు. ఆలోగా, ఆయన జీవితావసానవేళ సనసన్నగా తోచిన 'అభినవ' కవిత్వం చిక్కనై తెలుగుమీరి 'భావ' కవిత్వమయింది. ఆదీ ముదిరి 'అభావ' 'అహంభావ' కవిత్వాల పిందెలు పుట్టాయి. చెడుతూన్న చెట్టుకు కాయకల్ప చికిత్స అవసరమైంది. నులివేళ్ళతో జాతి గుండెనుంచి పీల్చి బోదె కందించి పూతకూ పిందెకూ

పంచే జీవసారాన్ని తెలుగు కవిత్వానికి సగఫరాచేసి పోయిన కవిత్వ విషయ్క గనకనే అప్పారావు ఈ అన్ని మార్పులలోనూ తాను మారకుండా నిలిచిపో గలిగాడు.

"తెలుగు ప్రజల స్మృతిపథంలో అప్పారావు సదా జీవిస్తాడు. చనిపోయి నప్పటికీ అతను జీవిస్తున్నాడు," అన్నాడు కన్నీళ్ల చేతితో తుడుచుకొని గురజాడ వెంకటరామ దాసును ఊరడిద్దామని ఉత్తరం రాస్తూ, గిడుగు రామమూర్తి. అయినా అప్పారావుమూర్తి 1915 నవంబరు మాసాంతపు రోజున ప్రాణపుష్టి కోల్పోయింది. కళ్ళతోచూచి కళ్ళకు గట్టినట్లు ఆ రూపాన్ని అక్షరాలలో చిత్రించారు డాక్టరు గిడుగు వేంకట సీతాపతిగారు :

> వెడల్పయిన నుదురు, చక్కని పెద్ద కనులు, ఆ కనులకు గొడుగు పట్టినట్లున్న కనురెప్పలు, 9 అంకెవలెనున్న చెవులు, సోగగా కొంచెము వంగినట్లున్న ముక్కు, మృదువైన అధరము, దానిక్రింద కొంచెము సంపుతేరి స్ఫుటముగానున్న గడ్డము, వెడల్పు, పొడవుగల చెక్కిళ్ళు, పురుష లక్షణము లకు తగినట్లు కనుబొమలు, మీసము—ఇవి అన్నీ ముఖమునకు నిండుతనము, గాంభీర్యము కలిగించి, వీరు దృఢకాయులు, ఆరోగ్యవంతులు అయివుందురనె నన్న అభిప్రాయమును కలిగించును. కాని వీరు బాల్యమునుండియు కృశులు గానే ఉండేవారు. 2.

తలపాగాల రోజుల్లో అప్పారావుది పెద్ద తలపాగా; మీసాల దినాళ్ళలో కోరమీసం. సాటివారిలో తలెత్తుకొని తిరిగి పెద్దమనిషి అనిపించుకొన్నాడు. వ్యవహార దక్షుడయ్యాడు. కుశాగ్ర బుద్ధికి పేరు బడ్డాడు. పైగా ముందుచూపుగల కవి. హాస్యదృష్టితో లోకాన్ని చూస్తూ దయతో మనస్సులను బోధ పరచుకొంటూ తాత్వికుడు కూడా కాగలిగాడు.

కన్యాశుల్కం నాటకంగాని, గురజాడ సాహిత్యం అంతా కలిసిగాని ఆయనకీ చిరంజీవిత్వాన్ని ప్రసాదించలేదు. ఈ సాహిత్యంకంటె దానిని సృష్టించిన మనస్సు చాలా గొప్పది. సమకాలానికి ముందుబడీ దానినుంచి వేరుపడీ మాత్రమే ఆయన గొప్పవాడుకాలేదు. ఆ కాలానికి ఎంతో ఎగువనుకూడా ఆయన భావన చరించింది. అలాంటివాడు తన జాతికి ప్రాతినిధ్యం వహించగలుగుతూనే, ఇతర జాతులకు తన జాతి తరపు రాయబారి కాగలుగుతాడు. ప్రాంతీయ విలక్షణత్వాన్ని నిలుపుకొంటూనే,

సార్వజనీనమైన సామాన్యత్వాన్ని సాధించుకోగలుగుతాడు.[3] మృత్యువును మీరి గురజాడ అప్పారావు జీవించడానికి కారణం ఇదే.

భవిష్యత్తులో ఒక్కొక్క ఏడాది పైబడుతున్నకొద్దీ, గడిచిపోయిన రోజులను వెనక్కుతిరిగి చూచుకొనేటప్పుడు, తెలుగువాళ్లు గురజాడ అప్పారావుకు "నమ్రతతో, గౌరవముతో" జోహారులర్పిస్తారని విజ్ఞుడైన అలనాటి ఆంగ్లేయుడు రాశాడు. "రచయితగా, పండితునిగా, దేశభాషా సంస్కరణోద్యమ అధ్యులుగా లోకము ఆయనకు హారతులు పడుతుంది."[4] పొల్లుబోవడానికి ఇదేమీ జోస్యంకాదు. ఆయన బహుముఖ కృషిని, అనన్య ప్రయోగాలనూ గమనించిన వ్యక్తికాబట్టి జె.ఎ. ఏట్సు ఇంతధీమాగా భవిష్యత్తుగురించి రాయగలిగాడు. అప్పటివరకు గురజాడ అప్పారావు పొందైనాకిట్టని బి. యన్. శర్మవంటి ప్రత్యర్థులుకూడా, జాతికి సాహిత్యానికీ "ఆత్మస్నేహితు"డని అప్పారావును ప్రస్తుతించగా, కోర్టు లావాదేవీల్లో అప్పారావుతోబాటు నలిగి మెలిగిన న్యాయవాది యస్. శ్రీనివాసయ్యంగారు ఊరకుండగలరా? సామాన్యుడనిపించే అసామాన్యుడైన అప్పారావు, సాహిత్యంలోనూ పురావస్తు తత్వశాస్త్రంలోనూ మాత్రమేగాక, లోకుల తీరుతెన్నులను గుర్తెరగడంలో కూడా ఎంతో జ్ఞానాన్ని సంపాదించాడన్నాడు. మాక్ హంటర్‌లాంటి విద్యావేత్త వేసిన అంచనా సరైనదనుకొంటే, అప్పారావు "దక్షిణ భారతదేశములో గల మేధావులలో పండితులలో ప్రథమ శ్రేణికి చెందిన వ్యక్తి"[5]

ఇందరిన్ని విధాలుగా ప్రస్తుతించినా, 'పండిత' వర్గంలో అప్పారావు గురించి నాటికీ నేటికీ చిన్న చూపే ఉంది. గిడుగు వెంకటరామమూర్తి కుమారుడు వేంకట సీతాపతిగారు కూడా ఒకమారు నోరు విడిచి అనగా లేనిది, ఆనాటి ఆకాశరామన్న ఒకడు, నీవు అపండితుడవని రాయి విసరడ మేం వింత?[6] దీనికి గల ఒకే ఒక అర్థం అప్పారావు నిరాడంబరత్వమే. అడుగుపెట్టిన చోటెల్లా జ్ఞానపు గనులను చూడగలిగిన వివేకి ఆయన. విద్య ఆయనకు వినయాన్నిచ్చింది. చివరి వరకూ జిజ్ఞాసువుగానే ఉండిపోయాడు.

అలాగే అప్పారావు శీలం గురించి అపవాదులెన్నో చలామణిలో ఉన్నాయి. దీని అర్థం ఆయన విశాలదృక్పథమే. వర్ణధర్మంలో అక్రమాన్ని, దాంపత్యజీవితంలో స్త్రీ విషాదాన్ని, భోగంపిల్లలో మానవత్వాన్ని, మతసంస్థలుగా కొరడు బారిన వాటిలో లోపాలను ఆయన గమనించాడు. దేశిరాజు పెదబాపయ్య లాంటి బ్రాహ్మ సమాజికులు కూడా అంతర్వర్ణభోజనాలకు పెడముఖం పెడుతున్నప్పుడు

రఘుపతి వేంకటరత్నం వంటి నూతన మతగురువులు భోగం మేళాలను కంటగించు కోవడమేగాక వయస్సు వచ్చిన విధవల పునర్వివాహాలకు నొచ్చుకుంటున్నప్పుడు, వేశ్యావృత్తిని సంస్కరించడం దేశం నుంచి హిమాలయపర్వతాలను నిర్మూలింప జూడడమేనని హేమాహేమీ సంస్కర్తలే పెదాలు చప్పరిస్తున్నప్పుడు, సంస్కరణోద్యమాలకు విమర్శకుడయ్యాడు గనకనే తాను దూషింపబడ్డాడు. మానవీయదృక్పథమే ఆయన తత్వం. వస్తుతత్వం గురించే ఆయన ధ్యాస. హృదయ వ్యాపారం మీదనే ఆయన గురి. టి. యస్. ఇలియట్ నిర్వచనం ప్రకారం, ఆయన వివేకి.

Wisdom is a native gift of intuition, ripened and given application by experience, for understanding things, certainly of living things, most certainly of the human heart.

కొయ్య బొమ్మలను విడిచి కోమలమైన హృదయాలనే మెచ్చబూనుకొన్న మనిషికి లోకంలోని సాదాతనం పగ అవుతుంది. సాదాతనాన్ని తనమీదికి కవ్వించుకొని నింద తలమోయవలసివస్తుంది. గొప్పదనం గొప్ప మనిషికి అనుక్షణమూ ఒక శిలువమాను దండన.

నాకు తెలిసి ఒకటికంటె ఎక్కువమార్లు గురజాడ అప్పారావు మరణించాడు. ఆయనవి రెండు జన్మలూ మూడు మరణాలూ. బతికిఉండగానే విరోధులు విసిరిన రాళ్ళతో ఆయన కీర్తికి ఒకమారు చచ్చినంత పనైంది. తీరా చనిపోయాక, కీర్తి కాయాన్ని హింసిస్తూ పారనంది జగన్నాథస్వామిగారొకమారు, పొట్లపల్లి సీతారామారావుగారొకమారు 'జయంతి కుమారస్వామి'గారింకోమారు దాడిచేశారు. రామందాడి చేసిన చిల్లరమల్లర ఘాతుకులకు లెక్కేలేదు. 'ఫిలిస్టయిన్స్' (Philistines) అనే మాటకు ప్రత్యక్ష ఉదాహరణలు కల్పిస్తూ సాగిన ఈ 'విమర్శ'లు నిందలుగానే చరిత్రలో మిగిలిపోయాయి, భాష, సాహిత్యం తమ హక్కు భుక్తాలనుకొనే నిక్కుబోతులు నాటికీ నేటికీ గురజాడ అప్పారావును ఢీకొని బొప్పెలుగట్టిన మోరలతో అక్షరాలా శృంగభంగంపొందారు. ఏల పాటలకూ స్త్రీల పాటలకూ వాఙ్మయంలో ఎలాంటి స్థానమైతే ఉందో, జాతి జీవితంలో గురజాడ సాహిత్యానికలాంటి స్థానం ఉంది. ఆ గేయాలు నాలుకకు పట్టాయి, మనస్సుకెక్కాయి. ఆ ఛందస్సూ తెలుగువాడి సొంతమైంది. కాలక్రమంలో ఒకానొక బిందువువద్ద నిలిచి సమస్తాంధ్ర జీవితాన్ని వైవిధ్యసంపన్నంగా అక్షరబద్ధం చేసిన కన్యాశుల్క నాటకం, సాహిత్యానికీ సంఘచరిత్రకూ ఉపయోగపడింది. కాబట్టి పనిగట్టుకొని ఎవరోకల్పిస్తే

కలిగిన పెద్దతనమేమీకాదు; తెచ్చి తన తలపై తాను మోపుకొన్న కిరీటమేమీకాదు గురజాడ అప్పారావుది. జాతి వర్తమానాన్ని సుదూర భవిష్యత్తుతో ముడివెయ్యబట్టీ; పాతను కొత్తతో అతుకుతూ "క్రొమ్మెరుంగు"లను చిమ్మబట్టీ; సాహిత్యంలోనే గాక భాషలోనూ ప్రజా దృక్పథంతోబాటు, జీవితంలో ఆలోచనలో హేతువాద పూర్వకమైన నవనాగరిక వైఖరి నవలంబించబట్టీ; తనంతతానై ఆయనను గొప్పదనం వరించింది. ఆయన ఎత్తినాడని కిడాంబి రంగాచార్యులవారు ప్రశంసించిన "ప్రజాసామాన్య రక్తధ్వజం" ఆనాళ్ళలో పండిత వృషభాలకు "రక్తవస్త్రశకల" మైతే, ఈ నాళ్ళలో సదరు వృషభాల సంతానానికి బెదురు పుట్టిస్తున్నది. 8 లేగ దూడలూ గిత్తలూ దుక్కిటెద్దులూ చేసిన దాడుల అంతరార్థమిదే.

సాంస్కృతిక పునరుజ్జీవనం (Renaissance) చేకూర్చిన మార్పులు గురజాడ అప్పారావు జీవితాన్ని సాహిత్యాన్నీ తాకి విడిచినంత గట్టిగానూ, మెండుగానూ ఆనాటి ఆంధ్రప్రముఖుల జీవితాలనూ సాహిత్యాలనూ స్పృశించలేదు. సమాజం అట్టడుగువరకు విద్యా విజ్ఞానాలను తీసుకుపోయేందుకై గ్రంథభాషను సంస్కరించి, విద్యావిధానానికి జాతీయతను ఒంటబట్టించి, రచయితలను జాతికి అధ్యాపకులుగా చేయాలనుకొన్నాడు. రచయితలలో కాల్పనికవాదం రగుల్కొలిపిన అబద్ధపు సౌందర్య సృష్టను దగ్గరకు చేరనివ్వక, ఆదర్శబలంతోటీ వస్తుపరమైన దృష్టితోటీ ప్రజాహితకరమైన సాహిత్యాన్ని సృష్టించి మనోవికాసం కలిగించబూనాడు. ఆయన హాస్యంలోకూడా గంభీర హృదయస్పందనలు వినిపించే దిందుచేతనే. మెచ్చని వాళ్ళను విడిచి ముందుకు వెళ్ళగోరాడు. గతించాకనే అప్పారావు గొప్పను హఠాత్తుగా గుర్తెరిగినట్లు, కాకినాడలో కూడిన చతుర్థాంధ్ర మహాజన సభవారు "ఆంధ్ర దేశమునకు మహోపకారము చేసినవారిలో" ఒకరుగా అప్పారావును పేర్కొన్నారు. శాసనసభలో భాషావిషయమై అప్పారావును గట్టిగా వ్యతిరేకించిన మోచర్ల రామచంద్రరావు, ఆ మహాసభ అధ్యక్ష స్థానంనుంచి ప్రసంగిస్తూ "...తెలుఁగు భాషను జ్ఞానాభివృద్ధికిని జనసామాన్యమునకు అర్థజ్ఞానము కలిగించు నవీన రచనాపద్ధతికిని వారు మార్గదర్శకులైరి" అన్నాడు. 9

ఎటొచ్చీ కందుకూరి వీరేశలింగం, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు—ఈ ముగ్గురే, ఆధునికాంధ్ర సాహిత్య నిర్మితిలో, అభిరుచి నిర్ణయంలో, రాళ్ళెత్తిన తొలిపనివాళ్లు. ఈ త్రయంలోనూ వీరేశలింగం మూలవిరాట్టు. ఆయన

తోటి అప్పారావుకు గల సామ్యమల్లా, ఒక పూర్ణరాశికీ అందులోని భాగానికీ గల సామ్యమే. అలాగే దేశభాషా పండితుడుగా గిడుగు రామమూర్తి బుజాలను అప్పారావు దాటిపోలేడు. నవయుగ భావచేతన మూడుపాయలుగా సాగిన సెలయేరు, కాలం చేతి ముమ్మొనవాలు, వాళ్లు ముగ్గురూ. నూతక్కి రామ శేషయ్య గారి కావ్యచరణాలను కొద్దిగా మార్చి రాస్తే —

మూటు బారెడు రక్త మొక్కటె
మూటు వెలిగెడు తేజ మొక్కటె
మూడనుటె తప్పు.

— అని వాళ్లను వర్ణింపవచ్చు. అయితే వారికి అన్ని విషయాలను గురించి అంగీకారం ఉండేదని భావించడం పొరబాటు. సంస్కర్తగా వీరేశలింగం గిడుగు రామమూర్తికి ఆచార్య ప్రాయుడు; గురజాడ అప్పారావుకు కనీసం 1911 తర్వాతనైనా "నిశ్చయముగా మహాపురుషుడు". భాష గురించీ, సాహిత్యం గురించీ ఈ ఇద్దరికీ ఆయనతో చాలాకాలం సరిపడలేదు. అప్పారావు మరణించిన నాలుగేళ్లకు అవసాన దశలోనే వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి వీరేశలింగం అధ్యక్షుడుగా ఉండబూనాడు. అంతవరకూ వారిమధ్య సంబంధాలుకూడా అంతంత మాత్రమే. బ్రహ్మ సమాజంకూడా అప్పారావును ఆకట్టుకోలేక పోయింది. సంస్కరణాది విషయాలలో వీరేశలింగం పరిశుద్ధవాదం మానవుల హృదయ ధర్మంతోటి స్పర్థించే సరికి; ఈశ్వరుని పితృత్వం సంస్కర్తల పితృస్వామిక నియంతృత్వంగా పరిణమించే సరికి; నీతినిష్ఠల పేరిట దయకూ జాలికీ జాగా కుంచించుకు పోయే సరికి; గురజాడ అప్పారావు స్నేహ, ప్రేమమార్గ బోధకు పూనుకోవలసి వచ్చింది. సంస్కర్తల గుంపులో దూరిన ఆషాఢభూతులను ముసుగూడదీసి బటాబయలు చెయ్యవలసి వచ్చింది. అలాగే భాష విషయంలోనూ, శృంగార రస పోషణ విషయంలోనూ, 'పండిత' సంప్రదాయానికి దుర్గరక్షకుడుగా నిలిచిన వీరేశలింగం రచనలను పట్లీకునే విమర్శించవలసి వచ్చింది. భోగం మేళాలను సమర్థించకున్నా సంగీతనృత్యాది లలితకళలకూ భోగంవారికి ఉంటూ వచ్చిన బాంధవ్యం గురించి ఉపన్యసించినప్పుడు, అంతటి ఆప్తమిత్రుడైన గిడుగు రామమూర్తికే బాధ కలిగింది — ఇక పారనంది జగన్నాథస్వామి వంటి వారి దృష్టిలో అప్పారావు రసికావతారం కాకుండా ఎలా పోగలడు? సమకాలానికే ముందడుగు

వేసిన సాహసి గురజాడ అప్పారావు. అడవిలో ఆయన తొక్కిందంతా దారి అయింది. ఇప్పుడది ఇసుక దొంకగా మారింది.

రచయితే కాదలచుకోని వ్యక్తికి "మహాకవి" నన్న స్పృహ ఉంటుందా? కమ్యూనిస్టులు కాదు మొదట ఆయన తలకు ఆ బిరుదు బందను ఎత్తింది; దేవుల పల్లి కృష్ణశాస్త్రిగారు తమ గేయంలోనూ, నిడుదవోలు వేంకటరావుగారు తమ ఉపోద్ఘాత గ్రంథంలోనూ ఆ పని చేశారు. వింజమూరి రంగాచార్యులవారు శోక ముత్యాల సరంగారాసి 1916 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటించిన "అప్పారాయ స్మృతి" అప్పారావును "కవీంద్రచంద్రు"డని పేర్కొన్నది. * అప్పారావు మాత్రం అంతటి స్వోత్కర్ష ప్రదర్శించకుండా, ఉత్తరోత్తరా బయలుదేరి రాగల ఒక మహా రచయిత కోసం అందరూ కలిసి అనుకూల పరిస్థితులను కల్పించాలని అన్నాడు. ఇది అతి వినయమూ కాబోదు, ఆయన ధూర్తుడూ కాదు. ఎందుకంటే తానొక కొత్త పుంత తొక్కుతున్నట్లు గుర్తెరిగాడు. సంకల్ప పూర్వకమైనదే ఈ పథ ప్రదర్శనం కొత్త రచయితల కోసం, వారి మద్దతు కోసం, ఆయనపడిన తహతహ సమస్తం, ఆగామి రచయితలు సుసంపన్నమైన నాగరికమైన సాహిత్యాన్ని సృష్టించాలనే కోరికవల్లనే కలిగింది. తన ప్రయత్నం అల్పమైనదని తానే అను కొంటే స్వయంగా యిలా రాయడు:

> తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం; కావ్య యితివృత్తాలు భారతీయం. కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను; జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి, కథా, కవితా రూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయ త్నించాను.10

ఎంత నవ్యరీతులైనా కావచ్చుగాని, అప్పారావు గతాన్నీ అది ఇచ్చిన వారసత్వాన్నీ పూర్తిగా నిరాకరించలేదు. అలాగే వారసత్వం పేర రాజాధీనమూ పండితైక వేద్యమూ నైవేద్యమూ అయిన సాహిత్యాన్ని మొత్తంగా ఒప్పేసుకో లేదు. సంప్రదాయాన్ని నిరసించాడని అప్పారావును విమర్శించే వాళ్లున్నారు. సంప్ర దాయమంటే ఏకశిల (Monolith) కాదని వాళ్ళు గమనించరు. వాఙ్మయంలో గేయ

---

* 'ఆంధ్రభారతి' పత్రికలో 'కన్యక' అచ్చు పడినప్పుడు అప్పారావు పేరుకుముందు 'కవి శేఖర' బిరుదు ఉంది. బసవరాజు అప్పారావు, బుర్రా శేషగిరిరావు, నిడదవోలు వేంకటరావు రచనలు దీనిని ధృవీకరిస్తున్నాయి.

వాఙ్మయం, మతంలో ఆది వైదికమో లేక బౌద్ధమో అప్పారావును తృప్తి పరిచాయి. ఆయనది మత సమన్వయ వైఖరి. అంతేగాక చాలావరకు 'లౌకిక' (Secular) వైఖరి. కర్మకాండలూ మత సంస్థలూ ఆయనకు సరిపడలేదు. అంత మాత్రాన్నే ఆయన సంప్రదాయవిరోధి అయికూర్చోడు. రాధాకృష్ణన్ అన్నట్లు—

Tradition is not only concord with the past but also freedom from the past.11

"పంజరమ్ముల నున్న కట్లను పగలదన్నగ" జూచినవాడు, "మందగించక ముందు కడుగెయ్" అని కూడా అనగలిగాడు. కావ్యం రాసినవాడుమాత్రమే కవి శబ్దవాచ్యుడయేట్లుంటే, నిజమే, గురజాడ అప్పారావు మహాకవికాడు. నాటకాది ప్రక్రియలుకూడా కావ్యభేదాలే అయితే, గురజాడ అప్పారావు మహాకవి. భాసుడూ శూద్రకుడూ కావ్యాలేరాసి మహాకవులుకాలేదు. తెలుగు కవిగా పదేళ్ళకంటె అధికం జీవించని గురజాడ అప్పారావు కొందరి దృష్టిలోనైనా "మహాకవి" కాగలిగాడంటే, ఆయన కావ్యరచనలోని ఛందస్సుగానీ, శబ్దంగానీ సువ్యవస్థితమూ, సుసంస్కృతమూ సంస్కృతముకూడా అయినందువల్లకాదు. తరువాతితరాలవారికి విస్రబ్ధమైన, అపూర్వమైన శబ్దస్ఫూర్తిని ప్రసాదించిపోయాడనీకాదు. తాను రాసినవిధంగా రాయుటుండానే పోయివుంటే, తరువాతివాళ్ళు తాము రాస్తున్నవిధంగా రాయలేకపోయేవాళ్ళు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి పద్యాన్ని సులభసుందరంచేశాడు. అయితే గేయాన్ని పైకెత్తింది గురజాడ అప్పారావు. గేయంలో వాడుకమాటలను అధికంగా ప్రవేశపెట్టి వాటికి కావ్యగౌరవం కలిగించడమేగాక, రసస్ఫూర్తికి గ్రాంథిక పదజాలం కంటె ఎక్కువగా అవే ఉపకరిస్తాయనికూడా ప్రదర్శించిపోయాడు. ఛందస్సుదేశితనం, కావ్యభాష సౌలభ్యం, ఇతివృత్తాల నవ్యత్వం, సమకాలికత్వం, ఉపదేశబలం—ఇదంతా గురజాడ అప్పారావు కవిలోకానికిపెట్టిన భిక్షే. అందుచేతనే పది ఇరవై గేయాలకంటె ఎక్కువ కవిత్వ సామగ్రిని చేకూర్చిపెట్టిపోని మనిషినికూడా "మహాకవి" అనేందుకు ఆ కొందరు పూనుకొన్నారు. శ్రీ శ్రీ అన్నట్లు—

ఏ కవియొక్క ఆవిర్భావంవల్ల ఈ ప్రపంచం ఇంకో అడుగు ముందుకు వేసిందో ఆ కవే మహాకవి. 12

అంచనాలు ప్రతి తరానికీ మారిపోతూ వుంటాయి. కవుల కీర్తి పరమ చపలం. నేటి శిఖరిణి స్థానంలో, రేపటి అఖాతం కంటికెదురుగావచ్చు. అయితే బొమ్మలకొలువులో పైనుంచి కిందికీ కిందినుంచి పైకీ బొమ్మలను మారుస్తూ

తన ముచ్చట తీర్చుకొనే చిన్నదానివంటి వాడు, విమర్శకుడనిపించుకోడు. అభిరుచిలో రాకతప్పని గొప్ప మార్పులూ విమర్శకుల తీర్పులూ ఒక్కటే కాదు. గురజాడ కావ్య జీవితానికి గూడా ఉచ్చనీచదశలుంటే ఉంటాయేమోగాని, కవి అయినవాడు 'అకవి' అయిమాత్రం కూర్చోబోడు. అలా అస్తవ్యస్తంగా తీర్పు చెప్పే విమర్శకుడు యమధర్మరాజు కొలువులోని ఎచ్చిపిచ్చి తలవరి. అలాంటి ఆతతాయికిన్నీ, అభిరుచి గలిగిన 'సంపత్' వంటి సద్విమర్శకుడికిన్నీ గుణంలోనే భేదం ఉంది — కుమతికీ మతిమంతుడికీ ఉన్నభేదం! గురజాడ అప్పారావును మహాకవి కోటిలో చేర్చడం సముచితం కాదంటూనే, "....గొప్ప నాటకకర్త; ఉద్యమ ప్రవక్త; దూరదర్శి; కాలముతో మార జీవితాన్ని సమాజాన్ని నిశితంగా ప్రతిపాదించ గలిగిన సమీక్ష్యకారి. ప్రయోగ సాహసమున్న ప్రతిభావంతుడు.... అతడు మహాకవి కాకపోయినా ఖండకావ్యరచనకు ప్రేరకుడు, మార్గదర్శి." అన గలిగిన సమ్యక్ దృష్టి "సంపత్" గారికి ఉంది.[13]

కాలమనే జవనాశ్వపు జూలును ఒడిసిపట్టుకొని ఒక్క ఉదుటున ఎగిరి దాని మూపున జేరి, ఆ బెదురు చూపుల 'బుకీఫేలస్'ను ఇష్టానువర్తినిగా మార్చుకొని, యుగాశ్వ హృదయాన్ని బోధపరచుకోగల నేతృత్వమున్నూ; కాలానుసారంగా మనస్సులను మలచగోరి క్రమపరిణామ మందగతిలోనే ఎంత చిన్నదైనా ఒక దాటు వేయించగల నేతృత్వమున్నూ; అప్పారావు సమకాలీనులలో అనేకులకు లేవు. గడియారపు ముళ్ళ నడిమి కాలాన్ని స్తంభింపజేయబూనారు కొందరు. కొత్త ఒకరోతగా పాత ఒకవింతగా తల్లకిందుల తపస్సు చేశా రింకొందరు. కావడానికి అందరూ 'అగండులే'! ఒకరి గిరసలు తొక్కుకొంటూ మరొకరై, పెనుమార్పు తుఫానుగాడ్పుకు చెలరేగి అతివేలంగానురుసులుకక్కుసాగిన జీవితసముద్రంలో ఉత్తాల తరంగ సన్నిభంగా, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు రఘుపతి వేంకటరత్నం, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు, జయంతి రామయ్య, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, తిరుపతి వేంకట కవులు, వేదం వేంకటరాయశాస్త్రి, ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మ, పానుగంటి లక్ష్మీనరసింహారావు చిలకమర్తి లక్ష్మీనరసింహం, మారేపల్లి రామచంద్రశాస్త్రి, చిలుకూరి వీరభద్రరావు — ఎవరికి వారే అతిరథప్రాయులు. అది 'టైటాన్ల' జాతి; అతికాయులూ మహామతులూ నైన వారి వంశం పందొమ్మిదో శతాబ్దిలోపుట్టి పదిహేడో శతాబ్దానికి తనమనస్సు నర్పించుకోకుండా, ఇరవయ్యో శతాబ్దికి అప్పగించు కొన్నాడాయన. కాలాన్ని బట్టే

గాకుండా, ఆయన నవ్యత వాస్తవమైన నవ్యత. ఆయనకూ నవ్యులకు ఆద్యులుగా గణనకు వచ్చిన తదితరులకూ, చూపులోనూ తలపులోనూ తేడా ఉంది మహాపురుషుడైన వాడు సృష్టించిన సాహిత్యానికిన్నీ, కానివాడు సృష్టించిన సాహిత్యానికిన్నీ, గుణమే భేదించక తప్పదు. ఇందుచేత కూడా గురజాడ సాహిత్యానికి ఆయన వ్యక్తిత్వపు గొప్ప మోహరు పడుతున్నది.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి మాటల్లో చెప్పాలంటే, గురజాడ అప్పారావు తెలుగు సారస్వతానికి 'సరిహద్దు'. 14 వచన రచయితలు, కథాకారులు, నాటక కర్తలు, కవులు, అందరూ ఆయనను సొంతపరచుకొని, వ్యక్తిని మహత్తరమైన సాహిత్యశక్తిగానే మార్చివేశారు. పద్యరచయితల కంటె ఎక్కువగా వచన రచయితలే గురజాడ అప్పారావుకు సాహిత్య వారసులని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిరాశాడు. 15 ఇందుకు తగినకారణం లేకపోలేదు. రాయప్రోలు సుబ్బారావుగారి వెంటలేచిన నవకవిలోకం 'భావ' కవిత్వావరణలో ప్రవేశించిన రోజులలో, అప్పారావు స్థాపించిన ప్రజా దృక్పథం మరుగునపడింది. పండితుల శిరఃకంపం కోసం గాకున్నా, తమతమ సాంఘిక, విద్యాసంబంధి నేపథ్యాలను పురస్కరించుకొనైనా, 'మార్గ' కవిత్వవాసనలను కవులు తిరిగి ఒంటబట్టించుకొన్నారు. కాకుంటే ముఖ్యుడైన ప్రతి భావకవీ గురజాడ అప్పారావును ప్రేమతో భక్తితో సంభావించి, వెంటనే పక్కదారికి మళ్ళిననాడే. అలాగే ముత్యాల సరాన్ని ప్రతిముఖ్యకవీ కాస్సేపు మెడలో వేసుకొని ముచ్చట తీరాక తీసి పక్కన బెట్టాడు. రాయప్రోలువారి 'చిలక' కూడా ఆ ఛందస్సుకు పుట్టినబిడ్డే. పూర్వోక్తమైన రంగాచార్యుల గేయాన్ని వచనం చేస్తే —

వేగుజుక్క వెలుగును నిద్రామత్తులు చూడలేకపోయారు. దాని కోటి సూర్యకాంతి అడవిగాసిన వెన్నెలఅయింది. ఆ చుక్క రాలింది. ఇంకా నిద్రలో ఉంది లోకం. ఇంతలో తూర్పు తెల్లవారింది. పక్షుల కలకలారావం మొదలైంది. ఆ రాలిపోయిన వేగుజుక్కను చూచి ఉండిన కొద్దిమంది దాని శోభ గురించి పొగుడుతూంటే, అప్పుడప్పుడే ఒళ్లు విరుచుకోసాగిన వాళ్లు తెల్లబోయారు:

ఎక్కడైతే చుక్క వెలిగెనో
అక్కడొక్కటి కాంతి వెలసెను

అట్టులెత్తి జనంబు లెల్లను
అద్భుతంబునఁ జూడఁగన్.

అప్పరాయ కవీంద్రుని తేజం ఆంధ్రలోకమంతా నిండి వెలుగుతున్నదని ఆచార్యులవా రన్నారు. అవును. మద్రాసులో చేరి చదువుకొంటూ, కాకినాడ వెళ్ళి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిని కలిసినప్పుడెల్లా బసవరాజు అప్పారావు గురజాడ గేయాలను గొంతెత్తి గానం చేసేవాడట. గురజాడ "యిగురుపాట" బసవరాజు అప్పారావుచేత సెలయేటి గానం చేయించింది.* పెద్దాపురంనుంచి చింతా దీక్షితులు కూడా కాకినాడకు ఈ గేయాలనూ వాటి సువాసననూ మోసుకెళ్ళేవాడు. గురజాడ బాలగేయరచనల ప్రభావమేగాక సులభ భాషాసౌందర్య స్పర్శకూడా దీక్షిత సాహిత్యాన్ని సోకింది, ఇక కృష్ణశాస్త్రిగారున్నారు. గురజాడ అప్పారావుకు మహాకవి పదమిచ్చి ఆ పోయిన కోకిలను తానొక చిన్నిపికమై ఆక్రోశిస్తూ పిలిచారు. అలాగే అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులద్వారా అప్పారావు గొప్పదనాన్ని గ్రహించి, నేరుగా కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్సభలో ఆ వాణిని ఆలకించి, తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు తమ రచనాపద్ధతిలో మార్పును సాధించుకొన్నారు. గురువైన గిడుగు రామమూర్తి వద్దనుంచి గురజాడ అప్పారావుమీద సదభిప్రాయాన్నిపొంది తెలికిచెర్ల వెంకటరత్నంగారు గురి నిలుపుకొన్నారు. కన్యాశుల్క నాటకభాషకూ తద్గత హాస్యానికీ ఘమిడిపాటి కామేశ్వరరావు మనస్సు నర్పించుకోగా, అబ్బూరి రామకృష్ణారావుగారు ఆ నాటకరంగ ప్రయోగానికి శక్తి వెచ్చించుకొన్నారు. ఇలా పద్య, గద్య రచయితల కుభయులకూ గురజాడ అప్పారావు భిన్నరూపాలలో సన్నిహితుడూ విహితుడూ కాగలిగాడు ఆయన కావ్యాత్మ, జాతి రక్తప్రవాహమన దగిన రచయితృ పరంపరలో ఇలా కలగలిసి సత్తువ పట్టించింది. ఆ అడుగుజాడ గట్టిగానో తేలికగానో అచ్చుపడని రతనాతలమంటూ తెలుగునలేదు. 'నవ్య' సాహిత్యపు ప్రాణమూలంలోనే చైతన్యరూపాన నిలిచి, ఆధునికాంధ్ర జీవిత ప్రవాహంలో లీనమైపోయిన "గురజాడ వాల్మీకి" ఈ నా కథనానికి కేంద్రబిందువు.

---

* 'సెలయేటి గానము' (1915) "శ్రీ కవిశేఖర గురజాడ అప్పారాయ స్మృతి"కి అంకితమైంది. "పరమగురు సమానులు" గురజాడ అప్పారావు కవిత్వ పఠనమే బసవరాజుకు ప్రోత్సాహ జనకమైనదట.

# 2

**1963** లో విశాలాంధ్ర ప్రచురణాలయం నా [illegible]ను ప్రచురించింది. దానికిది పరివర్ధిత సంస్కరణం (Enlarged Edition) కాదు. సరికొత్త రచన.

ఈ గ్రంథాన్ని మూడు భాగాలుగా విభజించుకొన్నాను. బ్రిటిష్ పాలనకు ముందువెనకల ఆంధ్రసాహిత్యమూ సంఘమూ ఏఏ మార్పుల కగ్గమైందీ 'ఉదయ సంధ్య'లో వివరించాను. గ్రంథవిస్తర భీతిచేత చారిత్రక నేపథ్యాన్ని విడనాడడం సరికాదనిపించింది. జీవిత చరిత్రకారుడు రూపచిత్రకారుడున్నూ చరిత్రకారుడున్నూ కావలసివుంటుందని ఆంద్రే మార్వా (Andre Maurois) అని ఉన్నాడు. అయితే చరిత్రను ఏకరవుపెట్టినంతమాత్రాన అతని పని తీరదు. గతించిపోయిన కాలాన్ని సాకల్యంగా తన కళ్ళకు కట్టించుకోజాలని చరిత్రకారుడు, ఊహల రంగులతోనే యుగచిత్రాన్ని వెయ్యగలడు. అందుచేత చారిత్రక దృక్పథానికి బతిగా, కవిజీవిత చరిత్రకారుడు, ఆ కవియొక్క భావనా కేంద్రాన్ని అంతు చిక్కించుకొని, అతని ఆలోచనా వైలక్షణ్యాన్ని అలవరచుకోవలసి వుంటుందని హెలెన్ గార్డినర్ (Helen Gardener) ఉవాచ. కావ్యపరిశీలన ఇందుచేతనే విధాయక మౌతున్నది. 'సప్తాశ్వాలు' అనే విభాగం ఈ భావనాకేంద్ర పరిశోధనకున్నూ సాహిత్య పరిశీలనకున్నూ వినియుక్తమైంది ఇందుచేతనే. ఈ రెండు రచనాఖండాలమధ్య 'అరుణోదయం'లో గురజాడ అప్పారావు లౌకిక జీవిత పూర్వచిత్రం లభిస్తుంది. దానితో బాటుగానే అభినవాంధ్రజాతి జీవితకథకూడా. ఈ పునరుజ్జీవనంలో అప్పారావు స్థాన మెలాంటిదో నిర్ణయించడంకూడా అవసరమైంది. గ్రంథం పేరు, శీర్షికలు, అన్నీ సూర్యసంబంధి సంకేతాలతోనే ఉండడమనేది సంకల్ప పూర్వకమే.

కాలక్రమణిక, గురజాడ వాఙ్మయదర్శిని గ్రంథంలో ఆద్యంతస్థానాలలో ఉండడం, పాశ్చాత్యగ్రంథ ప్రణాళికానుసారమే. గురజాడ వాఙ్మయసూచిక సర్వ సమగ్రమేమీ కాదుగాని, నాకుగల శక్తినీ అవకాశాన్నీ బట్టి నేను సేకరించగలిగిన ఈ భోగట్టా, ముందు ముందు పరిశోధకులకు ఉపకరిస్తుందని మాత్రమే దానికీ పుస్తకాన చోటిచ్చాను. అనుబంధాల పేర గ్రంథాంతాన అచ్చుపడుతున్నవెల్లా

ఇంతవరకూ పత్రికలలో మాత్రమే అచ్చుపడి ఉన్న అప్పారావు రచనలో, ఆయన పుస్తకాలలో 'మార్జినల్ నోట్సు'గా ఉండిపోయినవో, వ్యక్తులకు ఆయన రాసిన లేఖలో అయి ఉన్నాయి. అవి పదుగురెదుటకు రావడమిదే ప్రథమం. పరిశోధిస్తూ పరిశ్రమిస్తూ పోతే ఇంకా మరికొన్ని దొరికే అవకాశం ఉంది.

జవహర భారతి, కె. వి. రమణారెడ్డి

కావలి. 1–8–1968.

---

1. "నరకంలో" – గురజాడ : మన సాహితి ప్రచురణ : శ్రీ శ్రీ – పు. 54-55.
2. మహాకవి గురుజాడ వేంకటఅప్పారావు :
   డా. గిడుగు వేంకటసీతాపతి, (వ్యా)గు. శ. సం, హై., పు. 8
3. *Goethe as sage - On poets and poetry;*
   T. S. Eliot pp. 207-210
4. మిస్టర్ జె. ఎ. ఏట్సు : గు. ర. మ. డై., పు. 230 - 231.
5. మదరాసులో సంతాపసభ : అదే, పు. 221-226.
6. ఆదర్శపురుషుడు :
   డా. గిడుగు వేంకటసీతాపతి : పరిశోధన, డిశంబరు, జనవరి 1956 (వ్యా).
7. చూడు, పైన 3.
8. మహాకవి – మహాపురుషుడు : సెట్టి ఈశ్వరరావు, పు. 37-38.
9. చతుర్థాంధ్ర మహాజనసభ : ఆంధ్రోద్యమము, పు. 307, 367.
10. గు. ర. లే., పు. 205.
11. *Most Dear to All the Muses;*
    Radhakrishnan: Tagore - A centenary volume, p. xvii.
12. "కవిత్రయం" : శ్రీ శ్రీ, తెలుగుతల్లి - 25-10-1945 (లే. ప్ర.)
13. ఖండకావ్యము – భావ కవిత్వము : సంపత్ - తె. ధా. చ. సం., పు. 781.
14. గురజాడ వాల్మీకి : వ్యాసావళి - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, పు. 23
15. మార్గదర్శి గురజాడ అప్పారావు :
    శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, నవోదయ, 8-2-1946 (వ్యా)

# కృతజ్ఞత

ఓం ప్రథమంగా గురజాడ వేంకట రామదాసు పంతులుగారికి కృతజ్ఞత చెప్పుకోవాలి. డెబ్బయ్యోపడిలో ఉండికూడా ఓపికతో పదులకొద్దీ ఉత్తరాలు రాసి, విడిగా రాసిపెట్టుకొన్న తమ Memoirs ను చూపెట్టి, ఈ గ్రంథ రచనకు ప్రోత్సాహాన్నిచ్చారు. గురజాడ వారి వంశ చరిత్ర గురించి కొత్త సమాచారం ఇచ్చింది, బందరులోని ప్రముఖ కవులు గురజాడ రాఘవశర్మగారు. గురజాడ భాస్కరరావుగారు కూడా. గురజాడ భాషలోని సూక్ష్మాలను వివరించి చెప్పింది, విజయనగరం యం. ఆర్. కాలేజి ఇంగ్లీషు ప్రొఫెసరు రోణంకి అప్పలస్వామి గారు. కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావుల ఇలాకా గురించి కొత్త సమాచార మిచ్చింది. డా. ఏ. రమాపతిరావు ('మంజుశ్రీ')గారు: మండప లక్ష్మీనారాయణ శాస్త్రికృత వ్యాకరణ గ్రంథంలోని అప్పారావు ప్రశంస భాగాన్ని రాసి పంపింది, డా. తూమాటి దొణప్పగారు. ఇంగ్లాండులో 'పంచ్' (Punch) పత్రిక 1910—1913 ఫైళ్ళలో అప్పారావు రచనలకోసం గాలించింది, శ్రీమతి ఎలిజబెత్ కోల్ (Mrs. Elizabeth cole). మద్రాసు యూనివర్శిటీ లైబ్రరీలో Epigraphia Indica, *The Hindu* పత్రికల సంపుటాలను చూడనివ్వడమే గాక, బాగా వెలుగులోనికి రాని అప్పారావు 'ఎడిట్'చేసిన The Annals of Handeh-Anantapur గ్రంథాన్నీ, కన్యాశుల్క నాటక కన్నడానువాదాన్నీ అరువిప్పించిన సాహిత్యాభిమాని డా. పి. గంగాధరరావుగారు ప్రత్యేకించి పేర్కొనదగినవారు. *The Mail* పత్రికలో సహాయ సంపాదకులు బాలాంత్రపు నళినీకాంతరావుగారు నాతోబాటు ఈ 'కాయకష్టం'లో పాలు పుచ్చుకొన్నారు. వేదం వేంకటరాయశాస్త్రి మనుమలు, వేదం వేంకటరాయశాస్త్రి యం. ఏ. గారు తమ వద్దనున్న అప్పారావు లేఖలను తొలిసారిగా ముద్రించ నివ్వడమేగాక, తమ తాతగారి జీవిత చరిత్ర గ్రంథంలో అచ్చుపడి ఉన్న మరి మూడింటిని గూడా ఈ పుస్తకంలో అచ్చు వేసుకోనిచ్చారు. శ్రీనివాస చక్రవర్తిగారు కూడా తోడ్పడినారు. నా మిత్రుడు బండి గోపాలరెడ్డి (బంగోరె) సాయం లేకుంటే కొన్ని అపురూపమైన గ్రంథాలూ పత్రాలూ నాకు లభించేవికావు. జి. సాంబశివరావు, జయంతి కామేశ్వరరావులు కూడా వందనార్హులే. వర్ధమాన సమాజం (నెల్లూరు), సారస్వత నికేతన్ (వేటపాలెం) గ్రంథాలయాధికారులూ, ఉద్యోగులూ వందనపాత్రులు.

— కె. వి. ఆర్.

# ఉదయ సంధ్య

"తూర్పు బల బల తెల్లవారెను
మేలు కొలుపులు కోడి కూసెను."

# ఉదయ సంధ్య

దేశ క్షేమమునకు భాషా క్షేమమే పునాది, అని 1919లో ఆంధ్రసాహిత్య పరిషత్తు అధ్యక్షస్థానం నుంచి అభినవ మల్లినాథసూరి బిరుదాంకితులైన వేదం వేంకటరాయశాస్త్రిం వారు పలికారు. ఎనసొంపైన ఈ మాటలు తర్కానికి నిలవాలంటే తల్లకిందులు కావలసి ఉంటుంది. అలా అయినప్పుడు భాషా క్షేమమునకు దేశక్షేమమే పునాది. దేశానికిగానీ, భాషకు గానీ క్షేమమనేది, కలలోనిమాట అయిన రోజులను ఒకమారు గుర్తుచేసుకోవాలి.

రాయసామ్రాజ్యం ఆంతరంగికంగా లుకలుకలాడి, బాహిరంగా నీరసించి పోయాక, అమర నాయంకరవ్యవస్థ అల్పిష్టి రాజ్యాలలో అధికారాన్ని కొనసాగించింది; మధుర తంజావూరు, చెంజి, పుదుక్కోట నాయకరాజ్యాలే అలా గణనకు వచ్చేవి. ముఖ్యాంధ్ర భూమి అంధకార నివేశనం కాగా చిల్లర మల్లర రాజ్యాండాలను గోల్కొండ గుడ్లగూబ తట్టిపూటి వేయసాగింది. 17వ శతాబ్ది కొనముట్టే నాటికి గోల్కొండ కొడిగట్టిన దీపమై పోవడమేగాక, ఉత్తరం నుంచి తోలసాగిన మొగలాయీ ఈదరగాలికి, పూర్తిగా కొండెక్కి పోయింది. ఆ మొగలాయీ బదనాయం కూడా మరి రెండు తరాలలోనే అంతరించగా, ఆసఫ్‌జాహీ వంశపు నైజాము నవాబుల జులుము, చికాకొల్లునుంచి రాజమండ్రి మీదుగా ఆర్కాటు వరకూ విస్తరించగలిగింది; ఈ లోపల తెలుగుదేశపు రాజులు 'రాజా' లయ్యారు.

కృష్ణకు దక్షిణాన అసంఘటితమైన అరాచకమైతే, ఉత్తరాన సంఘటితమైన అరాచకం — కుల్లిన అరాచకమే ఆంధ్రదేశ చరిత్రకు ప్రముఖ లక్షణమైన ఆ దుష్కాలంలోనే, మతాంతరులు మాత్రమే అయినముస్లిములను మెల్లగా మెత్తగా తోసికోసి, దేశాంతరులు గూడా అయిన యూరోపియన్లు సూదిగా మొనజూపి దబ్బనంగా పరిణమించారు. ముఖంమీది మశూచికుండల్లా దేశం వెలపొనా ఈ పరాసు, ఒలంద, ఇంగిలీజు వ్యాపార స్థావరాలేర్పడ్డాయి. సూదివత్తై బీజం పొడుచుకొని దేశభాషల్లోకి విదేశీపదాలు చొరబార సాగినట్టుగానే, దేశపు సాంఘిక - ఆర్థిక జీవితపు మడుగునీటిలో పొడిరాయి చందంగా విజాతీయ ప్రభావ ప్రాభవాలు వచ్చి కలచసాగాయి.

రాజ్యాధిపతుల ఆశ్రయ సహకారాలకోసం ఫ్రెంచివారికి ఇంగ్లీషువారితో మొదలైన పోటాపోటీ, చివరకు ఆ ఇద్దరి స్వతంత్ర రాజ్యనిర్మాణస్పర్థగా పరిణమించింది. ఓడలు బళ్లుకాగా, బళ్లు ఓడలయ్యాయి. స్వదేశీయ రాజ్యాధిపతులు ఫ్రెంచివారినో ఇంగ్లీషువారినో అండగొని తమతమ సొంత పబ్బాలు గడుపుకోవలసి వచ్చింది. మూసాబుస్సీకి హైదరాబాదునుంచీ సర్కారు జిల్లాలనుంచీ త్వరలో అర్ధచంద్ర ప్రయోగం జరిగింది విజయనగర ప్రభువైన ఆనందగజపతి స్వార్థచింతతో కలకత్తా నుంచి కర్నల్ ఫోర్డును రాబిలిచి, విశాఖపట్నం నుంచి మచిలీపట్నం వరకుగల ఆంధ్ర వసుంధరను ఇంగ్లీషువారి చేపలబుట్టలో పడవేయించాడు. మొగలు బాదుషా షా ఆలం వద్ద నుంచి ఉత్తర సర్కార్లపై ఇంగ్లీషువాడు పెత్తనం తీసుకొన్నాడు. మొదట్లో మొరాయించినా, చివరకు నైజాము నవాబు సర్కార్లకు నువ్వులనీళ్లు వదులుకోక తప్పలేదు. కొత్తశతాబ్ది ప్రారంభకాలానికి రాయలసీమ ఇంగ్లీషువాడికి దత్తమండలమైంది. మరి రెండేళ్లకు నెల్లూరు, చిత్తూరు మండలాలు రాలి వాడి ఒడిలో పడగా, పరాయివాడు అఖిలాంధ్ర దేశాధినాథుడై కూర్చొన్నాడు. ఆనంద గజపతి తెచ్చి తలగిచుకొన్న కొరివి దేశ స్వాతంత్ర్యానికి తలకొరివి.

అప్పుడు తెలిసివచ్చింది రాజనామధారులైన జమీందార్లకు చాలమందికి, స్వాతంత్ర్యపు గౌరవమూ స్వేచ్ఛ రుచీ అంటే ఏమిటో అనేది ! ఎదురుమదురుగా జరిగిన తిరుగుబాటు లన్నీకూడా నగుబాట్లుగా ముగిశాయి. కుక్కినపేనై జమీందార్లు సర్కారు వాడికి దాసోహమన్నారు. శాశ్వతభూమిశిస్తు పద్ధతి సర్కారు జిల్లాలకు వ్యాపించింది, జమీందార్లకు కన్ను లొట్టబోయిందనేగాని, చావు తప్పింది. సొంత రాణువలు అంతరించేసరికి, కోరలూడినంత పనైంది. చివరకు తమ తమ జమీలలో 'పోలీస్' అధికారాన్నికూడా చలాయించే వీలులేకపోయింది. చిల్లర మల్లర పన్నులను విధించే అధికారం పోయింది. అయితేనేమి ? తమ జమీలకు తామే ఇప్పుడు సర్వాధికారులు. స్వతంత్ర ప్రతిపత్తి గలిగియుండిన రైతులో, తమకిప్పుడు వట్టి కౌలుదార్లు మాత్రమే. జనాన్ని అదరగొట్టి అదుపున పెట్టి ఉంచేందుకోసమై, సర్కారువారు తమకు ఒక అధికారం — Power of Distraint దఖలు పరిచారు. మహా అంటే, ఏటేటా తాము పేష్కషు ముదుపు కట్టుకోవాలి. మొత్తం ఫలింపులో అది మూడింట ఒక్క వంతుమాత్రమే గనక, మిగిలిన రెండూ తమకు దక్కుడే బొక్కుడే. క్రితంలో ప్రతి జమీలోనూ కొంత

భూమిని 'హవేలీ' భూమిగా ముస్లిం నవాబులు విడిగా ఉంచుకొన్నారు గాని ఇప్పుడా భూములను విడగొట్టి వేలానికి బెట్టి సర్కారువారు తమకు అమ్మజూపారు దేశానికి పారతంత్ర్య మైతేనేమిగాని, తమ పరువు మిగిలింది భద్రతకలిగింది. 1

జిల్లాలకు కలెక్టర్లు ఏర్పాటయ్యారు. జడ్జీలు వచ్చారు. జమీందార్లింకా ప్రజల నుంచి భయభక్తులు రాబడుతున్నా, ఇంగ్లీషువాడి శతగోపం నేరుగా ప్రజల తలమీద నిలిచింది. సీమలో మొదలై విజృంభించిన పారిశ్రామిక విప్లవం, పరిస్థితిని తారుమారు చేసింది. వ్యావసాయిక దేశమై ఉండినంతవరకూ, చైనా, ఇండియాలవంటి దేశాల వ్యావసాయిక సంపద ఇంగ్లాండు నోరూరించేది. బంగారం దానిది, ఇటే తరలి ప్రవహించి వచ్చేది. ఇప్పుడో అక్కడి యంత్రాలు నిర్మించి చవకగా దొరికే వస్తువులను తూర్పు దేశాలకు పంపి అమ్ముకొంటూ జేబులు నింపుకొంటూ ఇక్కడి వెండి బంగారాలను అటు మలుపుకోవడం మొదలైంది. దేశానికి దారిద్ర్యాధ్యాయం ప్రారంభమైంది. సీమకు ఈ మనదేశం పెరటితోటగా మారిపోసాగింది. మన చీనిచీనాంబరాలూ 'కేలికో' బట్టలూ మజిలీను తానులూ ఇంగ్లాండులో అమ్మరాదంటూ, పార్లమెంటు చట్టాలకు చట్టాలే చేయవలసి వచ్చింది. "వరహాలచెట్టు" (Pagoda Tree) వేళ్ళంటా ఊగి ఇంగ్లీషువాడి సంచీలోకి ధనాన్ని వర్షించసాగింది. ముడిపత్తిని అమ్ముకొందాము లెమ్మనుకొన్నా అమెరికానుంచి ఈజిప్టు నుంచి పోటీధరలు వచ్చిపడ్డాయాయె! ఇక వృత్తులు క్షీణించక? బస్తీలకు వలసలు, ఇనుప గజ్జెల తల్లి చిందులు, 'అనస్టాని'కి పర్యాయపదమై పోయింది, అన్నపూర్ణ వంటిదని చెప్పుకొనే నిస్తులమైన మన నిత్యపస్తుల దేశం.

రాజులు మారినా రాజ్యాలు కూలినా, పది కాలాలనుంచీ పదిలంగా ఉంటూ వచ్చిన గ్రామాలు కుప్పకూలిపోసాగాయి. అతి ప్రాచీనమైన స్వయం పాలనా సంస్థలు ముక్కచెక్కలై మూలబడ్డాయి. స్వయంపోషకత్వం అంతరించింది. బస్తీలు సీమమీద ఆధారపడితే, బస్తీలపై ఆధారపడసాగాయి పల్లెటూళ్ళు. పంటను 'రెవిన్యూ' ఉద్యోగులు ఊడ్చుకుపోతూ, గడ్డినీ గాదాన్నీ మాత్రమే రైతుకు మిగిలిస్తున్నారు. డబ్బుకు 'కసాలా' వచ్చింది. కాయకష్టం ఒక్కటే మిగిలేంతగా, శిస్తులూ పన్నులూ వచ్చిపడ్డాయి. కులవృత్తులు పొట్టకూటికి గూడా పనికిరావడం లేదు. పాత చదువులు వట్టిపోయాయి. సర్కారు నౌకరీ ఇంద్రపదవిలా కనిపిస్తున్నది. వర్ణాంతర నిర్బంధాలు బదాబదలౌతున్నాయి. కరణాల మున్సబుల దాష్టీకాలకూ దౌర్జన్యాలకూ అంతుపొంతు లేకుండా పోతున్నది. సంఘం నీళ్ళ కాగైతే,

కిందిది మీదికీ, మీదిది కిందికీ పోతున్న నీటిలా ఆచార వ్యవహారాలు అస్తవ్యస్త మౌతున్నాయి. దేశం దీనదశ పాలైంది. ఈ దయనీయ స్థితినంతా చూచి 1820-27 మధ్యకాలంలో మదరాసు గవర్నరుగా ఉండిన మన్రో (Sir Thomas Munro) ఒక మాట చెప్పాడు :

మన చట్టాలూ మన బడిపుస్తకాలూ భారతీయుల శీలాన్ని ఉన్నతం చేయడం కంటె- ఎక్కువ శక్తివంతంగా, అధికారం నుంచీ, విశ్వాసం నుంచీ నౌకరీ రాళ్ళ నుంచీ వారి నందర్నీ దూరంగా అట్టిపెడుతున్న నేటి మన పాలనా పద్ధతి ఆ శీలాన్ని మరింతగా దిగజార్చగలదు.

ఇంగ్లాండును మరో దేశమేదైనా జయించి ఇంగ్లీషు వారి నిలా పదవుల నుంచి వెలివేసి వుంటే, ఆనాడు భారతీయుల దోషాలెన్నుతున్న ఇంగ్లీషువాళ్ళే క్షుద్రమనస్కులూ వంచనాపరులూ విశ్వాసహీనులూ అయి ఉండకపోరంటూ, భారతీయులను స్వపరిపాలనకు తర్ఫీదు చెయ్యాలని మన్రో అన్నాడు.

కంపెనీ పాలనాయంత్రంలో సీలలుగా మరలుగాకూడా భారతీయులు పనికి రారనే చిన్నచూపు వదలడానికి అధికారులకు చాలాకాలం పట్టింది. దుబాసీలు దళారులూ అవసరమైతే సరే, ఎలాగూతప్పదు. కాని, చిన్నపాటి గుమాస్తాగిరీ దక్కించుకోవాలన్నా ఎన్నో తిప్పలు పడవలసి వచ్చేది. 'సబార్డినేటు సర్వీసు' మాత్రమే భారతీయుల కెంతోకాలం ప్రవేశయోగ్యమైంది. పరీక్షలు పెట్టి కొన్నిటికీ నేరుగాకొన్నిటికీ నియామకాలు జరిగేవి. విలియంబెంటింక్ (Bentinck)హయాము వరకూ ఈ పరిస్థితి మెరుగు కాలేదు. 2

ఈస్టిండియా కంపెనీకి వర్తకవాణిజ్యాలే ముఖ్యప్రమేయాలైన తొలిదినాళ్లలో (1600-1715) గూడా, అది సంపాదించుకొన్న స్థలాల్లో మతప్రచారం ఒకచెంప, ఇంగ్లీషు విద్యా వ్యాపనం మరోచెంప, జమిలిగా జరుగుతూవచ్చాయి. "సువార్త"ను వినిపించి మతాంతరీకరణ జరిపించేందుకై మిషనరీలకు దేశభాషలు నేర్పడం ఒకటి. కంపెనీ ఖాతాలందనే కొన్నిస్కూళ్లు స్థాపించి ఆనాళ్లలో బహుళ ప్రచారం పొందిన పోర్చుగీసు భాషను నేర్పడం ఇంకొకటి. రాజకీయాల బూరెలగంపలో పడి రాజకీయ శక్తిగా కంపెనీ రూపొందిన దరిమిలా, దేశీయుల్లో సంపన్న వర్గాల వారి భక్తి విశ్వాసాలను చూరగొనేందుకోసం ఆ వర్గాలకు చెందిన యువకులకు విద్యాబుద్ధులు మప్పసాగింది. ఆదిలో ప్రాచ్య విద్యాపోషణపట్ల కంపెనీ సుముఖత చూపుతూ రావడం మిషనరీలకు నచ్చలేదు. విల్బర్ ఫోర్స్ (Wilberforce)

ప్రభృతులు సీమలో ఆందోళన చేశారు. ఈ మంటకు చార్లెస్ గ్రాంట్ (Charles Grant) ఒక సమిధ అందించాడు. 'చర్చి మిషనరీ సొసైటీ' (Church Missionary Society) స్థాపించడమేగాక, పాశ్చాత్య విద్యావ్యాప్తి మూలంగా కూడా, క్రైస్తవాన్ని వ్యాపింప జేయవచ్చు ననుకొన్నాడు. 1813 'ఛార్టరుయాక్టు' చేస్తూ, తన వరుంబడిలో ఖర్చులుపోగా మిగిలినడబ్బు లక్షరూపాయలకు తక్కువ గాకుండా పాలితులలో పండితులను ప్రోత్సహించడానికిన్నీ పాలిత ప్రజాసామాన్యపు శాస్త్ర జ్ఞానాన్ని పెంపొందించడానికిన్నీ కంపెనీ కేటాయించవలసి ఉంటుందని పార్లమెంటు కటడి చేసింది.[3]

ఆంగ్ల ప్రభుత్వోద్యోగులు దేశభాషలు నేర్చుకొనేందుకని 1813 లో మద్రాసు సెంట్‌జార్జికోటలోనే ఏర్పాటైన 'కాలేజీ'లో ఉదయగిరి వెంకటనారాయణయ్య పట్టాభి రామశాస్త్రి రావిపాటి గురుమూర్తిశాస్త్రివంటి తెలుగు పండితులు పాగా చేశారు. మామిడివెంకయ్యరాసిన ఆంధ్రదీపిక వంటి గ్రంథాలు పాఠ్యాలు. గ్రంథ ప్రచురణకై యద్దనపూడి సంజీవయ్య బరూరు త్యాగరాయశాస్త్రిలాంటివాళ్ళు కృషిచేశారు. ఆవి సరస్వతీ ముద్రాక్షరశాలవంటి అచ్చుకూటా లేర్పడ్డాయి. తెలుగు భాషకు దక్షిణాదిభాషలతోగల బాంధవ్యాన్నిగుర్తించి వాడుకలోనున్న క్రియారూపాల నిస్తూ 1816 లో కేంబెల్ (Campbell) ఒక తెలుగువ్యాకరణం అచ్చువేయించాడు. పాఠ్యగ్రంథాల తయారీకి "ఉపయుక్త గ్రంథకరణ సభ" (The Madras Vernacular Text book Society) ఏర్పాటైంది మన్రో ధర్మమా అని, ప్రతి కలెక్టరేటులోనూ హిందువులకు ముస్లిములకు చెరొకబడి, ప్రతి తహశీలులోనూ ఒకటి నెలకొన్నాయి. మన్రోదొరను "మాండవఋషి" అని మనవాళ్ళు ఊరికే అనలేదు.

దేశీయులలో దూరదర్శులైనవాళ్ళు ఆంగ్లవిద్యనూ శాస్త్రవిజ్ఞాన వ్యాపనాన్నీ నిస్సంకోచంగా సమర్థించినట్టు, లార్డ్ అమ్‌హర్స్టు (Amhrest) కు రామమోహన రాయలు రాసిన లేఖనుబట్టి మాత్రమేగాక, ఏనుగుల వీరాస్వామయ్య, కోమలేశ్వర పురం శ్రీనివాసపిళ్ళె, వెన్నెలకంటి సుబ్బారావు వగైరాల కార్యకలాపాలనుబట్టికూడా తెలుస్తున్నది. మిషనరీల చాలులోని మొక్క కాకపోయినా, క్రైస్తవమత వ్యాప్తిని కూడా కోరుకొని మెకాలే (Macaulay) ఆంగ్ల విద్యాబోధనను తెచ్చిపెట్టాడు. అప్పటికే మచిలీపట్నంలోనూ గుంటూరులోనూ మిషనరీ విద్యాసంస్థలు మొదలై ఉన్నాయి.

భారతీయులలో యూరపియన్ సాహిత్య, విజ్ఞానాలను వ్యాపింపజేసి పెంపొందింప జేయడమే బ్రిటిష్ ప్రభుత్వ మహదాశయమంటూ, 1835 లో గవర్నరు జనరలుగా విలియం బెంటిక్ ప్రకటించాడు. మరి నాలుగేళ్ళకు ఎల్ఫిన్‌స్టన్ (Elphinstone) ప్రణాళిక ఫలితంగా, మద్రాసు ప్రెసిడెన్సీలోని నాలుగు కేంద్రాలలో (అందులో మచిలీపట్నమొకటి) ఇంగ్లీషు బోధనాభాషగాగల పాఠశాలను నెలకొల్పారు. 1841 లో 'మద్రాసు యూనివర్సిటీ'పేర మొదలైన హైస్కూలు 1855 లో ప్రెసిడెన్సీ కాలేజిగా మార్పుచెందింది. ఆ క్రితం సంవత్సరమే ఉడ్ ఉత్తరువు (Wood's Despatch) జారీఅయి, విద్యాశాఖ (Department of Public Instruction) నిర్మాణమైంది. మరి నాలుగేళ్ళకంతా మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాలలో విశ్వవిద్యాలయాలు తలలెత్తాయి. అవి పరీక్షలు నిర్వహించే సంస్థలేగాని బోధన జరిపేవికావు వాటికింది వరసల్లో అనుబంధ కళాశాలలు ఉన్నత పాఠశాలలు వట్టి దేశీయ విద్య మాత్రమే నేర్పే ప్రాథమిక పాఠశాలలు. సెకండరీ దశలో ఆధునిక భారతీయ భాషలే విద్యాద్వారాలు. ఉడ్ ఉత్తరువువచ్చిన పదేళ్ళకు మెట్రిక్యులేషనుకూ పట్ట పరీక్షకూమధ్య "ఫస్టు ఎగ్జామినేషన్ ఇన్ ఆర్ట్సు" (F A) ఏర్పాటైంది. యావద్భారత దేశానికి ఏకవిధమైన విద్యావిధానమొకటి సమగ్రంగా రూపొందడానికి మరో ఇరవయ్యేళ్ళ వ్యవధి కావలసి వచ్చింది. ఈ దశలోనే గుంటూరులో ఏ. సి. కాలేజి, కాకినాడలో పి. ఆర్. కాలేజి, విజయనగరంలో యం. ఆర్. కాలేజి, రాజమండ్రిలో గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, విశాఖపట్నంలో మిసెస్ ఏ. వి. యన్. కాలేజి అవతరించాయి 4

ఈ ఇటీవలి దశలో (1854 లగాయతు) ఇంగ్లీషు చదువులు పరిణమించిన తీరు, దేశానికి అంత ఉపయోగకారి కాలేదు. వృత్తి, సాంకేతిక విద్యలు కలిగానికి గూడా కానరానంతగా 'లిబరల్' విద్యపేర సాహిత్యం, చరిత్ర తత్వ, తర్కశాస్త్రాలు ప్రాముఖ్యం పొందాయి. మదరాసు, పంజాబు విశ్వవిద్యాలయాల్లోతప్ప ఆధునిక భారతీయ భాషలకు సమాదరణ లభించింది కాదు. అనుబంధ కళాశాలల్లోనైనా, ఆ భాషలను బోధించే వసతి త్వరలోనే అంతరించింది. అయితే కావచ్చుగాక. ఆధునిక భారతీయ భాషల్లో గ్రంథసంపద తామరతంపరైన కాలం ఇదే. గ్రంథ ప్రచురణలో, మిషనరీల తర్వాత కంపెనీ ఉద్యోగులు ఎంతో పూనికచేశారు. చివరకు ప్రభుత్వ విద్యాశాఖవారే రంగంలో దిగారు. 1854 కు మునుపు పుస్తకాలను తయారుచేయించే బాధ్యత, కమిటీలకో బోర్డులకో కౌన్సిళ్ళకో ఉంటూ

వచ్చేది. ఆ తర్వాత మాత్రం విద్యాశాఖవారే పుస్తకాల 'డిపో'లు స్థాపించి నడప సాగారు. క్రమేపీ ప్రైవేటు ప్రచురణకర్తలుకూడా చొరబారివచ్చారు.

బైబిలు అనువాదాలతోటి మొదలైన తెలుగు పుస్తకాల ముద్రణ, 19వ శతాబ్ది ప్రారంభానికే బాగా పుంజుకొంది. తెలుగు అచ్చాఫీసొకటి మద్రాసులో 1806 నాటికే ఏర్పాటైంది. బెంజమిన్ షుల్ట్జ (Benjamin Schulz) తెలుగు బైబిలును యూరపులో అచ్చువేయించాక ఇక్కడ ప్రిషెట్ (Prichett) గోర్డన్‌లు (Gordon) 'సువార్త'లను తెలుగువారికి అందించారు. కెరే (Carey) కూడా బైబిలును తెనిగించాడు. అయితే ఇది తెలుగువారి మదికెక్కలేదు. భాషకే గాక చరిత్రకుగూడా తోడ్పడిన కల్నల్ మెకంజీ (Mackenzie) (1753-1821) మొత్తం దేశానికి సర్వేయరు - జనరలుగావుంటూ, కావలి సోదరుల సాయంతోటి గ్రంథాలనూ శాసనాలనూ సేకరించి స్థానిక చరిత్రలను మళ్ళీ వెలుగులోకి తీసు కొచ్చాడు.[5] ఆ సోదరత్రయంలో ఒకరైన కావలి వెంకటస్వామి *దక్కను కవుల జీవితచరిత్రలు* ఇంగ్లీషున రాసి బొంబాయిలో అచ్చువేయించిన ఘనుడు.

ఇక సి. పి. బ్రౌన్ (C. P. Brown) గురించి చెప్పేదేముంది? ఈ దేశా నికివచ్చే నాటికి (1827) తెలుగనే భాష ఒకటి ఉన్నదనికూడా తెలీనివాడు తెలుగుజాతికి ప్రాతస్స్మరణీయులలో ఒకడైపోయాడు. ఆయన చెయ్యేపడక పోయివుంటేనా, "నేడు మనకు ప్రాచీనాంధ్ర సాహిత్యములో చాలాభాగము నామ మాత్రావశిష్టముగానుండెడిది."[6] మన భాషను నాగరికం ఆధునికం చేయబూనిన మహానుభావులకందరికీ, బ్రౌన్ వరవడిపెట్టాడు.

కాంబెల్, మెకంజీ, బ్రౌన్ - ఆంధ్ర సాహిత్య, భాషా, చరిత్రల ఉద్ధారక త్రయమనదగిన ఈ పాశ్చాత్యులు, మన పండితులు కొందరిలోనైనా కలిగించిన కదలిక గమనించదగ్గది. మధ్యలో చిన్నయసూరి అడ్డుదగిలి ఈ ప్రవాహాన్ని మరో తెన్ను పట్టించకుండా ఉండి ఉంటే, కనీసం కందుకూరి వీరేశలింగం ప్రాణావసాన దశలో గాకుండా జీవిత ప్రభాత సమయంలో ఆ ప్రవాహాన్ని అనుసరించిపోయి ఉంటే.... అలా ఉండలేదు గనకనే గిడుగు రామమూర్తికిన్నీ గురజాడ అప్పారావు కున్నూ తలనిండా చేతినిండా పని తగిలి చరితార్థత చేకూరింది. ఆ ముగ్గురు దొర లను ఆశ్రయించిన పండితులు-పర్వ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి, రావిపాటి గురు మూర్తిశాస్త్రి వంటి వాళ్లు, నిజంగానే ఆ పాశ్చాత్యుల భాషాకృషిని హర్షించి మన స్ఫూర్తిగా సహకరించారు. ఆధునికాంధ్రవచన రచనకు పురుటి నొప్పుల వంటి

ప్రథమ ప్రయత్నాలుగానైనా ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్ర, బేతపూడి సుందరరామయ్యగారి *నీలగిరి చరిత్ర* గౌరవింపదగ్గవి. అయితే 1913-14 లో మద్రాసు శాసనమండలిలో ఆంధ్ర రాజకీయ ధురంధరులు వీరాస్వామయ్య పేరెత్తి ఆయన పుస్తకం పఠన పాఠన యోగ్యంకాదని రాసివేశారు: గురజాడ అప్పారావు ఎన్నిక చేసింది కాబట్టి ఆ పుస్తకం తనకు సహజంగా చెందవలసిన గౌరవ ప్రతిష్ఠలను రచ్చలో నిలుపవలసి వచ్చింది. సరే. ఉపయుక్త గ్రంధకరణ సభ తరపున వెలువడ్డ గ్రంథాలలో 1848 సంవత్సరానికి ముందు వచ్చిన వన్నీ వ్యావహారిక భాషనే స్వీకరించాయి. వ్యాఖ్యానాలన్నిటా అదే ప్రయుక్తమైంది. బ్రౌన్ దాన్నే ఆశ్రయించాడు. అదే జాతీయ సంప్రదాయమని గుర్తించాడు.

ఇంగ్లీషు చదువులు కలిగించిన ఫలితాలు మరెన్నైనా ఉన్నాయిగాని, జన సామాన్యం దానికింకా ఎడమెడంగా పెడమొగంగా ఉంటూ వచ్చింది. విద్యాధికుల వర్గం ద్వారా నెమ్మదిమీద సంఘం అట్టడుగు పొరల వరకు విజ్ఞాన వికాసాలు దిగిపోయేట్లు చెయ్యడమే (Infiltration). బ్రిటిష్ ప్రభుత్వాశయమై ఉండేవి. కనీసం వాళ్ళ ప్రకటనలు అలా అనిపించేవి. అయితే అది అంతసులువుగా జరిగే పనికాదు. ఆంగ్ల విద్యావంతులు కొద్దిమంది మహాసముద్రంలోని దీవిగడ్డలా 'కేటాబడి' పోయారు. జాతితో వాళ్ళకు భావైక్యత ఏర్పడలేదు సరిగదా, వాళ్ళను జనం ఒక కంట కనిపెడుతూనే హేళనచేస్తూ దూరంగా ఉంచసాగారు.

ఉద్దేశం ఏదైనా కావచ్చుగాని, మెకాలే కారణభూతుడుగా 1835 నుంచి బ్రిటిష్ ప్రభుత్వం అనుసరింపసాగిన విద్యా విధానం మట్టుకు ఎంత మేలు కలిగించిందో అంత కీడూ కలిగించింది; లేక, ఎంత కీడు కలిగించిందో అంతకంత మేలూ కలిగించింది. దేశీయ విద్యలకు శాపవాక్కుగా ఉద్దిష్టమైనదే, దేశానికి వర ప్రసాద మైంది. సంప్రదాయం పేరు పెట్టుకొన్న మౌఢ్యాన్ని మౌర్ఖ్యాన్నీ చావుదెబ్బ తీసింది. ప్రపంచంతోటి మళ్ళీ ఈ దేశాన్ని సంధించింది. గుడుగుడుగుంచంలాగా గుంజ చుట్టూ తిరుగుతూ వచ్చిన భారతీయుల భావ విశేషాలు విహరించ గలందులకై బారైన బయళ్ళను చూపింది. పెండేలు తుండేలుగా తెగీ తునిగీపడి ఉన్న విడి మాంస ఖండాలవంటి ఉపజాతులను ఒక్క పలుకుబడి కిందికి కూడగట్టి తెచ్చి, స్వేచ్ఛా వ్యాపార ప్రసారానికి ఆటంకాలుగా ఉన్న సంస్థానాలను అణచి, యావద్దేశాన్ని ఒకే ఒక్క విపణిగా (Market) మార్చి, సమగ్రమైన దేహంలాటి 'జాతం' ఏర్పడేందుకు ఇంగ్లీషు భాషకూడా ఒక చెయ్యి వేసింది. 'దేవభాష'ను దెబ్బ తీసిం

దేమో గాని దేశభాషలకు అభ్యుదయ పథం చూపెట్టింది. మనస్సునుంచి మగతను తూలగొట్టింది. ఆంగ్ల మానసపుత్రులను లేవదీసిందేమోగాని, అది ఆంగ్ల ప్రభుత్వం పాలిటి భస్మాసుర హస్తం కాకపోలేదు. కాంగ్రెసు నిర్మాతలలో ఒకడైన సురేంద్ర నాథ్ బెనర్జీ మాటల్లో—

The enfranchisement of the individual, the substitution of private judgement in place of traditional authority, the exaltation of duty over custom, all came with force and suddenness of revealation to an oriental people who knew no more binding obligation than the mandate of immemorial usage and venerable tradition. 7

రెండు లోకాలమధ్య ఘర్షణ, రెండు సంస్కృతుల స్పర్ధ! ఇది తెలుగు సాహిత్యంలో కూడా ప్రతిబింబించింది. మహాప్రబంధ యుగపు నామూనాలలో క్షుద్ర శృంగారపరమైన ఇతివృత్తాలలో అలంకారాల గలగలలతో నిఘంటు శబ్దాల దడ బడలతో, లోకపరిణామాలకు అతీతంగా 'సంప్రదాయం' చూరుపట్టుకొని 'రాజు' లను ఆశ్రయించుకొని ఉండిన రోజుల నొకమారు గుర్తుచేసుకొంటేనే గాని, నేటి తెలుగు సాహిత్యం ఎన్ని సుడిగుండాల నీదుకొని ఎన్ని యమగండాలను తప్పుకొని బయటబడగలిగిందో తెలుసుకో లేము.

# 2

మహో ప్రబంధ నిబంధనాదక్షులు దాటుకొన్నాక వారి కొద్దిపాటి ఔచిత్య వివేకం కూడా కాలం చేసిందనే చెప్పాలి. "నిజమైన పచ్చిశృంగారం మన్నది పరకీయ శృంగారము" అని 1912 లో అప్పారావు అనవలసివచ్చింది.[8]

ప్రబంధ వృక్షం నాయకయుగానికే ముదిరిపోయింది. చేమకూర వేంకటకవి లాంటి బహుకొద్దిమంది తప్ప తక్కిన కవులంతా పడకటింటి పెళ్ళికొడుకు దృష్టి నవలంబించడానికి కారణం, ఆనాటి వారి "రసికత" అని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారివంటి పండితులు అంటున్నారు. సమర్థించబోయి పప్పులో కాలువేస్తూ నిడదవోలు వేంకటరావు వంటి కొందరు శృంగార రసస్థాయి అయిన రతికిన్నీ మైథున వ్యాపార మైన రతికిన్నీ అభేదం చెప్పారుకూడా. ఒక్కొక్క కవి మీది మక్కువ కొద్ది "వజ్రయుగ" మని ఒకరంటే "పూలకార"ని మరొకరు. నీతిబోధ కళాద్రోహమని ఒకరంటే కళాసౌందర్య నిర్ణయంలో నీతికి తావేలేదని ఇంకొకరు.

ఎవ్వరేమన్నా దక్షిణాంధ్రనాయక రాజయుగం ఆంధ్రసాహిత్యంలో మునిమాపు. అస్తమానం తర్వాత కూడా సూర్యుని చరమదీప్తి దిక్కుల నుద్దీపింప జేసేట్లు ఈ యుగాదిలో విద్యల "కసటు" తొలగింది. రాజ సభాంతరాళాలలో విద్యల విలువ పెరిగింది. "రమానటీ నర్తన రంగశాల" వంటి చోళసీమలో, మాటల నేర్పులు సరస మార్గములు నాటకశాలలు, కళల భాగ్యములు — పలు తెన్నులుగా ప్రకాసం పొందాయని చేమకూరవాని పద్యమే తెలుపుతున్నది. కావచ్చు గాని, రాయసామ్రాజ్య యుగావశేషాలే ఇవన్నీను. యక్షగాన, పదకవితా వాఙ్మయ శాఖలకు అపూర్వమైన ప్రాచుర్యం కలిగి ఉండవచ్చు గాని నాయక రాజయుగానికి రాయసామ్రాజ్య యుగంతోటి మాతాసుత సంబంధ మున్నట్లుగానే, క్షీణయుగంతోటీ జన్యజనక సంబంధం ఉంది. నీతులూబూతులూ కలగలిసి పోతున్నాయని కవిచౌడప్ప అనగా, "అవ్యవస్థ విషయు"లైన దుష్టనృపులు పేట్రేగి పోతున్నారని కుట్టికవి అంటాడు.

విద్వత్ప్రభువులు ఆనాటికే కనుమరుగై పోతూ ఉండినట్లు చేమకూర కవి అంటాడు. తంజావూరి రఘునాథ, విజయరాఘవ నాయకులు, మహారాష్ట్రుడు శాహాజీ, మధుర విజయరంగ చొక్కనాథుడు — ఎందరో రాజకవు లిలాంటివారు

లేక పోలేదు. రఘునాథుని వంటి కళామర్మజ్ఞుడే వాల్మీకి చరిత్ర వంటి కావ్యాలలో ఔచిత్య దూరమైన పద్ధతిని ఆదరిస్తే, "షోడశ సహస్ర స్త్రీ చక్షుఃప్రసారు" డైన విజయరాఘవుడు, "యువతీజన పాంచాలు" డైన విజయరంగ చొక్కనాథుడు చేయనిదేమిటి? 'యథారాజా తథాప్రజా' యేమోగాని 'తథాకవయః' అనవచ్చు. శృంగార విషయంలో విషయ వాంఛావలయంలో శ్రీకృష్ణుణ్ణి తమ స్థాయికి దించుకొన్న రాజులు; ఆ రాజులకూ శ్రీకృష్ణునికీ ఐక్యతను స్థాపించే కవులు; వీటన్నిటికీ శ్రీ వైష్ణవం ఆమోదముద్ర!

కన్ను, చెవి, ముక్కు వంటి ఇంద్రియాలకు తర్పణ కలిగించే విధంగా కుంకుమ, కర్పూరం, పూలపొట్లంవంటి వస్తువులతో తన రామాయణ కావ్యంలో వాల్మీకి చరిత్రలో రఘునాథుడు రచించిన కందపద్యాలు; చీని చక్కెర పానకం విరజాజి సరాల సువాసన మందమారుతాల స్పర్శ వెన్నెల తేటలను కవిత్వాని కంటగడుతూ రాజగోపాల విలాసంలో చెంగల్వ కాళకవి సీసపద్యాలు; పెద్దన అని వాడుకలో ఉన్న చాటువుకు పుట్టిన బిడ్డలే. పెద్దనది "వైషయిక కవిత" అయితే ఇక వీరిది విషయవాంఛా ప్రధానమైన కవిత్వమే. రాచరికం భూస్వామ్యం పురుషాధిక్యం సుఖానుభవపరత అతిశయించగా భోగలాలసత్వం బహుభార్యాత్వం వేశ్యా సాంగత్యంగా మారిన స్త్రీలోలత్వం — వీటన్నిటి ఫలితమే ఈ "రసికత." రామభద్రాంబ, రంగాజమ్మ, ముద్దు పళనివంటి కవయిత్రుల కులగోత్రాలతో ఏమిగాని, వివాహ వ్యవస్థా బాహిరమైన అనుబంధంతోటి రఘునాథుణ్ణీ విజయ రాఘవుణ్ణీ ప్రతాపసింహుణ్ణీ బంధించినా ఎవరిపుట్టీ మునిగిందేమీ లేదుగాని, వారి కావ్యాల ధోరణివల్లనే వారికి కీర్త్యపకీర్తులు మిగులుతాయి. ఇది వట్టి నీతినియమాల పట్టింపు కాదు అభిరుచి పట్టింపు. మాటల పోహళింపులో, శబ్దాలంకార విన్యాసంలో లాగే, ఇతివృత్తాల ఎంపికలోనూ కొట్టవచ్చినట్టు ఎదురయ్యేది ఈ ఇంద్రియ తర్పణైక దృష్టి. ఉష, తార అహల్య, సత్య రాధ, ఇళ — వేర్వేరు వ్యక్తులైనప్పటికినీ, వీరందరికీ, కవులాపాదించిన సామాన్య ధర్మం కామినీగుణం. మన్మథపత్ని రతీదేవి ఈ నాయికలకు "మానినీ మానాపహారిణి"గా అర్చనీయురాలైంది. అందరూ మానవతులే అయినా కావ్యాలలో మానాభిమానాలను గాలికి వదిలారు. కామకళా ప్రాచుర్య నిర్వహణలో తరతమ భేదాలేగాని కవులలో గుణాత్మకమైన అంతస్థులు కనిపించవు. సంభోగ శృంగార వర్ణనలకు పూరా తావు గల్పించే ఇతివృత్తాలను మాత్రం ఎన్నుకొని పురాణ కథలకు గూడా తోకలూ పీకలూ తగిలించి, ఒకే

మూసలో పోసి లాగినట్లుగా కథను నిర్వహించారీ కవులు. శ్రీకృష్ణుడే కథానాయకుడైన ప్రబంధాలలో ఆయనకు రాజుల మొక్కులే వచ్చాయి. అష్టమహిషులు నాయికలయ్యారు. మన్నారుస్వామి విజయరాఘవుడు కాగా, విజయరాఘవుడు "దక్షిణ నాయకు" డయ్యాడు; నేరుగా కావ్యనాయకుడయ్యాడు కూడా.

భట్టుమూర్తి ధర్మమా అని ప్రబంధాలలో దూరిన శ్లేషకు నాయకరాజ యుగకవులు అతిశయ ప్రాచుర్యం కల్పించారు. కసరత్‌గా మారిన కవిత్వానికి నిఘంటువులే గోదాలయ్యాయి. వేశ్యలకు పోటీలుపెట్టి గోదాలో కుస్తీలు పట్టించే వాళ్ళకు, శబ్దాలోక లెక్కా? కవిత్వం వేడుకైంది. అర్థచమత్కారంగానీ భావగౌరవంగానీ రసపుష్టిగానీ, కలగదని, ఇలాంటి కావ్యాలను వీరేశలింగం కవుల చరిత్రలో తోసివేశాడు. శ్లేషకవితకు సైదోడే చిత్రకవిత. శతలేఖినీ విద్యగా పేరు మోసిన ఈ ప్రక్రియ పర్యవసానంగా, మొల్ల ఎన్నడో చెప్పినట్టు కవిత్వమనేది "మూగ చెవిటివారి ముచ్చట" కావడమే మిగిలింది.

ఎటొచ్చీ సాహిత్యంలో యక్షగానాలూ వచన గ్రంథాలూ గుడ్డిలో మెల్లగా పేర్కొనదగ్గవి. యక్షగానమనేది ప్రజాజీవిత తటాకంలోని తరంగమే. సామాన్యులనదగిన పాత్రలే ఎక్కువ. ఆ పాత్రలకు ఉచితమైన భాషే ఉంటుంది; కాబట్టి దాదాపు తొలిసారిగా తెలుగు వ్యావహారికం యక్షగానాలలో దర్శనమిస్తుంది. అయితే ఇది ఎక్కువగా హాస్యానికే పనికి వచ్చింది. గ్రాంథిక భాషావాదాన్ని సమర్థించిన దశలో వీరేశలింగం ప్రహసనాలలో మాత్రం వ్యావహారికాన్ని వాడాడంటే, ఇదిగో ఈ యక్షగాన వాఙ్మయం ఎన్నడో ఆ పని చేసింది కాబట్టేగాని భాషా సంస్కరణ దృష్టితో మాత్రం కాదు. రాజులూ పండితులూ యక్షగానాలను చేబట్టారు. పోను పోను, యక్షగానాదులలో కూడా స్తోత్ర వైవారాలను, మహారాష్ట్రుల కాలంలో నాందీ ప్రస్తావనలను దూర్చి ఈ ప్రజానాటక ప్రక్రియపై సంస్కృతనాటక సంప్రదాయభారాన్ని మోపారు.

క్రితంలోనే గద్యనుండి వేర్పడిపోయి వేదాంత ప్రచారానికి వినియుక్తమైన వచనం, నాయకరాజయుగంలో సాహిత్యగౌరవాన్ని నోచుకోగలిగింది. రాయవాచక భాష వ్యావహారికమే అయినా అది సాహిత్యగ్రంథం కాదనడం నేటి విమర్శకులకు పరిపాటిఅయింది. పండితులు తలలూపేట్లు సుష్ఠుగా, అయినా సులువుగా వచన కావ్యాలను రచించిన సముఖం వేంకటకృష్ణప్పనాయకుడు, కుందుర్తి వేంకటాచలకవి లింగనమఖి కామేశ్వరకవి, గ్రాంథికమన దగిన పద్య గంధి వచనాన్నే ఎక్కువగా

రాశారు. పద్యకావ్యాలలోనే గ్రాంథిక భాషానియమాలు కొంత సడలిచ్చినప్పుడు, వచన గ్రంథాల మాట చెప్పేదేమిటి? ఎంత బండ వచనమైనా దానికి వ్యావహారిక చ్ఛాయ సోకింది ఈ దక్షిణాది తెలుగు వచనమే చిన్నయసూరి ద్వారా ఈనాటికీ పాఠశాలల్లో పిల్లలకు ఇనుపగుగ్గిళ్లగా ఉంటూన్నది. గిడుగురామమూర్తి, గురజాడ అప్పారావులు కృష్ణార్జునులై పోరుసలిపింది ఈ నివాతకవచుల మీదనే.

మొలక చీకట్లలో సాహిత్య చరిత్రకారులకు కనిపించకుండా పోయింది, సాహిత్యపు విస్తృతికీ విశిష్టతకూ మధ్యనున్న అఖాతం వంటి అంతరమేననాలి. వైవిధ్యం ఉంటేచాలు, అభిరుచిలో శుచీ, అనుభవపరతలో నియతీ,రసనిర్వహణలో ఔచితీ లోపించినా ఫరవాలేదనుకొన్నట్లుంది.అయితే తదనంతర సాహిత్యయుగంతో పోల్చి నిలిపినప్పుడు, నాయకరాజయుగం ఎంతోమేలనిపిస్తుంది, ఏవో ఒకటీ అరా ఉరువైన చుక్కలే కనిపించే అంధకారాలయం వంటి సాహిత్యాకాశంలో, మిగిలిందంతా చుక్కల ధూళిలాంటి నజ్జుసరుకు. కనిపోషకులూ అంతే. ప్రజలకు అతీతమై భాషాపండితులకు పరిమితమైపోయిన సాహిత్యం నిలవనీటి మడుగులాంటిదైంది. కవిత్వమూ పాండిత్యమూ కుల వృత్తులుగా మార్పుచెంది, ఉదరపోషణకు సాధనాలయ్యాయి. కవిపండితుల స్పర్థ సయోగివైదీకి కాట్లాటగా రూపొందింది. పండితుల దృష్టిలో కవిమాత్రులు "సాహిత్యగాళ్లు" అయ్యారు;తోటకూరలోని పురుగుల్లా కనిపించారు.9 మరి కవులు ఊరకుంటారా? అడిదం సూరకవి రేకపల్లి సోమప్పనన్నట్లు, పండితులంతా శుష్కతర్క కర్కశమతులని భావించి ఉంటారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారన్నట్లు,"ఉన్నయభిరుచికి ఉదాహరణము లిచ్చువారేకాని, దానిని సరియైన త్రోవలో మార్చి దిద్దగలిగిన ధీరులు లేరైరి. క్రమముగా కవిత్వమునకు జీవనము సంపాదించుకొనుట యొక యానుషంగిక ఫలముగాఁగాక, ప్రధాన ఫలముగా పరిణమించెను".10A

'దేవమానం'తోటి పండితునికి భూమి కొలిపించి యిచ్చిన పిఠాపుర ప్రభువు గంగాధర రామారావూ, కాశీనుంచి పండితులను పిలిపించుకొని వచ్చిన విజయనగర ప్రభువు విజయరామ గజపతీ_ఇలాంటివాళ్లు బహు సకృత్తు. పెద్దాపురం, నూజివీడు, వేంకటగిరి, కార్వేటినగరం_జమీందార్లు కూడా కవిపండితులను యథాశక్త్య సత్కరించి సాహిత్యానికి పెంపు చేకూర్చినవాళ్ళే. అయితే గంటాలపై పన్నువేసి అడిదం సూర కవి నిరసనకు పాత్రుడైన పూసపాటి సీతారామరాజూ, కూచిమంచి జగ్గకవికి దేహశుద్ధి చేయించిన ఏటికొప్పాక జమీందారు, పంటపొలాలకు చెరువునీరు

ఎక్కకుండాజేసి అడిదం రామకవి అగ్రహాన్ని కొనితెచ్చుకొన్న దంతులూరి జగన్నాథ రాజు-ఇలాంటివాళ్ళదే ఈ యుగంలో సంఖ్యాతిశయం. ఎవరు ఎవరిపై చెప్పారోగాని ఈ చాటువు క్షీణయుగ ప్రభులక్షణాన్ని ఆవిష్కరిస్తుంది.

> రాజులు తొల్లియిందుఁ గవి రాజులఁ బూజల నాదరించి వి
> భ్రాజితమైన కీర్తిఁ గకుబంతములన్వెలయంగఁ జేసి రా
> రాజులు నేఁడు చూడఁ గరిరాజుల వాజుల నాదరింపుచు
> న్భ్యాజన కోటిపై నిడిరి పూజ్యుల భారము పల్వు రిమ్ముగాఁన్.

*వేణుగోపాల శతక* కర్తకూ కార్వేటినగర ప్రభువుకూ మధ్య అడ్డంకులు ఒకటీ రెండూ కావు; అవి అన్నీ మనుష్యావరోధాలే: దివాను, మునషీ, బక్షీ, మజుందారు, సిరస్తాదారు, మునరద్ది, దేశపాండ్యా. వీళ్ళందరినీ దాటుకొని వీళ్ళ అను గ్రహాన్ని కొనుక్కొంటేనేగాని రాజదర్శనం కాదు. గంగిరెద్దూ మూర్ఖభూకాంతుడూ అడిదం సూరకవి కొక్కలాగే అనిపిస్తారు. ధనవంతులైన వైశ్యులూ తది తరులూ పండిత సంభావనలనీ కవిత్వప్పళ్ళలనీ వర్షాశనాలనీ ఆసరా ఇవ్వకపోతే. కవులు కూడా భిక్షాటకులు కావలసివచ్చేది. ఈ స్థితిలో నోరు గలవాడిదే ఊరు. కైవారాలకు రాలని కాసులు శాపాలాపాలకు జలజలా రాలసాగాయి. 'సూరకవి తిట్టు కంసాలి సుత్తెపెట్టు' అయినట్టుగానే, తురగా రామకవి శాపం పెద్దాపురపు వత్సవాయి తిమ్మజగపతి నట్టింట పెద్దమ్మ చేత దిద్దిమ్మని నాట్యం చేయించిందట.

*రామలింగేశ్వర శతక* కారుడు వర్ణించినట్టు, అగ్రహారాలు నామ మాత్రావశిష్టాలవుతున్నాయి; మాన్యాలు మంట గలుస్తున్నాయి; భత్యానికి వెనకటి పడికట్టు తప్పింది; పండితుల రాకపోకల జోరు తగ్గింది; వర్షాశనాలు నీట గలి శాయి; ఏనుగులూ, గుర్రాలూ తాకట్టుపడ్డాయి- "ధార్మికస్థానము"లు క్షీణిస్తున్నాయి. మరి సదరు క్షైణ్యం కవుల లౌకిక, కావ్య జీవితాలను దయదలచి విడిచిపెట్టలేదు.

అంధ యుగానికీ క్షీణయుగానికీ లంకె అనదగిన గణపవరపు వేంకటకవి అంత ఉద్దండ పండితుడై *ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాస* కర్త అయికూడా, ముద్దళగిరి రాజుగారి ఉంపుడుగత్తెపై *విద్యావతి దండకము* చెప్పాడు. *భోగినీ దండకం* లేదా అనవచ్చు. రాజాశ్రయం కవులను నానా పనులు చేయించిందనడానికి తార్కాణలుగానే ఇవి పనికివస్తాయి. అప్పటికే 'మూగ చెవిటివారి ముచ్చట' అయిన కవిత్వం ఇప్పుడు పశుపక్ష్యాదుల ముచ్చటగా మారేట్లు

> కైకోకీ కాకెకుకై
> కోకాకాకింక కూకి కూకకుకోకీ
> కాక కకు కేకికేకిక
> కూకో కొకూ్కక కింక కోకైకోకా.

అన్నాడు. మరి నూరేళ్ళ తదనంతరం 256 విధాలుగా చదవదగిన కంద పద్యాన్ని మండపాక పార్వతీశ్వరశాస్త్రి చెప్పాడట. ఢక్కాఢధాంక శబ్దాన్ని ఒకరు అనుకరిస్తే ఒక్క కందంలో 'కమల' శబ్దాన్ని తొమ్మిదిమార్లు మరొకరిమిడ్చారు. చేతుల్నీ గోతుల్నీ కాకుల్నీ వాన ముక్కుల్నీ ఒకరు శ్లోకంలో దూర్చగా, చింత కాయల్నీ, కలేకాయల్నీ మరొకరు. "శిల్పి వ్యాపార కౌశల"మని ఈ గర్భ, చిత్ర కవిత్వాలను వర్ణిస్తూనే వీరేశలింగం వాటి నీసడించాడు. నువు పోదలచుకొన్న చోటికి మనిషిలా కాళ్ళతో నడిచిపోవాలిగాని—అడ్డంగా నేలమీదపడి "కడుపుతో దొర్లి ప్రయాసపడి గమ్యస్థానమును జేరి యసాధారణ ప్రౌఢిమను జూపిన బుద్ధి మంతుని మెచ్చుకొనునట్లే కవితాచమత్కృతులు మెచ్చుకొనఁదగియుండును."10B

అస్వతంత్రులూ రాజాశ్రితులూ కావడంచేతనే కవులిలా రాశారనడం సరి కాదేమో! వాళ్ళ అభిరుచికే చీడపట్టి ఉండాలి. తమ ముందరి కవులు చూపిన మార్గం ఉత్తమమైనదని తమకు తెలియకపోలేదు. *ఉత్తర రామాయణ* కర్త కంకంటి పాపరాజుగానీ *సమీర కుమార విజయ* కర్త పుష్పగిరి తిమ్మన గానీ ఈ పలివారికి దిసాయించలేదు. రామరాజభూషణుడు మార్గదర్శి. అతనిశక్తి వినా మిగతాదంతా తమ కబ్బింది. సూరకవి *కవిజనరంజనము*, కూచిమంచి తిమ్మకవి *రసికజన మనోభిరామము* తదనంతర కవులందరినీ పెడతోవ పట్టించాయి. పిల్లవసుచరిత్రలకు కారణం ఇదే. ప్రతిపదశ్లేషతో *వాసవదత్తా పరిణయం* రచించిన వక్కలంక వీరభద్రకవీ, *కవిరాజ మనోరంజన* కవి కనుపర్తి అబ్బయామాత్యుడూ, *యాదవ రాఘవ పాండవీయ* కర్త నెల్లూరి వీరరాఘవ కవీ, ఆ శ్రీకను ఉల్టాసీదా చేసినట్లు *రాఘవ యాదవ పాండవీయ* కర్త అయ్యగారి వీరభద్రకవీ — ఇలాంటి వారెందరో మహానుభావులు!

ఇంతెందుకూ, పాండిత్యం వక్రించింది. కవిత్వం నిఘంటు పరిశ్రమగా మారింది. అర్థలోపానికి శ్రవణకటుత్వం జత చేరింది. స్వతంత్ర కల్పనాశక్తి

అడుగంటింది. కొండెక్క సాగిన సాహిత్యదీపకళికను పిశాచాలవంటి వికృతభావ రూపాలు చుట్టుముట్టాయి. పాండిత్యం సాముగరిడీలకు, కవిత్వం వినోదానికి పనికి వచ్చాయి. "చండకరాఖండల ఖండపఃళు చిత్రప్రద దోర్దండ సముద్దండ పరాక్రమాక్రాంత సమస్త శాత్రవచక్రప్రదత్త మత్తకరి నృత్తచరీ తుంగ తురంగ మాతంగ శతాంగాద్యుపాయన పరిపూర్ణ ప్రఘూణ పరాఖండును .." ఇలా గుక్క తిప్పనివ్వని 'వచనం'. ఇంకా పద్యం 'గర్భచెరి' వదిలి బయటపడలేదు.

ఈ పద్యగద్యాలు రెండూ మరొక సాంఘిక వ్యవస్థవి. అగ్రహారిక విద్యా విధానం, భూస్వామ్యం, జమీందార్ల ఏలుబడీ, సంస్కృత విద్యాధిక్యం ప్రబంధ ప్రక్రియాప్రాబల్యం – ఇవీ దాని లక్షణాలు. అవలక్షణాలైనా ఇవే. కవిపోష కుడూ కావ్యరత్న పరీక్షకుడూ ఒక్కడే: రాజనామధారియైన 'రాజా'. అర్థులు తెగపెరిగి దాతలు సన్నగిల్లిన రోజులు కాబట్టి ఒక అభాగ్యకవి ఇలా వాపోవలసి వచ్చింది :

> కవితా లక్షణ మెఱుఁగని
> యవివేకికిఁ బద్యమిచ్చి యడుగుటకంటెన్
> చవిలెఁగొని దండెఁ గొనుకొని
> భువిలో హరిదాసుఁడైన బుణ్యమె దక్కున్.

కాలికి బలపం కట్టుకొని శిష్టు కృష్ణమూర్తిశాస్త్రివంటి విద్వత్కవి దక్షిణాన కాళహస్తినుంచి ఉత్తరాన మాడుగుల వరకు ప్రయాణం చెయ్యవలసివచ్చిన దుష్కాలంలో, "ఘనవిత్తం" గురించి కవులలో కవులకూ పండితులలో పండితులకూ కవులకూ పండితులకూ సిగపట్ల గోత్రాలు తప్పలేదు. రాజును మురిపించి మైమరపించే అవసరం గోపీనాథుని వేంకటకవి వంటి కవిచేత, బ్రహ్మానందానికిన్నీ మైథునానందానికిన్నీ అభేదాన్ని చెప్పించింది. దిగ్దంతివంటి మాడభూషి వేంకటా చార్యులు రామావధూటీతాటంకావళి చెప్పవలసివచ్చింది. మరెవరూ యోగ్యులు కృతిపతిగా దొరక్క శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి తన కావ్య కన్యకను ఒక శిరస్తాదారు చేత పెట్టవలసి వచ్చింది. సుందరీమణుల కందరికీ అన్వయించేలాగున రాజుగారి పెంపుడు సానిపై కూర్మనాథ కవి వంటి నిష్ఠాపరుడుకూడా ఒక శతకం చెప్పవలసి వచ్చింది. ఈ అంధయుగపు ఆంధ్ర కవిజన హైన్యదైన్యాలను చెప్పుకోడానికో

అన్నట్లు, ఇంగ్లాండు చరిత్రలో రెండవ ఛార్లెసు హయాంలోని కవుల స్థితిని ఒక ఫ్రెంచి విమర్శకుడిలా వర్ణించాడు :

> The author of the day ... became the complete and perfect sycophant. Against their better judgement, they indulged in clowning. They recognised the better path, and chose the worse ... They grew accustomed to be despised, and became despicable. Their self-respect being so small, they respected their profession little. [11]

అట్లని, కవులకందరికీ ఆత్మగౌరవమూ చిత్తశుద్ధీ లోపించాయని అనుకోవడం అతిశయోక్తి అవుతుంది. దేహీ అనని పండితులు అసిధారా వ్రతంగా జీవించేవారని చెళ్ళపిళ్ళవారు రాశారు. ఈ యుగారంభంలో వేమన్న, మధ్యలో పోతులూరి వీరబ్రహ్మం, ఏగంటివారు ఉండి తమ 'కవిత్వం' చెప్పారు. చెప్పే కవులెప్పుడూ, రాసే కవులకూ తల అడ్డంగా ఊపే పండితులకూ లోకువ. కాబట్టి వేమనాదులను 'సిద్ధులు'గా గణించని ప్రబుద్ధులీనాటికీ ఉన్నారు. తరిగొండ వేంగమాంబ గురించి ఏ తగాయిదా ఉండబోదు. ఇక దేశానికి తురుష్కుల, మరాఠీ, పిండారీల దండయాత్రలనుంచి మూడిన చేటు పరిస్తూ, ఆక్రోశిస్తూ సింహాద్రినారసింహుణ్ణీ, తిరుపతి వేంకటేశ్వరుణ్ణీ, భద్రాద్రి రాముణ్ణీ నిందా స్తుతిరూపంగా పిలిచి విన్నవించిన గొప్ప శతకకవులు కూడా ఈ కావ్యపరీక్షలో లెక్కకు రారు. పోనీగాని, వాళ్ళ మురుగు ముంపున పడలేదు. వారి గొంతు ఎలా వినిపిస్తుంది? కాకిగోలలో కోకిలలయ్యారు.

# 3

ఇంగ్లీషు చదువుల పుణ్యమా అని, మోడుబారిపోతున్న నుఱిచెట్టు కొత్త చిగుళ్ళు వేయసాగిన రోజులను జాతి జీవితానికి "గర్భసంధి" అని వర్ణించడం సవ్యంగానే ఉంది. మూగబారి స్తబ్ధమైపోయిన వృక్షవీథిలో మళ్ళీ లలలలలుగా గాలి తోలసాగింది. అది పడమటి గాడ్పే – సందేహం లేదు. ఊపిరిసలపని చోట అదే పదివేలు. పాశ్చాత్య విద్యావంతులు కొద్దిమంది అయినా వారికి నూతనో త్తేజం కలిగింది. మరి ఈ కదలికకూ పై నిశ్చలతకూ ఆదిలో విరోధం ఏర్ప డక తప్పిందికాదు. గతానుగతికత్వానికీ దాని ముద్దుపేరైన ఆచార పరత్వానికీ, నవీన కల్పనకూ దాని స్వరూపమైన పాశ్చాత్యభావపరత్వానికీ దాదాపొక నూరేళ్ళ పాటు హోరాహోరీ పోరాటం జరిగి చివరకు నూతన విజ్ఞాన ప్రవంతి ఉపరిపఙ్క్తుల పాలై పోయింది. కబంధహస్తం లాగా సాగేగుణం గల హైందవ సంప్రదాయం రెండు వేలేళ్ళ చరిత్రలో ఎన్నో కొత్తలను వింతలను ఉనలో కలుపుకొన్నట్లే ఈ కొత్త వింతనుకూడా జీర్ణించుకొని గర్రున తేన్చింది.

ఈ కదలిక ఎటువంటిదీ అని, ఇప్పటిదాకా విజ్ఞులు తర్కించుకొంటూనే ఉన్నారు. బూడిదపోగులో సుడిగాలి వంటిదా ఇది, లేక ఉడుకబోత తర్వాత పైర గాలి లాంటిదా ? మన సంస్కృతి చావలేదనే గాని చావుగుమ్మాన నీరసిల్లి పడి ఉండినప్పుడు మళ్ళీ దానికి ఊపిరులూదిన ఆ మంచి రోజులనే పునరుజ్జీవన దశ అంటున్నాము (రినేజాన్సు), యూరపులో పదిహేను, పదహారు శతాబ్దులలో విలసిల్లిన సాంస్కృతిక మహోద్యమానికీ, దీనికీ. పేరునుబట్టే పోలిక ఎక్కువ. ఆనాటి యూరపియన్లు ప్రచలించినంతకంటె ఎంతో ప్రబలంగా 'రినేజాన్సు' మూలాన మనవాళ్ళు ప్రతిచలించారు. దానికి కారణం, మన ఆంగ్ల విద్యాధికులు తమ ఆలోచనా పద్ధతులను సమూలంగా మార్చుకోవలసి వచ్చింది. సనాతన హైందవ సంస్కృతియొక్క శిథిలాలను నిరాకరించి, 'యూరపియన్ రినేజాన్సు' సమకూర్చి పెట్టిన నూతన భావాలను స్వీకరించిన వాళ్ళు అల్పసంఖ్యా కులే అయినా, నవభారత నిర్మాణంలో వాళ్ల కృషి అల్పిష్టి దేమీకాదు, హైందవ సంస్కృతి శల్యావశిష్టమై మంచాని కంటుకొని దీర్ఘకాల క్షయరోగి లాగుందేదని అరవింద, రవీంద్రులు కూడా అంగీకరిస్తారు. పందొమ్మిదవ శతాబ్ది నాటికి ఈ

మహాక్షయం ఒక కొలిక్కివచ్చి, మతంలోనూ కళల్లోనూ సృజనాత్మక ప్రతిభ అలసమై శోషబడినట్లుగా, విజ్ఞానశాస్త్రమూ తత్వజ్ఞానమూ మేధాసంబంధి పరిజ్ఞానమూ శుష్కపాండిత్య ప్రదర్శనంగా కొరడుగట్టినట్లు అరవిందుడు వర్ణించాడు —

> ... all pointing to a nadir of setting energy, the evening-time from which, according to the Indian idea of Cycles, a new age had to start. It was that moment and pressure of a superimposed culture which followed it that made the reawakening necessary.[12]

సంస్కృతికి కనుకొలుకుల్లోకి వచ్చింది ప్రాణం కొట్టుకోసాగింది దీపం. గతానుగతికత్వం, 'సంప్రదాయ' పరత్వంగా చలామణీ కాసాగింది. రవీంద్రు డంటాడుగదా,

> In social usage, in politics, in the realm of religion and art, we had entered the Zone of uncreative habit, of decadent tradition, and ceased to exercise our humanity.[13]

పునరుజ్జీవనమనేది సంజీవ కరణి అయిందేమోగాని విలువలను పూర్తిగా తల్లకిందులు చెయ్యలేదు. పాతను కొత్త 'ఫీటు' గొట్టిందనే గాని త్వరలో దానితో రాజీపడక తప్పలేదు. ఆ రాజీవల్ల అనూచానమైన ఆధ్యాత్మికత నిరంతరాయంగా కొనసాగగలిగిందని అరవిందు డన్నాడు. భారతీయమైన ఈ పారలౌకిక దృక్పథం విజ్ఞానశాస్త్ర విహితమైనట: మత భావన మళ్ళీ పైకొనేందుకు ఇదొక పూటీ. ముచ్చెనగుంటలో కన్ను మొలిచినట్లుగా, ఏ బదరికాశ్రమంలోనో నైమిశారణ్యంలోనో స్వర్ణయుగ చిత్రాన్ని ప్రదర్శించడం ఇందువల్లనే పొసగుతుంది. పునరుజ్జీవనమంటే బతికివున్నదాని మూపున శవభారాన్ని మోపడం కాదు. కాబట్టి సంప్రదాయాన్ని పూర్తిగా నిరాకరిస్తూ ఆంగ్లో - ఇండియన్ యువకుడు డెరోజియో, అతని బెంగాలీ అనుచరబృందం పాశ్చాత్య సంస్కృతిపట్ల వెర్రి మోజు పెంచుకొని ఉన్మత్త ధోరణి నవలంబించి తాగుడుకూ నంజుడుకూ మనస్సులప్పగించారు. సంప్రదాయ వాదుల్ని గంగవెర్రు లెత్తించేందుకే ఈ ఆకతాయి పనులు. ఎథీనియం (Atheneum) వంటి పత్రికద్వారానూ, 'ఎకడమిక్ అసోసియేషన్' వంటి సంస్థద్వారానూ, డెరోజియో చిచ్చరపిడుగు చందంగా బతికి కుర్రకారు బెంగాలీలను విశేషంగా ఆకర్షించి పోయాడు. ఆదిలో క్రైస్తవమతం కొందరిని ఆకర్షించినా, అనేకులు కాలక్రమాన యావద్దేశీయ రాజకీయ విషయాలపై దృష్టిని లగించి, ఫ్రెంచి మహా విప్లవ భావాలను ప్రచారం చేస్తూ అపూర్వమైన సంచలనం

కలిగించారు. అయితే నిరసనకు పనికివచ్చినంతగా నవీనతా కల్పనకు వారి కార్య కలాపాలు దోహదం చెయ్యలేదు. పూర్వీకు లెలాగైతే లేరో, వాళ్ళకు వారసులూ లేకపోయారు–"a generation without father and children". 14

సంస్కృతి అనబడే దానికి వెనక నేపథ్యమంటూ ఒకటి ఉంటుందనీ అది ముఖ్యంగా దేశీయమైనట్టిదనీ గుర్తించనందుచేత, దెరోజియన్ల ప్రభావం వట్టి దుస్సాహసంగానో శుద్ధ అరాజకంగానో మిగులుపడి పోయింది. రామమోహన రాయలు రాజహంసలాంటి మనీషి కనకనే, సంప్రదాయాన్ని క్షీర నీర విభాగంచేసి మేలిమినే స్వీకరింప బూనాడు. ప్రాచీన ప్రాచ్యభాషా పాండిత్యం, ఆయనకు శరత్వాన్ని కలిగించలేదు. మత చింతన, ఆయనకు శాస్త్రవైముఖ్యాన్ని అలవరచ లేదు. ఉపనిషద్భావపరత, ఆయనను భవిష్యద్దర్శనానికి ప్రతికూలుణ్ణి చెయ్యలేదు. మతాన్నీ సంఘాన్నీ మరమ్మత్తు చేయ బూనుకొన్నాడు. 'అగ్రే', 'అగ్నే' అనే రెండు మాటల విపర్యయం వల్ల ఏర్పడిన సతీ సహగమన వైపరీత్యాన్ని నిర్మూలించేందుకు సంప్రదాయవాదులతో సంప్రదాయపద్ధతిలో ఆయన పోరాటమే చేయవలసి వచ్చింది. సాంస్కృతిక పాతాళాన భస్మరాశి ప్రాయంగా ఉండిన సగర పుత్రులవంటి స్వదేశీయుల భావాస్థికలపై ఆంగ్ల విద్యాద్వారాన ఆధునిక విజ్ఞాన మందాకినిని భాగీరథిగా కొని తెచ్చాడాయన. 'ఏకమేవా ఉద్వితీయం బ్రహ్మ' అనే ఉపనిషత్సూక్తి ధ్వజంకాగా, సాంప్రదాయిక మత దుర్రక్షకులపై ఆయన దండెత్తాడు. ఫ్రెంచి విజ్ఞానవికాసం (Enlightenment), ప్రచురంచేసి పోయిన హేతువాద (Rationalism), వ్యక్తిస్వాతంత్ర్య వాద (Individualism) భావాలను పుడిసిట బట్టినందుచేత, మతంపట్ల సమాజంపట్ల వివేచనాత్మకమైన విమర్శావైఖరి ఆయన కలవడింది. ప్రతి మతంలోనూ సార్వకాలిక సార్వజనిక సత్యమేదో లేక పోలేదుగావి దానిని కప్పివేసేంతగా అనావశ్యక పదార్థమెంతో దానిపై పోగుబడి ఉంది ; దీనినుంచి దాన్ని వేరుచేసి మతవిహిత జీవితానికి ప్రాతిపదిక సమకూర్చాలి. – రామమోహనరాయల సంకల్పం ఇంతే. ఆయనలో సంకల్పానికీ క్రియాచరణకూ మధ్య ఆటంకంలేదు.

చనిపోవడానికి కొద్దిముందుగా రామమోహనరాయలు (1774 – 1883) స్థాపించిన బ్రహ్మసమాజం (1828), తరువాతి కాలాన బయల్దేరిన మహోద్యమాల కన్నిటికీ మాతృస్థాన మనదగినట్టిది. ఆయన తిక్శికపెట్టిన పర్ణకుటి త్వరలోనే కిక్కిరిసిపోయింది. దేవేంద్రనాథ టాగూర్ బ్రహ్మ సమాజానికి సారథి అయిన

కాలాన, "సనాతన" మతధర్మానికి దానిని పునరంకితం చేశాడు. చేసి తాను "మహర్షి" కల్పుడయ్యాడు. తొల్లిటి వసుధైక విశాల మతభావన మరుగున పడిపోసాగినప్పుడు, బ్రహ్మ సమాజాన్ని కేశవచంద్రసేన్ సొంతపరచుకొన్నాడు. క్రైస్తవం ఆతని మనస్సు కెక్కింది. వంగదేశ వైష్ణవ సంప్రదాయం జతకలిసింది. మత సంస్కరణం సంఘ సంస్కరణకు దారిచూపింది. అతిబాల్య వివాహాలు అత్యాచారా లనిపించాయి. కులం, ఆచారం. దూరుపడ్డాయి. ఫలితం బ్రహ్మసమాజంలో చీలిక. ముసిలీ ముగకా సామాజికులు 'ఆది బ్రహ్మసమాజం'లో ఒదిగి కూచుంటే, వాళ్ళను వెక్కిరించి మునుసాగే కుర్రకారు 'భారత బ్రహ్మసమాజం'లోకి పరుగుతీశారు. మరి పదేళ్ళకు 'సాధారణ బ్రహ్మసమాజ'మంటూ మూడో కూటమి ఏర్పడింది.

"ఆత్మప్రత్యయం" (Intuition) మూలాన ఆస్తిక్యభావ మేర్పడుతుందని మహర్షి అన్నారు. దానికితోడుగా "సహజజ్ఞానం" (Common sense) వల్లకూడా ఇహపరాలను గుర్తెరగవచ్చునని బ్రహ్మనందుడైన కేశవచంద్రుడన్నాడు : మొదటిది శుద్ధ విశ్వాసం, రెండవది జ్ఞానం. విశ్వాసంకంటె జ్ఞానం హెచ్చైనదే గాని అది కొన్ని పరీక్షలకు నిలబడవలసి వస్తుంది. ఆ పరీక్షల పేరు హేతువాదమే. ఏదిన్నీ అపౌరుషేయమనే ప్రశ్నకు అది చోటీయదు. విమర్శకు ప్రతిఒక్కటీ తల ఒగ్గాలి. తాను ప్రవక్త ననుకొని తనవాణి దైవవాణి అని కేశవచంద్రుడన్నప్పుడే వచ్చింది చిక్కు. 'నవవిధాన్' ఆరాధనా విధానమైపోయింది. ఆరాధన, ధ్యాన, ప్రార్థనలు దానికి అనుష్ఠానాలయ్యాయి. పాతమతం స్థానే అంత సాంగోపాంగమూ అయిన సరికొత్త మతం తలెత్తింది. సేన్ మత పాలకుడయ్యాడు (Theocratic,- ఈ మార్పుల నొల్లనివాళ్ళే 'సాధారణ' బ్రహ్మ సమాజాన్ని స్థాపించుకొన్నారు. ముక్కుపచ్చలారని కుమార్తెను కూచ్ బీహారు రాజాకిచ్చి పెళ్ళి జరిపించి, తానొకప్పుడు గర్హించిన అతిబాల్య వివాహాలను తానే ఇప్పుడమలు పరిచాడని సేన్‌పై కారాలు, మిరియాలు నూరినవాళ్ళుకూడా అతని విమర్శక కూటమిలో చేరారు. కొందరికిందులో 'ఆది' బ్రహ్మసమాజ భావాలుండేవి. ఏకేశ్వరారాధన కెక్కువ ప్రాముఖ్యమిస్తూ ఆత్మ ప్రత్యయభావాన్ని కుదించి తగ్గించివేశారు. 'సహజజ్ఞాన' వాదానికి సహేతుకాలైన బ్రాహ్మ సాక్ష్యాధారాలు పునాది అయ్యాయి. విశ్వ హృదయ మనదగిన (Universal Reason) మకుటధారి కాగలిగింది : ప్రవక్తల సూక్తులూ పవిత్రగ్రంథాలూ మాత్రమే శరణ్యాలు కావు. పండిత శివనాథశాస్త్రి మత ప్రచారకుడు, పురోహితుడు అయ్యాడు. 15 ఆంధ్రదేశానికి పలుమార్లు వచ్చి మన మత సంస్కర్తల భుజంతట్టి మార్గం చూపిపోయిన వాడీయనే.

వ్యక్తికి ఉండక తప్పని భావ స్వాతంత్ర్యానికి బ్రహ్మసమాజమెంతో ప్రాముఖ్యమిచ్చింది. తనకు బాహిరమైన ఇతరేతర వ్యక్తుల, సంస్థల అదుపాజ్ఞలకు అది లోనుకాగూడదు. విశ్వాసంపేర ఆచారంపేర దాని విలసనాన్ని ఆటంకపరచ గూడదు స్వయంగా తర్కించుకొని తనకుతానై చేసుకొన్న నిర్ణయమొక్కటే, ఏ వ్యక్తికైనా శిరోధార్యం కావాలిగాని, తదన్యమేదీ కాదు. ఈ దృక్పథమే క్రమేపీ రాజకీయాధికార నిరసనకు దోవచూపింది. బ్రహ్మసమాజం పెంపుచేసిన వాతావరణంలోనే, కాంగ్రెసు సంస్థ పుట్టిందనవచ్చు పత్రికా స్వాతంత్ర్యాన్ని కుంచిస్తూ సర్కారు వాళ్ళుచేసిన చట్టాన్ని రామమోహన రాయలు నిర్భీతిగా ఖండించిన తరుణమే. భారతజాతి ఆధునికచరిత్రకు నాంది.

సంస్కరణోద్యమాలకూ ఆయనపెట్టిందేభిక్ష. కేశవచంద్రుడుబ్రహ్మమతాన్ని సంఘసంస్కరణతో బ్రహ్మముడిపేశాడు. వెనకెప్పుడో దక్కారుకు చెందిన రాజారాజ్ వల్లభ్ తన విధవ కుమార్తె గురించి అదుర్దాపడి విధవా పునర్వివాహం ధర్మబద్ధమా కాదా అని, యావద్భారతదేశంలోగల పండిత ప్రకాండులను తేల్చి చెప్పమన్నప్పుడు, కాదనే ఎక్కువ మంది చెప్పారు. అయితే కాలం మారింది. 1837 నాటికి కలకత్తాలోనూ బొంబాయిలోనూ ఈ సంస్కరణకు సుముఖత చేకూరింది. ఈశ్వర చంద్రవిద్యాసాగర్, విష్ణుశాస్త్రి వంటివాళ్లు దాన్ని చేబట్టారు. ప్రభుత్వానికి మహజర్లుపోయాయి. విజయనగరం సమీపాన ఒక గ్రామంలోని బాల వితంతువులు కొందరిలా 1856 తర్వాత గవర్నరుగారికి ఒక మహజరు పంపారని ఇటీవల ఒక పరిశోధకుడు బయల్పరిచినాడట. ఆనాళ్లలో దేశంలోని ప్రతీపశక్తులను చూచి బ్రిటిషు ప్రభుత్వమింకా దడవడం నేర్చుకోలేదు, కాబట్టి 1856 లో హిందూ విధవా పునర్వివాహచట్టం చెయగలిగింది. పునర్వివాహ సమాజాలేర్పడ్డాయి. ఒకవైపు శశిపాదబెనర్జీ, ఇంకోవైపు ప్రొఫెసర్ డి కె. కార్వే, విధవలకు శరణాలయాలు స్థాపింపసాగారు.

పూర్వాచారపరాయణుల మాటనటుంచి, ఆంగ్ల విద్యాగంధ మలదుకొన్న వాళ్లలోకూడా పూర్వసువాసన చావలేదు. ఆంగ్లమానసపుత్రులకు ప్రతియోధులు పుట్టుకొచ్చారు. పునరుజ్జీవనదశలో ఇది రెండవతరమౌతుంది. బ్రహ్మసమాజంలో కూడా కొందరు సంఘాన్ని ముట్టుకోడానికి విముఖులయ్యారు. మరి మిగతావాళ్లు ఊసెందుకు? వీళ్ళకు గతచరిత్ర సమస్తమూ ఘనమనిపించింది; సంప్రదాయ మంతా పూజ్యమైంది. హైందవధర్మంపవిత్రమైంది. అలాంటివారికంతామొగదారుబంకించంద్ర

ఛటర్జీ. ఈ హైందవ పునరుద్ధరణోద్యమానికి వంగదేశంలో రాజకీయస్వరూపమిచ్చిన అరవిందఘోష్ దీన్ని సమర్థించకుండా ఉండలేకపోయాడు. వీళ్ళది ఒకవిధంగా సమన్వయ దృక్పథమని రాస్తూ, ఇది వట్టి పునరుద్ధరణకాదు, సమ్మేళన (Fusion) అన్నాడు. సాంప్రదాయికులనూ నవీనులనూ; గతానుగతికులనూ వివేచనాపరులనూ; ఉభయులనూ అలరించేలాగున ప్రాచీన సాంస్కృతిక మూల్యాలను పునశ్చరించడమే (Restatement) జరిగిందట! రచయితగా బంకించంద్రుని గొప్పదనాన్ని అటుంచిచూస్తే, ఆతని చారిత్రక కాల్పనిక దృక్పథం ఎంతో వండదెచ్చిపెట్టినట్లు గురజాడ అప్పారావు గమనించగలిగాడు. రథం ముస్లింజాతిమీదికి మళ్ళినట్లు బంకిం రచనలు తెలియజేస్తాయి. బెంగాలీ రచయితలు ఆనాళ్ళలో రాసిన ఏ నాటకంగాని, నవలగాని, ముస్లిములను మర్యాదతో వదిలిపెట్టలేదు. దేశభక్తికీ మత పాక్షిక దృష్టికీ పొత్తుకలిసింది. తెలుగులోకూడా ప్రతాపరుద్రీయ నాటకం మొదలు రోషనార నాటకంవరకు, మహారాష్ట్ర జీవనప్రభాతం మొదలు [illegible] నవలవరకు, చరిత్ర రచనలోకూడా ఈ పరమతనిరసన కనిపించడానికి హైందవ పునరుద్ధరణోద్యమమే కారణమనాలి. రవీంద్రుని జీవితకథలో ఎదురయ్యే "హిందూమేళా" దీనికి పుట్టిన బిడ్డే.

దయానంద సరస్వతి స్థాపించిన 'ఆర్యసమాజం' మతాంతరీకరణను ప్రోత్సహించినా, సంస్కరణలకు పెడమొగం పెట్టలేదు; ఆచారాలనన్నిటినీ తలదాల్చలేదు; వేదప్రామాణ్యాన్ని మాత్రమే అంగీకరించి ఈ నడిమి కాలాన కుప్పతెప్పలుగా వెలువడిన మత వాఙ్మయం అధికారాన్ని తోసిపుచ్చి, హైందవ మత శుభ్రతను పరిరక్షించేసుకొంది. 'దివ్యజ్ఞాన సమాజం' (Theosophical society) అలాంటిది కాదు. మత విశ్వాసాలనూ సంఘ దురాచారాలనూ బాహాటంగా ఖండించే ధైర్యం లేక, వాటిని తలదాల్చేందుకు తమ ఆంగ్ల విద్యావిజ్ఞానాలు ఒప్పుకోక, సదమదం కాసాగిన భారతీయులకు దివ్యజ్ఞాన సమాజం సులభతరణోపాయమైంది. 'సనాతనజ్ఞాన'మనేది ఒకటి కాలక్రమాన బహుమతాల పుట్టుకకు కారణమైనదంటూ, సదరుజ్ఞానాన్ని చేకూర్చుకోగలిగినవాళ్లు మహాత్ములై తమ ఆత్మశక్తితో మానవలోకానికి చోదకులు కాగలరని దివ్యజ్ఞానసమాజం చెప్పింది. అవతారాలను అంగీకరించింది. ఆచారాలకు ఉపపత్తులు చూపింది.

భాషా, సాహిత్యవిషయాలలోనూ వంగదేశమే మార్గదర్శకమైంది. సంస్కృత భాషా పండితులు బంగాళీభాషను శాసించిన రోజులు భూతకాల గర్భాన కలిసి

పోయేట్లుగా రామమోహనరాయలు వచనాన్ని సుబోధకంగా మలిచి రచనలు చేశాడు. విద్యాసాగరునివల్ల దానికి వ్యాప్తికలిగింది. అయితే, పాండిత్య శిరోభారం విద్యాసాగరుడికిగూడా వదల్లేదు. విద్యావంతులు మాత్రమే సమాదరించగలంత సంకుచిత ప్రయోజనంతో ముందునడక ఆగిపోయిన బంగాళీ వచనానికి బంధమోక్షణం చేసినవాడు పేక్‌చంద్; పద్యానికి ఛందస్స్వేచ్ఛనిచ్చి మహాకావ్యాన్ని రచించినవాడు మైకేల్ మధుసూధనదత్. పేక్‌చంద్ తలదన్నే విధంగా బంకించంద్రుడు వచనాన్ని నవీనమూ పటిష్ఠమూ చేశాడు. వీళ్ళంతా గురజాడ అప్పారావుచేత వందనాలందుకొన్నవాళ్ళే. చివరకు, కలకత్తా పరిసరాలలో జనం మాట్లాడుకొనేభాష ఆధునిక బంగాళీ కావ్యభాష కాగలిగింది. ఈమూలంగా కూడా వంగదేశం గురజాడ అప్పారావుకు ఆచార్యపీఠం అయింది.

ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవన మనే ఏమి తక్కిన ప్రాంతాలను తాకింది కూడా, వంగదేశంనుంచి దూకిపడిన చేతన తరంగమే. చరిత్రలో నిలిచిపోయే ఆ క్షణాన్ని, దాని గొప్పదనానికి తగిన వాక్యాంలోనే యదునాథ సర్కార్ ఇలా వర్ణించాడు :

> If Periclean Athens was the school of Hellas, the eye of Greece, mother of arts and eloquence, that was Bengal to the rest of India under British rule, but with a borrowed light which it made its own with marvellous cunning. In the new Bengal originated every good end great thing of the modern world that passed on to the other parts of India...New literary types, reform of the language, social reconstruction, Political aspirations, religious movements and even changes in manners that originated in Bengal, passed like ripples from a central eddy, across provincial barriers, to the farthest corners of India.[4]

భారతీయ సంస్కృతికీ సాహిత్యాలకూ అది ఉదయసంధ్య.

---

1. Economic History of India—part II : *Romesh chandra Dutt p. 87*
2. Historical Geography of India : *P. E. Roberts p. 500*
3. A History of Education in India : *Syed Nurullah and J. P. Naik*
4. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావం : డా॥ కె. వీరభద్రరావు.

5. గు. ర. లే : కన్యాశుల్కం పీఠిక రెండవకూర్పు, పు. 40.
ఇక్కడ అప్పారావు మెకంజీ కృషిని ప్రస్తుతిస్తూ వెలిగెట్టాడు

6. సి. పి. బ్రౌన్: డా॥ కె. వీరభద్రరావు

7. A Nation in the Making : *Surendranath Bannerjea.*

8. గు. ర. వ్యా : కావ్యాలలో శృంగారం పు. 11.

9. కథలు – గాథలు—2 వ భాగం : బ్రాహ్మణశాఖలు :
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.

10ఎ. వేమన : రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. పు. 181 - 182.

10బి ఆంధ్రకవుల చరిత్రము : తృతీయభాగము : కందుకూరి వీరేశలింగం.
పు. 167 - 168.

11. Men of Letters and the English publc in the xviii Century:
*Alexander Belijame*

12. The Renaissance in India : *Sri' Aurobindo, p. 4 - 5*

13. Cit. in Dawn of Renascent India : *Dr. K. K. Dutta p. 7*

14. Notes on Bengal Renaissance : *Amit Sen p. 17*

15. The philosophy of Brahmaism :
*Sitanath Tattwabhushan p. 1 - 41*

16. History of Bengal : *Ed. Sir Jadunath, Sarkar. Cit. in BRITISH PARAMOUNTCY AND INDIAN RENAISSANCE : Bharatiya Vidya Bhavan vol ii p. 89*

# అరుణోదయం

"వేగుచుక్కయు తోకచుక్కయు
మెరసి వెడలిరి మిన్నువీథికి."

# అరుణోదయం

"పూర్వా సంధ్యా ప్రవర్తతే"

**గురజాడ** అప్పారావు పుట్టి పెరిగిన ఆంధ్రదేశం, నేటి ఆంధ్రదేశానికి సాంఘికంగానూ సాంస్కృతికంగానూ సయానా తల్లి. ఆ ఉదయసంధ్య ఫలితమే మహోదయ మనదగిన అద్భుతాభివృద్ధి. తెలుగు వారి హృదయాన్నీ మనసునీ మలచిన మహనీయులందరూ, అప్పటికింకా అడ్డాలలో బిడ్డలే.

త్యాగరాజు కాలం చేసిన ఏడాదే (1848) వీరేశలింగం అవతరించాడు. అలా రెండు యుగాలు తారసిల్లిన సంవత్సరమది. వీరేశలింగం ఒక కొత్త యుగానికి వేగుచుక్క కాగా, కొత్తయుగంలోనూ మిగిలిన పాతయుగపు పద్ధతుల పాలిటికి గురజాడ అప్పారావొక తోకచుక్క. అప్పారావు తోబుట్టువన్నంతగా ఆయన పుట్టిన సంవత్సరమే రఘుపతి వేంకటరత్నం అనుసరించి వచ్చాడు. అప్పారావుతో చెలిమి చేసేందుకై గిడుగు వేంకటరామమూర్తి ఆ మరు సంవత్సరమే వచ్చి కలిశాడు. మరింతతాళి వచ్చాడు 1877 లో కొమర్రాజు వేంకటలక్ష్మణరావు. ఇకనేం, సాహిత్యం, భాష, మతం, చరిత్ర — వీటి మేలికూడికైన సంస్కృతికి మళ్ళీ ఊపిరాడింది తెలుగుదేశం వెలుగులను నీళ్లాడింది.

కదలవారింది చిమ్మచీకటేగాని మంచుచీకట్లింకా విచ్చుకోలేదు. వీరేశలింగం వీరావేశం మొగ్గ విప్పడానికింకా వ్యవధి ఉంది. భావపిశాచరూపాలింకా విక్రమిస్తూనే వచ్చాయి: కన్యా విక్రయాలు, అతి బాల్యవివాహాలు, కుంద మార్పిడి పెళ్ళిళ్ళు, వేశ్యావిలాసాలు, విద్యాధికుల చీకటి వినోదాలు, బాలవితంతువుల కన్నీటి చిచ్చులు, 'పండితమ్మన్యుల' హెచ్చులు, కవుల కుళ్ళు వస్తువులు, సాహిత్యైక జీవుల అతుకు బతుకులు, జమీందార్ల దాష్టీకాలు — యథాపూర్వంగా సవ్యంగానే సాగిపోతున్నాయి. అగ్రహారాలలో వైదిక సంప్రదాయపు కుదుపింకా వదల్లేదు. అధమ కులాలకింకా ఆదరణే లభించలేదు. ఇంకా కాలు గతంయొక్క కౌగిలినుంచి విడిపోయి ముందుకు సాగలేదు: ఇది ఒక పెర.



మరొక వైపు: మొనజూపి కాలు నిలవరించుకొని బలీయమౌతున్నది మెల్లగా చల్లగా ప్రతికూల పరిస్థితుల ఆవరణలోనే మార్పు. వేషాలు కూడా మారుతున్నాయి. కులవిద్యలకు నూకలు మిగలకపోతున్నాయి. అగ్రికల్చరిస్టులు కూడా తెల్ల ఇజార్లు తొడిగి తలటోపీలు పెట్టి నవ్వులపాలౌతున్నారని ఎప్పుడో ... చెన్న శతక కర్త వర్ణించాడు. వర్ణసాంకర్యమే మోగాని, వర్ణాలమిశ్ర సంబంధాలు మొదలయ్యాయి. ఒక అరలో నుంచి మరో ఇరుకు అరలోకి పిల్ల ఇంపుతున్నాయి. మూసేసుకున్న సంఘం తలుపులు నెమ్మదిగా తెరుచుకుంటున్నాయి. ఇంగ్లీషురూపు చెడి ఇంగిలిపీసై ఎంగిలిపీసై పల్లెపట్లలో కూడా వినిపించి పాతకాలు వాళ్లను కవ్వించి నవ్విస్తున్నది. "పరిహాసవిద్యలు" "గొల్లసుద్దుల కతలు," పాషండమతాలు పైకొనిరాసాగినట్లు కుక్కుటేశ్వర శతక కర్త వాపోయాడు.

20 వ శతాబ్ది ప్రథమార్థానికి అనువర్తించేటట్లుగా పింగళి లక్ష్మీకాంతంగారు చేసిన, ఈ వర్ణన నవోదయకాలానికి అతికినట్లుగా సరిపోతుంది:

> ఒకవంక ప్రాచీనతయను మందరనగము. మరియొకవంక ఆధునికత్వ మను హిమవన్నగము. ఈ రెండు కొండల నడిమి గంభీరమైన లోయలో చీమలబారువలె సామాన్య ప్రజలు నడచిపోవుచుండిరి. కవిత్వమునందును ఇదియే స్థితి. 1

ప్రబంధకవిత్వం క్రమంగా బంధకవిత్వంగానే మిగులుతది, "ఇసుర్ల పుట్ట" వలె క్షుద్రశృంగారకావ్యాలు, శ్లేషకావ్యాలు లెక్కకుమిక్కుటమైనట్లు సాహిత్యానికి పట్టిన గ్రహణి ఇప్పుడిక తగ్గుముఖంపట్టింది. స్వేచ్ఛనుకోల్పోయిన కవిని ఇంగ్లీషు దొరతనం ఆదుకోలేదుగాని, రాజపోషకులను నీరసపరిచినందుచేత వారి సిరిని కొల్లగొట్టినందుచేత కవి నిరాశ్రయుడయ్యాడు; ఆ నిరాశ్రయత్వమే చివరికి అతనికి స్వాధీనతను నేర్పింది. పెద్దనలో రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి కనిపించిన 'మగకవి' మళ్ళీపుట్టుకొచ్చేపరిస్థితి ఏర్పడింది. పింగళి లక్ష్మీకాంతంగారు కూడా 'కవిధీరులు' లేకపోయారని బాధపడుతూ, 1775 తరువాతి శతాబ్దికాలంలో తామరతంపరగా పోగుబడిన కావ్యరాశి"....అంతయును ప్రాణరహితమైనవి పొల్లు" అని, కవుల అస్వతంత్రతను అనుకరణశీలతను ఎత్తి చూపారు: "నిద్రాణమైన జాతిని మేలుకొల్పగల వీరుడుగాని, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరింపగల కవి వీరుడుగాని లేకపోయెను." 2 అలా జాతినీ సారస్వతాన్నీ ఒక్కసారిగా తాకి వాటి మాంద్యాన్ని తీసివేసిన ఘనుడు వీరేశలింగం.

అయినా ఈకలు మొలిచి రెక్కలు గట్టిపడేవరకు వీరేశలింగం కూడా కాద్రవేయ కావ్యవిషవలయంలోనే ఆ మురుగుగుడ్ల కంపుగూటిలోనే ఉండిపోక తప్పలేదు. మార్కండేయ స్వామిపై గోపాలునిపై చెప్పిన శతకాల నటుంచినా, అటుమీదట చేయబూనిన గర్వకవిత్వ మేమి, *శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధ* మేమి, ఆయన అభిరుచిలోని ఆదిమత్వాన్ని బయల్పరుస్తున్నాయి. చిట్టచివరివరకు కవిత్వరచనలో ఆయన సాంప్రదాయికుడుగానే ఉండిపోయాడు. ఆయన చేసిన భాషా సంస్కరణమంతా కావ్యభాషను – ముఖ్యంగా గ్రాంథిక వచనాన్ని – సులువు చెయ్యడమే. అదికూడా చిన్నయసూరికంటె పెద్దననిపించుకోవాలనే ఉబలాటం *విగ్రహ* రచనద్వారా తగ్గాకనే. నూతన ప్రక్రియలనెన్నిటినో చేబట్టాడుగాని ప్రయోగాలనదగిన వాటిని కన్నెత్తి చూడలేదు, ఆయన ప్రాచీనులలో నవ్యుడనిపించుకొనేంతగా నవ్యులకు నవ్యుడనిపించుకోలేడు. అన్ని రంగాలలోనూ శ్రీరాములు రాసింది తానేనని ఆయన *స్వీయచరిత్రము*లో రాసుకొన్నాడుగాని కొన్నితారీఖులు ఆయనకీ ఆద్యత్వాన్ని తీసివేస్తున్నాయి. కాకుంటే తనకంటెముందు ఈ రంగాలలో వేలుబెట్టిన వారి రచనలు సాధకుల స్థాయిలోనేఉండే, తనవిమట్టుకు శిఖరస్థాయికి చెందినవని భావించిపుంటాడు. లేకుంటే వీరేశలింగం అబద్ధికుడూ ఆత్మస్తుతిపరుడూ కావలసివస్తుంది.

నవల విషయంలో డా. ఎ. రమాపతిరావుగారుచేసిన పరిశోధననుబట్టి ఇలా అనుకోవచ్చు. వీరేశలింగం *రాజశేఖర చరిత్ర* తొలి తెలుగునవలగా ప్రశస్తి పొందిందని అంగీకరిస్తూనే, తొలి నవలా ప్రయత్నంగా నరహరి గోపాలకృష్ణమచెట్టి *శ్రీరంగరాజు చరిత్ర*ను పేర్కొన్నారు, మరి, కొక్కొండవారి *మహాశ్వేత* నవలకాదు; సంస్కృత *కాదంబరి*లోని ఒకానొక వృత్తాంతానికి ఆంధ్రీకరణం మాత్రమే. తొలి తెలుగు 'వచన ప్రబంధ' కర్తతానేనని వీరేశలింగం రాసుకొన్నాడంటే, ఈ పూర్వాపరాలు తెలిసికూడా రాసుకొన్నాడన్నమాట. నవలగా ఈ 'వచన ప్రబంధం' 1897 నుంచి విమర్శా పరిభాషలోకి దూరిందంటూ, *రాజశేఖర చరిత్ర*పై కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిచేసిన విమర్శను ఉటంకించారు రమాపతిరావుగారు. 'నవాన్ విశేషాన్, లాతి గృహ్ణాతీతి నవలా' అని అర్థ వివరణమిస్తూ, ఇంగ్లీషు 'నావెల్' శబ్దం 'కొత్త' అనే అర్థమిచ్చే 'నవ్' శబ్దజన్యమని బ్రహ్మయ్యశాస్త్రి ఆనాడు సిద్ధాంతం చేశాడట. [3]

ఆనాటి సాహితీపరుల దృష్టిలో నవలకూ వచనప్రబంధానికీ సమీప

బాంధవ్యమే ఉండేది. అందుచేతనే *యశోహేల* వంటి రచనను నవలగా భావించ గలిగారు. అయితే మనకు తెలిసిన 'నవల' పూర్తిగా సీమనుంచితెచ్చి పాతిన అంటు మాత్రమే. అందుచేతనే ప్రథమాంధ్ర నవలా కర్తగా వీరేశలింగమే గణనీయుడు. ఇన్ని రంగాలలో ఇన్ని ప్రక్రియలలో ఆయన బీజారోపకుడేమీ కాకపోయినా, చెట్టు చివరి ఫలం ఆయనదే. వీరేశలింగం తన కాలానికి చిటారు కొమ్మ.

ప్రారంభకాలాన వీరేశలింగం వచన శైలి చిన్నయసూరి మూసనుంచి తీసిన అయోమయ పదార్థంగా ఉండేది. 'ఉపయుక్త గ్రంథకరణసరణిని అధ్యక్షు డయ్యాక, సూరి వచనరచనలో భూకంపమే తెచ్చాడు. 'దక్షిణాది' పండితులైన రేకం రామానుజసూరి, నిశ్చింత తేవప్పెరుమాళ్ళయ్యలతో జోడుకట్టి, తెలుగు వచన రచనా సంప్రదాయానికి గొడ్డలిపెట్టు పెడుతూ, ప్రౌఢయుగ దోరణులను నిరాక రించి, మధురనాయక రాజులనాటి వచన సంప్రదాయాన్ని పాతరతవ్వి తలకెత్తు కొన్నాడు. *నీతిచంద్రిక* ద్వారా (1858) కృతక వచనాన్ని గ్రాంథిక భాషజేసి పండితులచేత అవునవుననిపించుకొన్నాడు. ఆయనకంటె ఘనుడన్నట్లు కొక్కొండ వేంకటరత్నం గ్రాంథికాంధ్రానికి పట్టుగొమ్మగా నిలిచాడు. ఈ వ్యామోహాన పడ కుండా కాలు నిలవరించుకోవడం వీరేశలింగానికి గూడా వల్లగాలేదు. చిన్నయసూరి చిన్నబోయేంతగా, *సంధి, విగ్రహాల*ను అనువదించాడు. గ్రాంథికం స్థిరపడి, గిడుగు రామమూర్తి 'మాతృభాష' అని వర్ణించిన వ్యావహారికం "అస్పృశ్యమై, అవాచ్యమై, అధోగతిపాలైనది"—

> ప్రాచీన ప్రబంధస్థమై, కేవల ప్రయోగ శరణమై, పండితులకైనా బహుప్రయాస సాధ్యమై, ఒక్క ప్రబంధ నిర్మాణమునందే ఉపయోగించ దగి, పండితులు మాత్రమే అభ్యసిస్తూ ఉండిన 'గ్రాంథిక భాష'లో అధికారానధికార తారతమ్యము ఆలోచించకుండా, ఆబాల గోపాలం అందరి పిల్లల చేతనూ, రచనాభ్యాసము చేయించ నుద్దేశించి, అందుకు సాధనముగా, అసమగ్రము, అనిర్ణాయకము, భ్రమ ప్రమాదాత్మకమున్ను అయిన చిన్న వ్యాకరణము ఒకటిన్ని, అస్ఖలితముకాని చిన్న వచన గ్రంథ మొకటిన్ని రచి యించి, ఇచ్చి, ఆసూరిగారు కీర్తిశేషులయినారు. 4

ఆ కీర్తిశేషుని బరువూ భారమూ ఆంధ్ర జాతిపై, ముఖ్యంగా తరతరాల విద్యార్థులపై పడి ఉన్నాయి. తెలికిచర్ల వెంకటరత్నంగారన్నట్లు "చిరుమీలమాటలు తిమితిమింగలముల భాషణములుగా వ్రాసినాడనే నిందకుపాల్పడిన డా. సామ్యుయల్

జాన్సన్" అవలంబించిన శైలినిమించి చిన్నయసూరి శ్రీకారం చుట్టగా, "పదాడంబరము పరాకాష్ఠ పొందేరీతిని దీర్ఘ సమాస, యమకానుప్రాస భూయిష్ఠముగా" కొక్కొండ వెంకటరత్నం, కందుకూరి వీరేశలింగం రాశారు. చిన్నయసూరి వచనానికి గల సుగుణాలను మట్టుకు విడిచి, ఆ శబ్దసంగీత గుణాన్ని విరిచి, సూత్రీకరణలుగా భ్రమగొలిపే చిన్ని వాక్యాల తీర్చిదిద్దిన విన్యాసాలను పోకార్చి, బండరాళ్ళు దొర్లించిన చందంగా, ఆ శైలిలోని అవగుణాలనన్నిటినీ సొంతపరచుకొన్నారు. (ప్రిన్సు ఆఫ్ వేల్సు యాంధ్రస్థాన సందర్శనము (1877)లో కొక్కొండవారి తెలుగు వచనం మచ్చుకి –

అనవరత శతఘ్నీధ్వని ఘోషముచేతను, నానాముఖ ప్రణాళికా నిష్క్రాంత నిర్మల జలధారార్ద్రీకృత భూభాగము చేతను, సద్యస్కృత మరకత హరిత్ర విచిత్ర పత్రమయ తాయమాన మండప ప్రాసాద దుర్గరామణీయకము చేతను సంప్రవృద్ధ ప్రావృడ్దివసంబన్నట్లు పొడకట్టె.

వీరేశలింగం కొక్కొండ వారికి రాసిన జాబునూ, (చి. సూ.) చిన్నయసూరి వర్తమాన తరంగిణి సంపాదకునికి రాసిన జాబునూ చదివితే, నిత్య వ్యవహారంలో అనాది సిద్ధంగా పండితులుకూడా వాడే వ్యావహారిక భాషా సంప్రదాయానికి విరుద్ధంగా, కొత్తకాపుపండితులు గ్రాంథికాంధ్రాన్ని ఆశ్రయించారని తెలుస్తుంది. అంతేకాదు; చిన్నయసూరి వచనశైలిలోని సారళ్యం తారతమ్య పరీక్షలో బయల్పడుతుంది. మొదట చి. సూ. (చిన్నయసూరేనా ?):– "మహారాజశ్రీ వర్తమాన తరంగిణి ఎడిటరుగారి సముఖమునకు. ఈ యడుగున వ్రాసుకొన్న పద్యంబు తమపత్రికలో ప్రచురముచేసి పండితులగు వారివలన నా పద్యంబు కర్దంబు తెప్పించి తిరుగా తమపత్రికలో ప్రచురముచేసి నా అభీష్టం బీడేర్తురని తమ ఘనమును బహుధా ప్రార్థించెదను." కొక్కొండవారి పత్రికను అందుకొని వీరేశలింగం సంతోషించి రాస్తున్నాడు : "మీ యసమాన పత్రికారత్నమ్ము, కరమ్మున నాకరమ్ము నలంకరించి ఘనమ్మగు మనమ్ము లేమిడి యెక్కుమ్మడి నుడిపి కడుంగడు సంతసంబు నాపాదించు చున్నయది." 5 చిన్నయసూరి చాలామేలు. గుడ్డిలో మెల్ల మేలుకాదా మరి ? ఈ ఇద్దరు పెద్దలను పరిహసించి 1914 లో గురజాడ అప్పారావు రాసిన మాటలు గమనింప దగ్గవి. సూరి రచన masterpiece అంటూ, ఆయన అభిరుచి మెచ్చదగినదంటూ, వెంకటరత్నంగానీ వీరేశలింగంగానీ ఆ అభిరుచిని పెంపొందించుకోలేదని అప్పారావు రాశాడు.

The faults which Chinnaya Suri avoided by a correct taste rare among Telugu Pandits, are found exaggerated in Mr. Veeresalingam. His extravagance transgresses even the bounds of proverbial oriental extravagance.

వీరేశలింగం శైలికి అప్పారావిచ్చిన ఉదాహరణ :

—నిరంతర పరిఫుల్ల పనస మల్లికా వల్లికా మతల్లికా వేల్లిత [illegible] రంజితంబును, కుసుమ వినరపరిమళ ఘుళిత గళిత సుమరంద [illegible] హాస్వాదనాగత మిళిందబృంద సుందరంబయి వివిధ విటపి విటపాగ్రారూఢిత కుంత సంతానాక్రాంత తతరవాక్రాంత దిగంతరాళంబయి.

ఈ బాల్యచాపల్యం శబ్దలౌల్యం వదిలి, సమిత వృష్టి అనేవి [illegible] వీరేశ లింగం తన వచనాన్ని సంస్కరించుకొనేందుకు దాదాపు 1890 వరకు పట్టింది. కొత్తశతాబ్ది ప్రారంభకాలానికే ఆయన సులభ శైలిని నిరపంగా [illegible]. 'గద్యతిక్కన్న' అనిపించుకొన్నది తిమితిమింగల భాషణలకు కాదు. సరికొత్త మాసాలకు దాటుకొంటాడనేంతవరకూ 'సలక్షణమైన' శైలిని వదలనేరకపోయినా, "విషయానుగుణముగా తత్తదుచితరీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథము లను వ్రాయవచ్చుననియే నా యభిప్రాయము" అనగలిగాడు. 7 బతికించాడు. అందు వల్లే తానూ బతికాడు.

ఆంధ్ర భాషాభిమానం వీరేశలింగంచేత ఆంధ్ర కవుల చరిత్రను రాయిం చింది. గురుజాడ శ్రీరామమూర్తి, మానవల్లి రామకృష్ణకవి పోటీతగిలినా, కవుల చరిత్రలో అగ్రతాంబూల మాయనదే. మెకంజీ సేకరించిపోయిన గ్రంథసామగ్రి, 'లోకల్ రికార్డు'లు, ఆధారాలుగా రచించిన ఈ ఉద్గ్రంథం, మల్లంపల్లి సోమశేఖర శర్మ మాటల్లో, "ఒకవిధమైన చారిత్రక కావ్యమే." అప్పారావుకు దీనిలో ఎన్నో లోపాలు కనిపించాయి గాని ఆ లోపాలను పూరించే వ్యవధి చిక్కలేదు.

వీరేశలింగం అభినవాంధ్ర దేశానికి పితృతుల్యుడు. మార్పులో ఆయనదే ఆది; సాధనలో ఆయన పెట్టినదే ప్రమాణం. ఆత్మూరి లక్ష్మీనరసింహం ఎప్పుడైన గానో బ్రహ్మ సమాజంపట్ల తనకేర్పరచిఉన్న సదభిప్రాయాన్ని, తాను మద్రాసు లోని ప్రెసిడెన్సీ కాలేజి ఆంధ్రభాషాచార్యుడయ్యాక మన్నవ బుచ్చయ్య పూర్తిగా స్థిరపరిచాడు. 1864 లో కేశవచంద్రసేన్ మద్రాసుకువచ్చి చేసిన ఉపన్యాసాల ఫలితంగా ఏడేళ్ళ తదనంతరం శ్రీధరులు నాయుడు దక్షిణభారత బ్రహ్మ సమా

జాన్ని స్థాపించాడు. బ్రహ్మ సమాజ ప్రచారయాత్రలో పండిత శివనాథశాస్త్రికి రత్నంవంటి అనుచరుడు లభించాడు: క్రిశ్చియన్ కాలేజీలో విద్యార్థిగా ఉండిన రఘుపతి వేంకటరత్నం శాస్త్రి ఉపన్యాసధారలో తడిసి బ్రాహ్మధర్మ దీక్షితుడయ్యాడు. 1895 లోనే బ్రహ్మసమాజం నిండుగా వీరేశలింగం మదికెక్కింది. మద్రాసునుండి తిరిగివచ్చి రాజమండ్రిలో దాని అంటుగట్టాడు. అప్పటికే తెలుగు జిల్లాలలో సమాజశాఖలు విస్తరించి ఉన్నాయి. శతాబ్దులు మార సాగేనాటికి శివనాథశాస్త్రి అన్నట్లు, రాజమండ్రి బ్రహ్మకర్మక్షేత్రమైతే, బాపట్ల బ్రాహ్మభక్తమండలం, బందరు బ్రాహ్మవిజ్ఞానాలయం కాగలిగాయి. బాపట్లలో దేశిరాజు పెదబాపయ్య ధర్మానుష్ఠాన విషయంలో తనకే దారిచూపినట్లు వీరేశలింగం స్వీయచరిత్రలో రాసుకొన్నాడు.8

రాయసం వేంకటశివుడన్నట్లు "వీరసంస్కర్త"గా ఉండిన వీరేశలింగం వీరావేశం బ్రహ్మసమాజం పుణ్యమా అని, తొలి తీవ్రతను కోల్పోయింది. సంస్కరణోద్యమం వెనకముఖం పట్టిందికూడాను. కాకినాడలోని పిఠాపురం రాజాకాలేజికి ప్రధానాచార్యుడుగా రఘుపతి వేంకటరత్నం వచ్చిననాటినుంచి, ఆస్తికమత విషయాలే వీరేశలింగందృష్టికిగూడా ప్రముఖంగా తోచాయి. వీరేశలింగంనడిపిన విధవాపునర్వివాహోద్యమం నాయుడుగారి మదికెక్కినట్లులేదు. కాలేజీ విద్యార్థులెవ్వరూ విధవలను పెళ్ళాడడం ఇష్టంలేకపోవడమేగాక, కొంతకాలం ఒక భర్తతో కాపురంచేసి వైధవ్యం అనుభవించే స్త్రీ చనిపోయిన తన భర్త ఆత్మశాంతి దృష్ట్యా మళ్ళీ పెళ్ళి చేసుకోరాదని కూడా ఆయన మతమట. అయితే అలా తమను తాము నిభాయించుకొని ఉండలేని స్త్రీలు చెడి తిరగడంకంటె పెళ్ళాడి బాగుపడడమే మేలని భావించాడు. ఇంతమాత్రానబాల్యవివాహాలను ఆయన వ్యతిరేకించలేదని తీర్మానించుకోగూడదు. దేవదాసీవిధాన సంస్కరణవిషయంలో వెంకటరత్నం నాయుడు వీరేశలింగంకంటె ముందడుగు వేశాడు. అలాగే పెదబాపయ్యకు గూడా సహపంక్తి భోజనవిషయంలో ఆక్షేపణలుండేవి. బాబూ హేమచంద్రసర్కారు రాజమండ్రికి వచ్చినప్పుడు (1904) మాంసభక్షణ గురించి బ్రాహ్మసమాజికులు చూపెట్టిన ఉదాసీనవైఖరికి ఎంతో నొచ్చుకున్నాడు. ఆనందగజపతి ప్రోత్సాహంకొద్దీ బ్రహ్మసమాజంలోనూ థియోసాఫికల్ సొసైటీలోనూ సభ్యుడైన గురజాడ అప్పారావు తన రచనలలో, ముఖ్యంగా కొండుభట్టీయంలో ఈ వైరుధ్యాలనన్నిటినీ చిత్రించబోయాడు. అప్పారావుకు ఇలాంటి మతాభినివేశంగానీ 'అచ్చాదీ' తనంగానీ లేదు.

జీవితాన్ని మరింత సరసంగా సరళంగా గడిపాడు. అంతమాత్రాన ఆయనకు అవినీతి అంటగట్టడం తగనిపని. 'సెక్సు' ఒక్కటే జీవిత సర్వస్వమైనట్లు, కొందరు కట్టుకథలనల్లి ఆయనకు రంగుపూయ జూస్తారు. ఆయన సామాన్యుడు. ప్రతిఒక్కడూ మహర్షి కాలేడు.

వీరేశలింగం కీర్తిమంటపానికిగల వెయ్యిస్తంభాలలో బ్రహ్మసమాజం చిట్ట చివరిదే కావచ్చుగాని ఒకానొక్కటిమాత్రమే. 'దక్షిణభారత విద్యాసాగరుడ'ని శతాబ్దిచివర (1898) ఆయనను సత్కరించారుగాని, దక్షిణభారత రామమోహను డనదగిన మహావ్యక్తిత్వం ఆయనది. రణడే, కార్వే, శాస్త్రి, తెలాంగ్, భండార్కర్, ఇన్ని చేతుల ఇందరు చేసిన పనులను ఒక్కడు రెండు చేతులతో చేయగలిగాడు. ధవళేశ్వరంలో బాలికల పాఠశాలను ఏర్పాటు చేయడంతో శ్రీకారం చుట్టుకొన్న స్త్రీ జనోద్ధరణ (1874), మదరాసులోని 'వేదవిలాస్'లో కాలధర్మం చెందేవరకు (1919) దాదాపు నిరంతరాయంగా సాగింది. 1881 లో విధవాపునర్వివాహోద్యమం మొదలైంది. శరణాలయాలు, ప్రార్థనామందిరాలు వెలకొన్నాయి. శాస్త్రవిద్యా ప్రచారం జరిగింది. సారస్వతం సంస్కరణకు ఒక సాధనమైంది. ఉపన్యాసాలు, వ్యాసాలు, ప్రహసనాలు కొత్త భావాలను ప్రజలమధ్యకు తీసుకుపోయాయి. నవయుగ మేధావులందరిలాగే, సృజనాత్మక సాహిత్యసిద్ధికంటె ప్రచారాత్మక సాహిత్యసిద్ధి వీరేశలింగంలోనూ ఎక్కువ. బంకించంద్ర ఛటర్జీ, రవీంద్రనాథ టాగూర్లుకూడా విజ్ఞానవ్యాప్తికై తమ సాహిత్య జీవితాలను కొంతవరకైనా వినియోగించినవారే నంటూ, ఒక ఆధునిక భారతీయ మేధావి ఇలా వర్ణించాడు :

> For the Indian intellectual the task was comparable to that of maintaining agriculture on the edge of a desert, against constant invasion by the sand.

ఎడారి అంచున వ్యవసాయం చేయబూని ఎంతో గట్టిపంటను పండిస్తూ ఇసుకను దరిదాపులకు రానీయకుండా చేసిన కర్షకుడు కందుకూరి వీరేశలింగం. గురజాడ అప్పారావు జీవితాకాశాన వీరేశలింగం సూర్యుడు. మొదట మొదట వీరేశలింగం శిష్యగణంచేసే భజనలూ, పాడే కీర్తనలూ తనకు రుచించకపోయినా, కాలంగడిచేకొద్దీ ఆయన ఘనతను అర్థం చేసుకొంటూ ఏదో గొప్ప విషయాన్ని కనిపెట్టినట్లుగా, మునుపటి సంశయాలను తోసివేసి గట్టిగా తీర్మానించుకొంటున్నట్లుగా తన డైరీలో వీరేశలింగం "నిశ్చయముగా మహాపురుషుడు" అని రాసుకొన్నాడు. వ్యక్తిగా క్రియాపరుడుగా ఆ ఇద్దరికీ పోలికేలేదు. అప్పారావుది.

సాహిత్యమే ఈ ప్రత్యక్ష సంస్కరణాచరణకు ప్రత్యామ్నాయంగా ఉపకరించింది. కన్యాశుల్క నాటకానికి 'హీరో' ఎవరైనా ఉంటే అది వీరేశలింగమే. డాక్టరు సి. ఆర్. రెడ్డి అన్నట్లు వీరేశలింగం ... the greatest Andhra of modern times. He sums up in his personal history the evolution of an epoch. 1 వీరేశలింగం వైతాళికులకే వైతాళికుడు. మల్లంపల్లి వారి మాటల్లో—

> ఒక మనిషి మన తెనుగుదేశంలో ఉదయించాడు వేగుచుక్కలాగు. అంతటితో అంతవరకు గాఢ నిద్రాపరవశమై వున్న మన సంఘం అతని పిలుపులకూ, మేల్కొలుపులకూ, కూకలకూ, కేకలకూ, అదరిపడి దద్దరిల్లి లేచింది; ఆహవనీయాగ్నిచ్ఛటవలె తాను తాకినంతమేరా ఒక మహా సాంఘిక విప్లవం ప్రావృట్కాల పయోధరమాలికలాగ గర్జిస్తూ పునీతంచేసింది. సంఘం ఇల్లు చక్కదిద్దుకొని ఆత్మపరీక్షచేసుకొని కన్నులు నులుముకొని అభ్యుదయ పథాన ప్రయాణం సాగించింది. 11

ఆ మహాభ్యుదయమే ఈ 'మహోదయాని'కి వస్తువు. అయితే వీరేశలింగ హృదయావిష్కరణంగా వీరేశలింగ సత్కార్య కథనంగావుండక, ఇది గురజాడ అప్పారావుకు అంకితమైన దెందుచేత? వీరేశలింగమే లేకుంటే గురజాడ అప్పారావు ఉండేవాడు కాదనేందుకంటె, వీరేశలింగం ఉండిపోయినా గురజాడ అప్పారావు ఉనికి అవసరమూ అనివార్యమూ అయిందనడమే సబబు. "ఆహవనీయాగ్నిచ్ఛట"లా తాకితేనే కాలి, తేరిపారజూడనీయకుండా తీక్షణత మీరిపోలేదు గురజాడ అప్పారావు. ఇంటి దీపపు సాధుశిఖ ఆయన. ఆగ్రహాన్నీ, ఆవేశాన్నీ అసహనాన్నీ దరికి చేరనివ్వక, చిరునవ్వులతోనో ఎత్తిపొడుపులతోనో కన్నీళ్ళు నిండిన కమ్మని గేయ కథలతోనో, కథలతోనో ఆయన ఇతరులను సంస్కరింపబూనాడు. ఆయన సంస్కరింపబూనినవాళ్ళలో సంస్కర్తలుకూడా ఉన్నారు. ఆయన సంఘ సంస్కర్తల భావ సంస్కర్త: సంస్కరణోద్యమాల తీరు తెన్నులను నిర్మాణాత్మకంగా విమర్శింపబూనాడు. ఆ విధంగా వీరేశలింగానికి గురజాడ అప్పారావు ఉపాంగం కాకుండాపోయాడు. నీతి నియమాల పట్టింపుకు సానునయాన్ని జతకలిపాడు. రాయసం వెంకటశివుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, మరొకరు, ఇంకొకరు వీరేశలింగం శిష్యప్రాయులు. గురజాడ అప్పారావు ఏకలవ్య శిష్యుడైనా కాదు. ఎంత భయభక్తులు చూపెట్టినా, తనను తాను తక్కువ చూపు చూచుకోకుండా, వీరేశలింగంతోటి సమానపాయానే తనకు తావిచ్చుకొన్నాడు.

భాషా విషయంలో వీరేశలింగాన్ని విమర్శించి తనకు తాను ఆధిక్యం వుందంటే ఆధునిక యుగానుగుణ్యతను ఇచ్చుకొన్నాడు. ఇంతకూ ఒక సాహిత్యయుగపు పొలిమేరల్లోనే వాళ్ళిద్దరు తారసిల్లారు. వీరేశలింగం హాస్యమూ కొత్తది; మనసూ దాని భాషా పాతవి.

తన గ్రంథాలపై వచ్చేరాబడితో స్వతంత్రంగా జీవించగలిగిన ప్రథమాంధ్ర కవి వీరేశలింగమేనని డా॥ కట్టమంచి రామలింగారెడ్డి అన్నారు. వీరేశలింగం కవిమాత్రుడేకాదు: సంధికాలంలో వాడుకలోకి వచ్చిన "రచయిత" శబ్దాన్ని ఆయనకు వాడవచ్చును. పండితులే పాఠకులైన స్థితిపోయింది. 'ప్రజలు' — కనీసం మధ్యమ వర్గీయులు — కొత్తపాఠకలోకమై కవిని "రచయిత"గా మార్పించారు. గ్రంథకర్తల లేమిడీ, రాజాశ్రయనిర్బంధమూ తప్పాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం, రాజా కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావు ఆగ్రహానికి పాత్రుడై కూడా 1911లో మనోరమ పత్రికను స్వతంత్రంగా స్థాపించుకోగలిగిన ఉదంతం ఈ మార్పును సూచన. అయినా కొత్తశతాబ్దానికికూడా గ్రంథకర్తలస్థితి మెరుగుకాలేదని కన్యాశుల్కం రెండవకూర్పు పీఠికలో గురజాడ వాక్యాలనుబట్టి తెలుస్తుంది: "తెలుగున గ్రంథప్రచురణమనేది పీకులాటపంచాంగం. కృత్యాద్యవస్థ.... గ్రంథకర్త తన పుస్తకాన్ని తానే అచ్చొత్తించుకోవాలి. ముద్రాపకుడు, ప్రకటనకర్త, ప్రచురణకర్త అన్నీ అతనే!" మహారాజపోషకులు, రాజపోషకులు, అభిమానులు, చందాదారులు, అని నాలుగు శ్రేణులుగా పుస్తకాలను క్రయంచేస్తూ పాఠకులు పెరుగుతున్నా కొత్తవ్యాపారాన్ని బోలెడు సాహిత్యాభిరుచితో మిళాయించి గ్రంథమాలలూ మండలులూ బయలుదేరి వస్తున్నా, "గ్రంథకర్తపని కుదేలు" కాక తప్పలేదు.

సంఘంలో కవిహోదా పెరగకతప్పలేదు. సంస్కర్తగా వీరేశలింగం కవి ఖ్యాతుడై ఘనుడని గుర్తింపుపొందాడు. ప్రజావాణిగా చిలకమర్తి లక్ష్మీనరసింహం వేదికలపై తరచూ కనుపించాడు. రాజాస్థానాలలో పాండిత్య కవిత్వ ప్రదర్శనల తోటి వినోదంకల్పించినా, విద్వత్కవులకూ 'ప్రజ'లకూ మధ్యవుండిన గండిని తిరుపతి వేంకటకవులు చాలావరకు పూడ్చారు. అవధానకవిత్వం కలిగించిన కీడులో మేలంటే ఇదే. "వైదుష్యారణ్యసీమల" నుండి కవిత్వాన్ని బయలుదేరదీయించి శైలినిసులువుచేసి ఆధునికాంధ్రకావ్యరచనకుదారి కొంతవరకు సాపుచేశారు ఆ జంట కవులు. కవిత్వం పదిమందిలోకీ వచ్చి రాజా మంత్రిప్రగడ భుజంగరావు ధర్మమా అని, గొప్పింటివారి శుభకార్యాలలో కవిసమ్మేళనాలకూ, కావ్యగానాలకూ సన్మానాలకూ

వీరేశలింగం 'కవిత్వతత్త్వ విచారము' రూపాంతరం తాల్చినా, మూక గట్టుకొని 'దొడ్డి సంభావనల' కోసం ఎగబడే కాతరత్వం యాచకగుణం చాలావరకు వెనకఉండిపోయింది.

పాఠకుల అందచందలరోటి ఈ ప్రభాత సమయంలో ఎన్ని పేరెన్నికగన్న పత్రికలు వెలువడేవో చూస్తే ఆశ్చర్యమూ సంతోషమూ కలుగుతాయి. వీటిలో మొదటివి వర్తమాన తరంగిణి, చిన్నయ్యసూరి 'సుజన రంజని' రెండోది. నెల్లూరినుంచి పూండ్ల రామకృష్ణయ్య నడిపిన అముద్రిత గ్రంథ చింతామణి, వీరేశలింగం వివేకవర్ధని, హాస్యసంజీవని, ఎ. పి. పార్థసారథినాయుడు మద్రాసునుంచి నడిపిన ఆంధ్ర ప్రకాశిక, కొక్కొండ వేంకటరత్నం ఆంధ్ర భాషాసంజీవని, హాస్యవర్ధని, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కళావతి, పనప్పాకం అనంతాచార్యుల వైజయంతి, వేంకటరామకృష్ణకవుల కవిత, చిలుకూరి వీరభద్రరావు ఆంధ్రకేసరి, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి ఆర్యమతబోధిని, ఇంకా శశిరేఖ, సరస్వతి, ఇవి మొదలైన పత్రికలు ముఖ్యమైనవి. చివరకు గురజాడ అప్పారావుకూడా ప్రకాశిక పత్రికకు తాను సంపాదకుణ్ణని ప్రకటించుకొన్నాడు. విజయనగరంనుంచి గుండుకుర్తి వెంకటరమణయ్య దిఇండియన్ లెషుర్ అవర్ (The Indian Leisure Hour) అనే ద్విభాషాపత్రికను, వంగుమాధవ రావు నాయుడు ది తెలుగుహార్పు (The Telugu Harp) అనేదానిని నిర్వహించారు. అప్పారావు ప్రతిభకు అవి దర్పణాలయ్యాయి. అయినా తానే ఒకపత్రికను వెలువరించబూనాడంటే పత్రికలప్రభావం గురించి ఆయనకెంతో దొడ్డగురి ఉండేది గనుకనే 1895 ఏప్రిల్‌లో ఒకరోజున మద్రాసులోని క్రిశ్చియను కాలేజీ తెలుగు సొసైటీవారి సభకు అధ్యక్షత వహించి వార్తాపత్రికల ప్రభావం గురించి ఉపన్యసించాడని డైరీలనుబట్టి తెలుస్తున్నది. "తెలుగుభాషలో పత్రికా ప్రచురణావశ్యకత ఎంతోవుంది. మాతృభాషలలో పత్రికలు రాజకీయాలు, సాంఘిక పరిస్థితులూ తెలిపే ఒక మాన్యుయలు వంటిది అవసరం. ఇటిది ఇంగ్లీషునలేదు." పత్రికలు వట్టి సాహిత్యాన్నేగాక, ప్రజల రాజకీయ, సాంఘిక జీవితాలనుకూడా మలచ వలసి ఉంటుంది. వారపత్రికలు చాలా అవసరం. వాటి ఉపయోగం కాలాన్నిబట్టి చాలా హెచ్చుగా ఉంది. అమృత బజారు పత్రిక, నేషనల్ గార్డియను, [illegible] పత్రికల పాఠకుడుగా తన అభిప్రాయాలను క్రోడీకరించుకొని ఆయన రాతామనుకొన్న వ్యాసం చిత్రప్రతి మూలాసంతిలో అచ్చు పడివుంది. ఇంగ్లీషు పత్రికా ప్రచురణం ఇంగ్లాండు పత్రికల అవగుణాలను అలవరచుకొని అవివేక పద్ధతుల ద్వారా ఎన్నో దుష్ఫలితాలను కలిగిస్తున్నాయంటూ, ఆయన చెప్పిన ఈ మాటలు ఆలోచించ దగినవి.

"ఇది యుగసంధి. కాలము ప్రమాదకరముగా వున్నది."12

# 2

మైక్రోస్కోపులో పొడగట్టుతున్న విప్లవాన్ని, దాని వెనక వ్యూహాన్ని తర్కించుకోసాగిన గురజాడ అప్పారావు యుగసంధిలో జన్మించారు.

సాహిత్యం మాటకేమి గాని సంఘమే కుదురు తప్పి పాదుల్లోంచి కదిలిపోసాగిన కాలమది. మతవిశ్వాసాలు సడలిచ్చి హేతువాదమునున్నతి పొందసాగింది. జమీందార్లకూ, భూస్వాములకూ ఆధిక్యంతగ్గి గ్రామాలు మొలకెత్తి పట్టణ మధ్యమ వర్గం పట్టుకుబడి సంపాదిస్తున్న రోజులు. ఇదే 'ప్రజాతంత్ర' యుగానికి నాంది. అదేవిధంగా మతాధికారుల పీఠాధిపతుల దాష్టీకమూ జబర్దస్తీ వెనక్కి తగ్గి శ్రీముఖాలు తెల్లమొగం వేస్తూ వెలి గేలిపాలౌతూ వర్గాలు పగిలిపోగా జీవితం తన ఆధునిక రూపాన్ని ధరిస్తున్నది. ఎద్దుబళ్ళా పడవలా బదులు రైలుబళ్ళు: పూటకూటిళ్ళబదులు హోటళ్ళు, కొలువు ఓటాల బదులు న్యాయస్థాన ప్రాంగణాలు; ఇవన్నీగాక ఇరవన్ని ప్రజాతంత్ర పరిణామ సోపానాలయ్యాయి. గజం మిథ్యకావచ్చు, పలాయనమూ కావచ్చు మిథ్య. గాని ఆవిశ్వాసి రుని తాజావారసుల పలాయనం మాత్రం రాజమండ్రిలో తథ్యమే అయింది. 13 సహపంక్తి భోజనాలేమి, సముద్రయానాలేమి, విధవాపునర్వివాహాలేమి. నిమ్నజాతి జనుల పాఠశాలలేమి, యజ్ఞోపవీత పరిత్యాగాలేమి, శ్రాద్ధకల్పనిరసనలేమి — 'విశ్వాస' యుగాన్ని హేతువాదయుగం అతిక్రమిస్తున్నది *

---

* ఇది రాశాకనే నేను డాక్టర్ అక్కిరాజు రమాపతి రావుగారి నూట ఇరవై ఏళ్ళ వీరేశలింగం అనే వ్యాసాన్ని (భారతి: ఏప్రిల్ 1968) చూడడం జరిగింది. ఆ వ్యాసంలో ఆయన వీరేశలింగ యుగ పరిస్థితులను సూక్ష్మాంశాసహితంగా చిత్రించినారు.

డబ్బు వినిమయం తక్కువగా ఉండి దాని విలువ హెచ్చినందుచేత, ఉద్యోగమే పురుష లక్షణమై ఆంగ్లవిద్య జీవనాధారమయింది. కులవృత్తులూ గ్రామజీవనమూ అడుగంటగా. సర్కారు కొలువు కొత్త హోదానిచ్చి ఒక మధ్యమ వర్గాన్ని సృష్టించింది. ప్రాచీన సంస్కృతికి ధర్మకర్తలమనుకొన్న అగ్రవర్ణాల వారే వర్ణాశ్రమధర్మాలను మొట్టమొదట భంగపరిచారు. అయినా దురాచార వర్గానికింకా తామే రక్షకులు. "సతీ సహగమనం, కులీన బ్రాహ్మణ వివాహాలు, వల్లభ మతస్వీకారం, సంఘాన్ని కలుషితం చేశాయి." (పు. 59). వీరేశలింగం పుట్టేనాటికిగాకున్నా ఆయన వ్యక్తిత్వం రూపురేఖలుదిద్దుకొనే నాటికి, "అర్థం పర్థం లేని దురాచారాలు. కుచ్చితమైన స్వార్థం, కడుపునబుట్టిన బిడ్డల యెడల నిష్కరుణ. వేశ్యలను

రాజకీయాల ఉద్యమ ప్రసంగాలు వీచసాగాయి. మండల మహాసభల నుండి ఒక్క ఉదుటున దేశీయ మహాసభాభిముఖంగా విద్యార్థులూ, విద్యావంతులూ, స్థితిపరులూ, వృత్తిజీవులూ పయనించసాగారు. రాష్ట్రాలన్నీ ఒక్క వేదికపైకివచ్చి నిలుస్తున్నాయి. ప్రాంతీయమైన వేర్పాటు సన్నగిల్లుతున్నది. వివేకానందుడు కాశ్మీరంనుంచి కన్యాకుమారి వరకుగల దేశం నిడివిని తన రెండు కాళ్ళతో కొలుస్తున్నాడు. శివనాథశాస్త్రి ఒకటికి మూడుమార్లు వచ్చి తన వాణిని వినిపించి పోతున్నాడు. బిపిన్‌చంద్రపాల్, హేమచంద్రసర్కార్, సతీశచంద్రచక్రవర్తి అమృతలాల్‌బోస్, నిర్ఝరప్రియఘోష్, షిండే, కార్వే, రణడే, సౌత్‌వర్త్, డ్రమండ్, నెటిల్‌షిప్ - దేశాన్ని లేపగొట్టేందుకో మతాన్ని పంటబెట్టించేందుకో రాకపోకలు సాగిస్తున్నారు. ఇంతెందుకు, దేశంలోని ఇతర రాష్ట్రాలతోనే గాక ప్రపంచంలోని ఇతర దేశాలతోగూడా ఆంధ్రులు భావబాంధవ్యం స్థాపించుకొంటున్నారని, జపానీయ నాటకం, జపానీయ పత్రిక గ్రంథం, అబ్రహాం లింకను జీవితచరిత్ర వగైరా తెలియజేస్తాయి. మునగాల రాజా నాయని వేంకటరంగారావు తన కుమాళ్ళలో ఒకనికి 'టోగో' మరొకనికి 'నోగి' అని జపాను సైన్యాధిపతుల పేర్లు పెట్టబోతున్నాడు, స్వాధీనరాయుగోదయమౌతున్నది.

మహామహోపాధ్యాయులు పట్టిన కుందేలు మూడుకాళ్ళతో గాకుండా నాలుగు కాళ్ళతో వధ్యశాలవంటి వంటింటిలోంచి నడివీధిలోకి గెంతి ప్రాణాలు దక్కించుకొంది. సంస్కర్తల సాంగత్యంతో నీతిబోధకు సాధ్యం అవుతూ ఒకవైపు

---

చేరదీయనివాడు పురుషుడే కాడనుకోవటం మొదలగు హేయమైన ప్రవత్తులు ... స్త్రీలు చదవ కూడదనటం. వృద్ధవివాహం శాస్త్రవిధి అనటం, అంటరానితనం సదాచారమనటం, నిర్బంధ వైధవ్యం కొనసాగవలసిందే అని వాదించటం..." సంఘంలో బహుళవ్యాప్తిలో ఉండేవి. దాదాపు 1870 వరకు వీరేశలింగం మనకు తెలిసిన వీరేశలింగంగా అవతరించలేదు. ఈ అవతరణలో ఇంగ్లీషు చదువు నెరపిన ప్రభావం అనల్పమైంది. 1875 వివేకవర్థని (అక్టోబరు)లో ఆయన వ్రాసిన వాక్యాలను డాక్టరు రమాపతిరావు గారుద్ధరించారు.

It is admitted by one and all that Western lore has worked wonders among the natives of India. We are quite aware that English education has rendered natives more refined in their manners, has dispelled the mist of superstition from the minds of several of them, if not many and has considerably developed their moral calibre whenever it is properly imparted. (P. 61)

దేశాభిమానులతో కత్తుకలిపి రాజకీయ ప్రబోధానికి ద్వారం తెరుస్తూ ఇంకోవైపు, సాహిత్యం కుబుస మూడ్చుకోసాగింది. అసూర్యంపశ్యగా ఉండిందే ఇప్పుడు గాలికీ ధూళికీ తెగబడింది. 'యమ' నియమా , యమకాలంకారం, శ్లేషల వేషపాన్పు చిత్రకవిత్వపు తలచిక్కు వదిలింది. కావ్యభాషను దాచిన కఠినమైన ఒర తుప్పటి పెచ్చులు పెచ్చులుగా రాలుతూంటే, తేలికైన, నాజూకైన మరొక ఒర తయారీ కాసాగింది. 'ప్రబంధ సంబంధ నిబంధన' ఒకొక్కటి వదులు కాసాగాయి. 'శృంగారం' కంపుగొట్టిందేమో, కవులు 'ప్రేమ' మహామంత్ర పారాయణంతో గొంతులు సవరించుకొంటున్నారు. 'శృంగార'యుగం పోయి, 'ప్రేమ'యుగం వింతౌతున్నది.

ఇన్ని శుభసూచనలుంటేన్నీ, అన్నిటికన్నా అపలక్షణాలు వెనకటిరోజుల మిగుళ్ళు సగుళ్ళుగా ఉంటూవచ్చాయి.

ఇంగ్లీషుచదువు ప్రజలనుండి విద్యాధికులను వేరుచేసి, ఒకరి బతుకునవెన్ని చిక్కుముళ్లు వేసిందో, మరొకరికన్ని నిక్కుటెక్కులు తెచ్చిపెట్టింది. ఆంగ్ల విద్యాధికులందరూ నవభావాలను సమాదరించలేదు. అల్పసంఖ్యాకులలో అత్యల్ప సంఖ్యాకులు మాత్రమే ఆ సాహసంచేశారు. తతిమ్మాజనం సాదా జనాన్ని మించి ఆలోచించలేకపోయింది. ఆచారంతో రాజీకి తయారైంది. 'క్రాపింగ్'లో దాగిన పిలకలా, 'కోటు'కింది జందెంపోగులా, వీళ్ళలో సంప్రదాయపరత్వం జీర్ణించుకొనిపోయింది. దేశమంతటా శాఖోపశాఖలుగా విస్తరిల్లిన దివ్యజ్ఞాన సమాజం ఆర్య సమాజంవంటి వాటిలోకి ఎగబడడమనేది యిందుచేతనే జరిగింది. హేతువాదం మూలకందంగా ప్రారంభమైన బ్రహ్మసమాజంకూడా, కాలక్రమాన అతీంద్రియ విషయాలైన ఆత్మప్రత్యయ, సహజజ్ఞానభావాలకున్నూ అనుష్ఠానాలని కొత్తపేరు పెట్టుకొన్న పాత పూజాపద్ధతులకున్నూ తావిచ్చి, మత విశ్వాసాలకు మళ్ళీ ప్రాణదానం చేసింది. నీతి నిష్ఠలకు అతిశయ ప్రాముఖ్యమిచ్చి దినదిన జీవనంలో కాపట్యానికీ, వేషాడంబరానికీ, ఆషాఢభూతిత్వానికీ వీలు కల్పించింది. ఆదిలో హైందవాన్ని తెగతూలనాడిన కుర్రమూక యవ్వన ముదిగాక, ఉత్సాహోల్బణం తగ్గాక, స్థిమితపడి ఆ హైందవంలోనే అణగారిపోయింది.

The Young Hindus ranting against their traditions are not elephants of westernization, they are the grass of the Hindu fields, which to-day is and tomorrow is cast into the oven. They talk in their little day, to be borne down into the everlasting silences of Hinduism. 14

ఇక దివ్యజ్ఞాన సమాజంమాట చెప్పేదేమిటి? దానిశాఖలు ప్రతి ముఖ్య పట్టణంలోను వెలిసినట్లు, కొండ వెంకటప్పయ్య *స్వీయచరిత్రము* తెలుపుతున్నది: "సర్కారు ఉద్యోగులు పలువురు ఈ సమాజములో జేరిరి. ఇందువలన ఆంగ్లేయ విద్యాధికులకు హిందూ మతమునందు అభిమానము ప్రబల సాగినది. పురాణములలో చెప్పిన గాథలన్నియు వాస్తవములైనట్లు సకారణముగా స్థాపించుటచేత కొన్ని వెర్రి విశ్వాసములు వ్యాపింప నారంభించెను. ఆధునిక భౌతికశాస్త్రము కంటె మన మహర్షుల ఆధ్యాత్మిక విద్య ఉత్తమమని ప్రజలు గుర్తించసాగిరి." వెంకటప్పయ్య మొగ్గకూడా దానివైపే ఉండటం గమనించ దగినది. మధ్యమ వర్గంలో వృత్తిజీవులతోపాటు వ్యాపారస్థులలో అత్యధిక సంఖ్యాకులుకూడా ఈ అభినవ హైందవ మహోద్యమాలకు మనస్సు లప్పగించుకొన్నారు. గురజాడ అప్పారావులాంటివారు బహుకొద్దిమంది మట్టుకు, ప్రవాహానికి ఎదురీదకున్నా దాని ఊపునపడి కొట్టుకొనిపోకుండా కాళ్ళ నిలవరించుకో గలిగారు.

రాజకీయాలలోగూడా వీళ్ళది ఉలిపికట్టె వ్యవహారంగానే ఉండిపోయింది. కాంగ్రెసుసంస్థ పుట్టి దేశమంతటా దోగాడ సాగినప్పుడు తప్పటడుగులువేసి చొక్కుమాటలు పలికినప్పుడు కాస్తోకూస్తో ముచ్చటపడక పోలేదు గాని మొదటినుంచీ వారిది విమర్శావైఖరేననాలి. గ్లాడ్‌స్టన్ యుగంలో వాళ్ళ రాజకీయాలు 'లిబరల్' రాజకీయాలు; జాన్ స్టువర్టుమిల్ శకంలో వాళ్ళ తాత్త్వికభావన 'యుటిలిటేరియన్' పరిధిలో చరించింది. ఒకొక్కప్పుడేమి, చాలామార్లు ఈ వైఖరి బ్రిటిష్ పాలకుల సౌజన్య సౌహార్దాలకు ఇవ్వవలసినంతకంటే ఎక్కువ ప్రాముఖ్యమిస్తూ ప్రభుభక్తి పరాయణతగాకూడా రుజువుపడింది. జాతీయవాదమనేది ప్రబలమైన రాజకీయ శక్తిగా అవతరించి ఈ పాతకాలపువాళ్ళ 'లిబరల్' వైఖరిని అతకరించేనాటికి, జాతీయోద్యమమూ హైందవ పునరుద్ధరణోద్యమమూ పెనబడి తిలక్, అరవిందఘోష్, లజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్ పైకివచ్చారు: సురేంద్రనాథ బెనర్జీలాంటివాళ్ళు తెరమరుగయ్యారు. అంతేగాక మొట్టమొదట కాంగ్రెస్ సంస్థకు జమీందార్ల తోడ్పాటుకూడా వుండేది. ఏ. ఓ. హ్యూమ్ (A. O. Hume) పుణ్యమా అని, డఫ్రిన్ (Dufferin) దొరతనంలో బ్రిటిష్ ఇండియన్ ప్రభుత్వానికిన్నీ కాంగ్రెసు సంస్థకున్నూ పడిన ముడి, ఆ సంస్థకొక ప్రతిష్ఠనే చేకూర్చిందిగాని అప్రతిష్ఠనుకాదు. అందుకనే జమీందార్లు, రాజాల, భూస్వాముల మద్దత్తు. కాబట్టి రాజకీయాలలోకూడా కల్మషం కనిపించకుండా

పోలేదు. కాంగ్రెసు వచ్చి ఉపన్యాసాలను అలవాటుచేసింది. ఉపన్యాసాలలో చిత్తశుద్ధి లోపించింది. ఈ అవగుణాలను గుర్తించి వాటిని బయల్పరిచేందుకు కూడా గురజాడ అప్పారావువంటివాళ్లు అవసరమయ్యారు. 'పోలిటిషను' ఉన్నపాటనే గిరీశం ఖరాబుపట్టించింది ఈ బాకారాయుళ్ళ కారణంగానే.

మరి భాష. 'సులభ' గ్రాంథిక వచనంపేరిట తమ వ్యాకరణ సూత్రాలను తామే ఎసరుపెడుతూ భాషలో ఇష్టారాజ్యాన్ని సృష్టిస్తున్నారు పీరేశలింగం మొదలు 'బాలకవి'వరకుగల పండితులు. దాని నాసరా జేసుకొని అరాచకానికి పాల్పడుతూ వచ్చారు పండితమ్మన్యులు. సులభమై, అది వ్యాకరణాన్ని భంగిసుచేసినంతగా సామాన్య ప్రజలకు సంస్కృతిద్వారం కాజాలకపోయింది. జీవద్భాషను మహా అంటే నీచస్థానమిచ్చి పాత్రోచితభాషగా ప్రహసనభాషగా ఉపయుక్తం చేసిందేమో గాని, ఆధునిక జీవిత వైవిధ్యాన్ని ముడిపస్తువు చేసుకోక ఉత్తమ సాహిత్యసృష్టికి వెలిబడిపోయింది. *

ఉన్న వృత్తభేదాలు చాలక, నవ్యచ్ఛందస్సులంటూ బంగారిమనో తిగిరమనో లోహాలను రాబిలిచి దొట్టిపెడుతూ గొప్పలు చూపుతుంటున్నారు పిస్సత్కవులు. బంగారమైనా సీసమైనా, అది పైరూపమేగాని లోపలిదంతా అయోమయమే.

* నాగానంద నాటకం మొదలు ప్రతాపరుద్రీయ నాటకం వరకు వేదం వేంకటరాయ శాస్త్రి పాత్రోచితంగా గ్రామ్యభేదాలను వాడాడు. దానిమీద కొక్కొండ వెంకటరత్నం, ఆయన అనుచరులూ శాస్త్రిపై నిందావర్షం కురిపించారు. తనవాదాన్ని బలపరుచుకుంటూ గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము పేర వేంకటరాయశాస్త్రి ఆలంకారికులనుంచీ లాక్షణికుల నుంచీ స్వానుకూలమైన వాదాలను ఉద్ధరించాడు. గ్రామ్యాన్ని ప్రయోగించని నాటకమే గ్రామ్య నాటకమని. "గ్రామ్యగ్రాహియే అగ్రామ్యము. శాస్త్రీయము. సురూపకము" అని సిద్ధాంతీకరించాడు (పు. 64). ఈ సందర్భంలో తలవని తలంపుగా వ్యావహారిక భాషావాదానికి వేంకటరాయ శాస్త్రి ఒక ఉపకారం చేశాడు. తర్వాతికాలంలో ఆ మాట మరిచినప్పటికీ. ప్రస్తుతానికి మద్దతుగా "గ్రామ్య" భాషకుకూడా ఈవరకే గ్రంథాలున్నాయని వాదించాడు :

సాక్ష్యమున కుండవలయునేని, ఆంధ్రగ్రామ్యమునకు సి. పి. బ్రౌన్‌దొరగారు, ఉదయగిరి శేషయ్యగారు. మహా మహోపాధ్యాయ శ్రీ శేషగిరిశాస్త్రులవారును చేసిన అట్టి గ్రంథములు సాక్ష్యమునకున్నవి. గావున ఇంక గ్రామ్యప్రయోగ నిషేధపరమైన వాదమును మానుకొనందగును. ఇవి సమగ్ర లక్షణములు కావా: వాల్మీకి సూత్రములపాటి, వరరుచి వ్యాకరణముపాటి సమగ్రములే ఇవియు.

వ్యావహారికభాషావాదులకు వేంకటరాయశాస్త్రిఒకవిధంగా కొంతవరకు మార్గదర్శి.(పు39)

జాతి గుండెను సూటిగా తాకి, జీవనాడిని మీటి, సహానుభూతిని వెలువరించగల దేశిచ్ఛందస్సులు జానపదగేయ ఫణితులు వారి పాండిత్యానికీ ప్రకర్షకూ తరుగు పడ్డాయి. కవుల కులీనత్వం అడ్డువచ్చింది.

ధార్వాడ నాటక సమాజాల పుణ్యమా అని, సర్కారు జిల్లాలలో ఊరూర పుట్ట గొడుగుల్లా లేచిన నాటక సమాజాలు స్వతంత్రనాటక రచనకు ఎంత ప్రోత్సాహ మిచ్చాయో, రంగప్రయోగంలో నాగరిక పద్ధతులను అంత అడుక్కుతొక్కాయి. నటుల కోరికమీద రాసిన నాటకాలు ఎక్కువగా పౌరాణికాలో చారిత్రకాలో కావడం వల్ల, సంఘజీవన చిత్రాలుగా ఏ ఒక్కటీ భాసించే వీలులేకపోయింది.

ఇంగ్లీషుచదువు ప్రజలనుండి విద్యాధికులను పైకెత్తి నిలిపింది, దొర తెల్లాగూ కాజాలక వాళ్ళు నల్లదొరలై కూర్చున్నారు. వాళ్ళకునడమంతరపు సీలుగు నర నరానికీ ఎక్కింది. చదువనేది వుపకారానికి బదులు ఎంతో అపకారం చేస్తున్నదనీ అది ప్రజలను పైకెత్తడానికే వినియుక్తం కావాలనీ, ఏ ఒక్కరో ఇద్దరో అరాట పడ్డారు. ఆ ఒకరిద్దరిలోనూ గురజాడ అప్పారావు ఉన్నాడు. ధార్వాడ నాటక సమాజాల ఉధృతి తగ్గిపోయినందుకు విచారించకుండా సంతోషం ప్రకటించిన ఆ ఒక్క వ్యక్తే విద్యావంతులలో బలిసిపోతున్న భేషజాన్నికూడా కంటగించుకొన్నాడు. 'ఒరిజినాలిటీ' లేకుండా చిలకపలుకులను వల్లించే పండితులనెలా పరిహసించాడో, ఆంగ్ల విద్యా వంతులను అలాగే విమర్శించాడు. ఆ ఇద్దరినుంచి విడబడి తన స్థానాన్ని తనీగా నిలుపుకొన్నాడు.

కళాపునరుజ్జీవనం కలిగించిన ఫలితం కళవళమైనంతగా ఉత్తమ స్వతంత్ర కళాసృజన రాలేదే అని ఆయన తపన. అలజడి ఏర్పడినంతగా స్థిమితం ఏర్పడలేదు. పూనిక ఉన్నంతగా ఫలితంలేదు. తిరుగుబాటుదశకు సంబంధించిన ఈ లోపాలు, పునర్నిర్మాణదశకు అవరోధాలు. సంప్రదాయ నిరసనం శాశ్వతంకాగూడదు. కళాకారుని మనస్సు మళ్ళీ దానితో సంబంధం కలుపుకోవాలి. లేకుంటే దానిలో నవ్యత ఉన్నంతగా భవ్యత ఉండబోదు. పాతకూ కొత్తకూ జగడం ఉన్నంతగా "మేళవింపుక" ఇంకా మొదలు కాలేదు. సమన్వయ దృక్పథం అవతరించలేదు.

విద్యలో, భాషలో, సాహిత్యంలో, తత్వంలో, రాజకీయ చింతనలో, లోక దర్శనంలో, లౌకిక విషయాలలో – నవ్యత్వాన్ని అంటకాగుతూ వచ్చిన లోపాలను పూరించేందుకు మరొక మనిషి, మరొక మనీషి మోటుకోవలసి వచ్చింది. కట్టు కథగా పరిణమించి, ఇంటిపేరుమీదనే సువిఖ్యాతుడైన వేంకట అప్పారావుపంతులు,

అప్పారావు పంతులు, అప్పారావు, మహా సంస్కర్తల కిందికి రాడు, మహా వేత్తల కిందికి రాడు. మహా కవుల కిందికి రాడు. నిజానికి ఆ అంశలన్నీ ఆయనలో ఉన్నాయి. ఆయన వ్యక్తిత్వాన్ని బట్టి మాత్రమే గాకుండా, గురజాడ సాహిత్యానికి తనదని చెప్పుకోదగిన స్థానం ఉంది. దాని అంతస్సత్త్వం గొప్పది. దాని ప్రభావం ఇంకా గొప్పది.

శేముషిక తగినంత కృషి సాగించే వీలు, అనేక కారణాలవల్ల ఆయనకు లేకుండా పోయింది. అయినా సాహిత్య సంగీత చిత్రలేఖనాది కళలపట్ల తన అభిమానాలను పంచిపెట్టాడు. లోక వ్యవహారాలలో నిరంతరం పాల్గొంటూ జీవితాన్ని పూర్తా అనుభవిస్తూ, నిర్మమతను అలవరచుకొని లోకంలోని సమస్యలను వాస్తవ దృష్టితో చూసి సమన్వయ మార్గం గురించి దీర్ఘంగా చింతించి, చివరకు పరమ సామాన్య మనిపించేంత సార్వజనికాలైన జీవన మూల్యాలను సాధించుకొని ప్రవర్తించాడు: మంచితనం, స్నేహం, ప్రేమ. హాస్యాన్ని పదును కోసులాయుధంగా తీర్చిదిద్దుతూ, సులభ సాధ్యం కానటువంటి హాస్యదృష్టి (Comic Spirit) అలవరచుకొన్నాడు. ఎంత హాస్య ప్రసన్నుడో అంత గంభీరుడు. లోపాలతో సహా లోకాన్ని ఆమోదించి లోటులను అధిగమిస్తూ, సున్నితంగా ఆ లోపాలను తీసివేసి సానునయ లేపనంపూసి దాని ఇతోధిక వివర్ధనానికి ప్రోత్సాహం చేసే వైఖరే గనుక హాస్యదృష్టి అయితే, తెలుగు సాహిత్యంలో దానికి పాదు తీసి నీరుపోసిన తోటమాలి ఆయన. వీరేశలింగం మచ్చుకత్తికి అప్పారావు కృపాణం పోటీకాదు. వీరేశలింగం గ్రీష్మాతపానికి అప్పారావు హేమంతభాను కాంతివ్యాప్తి విరోధికాదు; అత్యవసరమైన రూపాంతరం మాత్రమే. మరింత నాజూకు తేరి నాగరికమైన వీరేశలింగం తత్వమే అప్పారావుది. తెలుగు రచయితలలో ఇటీవలి కాలాన గురజాడ అప్పారావు తొలి సంస్కారి.

గురజాడ అప్పారావు మొగాన్నే తెలుగు వారికి తెల్లవారించని కాదుగాని, దాదాపు మున్నూరేళ్ళ సంపు, సాహిత్య చరిత్ర ఆయనలో నూతనోత్తేజం పొంది, ఆయన ద్వారా ఆధునిక యుగానికంతటికీ సంక్రమించింది. యుగకర్తగానీ శకకర్తగానీ కాకపోవచ్చుగాక, ఆ యుగమూ ఆ శకమూ తమ సమగ్ర స్వరూపాన్ని ఆయన భావనలోనూ, సాహిత్య కల్పనలోనూ చేకూర్చుకొన్నాయి. వచనం, కావ్యం, నాటకం, కథ – గురజాడ అప్పారావు ముందు వెనకల ఒకేతీరున ఇవి కనిపించవు, మట్టిని చేబట్టి బంగారం చేసినా చేయలేకపోయినా, బంగారాన్ని చేబట్టి మురికి

మట్టిగా చెయ్యకుండా, బంకమన్నునుండి దివ్య ప్రతిమలు చేశాడు. తాంబేటి నడక నడుస్తూ ఉండిన సాహిత్యాన్ని కుందేటి లగుపు తీయించాడు. మార్పును గుర్తించడ మొకటి, దానికి మేలైన తెన్ను చూపెట్టి, దాని వెంబడి తానునడుస్తూ ఇతరులకు ధైర్యం చెప్పడ మింకొకటి. దారుల కూడలిలో ఆయన తీసిన బాట ఈ నాటిది. ఆయన ప్రథమమార్గదర్శకుడు.

అందుకనే వీరేశలింగం వేగుచుక్క కాగా గురజాడ అప్పారావు పొద్దుచుక్క అయ్యాడు.

---

1. తె. భా. చ. సం.: పు. 621 - 622
2. అదే: పు. 619
3. తొలి తెలుగు నవల (వ్యా): డా. అక్కిరాజు రమాపతిరావు, భారతి, డిసెంబరు 1967
4. వ్యాసావళి: గిడుగు వేంకటరామమూర్తి
5. ఆంధ్ర వచన వాఙ్మయము: నిడుదవోలు వేంకటరావు. పు. 91. 104
6. *Minute of Dissent:* G. V. Appa Row, B. A; F. M. U., P. 91
7. స్వీయ చరిత్రము: కందుకూరి వీరేశలింగం. పు. 174 - 175
8. అదే: పు. 136 - 137
9. *The Intellectual in India:* Nirad C. Chaudhuri, P. 14
10. *Viresalingam* (వ్యా-ఉ): C. R. Reddi, SWATANTRA, 1948.
11. వేగుచుక్క (వ్యా): మల్లంపల్లి సోమశేఖరశర్మ. కిన్నెర
12. గు. ర. మా. మం.: పత్రికలు, పు. 108
13. స్వీయ చరిత్రము: చిలకమర్తి లక్ష్మీనరసింహం, పు. 234 - 235
14. *The Continent of Circe;* Nirad C. Chaudhuri, P. 304

# అరుణోదయం

## "కౌసల్యా సుప్రజా...."

....కళింగదేశ విజిగీషా మనీషం దండెత్తి వచ్చిన కృష్ణదేవరాయల ప్రతాపాగ్ని గౌతమీజలాన్ని మరగగాచి పొట్నూరులో రాజుకొనమున్నా, విశాఖ మండలం సర్వసిద్ధి తాలూకాలో ఈ ప్పేవు సెలవిచ్చు కొంటిట - ఆచోటే రాయవరవు*వాస్తవ విషయాలు కట్టుకథలతో అల్లిబిల్లిగా అల్లుకొని పోయిన దేశచరిత్రలో ఏది ఏదో విడమర్చేందుకు ఎంతో శ్రమపడాలి.

కృష్ణరాయల డేరెందుకుగాని, సదరు రాయవరంలో గొడవర్తి కృష్ణయ్య పంతులు మట్టుకు మడిమాన్యాలు సంపాదించుకొని ఇల్లూ అదీ కట్టుకొని కాపురముండేవాడు. ఇదిమాత్రం కట్టుకథకాదు, వాస్తవం. గురజాడ అప్పారావు ద్వారా ఆయనకూడా చరిత్రకు ఎక్కదగిన మనిషి.

— ఆ కృష్ణయ్య పంతులుగారి ఇంట ఒకరోజున ఉదయమాదిగా ఎవ్వరికీ గుండెల్లోగుండెలేనట్లుంది. గురజాడ అప్పారావు ఒకంతట మాతృ గర్భంవదిలి బయటపడలేదు. కౌసల్యమ్మకిది తొలిచూలు. పెళ్ళయి. ఆరేళ్ళ

---

* సర్వసిద్ధి - రాయవరము అనే వ్యాసంలో (కళింగ [illegible] వార్షిక సంచిక, 1929, విశాఖపట్నం) గొబ్బూరు వెంకటానంద రాఘవరావు ఇలా రాశాడు:

తూర్పుచాళుక్య రాజవంశ స్థాపకుడైన కుబ్జ విష్ణువర్ధనుని [illegible] 'సర్వసిద్ధి' బిరుదనామం. అతడు స్థాపించినదే ఎలమంచిలికి ఐదున్నర మైళ్ళ దూరంలోని సర్వసిద్ధినగరం. కొన్నాళ్ళు అది అతని రాజధాని. విశాఖపట్టణ గెజిటీరు పుట 314 లో రాసినదాన్నిబట్టి, 1861 వరకు తాలూకా కేంద్రమై ఉండింది. అయితే మున్సబుకోర్టు సర్వసిద్ధికి రెండుమైళ్ళ దూరాన ఉన్న రాయవరం గ్రామంలో ఉంటూవచ్చింది. ట్రంకురోడ్డు నిర్మాణమైన తర్వాతనే దానిని ఎలమంచిలికి మార్చారు.

రాయవరం కృష్ణదేవరాయవరం. రాయలవారి శిలాశాసనం రాయవరం సంత పేటలో రాచబండ పేరిట ఉంది. (పు. 89 - 92)

గడిచినా, కాపురానికి వెళ్ళిందిటీవలనే. నెలలు నిండేందుకుగూడా మరి రెండు మాసాల వ్యవధి ఉంది. ఏడోమాసంలోనే బిడ్డకుట్టు మొనజూపుతుందని ఎవరూ అనుకోలేదు. గర్భిణికి పదిహేనేళ్ళకంటె వయస్సు లేదు. తెరలు తెరలుగా నొప్పులు కనిపించి పోతున్నాయి. మంత్రసాని పనినేర్పు అక్కరకురాలేదు. కూతవేటుదూరంలో వైద్యుడులేడు. ఎల్లాగో పొద్దు నడినెత్తిమీదికి వచ్చి పడమటికి వాలింది. కృష్ణయ్యపంతులు వైద్యుణ్ణి వెంటబెట్టుకువచ్చాడు.

ఎట్టకేలకు కౌసల్యమ్మ నీళ్ళాడింది — "కౌసల్యా సుప్రజ" పుడితే కావలసిందేమిటి? అలాగాక అక్షరాలా అర్భకుడే పుట్టాడు. వట్టి లోటకూర కాడలాగున్నాడు. ఎలాగుంటే ఏమిగాని, తల్లీ బిడ్డా గండంగడిచి ఒడ్డునబడ్డారు- సింహాద్రి అప్పన్నదయ. అభిజిత్ ముహూర్తం. మఘానక్షత్రం, నాల్గవపాదంలో కేతువు. జన్మకాల కేతుమహర్దశ. తండ్రి వెంకటరామదాసుకు ఈ విషయాలలో చాలాపట్టింపు. జన్మాష్టమం ఐదోఏటగాక ఎనిమిదోఏట ఉపనయనం జరగాలి....

దుందుభి నామ సంవత్సర భాద్రపద బహుళ త్రయోదశీ అదివారం 1862 సెప్టెంబరు 21 అని పంచాంగాలు వెదికించి నిర్ధారణ చేయించారు అప్పారావు పుట్టిన నూరేళ్ళ తదనంతరం ఆయన అభిమానులు. ఆ తేదీ మీదుగా శత వార్షిక జయంతి కూడా జరిగిపోయింది.

అది ఆదివారం కావడం మరెందుకైనా కాకున్నా రాయవరంలో ఉంటూ వచ్చిన జిల్లా మున్సబు కోర్టు సిరస్తాదారైన కృష్ణయ్య పంతులు ఇంటిపట్టున ఉండి పోయేందుకు పనికి వచ్చింది. ఆయనే అక్కడ లేకపోయిఉంటే సమయానికి వైద్య సహాయం అందకనే పోనేమో!

అది అటుంచి, దుందుభినామ సంవత్సరంలోనే పరవస్తు చిన్నయసూరి దాటుకొని గురజాడ అప్పారావు జన్మించడం కాకతాళీయమే అయినా, చిన్నయ సూరిని చంపి గురజాడ అప్పారావు పుట్టాడని చమత్కరించేందుకు వీలు కల్పిస్తుంది. ఆ వీలును నిడుదవోలు వేంకటరావుగారు వాడుకొనే ఉన్నారు; వారి వ్యాసానికి ఉపశీర్షిక "చిన్నయసూరి నిష్క్రమణ - గురజాడ అవతరణ." ఆ వ్యాస క్రమంలో ఆయన అంటారుగదా -

అప్పారావు పుట్టుకలో ఒక చిత్రం ఉన్నది .... అది దుందుభి సంవత్సరము. అటు చిన్నయసూరి; ఇటు గురజాడ. ఇద్దరి కీర్తి దుందుభులు మారు మ్రోగుతూనే వున్నవి. 1

చిన్నయసూరి 'జయంతి,' గురజాడ 'వర్ధంతి' మాటలకేమిగాని వావిళ్ళ వారు ప్రచురించిన "ముత్యాల సరములు" గ్రంథానికి వేంకటరావుగారు పీఠిక రాస్తూ, అసలే చిత్రమైన అప్పారావు పుట్టుకను చిత్రాతి చిత్రం చేశారు. ఆయన గారి జన్మ తారీఖును 31-10-1861 గా అందరిలాగే ఇచ్చి, ముద్రారాక్షసుడి సాయంతోటి బారసాలను 11-13-1861 న జరిపించారు. పోనీ లెమ్మనుకొంటే, అందులోనే ఒకచోట 9-4-1915 న అప్పారావును "అమర లోకనివాసి"ని చేసి, 9-11-1915 న ఇంకొకచోట "కీర్తిశేషు"ణ్ణి చేశారు. 2

గురజాడఅప్పారావు పుట్టుకలో ఉన్న "చిత్రం" అదికాదు. నేలమీదపడకముందే అమరలోకవాసానికిపోకుండా, పుట్టిన వెనుకగూడా అప్పటికింకా సముపార్జించని కీర్తిని శేషింపజేయకుండా, ఏభై మూడేళ్లు 'బొంగరంలా' తిరుగుతూ మహారాజుగా బ్రతకడమే ఆ చిత్రం. వయస్సువచ్చి ఊహ తెలిశాక ఎన్నో ఇతర వ్యాపకాలలోపడి ఆయుస్సునూ, మనస్సునూ వ్యయంచేస్తూకూడ సాహిత్య ఫలరాశిని ఇచ్చిపోవడం, ఆ చిత్రానికే విచిత్రం గొలిపేసిద్ధి – ఆ ఫలరసం జాతికి ఆస్వాదయోగ్యం కావడం సరేసరి.

....గొడవర్తివారి ఆడబడుచు గురజాడ వారింటి కోడలుకావడంకూడా సాధారణ విషయమేమీకాదు, దానికి ఒక కథే ఉంది.

రాయవరంలో గురజాడ పేర్రాజుపంతులుకూడా ఎన్నదగిన మనిషి. అమీను పనిచేసి పింఛనీదారుడై సొంత 'పేరి' నడిపిస్తూ నియ్యోగం వెలిగిస్తున్నాడు. భార్య పేరిందేవి పేర ఒక నూయి త్రవ్వించాడుకూడాను. పంతుళ్ళు ఇద్దరూ ఇప్పుడు చేతులు కలుప దలుచుకొన్నారు. పేర్రాజు కిద్దరు తమ్ముళ్ళు: సీతాపతి, కొండయ్య. సీతాపతి నడిప్రాయంలోనే కాలం చేశాడు. ఆయనకు మూడంటే మూడే పెళ్ళిళ్ళు. కడగొట్టుభార్య సూరమ్మ. స్వగ్రామం గోదావరి సీమలోని మొగలితుర్రు. సీతాపతిగారికి వంశాంకురాల నిచ్చింది ఆవిడే: పెద్దవాడు వెంకటరామదాసు, రెండవవాడు కొండ్రలావు. పసితనంలోనే బరువు బాధ్యతలన్నీ రామదాసుపై బడ్డాయి. పెత్తండ్రి పేర్రాజు ఒక చెయ్యి వెయ్య దలచుకొని కృష్ణయ్యపంతులుగారి కుమార్తె కౌసల్యమ్మను రామదాసుకు వధువుగా నిర్ణయించాడు.

కానున్న అల్లుడి విషయమై కృష్ణయ్య పంతులుగారికి అరమనస్సుండ వలసిన అవసరమేమీలేదు. పిల్లాడు కంటికి నదురుగా ఉన్నాడు. పెద్దకళ్లు.

పచ్చటి ఛాయ, ఒడ్డూ పొడుగూ ఉన్నవాడు. భారీ విగ్రహం. పైగా పూసపాటి విజయరామ గజపతి అనుగ్రహానికి పాత్రుడై కుమరాం తాణాలో ఒక గుమస్తా గిరీ సంపాదించుకొన్నాడు – అదే – అదే పిల్లనిచ్చే పంతులుగారికి కావలసింది.

ఆ ఉద్యోగం దొరకడం ఒక ఉపకథ. రాజాగారు మహారాజావారింకా కాకముందు ఒకరోజున పెదగాడికి విజయం చేశారు. గురజాడ కొండయ్యా పంతులు పెదగాడి తాణాకు అమీను. లోగడ సర్కారువాడి కింద జిల్లా 'హెడ్' పోలీసుగా ఉండి పింఛను పుచ్చుకొని ఇప్పుడు రాజావారికొలువు చేస్తున్నాడు; వెంకటరామదాసు పినతండ్రివద్ద ఉండిన రోజులవి. చెన్నాపట్నానకు దొరతనం వారికి జరూరుగా ఒక నివేదిక పంపుకోవలసి, చిత్తుప్రతిని సాపురాయగల మనిషి కావాలని రాజాగారడిగారు. రామదాసు ఆ పని 'బేగి' పూర్తిచేసి రాజాగారిని మెప్పించి పై జెప్పిన ఉద్యోగాన్ని సంపాదించుకొన్నాడు. అలా మొదలైంది తన తండ్రిద్వారా విజయనగరం 'సమస్థానం'తోటి గురజాడ అప్పారావు 'ఇలాకా'....

కృష్ణయ్యా పంతులుగారి అల్లుడయ్యాక వెంకటరామదాసు చీపురుపల్లిదాపున గులివిందాడలో సొంతకాపురం పెట్టాడు. "ఊరెయ్యది ? చీపురుపలి" అని అడిదం సూరకవి చెప్పిన ఊరు కావడమేగాక, ప్రాయంమీరాక ఆ కవి వెళ్ళి నివసించిన అగ్రహారం గురవిందాడే కావటంకూడా యాదృచ్ఛికమే. గులివిందాడకు రామచంద్ర పురాగ్రహారమనికూడా పేరు. 'కన్యాశుల్కం' నాటకంలో ఇది ఒక స్థలమై కూర్చుంది కూడాను. అక్కడ అడిదం, దూసి, అక్కినపల్లి, మురపాక కుటుంబాలుండేవి – అంతా నియోగికట్టు. 3

ఊళ్ళేలడానికైనా మంత్రాంగంచెప్పి ఏలించడానికైనా మేమే తగుదు మనిపించిన నియోగుల్లో గురజాడవాళ్ళూ ఒకరు. వాళ్ళు ఆపస్తంభ సూత్రులు, కౌండిన్యగోత్రులు. పొట్టచేతబట్టుకొని దేశంకాని దేశానికి వలసవచ్చినవాళ్ళే అయినా సంబంధ బాంధవ్యాలనుబట్టి స్థానికులైన నియోగి ప్రభువుల నిరాదరణకు పాత్రులు కాలేదేమోననిపిస్తుంది. ఈ కథ ప్రారంభంనాటికే సింహాద్రి అప్పన్న పేరు రెండు తరాల గురజాడ వాళ్ళకు అచ్చివచ్చింది, కొండలావన్నా, కొండయ్యనా, అప్పారావన్నా ఆ దేవుడే. మరైతే ఏమైపోయాడు, కృష్ణాజిల్లా గురజాడ గ్రామం లోని తమ ఇలవేలుపు రామలింగేశ్వరస్వామి ?

తమ్ముళ్లను తోడుచేసుకొని పూసపాటివారి విశాలమైన ఉనరు క్షేత్రానికి రాక ముందు, పేర్రాజు పంతులు మచిలీపట్నంలో తండ్రి వీర్రాజుపంతులు పెంపకాన కౌమార యౌవనాలు గడిపినవాడే. తమ్ముళ్లకంతటి వయస్సు వీర్రాజు చనిపోయే నాటికి లేకపోవచ్చును. ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీలో బహుచిన్న నౌకరీ చేస్తూ సంసారాన్ని నెట్టుకొస్తూ ఉన్నట్టుండి వీర్రాజు చనిపోయేసరికి, దిక్కూ దరీ తోచక పేర్రాజు దేశం విడిచిపెట్టి పోవలసి వచ్చింది.

వీర్రాజుపంతులు నూరింట యాభై పంతులు మట్టుకే ఆరువేల నియోగి. తతిమా యాభై గోలకొండ వ్యాపారి. ఆ రెండింటికీ చెప్పుకోదగ్గ అంతరమేమీ లేకపోయినా, వైదీకులు కాని బ్రాహ్మల్లో ఇవి రెండూ రెండు శాఖలు: ఒక్క చేతివే అయినా రెండూ రెండు వేళ్ళు. తండ్రి పట్టాభిరామయ్య ఆర్వేల నియోగి కాబట్టి వీర్రాజూ ఆ తండ్రి బిడ్డ — అచ్చం ఆర్వేల నియోగి బిడ్డ కావలసివస్తే చెప్పలేముగాని, తల్లిగారి శాఖను కొట్టివెయ్యలేము కూడా. శ్రీనాథుని కోదండ రామయ్యకూ, ఆళ్వారాయచరిత్రం చెప్పిన శ్రీనాథుని వెంకటరామునికి ఏమి సంబంధమో తేల్చిచెప్పడం నావల్ల కాలేదు. అసలు ఆ ఇంటిపేరే ఆకర్షణీయంగా ఉంది. ఒకచెంప ఓడవర్తకం నడుపుతూ ఇంకొక చెంప ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీలో 'దుబాసి' పనిచేస్తూ రెండుచేతులా సంపాదించి పోయిన యీ కోదండ రామయ్య గురజాడ గ్రామంనుంచి కట్టుగుడ్డలతో చక్కా వచ్చిన పట్టాభిరామయ్య గుణాలు చూచి మెచ్చి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేసి పోయాడు. ఆయన వెనువెంటనే దఫాలు దఫాలుగా పోయింది, అటించీ గటించీ ఆయన కూడబెట్టిన సిరి. మనమడు వీర్రాజు బిడ్డలు వలసపోవలసి వస్తుందని కోదండ రామయ్య అనుకొనే వుండడు.

డబ్బునూ కన్నబిడ్డనూ యిచ్చిన మామగారు పోయాక హారతి కర్పూర జ్వాలలాగా ఒక వెలుగు వెలిగిన పట్టాభిరామయ్య, 'రసికుడై' వుండకుంటే అప్రయోజకుడై ఉండాలి. అయితే యీ రెండవ బిరుదు ఆయనకు తగనిది. తాను సాహసి కాకుంటే తరతరాలబట్టీ వస్తూన్న ఇల్లూ, పొలమూ విడిచి వ్యాపార కేంద్రమైన బందరుకు వచ్చివుండేవాడే కాదు. తనకు చొరవ లేనట్టయితే గుమాస్తాగా ప్రవేశించి యజమానిని మెప్పించి అతని ఆస్తినంతటినీ రాబట్టుకోగలిగేవాడే కాదు.

తెంపరితనం గురజాడ పట్టాభిరామయ్య రక్తసారంగా మారింది. పెద వీర్రాజుగారి ఏడుగురు కుమాళ్ళలోనూ తాను నాల్గవవాడు. గంపెడంతైన సంతానాన్ని పెంచి విద్యాబుద్ధులు చెప్పించి ప్రయోజకులను చెయ్యగల స్తోమతు ఆ వీర్రాజు

పంతులుగారికీ లేకపోయింది. బ్రాహ్మణ వ్యవసాయంమరి! అక్కిరాజుగారి బిడ్డలలో తాను మధ్యముడు. అక్కిరాజెంతటి అసాధ్యుడైనా కావచ్చుగాక, అతని ఆస్తిపాస్తులు మూడుగా విడిపోక తప్పలేదు. ఆ మూడింట ఒకటి, వీర్రాజుగారి సంతానోత్పదకశక్తి తీవ్రత వల్ల, ఏడుగా చీలింది. పట్టాభిరామయ్యను గురజాడ గ్రామానికే ఆమరణాంతమూ కట్టిపేయగలంతదా ఈ ఒకటింట ఏడవపాలు? అందుకే కుటుంబ బంధనాలూడ్చుకొని లోకంమీద పడి ఉద్యోగపు వేటలో ఇల్లాలినికూడా సంపాదించుకున్నాడు.

గురజాడవారి వంశకర్త, పైచెప్పిన అక్కిరాజు గుంటూరుజిల్లా జంపని గ్రామం నుంచి * గురజాడకు నాలుగు వర్ణాలవారినీ వెంటబెట్టుకువచ్చి అక్కడ స్థిరపడ్డాడు. గోల్కొండ కుతుబ్‌శాహీ నవాబుల 'నమక్' తోటీ హైదరాబాద్ ఆసఫ్ జాహీనిజాముల 'మదత్' తోటీ, మూడు పువ్వులు ఆరు కాయలుగా పెంపొందిన నూజివీటి మేకావారి ఏలుబడిలో, అక్కిరాజుగారికి ముస్లిం సంస్కృతికూడా ఒంటబట్టి ఉంటుంది. మచిలీబందరువరకూ నైజాము రాజ్యమే. పద్దెనిమిదవ శతాబ్ది ప్రారంభ కాలానికి అక్కిరాజు నడికారులో ఉండివుంటాడు. మరో యాభై ఏళ్ళకుగాని బుస్సీ శృంగభంగంతోబాటుగా నైజాము అధికారం అంతరించి ఇంగ్లీషువారి 'కుంఫినీ'కి ఈ సీమ 'దఖల్' పడలేదు. మరో నూటయాభై యేళ్ళ తర్వాతగూడా "మొగలాయి సాంప్రదాయములు ప్రజలనింకనూ బూర్తిగా విడవలేదు" – పార్శీపేరిట ఉర్దూభాషాబోధన. షేర్వాణీ లేదా అంగర్ఖాధారణ. వీపున కొంగులువిడుస్తూ వంకర తలపాగాలు చుట్టుకునే వాడుక.4

అదంతా వాస్తవమే కావచ్చుగాని, అక్కిరాజు అనే అగ్గికి ఈ పరాయా చదలు అంటినట్టేలేదు; అంటినా పీదోలుదాటి లోనికిపోయినట్టులేదు. ఎందుకంటే, గురజాడ గ్రామంలో ఆయన రెండుదేవాలయాలు కట్టించాడు. * మేకా వేంకటాద్రి అప్పారావు ఈ ఆలయాలకు ఈనాములిచ్చాడు. అందులో రామలింగేశ్వరస్వామి కొకటి. ఆయన మనవళ్ళు కొందరు ఆకోవెల గోపురకలశంమీద శాసనంవేయిస్తూ వేయించిన సంవత్సరం పేర్కొన్నారు – తద్వారా గుడికట్టించిన పుణ్యానికితోడు చరిత్రకారుని పని సుకరంజేసిన పుణ్యాన్ని తమకూ తమ వంశానికీ సంపాదించు

---

* గురజాడ దేవస్థానములచారిత్రము: గురజాడ భాస్కరరావు (1928) బెజవాడ.

* ఆయన సుమారుడు శరభరాజు కసుదనవారి సంస్థానం (గుడివాడ తాలూకా)లో మాన్యాలు సంపాదించి నూటిపీటివారికి దివానుగా పనిచేశాడు. (1754 ప్రాంతం).

కొన్నారు. (శార్వరినామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమీ శుక్రవారం క్రీ. శ. 1781 జనవరి 1 కి సరిపోతుందని గురజాడ రాఘవశర్మగారు చేసిన అంచనా సరైనదికాదు. సంవత్సరం అటుంచి, ఫాల్గుణానికీ జనవరికీ, గోకులాష్టమికీ పీర్ల పండగకూగల సంబంధమేఉంది. మార్చిలోగాని ఏప్రిల్‌లోగాని ఫాల్గుణమాసం వస్తుందని "దైవజ్ఞులు" చెప్పనవసరమేలేదు. అయినా శ్రీపాద వెంకటరమణ దైవజ్ఞ శర్మ గారిచేత ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారిద్వారా నేనీవిషయం నిర్ధారణ చేయించాను. *గురజాడ దేవస్థానముల చరిత్రలో* (పుట. 10) గురజాడ భాస్కరరావు గారు పొందుపరిచారంటూ ఈ విశేషాన్ని నాకు దయతో తెలిపిన రాఘవశర్మగారిని తప్పుపట్టి తిన్నయింటివాసాలు లెక్కించడం కాదనుకొంటానిది.)

ఇంటిపేరు గురించి ఒకటి రెండు మాటలు. వాడుకలో 'గురుజాడ'లోని కొమ్ము ఊడి 'గురజాడ' అయింది. అయినా కవి చరిత్రకారుడు శ్రీరామమూర్తి పంతులు, 'కవిశేఖర' రాఘవశర్మగారు, ఇతరులు కొందరు ఆ కొమ్మును దానికి తగిలించే రాసుకొంటూ వచ్చారు. 'ర' వర్ణానికి కొమ్ము తగిలించి కొమ్ము మొలిపిస్తూ ఇంటిపేరులోగూడా గురుత్వాన్ని గర్భీకరించేందుకు ఇంకా కొందరు వ్యర్థంగా ప్రయత్నిస్తున్నారు. ఒకేఒక్క సందర్భంలో, అదిన్నీ గురునిజాడ అనే అర్థం రాబట్టేందుకని, అప్పారావుకూడా "గురుజాడ" అని రాసుకోవలసివచ్చింది.

ధృతి గురుజాడల నరిగెడు
గతి పెద్దలు జూప జనితి గజపతి త్రోవన్....[5]

పేరులోని పెన్నిధి ఏమిటిగాని, గురజాడవాళ్ళు ఘటికులు. నేటికీ మున్సబు కరణాలు ఆ వంశంలోనివాళ్ళే. నూజేభై ఏళ్ళక్రితంలో గ్రామాధికారులె ప్రజలకు ప్రత్యక్ష ప్రభువులు. ఒక చాటుకవికి కరణం "నృపు నుపకరణము" కాబట్టి "గ్రామాభరణము" కూడా అనిపించాడు. కరణీకపు లౌక్యానికి జతగా మున్సబీ హాజం ఉండేది. కాబట్టి అప్పట్లో వీళ్ళను పట్టపగ్గాలుండేవికావనుకోవచ్చు. కరణం తోటి కలహం కొరివితో తలగోక్కోవడమే.

అయినా అన్ని దినాలొకరివికావు. "పూలమ్మిన చోట" సామెతననుసరించక పట్టాభిరామయ్య పరపంచలు పట్టిపోయాడు. అలాంటివాళ్ళు మరెందరో ఉండేవారని రాఘవశర్మగారి భోగట్టా. వ్యాపార వాణిజ్య స్థలాలకు, సంస్థానాలకు, ఎగబడి పోయిన మరొక బ్రాహ్మణ కుటుంబం, – ఆ ఇంటిపేరే ఉన్నవాళ్లది – గురజాడ

గ్రామానికి దాపున పసుమర్తిలో ఉండేది. వీళ్ళకూ వాళ్ళకూ బావా మరిదీ వరసలట. 'అగ్ర' కులస్థులు కూడా, నీతి దెలియని నీచుని రాజ్యాన, తెల్లయిజార్లు తొడిగి తలటోపీలుపెట్టి నవ్వులపాలౌతూ వచ్చారని *గువ్వలచెన్న శతక కర్త* వర్ణించిన రోజులలో, ఈ వలసలు మొదలై ఉంటాయి.

కొత్త పరిసరాల్లో కూడా కాలు నిలదొక్కుకొని నెట్టుకొని వచ్చే ఓర్పుతో లోకపు సుడిగుండాన పడి గిరగిర తిరుగుతూనే ఒడ్డున బడగల నేర్పు జతచేరి ఇలాంటి వారికి అస్తినిష్ఠంగా ఉంటాయి. ఖామందుల వారి కనుసన్నలలో, ఏలిన వారి చిత్తమెరిగి నడుచుకొంటూ ; ఆవులించక మునుపే పేగులు లెక్కబెడుతూ ; స్వామికార్యాన్నీ, స్వకార్యాన్నీ చక్కబెట్టుకుంటూ ; ఒళ్ళంతా కళ్లుచేసుకొని పరిసరాలనూ పరిస్థితులను గమనిస్తూ ; పై మెట్టుమీద పెట్టేందుకే కింది మెట్టుపై ఉన్న అడుగు తీస్తూ ; విశ్వాసం వినయం లోకజ్ఞానం లౌక్యం సమ్మిశ్రణం చేసిన బతకనేర్చినతనాన్నీ బాగుపడేయోగాన్నీ కూసువిద్యగా నేరుస్తారు. వెంకట రామదాసు ఆ తానులోని గుడ్డతుంటే, ఆ తండ్రికి బిడ్డే అప్పారావు. తన వెనకటి వారెవ్వరూ ఎక్కలేనంత ఎత్తెక్కాడాయన. సంస్థానాధిపతులకు తలలోని నాలుకయ్యాడు. ఆనంద గజపతి మరణానంతరం పది పదిహేనేళ్ళు, నిజానికి తాను మకుటమొకటే తక్కువైన మహారాజా. ఇంతటి ఉన్నతి కలిగినా ఉద్ధతుడుకాలేదెన్నడూ ; సేవకుని వేషం విప్పనే లేదు. నేర్పంటే మరొకటేదోకాదు, ఇదే. గురజాడ వారి వంశ ప్రతిష్ఠకు అప్పారావు జీవిత మొక పతాక.

అయితే గురజాడ అప్పారావు ప్రతిష్ఠను ఈ సేవకావృత్తిమాత్రం ఇప్పుడు యేమాత్రమూ నిర్ణయించదు పైగా, వంకర నాలుకలవారి మూతివిరుపులకూ, వెక్కిరింపులకూ అగ్గమౌతున్నదికూడా. రాజాల రాణీల "చంకబిడ్డ"ట అప్పారావు!

గురజాడ అప్పారావు పేరుప్రతిష్ఠలు లోకానికి సుపరిచితాలై 'గురజాడ' శబ్దమే సువిఖ్యాతమయ్యాక, ఎక్కడెక్కడి గురజాడవాళ్లూ ఒకరినొకరు పలకరించుకోసాగారు. తమందరికీ సామాన్యమైన అసాధారణ గర్వ హేతువొకటి చేకూరింది. విజయనగరానికి బందరు ఇరుగుపొరుగైంది. అప్పారావు వంశోద్ధారకుడయ్యాడు ; కనకనే విస్మృతి చీకట్లనుంచి అక్కిరాజు తర్వాతి తరాలన్నీ మళ్ళీ జీవించ గలుగుతున్నాయి.

- అక్కిరాజు
  - సూరపరాజు
    - వీరి కుమారులు శరభరాజు, రామన్న, లక్ష్మన్నలే, క్రీ.శ. 1781 లో గోపుర కలశంమీద శాసనం వేయించినవాళ్లు.
  - పెదవీర్రాజు
    - బుచ్చిరాజు
    - సుబ్బరాజు
    - జానకీరామరాజు
    - పట్టాభిరామయ్య
      - వీర్రాజు
        - పేర్రాజు = పేరిందేవి
        - సీతాపతి = సూరమ్మ
          - వేంకటరామదాసు (మృతి 1904) = కౌసల్యమ్మ (మృతి 1916)
            - వేంకట అప్పారావు (1862–1915) = అప్పలనరసమ్మ (మృతి 1923)
              - లక్ష్మీనరసమ్మ
              - వేంకటరామదాసు
              - అప్పలకొండమ్మ
            - శ్యామలరావు (1866–1891)
          - కొండల్రావు
        - కొండయ్య
    - సుందరరామయ్య
    - అయోధ్యరామయ్య
    - సీతారామయ్య
  - చినవీర్రాజు

# 2

కుటుంబపు ముచ్చట్లుగా మిగిలి ఇంకా నానుతూన్న కట్టుకథల్లో ఒకటి అప్పారావు పసితనానికి చెందినట్టిది. తదనంతర జీవితంలో గొప్పతనాన్ని సాధించిన వాళ్ళందరికీ పట్టిన ఖర్మే ఇది. వాళ్ళ ఉయ్యాలచుట్టూ దేవకన్యలు గుమికూడకపోతే, పొత్తిళ్ళబిడ్డలను నాగ సర్పాలే పడగెత్తి ఎండపొడ తగలకుండా సేవిస్తాయి. గొప్పవాడు కానున్నాడని కాబోలు అప్పారావనే దుర్బల శిశువు నిద్రిస్తున్నాడని చూచి, ఎండసోకే ప్రశ్నగాని గొడుగు కావలసిన అక్కరగాని లేదని తెలుసుకొన్నదై ఒక దేవతా సర్పంలాంటిది మంచంమీదికెక్కి ఈ కొసనుంచి ఆకొసకు బరబరా పాకిపోయింది. దేవతాసర్పానికి గూడా కోరలూ గ్రంధినిండా విషమూ ఉంటాయి కాబట్టి ఇదిచూచి పెద్దలు గాభరాపడ్డారు. చివరకు జ్ఞానోదయమై పిల్లవాడి గురించి ఇప్పటినుంచి కూడా ఘనంగా ఊహించుకో సాగారట. ఈ 'ట' చాలు, ఇలాంటి ఉబుసుపోక కతలన్నిటికీ శిరచ్ఛేద శిక్షవిధిస్తుంది.

అప్పారావు శైశవం ఎక్కువగా అమ్మమ్మగారి రాయవరం ఇంటిలోనో, ఎలమంచిలి ఇంటిలోనో గడిచి పోయింది. మనవడికి ఇంతకంటె ఎక్కువ కోరుకోదగిందేదీ ఉండదు. ఉద్యోగధర్మంలో ఊళ్ళేగవలసి వచ్చిన వెంకటరామదాసు ఎందునా ఇంతపచ్చిక మొలవనిచ్చినట్టు కనిపించదు తాణా అయిన కుమరాంలో సదుపాయాలెంత తక్కువో సంకటాలంత ఎక్కువ కాబట్టి, దాపున్నే ఉన్న గురివిందాడలో కాపురం పెట్టాడు. దీనికి రెండుమైళ్ళలో ఏనుగులవలస, అక్కడ సంస్థానపు భూములు, వాటిలో ఒకచిన్నపాటి సొంత 'సేరీ'. చింతచచ్చినా పులుసు చావనట్టుగా, కృష్ణమండల సుక్షేత్రాలతో తమకుండిన ఆదిమానుబంధం గురజాడ వాళ్ళలో ఎప్పుడో ఒకప్పుడు పొటమరించేది. అప్పారావుకుగూడా ఇది తప్పిందికాదు. భూమిలో వేళ్లుదన్నుకొని ఎక్కడో ఒకచోట స్థిరపడిపోవాలని, జంగమ పదార్థంగా బతుకుతూన్న వెంకటరామదాసుకు కోరిక కలగడం వింతేమీకాదు గాని, కుమరాం నుండి బదిలీ అయ్యాక, ఎక్కడివేళ్ళక్కడ తెగిపోక తప్పలేదు. వార్ధక్యదశలోగానీ ఆయనకు చెప్పుకోదగ్గ స్థావరత్వం ప్రాప్తించలేదు.

చూస్తుండగానే అప్పారావు ఐదేళ్ళ పిల్లాడయ్యాడు. అయినా ఒళ్లు చెయ్యలేదు. ఒళ్లుమాత్రమే చెయ్యలేదనాలి. వయస్సుకుమించిన ఊహ ఉంది. చురుకు

పాలు తక్కువేమీకాదు. ఆటపాటలంటే ఎగిరి గంతేస్తాడు. వానల్లో వీధి లోనే కాపురం. వాననీళ్ళంటే సరదా. ప్రవహించే ఏ నీళ్ళదిగినా ప్రాణమిస్తాడు. పూలమొక్కలు చేరరమ్మంటాయి. సంబరాలూ పండుగలూ వేడుక గొలుపు తాయి. భోగినాడు వేకువ చలిలో తాటాకు మంటల వద్దజేరి చిట్టి అరిచే తులు చాపి మంటసెగను బుగ్గల కద్దుకొన్నప్పటి సగింపు, అటు తర్వాత చాల నాళ్ళవరకు గుర్తుండి పోయింది. దీపావళి సందడి సరేసరి. మరో ఇరవ య్యేళ్ళ తర్వాతగానీ యం. యస్. యం. రైల్వే విజయనగర ప్రాంతానికి రాదు. తాను అగ్రహారపు బావి కప్పకూన. అయినా బొమ్మల్లో చూసిన రైళ్ళూ, ఓడలూ చిన్ననాడే మనస్సులో అచ్చుపడుతున్నాయి. "మా చిన్ననాడు మాంచస్టరు బట్టల కుండే రెయిలు, స్టీమరు బొమ్మలు చూడడం, అదొక సరదా."6

గులివిందాడ నుంచి ఏనుగుల వలసకు స్నేహితులతోనో, పాలేళ్ళతోనో కలిసిపోవడం, ఈ గురజాడ 'వెంకటేశం' నిత్యకృత్యాలలో ఒకటై పోయింది. పనిపాట్లు చూస్తూ కాస్సేపు, వాకతుప్పలలో అడివి పళ్ళు ఏరితింటూ కాస్సేపు మరేదీ తోచకుంటే తలెత్తి మింటికి కళ్ళప్పగించి 'పెద్దమ్మ ఆరబోసిన రంగులు' తిలకిస్తూ విస్మయానందాల ననుభవించేవాడు. పెద్దలతో చెప్పిచేస్తే ఏ పని తప్పు కాబోదు, శిక్ష పడబోదు. చెప్పిచెయ్యని మంచి పనికూడా పెద్దవాళ్ళ దృష్టిలో తప్పే. దండన లేకుంటే, తప్పు తప్పనే విషయం పిల్లలకు తెలిసిరాదు : "పిల్లలు కనిపించక పోయేసరికి తల్లిదండ్రులు కంగారు పడతారు. దిగులు పడతారు. భయపడతారు. అటు యిటు పరుగులు పెడతారు. తీరా కనిపించేసరికి పిల్లలమీద మండిపడతారు"– బుద్ధిమంతుడై ఇరవై నాలుగ్గంటలూ పెద్దలు గీచిన గిరిలోనే ఉండే పిల్లాడి మాటలు కావివి. భయంలేకపోతే పెద్దలు పెద్దలే కారు. భయముంటే పిల్లలు పిల్లలేకారు.

వీధి భాగవతాల లాంటి వెన్నో వినోదాలు. అందులో తోలు బొమ్మలాట, గురజాడ అప్పారావనే వ్యక్తిని మహనీయుణ్ణి చేసిన ఎన్నో అంశాలలో చాలా ముఖ్యమైనటిది. ఎవరాడిస్తే మొదట చూశాడోగాని, తాటాకులతో తానే చిన్ని బొమ్మల్ని చేసి కీళ్ళవద్ద తుమ్మముళ్ళు గుచ్చి పిల్లల్ని పోగుచేసి బొమ్మలను ఆడించ నేర్చుకొన్నాడు. పెద్ద పెరిగాక, తొలినాటి ఆట పాటలు గుర్తురాగా, ఆయన మనస్సులో మెరుపులాంటి భావమొకటి తటిల్మని మెరిసింది. మెరిసింది మరి మాసిపోలేదు. బొమ్మలాట కీలకం తనకు గొప్ప తత్వాన్నే నేర్పింది. చీకట్లో తోలు

బొమ్మలకు విడి విడి అందచందాలెలా ఉంటాయి? అంతా "ఏకనలుపే". అసూయలో కూడా మనుషుల సొగసులు విడి విడిగా గానీ సమిష్టి మీదగానీ కానరావు. అలాగాక, తోలుబొమ్మల మీదికి వెలుతుర్నీ, మనుషులమీదకి ప్రేమనూ మళ్ళించి చూశావో, అంతవరకూ దాగిలేనట్లేవున్న ఎక్కడెక్కడి సొగసులూ ఒక్కుమ్మడిగా బయల్పడగలవు. బొమ్మలు ఒక్కొక్కటీ ఒక్కొక్క వ్యక్తి. ఒకటి మరోదానిలా గుండదు. దేనిఅందం దానిదే. వెనకటికి ప్రపంచాన్ని నాటకరంగస్థలాలతోటి, జీవులను నాటకపాత్రలతోటి, జననమరణాలను ప్రవేశ నిష్క్రమణలతోటి పోల్చి షేక్స్పియరు మహాకవి చెప్పాడు. అప్పారావు తత్వందానికంటే భిన్నమైనది. ఇంకా అర్థవంతమైనది కూడా. లోకంగురించి విస్పృహ కిందులో తావులేదు. ఐహిక జీవనానందాన్ని తగ్గించివేసేమాట కలికానికికూడా కానరాదు. 'తత్వాలు' చెప్పేవారి చేతికోబడి వుంటే, జీవితపు క్షణభంగురత్వాన్నీ, ప్రపంచపు మాయామయత్వాన్నీ చాటటానికి పనికివచ్చేదే, అప్పారావుచేతిలోబడి చక్కదేరింది.

ప్రకృతితో సరిపోల్చడానికి లోకంలోని పుస్తకా లన్నీకూడా చాలవు. అంతటి పెద్దపుస్తకమూలేదు. చదివితే అంతగా తనివి తీర్చేదీ లేదు. అద్దాలవంటి వాగులు చెప్పే సుద్దులూ రాక్షస వధూవరులు పోసుకున్న తలంబ్రాలవంటి రాయి రప్పలు విప్పే చిక్కుముడులూ ఏ గ్రంథమూ చెప్పదు, విప్పదు. రాసిపెట్టని, ఎవరూ కట్టివుంచని ఆ ఉద్గ్రంథాన్ని చదవటానికి చిననాటి నుంచిగూడా అలవాటు పడ్డాడు అప్పారావు. ప్రకృతి అంటే వాగులూ వంకలూ చుక్కలూ నేలమీది మొక్కలూ మట్టుకే అయితే, ఆయన ప్రకృతి కవిమాత్రమే అయిఉండేవాడు. ప్రకృతిదృశ్యాలు ఆయన కావ్యాలలో ఇతర రచనలలో ఎంతో కమనీయంగా కనుపించినా, ఆయన గురి మనిషిపైనే. మరి మనిషంటే ప్రకృతికి శిశువు. ఆ మనిషి హిమప్రవాహంలో తేలుతూపోయే పెద్ద మంచుగుట్టలాంటివాడు. పైన ఎంతో, లోన అంతకంతగా తన మనుష్యత్వాన్ని వ్యాపింపజేసుకున్నాడు. కాబట్టి మనుషుల వేషభాషల్నీ మనస్సుల వేలగోప్యాల్నీ అప్పారావు గమనిస్తూవచ్చాడు. పరిశీలన చేయనివాడు, విమర్శచెయ్యలేడు. జీవిత పరిశీలకుడూ, విమర్శకుడూ అయ్యాడంటే, అప్పారావు స్వభావమే అందుకు అనుకూలించింది.

ఐదేళ్ళ ప్రాయాన్నే అప్పారా వింత బుద్ధిమంతు డయ్యాడని కాదు, అయేసూచనలు అప్పుడే మొదలయ్యాయనేందుకే, భిన్నదశల్లోని విషయాలను ఇక్కడ గుదిగుచ్చవలసి వచ్చింది.

కాలక్రమాన్ని పాటించవలసి వస్తే, ఐదో ఏట అప్పారావు అక్షరాభ్యాసంతో మొదలెట్టాలి. అప్పటికి వెంకటరామదాసు స్థితి మరింత మెరుగైంది. చీపురుపల్లిలో వేషాక్రారు. అందువేత కుమారుడి చదువుకు మునుపులేని వీళ్ళు ఇప్పుడు కలిగాయి. వెలివల రామమూర్తి అనే స్కూళ్ళ ఇనస్పెక్టరు ధర్మమా అని, అప్పారావు చదువొక దారిని పడింది. చీపురుపల్లి గ్రాంటు స్కూల్లో పేరుకు మాత్రం, రామమూర్తివద్ద నిజంగానూ ఈ చదువు సాగింది. "కోటపేజల నేలగలరవి" బిడ్డల సుఖాన్నికోరి ఇంగిలీషులు చెప్పించేందుకు తల్లితండ్రులు తంటా లెన్నడన గానో మొదలై ఉన్నాయప్పటికే. "పొట్టకూటికి నేర్చువిద్యలు" మాత్రమే కావచ్చు గాక, కుల విద్యలు కుప్పకూలిపోయిన కాలాన, రాబడి పాటికి రాబడీ పలుకుబడి పాటకి పలుకుబడీ ఇంగ్లీషు చదువులు చేకూర్చే సర్కారు ఉద్యోగాలద్వారానే లభిస్తాయి. 'కన్యాశుల్కం' నాటకంలో కిరటకశాస్త్రి శిష్యుడు కాళిదాసు 'మేఘసందేశం' పనికిరాదంటూ ఇంగ్లీషు మహిమను వర్ణించిన ఘట్టమూ, అగ్నిహోత్రావధాన్లలాంటి నైష్ఠికుడుకూడా తన సుపుత్రుణ్ణి మాల చదువులకోసం విజయనగరానికి పంపించిన వైనమూ – దీన్నే తెలియజేస్తాయి. సంప్రదాయపు "పుట్టకీట్లు" కదిలి పోసాగిన ఈ తాకిడిని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఇలా వర్ణించి పోయాడు :

వెయ్యేళ్ళ మహమ్మదీయుల పరిపాలన తెచ్చిపెట్టలేని మార్పులు తెచ్చి పెట్టింది, నూటయాభై సంవత్సరాల క్రైస్తవ పరిపాలన, మనలో.

చాలామంది విద్యాధికులను తన వలయంలోకి తీసుకోలేక పోయినా, బ్రహ్మసమాజం, ఆర్యసమాజం వంటి కొత్త సంప్రదాయాలు ప్రారంభించే టట్టయినా చేసింది క్రైస్తవమతం.

కళ్ళకు వెలుగిచ్చి కొత్తబాటలు కనపర్చి దృక్పథమే మార్చేసింది, ఇంగ్లీషు వాఙ్మయం మనకు.

వైదిక విద్యలు నేర్చి స్వధర్మనిష్ఠులయి వుండిన వారినికూడా తమ కుమాళ్ళను ఇంగ్లీషు చదువులో ప్రవేశపెట్టేటట్టు చేసింది ఉద్యోగ వ్యామోహం.

'వీరి కధికారం వుంది, వీరికి లేదు' అనకుండా అష్టాదశవర్ణాల వారికీ పఠన పాఠనావకాశాలు కల్పించింది రాజ్యాంగం.

దీంతో మన ధర్మసౌధం పునాదులకంటా కూలిపోయింది." 7

వీధి బడులూ గుంటఓనమాలూ సంతచెప్పడాలూ బాలరామాయణ అమర కోశ సుమతీ శతక పఠనలూ చిన్నపిల్లల పెద్ద బాలశిక్షలూ ఎక్కాల రాగపఠనలూ

గుణింతాల మండూక నాదాలూ ఆటవిడుపు పద్యాలూ దసరా బుల్లోడి వేషాలూ— అప్పటికెప్పుడో కనుమరుగయ్యాయి. ఇంగ్లీషు పరీక్షలిచ్చే యఫ్. ఏ. బి. ఏ డిగ్రీలు మనుషుల ఇంటి పేర్లౌతున్నాయి. మిడిల్‌స్కూలు ఉట్టికెక్కి పెద్ద ఉద్యోగాల స్వర్గాలకు నిచ్చెనలు వేస్తున్నారు. చదువులంటే ఇంగ్లీషు చదువులే అని అర్థాలు. విద్యాధర్మాలకు ధనార్జనే కొలబద్ద. టంగుటూరి ప్రకాశం మాటల్లో, "జనం ఇంగ్లీషు చదువులకి తియ్యనీటికి చేపలెక్కినట్లు ఎక్కారు." ఎక్కడం కాదది, ఎగబడడమే అయింది. ప్రతి మబ్బుకీ జరీ అంచు ఉంటుంది గదా, ఇంగ్లీషు చదువుల్లో కూడా ఉత్తమ ప్రయోజనాలు లేకపోలేదు. కొందరికైనా అది "కన్నుకానని వస్తుతత్వము" తెలియ జెప్పాయి. అనేకులకు మాత్రం నెత్తిమీద కళ్ళు మొలిపించాయి; గీర్వాణపు గీరను తలదన్నే భేషజాన్ని ఒంటబట్టించాయి. ఈ ఇంగ్లీషు చదువులన్నీ నిజానికి దేశపునరుజ్జీవనానికే నిర్దిష్టమై ఉంటే, శాస్త్ర విషయబోధనకు ప్రాముఖ్యం ఇచ్చే ఉండవలసింది. అలాగాక ఇది వట్టి "సాహిత్య విద్య" అయిపోయింది. దేశభాషల పునర్నవానికీ నూత్న సాహిత్య ప్రక్రియల ప్రాదుర్భావానికీ మాత్రమేగాక, స్వాతంత్ర్యభావ ప్రచారానికి గూడా ఇంగ్లీషు సాహిత్య పఠనం పనికి రాకపోలేదు. ఈ కొత్త గాలుల దిగుబడిలో చీపురుపల్లి గ్రాంటుబడిలో అప్పారావు మొదటి మూడు తరగతులు దాటి వచ్చాడు. ఆ మూడవ తరగతి నేటి ఫస్ట్ ఫారానికి సమానమైనది. అప్పటికి అతనికి పదేళ్ళ వయస్సు. పైనే చెప్పినట్టు ఒడుగు ఎనిమిదో ఏట జరిగింది.

ఉపనయనంలో "చౌలం" పద్ధతి ప్రకారం, మాతామహుడు మనవడికి సన్నబంగారపు కాడలతో చెవులు కుట్టించాడు. ఆ కుట్టుపోగులు ఆ మరణాంతమూ అప్పారావు చెవులను వదల్లేదు. చెవులు పెద్దవై పోగులలాగే ఉండి చిన్నవనిపించసాగాక, చక్రవర్తుల తాతాచార్యులనే మిత్రుడు అప్పారావును గేలిచేశాడు. సూట్‌బూట్ వేషానికీ చెవిపోగులకీ పొత్తు కుదరదని తెలిసినా, తాత మీది గురికొద్దీ వాటిని నసేమిరా తీసివెయ్యనని అప్పారావు భీష్మించాడు.

బహుశా ఆ ఉపనయన సందర్భంలోనే మాతామహుల ఊరు రాయవరానికి తలిదండ్రులతోటీ నాలుగేళ్ళ తమ్ముడు శ్యామలరావుతోటి వచ్చినప్పుడు, ఈ కింది సంఘటన జరిగింది. జిల్లామున్సబుకోర్టు ఆవరణలో అతని భవితవ్యం వచ్చి పరాచికాలాడి వెళ్ళింది.

....ఎండజోరు తగ్గాక, ఇంటినుంచి తాతయ్యకోసమని 'టిఫిన్' తీసుకు వచ్చి ఆయనకిచ్చి కోర్టు ఆవరణలో చీకటిపడేవరకు పిల్లలాడుకొంటున్నారు.

పనిముగించుకు మున్సబుగారు వెళ్ళిపొయ్యారులెమ్మని వాళ్ళధీమా. తమలోతమకు ఒక విషయమై పోటీపడింది. చదువూగిదువూ అయ్యాక ఎవరే ఉద్యోగం వెలగబెడతారో ఒకరినొకరు అడిగి తెలుసుకొని సంబరపడుతున్నారు. అందరూ నోరువిప్పి చెప్పారు. అందరిలాంటివాడు కాదలుచుకోనట్టు, కొంచెం చూపులతో సరాసరి మున్సబుగారి గదితలుపులవద్దకు నడిచివెళ్ళి, జేబులోంచి సుద్దముక్క తీసి మహాదర్జాగా ఆ తలుపులమీద తన భవిష్యత్తును అక్షరాలలో విస్తరించి ఇలా నిర్వర్ణించాడు అప్పారావు:

G. V. APPA ROW, B, A. B. L;
DISTRICT MUNSIFF.

అతని ధీమాచూసి మిగతాపిల్లలు తోకముడిచారు. చీకటిపడిందింతలో. ఇళ్ళకువెళ్ళి బువ్వదిని బజ్జున్నారు. తెల్లారింది. పొద్దెక్కింది. కోర్టుపెట్టింది. మున్సబుగారు మదేభయానంతో వస్తున్నారు. తమగది సమీపించారు. గది తలుపులమీద తమ పోటీదారు తిష్ఠవేసుక్కూచుని ఉన్నాడు. ఎవడీ అప్పారావు ?? పట్టి అల్లాటప్పారావు లాగున్నాడే ! ఎవడితగాడు ? సిరద్దారును పిలిచి గద్దించారు. కృష్ణయ్యపంతులు గొంతులో వెలగపండు, ఎల్లాగో మాటలు పెకల్చుకొని ఆ అల్లరి పిల్లడు మరెవడోకాదు, తన మనవడే అని బెరుగ్గా చెప్పాడు. మున్సబుగారి 'ఉగ్రం' నవ్వుగా మారింది. సాయంకాలం ఆ కక్షిదారుణ్ణి తమముందు హాజరు పెట్టవలసిందన్నారు. వచ్చాడు అబ్బాయి, భయపడిన లక్షణాలే కన్పించడంలేదు. చిలిపితనంతో కళ్లు మిలమిల్లాడుతున్నాయి. అడిగిన ప్రశ్నకు నదురుబెదురు లేని జవాబు. తానలా ఎందువల్లరాయవలసి వచ్చిందీ వివరాలతో సహా వాఙ్మూలం ఇచ్చాడు. బాగుంది గాని, తలుపుమీద గాక గోడ మీద రాయగూడదూ ? గోడ తెల్లటిది ; సుద్దా తెల్లటిదే ; కాబట్టి అసలే తెల్లటి దానిమీద కొత్తగా తెల్లటి దానితో రాయడమెల్లా ? బొగ్గుముక్క ఉంటే సరే గాని, ఉన్నదల్లా సుద్దేనాయిరి. మున్సబుగారు నిరుత్తరులయ్యారు. ఎనిమిదేళ్ళవాడి పాటి సూక్ష్మం తనకు లేకపోయింది. పిల్లాడు ఘటికుడు ; వృద్ధికి వస్తాడు. జిల్లా మున్సబు కావడమేం ఖర్మ ? హైకోర్టు జడ్జీ కాగలడు. మున్సబుగారు అంతమాటా అనేశారు కూడా. సిరద్దారు కృష్ణయ్య పంతులు నెరసిన మీసకట్టులో నవ్వు తొంగి చూసింది. అప్పారావు పని అందలమెక్కినంత ?....

ఇల్లు కూడా అలక్కముందే ఏం పండుగ ? ఉంటే, ముసళ్ళ పండుగే ముందున్నది. తాను పేద బ్రాహ్మణ విద్యార్థి. పై చదువులంటే మాటలా ?

ఒకే ఒక వ్యక్తి రెక్కలమీద కుటుంబమంతా ఆధారపడినప్పుడు కలిగే బాధలు మిక్కుటము. తెలివితేటలు వుండి ముందు ముందు రాణించవలసిన యువకులు, డబ్బులేనందువల్లనో, మరెందుచేతనో చదువు మానుకుంటున్నారు. ఆ రోజులలో డబ్బులేక పోవడమువల్ల చిక్కులు తటస్థించినవి.[8]

చీపురుపల్లి గ్రాంటు స్కూలులో నేర్వదగినదంతా నేర్చాడు. మరి చదవాలంటే దూరాభారం పోవాలి. విజయనగర మంటే మాటలుకాదు. బోలెడు ఖర్చు. ఏం చెయ్యడం ? వెంకటరామదాసు సమస్యలకు కొడుకు చదువు సమస్య తోడై వచ్చింది. సంస్థానం దివాను పెనుమెత్స జగన్నాథరాజు శరణాగత రక్షకుడో కాదో గాని ఆర్తత్రాణపరాయణుడే – సంస్థానం ఉద్యోగుల బిడ్డల చదువు సంధ్యల మేరకైనా అర్థిజన కల్పశాఖే. అగ్రహారాన నూతిలో పుట్టి చీపురుపల్లి మడుగున పెరిగి చివరకు విజయనగరం తటాకాన పడింది కప్పపిల్ల.

పల్లెటూళ్ళతో పదేళ్ల మాత్రమే సాగిన ఈ పరిచయం, అప్పారావు మనస్సును అవసానకాలంవరకూ ఏలింది. నగరజీవనపు నాగరికతకు ఆయన తెలుగు అక్షరలోకంలో తొలిచోటు కల్పించి పల్లెపట్టు ఆచారవ్యవహారాలనూ భల్లూకపట్లనూ నాటకాలకెక్కించి ఏడ్పించినా, ఆ సరళజీవనాన్ని అచ్చ ప్రకృతినీ ఈసడించాడన వీల్లేదు. వెలుగు నీడలు మెలిగి చెలిగే ఆకాశాన మబ్బు అంచులను ఉద్దీపింపజేసే రత్నకాంతులేనా, తూర్పుకొండకు గొడుగులెత్తే తాటితోపులేనా, బుజానకవాటికడవను వాటంగాపెట్టి చెట్టుచేమలుతోటి చెవులువిప్పి విని సొక్కేంతటి తీయని పాటలు పాడుతూపోయో పాటలాధరులేనా, ఇవన్నీ దాని దాఖలాలే. మనవాళ్ళయ్యలూ, నాంచారమ్మలూ, శాస్తుళ్లూ పంతుళ్లూ, అచ్చమ్మలూ బుచ్చమ్మలూ, పరమ అమాయకత్వాలూ పరమ విశృంఖల వర్తనలూ, గొంతెమ్మకోరికలూ దుఃఖాలూ, ఇన్నీ గ్రామాల నుంచి అప్పారావు మనస్సుకెక్కి మళ్ళీ పుస్తకాలకు దిగివచ్చాయి. వేదం వేంకటరాయశాస్త్రి కూడా విశాఖ మండలంలో బాల్యాన్ని గడిపి, తన దృష్టి పరిధిలోకివచ్చిన విలక్షణవ్యక్తులనూ విచిత్ర విషయాలనూ నాటకాలకెక్కించాడు. విశాఖపట్నంలోని సారా దుకాణాదారు బొడ్మిన్, ఓడల వ్యాపారంలో నష్టపోయి కాశీకి వెళ్ళిన ఘనపాండావాళ్లు, చోడవరం తాలూకా స్కూలుబంట్రోతు పేరిగాడు–వా స్తవజీవితం సాహిత్యానికందించిన వ్యక్తులే. పేరిగాడూ అసిరిగాడూ ఇలా అన్నదమ్ములే. పైగా గ్రామ్యభేదాలన్నింటిని బాల్యమాదిగా కనిపెడుతూ 'పాత్రోచిత భాష'కు సామాగ్రిని సేకరించుకొన్న శాస్త్రిగారికీ, 'గ్రామ్య' భేదాలను అతి మెళకువతో ఆయాస్థితులకు తగినట్లుగా అన్నిపాత్రలకూ పెట్టి వాడుకభాషకు సాహిత్య గౌరవాన్ని కల్పించిన అప్పారావుకూ పోలికవుంది. శాస్త్రిగారిని అప్పారావు మెచ్చుకొన్న కారణాలలో ఇదీ ఒకటి. [9]

# 3

విజయనగరాన్ని అప్పారావు తొలిసారి దర్శించేనాటికి ఆతనికేమో పదేళ్ళ వయస్సు; అప్పారావు ముఖాన్ని విజయనగరం తొలిసారిచూసేనాటికి దానికి రమారమి నూటయాభై ఏళ్ళ వయస్సు. (పెదవిజయరాముడు పొట్నూరినుంచి తన రాజధానిని మార్చుకుంటూ 1712 లో విజయనగరానికి శంకుస్థాపన చేసినట్లు అడిదము రామారావు రాశాడు.)

విజయ నగరంలో 'జిల్లాస్కూలు' అంటూ ఒక ఆంగ్ల పాఠశాలను విజయరామగజపతి ఎన్నడనగానో స్థాపించాడు * "సిపాయీ పితూరీ" సాగిన ఏనాడే ఆ మాధ్యమిక పాఠశాల ఏర్పడి ఏదేనిమిదేళ్ళలో ఉన్నత పాఠశాల కాగలిగింది. కాబట్టి మెట్రిక్యులేషను వరకు ఏ ఢోకాలేకుండా ఇక్కడే చదువుకోవచ్చు. విజయరామ గజపతి బారుబుద్ధిగల ప్రభువు. వేద సంస్కృత పాఠశాలలుకూడా నిర్వహించాడు. విశాఖపట్నం మొదలుకొని లండన్ వరకు గల ఎన్నో బస్తీలలో నగరాలలో ఆయన పేరుమీద సత్కార్యాలు జరిగాయి. రాజ్యానికి వచ్చిన ఇరవై ఏళ్ళకు 1868 లో "తక్కిన జమీందారులందరును జూచి నేర్చుకొను పటుల నన్ని విధములను తమ సమస్థానము ననుకూలముగ వ్యవహరించు చున్నారు" అని మెచ్చుతూ వైస్రాయి లార్డ్‌లారెన్సు (Lord Lawrence) విజయ రామునికి "మహారాజా" బిరుదిచ్చాడు. తాను రాజ్యానికి రాకముందే సంస్థానం తన పాత భూముల నెన్నటినో జారి విడుచుకొన్నా, పేష్కష్ ఇబ్బడి అయినా, అప్పులతో తన హయాము మొదలైనా, జగన్నాథరాజు దక్షత మూలంగా రాబడిని ఎన్నోరెట్లు ఎక్కువ చేసుకొని దానధర్మాలు జరపగలిగాడు. కీర్తికి పెంపు కలిగింది. ముడుంబై నరసింహాచార్యస్వామి, మండ కామేశ్వరశాస్త్రి, శ్రీపాద చలమయ్య ప్రభృతి

---

* విజయ రామ గజపతి స్థాపించిన మరొక పాఠశాల ఆంధ్ర దేశంలో తొట్టతొలి బాలికా పాఠశాల, స్థాపనకాలం 1869. ఆ సందర్భంలో లింగం లక్ష్మాజీ పంతులు చేసిన ఉపన్యాసాన్ని బట్టి, కాశీలో తప్ప తక్కిన ఏ భారత భూభాగంలోనూ ఇలాంటిది అప్పటికి లేదని, ఇలాంటి సంస్థల ద్వారా స్త్రీ పునర్వివాహం లాంటి సంస్కరణలకు గూడా దేశీయులు పూనుకోగలరని ఆశిస్తూ ఉండినట్లు తెలుస్తుంది. (నూట ఇరవై ఏళ్ళ వీరేశలింగం (వ్యా): డాక్టర్ పి. రమాపతిరావు, భారతి — ఏప్రిల్, 1968)

విద్వత్కవులు ఆశ్రితులు; ప్రసిద్ధ వైయాకరణులు పేరి వేంకటేశ్వరశాస్త్రి, భాగవతుల హరిశాస్త్రి ఆస్థానికులు. జగన్నాథ విలాసినీ సభకూ దివాన్‌గారికీ గల బాంధవ్య మేమిటో తెలియదు గాని అది సంస్కృత నాటకాలను ప్రయోగిస్తూ ఉండేది. పండితులు, భాషను మథిస్తూ వ్యాకృతిని వివరించి వ్యావహారిక భాషా వాదానికి ప్రాతిపదికను సమకూర్చారని డా. బుర్రా శేషగిరిరావు భోగట్టా. ఇలా విరబూయ సాగిన విద్యా పుష్పంవంటి విజయ నగరాన చదవరావడం ఎవరికైనా మహాభాగ్యమే. దానికి ప్రాచీనకాలపు ఏథెన్సుతోనే పోలిక. అది School of Hellas అయితే ఇది School of Telugus. గురజాడ అప్పారావు ప్రారంభ విద్య గురించి విశ్వసనీయమైన సమాచారం అట్టేలేదు. 1882 లో ఇరవయ్యేళ్ళ ప్రాయాన మెట్రిక్యులేషను పరీక్షలో కృతార్థుడైనట్లు కీ. శే. సూర్యారావు నిర్ధయించి వదిలాడు. తన కంటే ఏడాది చిన్నవాడైన గిడుగు వారబ్బాయి 1877 నుంచి 1880 వరకు తనతో కలిసి చదివి 1880 లోనే మెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గాడుకదా, అప్పారావు మరిరెండేళ్లు వెనుకబడటం ఎందువేత? అదే అంతుచిక్కని విషయం.

ప్రాథమిక మాధ్యమిక దశల్లో అప్పారావు విద్యార్థి జీవితం గురించి చాలినంత సమాచారం లేదని ఎవరికీ వగవ బనిలేదు; ఆయనకు ముందు వెనుకగా ఆ దశలు దాటివచ్చిన సమకాలిక ఆంధ్ర ప్రముఖుల జీవిత చరిత్రలు కావలసినంత సమాచారాన్ని ఇస్తాయి. ముఖ్యంగా టంగుటూరి ప్రకాశం, కొండ వెంకటప్పయ్య, చిలకమర్తి లక్ష్మీనరసింహం, రాయసం వేంకట శివుడుగార్లవి.

చిలకమర్తి తన పదకొండవ ఏట సర్కారు బడి మొదటి తరగతిలో చేరాడు. అంతక్రితం ఐదేళ్ళ వీధిబడిలోనూ, గ్రాంటు స్కూలులోనూ అప్పారావులాగే చదివి వచ్చాడు. అప్పటి మూడవతరగతీ ఇప్పటి ఫస్టుఫారమూ ఒకే లాంటివి. ఈ తరగతిలో రాయల్ క్లాసు బుక్ ఇంగ్లీషు పాఠ్యపుస్తకం. దీనిలో సగం మూడవతరగతికీ, తతిమ్మానగం పైతరగతికి బోధించే వాళ్ళు. ఇంగ్లీషు వ్యాకరణం కూడా ఉండేది. లెక్కలు సరేసరి. మిడిల్‌స్కూలుకే లెక్కలు చాలా వుండేవని ప్రకాశం రాశాడు. ఇంగ్లీషు 'ప్రాక్టీస్' లెక్కల్లాగా 'వెరసులు' వేయవలసి వచ్చేదని వెంకటప్పయ్య రాశాడు. ప్రభుత్వ విద్యాశాఖ వాళ్ళే పుస్తకాలను అచ్చువేయిస్తూ వచ్చారు. మెడ్రాస్ రీడర్ అనేది ఇలాంటిదే. చెన్నపుర రాష్ట్ర భూగోళము, హిందూదేశ చరిత్ర పఠనీయాలుగా ఉండేవి.

మూడవతరగతి తర్వాత, సర్కారుబడి అయితే ఫోర్తు, అప్పర్ ఫోర్తు క్లాసులు, మామూలు బడిలో లోవర్ ఫోర్తు, అప్పర్ ఫోర్తు, ఐదవతరగతి మెట్రిక్యులేషను ఉండేవని ప్రకాశం అంటాడు. అప్పర్ ఫోర్తు చివర మిడిల్‌స్కూలు పరీక్ష ఉండేదట. అలాగే లోవర్ ఫోర్తు తర్వాతగూడా ఒక పరీక్ష. ఇలా [illegible]తే అన్నిచోట్ల జల్లెడ పట్టేవాళ్ళు. ఇంతకంటె నికరమైన సమాచారం చిలకమర్తి స్వీయచరిత్రము ఇస్తుంది: లోవర్ ఫోర్తులో చేరేనాటికి అయి[illegible]ద్వాదశ[illegible]వాడు. అప్పటిదాకా దేశచరిత్ర భూగోళం గణితం తెలుగులోనే నేర్పుతూ వచ్చి అప్పటి నుంచి తెలుగు వాచకాలు మినహా అన్ని విషయాలనూ ఇంగ్లీషులో చెప్పే వాళ్ళు. లోవర్ ఫోర్తులో మోరల్ క్లాస్‌పుస్తకం, మాన్యూల్ గ్రామరు, హిందూదేశ ఇంగ్లాండుదేశ చరిత్రలు, ఆసియాఖండ హిందూదేశ భూగోళాలు, యూక్లిడ్ రేఖాగణితంలో పదహారు "ప్రపోజిషను" లుండేవి. తెలుగులో భారతంలోని నలోపాఖ్యానం చదివి అప్పగించాల్సి వచ్చేది. అప్పటికే రెంటాల వెంకటసుబ్బారావు రాసిన 'మేడీజీ' (Made Easy) పుస్తకాలు వ్యాప్తిలో ఉండేవి. కన్యాశుల్కం ప్రారంభంలోనే ఈ విషయం ప్రసక్తికి వచ్చిందిగూడా.

లోయరుఫోర్తు తరగతికి 'కంపేరిటివ్ ఎగ్జామినేషన్' పెట్టింది 1881 లోనే కాబట్టి ఈ బెడద అప్పారావుకు మాత్రం తప్పింది. అప్పర్ ఫోర్తు విద్యార్థిమాత్రం మిడిల్‌స్కూలు పరీక్ష ఇవ్వాలి. నెలకు ఒక్కరూపాయి బడిజీతమైతే, పరీక్షరుసుము మూడు. డిసెంబరు మొదటివారంలో పరీక్ష అయ్యాక విద్యాసంవత్సరం మొదలయేది * మూడురోజులపాటు జరిగే ఈ పరీక్ష ఫలితాలు రెండుమూడు నెలలదాకాగాని తెలిసేవికావు. అవి మూడు శ్రేణులుగా ఉండేవి: "ఆ పరీక్ష మొదటి తరగతిలో కృతార్థులైన వారికి గవర్నమెంటు కొలువులో నేదైన నుద్యోగ మియ్యవచ్చుననియు, రెండవ తరగతిలో కృతార్థులైన వారికి బోర్డులో నుద్యోగమియ్య వచ్చుననియు, మూడవ తరగతిలో కృతార్థులైన వారిని పైతరగతిలో చేరవచ్చుననియు నిబంధన యుండెను. ఈ మూడు రకములుగాక పైతరగతిలో వేయుటకు తగిన వారని (Fit for promotion) యింకొక రకముగూడ నుండెడిది. ఈపరీక్ష 1878 మొదలు కొని 1890 వరకు నుండెడిది. 1891 వ సంవత్సరమునుండి దానిస్థానమందు లోవరు సెకండరీ పరీక్ష నెలకొల్పబడినది." 10

ఇక ఐదవ తరగతి, మెట్రిక్యులేషను తరగతికి కింది మెట్టు అయినా ఆ పరీక్షకు ఇప్పటినుంచి శిక్షణ ఇచ్చేవాళ్ళు. మెట్రిక్యులేషను క్లాసులో 36 రూపాయలు

* కన్యాశుల్కంలో వెంకటేశం క్రిస్‌మస్ శెలవుల తర్వాత అగ్రహారం వెళ్ళిపోయింది ఇందుచేతనేనని కేతవరపు రామకోటిశాస్త్రి వంటి విమర్శకులు గమనిస్తే బాగుండేది.

జీతం చెల్లించవలసి వచ్చేది.* ఆ పరీక్ష డిసెంబరు 15 నుంచి ఐదురోజుల పాటు జరిగేది. ఇంగ్లీషులోనూ తెలుగులోనూ 'పాసుమార్కు' 33. గణితానికి సంబంధించిన మూడు విషయాలలోనూ కలిపి, అలాగే చరిత్ర భూగోళాలకు కలిపి నాల్గవ భాగం మార్కులు వస్తేనే 'పాసు.' అంతేకాదు. మొత్తం మార్కులలో కనీసం మూడో వంతురావాలి.

మెట్రిక్యులేషను పరీక్షలో తప్ప తక్కిన ఏ పరీక్షలోనూ తప్పని చిలకమర్తి లక్ష్మీనరసింహం ఇరవయ్యేళ్ళ ప్రాయానగాని ఆపరీక్షలో కడదేరలేదు. అప్పారావు చదువు ఒక కొలిక్కి వచ్చేసరికి దాదాపు అంత ప్రాయమూ వచ్చిఉంటుందని సమాధాన పెట్టుకోవాలి. వీరేశలింగంకూడా అంతే.

విజయనగరంలో అప్పారావు తొలిరోజుల గురించి కథాప్రాయంగానైనా కొంత సమాచారం అందుతున్నది. పెనుమత్స జగన్నాథరాజు పుణ్యమా అని, బడి జీతాలు కట్టేపని తనకు లేకపోయింది. బంధుగులెవరో ఇంతవండి పడేస్తున్నారు. ఆంతలో తన మేనబావ గొడవర్తి పాపయ్యకూడా పైచదువులకు రావడంతో ఒంటరితనం వదిలింది. ఇతర స్నేహితుల పేర్లు కొన్ని వసంతరావు బ్రహ్మాజీరావుగారి జాగ్రత్తవల్ల బయల్పడ్డాయి.[11] షరాఫ్‌ఖానా వెంకటకృష్ణరావు మంచిబలశాలి, భల్లూకప్పట్టు మనిషి. తన దేహ దారుఢ్యమూ అప్పారావు బుద్ధి సూక్ష్మత్వమూ జత గలిసినట్లయితే మల్లయోధులను గెలుచుకు రావచ్చుని పగ్గెలు పలికేవాడు. తెన్నేటి సాంబయ్య బొబ్బిలిపాట తెగపాడేవాడు. మేడేపల్లి వేంకటరమణాచార్యులు శ్రద్ధగా చదువుకొంటూ చిన్నప్పటినుంచి బుద్ధిమంతుడనిపించుకొన్న 'గుడ్బాయ్'.

అప్పారావుకు వీళ్ళందరూ కలిసి ఎంతో, గిడుగు రామమూర్తి నామధేయుడైన గడుగ్గాయి ఒక్కడూ అంత. పర్వతాలపేటలో పుట్టి పెరిగాడు. తండ్రి వీర్రాజు విజయనగర సంస్థానంలో సముద్దారు, అందే రివెన్యూ ఇనస్పెక్టరు. ఉద్యోగం చేస్తూచేస్తూ ఉచ్చదశలో గతించాడు. అప్పటికి రామమూర్తికి పద్నాలుగేళ్ళే. అంతకు ముందునుంచీ అప్పారావుతోటి దోస్తీ ఉండేది. తండ్రి చోడవరంలో చనిపోయారనే కబురుతెలిసినప్పుడు, కంటికి కడివెడుగా దుఃఖించ సాగిన రామమూర్తికి పొడిమాటలతో ఓదార్పు చెప్పక, తానూ ఏడవసాగాడు అప్పారావు. అదే రామమూర్తికి నిజమైన ఊరట.[12 A] కొత్తగా వచ్చిన లేమిడి కారణంగా

---

* 1882 వ సంవత్సరపు మెట్రిక్యులేషను తెలుగు పొయిట్రీ పుస్తకమొకటి నాకు లభించింది. అందులో భర్తృహరి నీతిశతకం, హరిశ్చంద్రోపాఖ్యానం, ఉన్నాయి.

బడి చదువు రెండేళ్ళపాటు ఆగిపోయినా 1877 నుంచి మోచెర్ల అప్పారావుతో కలిసి బడిలో చదువుకొనే అవకాశం మళ్ళీ రామమూర్తికి కలిగింది. రామమూర్తికి ఆనాటికి ఇంకా చాదస్తాలుండేవి. ఒకరోజున మిగతా పిల్లలతోపాటు రామమూర్తి కూడా మరో అబ్బాయికి బాగా దూరంగా జరిగి అతని గాలి కూడా సోకకుండా మెలగడం చూశాడు అప్పారావు. ఆ అబ్బాయి "మైల"ట. ఎవరో ఎక్కడో ఏదో అయితే దానితో ఏ సంబంధమూ నిజంగా లేని మరొకడు "మైల" పడతాడా? దేహానికి మైలేమిటి? ఈ ప్రశ్నలు గుప్పించి రామమూర్తి మనస్సు మార్చాడు.

అగ్నికి వాయువు తోడైనట్లుగా గిడుగు రామమూర్తి ద్వితీయుడై అల్లరికి పెట్టింది పేరయ్యాడు బడిలోనూ బయటనూ అప్పారావు. పంతుళ్ళను ఏడిపించని కుర్రాడు గొప్పవాడు కాదేమో నన్నట్టుగా పెన్సిలు తోటి పంతుళ్ళ వ్యంగచిత్రాలు కలం తోటి తమాషా పాటలూ వెలువరించాడు. బెత్తం దెబ్బలతోటి కూడా, పోయిన బుద్ధి మరలి వచ్చింది కాదని [illegible]లో తానే రాసుకొన్నాడు.

....ఒక రోజున ఏం జరిగిందో ఏమో పంతులుగారు ఈ ఇద్దరినీ బాగా కోప్పడి జుట్లుముడివేసి బెంచీకి అటొకర్నీ ఇటొకర్నీగా కూచోబెట్టారు. ఆయనకు పాపం, నసాళందాకా నస్యం ఘాటు ఉంటుందే మరో పని ఏదీ జరగదు. ఒక పట్టు ముక్కుపొడుం కోసమని గది దాటి వెళ్ళాడో లేదో, ఈ తుంటరి జంట జుట్టుముడి విప్పించుకొని బయటికి ఉడాయించారు. 'నల' నాటకంలో వేషాలు కట్టి మెప్పుతోగూడిన చప్పట్లు కొట్టించు కొన్నవాళ్ళేమరి! పరీక్షల్లో నువ్వా నేనా అంటూ పోటీబడి మార్కులు తెచ్చుకొనే బమాబట్టీలున్నూ వీళ్ళే. 'జి. వి.' అనే పొడి ఇంగ్లీషు అక్షరాలు ఉభయసామాన్యాలు కావడం, తరవాత చాలా ఏళ్ళకు 'గ్రామ్యవాది' అనే ఆక్షేపణలకు వీలు కల్పించినా, ఆ తొలి దినాళ్ళలో తెలివితేటల కెంతో అల్లరిచేష్టలకంతగా మారుపేర్లయ్యాయి. కాలం కత్తి అయి వాళ్ళ స్నేహానుబంధాన్ని తెంచాక కూడా సాహిత్య చరిత్రలో జంటగానే వాళ్లు కలిసి జీవిస్తున్నారు—కృష్ణార్జునులకు తాజా నకలు....

మీ పేరేమిటి? కథలో వెంకయ్య పాత్రకు గొడవర్తి పాపయ్య, రామమూర్తి పాత్రకు గిడుగువాళ్ళబ్బాయి పనికివచ్చినట్లు వసంతరావు బ్రహ్మాజీ రావుగారి భోగట్టా. కథలోకూడా రామమూర్తి "శతపెంకె". [illegible]

సంగ్రహాయు, బుద్ధచరిత్రము అతనికి కొట్టినపిండి. ఇక ఆ వెంకయ్య వచ్చి నిరీశ్వరవాది ; గురువుగారి మాటల్లో "ఒట్టి కిరస్తాను."

....రామమూర్తిని వీలుదొరికినప్పుడెల్లా వెర్రివెంగళాయనుజేసి ఆనందించడం నిత్యకృత్యమై ఒకరోజున చెరువు మెట్లదాకా షికారు వెళ్ళి అప్పారావొక పందెం వేశాడు. మేఘమల్లార రాగమాలాపించి వాన కురిపిస్తాట. అది వర్షాకాలం. మబ్బులు కూడుతూ వీడుతూ వున్నాయి. గొంతు సవరించిన అప్పారావుకే ఆశ్చర్యం కలిగేట్టుగా చినుకులు పడజొచ్చాయి. ఇకనేం? తాను తాన్ సేన్ అయిపోయాడు. మరో రోజునమాత్రం మంత్రం పారలేదు. మబ్బులు తనమాట వినలేదు. అయినా రామమూర్తికి ఠోకరా ఇవ్వాలి. ఎల్లా? ఎవడోగాని తనకంటె చాలా చాలా గొప్ప పాటగాడు బిగ్గరగా గొంతెత్తి మేఘరంజని ఆలాపిస్తున్నాడెక్కడో ; అంచేతనేసుమీ మబ్బులు ఇటుగాక అటుగా మందకట్టుకొని పోతున్నాయి ! నబబే అనిపించింది రామమూర్తికిది. ఓటమిలోనూ అప్పారావుదే పైచేయి. తెలివిపిల్ల ఓటమికూడా గెలుపులా కనిపించేట్టు చమత్కరించ గలడు....

పిల్లకాయ – అంటేపిందె – గా ఉన్నప్పుడే అప్పారావు హాస్యానికె మారు పేరయ్యాడన్నమాట. ఇదేలేకుంటే చిన్నతనంలోనే ప్రపంచమంటే కక్షపెంచుకొని స్విఫ్ట్ (Swift) లా తయారై ఉండేవాడు. అలాగాక బర్న్స్ (Burns) లా పరిణమించి సరసమైన హాస్యాన్ని ద్వితీయ ప్రకృతిలా మార్చుకొన్నాడు. తాను పేద బ్రాహ్మణ పిల్లవాడు. తనలాంటి పిల్లల బాధలు స్వానుభవ పూర్వకంగా మనస్సుకెక్కాయి. కలవారి బిడ్డల బుడదర్జాలు, కండకావరపు పనులు అవతలివారి నెలా నొవ్విస్తాయో తెలుసుకున్నాడు. అలా కలిగిన "మనఃక్లేశం" పిల్లలను చివరకు పట్టి పీడిస్తుంది. "తోటిపిల్లలకువలె తామూ ఉన్నతస్థితి పొందేవరకు, పిల్లల మనఃక్లేశం పోదుకాబోలు !" 12 B

పసితనం వదులుతున్నది. తనకెంత ఉల్లాసాన్నీ ఆనందాన్నీ ఇచ్చిపోతున్నదది ! అదినిజమేగాని, పువ్వులోచేరిన పురుగై లేమిడి మనస్సునెంతో కష్టపెట్టి తీపిని చేదుగా మార్చింది. ఆ వెనకటి రోజులు గుర్తువస్తే, ఆ దినాళ్ళగురించి సంతోషం బదులు సంతాపం మిగిలేలాగుంది. అవి తిరిగివస్తే బాగుణ్ణనికూడా అనిపించడంలేదు. "ఎప్పుడూఏదో ఒకడిగులు : డబ్బులేకపోవడంవల్ల ఎన్నెన్ని చిక్కులు. ఆ దుర్దినాలు వెళ్ళిపోయాయి, వెళ్ళిపోయాయి ! పూర్తిగా మటుమాయ

మైనాయి! అమ్మయ్యో! ఎట్టి విపత్తు!" 13 అవి వెళ్ళిన ముప్పయ్యేళ్ళకు గూడా, ఆ తొలి యవ్వనపు ములుకులు ఆయన మనస్సును గాడిస్తూ ఉండేవట్లు, తాను సంపాదనాపరు డయ్యేంతవరకూ కష్టాలనేవి కడతేరనట్లు తెలుస్తుంది. ఈ అనుభవం కూడా ఒకందుకు మంచిదే అయింది. స్వతంత్ర జీవితంపట్ల గురి ఏర్పరచింది. "మనిషికి చీకూ చింతా లేనపుడే సుఖము. ఎవరికివారు స్వతంత్రముగా జీవించుట అవసరము." పేదలపట్ల సానుభూతిని పెంపొందించి, "పరుల కలిమికి పొర్లి" ఏడవడం గాకుండా పేదరికాన్నే పెద్దమ్మవారిలా ద్వేషింప నేర్పింది. "డబ్బు లేకపోతే అన్నీ యిబ్బందులే. దారిద్ర్యం మనిషిని కృంగదీస్తుంది. అది పట్టించని మార్గం ఉండదు....దారిద్ర్యం ఎంత హేయమైనదో ఆ రోజులలో నేను గ్రహించాను" 14

ఈ రోజుల్లోనే అప్పారావు కోకిలపై కన్నువేశాడు. తెలుగుకంటె ఇంగ్లీషే ఎక్కువగా అలవడిందికాబోలు, మెట్రిక్యులేషను చదువుతుండగా 'కక్కూ' (cuckoo) అని ఇంగ్లీషు పద్యంలాంటిదొకటి రాశాడు. కవితాశాఖ నారోహించి మధురంగా మధురాక్షర కూజిత మొనర్చే వాల్మీకి కోకిలకు ఆధునిక ప్రతిగా 'గురజాడ వాల్మీకి' అనిపించుకొనేందుకు మాత్రమే పనికిరాలేదది. ఉత్తర సర్కార్ల స్కూళ్ళ ఇనస్పెక్టరుగా ఉండిన మన్రో (Munro) దాని చూచి మెచ్చాడు. చిలకమర్తి లక్ష్మీనరసింహం జీవితంలోకూడా కనిపించే ఈ దొర, తెలుగు కవులిద్దరికి చిన్నతనంలో ప్రోత్సాహమిచ్చినందుకైనా స్మరణీయుడు. అప్పారావుకు అయాచితంగా వచ్చిన యోగ్యతా పత్రమయిందది, తరట్పోతున్న గుర్రం దౌడు తీయాలంటే, కమ్చీదెబ్బకాదు కావలసింది, హుషారు గొల్పుతూ పులకలు రేపే రౌతు చేతితాకిడి. దీనితో అప్పారావు జీవితం స్పష్టంగా ఒక కుని మళ్ళింది. మెట్రిక్యులేషను పరీక్షలో ప్రథమశ్రేణి మార్కులు రావడం ఈ మార్పును స్థిరపరచింది. ఆయన మనస్సులో శక్తి కళ్లు నులుముకొని మేల్కొనసాగింది.

# 4

ఆనంద గజపతి మహారాజా కావడమూ విజయనగరంలో రెండేళ్లై ఉంటున్న కాలేజికి ప్రథమశ్రేణి హోదా రావడమూ 1879లో జరిగాయి. విద్యాప్రణాళికలోనే ఈ కాలానకు మార్పొకటి వచ్చి పడింది. మెట్రిక్యులేషనుకూ పట్టపరీక్ష (బి. ఏ.) కూ మధ్య 'ఫస్ట్ ఎగ్జామినేషన్ ఇన్ ఆర్ట్స్' (యఫ్. ఏ.) వచ్చి దూరింది. 'లిబరల్' విద్యపేరున చరిత్ర, తర్క తత్వశాస్త్రాలు సాహిత్యం వగైరాలకు ప్రాముఖ్యం చేకూరి ఆధునిక భారతీయ భాషలు మరుగున పడిపోవడమేగాక, శాస్త్ర విషయ పరిజ్ఞానం గగనమే అయింది. బోధనా భాషగా ఇంగ్లీషువచ్చి తిష్ట వేసింది. 'ఇండియన్ ఎడ్యుకేషన్ కమీషన్' వారినివేదిక లోని వాక్యమొకటిచాలు, తెరమరుగు విడిపించి వాస్తవాన్ని బయట వేస్తుంది :

The college of to-day aims at giving an education that shall fit its recipients to take an honourable share in the administration of the Country, or to enter with good hope of success to various liberal professions now expanding in vigorous growth. 15

గురజాడ అప్పారావు తరం నేర్చిన ఉన్నత విద్యకు, ఉద్యోగమో వృత్తో తప్పితే పరమార్థం మరొకటిలేదు. విద్య నట్టి జీవనసాధనం. ఉదరపోషణమే దాని ఏకైక ప్రయోజనం. అయితే, ఈ 'లిబరల్' విద్య రెండంచుల కత్తిగా పనికి వచ్చిందని లోగడనే చెప్పడమైనది.

యఫ్. యె. బి. యే. క్లాసులలో అప్పారావు చదువుగురించి చాలినంత సమాచారం చేతికందడంలేదు. తత్వశాస్త్రం గ్రీక్, రోమన్‌చరిత్రలు, అభిమాన విషయంగా (optional) సంస్కృతం — ఇవిగాక నిర్బంధ పఠనీయంగా ఇంగ్లీషు అభ్యసించాడు. తర్వాతరోజుల్లో గ్రీక్, రోమన్‌చరిత్రలను పోలుస్తూ పుస్తకమొకటి రాద్దామని సంకల్పించుకున్నటు ఆయన డైరీలు చెబుతున్నాయి. ఆ విషయాలను చదివిన విద్యార్థి కెలాంటి కెలాంటి భావాలు కలిగేవో రాయసం వెంకటశివుడుగారి స్వీయచరిత్ర తెలియజేస్తుంది. ప్రాచీన గ్రీస్‌లో స్వేచ్ఛాజ్యోతిగా పరిఢవిల్లిన ఏథెన్స్‌పట్ల అభిమాన మొకవంక; సంపన్నవర్గపు రాజ్యాధికారానికి (oligarchy) పెట్టనికోటగా నిలిచిన స్పార్టాపట్ల ఆగ్రహమింకొక వంక; అంతతో ఆగక బ్రిటిష్

చరిత్రలో రాజాధికారనిరంకుశత్వానికి ఎదురొడ్డి పార్లమెంటు జరిపిన పోరాటంగురించి అభినివేశం; ఇంకా ముందుకు ఇటీవల కాలానికి వచ్చి గ్లాడ్‌స్టన్ - డిస్రేలీల స్పర్ధలో ఒకరిని వెనుకేసుకుంటూ ఇంకొకరిని ఈసడించే వైఖరి — మెట్టు మెట్టుగా యువకుడైన విద్యార్థిలో కలిగే భావపరంపర ఇల్లాంటిది.

మెట్రిక్యులేషను తర్వాత, గిడుగు రామమూర్తి బడిచదువు చాలించుకొని విశాఖపట్నం జిల్లా కలెక్టరాఫీసులో నౌకరీరాళ్లు సంపాదించుకోబోయారు. ఆప్త మిత్రులులేని లోటును పుస్తకాలు పూడ్చాయి. విజయనగరంలో గంట స్తంభం పద్ద తూకంతూచి అమ్మివేసే "పనికిరాని" కాగితాలలో వెదికితే మంచి మంచి పుస్తకాలే తక్కువధరకు దొరికేవి. అలా తన పాలబడిన పెన్నిధి పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్. ఆంగ్లీకృతమైన బైబిలు తర్వాత సారళ్యానికి సూటిదనానికీ చిక్కదనానికి గూడా పేరుబడిన పుస్తకం ఇదొక్కటే. దాన్ని మనస్సుంచి చదివిన వాడెవడూ అంత సులువుగా దాని పట్టునుంచి తప్పుకోలేడు. బైబిలు భాష వాసనలు చిక్కంగా అంటుకొని ఉన్నప్పటికీ, నుడికారపు మెళకువలన్నీ వాక్‌వ్యవహారంనుంచి సంక్రమించినవే. బన్యన్ (Bunyan) ప్రభావం అజ్ఞాతంగానైనా అప్పారావు చరితాత్మపై ప్రసరించి ఉంటుందిగాని, అది ఆయన జీవితావసాన దశలోనే దాహరిల్లింది.

పుస్తకాలు, ఆలోచనలు - ఒకటి మారిస్తే ఒకటి ఆయనకు వ్యసన ప్రాయమయ్యాయి. "భావించటం నా ముచ్చట. ఆలోచనలు నా బలం. ఏదో ఒకదానిని దృష్టిలో పెట్టుకొని ఎడతెరిపి లేకుండా, ఆ రోజులలో సరదాగా ఊహించేవాణ్ణి.... మధురస్వప్నాలతో కొన్నాళ్ళు కొన్నేళ్ళు గడిచిపోయాయి." 16

అప్పారావు యఫ్. ఏ. కి వచ్చేనాటికే చదువు కొంతకాలం కుంటుపడిందేమో అనుకోవలసి వస్తున్నది. మెట్రిక్యులేషన్ పరీక్ష ప్రథమశ్రేణిలో నెగ్గిన వారికి ఉచిత విద్యార్థి వేతనం ఇచ్చేవారు. అది అప్పారావుకు పెన్నిధి అయి ఉంటుంది. పైగా తండ్రి వెంకటరామదాసు ఏదో ఇంత సంపాదించగలుగుతున్నాడిప్పుడు. జలంత్రా ఎస్టేటు అమీను, శృంగవరపుకోట సర్కిలు సూపరువైజరు - పైమెట్లెక్కుతూ పోతున్నాడు మహారాజావారి ఆదర విశ్వాసాలకు పాత్రుడయ్యాడటకూడా: బుదారిసింగు జమీందారు విజయనగర మహారాజాను పదివేల రూపాయల రుణంకోసం అర్థించినప్పుడు ఆ జమీందారు సంగతి సందర్భాలన్నీ విచారించి అప్పు ఇవ్వవచ్చునో కూడదో నివేదించవలసిందని వెంకట

రామదాసును నియోగించాడు మహారాజా. అయినా ఆయన సంపాదన బొటాబొటీ గానే సరిపోతున్నది.

ఉన్నతవిద్యాభ్యాస కాలంలో, అదృష్టం ప్రిన్సిపాలు సి. చంద్రశేఖరశాస్త్రి రూపు ధరించి అప్పారావును అనుగ్రహించింది. రాయవెల్లూరులో పుట్టి విజయనగర మహారాజా కళాశాలకు మొదటి నుంచి ప్రిన్సిపాలుగా ఉంటూ వచ్చిన ఈ తమిళుడు, విద్యార్థులకు గురువే గాక స్థానికంగా పితృస్థానాన్ని కూడా ఆక్రమించాడు. అప్పారావు వ్రాసిన ఇంగ్లీషు పద్యమేగాక మెట్రిక్యులేషన్ పరీక్ష ఫలితం కూడా చంద్రశేఖ శాస్త్రి దృష్టికిరాక తప్పలేదు. కుర్రవాడు చూస్తే పిడుగులాగున్నాడు — అయినా వట్టి బడుగు బ్రాహ్మడు. అవశ్యం అతనికి అండదండల నివ్వాలి. చంద్రశేఖరశాస్త్రి గారి తల్లికి అప్పారావు కడగొట్టుబిడ్డ కాగలిగాడు అదిసుతా, ప్రిన్సిపాలు ఇంటిలోనే అప్పారావు బివాణా వేశాడు. వడ్డించేవాడు మనవాదే అయినప్పటి సామెతగా, చంద్రశేఖరశాస్త్రి పెట్టసాగిన విద్యల విందుభోజనాలను కూడా పూర్తిగా ఆరగించి అరిగించుకోగలిగాడు అప్పారావు. ఒక్క అప్పారావునే కాదు, అలాంటి పేద పిల్లలనెందరినో చేరదీసి చలిపేంద్రలాంటి ఇంటిలో నిత్య సంతర్పణ జేసిన గొప్పవ్యక్తి చంద్రశేఖరశాస్త్రి.

> ....ఒకరోజు ఉదయం అన్నం దగ్గర్నుంచి లేచి ఉన్నవాడున్నట్టే కాలేజికి పరుగుదీయాల్సి వచ్చిందట అప్పారావు. గంట ఇంతపని చేసింది. క్లాసురూములోకి కట్టుపంచెతో మట్టుకే వచ్చిన ఆ శల్యమూర్తిని చూచి ప్రిన్సిపాలుకు కలిగింది కోపం కాదు, జాలి. వెంటనే తన ఉత్తరీయంతీసి అప్పారావు చేతికిస్తూ, విప్పి కప్పుకొమ్మన్నాడట 'సి. సి'....

యఫ్. ఏ. లోనూ బి. ఏ. లోనూ ప్రతి ఏడాది చివర పరీక్ష ఉండేవి; అందరినీ 'ప్రమోటు' చెయ్యకుండా, మెరికలనే ఏరి పంపేందుకు వడబోత, యఫ్.ఏ. బి. ఏ. రెండవ సంవత్సరాంతంలో జరిగేది—'సెలక్షన్ ఎగ్జామినేషన్'; ఇందులో నెగ్గుకొచ్చిన వాళ్ళకే యూనివర్శిటీ పరీక్షలకు ప్రవేశార్హత. చరిత్ర విద్యార్థులకు బ్యూరీ (Bury) గిబ్బన్ (Gibbon) మోమ్సెన్ (Momsen) ల ఉద్గ్రంథాలుండేవి. చరిత్రతోబాటు ఇంగ్లీషు భాషకూడా, మెదుగకు పదేవి. ఈ రోజులతో పోల్చుకుంటే, ఆ తరం విద్యార్థులు చదవవలసి వచ్చిన విషయాలు రాశిలో కొద్దివే అయినా, చదివింది క్షుణ్ణంగానే గాక కంఠోపాఠమయ్యేంత బండగా చదివేవాళ్ళనిపిస్తుంది.

"రొడ్డకొట్టుడు" చదువులని అప్పారావు వర్ణించింది వీటినే అనుకోవాలి. ఇక ఇంగ్లీషుకువస్తే షేక్స్పియరు నాటకాలు, మిల్టన్ కావ్యాలు సర్వసాధారణ పఠనీయాలు. టెన్నిసన్ వర్డ్స్‌వర్త్, కోలరిజ్ (Coleridge) వగైరాల కావ్యాలుకూడా. తత్వశాస్త్ర విభాగంలో లాజిక్, ఎథిక్స్, ఫిలాసఫీ ఉండేవి. అన్నీ ఇనప గుగ్గిళ్ళే. పరీక్షకు పోవడమనేదెంత మామూలో, పరీక్ష పోవడం అంతే. నెగ్గడమంటే, పట్టపగ్గాలుండని సంతోషాన్ని పొందడమే. అప్పారావు వరసగా నెగ్గిందీ లేందీ తెలీదుగాని వారి కుమారుడొక వ్యాసంలో రాసింది నిజమైతే, బి. ఏ. ఇంగ్లీషు పుస్తకాలు రెండు తనకు సరిపడనందువేత యథా సమయాన పరీక్షకు పోకుండా, ఒక సంవత్సర కాలం వాయిదా వేసుకొన్నాడని నమ్మాలి. అదే విధంగా యఫ్. ఏ. పరీక్ష తర్వాత బి. ఏ. కి పోకుండా మరొక అంతరాయం వచ్చింది. పరీక్షలంటే తనకు "పరమ అసహ్య"మంటూ ఒక లేఖలో దాదాపు ఇరవై ఏళ్ళ తర్వాత ఇలా రాశాడు: "....పరీక్షలంటే తేనిపోని బెడద, చికాకు, ప్రాణాంతకం. ఇవి ఎంత బాధాకరమైనవంటే పరీక్షలు ప్యాసయ్యామని చెవిని పడీ పడగానే తమ నెత్తికెక్కిన బరువు దింపుకున్నట్లు యువకులు 'ఫీ'లవుతారు. వాళ్ళ ప్రాణాలు తెరిపిన పడతాయి". 17 విద్యార్థులవైపునుంచి చెప్పిన మాటలు కావవి. తెలివిని గాకుండా జ్ఞాపకశక్తిని ప్రధానంగా పరీక్షించే పద్ధతి, అప్పారావు స్వానుభవానికిగూడా రాకపోలేదు.

యఫ్. ఏ. తర్వాత మహారాజావారి ఉన్నత పాఠశాలలో అధ్యాపక వృత్తి చెయ్యవలసి వచ్చింది. అది కొన్ని నెలలుమాత్రమే అయినా సంవత్సర కాలం దండుగైంది. 1886 లో ఇరవైనాలుగో ఏట బి. ఏ. డిగ్రీ చేజిక్కిందంటే, కారణ మిదే. ఆలస్యమైతే అయిందిగాని, బి. ఏ ఆంగ్ల పరీక్షా భాగంలో ప్రథమశ్రేణిలో నెగ్గగలిగాడు ఊరుగాని ఊరు – చెన్నపట్నం వెళ్ళి బెదురు బెదురుగా రాసి ఫలితం దక్కించుకొన్నాడు.

మరి చేయవలసింది? రాయవరంలో పదేళ్ళకు బాగా క్రితంలో జిల్లా మున్సబుగారు తట్టి లేపిన ఆశ, బి. యల్. వైపు వేలెత్తి చూపుతున్నది. బతకలేక పోతేకదా పండితులు కావడం? వకీలు పట్టా సంపాదించాలి. బడిపంతులై పిల్లల్ని దండిద్దామని, అంతరాంతరాల్లో ఏ మూలనైనా కొన కోరిక ఉండివుంటే, యఫ్. ఏ. తర్వాతి మూణ్ణెల్ల ముచ్చటతో అది తృప్తిపడింది. తానేగనక అప్పర్ ఫోర్త్ క్లాసులకు పాఠం చెబితే, పరీక్షఫలితాలు అత్యద్భుతంగా ఉంటాయనుకుంటే అద్భుతాలు

ఊహల్లోనే మిగిలిపోయాయి. "మునసబు సౌదామని నాకు మహా 'యిది'గా వుండేది. తరువాత లాయర్నవాలని కోరిక పుట్టింది. కోర్టుల్లో చాలా కేసులు నడిపించాను. కాని లాయర్నమటుకు కాలేదు." 18

ఆశలతో కట్టుకున్న మేడ కూలకుండా జాడలేకుండానే కలలాగా అంతర్ధానమైపోయింది. మిగిలింది, శూన్యమే సర్వవ్యాపిగా మారిన ఆలోచనా ప్రపంచం. ఆశాభంగంవల్ల అప్పారావుమటుకు కుంగిపోలేదు. అప్పటికే తన మనస్సును స్వాధీనపరచుకొన్న నావ్యోత్సాహంమీదికి, ఆశలనూ ఆలోచనలనూ తిగయిచేసి అల్లించుకోసాగాడు. దాన్ని గమనించాడు గనకనే ప్రిన్సిపాలు సి. సి. అప్పారావుకిచ్చిన యోగ్యతాపత్రం ఇలా సాగింది: "అఖండ మేధాసంపత్తిగల కొద్దిమంది విద్యార్థులలో అప్పారావు వొకడు. విద్యార్థిగావుంటూ, గురువుల మన్ననలుపొందిన యువకుడు నిరంతర సాహిత్య వ్యాసంగము అతని వ్యసనము. సహజ ప్రేరేపణ వలన కలిగిన అతని కవితాశక్తి అపారమైనది. సాధనవల్ల అది ప్రకాశవంతమై, ఎప్పటికిని మనం మరువలేని కవులస్థానమును అప్పారావుకు ప్రసాదిస్తుంది. ఇందుకు సందేహములేదు. వినయము సౌశీల్యము అతని సహజ గుణములు. జీవితమున అతను అన్నిటా ఔన్నత్యమును పొందవలెనని నా అభిలాష. అతని ఔన్నత్యమే నా ఔన్నత్యము. అతని ఆనందమే నా ఆనందము." 19

గుండెలోతులనుంచి ఉబికివచ్చిన శిష్యవాత్సల్యం, పక్షపాతవైఖరికి మాత్రం తావివ్వలేదు. ప్రత్యక్షరమూ నిజమయ్యేంతటి భవిష్యద్దర్శనం ఇది. మహాత్ముల నోటి మాటవెంబడి అర్థం నడుస్తుందంటారే, అది ఇదేననిపిస్తుంది. అయితే ఇది పూర్తిగా జోస్యమూకాదు ఆవరకే అప్పారావు ప్రతిభను సి. సి. చూచి ఉన్నాడు. గుండుకుర్తి వెంకటరమణయ్య వెలువరిస్తూ వచ్చిన *ది ఇండియన్ లెజర వర్* (The Indian Leisure Hour) పత్రిక 1883 లో ఇంగ్లీషు పద్యకావ్యాన్ని అచ్చు వేసుకొంది. దానిపేరు *సారంగధర*. నిన్నమొన్నటిదాకా మనకు ఆ పేరొక్కటే తెలుసు. *యూనిలిట్* వారి ధర్మమా అని, ఎనభై ఏళ్ళకు మళ్ళీ 1963 లో తెలుగువారి కళ్ళ బడిందది. ఈ ఎనభయ్యేళ్ళ కాలంలో అది అలాగే వేసినచోట ఉండిపోయిందిగాని, దాన్ని రచించిన కవిహోదాలో విపరీతమైన మార్పు వచ్చింది. యఫ్. ఏ రెండో సంవత్సరం చదువుతున్నప్పుడు, నవయువకుడుగా అనామకుడుగా అప్పారావు దాన్ని రాశాడు. రాశాక, వెంకటరమణయ్య సత్సంకల్పం మూలాన అది రాష్ట్రాంతరానికి వ్యాపించింది. ఆ తర్వాత మళ్ళీ ఏరచన చేయకుండా

పదిహేనిరవై ఏళ్ళుదాకా ఉండి పోయినందుచేత, కవిగా అప్పారావు స్థితి నామ మాత్రమై పోయింది. ఇంతకూ ఈనాడు తన ఇంగ్లీషు రచనల వల్ల గురజాడ అప్పారావు ఎవ్వరికీ గురుప్రాయుడు కాదు.

బ్లాంక్ వెర్స్ పద్ధతిని రాసిన శారంగధర కావ్యంలో ఛందోవ్యవస్థ మరింత బరువుగా ఉండిఉంటే బాగుండేదని ఆరోజుల్లోనే శంభుచంద్రముఖర్జీ అన్నాడు. దొరబాబుల తలదన్నేట్టుగా ఆంగ్ల విద్యావంతులైన భారతీయులు బ్లాంక్ వెర్స్‌కు పెడమొగం పెట్టి, అలెగ్జాండర్ పోప్ (Alexander Pope) వాడుక చేసిన చిమ్మటి ఛందస్సులంటే వెర్రిమోజు పడుతున్నారని చెప్పాడు. అయినా ఈ కావ్యాన్ని తన రీస్ అండ్ రయ్యత్ (Reis And Rayyet) లో వేసుకొన్నాడు.

గురజాడ అప్పారావు గురుప్రవర చెప్పాల్సివస్తే, కవిత్వవిషయంలో శంభు చంద్రముఖర్జీనే ఓంప్రథమంగా పేర్కొనాలి. తన కెదురౌతున్న నిఋత్సాహకర పరిసరాలను గురించి అప్పారావు రాశాడేమో ఆయనకు, ఆయన ప్రోత్సాహాన్ని జాబులనిండా కూరి జవాబులు రాశాడు. 1855 నుంచికూడా ముఖర్జీస్ మ్యాగజైన్ (The Mukherji Magazine) నిర్వహిస్తూ, బుర్రాశేషగిరిరావన్నట్లు "స్వయం కృషివల్ల నికటమైన పాండిత్యమును సంపాదించిన" ముఖర్జీ అప్పారావును సాహిత్యోపజీవిగా చేయదలచి ఎన్నో సలహాలిచ్చాడు : ఉన్నశక్తి సామర్థ్యాలను ఎక్కువజేసుకోమన్నాడు.

....చదువు, చదివిఆలోచించు. కావ్యాలేగాక, అన్నిరకాలైన పుస్తకాలూ చూడు. అయితే చదువే సమస్తమూకాదు. జీవితం స్థానాన్ని అది దురాక్రమించ గూడదు. అనుభవానికి మొదటిస్థానం, పుస్తకానుభవానికి రెండవస్థానం ఇవ్వు. ప్రకృతిని పారబట్టి చదువుకో. అదే గొప్పపాఠశాల. మనిషికూడా అందులోనే చేరిక. అడవులు, కోస్తా; పల్లెలు, చెట్టూచేమా; మబ్బులూ గాలికసరూ; సూర్య చంద్రులూ, ఉరుమూ మెరుపూ – అన్నీ చూడదగ్గవే. దగ్గర్లోఉన్న చోట్లకే వెళ్ళి కళ్ళారా చూడు. దివ్యమైన మానవాకృతిలోగల అందాన్ని అందవికారాన్ని కనిపెట్టడం మరిచేవుసుమా !

.... మనుషుల మానసిక ప్రవృత్తులను అనుసరించేప్పుడు వాటి బలా బలాలను సరిగా గమనించి మరీ అనుసరించు. ఈ అన్నివిషయాల గురించి ఇతరులేమేమని చెప్పిఉన్నారో గుర్తుంచుకొంటూనే, వాళ్ళమీద అట్టే ఆధారపడ కుండా నీమీద ఎక్కువ నిఘాఉంచుకో. నీస్వశక్తి సామర్థ్యాలనే వెలిబరచు కోవాలిగాని ఇతరులను అనుకరించకుమీ !

... నీదిగాని భాషలో రాస్తున్నావు గనక మిక్కిలిగా చదువుకొని దాన్ని నీ చెప్పుచేతల్లోకి తెచ్చుకోవాలి. జన్మతః ఆ భాషను మాట్లాడేవాళ్ళు తమ మనోభావాల నెలా ప్రకటించు కొంటారో తెలిసికొనేందుకై, చదివేదేదో ఒళ్ళుదగ్గర పెట్టుకొని చదవాలి నువ్వు.

.... నీ ప్రతిభకు తగిన కొత్తతెన్ను నువ్వే వేసుకోవాలి. దానికిముందు భాషపై అధికారమంటూ వచ్చేదాకా మొదట్లో ఇతరులను అనుకరించవలసి ఉంటుంది. చెప్పదలచుకొన్నదేదో అది తలంతానిండి నిజమైన హృదయ ప్రేరణ కలిగి రాయడమే జరిగినట్టాయెనా, నువ్వు నెగ్గకుండా పోయే ప్రమాదమే ఉంటుం దనుకోను .... 20

ముఖర్జీ ఉత్తరాల సారాంశం ఇది. రమేశచంద్రదత్ సహాధ్యాయి, స్వాతంత్ర్యాభిమాని, ఫిలడెల్ఫియాలో విద్యార్జన చేసివచ్చి వేత్తగా పేరుపడినవాడు ఇరవై మూడేళ్లుదాటని ఒక తెలుగుకుర్రాడికి కావ్యగురువై ఓనమాలు నేర్పుతున్నాడు; అంతేగాని, తాను అధికుణ్ణని అహంకరించి ఈ ఉపదేశం చెయ్యడం లేదు; అలాచేశాడని నేటివాళ్ళు ఒకరిద్దరు అనుకొన్నారు; అది విచారకరం. దోగాడుతూవచ్చి నిలిచి అడుగువెయ్యలేక తన పక్కన కూలబడే పసిబిడ్డకు చేయూతనిచ్చి నడక నేర్పే పెద్దవాడు గుర్తువస్తాడు. అప్పారావు ముఖర్జీని గురువుగానే ఎంచుకొన్నాడని, ముఖర్జీరాసిన ఒకటి రెండు జాబులకు ఐదూ పదిగా తాను జవాబులివ్వడం వల్ల తెలుసుకోవచ్చు. పరీక్ష రాయడానికని అప్పారావు మదరాసుకుపోయి ఉండినప్పుడు, ఆపట్నంలోని వింతలూ వినోదాలూ తెలుసుకోవాలని ముఖర్జీ ఉత్సుకత చూపాడు: విధవాపునర్వివాహ ఉద్యమ విజయావకాశాలు, కార్మికెల్ (Carmichael) దొరకు స్థానికులిచ్చిన వీడ్కోలు విందులో రభస, చెన్నపట్నపు రాజకీయప్రముఖులు. మరి రెండేళ్ళలో కాంగ్రెసుకు అంకురార్పణ జరుగుతుం దనగా, ఒక విద్యాధికుడు ఏ ఏ విషయాలగురించి ఆలోచించేవాడో తెలుసుకొనేందుకైనా ఈ లేఖ పనికివస్తుంది.

పరీక్షలోనెగ్గి ఉద్యోగంలో పడినతర్వాతకూడా ఈ లేఖాప్రవంతి ఇంకిపోలేదు. తన ఆత్మకథ నంతటినీ పూసగుచ్చినట్టు వర్ణిస్తూ రాసిన లేఖకు జవాబుగా, శంభు చంద్ర ముఖర్జీ అప్పారావుకు బోధించింది, సర్వమానవ బంధుత్వం గురించిన ఉపదేశం. ముఖర్జీ భారద్వాజగోత్ర బ్రాహ్మణుడు; ఎన్నడో కాలేజీచదువు రోజుల్లో 'అతివాది'; ఇప్పు డాపాలు చల్లారి 'బ్రాహ్మణ్యం,' తన వర్ణానికి ప్రత్యేకమైన

‘మహాశయా’ సంబోధనం నిలుపుకొంటున్నాడు. అయితే సృష్టిలో ఏదీ తక్కువది కాదు. దేనిఘనత దానిదే. వాటివాటికి ఉచితమైన తావుల్లో ఉంచిపెట్టినంత మాత్రానే అన్నీ ప్రపంచకంలో అమరికచెంది ఉన్నాయి ఈ హితవు అప్పారావు తత్వ సౌధానికి పడిన పునాది పూర్తిగాకాదు. ఎందుకంటే, ఉండవలసినట్టుగా అన్నీ చక్కగా బొమ్మల కొలువులాగా తీరివుంటే మరి వాటిలో ఉత్సాహమేముంది? ఉండవలసినవిధంగా అన్నిటినీ అమర్చిపెట్టేందుకే సంస్కరణోద్యమాలూ సిగ్గేనా.

సలహాలు ..... మరిన్ని సలహాలు. అప్పారావుకు దాహంతీరలేదు. ఏ ఏ పుస్తకాలు చదవాలి తాను? ప్రస్తుతానికి తాను చదువుతున్నవి. ఏం ఉద్దేశమేమిటో? వయస్సుకు మించి చదువుతున్నావు సెహబాసు! ఆనాటి రాజకీయ ప్రతిష్టంభన గురించి ఒకకావ్యమే రాస్తానన్నాడు అప్పారావు. శుభం, పూర్తిచెయ్యమన్నాడు ముఖర్జీ. ఇంకా రకరకాలైన నడకలతో జానపదధోరణిలో గేయకావ్యాలను (Ballads) రాయమన్నాడు కూడా. ఎంత పదునుగల కత్తిఅయినా వాడకపోతే మొద్దుబారిపోతుందని హెచ్చరించాడు.

సదరు రాజకీయకావ్యం రాయలేదు సరిగదా, కవిత్వసాధనే విడిచిపెట్టాడని అప్పారావు గురించి ముఖర్జీ అనుకోలేదు. జాబుల రద్దీ తగ్గింది. [illegible] ఉన్నట్టుండి మాట్లాడమానితే, పంచినట్టిది అనుభవించే విరహ ముఖర్జీ లేఖల్లో కనిపిస్తుంది — ముసలితనంలో మోజు తెచ్చే చేటు రాజరాజువ్వారా అప్పారావు ఈవరకే వర్ణించాడని ముఖర్జీ మహాశయుడు మరిచాడులాగుంది:

> మొదట నాకో అమిత ఆసక్తిని, గాఢ అనురాగాన్ని కలిగించి, ఉత్తరాలు వ్రాయడం మానివేసి, మధ్యలో నన్ను మర్చిపోయాడు. అతని భవిష్యత్తు ఎలా వుంటుందో చూడ కుతూహలపడుతున్న నాకు మీ మొదటి ఉత్తరం సంతృప్తి కలిగించింది. ఉద్యోగంలో చేరినాడని విని నేను ఎంతో ఆనందించాను. పరమేశ్వరుడు అతనికి అన్నివిధాల తోడ్పడుగాక! కవిత్వం వ్రాస్తున్నాడు కదా? అతని శక్తి అద్భుతం!

ఇంగ్లీషు మూలంలో He has the stuff in him తెలుగులో "శక్తి" అయింది. ఏమైతేనేమి, ఈ లేఖనాటికి (1889) అప్పారావు కవిత్వ మెలాగున్నా, జీవితం ఒక దారిని పడింది.

1. గురజాడ అప్పారావు : కన్యాశుల్కము (వ్యా) : నిడుదవోలు వేంకటరావు, తెలుగు మహాజనసమాజము ఆరవ వార్షిక సంచిక 1961
2. శ్రీ గురుజాడ అప్పారావు : నిడుదవోలు వేంకటరావు, వావిళ్ళవారి ముత్యాల సరములు, నీలగిరి పాటలును పీఠిక, పు. vii –ix
3. అడిదము సూరకవి : అడిదము రామారావు, పు. 13–15
4. స్వీయచరిత్ర, మొదటిభాగం : కొండ వేంకటప్పయ్య, పు. 4–5
5. గు. ర. ము. : ఋతశతకం, పు. 114
6. గు. ర. మా. మం : పిల్లలు, పు. 5
7. అనుభవాలూ – జ్ఞాపకాలూను, రెండవ సంపుటం : శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, పు. 260–261
8. గు. ర. మా. మం. ; చదువు : ఉద్యోగము పు. 7
9. వేదము వేంకటరాయ శాస్త్రుల జీవితచరిత్ర సంగ్రహము : వేదము వేంకటరాయశాస్త్రి M. A. పు. 19–21 ; 29–30.
10. స్వీయ చరిత్రము : చిలకమర్తి లక్ష్మీనరసింహం, పు. 37
11. గురజాడ సమకాలికులు (వ్యా) : వసంతరావు బ్రహ్మాజీరావు. గు. శ. సం. హై. పు. 25
12. గు. ర. మ. డై. : వాగనుశాసనులు శ్రీ గిడుగు. పు. 229
13. గు. ర. మా. మం. : పిల్లలు ; పు. 5
14. గు. ర. మ డై : 1895 ఏప్రిల్ 18, పు. 71
15. Cit. in *India : Its Administration and Progress :* Sri John Strachey, P. 257.
16. గు. ర. మా. మం. ; ఆలోచనలు, పు. 29
17. గు. ర. లే. ; సాహిత్య లేఖలు : నాటక గోష్ఠి. పు. 70
18. గు. ర. మా. మం. : ఆలోచనలు, పు. 27
19. అదే : చదువు ; ఉద్యోగము, పాదదీపిక, పు. 8
20. అదే : శంభుచంద్ర ముఖర్జీ, పు. 13–16
21. *afterword:* Srinivas Rayaprol, *unilit*, P. 17.

# "గజపతి త్రోవ"

జీవితం ఒక దారిని పడడమంటే కుదురుబాటనేది చేకూరడమే ననిపిస్తుంది. ఇతరుల రాబడిమీద ఆధారపడడం ఆగిపోవాలి. తనకు తానే యజమానికావాలి. అప్పుడే తనదైన వ్యక్తిత్వం రాణిస్తుంది. దేశాలకెలాగో వ్యక్తులకలాగే ఆర్థిక స్వాతంత్ర్యం సర్వతోముఖ వికాసానికి ఆదిమూలం.

బి. ఏ. చదువుతూండిన దినాల్లోనే అప్పారావు ఒకింటివాడయ్యాడు. అదృష్ట మనేది అతణ్ణి వెదుక్కొంటూవచ్చి మెడలో పూలమాల వేసిందనలేముగాని, అదృష్టాన్ని అతనివైపుకు మళ్ళించి ప్రిన్సిపాలు సి. సి. మరొక మహోపకారం చేశాడు. అది ఒక పిట్టకథ.

....ఎల్లాప్రగడ సన్యాసిరాజనే పెద్దమనిషి దేవరాపల్లి గ్రామ వాస్తవ్యుడు తన పుత్రికారత్నమైన అప్పలనరసమ్మకు తగిన వరుణ్ణి వెదికి నిర్ణయించుకొని రావలసిందిగా తన పురోహితుణ్ణి నియోగించాడు. పిల్లవాడి అర్హతలు యోగ్యతలు ఎలాంటివై ఉండాలో్ని చెప్పి మరీపంపాడు. కులం ఎలాగూ తప్పదు. వంశం మంచిదై వుండాలి. పిల్లవాడు బుద్ధిమంతుడు – అంటే ఇంగ్లీషు చదివిన వాడు – అయివుండాలి. కాబట్టి పురోహితుడుగారికి అట్టే ఇబ్బందిలేకుండా పోయింది. ఇంగ్లీషు చదివేవాళ్ళను దఫాలు దఫాలుగా ఉత్పత్తిజేసే కార్ఖానా లాంటి కాలేజి ఉందిగా! నేరుగా అక్కడికివెళ్ళి కాలేజి పెద్దల నాశ్రయించి సంగతి సందర్భాలు వివాదించడం సులువు. అలాగే ప్రిన్సిపాలు సి. సి. గారి నాశ్రయించి ఆయన ఎరికలోవున్న మాంచి ఇంగ్లీషు చదవరిని పేర్కొమంటే, మరో ఆలోచనలేకుండా అప్పారావును పేర్కొన్నాడాయన. అలా స్థిరపడిందీ మనువు.

పట్టా చేతికిరాకముందే పొట్టగురించి ఆలోచించుకోవాల్సిన గతి తప్పి, 1885-86 సంవత్సరంలో దేవరాపల్లి గ్రామాన విశాలమైన ఎల్లాప్రగడవారి భవంతిలో గురజాడ అప్పారావు వరుడై అప్పల నరసమ్మ మెడలో తాళి గట్టాడు. ఎల్లాప్రగడవారి ఆస్తిపాస్తులన్నీ మాడుగులలో ఉండేవి. దేవరాపల్లి 'బొట్ స్టేషను'లాంటిది.



**Prince Charming** అనిపించుకొన్న ఆనందగజపతి మహారాజా.

మామగారిది బహు సంపన్న కుటుంబం ; మాటకూ మన్ననకూ లోటులేదు. సన్యాసిరాజుగారు ఒక చిన్న కుబేరుడే. కాకినాడ ప్రాంతం కోటిపల్లినుంచి తల్లిని వెంటబెట్టుకొని "తూర్పునాటి"కి తరలివచ్చిన ఎల్లా ప్రెగ్గడ సోమరాజు, నరసరాజు, వెంకటరాజు అనే ముగ్గురన్నదమ్ములు అమృతపురమనే గ్రామాన స్థిరపడి పోయారు. కొమ్ములు, మైనం, కరక్కాయలు వగైరా వస్తువులను - సరుకును బొంబాయికి పంపుతూ "కొండ వర్తకం" చేసి సోమరాజు లక్ష లార్జించాడు. నరసరాజు మాడుగుల దివానిగిరీ వెలిగించాడు. వెంకటరాజు పొలమూ పుట్రా చూచుకొంటూ ఇంటి పట్టున నిలబడిపోయాడు ; ఆయన సుపుత్రుడే అప్పారావు శ్వశురుడైన సన్యాసి రాజు. ముగ్గురన్నదమ్ములకు తానొక్కడే మగనలుసు ; మూడు ఆస్తులూ వచ్చి చేరాయి - సాలీనా పన్నెండువేల రూపాయల వసతి. అయినా ఆయనది కాస్త గట్టిపాకం ; సింగరాజు లింగరాజు అంశ - పిసనారి అనిపించేంత పొదుపరి. పెద్దకుమార్తె అప్పల నరసమ్మకు రెండు వందల రూపాయల రాబడిగల భూస్తితినే చూపమనసైంది. అయినా సందుకాపెట్టెలోంచి దోసిలితో రూపాయలెత్తి తీసి కుమార్తె చేతుల్లో పోసి సవారీచేయించి మరీ అత్తవారింటికి పంపేవాడట. మామగారిని చూచుకొని మిడిసిపడే అవకాశం అప్పారావుకు కలిగింది కాదు. పెళ్ళయ్యాక గూడా, చెన్నపట్నం వెళ్ళి బి. యస్. చదవలేకపోయాడు గదా మరి !....

పట్టపరీక్షగండంనుంచి బయటపడగానే సరిపోలేదు. ఉద్యోగం కావాలి. మళ్ళీ సి. సి. అనుగ్రహించాడు. మహారాజావారి కాలేజీలో ఎనిమిదో అసిస్టెంట్ లెక్చరర్‌గా వేయించాడు. జీతం చాలాకొద్ది - దాంతో భుక్తిగడవటమే దుర్ఘటం. అందుచేత అప్పారావు చూపు, రివెన్యూ డిపార్టుమెంటుమీదికి పోయింది. కాలేజీలో 'లీవు' తీసుకొని స్థానిక జనరల్ డిప్యూటీ కలెక్టరాఫీసులో సబ్బోటం హెడ్ గుమాస్తా ఉద్యోగానికి ఒప్రుజాచాడు. అయితే ఈ నౌకరీ ఎనిమిది నెలల చాకిరీనే తనకు మిగిల్చింది. తన ప్రకృతికీ దేహస్థితికీ ఇది పడదు * అంతేకాదు, తన మనస్సంతా సాహిత్యంమీద లగ్నమైఉంది.

* గవర్నమెంటు నౌకరీ-అందులోనూ సబార్డినేటు-రివెన్యూ నౌకరీ గురించి అప్పారావుకు ఎంతటి ఏహ్యాభావముండేదో, ఒంగోలు ముని సుబ్రహ్మణ్యం అనే ఆనాటి యువకునికి 1911 లో ఆయనరాసిన లేఖనుబట్టి తెలుస్తుంది.

"సెకండుగ్రేడ్ ప్యాసయితివా, ప్రాక్టీసుపెట్టు. అంతేకాని గవర్నమెంటు నౌకరీలో

ఆంగ్లభాషావిభాగంలో ప్రథమశ్రేణిలో నెగ్గుకొచ్చిన ప్రతిభావంతుడొకడు కాలేజీకి అలంకారంగా ఉండవలసిందిపోయి. కూడికలతో తీసివేతలతో వైశ్యమధ్య నానా హైరానా పడుతున్నాడంటే ఆ కాలేజీకేంత లోటు! ఎస్టేటు స్కూళ్ళ ఇనస్పెక్టరయిన నాగోజీరావు నేరుగా మహారాజావద్దకుపోయి, పకాల్తాలేకుండానే అప్పారావు శక్తి సామర్థ్యాలనుగురించి గట్టిగా వాదించాడు. 1887 విజయదశమిరోజున అందరు రాజాల్లాగానే ఆనందగజపతి కొలువుచేస్తున్నాడు. 'సామంతులూ' ఉద్యోగులూ ఆశ్రితులూ ఫలమో పత్రమో తీసుకెళ్ళి సమర్పించే అలవాటొకటి జమీలన్నిటిలోనూ ఉండేది. ప్రిన్సిపాలు సి. సి. కూడా వెళ్ళాడు. వెంట అప్పారావు నడిచాడు. మహారాజావారిగురించి తానెంతో వినివున్నాడు. చిన్నపిల్లవాడుగా కోటకువెళ్ళి చోద్యాలుచూస్తూ ఆశ్చర్యం ప్రకటిస్తూ ఉండేవాడొకనాడు. యువకుడూ విద్యావంతుడూ రూపసీ (Prince Charming) అయిన ఆనందగజపతిగురించి విని ఆయననెప్పుడు చూద్దునా అనుకొంటూ వచ్చాడిన్నాళ్ళు. ఆ కోరిక ఇలా నెరవేరింది. గుమాస్తాగిరీ విడిచిపెట్టి తిరిగి కాలేజీకి రావలసిందిగా మహారాజా ఆజ్ఞాపించాడు. అయితే అది ఆజ్ఞలాలేదు; ఆదేశంలాగుంది. మహాప్రసాదమనుకొన్నాడే గాని పైకి నోరువిప్పి 'చిత్తం చిత్తం' అనలేదు. నెలకు మూడురూపాయల జీతంమీద నాలుగో అసిస్టెంటు లెక్చరరుగా నియమిస్తూ ఉత్తర్వు వచ్చింది. ఇలా ఆరునెలల అలక, నాలుగుమెట్లు ఒక్క ఉదుటున దాటించింది. అంతేగాక అనునిత్యమూ మహారాజావారికి వార్తాపత్రికలు చదివి వినిపించేందుకు పాతిక రూపాయలు అదనంగా ముట్టే ఏర్పాటుజరిగింది.

ఇన్ని విధాల సాయంచేసిన దొడ్డమనిషి సి. సి. మరు సంవత్సరంలోనే అకస్మాత్తుగా కన్ను మూశాడు. చివరి రోజులలో ఆయనమీద అభాండాలు వేసినవాళ్ళు లేకపోలేదు. చనిపోయాక మరి చెప్పేదేమిటి? ఆయన హయాంలో కాలేజి డబ్బు చాలా దుర్వినియోగం జరిగిందని మహారాజా వినేట్టుగా ఒకరిద్దరన్నారు. వారిలో "కె. ఆర్." ఒకరని, అప్పారావు రాసిపెట్టిన ఆనంద గజపతి: వర్ణ్యవింతలు తెలియజేస్తుంది. 1. కిళాంబి రామానుజాచార్యుల పేరుకు సరిపోయే ఈ

ప్రవేశించావుగనుక! క్రేన్‌లాగ నిన్నుమీదకు ఎత్తే చుట్టాలుంటేతప్ప గవర్నమెంటు నౌకర్లో ఎదుగూబొదుగూ వుండదు. ప్రమోషన్‌వచ్చేసరికి తలప్రాణం తోకకువస్తుంది. సెక్రటేరియట్ రెవిన్యూనౌకరీ నీ నెత్తురు తాగేస్తుంది. నీ మార్దవాన్ని ఉత్తేజాన్ని ఆహ్లాదాన్ని జలగలా పట్టి పీల్చేస్తుంది." (గు. ర. లే. పు. 107)

ఇదంతా స్వానుభవమే.

పొడి అక్షరాలు, ఆయన ప్రిన్సిపాలుగా చంద్రశేఖరశాస్త్రి వారసుడన్న విషయాన్ని కూడా బలపరుస్తాయి. సి. సి. ఆప్త కోటిలో ఒకరైన విజయరాఘవాచార్యులు ఆయన మృతికి ఎంతో విచారిస్తూ ఉండిపోయారట. వారిని ఓదారుస్తూ ధైర్యం చెబుతూనే, ఈ కె. ఆర్. చేసిన ఆరోపణను మహారాజా తోసివేశాడు. ఇలాంటి మాటలనెవరూ తన చెవిని వెయ్యవద్దని కట్టడి చేశాడుకూడా. సి. సి. గురించి అప్పారావుకు చాలా గురి ఉండేదని వేరుగా చెప్పనక్కర్లేదు. "ప్రిన్సిపాలు గారితో సరిపోల్చి చూస్తే మహారాజావారు ఏమంత గొప్పవారు కారని అనుకొనే వాణ్ణి" అంటూ తన బి. ఏ. రోజుల భావాలను మననం చేసుకున్నాడొకమారు. 2 ఇప్పుడా సి. సి. గతించాడు; ఆయనతోబాటు తన నవయవ్వనమూ గతించింది.

కొత్త ప్రిన్సిపాలు కిళాంబి రామానుజాచార్యులు కూడా అప్పారావుకు ఆప్తుడే. పశ్చిమ గోదావరిజిల్లా పెంటపాడునుంచి శతావధానంవిద్యచేసి చూపుతానంటూ విజయనగరానికి వచ్చి, త్వరలో ఆనంద గజపతి నాశ్రయించిన ఈ ఆచార్యులవారు కాలేజీకి ప్రధానాచార్యులు కాగలిగారంటే, యం. ఏ. చదవమని మహారాజా ఇచ్చిన ప్రోత్సాహమే ముఖ్య కారణమనాలి. రామానుజాచార్యులవారి అనుమతితో అప్పారావు యఫ్. ఏ, బి. ఏ. క్లాసులకు గూడా ఇంగ్లీషు బోధించే వీలు కలిగింది. న్యాయంగా అయితే, చరిత్ర, తత్వశాస్త్రం నేర్పవలసినవాడు. కాదు కూడదంటే సంస్కృత సాహిత్యచరిత్ర, వ్యాకరణం, అనువాదం – ఇవి కూడా బోధించవలసినవాడు. ఇవన్నీ ఆయన పిల్లలకు నేర్పిన విషయాలే. అష్టావధానికి గూడా అష్ట కష్టావధానం లాంటి దీపని.

అప్పారావు అధ్యాపక జీవితంగురించి ఉన్నంతలో బటుపైన సాక్ష్యాధారాలు, ఆయన శిష్యుల స్మృతిశకలాలే. సంస్థానం ఉద్యోగంలో ఉచ్చదశకు చేరుకొని, 'లా' శాఖ సూపర్వైజరైన జి. అప్పయ్య అలాంటి శిష్యుడు. అప్పారావు సంస్థానం కొలువు మానుకొంటూ పించనీకి దరఖాస్తు పెట్టుకున్నప్పుడు, దాన్ని మంజూరు చేయవలసిందంటూ ఇలా రాశాడు: "నాకు మహారాజావారి కళాశాలలో శ్రీ అప్పారావుగారి చెంత ఎఫ్. ఏ; బి. ఏ. క్లాసులు చదువుకొనే అదృష్టం కలిగింది. ఆయన అతి సమర్థుడు; ఉత్తమ అధ్యాపకుడు. విద్యార్థులు ఆయన్ని పూజ్యభావంతో చూచేవారు; ఆయన విద్యార్థులను ప్రేమించేవాడు".3

డాక్టరు గిడుగు సీతాపతిగారు ఒక వ్యాసంలో ఆనాటి ఒక ముచ్చటను ప్రస్తావించారు. 4. తను బంధుగుల కుర్రాడు పైడిఘంటం కృష్ణారావు పర్లాకిమిడి నుంచి

వచ్చి విజయనగరంలో ఉండి చదివేవాడు. పిల్లాడు చెడుసావాసాలు పరగకుండా ఒక కంట కనిపెట్టవలసిందని అతగాడి తండ్రి అప్పారావు కొకపని పెట్టాడు. అయితే ఒక రోజున అంతు చెప్పకుండా కృష్ణారావు కాకినాడకు ఉడాయించేశాడు. అవి ధార్వాడ నాటక సమాజం రోజులు, పిల్లలు నిలుస్తారా? సెలవులకు సుపుత్రుడు ఇంటికి రాకపోయేసరికి, గాభరాపడి ఆపెద్దమనిషి విజయనగరానికి పరుగు తీసి వచ్చాడు. అప్పారావు నడిగితే ఆయనేమి చెప్పగలడు గనక? వాకబుచేసి విషయం రాబట్టి ఆయన చెవిలో వేసేసరికి, మరి చెప్పాలా, అంత పెద్దమనిషి అగ్గిరాముడై పోయాడు. అప్పారావు మీద విరుచుకుపడ్డాడు.

ఇంతకూ పైడిఘంటం కృష్ణారావు చెడిపోలేదు. గురజాడ అప్పారావు శిష్యత్వంచేసి పాడూకాలేదు. విద్యావ్యసనాన్ని మాత్రం తలకు పట్టించుకొన్నాడనీ, పర్లాకెమిడి కాలేజి గ్రంథాలయాన్ని ఖాళీ చేశాడనీ, కన్యాశుల్క నాటక ప్రదర్శ నానికి నడుం కట్టుకొని నిలిచాడనీ గిడుగువారు రాశారు.

గురజాడ అప్పారావు జాన్సన్ అయితే, ఆజాన్సన్‌కు బాస్వెల్ అనిపించు కొన్నానని తానుగా తానే రాసుకొన్న ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారు, నేరుగా అప్పారావు శిష్యులుకారు. ఒంగోలు నుంచి పై చదువుల కోసమని తాము విజయ నగరానికి వెళ్ళేనాటికి (1904), అప్పారావు కాలేజి పని విడిచి పదేళ్ళు పైబడింది. సంస్థాన వ్యవహారాల్లో తలబంటిగా మునిగి ఉండే వాడప్పుడు. 1906 లో 'ప్రైవేటు' గా యఫ్. ఎ. చదువుతూ తమ తండ్రిగారి ప్రోద్బలంతో విజయనగరం సంస్థానం ఆఫీసులో గుమస్తాగా కుదిరాకనే అప్పారావు పరిచయం గలిగింది. తమ ఇంటికి రోజూ పొద్దుట వచ్చి తెలుగు సంస్కృత గ్రంథాలను శాసనాలను చదివి 'నోట్సు' తీసి పెడుతూ ఉండవలసిందిగా అప్పారావు ఆయనకు పనిపెట్టాడు.5

అంతకు మునుపే ఆంధ్రాంగ్లసాహిత్యా లంటే విశేష శ్రద్ధఉన్న నాకు, ఆయన సాహిత్య పరిశోధనాగారంలో కృషి చేయడం చెప్పలేనంత ఉత్సాహం కలిగించింది. ఆయనవల్ల నేనుపొందిన శిక్షణ ఎంత ఉత్కృష్టమైనదో, నేను పట్ట భద్రుడనై కాకినాడ కళాశాలలో ట్యూటరుగా లెక్చరరుగా చేరిన తరవాత నాకు బాగా తెలియవచ్చింది. ఆయన సాహచర్యం నన్నొక జిజ్ఞాసాపరునిగా సహృద యునిగా సాహితీ పరునిగా తయారు చేసింది. ఆయన శిక్షణ అటువంటిది. అది నాకే ఆశ్చర్యం కలిగిస్తున్నది. 6

ఆదర్శ ఉపాధ్యాయుడు తన విద్యార్థులలో నిజమైన సాహిత్యాభిలాషను పెంపొందింప జేయాలని తన విద్యాసంబంధి వ్యాసాలలో చాల చోట్ల రాసిన గురజాడ అప్పారావు, ఆచరణలో తన ఆశయాన్నెలా నెరవేర్చిందీ స్థాలీపులాక న్యాయంగా ఈ రెండు సంగతులూ తెలియజేస్తున్నాయి. ఉద్యోగవిరమణ తర్వాత గూడా బడిపిల్లలను ఆదరిస్తూ ఆదుకొంటూ వచ్చాడు. సుబ్రహ్మణ్యంగారి విషయమే తార్కాణం. బి. ఏ. పరీక్షకోసం మద్రాసుకు వెళ్ళి అక్కడ జబ్బుపడ్డారు. ఆ సమయానికి మద్రాసులో ఉన్న అప్పారావుకు ఉత్తరం రాశారు. ఆయన వెంటనే తన వద్దకు రావలసిందని సుబ్రహ్మణ్యానికి జవాబు రాశాడు. వచ్చాక వైద్యం చేయించి మోటారు కార్లో తీసుకుపోయి 'స్టూడెంట్స్ హోమ్'లో దిగబెట్టి పోయేముందు తన వద్దనున్న చిల్లరపైకం సుబ్రహ్మణ్యంగారి చేతుల్లో పోసిపోయాడు. లెక్కపెట్టుకోగా అది ఎనభై రూపాయలు! "నేను వారి పిల్లలతో సమానుడనైతిని."

బంధుగులపిల్లలు కూడా అప్పారావు ఔదార్య సాహాయ్యాల ననుభవించారు. కావూరి చిరంజీవి అనే తెలివైన ఒకకుర్రాణ్ణి అల్లుణ్ణి చేసుకొందామని కూడా ఆయన తలపోశాడు. అయితే గురజాడ పేర్రాజు పంతులుగారి పౌత్రుడైన పేర్రాజు చిరంజీవిని ఎగరదన్నుకు పోయాడు. పేర్రాజు పంతులుగారి మరో మనవడైన శ్రీపతి సీతాపతిరావుకూడా అప్పారావు నాశ్రయించి చదివినవాడే. చివరకు ఆయన కుమార్తె మాణిక్యమ్మ, అప్పారావు కోడలై వచ్చింది. ఇక భార్యతరపు బంధువులలో పెద్ద బావమరది నరసరాజుకు విద్యతోబాటు ఇంతో అంతో బుద్ధికూడా నేర్పించ వలసి వచ్చింది. అప్పారావు ఇల్లు ఇలా ఒక చిన్న సత్రమే కావలసి వచ్చింది. ఈ పిల్లల జీతనాతాలన్నీ తన జేబునుంచే వదులుతున్నాయని కాదు, గురజాడ వంశస్థులకు అప్పటికప్పుడే అప్పారావొక పెద్ద దిక్కైపోతున్నాడనే అర్థం చేసుకోవాలి.

# 2

ఇది ఇలా ఉండగా, దేశంలో సుడిగాలిలాంటి దొకటి వీచసాగింది. ఎక్కడెక్కడి ప్రాంతాలనూ ఆ ప్రాంతీయులనూ ఏకముఖం చేసిన ఈ గాలిపేరు 'దేశీయ మహాసభ' లేదా కాంగ్రెసు.

రామమోహనరాయల గుండెలో తొలిసారి అలసాగిన స్వతంత్ర రాజకీయ భావవీచిక, బ్రహ్మసమాజ, ప్రార్థనసమాజ, దివ్యజ్ఞాన సమాజోద్యమాల పుణ్యమాఅని, బలపడింది, బయటపడింది కూడా. తటాకపు అలకూ సాగరపు తరంగానికీ గల అంతరమే ఉంది, 1885 కు ముందూ వెనకా రాజకీయ సంచలనపు సంగతి. 'సిపాయి తిరుగుబాటు' మిగిల్చిపోయిన శ్మశానంలో చితాభస్మరాశినుంచి ఒక వట వృక్షమే పుట్టుకొచ్చినట్టయింది. ఇల్బర్టుబిల్ (Ilbert Bill) ను నిరసిస్తూ దేశంలోని యూరోపియన్లు రిప్పన్ (Ripon) దొరపై లేవదీసిన దుమారం, భారతీయులైన న్యాయాధిపతులు యూరోపియన్ నేరస్థులను విచారించగూడదంటూ జాత్యహంకార వైఖరిని చూపెట్టేసరికి, భారతీయుల ఆత్మగౌరవాన్ని బలంగా చరిచి దాని నిద్రవదిలించినట్లైంది. 'సివిల్ సర్వీసు' పరీక్షలలో నెగ్గినప్పటికిన్నీ, సురేంద్రనాథ బెనర్జీని ఉద్యోగం నుంచి ఊడలాగ బూనిన దొరతనంవారు, 1858 లో విక్టోరియారాణి ప్రకటన (Queen's Proclamation) లోని ఔదార్యమంతా కపట నాటకమే అని నిరూపించారు. ఒకవైపున వాయవ్యదిశనుంచి రష్యా బూచి ఆఫ్ఘనిస్థానాన్ని సమీపిస్తున్నదని ఇంగ్లాండులో మొదలైన కాకిగోల, ఇండియాలోని బ్రిటిష్ అధికారులకు గంగవెర్రులెత్తించిన రోజులవి. ఆంగ్ల విద్యాధికులైన భారతీయులు ప్రభుత్వమంటే విముఖత చూపతూ అవిశ్వాసం ప్రకటిస్తూ ఉన్నారు. ఇది ఆడక తెర. దీనినుంచి బయటపడడానికి గల మార్గమెల్లా, వీళ్ళను మంచిగా మచ్చిక చేసుకోడమేనని డఫ్రిన్ దొర గ్రహించాడు. ప్రభుత్వోద్యోగి అయిన ఏ. ఓ. హ్యూమ్‌కు ఈ పని నప్పగించాడు.

ఏ చారిత్రక శక్తికైనా అనేకానేక ముఖాలుంటాయి; పైన చెప్పింది వాటిలో ఒకానొక ముఖమే. ప్రభుత్వంలో ఉన్నతస్థాయిలో తమకెలాంటి ప్రమేయమూ లేక పోవడం గురించి దేశీయుల అసంతృప్తి ఈనాటిదేమీకాదు. 'ది బ్రిటిషిండియన్ అసోసియేషన్' (The British Indian Association) అని కలకత్తాలో ఒకసంస్థ

ఏర్పడి, విద్యావంతులకందరికీ వేదిక కాగలిగింది. హరిశ్చంద్రముఖర్జీ, రాజేంద్రలాల్‌మిత్ర, ప్రసన్నకుమార్ టాగూర్‌వంటి ముఖ్యులతో బయల్దేరిన ఆ సంస్థకిప్పుడు సురేంద్రనాథ బెనర్జీ అధినేత: కొత్తతరానికంతటికీ అతనిదే మేల్బంతి. బొంబాయిలో జగన్నాథ శంకరసేట్ ప్రభృతులు స్థాపించిన మరొక ప్రజా సంస్థలో దాదాభాయి నౌరోజీ అగ్రగణ్యుడు. ఇక మద్రాసులో ఏనుగుల వీరాస్వామయ్య, వెంబాకం రాఘవాచార్యులు, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళ కలిసి ఏర్పాటుచేసిన 'హిందూ లిటరరీ సొసైటీ' ఆంగ్లవిద్యావ్యాప్తి విషయమై ఏకైకశ్రుక్రితం సాగించిన ఆందోళన ఫలితంగా. 'ది మద్రాస్ నేటివ్ అసోసియేషన్' (The Madras Native Association) జన్మించింది. దానికి గాజుల లక్ష్మీనరసుచెట్టి నాయకుడు. కలకత్తాలో హరిశ్చంద్రముఖర్జీ పత్రిక *ది హిందూ పేట్రియట్* (The Hindu Patriot) వలెనే మద్రాసులో పి. సుబ్రహ్మణ్యయ్యరు లాంటివారి అండదండలతో *ది హిందూ*(The Hindu)అనే వారపత్రిక. కాబట్టి కాంగ్రెసనేది ముందు హెచ్చరికంటూ లేకుండా మిన్నులనుంచి ఊడిపడలేదు. ఈ అన్నిప్రజాసంఘాల రాజకీయ వేదికే కాంగ్రెసు సంస్థ

పూనాలో జరగవలసిఉండి కారణాంతరాలవల్ల మద్రాసులో జరిగిన తొలి పెద్దల సమావేశం పుట్టుపూర్వోత్తరాల గురించి భేదాభిప్రాయాలున్నాయి. ఎలాగో ఓలాగు మొలకెత్తిన ఈ సంస్థ తన ఆకుల చేతులతో దేశాన్నంతటినీ కమ్మివేసింది. ప్రతిఊరూ ప్రతిస్పందించింది - విజయనగరంకూడా, జమీందార్లు కూడా దానికి దోహదం చేయసాగారు - ఆనందగజపతితోసహా. గురజాడ అప్పారావు గుండె కూడా సందడి చేయసాగింది. అయితే తనకంటె, తనతమ్ముడైన శ్యామలరావే ఎక్కువసందడి చేశాడు. విజయనగరంలో బి. ఏ. చదువుతూ ప్రిన్సిపాలు రామానుజాచార్యుల బోధనాపద్ధతులు సరిపడనందుచేత, మద్రాసులోచేరి చదవసాగిన ఈ యువకుడు ఉత్సాహి కూడా. తమ్ముడంటే అప్పారావు బహిఃప్రాణమే. పైగా అతనికి పిల్లనిచ్చిన మామ కేసానుపల్లి నరసింహారావు మద్రాసు చదువుకు తగిన పైకమిస్తున్నాడు ప్రెసిడెన్సీ కాలేజిలో బి. ఏ చదువుతూ ఉండగా శ్యామలరావుకి కాంగ్రెసు గాలి సోకింది. అప్పటికే ప్రథమ కాంగ్రెసు మహాసభ బొంబాయిలో జరిగిపోయింది. రెండవది కలకత్తాలో జరుగుతుంది. అక్కడికివెళ్ళాలి. అయితే ఒక చిక్కు: బొంబాయిసభలోలాగా ఇచ్చవొచ్చిన ఎవరంటేవారు పాల్గొనే వీలు లేదు; కాంగ్రెసులో సభ్యులైనవాళ్ళు కొందరు తమ ప్రతినిధిగా తననెన్నికొని అధికారమిచ్చి పంపాలి. శ్యామలరావు ఎవరి ప్రతినిధిగా వెళ్ళిందీ తెలియదు.

సింగడు అద్దంకికి పోనూపోయి రానూవచ్చాడన్నట్లు గాకుండా శ్యామలరావు కాంగ్రెసు మహాసభలో నిజంగానే పాల్గొన్నాడు. విషయ నిర్ణయసభలో ఒక తీర్మానంమీద పదినిమిషాలసేపు ఉపన్యసించి మహాఘనమే అనిపించుకొన్నాడు. మదనమోహన మాలవ్యాకూడా తొలిసారి కాంగ్రెసులో ప్రసంగించిందా సంవత్సరంలోనే ఆ నాటికి మాలవ్యాకూడా నవయువకుడు. కలకత్తాలో శంభు చంద్రముఖర్జీ ద్వారా శ్యామలరావు చూసిమాట్లాడివచ్చాడు. మూడవకాంగ్రెసు మద్రాసులో జరిగినప్పుడు (1887) అక్కడేవుండి బి. యల్. చదువుతూవచ్చాడు, కాబట్టి శ్యామలరావు మళ్ళీ పాల్గొని ఉంటాడు. మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాధిపతులేగాక విజయనగరం మహారాజా వెంకటగిరి రాజాలవంటి జమీందార్లుకూడా కాంగ్రెసు సంస్థకు ఘూరివిరాళాలిచ్చినట్లు బెసెంటమ్మ రాసింది. అంటే విజయనగరంలో 1887 లో ఒకమారు 1889 లో ఇంకొకమారు కాంగ్రెసుసభల్లో ఉపన్యసించినందుకు నేరుగాగాని, తగుదునమ్మా అంటూ కాంగ్రెసు మహాసభల్లో పాల్గొంటున్నందుకు శ్యామలరావు కారణంగాగాని, ఆనందగజపతి అప్పారావుమీద ఏ హానీ చెయ్య లేదని దీన్నిబట్టితెలుస్తుంది. 'రేడికల్' అభిప్రాయాలుగల [illegible] ఉత్తనే అభిమానించలేదన్నమాట మహారాజా.

కీ. శే. అవసరాల సూర్యారావిచ్చిపోయిన భోగట్టా విశ్వసనీయమైతే, బొంబాయిలో జరిగిన ఐదవ కాంగ్రెస్‌లో గూడా (1889) శ్యామలరావు పాల్గొన్నాడనుకోవాలి.7 ఈ కాంగ్రెస్‌లో ఒక విశేషం ఉంది. ఇంగ్లాండులో పార్లమెంటు లోపలావెలుపలా కాంగ్రెసు అనుకూల ప్రసంగాలు చేసిన చార్లెస్ బ్రాడ్లా (Charles Bradlaugh) స్వయంగా వచ్చి పాల్గొని పోవడమే గాక, సర్ విలియం వెడర్‌బర్న్ (Sir William Wedderburn) అధ్యక్ష స్థానానికి ఎన్నిక కావడం కూడా విశేషమే. కాంగ్రెసు నాయకులను 'రాజద్రోహులు' (Seditionists) గా చిత్రించడం అప్పటికే మొదలైంది. మద్రాసు కాంగ్రెసు (1887) లో ఆ విషయాన్ని కుండబద్దలు గొడుతూ స్థానిక న్యాయవాది ప్రముఖుడైన ఎర్డ్లీ నార్టన్ (Eardley Norton) ఉపన్యసించి ఉన్నాడు. నలభై సంవత్సరాల క్రితం ప్రజల హక్కుల గురించి ఎంతో రాసీ మాటాడీ స్వదేశీయులకు పరమాప్తులలో ఒకరనిపించుకొని పోయిన జార్జి నార్టన్ అనే సుప్రీంకోర్టు అడ్వొకేటు పుత్రరత్నమే, చిచ్చరపిడుగులాంటి ఈ ఎర్డ్లీ. శాసన సభల్లో ప్రజా ప్రతినిధులకు ప్రవేశం కలిగించాలనడమే 'రహస్య రాజద్రోహచర్య' అయేట్టుంటే-

If this be sedition, I am right glad to be called a 'seditionist', and doubly, aye trebly glad when I look around me to-day, to know and feel I am ranked as one among such a *magnificient array of 'Seditionists'*. [8]

అని ఎడ్లీ ఉపన్యసించాడు. ఉపన్యాస పాఠంలో ఊదిపలికిన చివరి మాటలే గురజాడ శ్యామలరావును ఉత్తేజ పరచినట్టివి. ఇంగ్లాడులో కాంగ్రెస్ అనుకూల ప్రచారం చేసిరావడానికి జార్జిగేల్, హ్యూమ్, హె. సీఆడమ్, ఎడ్లీ నార్టన్, ఫిరోజిషా మెహతా సురేంద్రనాథ బెనర్జీ, మన్మోహన్ ఘోష్‌లతో ఒక ప్రతినిధివర్గాన్ని సీమకు పంపాలని ఐదవ కాంగ్రెసు తీర్మానించింది. వీరినందరనీ మనస్సులో పెట్టుకొని To the Magnificient Seditionists అనే గేయాన్ని రాసి 'ది హిందూ' పత్రికలో ప్రకటించాడు. ఆ పద్యాన్ని శంభు చంద్రముఖర్జీకి చూడ బంపి అభినందననూ ప్రశంసనూ రాబట్టుకొన్నాడు. అంతకంటే ముఖ్యమైనసంగతి- సముద్రంఒడ్డున మిత్రులతో కలిసి కూర్చుని ఉన్న శ్యామలరావును వెదుక్కుంటూ వచ్చి, ఎడ్లీనార్టన్ కౌగిలించుకొనిగానీ వదల్లేదు.*

కాంగ్రెసు కార్యకలాపాల్లో తల దూర్చిన ఈ అన్నదమ్ములలో అన్నకుగల స్వదేశాభిమానం, 1887లో విక్టోరియారాణి స్వర్ణోత్సవ సందర్భంలో ప్రశంసా పద్యాలు రాసి *లిస్ అండ్ రయత్* పత్రికలో అచ్చు వేయించేందుకు అడ్డు రాలేదు. రాజభక్తి కాంగ్రెసు శ్వాసగా ఉండిన రోజులవి. కవులప్పుడప్పుడు రాజ భక్తిని కవిత్వానికెక్కిస్తూ ఉండిరి: యువరాజు రాకను పురస్కరించుకొని, కొక్కొండ వేంకటరత్నం *ప్రిన్సు అఫ్ వేల్సు హిందూస్థాన సందర్శనము* అంటూ శతఘ్నుల ఉద్ఘోషతో పదేళ్ళ కిందటే స్వాగతంచెప్పి ఉన్నాడు. చిలకమర్తి లక్ష్మీ నరసింహం రాణీగారి స్వర్ణోత్సవానికీ వజ్రోత్సవానికీ కవిగట్టాడు. రాజకీయాలకే పెదమొగంపెట్టి సంఘసంస్కరణదే పైచేయికావాలని పదేపదేరాజభక్తిని ప్రకటిస్తూ వస్తున్నాడు వీరేశలింగం. దుష్టప్రభువులు పెచ్చు మీరిన వెనకటి దినాళ్ళలో నరకతుల్యమై ఉండిన ఈ దేశాన్ని సమైక్య పరచి ఊహకు మించిన సౌఖ్య సదుపాయాలను సమకూర్చిన బ్రిటిష్ దొరతనం, ఆయనకు స్వర్గతుల్యంగా కనిపించింది. లోపాలున్నప్పటికీ, అది చిరస్థాయి కావాలని జగదీశ్వరుణ్ణి ప్రార్థించాడు. అయితే

---

* ఇవన్నీ కుటుంబంలో మిగిలిపోయిన కథలే. కీ.శే. పుందుర్తి ఈశ్వరదత్‌గారు అఖిల భారతకాంగ్రెస్ సంఘ గ్రంథాలయం గాలించినా, కలకత్తా బొంబాయి కాంగ్రెస్సులలో శ్యామలరావు పాల్గొన్న దాఖలా దొరకలేదు.

శిశుత్వం నెపాన దాది నిర్బంధంనుంచి విడుదలను కోరే ప్రయత్నాలు రాజద్రోహ చర్యలు కానేరవన్నాడు. 9. ఇక, రఘుపతి వేంకటరత్నం మద్రాసు కాంగ్రెసు సభలో చేసిన ఘనకార్యంగురించి, ప్రత్యక్షంగా చూచి కొంత వెంకటప్పయ్య వర్ణించాడు. ఒక ఇల్లాలిని భర్తనుంచి దూరంచేసి, 'వైవోర్సు' పొందివ పెళ్ళాడకుండానే కాపురంచేస్తూ, వెంట పెట్టుకొని తిప్పుతూ కాంగ్రెస సభలో ప్రాగ్రాం టున్నాడని ఎడ్లీ నార్టన్‌ను వేలెత్తి చూపి, "తీవ్ర నీతివాదుల"తో కలిసి దిగ్గునలేచి సభ విడిచిపోయాడట 'మహర్షి' కానున్న నాయుడుగారు. అదే మహాసభలో, కళా ప్రియులమంటూ కొందరు నగరంలోని కళావంతులను పిలిపించి కచ్చేరీలు జరిపించారని విని ఆయన మరెంత కటకట పడ్డాడో ఊహించుకోవలసిందే. 10. సంఘ సంస్కరణల గురించి చాదస్తం వల్లగానీ, రాజభక్తి గురించి మూఢ విశ్వాసం వల్లగానీ, నాటి మేధావులనేకులు మడిగట్టుకొంటూ ఉంటే, రాజకీయాల మైలను గూడా గురజాడ సోదరులు వెరవలేదు. రాజకీయ కావ్యాన్ని రాయాలని అప్పారావు ఉబలాటపడితే, రాసి లోకంముందు పెట్టిన ధన్యజీవి శ్యామలరావు. అన్నగారి ఉత్సాహంలా అతనిది తాటాకు మంటగాక, నిలిచి వెలిగిన జ్వాల అయివుండాలి.

చచ్చినవాని కళ్ళు చేరెడేసి అని కాదుగాని, శ్యామలరావే బతికి ఉంటే అన్న తలదన్ని పోయినా పోకున్నా, సమవుజ్జీగానైనా రాణించి వుండేవాడు. శంభుచంద్ర ముఖర్జీనిగూడా తన ఆంగ్లభాషా వైదుష్యంతోటి మెప్పించాడు. కలకత్తా విశ్వవిద్యాలయంలో అలాంటి విద్యార్థులుంటే బాగుండునని ముఖర్జీ అనుకొన్నాడు. అయితే రాజకీయాలలో తలమునకలై పోకుండా, న్యాయశాస్త్ర గ్రంథాల మీదనే ప్రధానంగా దృష్టిని కేంద్రీకరించవలసిందంటూ శ్యామలరావు కాపెద్దమనిషి సలహా ఇచ్చాడు.

శ్యామలరావు రాసిన ఇంగ్లీషు పద్యం ది హిందూ పత్రికలో అచ్చుపడి కూడా ప్రస్తుతం లభించకపోవడానికి కారణం, ఆ సంవత్సరపు [illegible] సంపుటం వారి కార్యాలయం నుంచి తప్పిపోవడమే. అయినా శ్యామలరావు లఘు రచన ఒకటి,జి.సి.వి. శ్రీనివాసాచార్యులహరిశ్చంద్ర ఆంగ్లనాటకంలో మిగిలివుంది. అప్పారావు బాల్య స్నేహితుడు షరాఫ్ ఖానా వెంకటకృష్ణారావు 1889 లో విజయ నగరంలోనే 'ది రిప్పన్ హిందూ థియలాజికల్ హైస్కూలు' స్థాపించగా దానికి హెడ్మాష్టరుగా వచ్చి క్రమేపీ ఆనందగజపతి కృపకు పాత్రుడై నాటకాలలో వేషం కడుతూ గొప్ప నటుడని పేరుపొంది చివరకు నాటకకర్తగూడా తాగలిగా డీ శ్రీనివాసాచార్యులు. ఈ నాటకం చివరను హరిశ్చంద్రుడూ నారదుడూ చేసిన

సంభాషణ పద్యరూపంలో వుంది. దానిని శ్యామలరావు రాశాడని ఆచార్యులే ఒప్పు కొన్నాడు. అలాంటి శ్యామలరావు విద్యార్థిదశ పూర్తిగాకమునుపే కన్ను మూశాడు. కాలేయానికి సంబంధించిన వ్యాధి చికిత్సకు లొంగలేదు. అప్పటికి అప్పారావు కొక కుమార్తె మాత్రమే గాక కుమారుడుకూడా. మగబిడ్డకు పదో మాసం నిండక మునుపే ఈ ఘోరం జరిగింది. కాపురానికికూడా రాలేదో, లేక కొత్తగా వచ్చిందో, ఒక పసిపిల్ల యావజ్జీవం వైధవ్యంపాలై పోయింది. తలిదండ్రులు తల్లడిల్లారు. అన్న మంచం పట్టాడు. శ్యామలరావంటే రాముడి తమ్ముడే!

ఆ స్థితిలో అప్పారావు మనస్సుకు ఊరట కల్పించింది మరెవరో కాదు. సంస్థానాధిపతి ఆనందగజపతే.

# 3

కవితా మాధురిఁ దా గ్రహించి 'యిది శ్లాఘ్యం బిద్ది శ్లాఘ్యంబుగా
దు, విశేషం బిటు నిర్విశేష మిటు, మాధుర్యం బిటుప, సత్కవీ!
కవిరాజా!'యని మెచ్చియిచ్చు నృపుఁ డొక్కండైనఁ గన్పట్టఁ డే
గవియై పుట్టుటకన్నఁ బాప పరిపాకం బుండునే, భూవరా!

నానా రాజాస్థానాలలో అవధానవిద్య ప్రదర్శిస్తూ జీవిక నార్జించుకొంటూ విజయనగరం వచ్చిన తిరుపతి వెంకటకవులు ఆనంద గజపతిమీద చెప్పిన పద్యమిది. ఆయన పేరు ఎత్తిఎత్తకముందే తమ కవితాకుమారి సరేనన్నదట. జమీందారులేం? చచ్చి పోలేదన్ని. జమీందార్లలో విద్య తెలిసినవాళ్లెందరు? అన్ని చుక్కలకు ఒక్క చంద్రుడు. వెనకటికి రఘునాథనాయకుణ్ణి చేమకూర వేంకట కవి. విద్యలలో సాహితీ రసమహత్వమూ దాని అందచందాలూ ఎరిగి ఇవ్వగలవాడన్నాడు. అలాగే "ఏ ధరణీశుడో యెఱుఁగు, నెల్లరెఱుంగరు" అని. ఈ జంట కవులు ఆనంద గజపతిని ప్రస్తుతించారు, వీరికి మెచ్చి యిచ్చాడో లేదో తెలియదుగాని ఆనంద గజపతి రఘునాథు నంతటివాడే. ఆయన హయాము (1879-1897) విజయనగర సంస్థానాన్ని కళల విషయంలో చిన్న రాయసామ్రాజ్యంలాంటి దాన్నిగా మార్చింది. ఆంధ్రదేశపు ఉత్తరాగ్రాన మరో విద్యానగరం తలెత్తింది.

ఆనంద గజపతికి అల్లంతదూరాన ఉంటూ ఆదర్శ పురుషుడని ఒక దేవతా ప్రతిమను మనస్సులో నిలుపుకొని పూజిస్తూ విద్యార్థి జీవితాన్ని గడిపిన గురజాడ అప్పారావు, ఇప్పుడాయన సమీపవర్తి కాగలిగాడు. దూరపుకొండలు దాపయ్యాయి. నునుపు ఏమైనట్టు? మహారాజా మహాపురుషుడేనా? ఆయన ఎవతెనో చేరదీశాడని విని, తాను ప్రేయసి దృష్టితో గర్విస్తూ ప్రతిమను పగులమొత్తి "ఆయనంటే నాకున్న గర్వం, దీనితో తొలగిపోయింది." అనుకొన్నాడు. 11 అయితే తద్వారా దెబ్బతిన్నది అబద్ధమేగాని నిజంకాదు. ఎందుకనంటే తానిన్నాళ్ళూ కల్పించుకొన్నది, ఒక భ్రమ మాత్రమే. ఆనందగజపతి గొప్పదనం, స్త్రీ లౌల్యంవల్ల చప్పబడిపోదు. వెనకటి రాజుల 'రసికతా'ముద్ర ఆయన హృదయంమీద పడకపోలేదు. గురజాడ

లతో కూడిన ఒక అసామాన్య వ్యక్తిని ఆనంద గజపతిలో దర్శించినాటికి, అప్పారావు మనస్సు పరిణతమైంది. నాటికి నేటికీ మహారాజా ఒక్కటిగానే ఉండిపోయాడు.

ఆనంద గజపతి ఆశ్రితుడుగా ప్రవేశించి అంతేవాసిగా పరిణమించిన మనిషికి ఆయన సల్లాపాలు సందేశాలే. సూక్తులు ఉపనిషన్మహావాక్యాలే అయ్యాయి. ఆనంద గజపతి చనిపోయిన కొన్నేళ్ళకు గాని ఆయన పట్టునుంచి అప్పారావు తప్పుకోలేక పోయాడు. అప్పటికి అప్పారావు వ్యక్తిత్వాన్ని సాధించు కొన్నాడని ఈ మాటలే తెలుపుతాయి :

> ఆనందరాజును గురించి ఎవరైనా సహజంగా వొక ప్రశ్న వేయవచ్చును. ఆయన జీవిత పరమావధి ఏమిటి? యుద్ధవీరునిగా, రాజకీయ చతురునిగా, రచయితగా ఆయనేమైనా చరిత్ర సృష్టించాడా? లేదు; ఆయన చరిత్రను సృష్టించలేదు. చరిత్రను, రాజకీయ చరిత్రను సృష్టించిన హిందువులు అట్టే మంది లేరు.
>
> ఆనందరాజు సాహిత్య కృషి అంతంత ; అపుడపుడు వ్రాసే పద్యాలకు, వేదాంత చర్చలకు అది పరిమితం. ప్రపంచ దృష్టిని ఆకర్షించగలిగాననే ఆయన క్లెయిము ప్రతికూల పరిస్థితుల మధ్య ఆయన పెంపొందించుకొన్న గుణశీలాదులపై ప్రాతినిధ్యం వహించే ఆయన వ్యక్తిత్వంపై ఆధారపడి వుంది. ఆయన తన వ్యక్తిత్వములో హిందూ ముస్లిం యింగ్లీషు నాగరికతలను ప్రతిబింబింప చేసుకొన్నాడు.12

ఆనంద గజపతి జీవితకాలంలో అప్పారావు ఈ మాట లనిఉండలేదు. ఎందుకనంటే భయం వల్లా భక్తి వల్లా కాదు ; తానింకా యువకుడు ; సాధకుడు ; మహారాజాకంటే ఎంతో దిగువ నున్నాడు ; ఆయన సౌజన్య శాంత గాంభీర్యాలలో ఓలలాడుతున్నాడు ; ఆయన వద్ద 'రాజయోగం' సాధన చేసుకొంటున్నాడు. నిజంగా ఆనంద గజపతి గురజాడ అప్పారావు జీవితగురువు.13

గురుని జాడల్లోనే శిష్యుడు నడిచాడు ; గజపతి త్రోవనే పట్టాడు.

ఆనంద గజపతిని అంతటివాణ్ణి చేసింది తండ్రి విజయరామ గజపతి శ్రద్ధ మాత్రమే. లింగం లక్ష్మాజీ ఆంగ్ల విద్యా గురువు కాగా, ఒకమౌల్వీ పార్శీ (ఉర్దూ) భాష నేర్పాడు. భాగవతుల హరిశాస్త్రీ, మైసూరు భీమాచార్యులూ సంస్కృతం నేర్పారు. స్వయం కృషితో ఆయన ఫ్రెంచి, లాటిన్ భాషలు సాధించుకొన్నాడు. ఇంతటి విద్యావంతుడు గనకనే "ఏను జూచిన రాజులం దెల్లనొక్క — విజయ

నగర మహారాజు వేత్త" అని తిరుపతి వేంకట కవులన్నారు. సాహిత్యానికి సంగీతం సైదోడు. ఈ లలిత విద్యలవల్ల 'రసికత' పేరిట పట్టి భోగలాలసుడై చెడుతాడేమో నని, మగవాడికి కావలసిన గట్టి శిక్షణల నిచ్చాడు, తండ్రి : గుర్రం స్వారీ, కసరత్తు, గొప్పవారి ఆటలైన పోలో, క్రికెట్ వగైరాలు. ఆశించినంతకంటె అద్భుతమైన ఫలితం కలిగింది. సౌకుమార్యం భావంలోనేగాని దేహానికి కాదు ; సౌజన్యం మంచి వారిపట్లనేగాని పనికిమాలిన వారిపట్లకాదు : సంస్కారం విద్యావంతుల నడుమనేగాని వినయదూరుల నడుమకాదు. మనుషులను విలాస వస్తువులుగా వాడుకొని ముచ్చట దీరాక తోసివెయ్యకుండా వారిమనస్సుల అందచందాలను గుర్తించి వాటికి తగి నట్లుగా తన వైఖరిని నిర్ణయించుకొనేవాడు. కొండెములూ దబ్బరమాటలూ చెవిని బెట్టక కిందివారి లోపలేశాలను సహించి వారికి తలలోని నాలుకై వ్యవహరించాడు. దిగబడి వస్తూ ఉన్న మార్పులను గమనించి, అవి మంచివైతే వాటిని రెండుచేతులా పట్టి పిలుచుకొన్నాడు. అనంద గజపతి ఏ ప్రమాణాలకైనా గొప్పవాడే.

> క్షమావంతుడు, పరమధార్మికుడు, సర్వవిద్యా పారంగతుడు అగునీ రాజు సర్వదా పండితమండలీ పరివృతుడై విద్యాగోష్ఠియందు కాలము గడుపు చుండెడివాడు. 14

సాహిత్యాభిరుచి సంస్థానాధిపతుల చాలులోనే ఉంది. విజయనగర మంటూ ఒక బస్తీ తలెత్తకమునుపే, కుమిలి అనబడే కుంభిపురంలో ఉంటూ పూసపాటివాళ్ళు రాజ్యం చేసేకాలాన తమ్మరాజు [illegible] విజయం, వేంకటపతిరాజు [illegible], ఆనందరాజు [illegible] రామాయణం రచించి ఉన్నారు. బొబ్బిలియుద్ధకాలపు పెదవిజయరామరాజు గోగుల పాటి కూర్మనాథకవిని పోషించాడు. మరొక విజయరామరాజు అడిదంసూరకవిచేత మిగత రాజుల నందరినీ తరాజులుచేసి తానొక్కడే రాజశబ్దార్థుడుగా ప్రశంస పొందాడు. అతని మనమడూ అదేపేరుగలవాడూ ఆనందగజపతి తండ్రి. కాశీలో ప్రవాస జీవితం గడిపి తన తండ్రి నారాయణ గజపతి గతించాక, ఆయన ఎన్నిక చేసిన వధువు అలక రాజేశ్వరీదేవితోబాటుగా ఎందరో పండితులను వెంటబెట్టుకొని 1848 లో విజయనగరానికి మరలివచ్చాడా మూడవ విజయరాముడు. వచ్చిన రెండేళ్ళకు ఆనందగజపతి జన్మించాడు. తర్వాత గవర్నరు జనరల్‌గారి మెప్పు సంపాదించి 'మహారాజా' అనిపించుకోగలిగాడు (1868) ; అలాగే విజయనగరాన్ని ఒక విద్యాపీఠంచేసి పండితులనూ కవులనూ పోషించి సెభాషనిపించుకొన్నాడు.

ఆనందగజపతి అన్న పసితనంలోనే పోబట్టి తలిదండ్రులకు రెండవ కుమారుడే దిక్కయ్యాడు. తండ్రీ కుమాళ్ళ సంబంధం చిత్రంగా ఉండేదంటారు. కుమారుడు సామాన్యుడుకాదని తండ్రికి తెలుసు. అతని 'శారదామందిరా'నికి తన మోతీమహల్ నుంచి వచ్చి లోన అడుగుమోపేముందు, ద్వారంవద్ద పాదరక్షలు విడిచి మరీ ప్రవేశించేవాడట విజయరామగజపతి. అలాంటి సంస్కారికి ఇలాంటి ఉత్తమ సంతానం సహజంగానే తగిఉంది. విజయరాముని ఆస్థానంలోని పండితులే ఆనంద గజపతికిగూడా కీర్తిని సంపాదించినవాళ్ళు. కాబట్టి పూసపాటి తెలుగురాజుల రక్తంలోనే ఉందనుకోవాలి ఈ కళాభినివేశమనే సుగుణం. దానికి అపూర్వమైన వ్యాప్తినీ, అపారమైన సాఫల్యాన్నీ కగిలించినవాడు, పూసపాటి తెలుగువంశపు కొసవెలుగు ఆనందగజపతి.

అలాంటి మహాభాగునితో అంత పరిచయమేర్పడడం అప్పారావును వరించిన అతిపెద్ద అదృష్టం. ఆస్థానంలో ఏర్పడిన 'డిబేటింగ్‌క్లబ్'కు ఉపాధ్యక్షుడుగా ఎన్నిక కావడం ఈ అదృష్టానికి నిర్దిష్టమైన రూపాన్నిచ్చింది (1889). ఇప్పుడిక తాను మహారాజా ఆంతరంగికుడే, అనుమాన మక్కర్లేదు. అలాగే విశాఖ మండల స్వచ్ఛంద సేవాదళ సభ్యత్వంకూడా. రెండవ ఆఫ్ఘన్ యుద్ధం నెపాన రష్యాబూచిని చూపెడుతూ ఇంగ్లీషువాడు తన పబ్బం గడుపుకోసాగిన రోజులవి. ఉన్న రాణువ చాలక, ద్వితీయ రక్షణశ్రేణిని నిర్మించేందుకని జమీందార్ల సాయాన్ని కోరాడు. వాళ్ళ స్వామిభక్తిని చూపేందుకు అవకాశం తమకెప్పుడెప్పుడని ఎదురు చూస్తున్నారు. ఆనందగజపతి ముదలైంది. మండలంలోని ప్రముఖుల సైనికుల దుస్తు ధరించి ఆయుధాలు ప్రయోగించడం నేర్చుకొంటున్నారు. ఇరవయ్యేరు సంవత్సరాల వయస్సులో కూడా ఎనబై పౌన్లకంటె ఎక్కువ బరువుతూగని శల్య మూర్తి గురజాడ అప్పారావు తగుదునమ్మా అంటూ ఈ సేవాదళ సభ్యుడయ్యాడు. మహారాజావారు కోరడమే తరువాయి, బ్రహ్మసమాజమేమోగానీ దివ్యజ్ఞాన సమాజంలో మాత్రం సభ్యుడయ్యాడుకూడా. అయితే అంతమాత్రంలోనే ఆ రెంటింటితోనూ తనసంబంధం అంతరించింది. సేవాదళ సభ్యత్వం మరెందుకూ పనికిరాకున్నా, ఆ రోజులలో ప్రజల్లోకూడా వ్యాపించిన యుద్ధపు బెదురు గురించి కన్యాశుల్క నాటకంలో ప్రస్తావించడానికైనా పనికివచ్చింది.

తండ్రిహయాములోనే ఆనందగజపతికి విద్వజ్జన పక్షపాతిగా పేరుండేది, *

---

* ఆనంద గజపతి పండితజనవిధేయుడనేందుకు లోకములో వాడుకలోనున్న ఒక

ఒకమారు తన నాశ్రయించిన కవిని తండ్రివద్దకు తీసుకెళ్లి, వెనక ఎన్నడో అడిదం సూరకవి చెప్పిన "రాజు కళంకిమూర్తి" చాటువును తలపన్నేట్లుగా మరొక పద్యం చెప్పించి, తానై దాని సారస్యాన్ని తండ్రికి వివరించిచూపి, కవి కోరిక తీర్పించాడట. తాను వేత్తకావడమేగాక వేత్తల పేతృత్వాన్ని గ్రహించి సత్కరించే పెద్ద బుద్ధి ఆయనది. సంస్థాన వ్యవహారాలను తల్లి చేతబెట్టి, తాను హమేషా కళల నిషాతో పొద్దు పుచ్చేవాడు. ముడుంబై నరసింహాచార్యులు, కొల్లూరి కామశాస్త్రి, మండ కామేశ్వరశాస్త్రి, భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి, పేరి వెంకటశాస్త్రి, పేరి కాశీపతిశాస్త్రి – ఏ కొలువుకైనా వన్నె తెగల పండిత రత్నమాల ఇది. వైణికులు దూర్వాసుల సూర్యనారాయణశాస్త్రి, గురాబత్తుల ('వీణ') వెంకట రమణదాసు; వాయులీన విద్వాంసుడు కలిగొట్ల కామరాజు; రుద్ర వీణా వాదనా నిపుణుడైన కవిరాయని రమణయ్య; హిందూస్థానీ సంగీతజ్ఞులు మహమ్మత్ ఖాను, మున్వర్ ఖాను, అబిదుల్లాఖాను, నిషావల్లీఖాను—సరస్వతీదేవి రెండవ రూపాన్ని పట్టి నాదసుధను గ్రోలిన అద్భుత శిశువులు. 1894లో [illegible] ఆదిభట్ల నారాయణదాసు ఆట పాటల మేటితనాన్ని మెచ్చి మైసూరు మహారాజా సత్కరించినట్లు వార్త వచ్చింది: విజయనగరం వాడికి మైసూరులో; గురజాడ అప్పారావు ఈ వార్తను మహారాజా చెవిని వేశాడు. అలా లభించింది 'హరికథా పితామహు'డికి స్వస్థానంలో 'రాజా'స్థానంలో తొలి ప్రవేశం. ఇందులో ఇతరుల ప్రమేయంకూడా ఉంది.

గురజాడ అప్పారావుకు వ్యక్తిత్వం ఏర్పడ సాగిన రోజులలో అది పీల్చుకొన్న ప్రాణవాయువు ఎంతటి సుసంస్కృతమైందో చెప్పడానికే ఈ జావితా

కథను 'వియర్వ్యావర్య' వియర్వ్యావర్యము (ద్వితీయ భాగము) పు. 52,53లో [illegible] నాడ ఆంధ్ర భాషా సంరక్షక సమాజమువారు పేర్కొన్నారు:

> ... అస్థాన పండితులేమి, యితర పండితులేమి, యీ మహారాజును "పండిత ప్రభూ!" యని సంబోధించు వాడుక గలదు. ఒకసారి యొక మహా విద్వాంసుఁడెట నుండియో వచ్చి మహారాజును బండితప్రభూయని సంబోధించుచు నొక శ్లోకమును జెప్పెను. ఆ మహారాజా శ్లోకమును విని సంతసించి "పండితప్రభూ" యను దానిని షష్ఠీతత్పురుష సమాసముగఁజెప్పుట కంటె బహువ్రీహి సమాసముగఁజెప్పుట యెక్కువ రసవంతముగ నుండునని యా పండిత వర్యునితో సరసముగఁబలికెనట!... మూరుఁబండితులే ప్రభువులని యాయన చమత్కారముగ సెలవిచ్చినారు. ఆ మాట యాయన నోట వెడలుటచే నంత సొగసుగా నున్నది...

ఇటువంటి కట్టు కథలూ ఐతిహ్యాలూ ఎన్ని వాడుకలో ఉండేవో,

అవసరమైంది. ఆనంద గజపతి ఘనతకు మరెన్నో నిదర్శనాలున్నాయి. వాటిలో ముఖ్యమైంది బహుగ్రంథ ప్రచురణ. నూరేళ్ళ క్రితం కలకత్తాలో ఏర్పాటైన 'ఏషియాటిక్ సొసైటీ', (Asiatic Society) సంస్కృతి చరిత్రలో ఒక పెద్ద కొండగుర్తు కాగలిగింది. చరిత్ర పురావస్తు సంపద, కళ, శాస్త్రం, సాహిత్యం–ఇవన్నీ, పరిశోధనకు రంగాలయ్యాయి. మాక్స్‌ముల్లర్ (Maxmuller) అన్నట్లు, వెయ్యేళ్ళను అంగవేసి దాటి యూరోపియన్ భావసీమలో అడుగుమోపిన కొత్తజాతి మనుషు లీదేశాన పుట్టి పెరగసాగారు. ఈ విద్యా వికాసంలో పండిత పోషకుడుగా ఆనంద గజపతికి సముచితమైన స్థానం ఇవ్వాలి. కాశీలో గొప్ప సంస్కృత గ్రంథాల నచ్చువేయిస్తూ, *ది విజయనగరం సంస్కృత సిరీస్ లో* (The Vizianagaram Samskrit Series) పుష్పాలు గుచ్చాడు ; మాక్స్‌ముల్లర్ కృషి ఫలితమైన *ఋగ్వేద భాష్యం* ; తారానాథ తర్క వాచస్పతి కూర్చిన సంస్కృత *విజ్ఞాన సర్వస్వం* ; మున్షీ మహమ్మద్ పాచామియా కూర్చిన ఉర్దూ పదకోశం *ఫర్ హంగి ఆనంద్ రాజ్* వంటి వాటికి రెండు చేతులా ధనసహాయం చేశాడు. ఇక స్థానికంగా తమ తండ్రి హయాంలోనే ఏర్పాటైన ముద్రాక్షరశాలను వృద్ధిజేసి ఆస్థాన పండితుల గ్రంథాలను, ఆశ్రితుల రచనలను అచ్చు వేయించాడు: *ఆంధ్ర కౌముది* (మండ లక్ష్మీనరసింహకవి), *ఆంధ్ర సింధుసారము* (కొల్లూరు కామశాస్త్రి), *కవిజీవితములు*(గురజాడ శ్రీరామమూర్తి). *విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము* (కార్మికేల్ దొర ఆంగ్లరచనకు విజాపురపు కోదండరావు అనువాదం), *ఆంధ్ర మన్వర్థదీపికా సహితము*(మండ కామేశ్వరశాస్త్రి)వగైరా. శూద్రులవలంబించ వలసిన ధర్మాన్ని తెలియజేసే *శూద్ర కమలాకర* మనే సంస్కృత గ్రంథాన్ని ఆనంద గజపతి స్వయంగా అనువదింపబూని, కారణాంతరాల వల్ల కొల్లూరు కామశాస్త్రికి అప్పజెప్పాడు. ఆ కారణం మరేదో కాదు : మిల్ (Mill) దొరగారి తర్కశాస్త్రాన్ని అనువదించాలనే కోరిక. అదేమైందోగాని, ట్రీటీ * The Treaty

---

* నైజాం నవాబును చేతిక్కించుకొని సర్కారు జిల్లాల్లో తిష్ఠ వేసుక్కూచున్న మాన్సియర్ బుస్సీ ఫ్రెంచి సేనలను తరిమి గొట్టేందుకు, కలకత్తాలోని క్లైవుకు రాసి కల్నల్ ఫోర్డు ఇంగ్లీషు సేనలను తెలుగు దేశం మీదికి రప్పించిన ఆనంద గజపతి ఇంగ్లీషు కంపెనీతో చేసుకున్న ఒప్పందం ఇది. 1758 నవంబరు 15 న జరిగింది. దీన్ని గురించి విశాఖపట్నం జిల్లా వృత్తాంత సంగ్రహములో 326 పుట ఇలా వర్ణించింది:

పేరిట పూసపాటివారి చరిత్రలో ఇటీవలి ఘటనలను గురించి ఒక పుస్తకం ఇంగ్లీషులో రాసి, దాన్ని అచ్చువేసేందుకు తగిన 'టైపు'లను మద్రాసులో కొనుగోలు చేయవలసిందని అప్పారావుకి పని పెట్టినమాట నిజం. తన ఒక్కడి స్వదేశ సంస్థానహోదా రాబట్టుకొనే ప్రయత్నంలో ఇదిఒక భాగం.

ఆశు కవిత్వంనుండి తర్క, తత్వశాస్త్రాలవరకు అసమాన ప్రతిభుడైన ఆనంద గజపతి ఎంతటి విద్యాధికుడో అంత వినయవంతుడు; ఎంతటి సంపన్నుడో అంత రసజ్ఞుడు. భాషాపాండిత్యం ఆయున నోట "సుష్కుతర్క కర్కశము"గాని వ్యక్తి విడిచింది ; కావ్య ప్రియత్వం ఆయున భావాలకు పొంపలాన్నిస్తూనే ఉన్నది. ఆయన గుణాలన్నిటికీ నాయకమణి మంచితనమని చెబుతూ, "ఆయన సరళ స్వభావులు. కాఠిన్య మెరుగరు. ఆర్ద్రహృదయులు. సచ్ఛీలవంతులు. కావున వల్ల ఆయన చెంతవున్నపుడు ఎవరికైనా, తాము అల్పజ్ఞులమనే భావం కలుగుతుంది. ఆయనపట్ల పూజ్యభావ మదయిస్తుంది," అన్నాడు అప్పారావు. ఈ గుణాలకు తగిన రూపసంపదను మరొక ఆంధ్రుడు – కొంత వెంకటప్పయ్య – ఇలా వర్ణించిపెట్టాడు : "వారి స్వరూపము అత్యంత నిపుణుడగు శిల్పి చక్కగా చెక్కిన బంగారు ప్రతిమ వలెనే యుండెను. వారి ముఖారవిందము ఎన్నిసార్లు చూచినను యింకను చూడవలెననియే కోర్కె పుట్టుచుండెను. తెల్లని లాగును, తెల్లని అంగరఖాను తొడిగి, దానిపైన నల్లని పూసలుగల బంగారు తావళము మెడలోవేసుకొని, విలువ చెక్కిన తురాయిగల ఎట్టనిటోపీ పెట్టుకొని సభలకు వచ్చుచు ప్రేక్షకుల నాయనము గొల్పుచుండెను. ఆనంద గజపతియను నామధేయము వారియెడ పూర్తిముగ సార్థ

ఆ ట్రీటీలో దోపుడు ద్రవ్యము సమముగా పంచుకొనుటకును, ఉన్న [illegible] అన్నింటిని రాజుగారికి నొప్పగించుటకును, వాని రాబడి రాజాగారు [illegible], నదీ ముఖములయందున్న పట్టణములను, రేవుస్థలములను, వాని స్[illegible] [illegible] రాబళ్ళ సహితముగా కంపెనీవారికి చెందుటకును. సేనల [illegible] [illegible] యొక్కంటికి రు. 50,000లను ప్రత్యేక మూడేనర్ల ప్రయములనియు [illegible] ప్రవేశించినది మొదలుకొని రు. 6,000 లను రాజాగా రిప్పించుచుండుటకును, ఆ ట్రీటీలో నిర్ణయము చేసినారు.

అయితే ఈ ఒప్పందానికి అనతికాలంలోనే కంపెనీవాళ్ళు తూట్లు పొడవ సాగారు. దేశంలోని 32 స్వతంత్ర సంస్థానాల్లో (Principalities) ఒకటిగా పేరొందిన విజయనగరానికి ఆహోదాను తప్పించి వెయ్యసాగారు, నాలుగు లక్షల రూపాయల పేష్కషును తొమ్మిది లక్షలకు పెంచారు. దానిఫలితమే ఆనంద గజపతి వారసుడైన విజయరామ గజపతికి కంపెనీ వారికి పద్మనాభం వద్ద 1794 జులై 10 న జరిగిన యుద్ధం. (పద్మనాభయుద్ధం : జయంతి కామేశ్వరరావు.)

మయ్యేను." మదరాసు నగర వీథులలో ఆనంద గజపతి చిత్రపటాలను ఉమ్మే రోజులవి. 15 గురజాడ అప్పారావు ఒక్కడేకాదు, ఆ కాలపు వాళ్ళంతా ఆనంద గజపతి గొప్పతనానికి అమ్ముడుపోయారు – డ్యూక్ ఆఫ్ బకింగ్‌హాములంటి గవర్నర్లుకూడా.

శంభుచంద్రముఖర్జీ, తట్టిలేవగొట్టింది అప్పారావు కవి – వ్యక్తినిమట్టుకే. ఆనందగజపతి ఉద్బోధం అప్పారావులోని మానవ వ్యక్తినే లేవగొట్టింది. ఆయన మేధావుల నాకర్షించేవారు. వారి ప్రజ్ఞా పాటవాలకు తాను సానరాయి. వారి పోటీలకు తాను తీర్పరి. పుస్తకాలనుండి రాబట్టిన జ్ఞానం వారిదైతే, తనది లోకానుభవం నుండి సేకరించిన జీవనమధువు. అదిలింపులుగాని, మందలింపులుగాని లేని సమానస్థుల స్నేహసహకార సుందరమైన విద్యావినోదం–ఇదే ఆయన పొద్దుపోక. "నేను రాజునైననూ, కించిజ్జుడను. రాజు నోటనే కించిజ్జుడను అనవచ్చును" అంటూ బిల్హణీయ నాటకంలో అప్పారావు మాట్లాడించిన కర్త మహారాజు ఆనందగజపతే; ఆ రాజాస్థాన పండితుల కుమ్ములాట లిక్కడివే. అయితే ఆనంద గజపతికి కాసింత అహంకారం కొంచెం వెర్రిలాగా ఉండేదని అప్పారావే అన్నాడు; అది తన పదవివల్ల చేకూరిందేగాక జన్మతః వచ్చిందికూడా: లోకం దృష్టిని ఆకర్షించాలని ఉబ్బిపోయేవాడు. అయితే ఇది దుర్గర్వంగా మారిపోలేదు. అందుచేతనే తన ఆస్థానకవి పండితుల జీవితాలు ఆయన జీవితంతోటి "పెనవేసుకొనిపోయినవి." తాను ఒక విషయాన్ని ప్రస్తావించి ఇతరులను మాట్లాడేట్లుచేసి చర్చను విమర్శక పంథాకు తెలివిగా మళ్ళించి సారథ్యం నిర్వహించేవాడు. చర్చలు బహువిషయాల మీద.అసలవి చర్చలనిపించవు, సల్లాపాలనిపిస్తాయి. ఆనంద గజపతి: పర్యారు వింతలు ఉన్న అప్పారావు రచనలో వాటి సరళి కనిపిస్తుంది.

ఆయన మాట్లాడుతున్నప్పుడు హృదయంస్పందిస్తుంది. దివ్యానుభూతులు జ్ఞాపకమొస్తాయి. అవి ప్రసంగాలుకావు. ఉపదేశాలు.

ఒక లోకజ్ఞుని చరణతలాన కూర్చుని జీవితవేదభాష్యాలను ఆలకిస్తున్నట్టు, నానావిధ సంస్కృతుల సౌరభాలను మూజూస్తున్నట్టు, సౌమనస్యాన్ని మనస్సున తాపితం చేసుకొంటున్నట్టు, ఆనందగజపతిపెట్టిన జ్ఞానభిక్షను దోసిలిపట్టి స్వీకరించాడు; స్వీకరించినదానిని సొంతపరుచుకొని తన రచనలద్వారా లోకానికి పంచాడు గురజాడ అప్పారావు. అతని మదినీ హృదినీ మలిచి మెరుగుదీర్చినవి మహారాజా సుభాషితాలే. ఆయన సన్నిధిలో అప్పారావు"రాజయోగం"అలవరచుకొని దూషణ

భాష. అను సహజచిత్తంతోటి స్వీకరించ నేర్పాడని [illegible] అక్షరాలా నిజం. మరి ఆయనను 'దారాపుత్రులకంటె' ఎక్కువగా అప్పారావు ప్రేమిం చడంలో వింత లేనే లేదు. చాయవేసుకొని భోంచెయ్యమనే [illegible] అప్పారావును అరటికాయకూర పథ్యం పెడతాడు. కోయించి ఇస్తాడు. [illegible] వెంటబెట్టుకుపోతాడు. [illegible] మళ్ళీ అపూపచెత్తాడు. శ్యామలరావు చనిపోయాక తాను సంపాదించి ఉంటే, ఇల్లు మార్చడం బాగుంటుందని సంస్థానం [illegible] ఇళ్ళలో ఒక దాన్ని ఇస్తూ నామక అద్దె చెల్లిస్తూ ఉండమని [illegible] చేస్తాడు. ఉంగ్రి వెంకటరామదాసు సంస్థానం సేవలో మెసలినప్పుడు, [illegible] విజయనగరం కోట ఖిల్లేదారుగా నియమిస్తూ, [illegible] బొమ్మని ఆ ముసలాయనకు సలహా ఇస్తాడు. మహారాజా వారికి తానంటే "ప్రేమ" అని అప్పారావు రాసుకోడూ మరి? మా తల్లిగారికీ అక్కగారికీ నీనంటే నమ్మకం అన్నప్పుడు, పొంగిపోడూ? తనవల్ల ఆయన ప్రతిష్ఠకు భంగం కలుగగూడదు; తనవల్ల ఆయన మనస్సు బాధపడగూడదు. "ఆయన ఆదేశించిన కార్యాన్ని నెరవేర్చడానికి నేను సదా సంసిద్ధుణ్ణి. అతి కష్టమైనా, దానిని నిర్వర్తించడానికి హృదయ పూర్వకంగా ప్రయత్నిస్తాను."

అలా ఆనందగజపతి ఆదేశించిన పనుల్లో అత్యంత నికృష్ట మనిపించే దాని నుంచే అత్యంత ఉత్కృష్టమైన మానవీయ దృక్పథం తీగ విడిచింది. మహారాజా ఎందరో వేశ్యలను చేరదీశాడు. తనభార్య వనజకుమారి పోలికలున్నాయని ఒకతెను, మరొక కారణం చేత ఇంకొకతెను, ఇలా. "హృదయ, ప్రజ్ఞా సౌందర్యములంటే ఆయన ముగ్ధులౌతారు." చేరదీశాక, ఆ మనుషుల అవసరాలన్నిటినీ తీర్చజూస్తాడు; లోట్లను సరిదిద్ద జూస్తాడు; సంస్కరింప జూస్తాడు. అలాంటి ప్రయత్నాలన్నిటినీ బూడిదలో పోసిన పన్నీరు చందంగా చేసింది ఒకానొక ఉంపుడుగత్తె. మహర్షి అయినా కాకున్నా, మహారాజా ఓర్పు సన్నగిల్లింది. అందుచేత ఆ ఉపాధ్యాయ పదవిని అప్పారావు కప్పగించాడు. మహారాజావారి ఇచ్ఛకంకోసం చెయ్యరాని పనులు చేస్తున్నాడని లోకం వేలెత్తి చూపి ముఖాన ఇంత బురద కొడుతుంది సుమా, అని హెచ్చరించాడు కూడా. అప్పారావు ధైర్యంచేశాడు. ఆ అడివి 'మని షి'ని మచ్చిక జేశాడు; ఒకదారికి తెచ్చాడు. ఆ మనిషిని తానెందుకని అసహ్యించు కోవాలి? నిజానికి జాలిచూపాలి. నాటకీయ దృష్టే ఉంటే, ఆమె మనస్సు పనిజేసే పద్ధతులను ఆకళించుకొని, వ్యక్తిత్వాన్ని గుర్తెరిగి, గౌరవించాలి. అందుకై తాను

పరకాయ ప్రవేశం చేస్తాడు; ఆ పాత్రలో లీనమౌతాడు. పాత్రను దేన్నైనాసరే ఈసడించుకొని ద్వేషించే నాటకకర్త ఆ పేరుకే తగడు. సాధనలో తన ఇష్టాయిష్టాలను అదుపులో పెట్టుకొని, అవతలి వస్తువును దాని పరంగానే చూడాలి తప్ప తనపరంగా చూడకూడదు. అప్పారావు ఆమెకేదో నేర్పబోయి తానెంతో నేర్చుకొన్నాడు: "నిజానికి గత ఆరేడు సంవత్సరాలలో కొత్త కొత్త అనుభవాలు కలిగి జీవిత పరిజ్ఞానం అధికమయింది. జీవితానుభవాలు వైవిధ్యము అనుభూతులు నాకొక నూతన దృష్టిని కలిగించాయి." జాలి మేలు గుణమని నీతి.

దుంగలను వదిలివేసి, ప్రవాహవేగాన కొట్టుకుపోయే అశుద్ధాన్ని పట్టుకొని చేతినిండా జవిరిపట్టుకొన్న 'విమర్శకుల' కొందరు అప్పారావు శీలాన్ని ఈనాటికీ ఖూనీ చేస్తున్నారు. అందులో గిడుగు రామమూర్తి శిష్యులైన పారనంది జగన్నాథస్వామిగారు కూడా ఉండటం ఆశ్చర్యకరమే. వీరేశలింగం సాహిత్యాన్ని అప్పారావు విమర్శిస్తూ అధమ శృంగారం గురించి రాశాడని వీరి కినుక. వీరేశలింగంపై వీరికి గల గౌరవం మెచ్చదగిందే గాని అప్పారావుపై గల చులకన వీరికి తగనిది. "కళాప్రియులు, రసికవరులు" అయిన కొందరు, వేశ్యల యిళ్ళలోదూరి, "వినోదాల ద్వారా లాలిత్య కళలను కడుపునిండా హృదయము నిండాను ఆరగించి ఏ పదిగంటలకో స్వంత గృహాలు చేరుకొనేవారు. కొందరు స్వంత గృహాలలో ఈ వినోదాలకు ఏర్పాటు చేసేవారు. నాగరిక కుటుంబాలలోని గృహిణులు కూడా వీటికి అలవాటు పడిన వారు ఉండిరి. ఇది ఆనాటి నాగరికత, నాజూకుతనం కళారాధన." 16 వీరేశలింగం ప్రభావానికి గిడుగు రామమూర్తితో సహా పర్లాకిమిడిలో అనేకులు లోనైనట్లు బుర్రా శేషగిరిరావు రాశాడు. ఆనందగజపతి దాటుకొన్న చాలా ఏళ్ళకు విజయరామ గజపతి కుమారులకు 'ట్యూటరు'గా విజయనగరానికి వచ్చిన గిడుగు రామమూర్తి, ఒక భోగంమేళం నుంచి అసమ్మతితో లేచిపోయి అప్పారావును ఇరకాటాన పెట్టాడు. రామతిలకం అనే వేశ్యతో శరీర సంబంధం ఉడిగాక కూడా, ఆమె బుగ్గలసొట్టను మెచ్చి మాత్రమే ఆనంద గజపతి ఉంచుకొన్నాడని ఒక ప్రశ్నకు సమాధానంగా అప్పారావు చెప్పాడు. ఇది జీవిత వైఖరికే సంబంధించిన అంశమని గిడుగు రామమూర్తి కూడా చివరకు గ్రహించగలిగాడు.* తార్పుడు గాడన్నంత మాత్రాన, అప్పారావు జీవితాన్నీ శీలాన్నీ వాస్తవ దృష్టితో పరిశీలించినట్లౌతుందా?

* రెండవ ముద్రణకు కన్యాశుల్కం నాటకాన్ని తిరిగి రాస్తున్న సమయంలో (1909) గిడుగు రామమూర్తి తన కుమారునితోసహా అప్పారావు నోటనే మధురవాణికి సంబంధించిన ఒక దృశ్యాన్ని విన్నాడు. అయ్యాక, రామమూర్తి మిత్రునితో, ఇంత చక్కగా భోగం

ఏథెన్స్ నగరంలో విశ్వ వంద్యులైన సోక్రటీస్‌వంటి తాత్వికులు విందుల్లో వేడుకల్లో ఆ దేశపు వేశ్యలైన 'హెటైరా' (Hetaiaerae) సహవాస భాగ్యాన్ని పొందేవాళ్లు; కులస్త్రీల కంటె విద్యలో మిన్నలైనందుచేత ఉత్తమ సంస్కారుల కందరికీ వారి చెలిమి అభిలషణీయమై ఉండేది.

వేశ్యాజన సంపర్కమే 'రాసిక్య' లక్షణమని ఎవ్వడూ అనడు. గురజాడ అప్పారావు అలాంటి రసికుడూ కాదు. ముప్పై మూడేళ్ళకే నరాలు పట్టు దప్పి సంభోగానంతరం తలనరాలు ప్రకోపించి సరిగా నిద్రపట్టని బలహీనుడికి ఉపపత్ని గానీ, వేశ్యగానీ తలకుమించిన బరువు. అందగత్తె కంటబడినపుడు శృంగార ప్రియత్వం కలగడం సహజమేనంటూ, "అలాంటి ప్రమాదం తప్పించుకొందుకు ఆమెను నువ్వు నీ సోదరిగా భావించు" అని చిటకా చెబుతాడు. రకరకాల స్త్రీలను వర్ణించి 'నోట్సు'గా రాసిపెట్టుకోవడం అలవాటైంది. కామాక్షి కళ్ళు, చంద్రవదన ముఖం, 'రా' కనుబొమలు — అక్షర నిబద్ధాలై ఉన్నాయి. అందమైన ఆడవాళ్ళను చూడ ముచ్చటపడి భావాలను దౌడు తీయించే పనికి ఎంతత్వరగా స్వస్తి చెబతే అంతమేలని తనుతానే హెచ్చరించుకొంటాడు. వేశ్యలు తమవృత్తిని విడనాడాలంటే, వాళ్ళకు తమ వృత్తిలోని నీచత తెలిసిరావాలి; వృత్తిని విడిచి స్వతంత్రంగా వాళ్లుజీవించగలగాలి; ఆత్మగౌరవభావం పెంపొందించాలి; అందుకై వాళ్ళకు లలితకళలను నేర్పి స్వతంత్ర జీవనావకాశాలు కలిగించాలి - అని ఆనందగజపతి అన్నాడు. 17 దాదాపుగా అవేమాటలు గిడుగు రామమూర్తిదగ్గర అప్పారావు అన్నాడని గిడుగు సీతాపతిగారి వ్యాసంవల్ల తెలుస్తుంది. అలా అన్నంతమాత్రాన వేశ్యావృత్తిని కొనసాగించమన్నట్లు అర్థమా?

... అవసరంచొప్పున వేశ్యాగృహాలకు అప్పుడప్పుడు ఆయన వెళ్ళ వలసి వచ్చినట్లుకూడా దాఖలాలున్నాయి. విజయనగరాన బావగారి వద్దఉండి చదువు వెలగబెడదామని వచ్చిన ఎల్లాప్రగడ నరసరాజు, 'పొడుగుసుందరి' అని మారుపేరుగల బోగంపిల్లను మరిగి ముప్పొద్దులా అక్కడే ఉండిపో సాగాడు. అతని అప్పగారు అప్పలనరసమ్మ భర్తను సతాయించ సాగింది. మామగారు సన్యాసిరాజు ప్రతిష్ఠగల పెద్దమనిషి; ఆయనను చూచైనా పెద్దబావ మరిది వంకరదిద్దుదామని అప్పారావు ప్రయత్నించాడు. అయితే కథ అడ్డం తిరిగింది. దొంగసొమ్ము కొనుగోలుచేసి ప్రియురాలికి బహూకరించవెళ్ళిన నరసరాజు పోలీసు నిఘాకు గురయ్యాడు. సంగీతం పల్లవించే సరసురాలియింట పోలీసులబూట్లు తొక్కిడికి నరసరాజు పామై బుసకొట్టాడు. విటుడు యమభటు

దయ్యాడు. తుపాకీ మోపెట్టాడు. పోలీసులు పలాయనం చిత్తగించారు. అయితే ముందుమాట ? పట్టిపస్తారు, ముట్టడిస్తారు, బంధిస్తారు కూడా ... ఉరి వరకు తీస్తారు. తనకది ముఖ్యం. ప్రాణం కంటె కూడా ముఖ్యం. అందుచేత రాత్రికి రాత్రే నిండుప్రాణం తీసుకొన్నాడు ఆ 'మానధను'డైన నరసరాజు ....

అవి అప్పారావుకు చెడ్డరోజులు. సంస్థాన వైద్యుడైన నాటు వైద్య చికిత్సను నవ్వులపాల్జేసి శ్యామలరావు పోయాడు. ఇప్పుడే నరసరాజు. అతని ఆత్మహత్యం తండ్రిప్రాణానికే ముప్పుతెచ్చింది. ఆయన వెనువెంట భార్య. మృత్యువు తాండవమే చేసింది. 1895 లో ఒకరోజున అప్పారావు డైరీలో ఈ ప్రస్తావన కనిపిస్తుంది. విచారం ముంచుకొచ్చి మనస్సు పరిపరివిధాల పోతున్నది: "మా మామగారి కుటుంబంలో ఎంతమంది పోయారు ! వాళ్ళందరూ తలపుకు వస్తున్నారేమోమరి ? అందులోనూ చిన్నపిల్లడు చిట్టిబాబు పాపం !"

బంధువుల ప్రస్తావన ఎట్లాగూ వచ్చింది గనుక పనిలోపనిగా మరి నాలుగు మాటలు చెప్పాలి. మహారాజా ఆశ్రయంతోటి అప్పారావు పరపతి పెరిగింది. ఎక్కడెక్కడి చుట్టాలూ ఆ పనికోసం ఈ పనికోసం ఆయన ప్రాణం కొరక సాగారు. డబ్బువిషయాలలో ఆనందగజపతి ఆదినిష్ఠురం మనిషి. ఒకరూ ఇద్దరూ అయితేసరే — ఆశ్రితుల సంఖ్య అగణ్యం, ఆశ్రయదాత ఒక్కడే అయినప్పుడు అతనికి గట్టిపాకం లేకపోతే మొదటికే మోసం వస్తుంది. అలాంటిది అప్పారావు సొంత బావమరదే — సన్యాసిరాజుగారి సుపుత్రుడు నరసరాజే అప్పు యిప్పించమని పోరుపెట్టేవాడు. మహారాజా వద్దకే వెళ్ళినట్లుంది. అప్పారావు పూచీ పడలేదు సరిగదా, అప్పుకు అడ్డం తగిలి బావమరదికి కోపం తెప్పించాడు. మిగిలినవాళ్ళ విషయంలో మాత్రం ఇలా నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించలేదు. రాజమ్మ, అన్నపూర్ణమ్మలకు పెళ్ళి చేయించే బాధ్యతను సంతోషంతో నిర్వర్తించాడు.

కోకోవైను తాగడమూ మాంసాహారం ముట్టుకోవడమూ మాత్రమే కాదు అప్పారావు ఆనంద గజపతి సహవాస 'దోషం' వల్ల నేర్చింది. బడిలో సంస్కృతం చదువుకొన్న అప్పారావు, తెలుగులో పద్యచ్ఛందస్సు నిర్వహించడం కంటె సంస్కృతంలో శ్లోకాలు రాయడం తేలిక అనుకొంటూ వచ్చాడేమో. ఇప్పుడు మాతృభాష మాధుర్యాన్ని రుచిచూడగలిగాడు. రామాయణ మహాభారతాలను పామరులకు గూడా బోధపడే తేలిక భాషలో రాసిపెట్టండని తన పండితులను కోరే వాడాయన. భాగవతంలో కృష్ణ నిర్యాణ ఘట్టాన్ని చదువుతూ, "భావ గాంభీర్యానికి

ముగ్ధులై" సంతోషం పట్టలేక పోతన్నను ప్రశంసిస్తూ, "కమనీయ కవితాకల్పనకు, వర్డ్సువర్తు మొదలైన పాశ్చాత్య కవులు, పోతనతో సరి తూగగలరా?" అని ప్రశ్నిస్తాడు. "పదలాలిత్యంలో భావుకత్వంలో ప్రసాద వైభవంలో ఆయన కాయనే సాటి" అని తీర్పు చెబుతాడు. అలిసిన గుర్రాలను కొట్టకూడదు సరే, సర్కస్ ఫీట్లు చేయించడానికి మంచి గుర్రాలనైనా కమిచీలతో కొట్ట గూడదు; అలాగే ముదిమిమీరి ముతకబారి సడలిచ్చిన శబ్దాలను హింసిస్తూ వాటితో కావ్యాలను రాయడమూ, గరిడీలతో మురియడమూ – రెండూ తగని పనులే నని ఆనంద గజపతి నోరువిడిచి చెప్పాడు. విజయరామ గజపతి హయాములోనే పండితులు వ్యావహారిక భాషావాదపు నేపథ్యాన్ని సమకూర్చారని డా. బుర్రా శేషగిరిరావు చెప్పినమాటలు.* ఆనంద గజపతి హయాములో ప్రస్తుతిపొందిన లలిత కవిత్వ పద్ధతికి విహితమైనవే.

అయితే ఆనందగజపతికీ, ఆస్థాన పండితులకూ ఆశుకవిత్వమంటే వినోదంగా వుండేది. తెలుగు ఛందస్సు నేర్వమని అప్పారావును పురమాయించి పద్యాలు రాయించాడు. పుష్పులావికలు, మాటల మబ్బులు, ప్రారంభదశలో

---

* మండ లక్ష్మీకామేశ్వరశాస్త్రి (1857-1920) విజయనగరాస్థానంలో పేరుమోసిన విద్వత్కవి; ఆయన రాసిన తెలుగువ్యాకరణ గ్రంథం లిఖితప్రతి సర్వసిద్ధాంత చంద్రిక లోనున్న అప్పారావు ప్రసక్తినీ ప్రశస్తినీ గురించి డా॥ తూమాటి దోణప్పగారు, యం. ఎ. పి. హెచ్. డి., నాకు ఈ క్రింది సమాచారాన్ని ఇచ్చినారు:

క్రీ. శ. 1897 (ఆనంద గజపతి మరణం) 1915 (అప్పారావు మరణం) సంవత్సరాల మధ్యకాలంలో చేసిన ఈ సర్వ సిద్ధాంత చంద్రిక రచనలో. అవతారికభాగంలోని పద్యాలు:

గురజాడ వంశ తిలకుఁడు
వర విద్యా చణుఁడు సుచిర వార వివేకో
ద్ధురుఁ డప్పరాయ మంత్రీ
శ్వరుఁడుద్బోధంబుజేసె సరస ఫణితులన్.

ఎట్లనిన:–

మున్నానంద నృపాల మౌళి విబుధామోదంబుగా నాంధ్ర భా
ష నూత్నంబుగఁ దెన్గు వ్యాకృతిని గూర్చన్ నీకు నాజ్ఞప్తిని
చ్చెన్నేడా మహితాత్ము గోర్కె సఫల శ్రీనంద గ్రంథంబు లె
న్నెన్నో గూడెను జూచి కూర్పుఁడు యశం బేపార నా వ్యాకృతిన్.
అని యిట్లు నా కుద్బోధంబుగాఁ బలికిన నేను ప్రాచీన నవీనాంధ్ర వ్యాకరణంబుల బరిశీలించి యాధునిక వ్యవహారంబు నరయుచు నూత్నంబుగ నాంధ్ర సూత్రావళిం గూర్పనారంభించి...

అభ్యాసంకోసం విద్యార్థిచేసే వెరసుల్లాంటివి. శబ్ద దోషాలుండటమేగాక, వాటిలోని భావాలు ఏమంత గొప్పవికావు. మాటల మెలికలతో నడిచీనట్లో నర్మగర్భంగా 'శృంగార' సల్లాపాలుచేసే వీలునిచ్చేందుకు, విటులైన విప్రులూ ప్రబుద్ధులైన విటులూ పుష్పలావికలను మన సాహిత్యంలో ఆదినుంచి ఆశ్రయించారు. [illegible] లోనిపుష్పలావికల చెల్లెళ్ళే అప్పారావు పుష్పలావికలని డా. సి నారాయణరెడ్డిగారు గమనించి చెప్పారు. ఇక రెండవపదానిలో, రాజాస్థానాల విద్వద్గోష్ఠి వైభోగాలను కొండేలను అప్పారావు గర్హించాడు. [illegible] నాటకంలో పాత్రలద్వారా దీనినే విస్తరించాడు. నిజానికి ఆనందగజపతి ఆస్థానంలోని విషయాలే వీటికి మాతృకలు. "ఆయన వద్దమెలిగే విద్యాసంతులవల్ల, అప్పుడప్పుడు నామనసుకు మనః క్లేశం కలిగే"దని అప్పారావు ఇందు గురించే రాసివుంటారు. పెద్దమనిషితనంతోటి నడచుకోవడమెలాగో ఆయన వాళ్లకు చెప్తుతూ ఉండేవాడు. "విద్వాంసులు తలయెత్తినప్పుడు కత్తులు దూసుకోరాదు. లేనిపోని ఆవేశములు వ్యర్థం. వివాదము లందు మౌనమువహించుట ఆత్మకు గొప్ప బలం" .. ఆనందగజపతి అగ్బరు చక్ర వర్తిని గుర్తుకుతెచ్చే సన్నివేశాలిలాంటివి. అన్నిమతాలవారిని రావించి తమ తమ విశ్వాసాలను గుణాలను ఉపన్యసించమన్నప్పుడు వాళ్లు వాగ్రణరంగంలో జిహ్వా కృపాణాలతో ఒకరి నొకరు ఖండించుకోసాగారని బదౌనీ (Badauni) రాశాడు.

"సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అంటూ ఒక సమస్య నిచ్చాడు. తన పండితులకొకమారు ఆనందగజపతి; పూరించమన్నాడు. ఆదిభట్ల నారాయణ దాసు కూడా పూరించాడు కాబట్టి ఇది 1894 తర్వాత (ఆనందగజపతి ఆస్థానంలో నారాయణదాసు ప్రవేశించిన సంవత్సరం) 1897 ముందు (మహారాజా మరణించిన సంవత్సరం) జరిగివుంటుంది.

చతురకళా విద్యా సం
గతికిన్ స్థిర ధృతికిఁ బ్రకట కరుణామతి కీ
కృతి యానంద గజపతికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్

అని నారాయణదాసు పద్యమొకటి; అలాగే భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిది—

ఋతతిత ఊత్తుత్తీతా
తతేతితా తేతతాత తత్తై తత్తా

తత తత్తా తతతత్తిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్

కరక్కాయ పాకపు పద్యాన్ని బులుసు వెంకటరమణయ్యగారు పేర్కొన్నారు.[18] గురజాడ రచనలలో ముక్తకములుగా అచ్చుపడివున్న కందపద్యాలు అప్పారావు ఈ సందర్భంలో రాసినవే. పద్యచ్ఛందస్సు ఆయనకింకా మచ్చికగాలేదు. యతిప్రాసల విషయంలో చాలా ప్రయాసపడ్డాడు. మెరుపులు అనే రచన ఇంత కన్నా మేలు. సంస్కృత శ్లోకాలకు ఆంధ్రీకరణమే అయినా, ఇది యథామూలానువాదంకాదు. వేమన పద్యాల సౌరళ్యాన్ని పుణికి పుచ్చుకొన్నట్లుగా ఒకటి రెండు పద్యాలు రూపొందాయి. అయితే వాటి సౌష్ఠవాన్ని అచ్చు చెరిచింది. 'క్రాస్‌వర్డ్ పజిల్సు'రాని కాలంలో, సమస్యాపూరణం ఆ లోపాన్ని తీర్చేదేమో! రీవారాణి అప్పలకొండయాంబకు గూడా ఈ వ్యసనం ఉండేది. "వెలవాల్గంటి కుమారులౌదురు గదా విప్రోత్తముల్ రావణా! అనే సమస్యను ముడుంబై నరసింహస్వామి, మండ లక్ష్మీకామశాస్త్రి, పేరి కాశీనాథశాస్త్రి, పూరించడం బాగానేవుందిగాని రాజామణి చెట్టి, జి. వి. అప్పారావు, బి. ఏ. కూడా పూరించారు. అప్పారావు పద్యాన్ని మంజువాణి పత్రిక (1903) నుంచి పుష్పగిరి రాజమ్మగారు ఉద్ధరించారు:[19]

మ. కలిచేతన్ విమతిత్వ మొందుచు మహా కామాంధకారంబునన్
కుల ధర్మంబు పరిత్యజించి గణికన్ గూడిమ్మ అమ్మా నినున్
బలు మార్వ్వెడెదమంచుఁబల్కెద రహో పాండిత్య మూహింపకే
వెలవాల్గంటి కుమారు లౌదురు గదా విప్రోత్తముల్ రావణా!

పుష్పలావికలను గురించి, మరో ఇరవయ్యేళ్ళ తర్వాత పాఠ్య గ్రంథ నిర్ణయాధికారిగా రాస్తూ, విద్యార్థులు నేర్చుకోదగిందేదీ లేదన్నాడు ఈ అప్పారావే. అలాగే యతిప్రాసల పడికట్లకోసం తిప్పట్లు పడుతూ, నీరసభావాలకు గంగిరెద్దుపై గుడ్డల మెట్లవంటి అలంకారాలను కుప్పిస్తూ, కృతక భాషను నమ్ముకొని రాసే పద్యకవుల గురించి కూడా ఆయన అభిప్రాయం మారింది. ప్రస్తుతానికి మాత్రం ఆయనవి అందవశే. దీన్ని గురించి డా సి. నారాయణరెడ్డి గారి తీర్పు సమంజసంగానే ఉంది:

గురజాడ వారీ రీతిగానే పద్యరచన చేసియుండినచో ఆ మార్గములో వారు తప్పక ప్రౌఢకవి యయ్యేడివారు. సంప్రదాయము ననుసరించిన కవుల

పంక్తిలో ఎక్కడో ఒకచోట ఆయన కొంత చిలిపిని ఒలికించి ఉండవచ్చు. కాని అట్లు జరుగలేదు.[20]

ఈ దశలో అప్పారావు వచనశైలి కూడా వ్యావహారికానికి యోజనాల దూరాన్నే ఉండేది. మహారాజాతో కలిసి [illegible] [illegible] ప్రకృతి దృశ్యాలను తిలకిస్తూ అందగత్తెలను పట్టిస్తూ యౌవన సహజమైన కాల్పనిక ప్రవృత్తితో అప్పారావు చేసిన కథా ప్రయత్నమొకటి, [illegible] అనే రచనలో అణిగి మణిగి ఉంది. అప్పారావు ఇంగ్లీషున రాసిన ప్రకృతి వర్ణనలను ఆంధ్రీకరించిన అవసరాల సూర్యారావు, ఈ కథను మటుకు ఆయన భాషలోనే ఉంచాడు. వీరేశలింగం సులభగ్రాంథికం కంటె కాసింత [illegible] ఉన్నప్పటికీ, ఇది అదీకాదు, కన్యాశుల్క నాటకభాష ఎట్లాగూకాదు.

# 4

వీరేశలింగం మొదలు పీఠమానిసి దాకా చదివి చూచి ఆనందించిన కన్యాశుల్కం నాటకరచన ఈ దశలోనే జరిగింది. పత్రికలు దాని నొక "సంఘటనగా" గుర్తించాయి. పద్యాలు లేకపోవడ మొకటిమాత్రం అందుకు కారణం కాదు. చాటు పద్యాలు ఒకటీ అరా ఉన్నాయికూడా. దాని ఘనత యావత్తూ అది మొట్టమొదటి వచన సాంఘిక నాటకం కావడమే. నాటకకర్త ప్రేక్షకులను మన్నించి వచనంలో నాటకాలను రాయక తప్పని పరిస్థితి ఏర్పడినట్లు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం *స్వీయ చరిత్ర* చెబుతుంది. 21. నల పాత్రధారి తనకు పద్యాలు పెట్టవద్దని మొండికెత్తినప్పుడు పట్టరాని కోపంవచ్చి ఆయన నల నాటకం రాసిన పుస్తకాన్ని చింపేవేశాడు.

ఆంగ్ల నాటక కంపెనీలు బ్రిటిష్ సామ్రాజ్యమంతటా పర్యటిస్తూ ఆస్ట్రేలియా వెళ్ళే దారిలో బొంబాయి, కలకత్తావంటి మన పట్నాలలో ప్రదర్శనలిచ్చిన దరిమిలా అక్కడ అనుకరణశీలురు బయల్దేరి నాటక సమాజా లేర్పాటు చేసినట్లు కె. వి. గోపాలస్వామి గారి భోగట్టా. 22. పార్శీ నాటక సమాజాలనీ, ధార్వాడ నాటక సమాజాలనీ అలా గేర్పడ్డవే. పార్శీ నాటకాలు ఉర్దూలో, ధార్వాడ నాటకాలు హిందీలో ఉండేవి. 'ధార్వాడ' అని ఎలా పేరు వచ్చిందోగాని, దీని అసలుపేరు "ది ఆల్డేకర్ హిందూ డ్రెమటిక్ కంపెనీ". పార్శీ నాటకాల ద్వారా మహరాష్ట్రులు, వారి నాటకాలద్వారా కన్నడిగులు, మరి అంతిమ ఫలంగా ఆంధ్రులు నాటకసమాజాల నేర్పరచుకో గలిగారు. ఏలూరు, గుంటూరు, విశాఖపట్నం రాజమండ్రి — ఇవన్నీ నాటకోత్సాహం పొంగిపొర్లిన బస్తీలు. అప్పారావు శిష్యుడు కాకినాడకు ఉదాయించిన కారణం ఇదే. అయితే విజయనగరానికి నాటక ప్రదర్శన కొత్తదేమీ కాదు. విజయరామ గజపతి కాలంలోనే ఏర్పడిన 'జగన్నాథ విలాసినీ నాటక సమాజం' *శాకుంతలం*లాంటి సంస్కృత నాటకాలకు పేరుబడివుంది. జి. సి. వి. శ్రీనివాసాచార్యుల ఇంగ్లీషు *హరిశ్చంద్ర* నాటకమేగాక, ఇంగ్లీషు ఉద్యోగులే తమభాషలో కొన్ని నాటకాలనో, నాటకభాగాలనో అప్పుడప్పుడు ప్రదర్శిస్తూ వచ్చినట్లుఅప్పారావు డైరీలనుబట్టి తెలుసుకోవచ్చు. *కన్యాశుల్క* రచయిత వేదంవెంకటరాయశాస్త్రిలా "హూణ రూపకరసం బుదరంబు నిండార త్రావిగజ్జున త్రేన్చివైచినాఁ"నని తానై

చెప్పుకోలేదు గాని, షేక్స్పియర్, బెన్‌జాన్సన్ (Ben Jonson) మోలియెర్ (Moliere) ప్రభృతి పాశ్చాత్య నాటకకర్తల పరిచయం సంపాదించినట్టు [illegible] వరాహ నరసింహస్వామి సంస్కృతంలో రాసిన ప్రవేశిక (Prologue) తెలుపుతున్నది.

ఈ నాటక రచన అప్పారావు కాలేజిలో పనిచేస్తూ ఉన్నప్పుడే — 1886-87 ప్రాంతంలో జరిగి ఉంటుంది. 1893 లో ఆనంద గజపతి [illegible] అంకితం చేస్తూ, అంతకు పదేళ్ళ క్రితం విషయాలను ఉటంకించడంబట్టి 1883 లోనే రచన చేసినట్లు తీర్మానించడం, సరికాదనుకొంటాను. తొలికూర్పు ముద్రణ జరిగిన సంవత్సరం (1897) నుంచి పదేళ్ళు వెనక్కు (1887) పోవలసి ఉంటుంది గదా! మద్రాసు శాసన నిర్మాణసభ (Legislative Council) లో సభ్యుడుగా ఆనంద గజపతి సంఘ సమస్యలపై చూపునిలిపి, అతి బాల్య వివాహాలను గురించి విశాఖ మండలంలోని బ్రాహ్మణ కుటుంబాలనుంచి భోగట్టా సేకరించ సాగిన రోజులవి. *

* కన్యాశుల్క పద్ధతి ధర్మశాస్త్ర విహితమైనదో కాదో చెప్ప [illegible] కాశీలోని పండితుల నడిగించాడు. వాగీశ్వరశర్మ, గంగాధరశాస్త్రి, రామ[illegible] దీక్షితుడు, కైలాసచంద్ర భట్టాచార్య, శితలా ప్రసాదపండిత్, రామసుబ్రహ్మణ్య [illegible] శివకుమారమిశ్ర మున్నగు పద్నాలుగుమంది కాశీపండితుల సంతకాలతో [illegible] కన్యాశుల్క గ్రహణే దోషనిర్ణయః కాశీస్థ పండితైర్నిరూపితః అని సంస్కృతంలో [illegible] వేయించిన ఒక పత్రం నాకు లభించింది. దాని సారాంశం ఈ కింద [illegible]:

— అష్టవిధ వివాహాల్లోనూ అర్ష, ఆసుర వివాహాల్లోనే [illegible] వచ్చు. అర్షంలో గోమిథునాన్నిగాని, మిథునాలనుగాని వరుడినుండి [illegible] కన్యాదానం చెయ్యవచ్చు. అసుర వివాహంలో "స్వచ్ఛందంగా" కన్యా బంధువులకు [illegible] కన్యను స్వీకరించే పద్ధతి ఉంది. మనువు ఈ రెంటినీ తిరస్కరించాడు. [illegible] తన కన్యకై అణుమాత్రమైనా శుల్కం స్వీకరించరాదని అతని మతం. [illegible] బిడ్డను అమ్ముకొన్నట్టే. భారతంలో పంచాచారాన్నిబట్టి మద్రదేశ [illegible] భీష్ముణ్ణి అడిగినప్పుడు లజ్జిస్తూనే అడిగాడు. మనువు దృష్టిలో, క్షత్రియులకు ఆసుర [illegible] దోషంకాదు. అయినా శుల్కధనాన్ని తాము వాడుకోకుండా కన్యాబంధువు లామెకే ఇచ్చివేస్తే, అది కన్యా విక్రయం కాబోదు. అర్షవివాహంలో గోమిథున నిర్ణయం కన్యాదానాన్ని [illegible] మార్చదని పరాశరస్మృతి వ్యాఖ్యానం చెబుతుంది. వరుడినుండి ధర్మంగా పుచ్చుకొన్న ధనం, యజ్ఞయాగాది కార్యాలకోసమూ, ఆ వివాహానికి ఆర్షత్వ సిద్ధి కలగడం కోసమూ, లేక ఆ గో ధనాన్ని కన్యకే ఇచ్చివేయడం కోసమైనా వినియోగపడుతుంది గనక తమ సొంతానికోసం కాదు.

ఆ సాంఘిక దురన్యాయంమీద అప్పటికీ వీరేశలింగం ప్రచండ పరశువునెత్తి ఉన్నాడు. చల్లపల్లి బాపయ్య ప్రోద్బలంతోటి, ఈశ్వర చంద్ర విద్యాసాగరుని గ్రంథాంతోపాటు మను, యాజ్ఞ్య వల్క్య, పరాశర స్మృతులను పఠింప బూనాడు. 1874 లోనే మద్రాసులో స్త్రీ పునర్వివాహ సమాజం ఏర్పడింది. మరి ఏడేళ్ళకు రాజమండ్రిలో మొదటి పునర్వివాహం జరిగింది. దేశంలో కాకిగోల మొదలైంది. వేదం వేంకటరాయశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి దాసు శ్రీరాములు వగైరా యోధానయోధులై ఖండనదూషణలకు దిగారు. పునర్వివాహోద్యమం యుద్ధ సంరంభమే కాగా, వీరేశలింగం "వీరసంస్కర్త" కాక తప్పలేదు. ముఖ్యంగా విద్యార్థుల అండదండలే ఆయనకు బలమిచ్చాయి. బ్రాహ్మవివాహం ప్రహసనం 'పెద్దయ్య పెళ్లి' పేరున దేశమంతటా ప్రచారమైంది. దాన్ని చూశాక అప్పారావు తన నాటకం రాయలేదు; రాశాక, ఆ ప్రహసనం చదివాడు. దీనికి అది మాతృక కాదుగాని, వీరేశలింగం మాత్రం ఈ నాటకానికే పితృతుల్యుడయ్యాడు. నేరుగా సంఘ సంస్కరణోద్యమాన్ని బలపరచే ఉద్దేశ్యంతోనే అప్పారావు ఈ నాటక రచనకు పూనుకొన్నాడు.

'జగన్నాథవిలాసినీ నాటకసమాజం' ఇంతవరకు సంస్కృత నాటకాలను ప్రదర్శిస్తూ వచ్చి ఇప్పు డీతెలుగు నాటకాన్ని ప్రదర్శించింది. సిష్టల చలపతిశాస్త్రి గిరీశం పాత్రను గొప్పగా పోషించాడు. కృతిసమర్పణోత్సవ సందర్భంలో మరో మారు ప్రదర్శించినప్పుడు, మండపాక కొండలరావు "బంగారమునకు పెలిగారము వలె అప్పారావు రచనకు తగినట్టు" అభినయించాడని వసంతరావు బ్రహ్మాజీరావు గారి వర్ణన.[23] అలా మొదలైంది విజయనగరం నుంచి ఆంధ్రదేశం మీదికి ఈ నాటకం సాగించిన జైత్రయాత్ర. రంగప్రయోగమే నాటక సాఫల్యమయితే, ఇది సఫలమైంది. రచయిత రాసిపెట్టిన ఛలోక్తులు ప్రేక్షకులకందాయి; సందేశం సరేసరి. కన్యాశుల్క దురాచార మొకటేగాక అనేక సాంఘిక దురన్యాయాలు

---

సారాంశ మేమిటంటే, శాస్త్రం నిర్ణయించిన దానికంటె అధికధనం స్వీకరిస్తే కన్యా విక్రయదోషం తప్పదు; కాబట్టి అది అధర్మమే అవుతుంది—

కందుకూరి వీరేశలింగం ఈ శాస్త్ర దృష్టితోనే కన్యాశుల్కాన్ని "నరమాంస విక్రయ" మని వర్ణించాడు. కన్యాశుల్క నాటకానికి ఈ పండితాభిప్రాయం నైతికమైన బలాన్ని చేకూర్చిందని చెప్పనక్కర్లేదు. వీరేశలింగం మాత్రమేగాకుండా, పళ్ళె చెంచల్రావు కూడా కన్యాశుల్క పద్ధతికీ బాల్య వివాహాచారానికీ వ్యతిరేకంగా ధర్మశాస్త్ర ప్రమాణాలెన్నో చూపిన రోజులవి. విజయనగరంలోనే ఆనంద వర్ధనీ సమాజంవారు కన్యాశుల్కాన్ని గర్హించారని ఆనాటకం తొలిముద్రణ ప్రతిలో ప్రస్తావన ఉంది.

హేళనకు గురయ్యాయి. సామాన్య మానవులు నాటక పాత్రలై, సంఘ సమస్య నాటక ఇతివృత్తమై, పాత్రీకరణ పటిష్ఠమై, ఈ నాటకం నాటి "ఆంధ్రనాటక సాహిత్యంలో వొక సరికొత్త పద్ధతి [illegible] నూత్నంగా ప్రారంభమైంది." అని [illegible] పత్రిక రాసింది; ఆంధ్రసాహిత్యంలోనే ఒక "సాహసోపేతమైన నూత్న మార్గానికి ఆస్పదం" అంటూ [illegible] వ్యాఖ్యానించింది. పండితుల పత్రిక [illegible] అప్పారావు [illegible] తట్టింది. *

భాషవిషయమే చిక్కొచ్చింది. "ప్రబంధభాష"లో ఈ నాటకం రాశానని నేరుగా అప్పారావు తమతో 1914లో చెప్పినట్లు కే. వే. [illegible] శివరామశాస్త్రి రాశాడు. అది కన్యాశుల్కం తొలికూర్పుకూడా పొసగనిమాట. 24 [illegible] పీఠికలోనే వ్యావహారిక భాషావాదాన్ని ఢంకా బజాయిస్తూ అప్పారావు [illegible]. ఆంగ్లేయ నాటకక్రమాన్ని ఆంధ్రభాషలో సంఘటిస్తూ, "[illegible]" ప్రేక్షకుల సుఖాన్ని కోరుతూ అప్పారావు రచించినట్లు, ముడుంబై వరాహ నరసింహస్వామి సంస్కృత ప్రవేశికలోనే చెప్పాడు.

* కన్యాశుల్కం తొలి కూర్పు గురించి వచ్చిన పత్రికాభిప్రాయాలలో [illegible] విమర్శలు ఉన్నాయి. వీక్లీ రివ్యూ సమీక్షకుడు representation of Indian character in its various aspects అని దాన్ని పొగిడితే, తెలుగు హార్బింజరు [illegible] హాస్యమూ ప్రశంసార్హాలయ్యాయి. సంభాషణా చమత్కారాన్ని [illegible] ఎత్తిచూపింది. [illegible] బాలిక మెచ్చుకొంది. సంఘ సంస్కార పరతను చింతామణి గుర్తించింది. అప్పారావు [illegible]యాన్ని సాకల్యంగా ఆవిష్కరించిన సమీక్ష మద్రాసునుంచి [illegible] పీపుల్స్ ఫ్రెండ్‌లో 1897 జనవరి 21న అచ్చు పడింది. సరసయ్యగారి ప్రతిభను అప్పారావు బాగా గుర్తించినట్లు గు. ర. తే. పు. 102లో ఉంది. సరసయ్య ఇలా [illegible] :

Mr. Appa Rao is apparently a man of original ideas in literature...He has wisely and happily discarded for the purposes of his comedy the unnatural, stilted, Pedantic, literary dialect so much beloved of the Telugu pandits,..he has been ableto set at nought the absurd literary canons of this degenerate age and risen above the Prevalent grammatical and literary superstitions in regard to Telugu composition...a singularly original and interesting plot and...a variety of characters true to life...No little originality and dramatic skill...

దానికేమిగాని, హరవిలాస్ శార్దా మహాశయుని పేరుమీద లోకంలో వాసికెక్కిన బాల్యవివాహ నిషేధచట్టం చేసేందుకు 1929 వరకు ప్రభుత్వానికి ధైర్యం చాలనికాలంలో, ప్రజాభిప్రాయాన్నైనా సుముఖం చేసేందుకై వీరేశలింగం కృషితోబాటు అప్పారావు నాటకంకూడా ఒక శక్తిగామారింది. చరిత్రను అభివృద్ధి మార్గాన నడిపించగలిగిన మహాపురుషులలో గురజాడ అప్పారావుకూడా ఇప్పుడు చేరిపోయాడు.

ఆనందగజపతి పురమాయిస్తేనే అప్పారావుచూపు ఇంకొకవైపుకుకూడామళ్ళింది. స్వయంగా చరిత్ర విద్యార్థికావడమటుంచి విజయనగర రాజుల పుట్టుపూర్వోత్తరాలను గురించీ కళింగదేశ చరిత్ర గురించీ శ్రద్ధబూనాడు.

విజయరామగజపతి తన పూర్వులకు 'సుబేదార్' 'మహామండలేశ్వర' బిరుదులుండేవని అంటూవుండగా, ఎన్నడో చిన్నతనాన ఆనందగజపతి వినిఉన్నాడు. అది నిజమోకాదో తెలుసుకోవాలి. తన అనుమానాన్ని ఆశ్రితుల చెవుల్లోవేశాడు. అలా రగుల్కొంది అప్పారావుకు చరిత్ర పరిశోధనలో ఆసక్తి. పర్లాకిమిడి రాజావారి హైస్కూలులో పనిచేస్తున్న గిడుగు రామమూర్తి ఈ నిప్పురవ్వను రాజబెట్టాడు. 1889 లోనే ముఖలింగ క్షేత్రానికి వెళ్ళిఉండినప్పుడు, అక్కడి దేవాలయ కుడ్యాలపైనీ స్తంభాలపైనీ కానవచ్చిన శాసనలిపి, రామమూర్తిని కవ్వించిఉంది. పర్లాకిమిడి రాజావారి తమ్మునికి విద్యాదానం చేస్తూ అతని ధనసహాయంతోటి తనకు కావలసిన పుస్తకాలనూ, సామగ్రినీ తెప్పించుకొని ఆ శాసనలిపిగుట్టు చేజిక్కించుకోగలిగాడు. వ్యాసాలురాసి *ఎపిగ్రాఫికా ఇండికా* పత్రికలో ప్రకటించాడుకూడా. విజయనగరాన అప్పారావు పెట్టించిన సభలో The Antiquities of Mukhalingam అనే పెద్దవ్యాసం రాసుకొచ్చి చదివాడు. ఇలా మళ్ళీ మొదలైంది బాల్యస్నేహితుల 'తోడిడి'. స్వయంగా అప్పారావు విశాఖ, గోదావరి మండలాల్లో పర్యటిస్తూ శాసనాలు సేకరించసాగాడు. *కన్యాశుల్క* ప్రదర్శన కాలంనాటికే ఇదిఒక దశను చేరుకొన్నట్లు విజయనగరం పత్రిక *ది తెలుగు హార్పు* రాసింది_ an earnest labourerrin the field of local archaeology.

స్థానిక చరిత్రలో ఆసక్తి అక్కడితో ఆగిపోలేదు. బిరుదులకు సంబంధించి, సంజీవరావు అనే ఆయన 'మహామండలేశ్వర' బిరుదుకు దాఖలా చూపిస్తే 'సుబేదార్' బిరుదుకు అప్పారావు చూపించాడు. అది చిన్నవిషయం. విజయనగరరాజులతోబాటు

మూడుగుల మత్స్యవంశం, బొబ్బిలి పాలకరాజులు ... [illegible] సాగిపోయింది. తెలుగుశాసనలిపిని మరింత సులువుగా బోధపరచుకొనేందుకు, దాని క్రమాభివృద్ధిని గమనించేందుకు, కన్నడభాషను నేర్చుకోవలసివచ్చింది. [illegible] క్వార్టర్లీ వాల్యూములు తిరగవేయవలసివచ్చింది. ఓరియంటల్ మ్యూజియం గాలించవలసి వచ్చింది. బెంగుళూరులో హెచ్. కృష్ణశాస్త్రినీ, ఎ. వెంక[illegible] కలిసి మాట్లాడవలసివచ్చింది. డా. ఫ్లీట్ వారితోటీ, భండార్కరుతోటీ ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించవలసి వచ్చింది. మద్రాసు గవర్నరు అనుమతి పొంది సెంట్‌జార్జి కోటలోని పురాతన రాజ్యపత్రాలు తిరగేయవలసి వచ్చింది. ఊహాలతో చరిత్రనల్లకుండా, శాస్త్రీయపద్ధతులను చేబట్టి దక్షిణభారతదేశ చరిత్రను పునర్నిర్మించాలని సంకల్పించవలసి వచ్చింది. పూసపాటి రాజవంశపు తీగను కదిలిస్తే, [illegible] చరిత్ర డొంకంతా కదిలిందన్నమాట:

> నిజమే; నాకు ఆలోచనలు లావు: మనసు ప్రశాంతంగా వుండక అనేక విషయాల మీదకు దృష్టి పోతుంది. పురావస్తు తత్వ పరిశోధనలను కావించాలనే పిచ్చి ప్రబలి పోతున్నది.

మహారాజావారి వంశ చరిత్ర ఎక్కడ, ఆంధ్ర నాటక రంగం ఎక్కడ? ఈ రెండూ చాలక క్షత్రియుల విద్యాసమస్య ఎక్కడ? చారిత్రిక ఇతివృత్తం గల నవలలూ నాటకాలు రాయాలనిపించి, పూసపాటి మాధవవర్మను నాయకుడిగా చేసి సౌదామిని అనే ఒక నాటకాన్ని రాయబూనాడు, అది పూర్తికాలేదు. పూర్తి చేయలేదు. ఇంతలో ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. 1891 శీతాకాలంలో ఒకనాటి ఉదయం కొండెక్కుతూ ఎక్కుతూ మూర్ఛ వచ్చినంత ఆయాసం పొంది స్పృహ తప్పినప్పటి నుంచీ, అది క్షీణించ సాగింది. మరణం తప్పదనుకొన్నాడుకూడా. అయితే ఆనంద గజపతి మద్రాసుకు వెంట బెట్టుకుపోయి డాక్టరు బ్రౌనింగుచేత చూపించాడు. (1895). అప్పటికే నరాలన్నీ పట్టుదప్పి పోయాయి. చావు భయం లేదని డాక్టరు చెప్పాడు. చాలాకాలం బతుకుతావు పొమ్మన్నాడు. అయిదు నెలలు గడిచిందో లేదో బ్రాన్కైటిస్ పట్టుకుంది. కాలేజిలో 'లీవ్' తీసుకొని మద్రాసులోనే ఐదారు నెలలుండి పోవలసి వచ్చింది. అక్కడైనా కుదురుగా ఉండేవాడా అంటే, లేదు. క్రిశ్చియన్ కాలేజీకో, పచ్చియప్ప కాలేజికో వెళ్ళి మిల్లర్, స్కిన్నర్ వంటి విద్వాంసులతో ప్రసంగిస్తూ; శ్రీనివాసచారి వెంట నాటకాలు తిలకిస్తూ: సంగీత కచ్చేరీలకు హాజరౌతూ; సెంట్ జార్జికోటలో కాగితాలు తిరగేస్తూ; షాపుల్లో

మారుతూ, ; ఏష్టుల్లో తిరుగుతూ ; పాత పత్రికల సంపుటులు తిప్పుతూ : తన శరీరానికి ఎన్నో పరీక్షలు పెట్టాడు.

నిర్విరామ పరిశ్రమగా మారిన ఈ వ్యాసంగానికీ అధ్యాపకవృత్తికీ పొంతన ఉండదని ఆనందగజపతికూడా గమనించాడు. పైగా అప్పారావు గొంతుక కీచుబడి పోయింది. కీ. శే. శ్యామలరావు మిత్రుడైన శ్యామసుందరరావు మహారాజాతో మాట్లాడాడు. వీటన్నిటిఫలితంగా అప్పారావును సంస్థాన శాసనపరిశోధకుడుగా నియమించడం జరిగింది (1896). తీరికా ఓపికా సమస్తం శాసనసేకరణకే వినియోగించే వీలిప్పుడు చేజిక్కిందన్నమాట. పైగా ప్రకాశిక అనే పత్రికకు డిక్లరేషను పొందాడు. అయితే దానికి పురిటిలోనే సంధి కొట్టింది.

....మహారాజా వారు కుట్టించిన కొత్తకోటుమీద తొలిమోజు ఇంకా తీరలేదు. కొత్త ఉద్యోగం వచ్చి సంవత్సరం నిండలేదు. తన పరిశోధనకు మెచ్చి మహారాజా వారిచ్చిన 2350 రూపాయల బహుమాన ధన మింకా ఖర్చుపడిపోలేదు. ఇన్నిటికీ మూలాధారమైన మహారాజాయే మరణించాడు (1897 మే 23).

ఆనంద గజపతి అవసానదశ ఏడాది క్రితమే మొదలైంది. ఆయన కేదో గొప్ప విపత్తు వచ్చినట్టు కలగని గాభరాపడుతూ నిద్రలేచిన అప్పారావుకు 'ఛోటా మహారాణీ సాహెబా' వనజ కుమారి మరణవార్త వినవచ్చింది. ఆమె కాశీలో మరణించింది. పోతూ పోతూ ఆమె భర్త పంచప్రాణాలను వెంటబెట్టుకు పోయింది. ఆయన ఒక సంవత్సరం పాటు జీవచ్ఛవంలాగే జీవించాడు. కళాకాంతీ లేదు. మండుతున్న కుంపటిలాంటి గుండెమీద మూతపెట్టుకొని, తనది పరోపదేశ పాండిత్యమే కాదని తన నిగ్రహం ద్వారా నిరూపించాడాయన

సగం చచ్చి ఉన్న ఆనందగజపతిని పూర్తిగా చంపింది ఆయన ముద్దు గుర్రమే. వెలిగాడ కొండమీద నుంచి తుపానులో గుర్రం మీద దిగి వస్తూ, అది పట్టుతప్పి బోర్లాపడేసరికి జీను కొక్కెం గుండెల్లో దిగబడింది. ప్రమాదమనేది చెప్పివస్తే అది ప్రమాదమే కాదు. ఎటువంటి సందర్భాలలోనైనా గుర్రాన్ని దౌడు తీయించే అలవాటు ఆయనకుండేదని అప్పారావుకిప్పుడు గుర్తు వచ్చింది. మోతీ మహలుకు చేరుకొన్నాక, నాలుగు రోజులపాటు జ్వరం నిలిచికాచింది. ఆయాసం... ఎగ ఊపిరి.

మే 23 రాత్రి ఎనిమిదిగంటల వేళ....మహారాజావారికి మందు పట్టుకొద్దామని అప్పారావు డాక్టరుగారి వద్దకు వెళ్లాడు. తిరిగి వస్తున్నాడు. మహారాజావారి గదిలో

సందడి....తనకు గుండె ఆగినంత పనైంది. గాబరా.... 'కంటోన్మెంటు' నుంచి డాక్టరు గారు పరుగు పరుగున వచ్చారు....అప్పారావు గది వెలుపల....

—మనస్సు పరిపరి విధాలపోతున్నది. అధైర్యం హెచ్చింది. గుండె దడదడలాడుతోంది. ఏ నిమిషంలో ఏ దుర్వార్త చెవిని పడుతుందో కదా! అక్కడే అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను.

మూడు గంటలయింది. మరి అయిదునిమిషాలకు మహారాజావారు పరమపదించారు....మర్నాడు ఉదయం, కడసారి ఆయనను దర్శించుటకు వెళ్లాను. ఆయన వదనం మామూలుగానే వుంది. ఏమాత్రం కళ తగ్గలేదు. నిశ్చలముగ, ప్రశాంతముగ, నిర్మల వదనముతో నిదురపోతున్నట్లు కనిపించారు. ఆ గంభీర విగ్రహము అలాగునే వున్నది.

మహారాజావారు మరిలేరు. ఎంత హృదయవిదారకము. నేటినుంచి ఎవరి సుభాషితములు నేను వ్రాయను? ఎవరిప్రసంగములను విని ఆనందించగలను? ఎవరితో కవితానందమును అనుభవించగలను? 25

శ్రీకృష్ణుని మృతకళేబరాన్ని చూసిన అర్జునుడుకూడా "లోకమునుండి ఒక మహాజ్యోతి వెడలిపోయినది" అనుకొనే ఉంటాడు.

---

1. గు. ర. మా. మం: ఆనందగజపతి దర్బారువింతలు, పు. 134 - 135. ఈ అధ్యాయంలో నేను పేర్కొన్న అంశాలూ ఉదహరించిన మాటలూ ఎక్కువగా ఈ శీర్షికనుంచి తీసుకొన్నవే.
2. ,, ,, పు. 126.
3. గు.ర.లే: పింఛనీ, శ్రీ జి. అప్పయ్య రిమార్కులు, పు. 234 - 235.
4. గు. శ. సం. హై: మహాకవి గురజాడ అప్పారావు, (వ్యా) పు. 7.
5. గు, ర. లే: సాహిత్యలేఖలు, నాటకగోష్ఠి. పాదదీపిక—పు. 69 - 72.
6. గు. ర. మా. మం: పీఠిక: ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం, పు. iii—iv
7. గు. ర మా. మం; శంభుచంద్రముఖర్జీ, పాదదీపిక—పు. 16.
8. How India wrought for Freedom: *Annie Besant P. 40-41*
9. దేశీయ మహాసభయు దాని ఉద్దేశములును (ఉ) వీరేశలింగం గ్రంథావళి. ఎనిమిదవభాగము. పు. 4 - 50

10. స్వీయచరిత్రము, మొదటిభాగం : కొండ వెంకటప్పయ్య, పు. 77 - 78.

11. గు. ర. మా. మం : ఆనందగజపతి : దర్బారువింతలు, పు. 126.

12. ,, పు. 26.

13. గు. ర. ము ; ఋతశతకం, పు. 114.

14. తె. భా. చ. సం ; ఆనంద గజపతి (వ్యా)
మేడేపల్లి వరాహనరసింహస్వామి, పు. 725.

15. స్వీయచరిత్రము, మొదటిభాగం : కొండ వెంకటప్పయ్య, పు. 59.

16. గురజాడవారి రచనలు : వీరేశలింగంగారిపై దాడి (వ్యా)
పారనంది జగన్నాథస్వామి, భారతి 1964 సెప్టెంబరు.

17. గు. ర. మా. మం ; ఆనందగజపతి : దర్బారువింతలు, పు. 136.

18. గజపతిరాజుల తెలుగు సాహిత్య పోషణము :
బులుసు వెంకటరమణయ్య, పు. 203 - 205.

19. గురజాడవారి రచనల పరిచయం (వ్యా) :
పుష్పగిరి రాజమ్మ, పరిశోధన, డిసెంబరు. జనవరి 1956.

20. ఆధునికాంధ్ర కవిత్వము : డా॥ సి. నారాయణరెడ్డి పు. 212.

21. స్వీయచరిత్రము : చిలకమర్తి లక్ష్మీనరసింహం. పు. 83 - 85.

22. తెలుగువాఙ్మయ సంగ్రహచరిత్ర:తెలుగునాటకాలు:కె. వి. గోపాలస్వామి.

23. గు. శ. సం. హై ; గురజాడ సమకాలికులు (వ్యా) :
వసంతరావు బ్రహ్మాజీరావు, పు. 27.

24. భారతి రజతోత్సవ అధ్యక్షోపన్యాసం ;
(ఉ) వేలూరి శివరామశాస్త్రి, భారతి జూన్ 1949.

25. గు. ర. మా. మం : ఆనందగజపతి : దర్బారువింతలు, పు. 145-146.

# అ రు ణో ద యం

"పెరిగి విరిగితి; విరిగి పెరిగితి
కష్టసుఖముల పారమెరిగితి."

**ఆనంద గజపతి** గతించి ఆరు నెలలైనా నిండలేదు. చనిపోయిన మహారాజా ఆజ్ఞలు కొనసాగించడమా? సరిసరి, అసిస్టెంటు సంస్థానోద్యోగులు, జాయింటు మేనేజరు అనంతరావు లాంటివాళ్ళు. ఇక [illegible] పోతున్న విల్లక్ సంగతి చెప్పాలా? ఒకరోజున ప్రొద్దుటే ....

....భూములకు సంబంధించి పేచీలుపడి నలిగిపోతున్న రైతులు కొందరు వచ్చి శ్రీవారాణి అప్పలకొండయాంబ వద్ద మొరపెట్టుకొన్నారు. రాణిగారు అప్పారావంటే దొడ్డగురి. పోయేముందు ఆనంద గజపతి ఇతన్ని ఆవిడకు అప్పచెప్పి పోయాడు. కాబట్టి రైతులను మేనేజరుగారిదగ్గరకు తీసుకెళ్ళమని ఆవిడ అప్పారావుకు పనిపెట్టింది. మేనేజరుగారు వెళ్ళి విల్లక్‌దొరను చూసి కోరినారు. దొరగారు పిలుస్తున్నారని చెప్పారు. సరేనంటూ వెళ్ళాడు అప్పారావు. విల్లక్ మర్యాదలిచ్చి మాట్లాడసాగాడు. అప్పటికే వారిమధ్య వ్యవహారం బెడిసివుంది. గంగారాజు అమీను పెట్టుకున్న 'పిటిషను' గురించి 'ఫుల్‌నోట్' తయారుచేసి పంపవలసిందని విల్లక్ ఆజ్ఞాపించాడు. అప్పారావుకైతే సంస్థానం తలిశిళ్ళన్నీ తెలిసివుంటాయని మేనేజరు ఈ పాచిక వేశాడు. సంస్థానం ఆఫీసుకెళ్ళి సమగ్రమైన 'మెమొరాండం' తయారుచేసి పంపమన్న విల్లకే, అక్కడ పడివున్న పనికిరాని కవిలకట్టల గురించి మేనేజరుగారిని వేధిస్తున్నావంటూ అప్పారావుమీద సొడ్డుపెట్టాడు. ఇలా మొదలైన విరసం, రైతుల వ్యవహారందగ్గర పెడసరంగా మారింది. అప్పారావు స్వయంగానే దీన్ని రాసిపెట్టుకొన్నాడు:

— తీరా నేను వెళ్ళేసరికి దొరగారు తన ధోరణిలో లేరు. గిరుక్కున నాకేసి తిరిగిచూసి 'మంచిది, ఏమిటి వ్యవహారం?' అని ప్రశ్నించారు.

— 'ఈ వ్యవహారం గురించి నాకేమీ తెలియదండి. రైతుల్ని మ్యానేజరుగారి దగ్గరకి తీసుకు వెళ్ళమంటేనూ....'

— 'అలా అయితే నన్ను కలుసుకోవాలని మీ రెందు కనుకున్నారు?'

— 'అనుకోలేదండీ.'

— 'ఈ విషయంలో యాక్షను తీసుకునేది నేను; మేనేజరు కాదు. ఆయన దగ్గరికి మీరెందుకెళ్ళారు? ఇలాంటి వ్యవహారాలు సాగనిచ్చేదిలేదు.'

— 'అసలు వ్యవహారమేమిటో నాకు తెలియదు. ఇదేదో రైతుల వ్యవహారం. వీళ్ళని రీవామహారాణీవారు మ్యానేజరుగారి దగ్గరకు తీసుకు వెళ్ళమంటే సరే నన్నాను. ఇంతే నేను చేసింది.'

— 'హాఁ! నాకు తెల్సును! ఈ వ్యవహారానికంతా మూలం మీరే. యు ఆర్ ఎట్ ది బాటమ్ ఆఫ్ దిస్........ యస్.... మీ ప్రవర్తన గురించి మీరు జాగ్రత్త పడాలి'.

— 'నా ప్రవర్తన నాకు తెలుసును. కాని నేనేమి 'బాటమ్'లో లేను. మీకంత కోపం ముంచుకొస్తున్నందుకు నాకు మాత్రం విచారంగా వుంది'. 'యస్ యస్; సరే సరే; ఇకమీరు వెళ్ళండి;' 1

'బాటమ్'లో లేడు; మరెక్కడ ఉన్నట్టు? 'టాప్'న ఉన్నాడు. అందుకే ఈ కడుపు మంటలూ అక్కసులూ! హుజూరు వద్దగాకుండా తనవద్ద పని చెయ్య వలసిందని జాయింట్ మేనేజరు, అప్పారావు "మంచిని" కోరి చెప్పాడు. ఆనంద గజపతి చెప్పిపోయిన పనులు చూసుకొంటున్నానని ఆయన జవాబు. అనంతరావు ఏమనాలి?

— సరిసరి! చనిపోయిన మహారాజా ఆజ్ఞలు కొనసాగించడం!

అంతత్వరగా ఆనంద గజపతి తన ఉద్యోగుల మనస్సుల్లో "చచ్చి" పోతాడని అప్పారా వనుకోకుంటే, అది ఆయన తప్పే. ఎందుకంటే ఏనాడు మహారాజా సంస్థానం వ్యవహారాల్లో నేరుగా జోక్యం కల్పించు కొన్నాడు గనక? పైగా సంస్థానం బాగుపడాలంటే సంస్థాన పరిపాలనను తన పైన వేసుకోగూడదని మహారాజా సిద్ధాంత మొకటి ఉండె! జమీందారైనంత మాత్రాన పరిపాలనా సామర్ధ్యం ఉంటుందని ఎందుకనుకోవాలి? అందుకే దక్షులైనవారి చేతికి బాధ్యత లప్పగించడమే శ్రేయస్కరం. వారి పనిలో తాను వేలుబెట్టగూడదని ఆయన నియమం. వారికి పూరా స్వేచ్ఛ. చివరకు వారి మీద చాడీలుకూడా ఆయన విన గోరడు. వారంటే దయ. ముఖ్యంగా సంస్థానం సేవ చేస్తూ వచ్చిన స్టీవెన్సు,

డేవిస్ లాంటి ఇంగ్లీషువాళ్ళ కష్టసుఖాలు విచారించి చేతనైనంత సాయంచేస్తూ వచ్చాడు. ఆయన మంచితనాన్ని వీలు జేసుకొని సన్నిధిలో మాత్రమే ఆంజ నేయుల వాలకం చూపెట్టే వంచనాపరులుకూడా ఉండేవాళ్లు. అది తనకు తెలిసికూడా చూసీ చూడనట్లు ఉండిపోయాడు. పైగా ఇంగ్లాండు దేశంలో జరుగుతూవచ్చిన ఎన్నికలను గమనిస్తూవచ్చి, మేనేజరు, జాయింటు మేనేజరు పదవులకు ఎన్నికలు జరిపితే ఎలాగుంటుందో ఊహించేవాడు కూడా. 2 అందుచేతనే సంస్థానోద్యోగు లిప్పుడు ఏకుమేకై కూర్చున్నారు.

> మహారాజావారు మరణించిన వెంటనే, వారి ఆశయాలు వారితో నశించి పోయినాయి. ఇప్పుడెవరూ వాటి జోలికి పోరు. ఎవరూ స్మరించరు. అంతా విస్మరించినట్లే కనబడుతున్నది.

సంస్థానం ఇబ్బందుల పాలౌతూఉంది. కోర్టులకెక్కుతున్నది. ఆదాయం తగ్గుతున్నది. పాత రాజవంశానికే సవాళ్లెదురౌతున్నాయి. వత్సరాజు ఉదయనుడు లేకున్నా ఒక యౌగంధరాయణుడు రాజ్యాన్ని నిలబెట్టగలడు. ఆనందగజపతి 'నమ్మక్' తిన్నందుకేగాక, ఆయనను ప్రేమించినందుకూ, ఆయన తనను అంతగా నమ్మినందుకూ, అలకరాజేశ్వరికీ, అప్పలకొండయాంబకూ *తన నప్పగించినందుకూ తాను సంస్థానం సేవచెయ్యాలి. అప్పారావు హోల్కారు మహారాజాకు దివానైతే బాగుంటుందని జోధపుర యువరాజా అర్జునసింగ్ ఆనందగజపతి కొకమారు సూచించాడు; కనీసం కార్యదర్శిగానైనా పంప మన్నాడు. కాదుకూడ దనకుండానే వేళాకోళంలోకి దించి, అప్పారావు తనపనిని తాను చక్కజేసుకుంటూ హోల్కారును మెప్పించగల చతురుడేనని ఆనందగజపతి అన్నాడు. కన్ను రిట్టగించి చూసీచూడ నట్లుంటూనే చూస్తూంటాడని, నిటారుగా నిలబడికూడా ఒకబుజాన్ని దించుకొని ఉంటాడని అప్పారావును నఖశిఖపర్యంతం శోధించాడు ఆ మహారాజా; అతని ఆంతర్యాన్నికూడా కనిపెట్టాడు. అందుకనే అంతనమ్మకం. వీటన్నిటిని పురస్క రించుకొనే 1898 జూన్‌లో రీవారాణి ఆంతరంగిక కార్యదర్శి నియామకానికి అప్పారావు ఒప్పుదల చూపవలసివచ్చింది. ఇలా మొదలైంది ఆయన జీవితంలో మహర్దశ.

---

* అప్పలకొండయాంబనే రీవారాణి అనేవారు. జనం 'రీమా సర్కారు' అనేవారు. ఇప్పటి మధ్యప్రదేశ్‌లోని రీవాలో మఖోగడ్ సంస్థానాధిపతి రామరాజుసింగు ఆమెను పెళ్లాడాడు. త్వరలోనే ఆమె భర్తను పోగొట్టుకొని పుట్టింటికి వచ్చి చేరుకుంది.



రీవారాణి అప్పల కొండయాంబ

( ఫోటో ననుసరించి )

ఆనంద గజపతికి సంతు లేనందుచేత, చనిపోయేముందు రాసిన వీలునామా ప్రకారం దత్తత తీసుకొనేందుకు తల్లికి అధికారం ఇవ్వకుండా, ఆమె అన్న శంభో సింగు కుమారుడైన చిట్టిబాబుకు సంస్థానాన్ని దానంగా ఇచ్చిపోయాడు. ఆమెకు 'రివర్షనల్' అధికారం వచ్చింది. పదహారవ ఏట(1898) ఉపనయనానంతరం విజయ రామ గజపతి పేరుతో చిట్టిబాబు సంస్థానాధిపతి అయ్యాడు. ఇంకా యుక్త వయస్సు రానందుచేత, ప్రభుత్వంవారు 'కలెక్టర్ అండ్ గార్డియన్'గా విల్లక్‌ను నియమించారు. 'రీజన్సీ కౌన్సిల్' అంటూ ఒకటి ఏర్పాటయింది. అందులో అలక రాజేశ్వరీదేవి, రీవారాణి, విల్లక్ తదితరులు సభ్యులు. ఆ సంవత్సరం డిసెంబరు 18న దత్త స్వీకార మహోత్సవం జరిగింది. మరు సంవత్సరం నవంబరు 4న అలక రాజేశ్వరి వీలు నామా రాసింది.

సంస్థానం ఎన్నో వ్యాజ్యాల నెదుర్కోవలసి వచ్చింది: వెలిగాడ దావా, కొండపాలెందావా, కృత్రిమకొండ దావా, అక్కయ్యవలస దావా వగైరాలు. గురజాడ అప్పారావు తలకు పట్టిపోయాయి. కృత్రిమకొండ దావాను స్వయంగానే నడిపించాడు. పూర్వాశ్రమంలో అప్పారావు శిష్యుడూ, అటుమీదట 'లా బ్రాంచి' అధికారి అయిన జి. అప్పయ్య ఇలా రాశాడు: "ఇది సంస్థాన వ్యాజ్యాల్లో అతి ముఖ్యమైనది. ఏమంటే సంస్థానానికి వ్యతిరేకంగా హేమాహేమీలు—గారలు సాక్ష్యాలు ఇచ్చారు. ఇది కనక గెలవకపోయినట్లయితే, దీనిని పురస్కరించుకొని అనేక దావాలు మీదపడును." 3. మొసళ్ళవాత బడకుండా సంస్థానాన్ని ఒడ్డునవేసి నిలబెట్టడానికి గజీతగాడైనాడు అప్పారావు.

రామాయణంలో పిడకల వేట కాకుండా పిడకల వేటలో రామాయణంలాగా, దేవిడీ లావాదేవీలలో తల మునకలై గూడా శాసన పరిశోధనను కొనసాగిస్తూ వచ్చాడు. శాసనాల ప్రతులుతీసి అచ్చువేయించే సామాన్లను ఆనంద గజపతి తన కుచితంగా ఇచ్చిపోయాడు. ఇలియట్ తెలుగు శాసనాల సంపుటి లగాయతు డాక్టర్ ఫ్లీట్, బర్నెల్, బ్యూలర్ ప్రభృతుల 'పేలియోగ్రఫీ' (Palaeography) గ్రంథాల వరకు చదవకుండా విడిచిపెట్టేసిందిలేదు. హుల్ట్జ్ (Hultzsch) వంటి మేటి శాసన పరిశోధకునితో ఉత్తర ప్రత్యుత్తరాలు నడపడమేనా, కృష్ణశాస్త్రి, వెంకయ్యలతో ముఖాముఖి చర్చించడమేనా, కాలికి బలపంకట్టుకొని ఊళ్ళూ నాళ్ళూ తిరిగి రాగిరేకులను, శాసనాలను సేకరించడమేనా, మనిషికి మించిన శ్రమచేశాడు. స్థలపురాణాల నుంచి ఎలాగో పుక్కిటిపురాణాలనుంచి అలాగే 'చరిత్ర' బయల్పడసాగిన ఉషః

కాలమది. 'చరిత్ర చతురానను'లుగూడా ఇంకా విస్మృతాంధకారములంనుంచి వెలువడ లేదు. చరిత్రకారుడుగా గుర్తింపుపొందని గురజాడ అప్పారావు చిక్కు ముసిరిన ఆ అల్లకల్లోలపు ప్రళయజలాలలోనుంచి ఆంధ్రచరిత్రకు అవసరమైన సామగ్రిని శాస్త్రీయ పద్ధతులతో సేకరించాడు. ధరణికోట నాయకుల చరిత్ర, నాగులకొండ పడమటి నాయకుల పూర్వోత్తరాలు, మరికొన్ని జమీందారీ కుటుంబాల కథా కమామీషులు సమకూర్చారంటూ, మల్లంపల్లి సోమశేఖరశర్మ ఇలా రాశాడు: "ఆంధ్రదేశంలో లభించిన ఒరిజినల్ రికార్డులనుంచి ఆయన చరిత్రను వ్రాశారు.... ఆమూలాగ్రం క్షుణ్ణంగా పరిశీలించినట్లు తెలుస్తుంది."[4] *

కన్యాశుల్కం రాశాక, తనసాహిత్య వ్యాసంగం యావత్తూ ఈ పరిశోధనానికే కుదించుకుపోయింది. అది వ్యసనప్రాయంగా మారిందికూడా. రాత్రి నిద్రించే ముందు కళ్ళముందు అక్షరాలు మెదలందే కునుకుపట్టకుండా వచ్చింది. ఆనంద గజపతి హయాంనుంచీ, మద్రాసులోని 'హిగిన్ బాథమ్స్' వారితో, కేంబ్రిడ్జి పుస్తకాల కంపెనీవారితోనూ అప్పారావు ఒక ఏర్పాటు చేసుకొని ఉన్నాడు. సీమనుంచి కొత్తగా వచ్చిన పుస్తకాలలో తన అభిరుచుల కనుగుణమైనవాటిని ఎప్పటికప్పుడు వాళ్ళు పంపుతూవచ్చారు. సంస్థానంవారికి 'బిల్లు' పంపడమే తనపని. 1895 లో మద్రాసుకు వెళ్ళి ఉండగా, ఏ బజారులో ఏ పుస్తకం కనిపిస్తే అది కొనివేయడం ఈ వ్యసనానికి సూచిక. 1889 లోనే Practice of Elocution Living Authors, Hints on Elocution, A look Round Literature, Analysis of English Language చదివినట్లు దాఖలాలున్నాయి. అవన్నీ ఒకెత్తు — The Pleasure of Desultory Reading అనేదొక్కటీ ఒకెత్తు. ఆయన అభిరుచి ఎన్నడూ

---

* ప్రాచీన శాసనలిపి పాఠకపదవిలోనూ, అటు పిమ్మటనూ అప్పారావు సాగించిన చరిత్ర సంబంధకృషిని ఇంతవరకూ ఎవ్వరూ వెలగట్టలేదు. దానికి కారణం, ఆయన సేకరించిన పత్రాలు వగైరా చెల్లాచెదురుగా ఉండడమొక్కటేకాదు - ఆయన రచనల ప్రచురణాధికారం పొంది ఉన్నవాళ్ళు, ఆ పత్రాలను ట్రంకుపెట్టెలనుంచి విముక్తి చెయ్యకపోవడంకూడా ఒక కారణమే.

మల్లంపల్లి సోమశేఖరశర్మవంటి పండితులుకూడా అప్పారావు ముద్రిత రచనలను ముందుంచుకొని మాత్రమే ఆయన కృషిని వెలగట్టారు. ఇక గిడుగు సీతాపతిగారి దృష్టికి "గురుజాడ అప్పారావుగారు రెండు చిన్న శాసనములు మాత్రమే చదివి ఎపిగ్రాఫియా ఇండికాలో వ్యాసములు ప్రకటించారు. ఆ తర్వాత ఈ పని యెడల వారికి విసుపు పుట్టినది." (సాహిత్యోపన్యాసములు–గిడుగు వెంకటరామమూర్తిపంతులు పు. 12) ఇది పూర్తిగా

సంకుచితమైనదికాదు : గ్రామరు, వాగ్విధాయిని, కథాసప్తతి; 'అవ్‌డాన్' అనే నవల; నాటకాలు; కారన్‌హిల్ పత్రిక సంపుటులు; వేదాంతసారం, ది ఫోక్ సాంగ్స్, ఒరిస్సా అండ్ టెంపుల్ ఆఫ్ జగన్నాథ్; గ్రీక్‌అండ్ గోథే (Goethe), 1895 లో ఆయన డైరీలలో కనిపించే పుస్తకాల సమాచారం ఇలాగుంది. ఇంతెందుకూ – ఆయన ఎక్కడికి వెళ్ళితే అక్కడికి ఒకచిన్న గ్రంథాలయం తరలి పోయేది. ఆ చదవడమైనా ఆద్యంతాలు కాదు – అలవోకగా అలా అలా తిరగవేసే వాడు పుటలు. మంచి రచయిత అయినవాడు గ్రంథాదిలోనే తాను రాయబోతున్న దాని సారాంశాన్ని సూచిస్తాడని అంటూ ఉండేవాడు. ఏకసంథాగ్రాహి అని భ్రమ పెట్టేటంత వేగంగా పుస్తకాన్ని చదవడంపూర్తిచేసేవాడు. ఇలా సేకరించి సేకరించి ఇల్లుపట్టనంత సొంతగ్రంథాలయాన్ని సమకూర్చుకొన్నాడు. బెర్నార్డుషా Dramatic Opinions and Essays అనే పుస్తకాన్ని రాశాడని చాలామందికి నేటికీ తెలియదు గదా ! అది అచ్చుపడే పడకముందే అప్పారావు చేతికి వచ్చింది. అంత విస్తారంగా చదివి సమకాలపు నాగరిక భావ పురోగతిని అనుభవానికి తెచ్చుకోబట్టే, అంతటి మేధావి కాగలిగాడు.

ఈ దశలో ఇదమిత్థంగా సాహిత్యానికి ఏ విధంగా అప్పారావు దోహదం చేసినట్టు ? చేసింది బహుకొద్ది; చేయదలచింది జాస్తి. 'ఇండియన్ గార్రిక్' బిరుదు

---

మట్టుకు నిజం కాదేమో ? ఎందుకంటే 1912 వరకుగూడా అప్పారావు ఈ రంగంలో కష్టిస్తూ వచ్చినట్టు తెలుస్తున్నది. ముఖ్యంగా 1908-1909 సంవత్సరపు Report of the Assistant Archaeological Department for Epigraphy, southern circleలో పలుతావుల అప్పారావు ప్రసక్తి ఉంది, విష్ణుకుండిన రాజవంశానికి చెందిన మహారాజ ఇంద్రభట్టారకవర్మ కాలపు శాసనము, అప్పారావు సేకరణలలో ఒకానొకటి. తూర్పు గాంగ వంశపురాజు మూడవ వజ్రహస్తుని తామ్రశాసన పంచకం మరొకటి. తూర్పు చాళుక్యులు కొక్కిలివర్మ, చాళుక్య భీముడు వగైరా రాజుల తామ్రశాసనాలు మరికొన్ని. ఇవన్నీ విశాఖమండలానికి చెందినవే. పైన పేర్కొన్న నివేదికనుబట్టి అప్పారావు పరిశోధనలూ, సేకరణలూ ఎంతో ప్రయోజనం కలిగినవని తెలుస్తున్నది. ఆ నివేదిక చివర, మద్రాసు ప్రభుత్వ ప్రధాన (తాత్కాలిక) కార్యదర్శి A. C. Cardew సంతకంతో ఉన్న Order No. 538. Public, dated 28 th july 1909 అప్పారావు కృషినిలా ప్రశంసించింది. (పు. 124) :

The government are much obliged to M. R. Ry. G. V. AppaRao pantulu and M. R. Ry. K. Nagabhushanm Nayudu for the assistance acknowledged in Paragraph 54 of Part II of the Report and notice with satisfaction the Interest taken in epigraphy by Deputy Collector M. R. Ry. J. Ramayya Pantulu and other officials.

పొందిన నటుడు జి. సి. వి. శ్రీనివాసాచార్యులు ఇంగ్లీషున [illegible] నాటకం రాయగా, దానికి అప్పారావు సుదీర్ఘమైన ఉపోద్ఘాతం రాశాడు. మరి, విక్టోరియారాణి రత్నోత్సవ సందర్భాన చిలకమర్తి లక్ష్మీనరసింహం తెలుగున రాసిన ప్రశంసా పద్యాలను, న్యాపతి సుబ్బారావు అభ్యర్థనపై, ఆంగ్లీకరించాడు. వైస్రాయి మదరాసుకు విజయంచేసిన తరుణంలో (1900), రీవారాణి అచ్చు వేయించి పంచి పెట్టిం దీ పద్యాలనే. మరొక సంవత్సరం గడిచాక, కాలేజి సంస్కృత విద్వాంసుడు భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి రాసిన సంస్కృత [illegible] వ్యాయోగానికి అప్పారావు ఇంకా విపులమైన పీఠిక రాశాడు. ప్రతిభ పూరా విప్పారిన నడిప్రాయాన ఇదేనా తాను చేయవలసిన సాహిత్యకృషి ?

సాహిత్యం ఆక్రమించిన స్థానాన్ని చరిత్ర ఆక్రమించిలా ఫరవాఉంచే కాదు. న్యాయశాస్త్రంవచ్చి నట్టింట కూర్చోవడమే విపరీత మనిపించేసంగతి. ఆదుర్దా పడేందుకుగానీ, ఆసక్తిచూపేందుకుగానీ సంస్థానమే తనపాలిటికి ఒకపెద్ద కుటుంబమై కూర్చుంది. తన చిన్నకుటుంబంకూడా దానికి తగుపాటి సమస్యలను లేవదీసింది. 'నానమ్మ'కు పెళ్ళీడు వచ్చింది. 'బాబు'కు ఉపనయనం జరగాలి. అవోసపోచేసి ఈ శుభకార్యాలను రెంటినీ 1898 మే 12 వ జరిపించాడు. ఆ సంవత్సరం జనవరి నెల డైరీ చదివితే, 22 వ తారీఖున సూర్యగ్రహణకాలంలో ఇద్దరు బత్తులచేత మిశ్రలోహాలతో ఉంగరాలు చేయించినట్లు తెలుస్తుంది. గ్రహణకాలానికీ, లోహాల దారుఢ్యానికీ మధ్యగల ఇలాకా ఏమిటో తెలియదు. అలాగే ఫిబ్రవరినెల 27 వ తారీకునాటిడైరీ నగలజాబితానిస్తుంది. పెద్ద 'లిస్టే'- మొత్తం పదమూడువందల రూపాయలకు లెక్క తయారైంది. గుర్రాన్ని కొనుగోలు చేసిందికూడా ఆ ఏడే. ఇవన్నీ అప్పారావు హోదాలోవచ్చిన పెరుగుదలకు సూచికలు. విజయనగరంలోనే ఉండి చదుకొన్న ఓలేటి శ్యామసుందరశాస్త్రి ఇప్పు డల్లుడయ్యాడు: తాసిల్దారు నౌకరీచేసే బుద్ధిమంతుడు.

తన నియోగి 'పుటక'కు సార్థక్యం చేకూరేవిధంగా రీవారాణికి అక్షరాలా కార్యదర్శిఅయి, అప్పారావు- అప్పారావు పంతులుగా ప్రసిద్ధికి వస్తున్నాడు. వట్టి పేచీకోరుగా తయారైన విల్లన్ దొరమీద ప్రభుత్వానికి ఫిర్యాదుచేసి పీకివేయించి, గిల్మన్ దొరను తెచ్చుకొంది రీవారాణి. ఎక్కడెక్కడి గురజాడవాళ్ళూ తలెత్తి అప్పారావుకేసి చూపులు సారిస్తున్నారు. ఆ ఇంటిపేరు గల వయోధికులుకొందరు ఆయనమీద పెత్తనం చేయజూస్తున్నారు: దాన్ని సహించి ఊరుకోవడమా,

తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడమూ అనేది ఒక సమస్య. 5 లౌక్యమూ, స్వాధిక్యమూ ఘర్షణ పడుతున్నాయి. అప్పారావు వ్యక్తిత్వం ప్రసవ వేదనలు పడుతున్నది. గవర్నర్లూ, మహారాజాలూ; దివాన్లూ, యువరాజాలూ ; సుప్రసిద్ధ పత్రికా సంపాదకులూ, సుప్రతిష్ఠితులైన న్యాయవాదులూ – ఇదొక కొత్తలోకం – మత్తుకలిగించి మైమరపించే అధికారుల లోకం ; అందులోకూడా గడితేరడం నేర్చుకుంటున్నాడు. గురజాడ అప్పారావు వ్యవహారదక్ష డౌతున్నాడు.

కుమార్తె పెళ్ళి జరిపించాదో లేదో, విజయరామ గజపతికి వధువును నిర్ణయించే బరువు బాధ్యతలు పైనవేసుకుని ఎకాఎకీ కాశీనగరానికి ప్రయాణమయ్యాడు. కూడా ,భార్యారత్నమూ, బిడ్డలూ వచ్చారు. మహారాజావారూ ఆయన పరివారమూ ఉన్నారు. ఒక చిన్న సైన్యమే కదిలింది. 5 నవంబరు 1898 నాడు విజయనగరంలో మొదలైన యీ యాత్ర అహమదునగర్ మీదుగా సాగి కాశీలో ముగిసింది.

కాశీ సమీపంలోని కస్మండా జమీందారు సూర్యబక్సింగ్‌గారి పద్నాలుగేళ్ళ కుమార్తె లలితకుమారి వధువుగా ఎన్నికైంది. అప్పారావు 'పండిత్' ఆడపెళ్ళివారి గౌరవాన్ని చూరగొన్నాడు. లక్షరూపాయిల 'తిలకం' వరుడికిచ్చే షరతుమీద అక్కడే మూడుముళ్ళూ పడ్డాయి. సూర్యబక్సింగ్ బహుమానాలు అప్పారావుకు ముట్టాయి. ఇంతలో పూసపాటిరేగలోని ఆనందగజపతి జ్ఞాతులు కలబలుక్కొని కదలాడసాగారు. తాము అంత బలగమూ కూతవేటు దూరంలోనే ఉండగా, తమ 'ఆణ్యం'లో ఏ ఒక్కరూ పనికిరాకుండా పోయారా మహారాజ పదవికి ? వెనకటి కెన్నెన్నిమార్లు, ప్రధాన వంశం బీదపడి నప్పుడెల్లా, తమలో ఒకరు వెళ్ళి దానికి భిక్షపెట్టలేదు ? శంభోసింగు రెండవకుమారుడికి పట్టం కట్టడ మేం సబబు ? అలక రాజేశ్వరీదేవి కెవరిచ్చారీ దత్తత చేసుకొనే అధికారం ? ఆవిడ భర్త విజయరాముడు ప్రాణావసానవేళలో ఇచ్చిపోయాడంటున్నారు నోటిమాటగామాత్రం; అది నీటిమూటే; కోర్టులో ఎలా చెల్లుతుంది ? అమీతుమీ తేలా లిప్పుడు.

అప్పారావుకు మళ్ళీ తిప్పట తప్పిందికాదు. వ్యవహారం రచ్చకెక్కక ముందే జాగ్రత్తపడాలి ! అందుకే కొత్తశతాబ్ది మొట్టమొదటి ఏడాది విజయనగరం నుంచి ఉత్తరంగా కలకత్తాకూ, దక్షిణంగా మద్రాసుకూ రాకపోకలతో గడిచి పోయింది. సుప్రసిద్ధ న్యాయవాది రసవిహారీ ఘోష్‌తో సంప్రదించాలి. కలకత్తాకు పోవడ మెటూ పోయాడు ; పనిలో పనిగా అక్కడ 'నేషనల్ మ్యూజియము' చూసి ప్రాచీన శిల్పఖండాలను మెచ్చుకొంటూ, 'నేషనల్ థియేటరు'లోని సహజమైన

నాటక ప్రదర్శనానికిన్నీ 'బెంగాలీ థియేటరు'ని [illegible] [illegible] [illegible]
కిన్నీ భేదం గమనిస్తూ పోతున్నారు. భువనేశ్వరాలయం చూస్తున్నారు. [illegible]
తత్వం పులుసింకా చావక బౌద్ధ, జైన స్థగితాలు చూసింది [illegible] [illegible].
గ్రీకుశిల్ప ప్రభావం వీటిమీద ప్రసరించిందని అనిపించింది. [illegible] [illegible] [illegible]
దాయమని చరిత్ర గ్రంథాలలో పేర్కొన్నారనుకున్నాడట. [illegible] [illegible] [illegible]
కలకత్తా: డిసెంబరు 6 వ విజయనగరంలో ఉన్న [illegible] [illegible] [illegible]
ఉన్నాడు. పైస్రాయి సందర్శనం కోసం '[illegible]'లు ఏగరిస్తున్నాడు: [illegible]
ప్రయాణమైంది.

మరి రెండేళ్ళకుగాని విశాఖపట్నం కోర్టులో "స్పెషల్" [illegible] [illegible].
ఆపాటికి అలకరాజేశ్వరి కన్నుమూసింది. [illegible] [illegible] [illegible] [illegible].
అప్పారావు ఆవిడ నర్మసచివుడు. దావా వెనక: నడిపే వకీలు [illegible] [illegible]:
మైలాపూర్ వకీళ్లు బయూజెట్టీలు: వారిలో భాష్యమయ్యంగారు [illegible] లేని
మహారాజు; ఆయన అల్లుడు శ్రీనివాసయ్యంగారు మామగారి తెలివి [illegible]
వారసత్వం పుచ్చుకున్నాడు; ఆయనతో అప్పారావుకు దోస్తీ కలిసింది: [illegible]
కుశాగ్రబుద్ధిని గమనించి ఆయన లాయరై ఉంటే లోకంలో [illegible] [illegible] ఉండే
వాడని శ్రీనివాసయ్యంగారనుకొన్నాడంటే, ఆశ్చర్యపడనక్కర్లేదు. [illegible] [illegible]
నేర్పిన చందంగా వకీళ్ళకే 'లా పాయింట్లు' అందించేవాడు. స్వయంగా [illegible] [illegible]
రాయశాస్త్రిసాయంతో హిందూ ధర్మశాస్త్రం పనిగట్టుకొని పఠించసాగాడు. [illegible]
తాను సాగించిన స్థానికరాజవంశ చరిత్రపరిశోధన ఇప్పుడే సంపన్నంగా [illegible]
నిచ్చింది. వంశ మూలపురుషుల వృత్తాంతాలకు కావలసిన ప్రమాణాలు [illegible]
వచ్చింది. నిజానికి ఈ దావాను తన ఒంటిచేతిమీద నడిపించింది [illegible].
అందుకనే జిల్లాజడ్జి బ్రాడీ అప్పారావును గురించి the moving spirit in the suit
అని ప్రస్తుతించక తప్పలేదుట.

....దావా ప్రారంభమైన కొత్తల్లో ఒకనాటి రాత్రిపూట చీకటి [illegible]
చాటున కోట్లూ, తలపాగాలూ, వంకికర్రలూ గురజాడ వాళ్ళింటికి వచ్చి తలుపుతట్టి
లోపలికి నడిచాయి. అందరూ ఘనులే; సంస్థానం ఉప్పుతిని గొప్ప ఉద్యోగాలు
చేస్తూన్న పెద్దమనుషులే. సంస్థానం భవిష్యత్తంతా ఇప్పుడు ఏమి దయా
దాక్షిణ్యాలపై ఆధారపడివుంది. పందిని నందిగా, నందిని పందిగా చెయ్యగలరు,
తలచుకోవాలేగాని! నందిని పందిగాజేయదలచుకొని వచ్చారు. స్వామిద్రోహం

వాళ్ళ నోళ్ళనుంచి వాగ్రూపంలో వెలువడింది. అప్పారావునుకూడా తమ కుట్రలో కలుపుకొని రావాలి. ఇంకా అమాయకత్వంలో పడికొట్టుకుంటున్నాడు. ఆయన రాజవంశం కొమ్ముకాస్తుండగా తమ పప్పులు ఉడకవు. వెధవ నూర్రూపాయల జోడీనౌకరీ ఏం చాలుస్తుందయ్యా? నలభై లక్షల రూపాయల ఆదాయంవచ్చే సమస్థానం ఎగస్పార్టీవాళ్ళకు దక్కేటట్లు చేశావంటే, మరి చూసుకో, నీకు మహారాజయోగం పడుతుంది. నువ్వేమీ చెయ్యనక్కర్లేదు, తిన్న ఇంటి వాసాలు లెక్కేస్తేచాలు, పోనీ. తటస్థంగా ఉండిపో. బరువుభారాలు నెత్తినివేసుకొని భగవంతుడిచ్చిన తెలివిని ఖర్చుపెట్టివెయ్యకు. నలభైవేల రూపాయల గుండ్రటి మూట కాళ్లువచ్చి గుడగుడ నడిచి నీ గుమ్మంవద్దకు వస్తుంది. ఏమిటిలా విచారిస్తున్నావు?

"అర్ధపావు బియ్యం అరిగించుకోలేనివాడికి నలభైవేల రూపాయలు జీర్ణమౌతాయా, చెప్పండి?

"దయచేసి, వచ్చినదారినే వెళ్ళిపొండి.

"మరిచినట్టున్నారు, ఇదిగో ఈ నోట్ల బొత్తి తీసుకు మరీ దయ చెయ్యండి."....6

ఇది కట్టుకథకాదు; త్వరలోనే పొక్కి బజారుకెక్కిన యథార్థఘటన. ఇదంతా తనకు తెలుసు గనకనే, అప్పారావు చనిపోయాక మద్రాసులో ఒక సానుభూతిసభకు అధ్యక్షతవహించి మాట్లాడుతూ శ్రీనివాసయ్యంగా రిలాగన్నారు: "మహాధనికుడు కాగలిగిన పరిస్థితులలో ఉండికూడా సంస్థానమునకు ఋణపడి గతించాడు". ఫౌలక్ అన్నట్లు తంత్రాలకు గురజాడ అప్పారావు ఆమడదూరం; తానేమో తనపనేమో.

విజయనగరం ఖిలేదారుగా పనిజేసి తండ్రి వెంకటరామదాసు ఒక సంవత్సర కాలంనుంచీ పింఛనీదారుడై ఇంటిపట్టున ఉంటున్నాడు. సరిగా ఆ సమయానికి అప్పారావు గారింటిలోకి మరోప్రాణి వచ్చిచేరింది: రీవారాణి పేరుపెట్టుకొని అప్పల కొండయాంబ 1902 లో జన్మించింది. ఈ సంసార తాపత్రయాలు తనకేమీ పట్టవు; రీవారాణీ దయోపహతుడు తాను. భార్య అప్పలనరసమ్మ మంచి నిర్వాహకురాలు. ఆమెగురించి అప్పారావు ఒక్కచోటనేరాశాడు. (వ్యాసచంద్రికలో ఉండవలసిన *బాలికా పాఠశాల* అనే రచన లేఖల సంపుటంలో మొదటిదిగా అచ్చుపడివుంది) కలకత్తా నగరంలోని ఆడపిల్లల బడికొకదానికి వెళ్ళి అక్కడ

నేర్చే మహావిద్యలెల్లా దేవతాప్రార్థనలూ గురుజన సమ్మానాలూనని గమనించాడు. తన భార్యకు పసితనంలో అలాంటి తరిఫీదు లేకపోయెనే అంటూ ప్రారంభించి, ఏ తరిఫీదూ లేకుండానే గృహిణిగా, యజమానురాలిగా, వంటగత్తెగా భేషుగ్గానే నెగ్గుకొస్తున్నది కాబట్టి, ఇలాంటి బడిలో పంతులమ్మ పదవికి తగింపని చమత్కరిస్తాడు. దైవభక్తీ, మతవిశ్వాసమూ అస్థిగతమై ఉన్నప్పటికీ, భర్తనుమాత్రం ముగుదాడువోసి నడిపిస్తున్న దంటాడు. "....తనభర్త పొట్ట తెలివితక్కువవాడని ఆవిడ నమ్మకం. అడుగడుక్కీ తనసలహా లేనిదే, ఒక్కఅడుగు ముందుకువేయ లేడని ఆమె వుద్దేశం." హాస్యానికంటున్నాడులెమ్మని తోసివేయ దగ్గమాటలు కావివి. తమది ఎంతో అనుకూల దాంపత్యం. కీచులాటలూ, రుస్సులాటలూ లేవు. అది లింపులూ, అలకపాన్పులూ ఎరగరు. సామెతలు చెప్పడమన్నా, పాటలు పాడడ మన్నా, ఆడుతూ పాడుతూ సంసారాన్ని ఈదుకురావడమన్నా, గురజాడ అప్పల నరసమ్మగారికే చెల్లునని కుమారుడివ్వు దనుకొంటున్నట్లే, భర్త అవ్వు దను కొన్నాడు.

కుటుంబమే పట్టీపట్టని మనిషికి ఆశ్రితుల కుయ్యోమొర్రోలు చెవికెక్కు తాయా? పేదరికం కారణంగా తన సిఫార్సు బలంతో సంస్థానంనుంచి ఇంతోఅంతో రాబట్టి చదువుకొంటూన్న విద్యార్థులు కొంద రుండేవాళ్ళని ఒంగోలు ముని సుబ్రహ్మణ్యంగారి రచనబట్టి తెలుస్తుంది. గండ కత్తెరలో లేత మెడ ఇరుక్కొన్న తర్వాతనే వారి సంకటం ఆయన దృష్టికివచ్చి అయ్యో అనిపించేది. బి. ఏ. లో చేరేందుకు డబ్బులేక కాళ్ళు జాచుకొని కూర్చున్న ఆ కుర్రవాణ్ణి మధ్యాహ్నం రెండు గంటలవేళ జోడు గుర్రాలబండిలో ఎక్కించుకొని ప్రిన్సిపాలు వద్దకు తీసు కెళ్ళి, అతని కాలేజి జీతం మహారాణిద్వారా ముడుతుందని చెప్పవలసి వచ్చింది; ఇంతకూ అది కాలేజి పద్దులో జమపడలేదు. "సంస్థాన వ్యాజ్యము తీవ్రముగ జరుగుచుండుట వల్ల మహారాణీ స్వస్థ చిత్తముతో నుండు సమయము పంతులవారికి దొరకలేదు.... మూడు మాసములయిన తరువాత ప్రిన్సిపాలు వారు నన్ను క్లాసు నుంచి బంపివేసిరి. ఈ సంగతి పంతులవారికి నేను జెప్పినతోడనే బండెక్కించు కొని నన్ను కోటలోనికి దీసికొనిపోయి లా బ్రాంచి సూపరెండెంటుతో కొంత మాట్లాడి నేను వారివద్ద పని చేసినందుకు అరవై రూపాయిలు బిల్లుజేసి నాకిప్పించి జీతము కట్టుమని పంపిరి. ఇట్లు ప్రతి టరములోను బిల్లుజేసి నా కిప్పించగా నేను టరముఫీజు కట్టుచుంటిని. నా పరీక్ష రుసుము కట్టుటకును నిట్లే అరవైరూపాయలు బిల్లుచేసి యిప్పించిరి." 7.

ఇంతకూ మన సుబ్రహ్మణ్యంగారికి అప్పారావు వద్ద పనేమిటని అడగండి. రోజూ తప్పకుండా ఉదయం ఏడుగంటలకు అప్పారావు ఇంటికెళ్ళి, నాలుగు బీరువాలలో ఉన్న శిలా శాసనాల రికార్డులు, తెలుగు సంస్కృత గ్రంథాలు చదువుతూ, సంక్షేపకాలను విడిగా వివరంగా రాసి, కావలసిన పద్యాలను ఇంగ్లీషుచేసి అచ్చొత్తిస్తూ ఉండాలి. పద్య కావ్యాలలోని వంశ చరిత్రలకున్నూ, శాసనాలలోని వాటికిన్నీ సరిపోతున్నదో లేదో పోల్చిచూడాలి.* అది ఎలా చేయడమో ముందు తాను చూపించాడు. ఊపిరి సలపని సంస్థానం పనిలో తనపని తనీగా జరగాలంటే ఇలాంటి కుర్రాణ్ణెవణ్ణో తెలివైనవాణ్ణి చూసి నేర్పి కృషి చేయించాలి. ఈ ముడి సరుకును తాను తీరిగ్గా వాడుకొంటూ సాక్ష్యం చెయ్యవచ్చును. వీరేశలింగం రాసిన కవుల చరిత్రను లోపరహితం చేస్తూ నికార్సయిన చారిత్రకాధారాలతో మరో కవుల చరిత్ర రాయాలని అప్పారావు సంకల్పించాడు. అందుకే ఈ శ్రమ. 8 సాహిత్యవేత్తంటే అప్పారావులాగుండాలని ఆ యువకుని కనిపించిందంటే ఆశ్చర్యమేముంది? ఆ రోజుల్లోనే మద్రాసు ఓరియంటల్ లైబ్రరీకి లిఖిత ప్రతులను సేకరించేందుకని వరిష్ఠ విద్వాంసుడైన వేటూరి ప్రభాకరశాస్త్రి విజయనగరం వచ్చి అప్పారావు సాయాన్ని పొందాడని తెలుస్తున్నది.

---

* వీటి సాయంతోనే విజయనగర రాజ వంశావళిని *The Prabandham Pedigrees* అని ఒక లఘు గ్రంథంలో సమకూర్చి, పెద్ద దావాలో 'కోర్టు ఎగ్జిబిట్'గా అప్పారావు తయారుచేశాడు. ముఖ్యంగా, ఉషాభ్యుదయ, కృష్ణవిజయ, పద్మనాభయుద్ధ కావ్యాలనుండి సేకరించాడు.

# 2

సంగీత చిత్రలేఖనాదుల్లో క్రీడల్లో గురజాడ అప్పారావుకు ప్రత్యేకమైన అభినివేశం కూడా ఉండేదని అనేకులకు ఈనాటికీ తెలియకపోవచ్చు, అది వారి తప్పు కాదు. వసంతకుమారి మోతీమహల్‌లో అద్దాలమీద అద్భుతమైన పెద్ద చిత్రాలను వేస్తూనో ఆనందగజపతి వీణవాదనచేస్తూనే ఉండేరోజుల్లో తన చిన్ననాటి [illegible] వేడుకలు స్థిరపడిన వాడుకలయ్యాయి. వీణ వెంకటరమణదాసు, హిందుస్థానీ గాయకులు, నారాయణదాసు, కర్ణాటక సంగీత ప్రముఖులు, [illegible] శారదామందిరం చేశారప్పుడు. భోజరాజు రాజ్యంలో పిల్లలుకూడా సంస్కృత కవిత్వం మాట్లాడినట్లు, ఆనందరాజు హయాంలో బొబ్బిలి పిల్లలుకూడా సంగీతమంటే చెవి తాకట్టు పెట్టేవారని అప్పారావు స్వానుభవమే తెలియచెప్తుంది.

మద్రాసులో రెండు మూడు నెలలుండిపోవలసి వచ్చినప్పుడు (1895) అప్పారావు రాసిపెట్టిన డైరీలంటి ఆయనకు నాటకం తర్వాత ముఖ్యమైన కళ సంగీతమే ననిపిస్తుంది. ఓరియంటల్ లైబ్రరీ కేటలాగు కోసమని శేషగిరిశాస్త్రి ఇంటికివెళ్ళితే అక్కడ మైసూరు శేషన్న వీణ, బలిరంగని [illegible] వచ్చిందట. సుబ్బారావు పాడిన జావళీలు, శ్రీనివాసాచారి పాడిన కృతులు, పీఠధనం కచ్చేరీ, త్యాగరాజస్వామి శిష్యుడైన కృష్ణయ్య గానసభ – ఒక సంగీతప్రపంచం తనకు ఎదురైంది. కృతులు విన్నాక, తెలుగు వాగ్గేయకారుడుగానేగాక [illegible] త్యాగయ్య శ్రేష్ఠుడనిపించింది. ధనం పాటకచ్చేరీ విన్నాక మెళకువలు కొన్ని ఒకటొక్కటిగా తెలిసివస్తున్నాయి. సంస్కృత శ్లోకాలకు స్వరకల్పనచేస్తూ, జావళీలను పుస్తకాని కెక్కించుకొంటూ, జానపదగీతాలను సేకరిస్తూ సంగీతంలోగల తన కొద్దిపాటి సంబంధాన్ని పెంచుకోసాగాడు.

రీవారాణితోబాటు ప్రతి వేసవిలో నీలగిరులకు పోసాగినప్పటినుంచీ నీలగిరుల ప్రకృతి సౌందర్యం మనస్సుకు గిలిగింత పెడుతున్నది. వెలిగాచ కొండలనుంచి నీలగిరులకు ఎంతదూరమో ఆ ఈ చక్కదనాలకు అంత వార. మనస్సు రాగాల తీగలుగా పల్లవిస్తున్నది; అల్లుకొంటున్నది. విన్నవి మనస్సునుంచి కొత్త రూపా లలో సొంత పాటలై బయల్పడుతున్నాయి. దృశ్యాలు గానయోగ్యాలౌతున్నాయి. దృశ్యమూ గేయమూ ఒక్కటౌతున్నది. లలితకళలు రెండు పెనవడుతున్నాయి.

చిత్రలేఖనం మూడవది. మాడుగులలోవ, కుమిలిఘాటు, గుసుషూపి అడవి, నెల్లిమర్ల ఏరు, శృంగవరపుకోట కొండలు — తనలో కదిలించిన అనుభూతులు నీలగిరులనెపాన అక్షరరూపం ధరిస్తున్నాయి. వాన సంపెంగమాను .. వెన్నెల.... దూరాన కొండలమీది ఇళ్ళదీపాలు....కొలనులో కాంతి కదలికలు....వెల్ల ఆకుల మిలమిలలు .... ఇవన్నీ కలగలసిపోయాయి.

1903 నుంచి నీలగిరి యాత్రలు చేస్తూ వస్తున్నా 1907 నాటికిగాని రీవారాణికి అంకితమై నీలగిరి పాటలు అచ్చుపడ్డాయికావు. * ఈలోగా చిత్రలేఖనంమీదికి మనసుపోయింది. 1895 నాటికే చిత్రకళగురించి నిశ్చితాభిప్రాయాల నేర్పరుచు కొంటూ ఉన్నాడని రాజా రవివర్మ 'రాధ' చిత్ర విమర్శ తెలుపుతుంది. రాధ "మొద్దుమనిషి"లా కనిపించింది; ఒక కనుబొమ రెండవ దానికంటె పొట్టి; కళ్ళు చేరదేసి; పై పెదిమ కొస చప్పబడినట్లు అణగిపోయింది. రాధ కుండవలసిన చలాకీ తనం కనిపించేబదులు, అమాయిక పౌఢత్వం కనిపిస్తూంది. తాను ఇంగ్లాండు నుండి తెప్పించిన చిత్రా లిలాంటివికావు. శీతలప్రదేశాల ప్రకృతిలో సూక్ష్మాతి సూక్ష్మమైన వర్ణభేదంకూడా స్ఫుటంగా దృగ్గోచరమౌతుంది. నేటికీ గురజాడ వారింటి గోడలకు వేలాడుతూన్న నాలుగైదు ప్రకృతి దృశ్య చిత్రాలను చూస్తే అప్పారావు అభిరుచి ఎలాంటిదో తెలుస్తుంది.

నీలగిరి యాత్రలలో హాస్యానికిగూడా లోటుండేదికాదు. ప్రిన్సిపాలు రామానుజాచార్యుల బావమరది చక్రవర్తుల తాతాచార్యులు రీవారాణి సిబ్బందిలో ఉండే వాడు ; అతడు హాస్యచతురుడూ, హాస్యభాజనుడునూ. ఏదీ, నామీద పాటొకటి కట్టు, చూతాం నీ ప్రజ్ఞ, అని అప్పారావు నడిగాడు. అప్పారావు చెప్పిన ఆశుగేయమిది :

నూగు మీసపు కట్టు
కానరాని బొట్టు
నోటాన సిగరెట్టు
కోటు వింతకుట్టు
చే కఱ్ఱ జిలుగు వెండికట్టు

* నీలగిరి పాటలకు స్వరకల్పనచేయడంలో అప్పారావుకు తోడ్పడినవారు చింతలూరి గణేశ్వరరావు, కలగట్ల కామరాజు అని తెలుస్తున్నది.

నీలగిరి కొండల్లో

పై విహరించు ప్రకృతి సౌందర్యం.[9]

నీలగిరులలోనూ విజయనగరం తానున్నానని గుర్తుచేస్తూ వచ్చింది. కూతురైన లక్ష్మీనరసమ్మకు జబ్బుగా వుందని తెలిసి. ఒకరిద్దరు మిత్రులయాలనుకొని వారిని ముట్టుకోకుండా మహాశక్తిపై విరుచుకుపడి అందరినీ ప్రమత్తులను చేసి ఉన్నట్టుండి ఆ మొదటివారిపై దాని చేతక్రిందుకొనాలని. మృత్యువు జిత్తులమారి తనం బయట పడింది. మనవడు రామదాసుకు పెళ్ళి చేయడం విధ్యాలంటూ తాత వెంకటరామదాసు మొత్తుకొంటూ వచ్చాడు. ఆయన సంతాపం పెళ్ళినే. పసితనం పీడని లక్ష్మీనరసమ్మను తొందరపడి పెళ్ళి చేయాలని వచ్చింది. పెళ్ళయే నాటికి నానమ్మకు ఏమీకాదనుకొందేమో. బహుశా పెళ్ళిచేసి పంపించాలని ? తొందరపాటుతో వెంకటరామదాసు చేసిచూపించిన పని వల్ల తెలిసి వచ్చింది. ఊరి. పొలిమేర్ల మాదాన ఊటగడ్డదరి తన సొంత పొలాలను చూసివస్తానని వెళ్ళాడు. ఎంతకూ తిరిగిరాడు. అప్పారావు ఊళ్ళో లేడుగాని, ఉండే ఉంటే విస్మితనం గుర్తుకువచ్చి ఉండేది. శ్యామలరావుకు రాసిన ఉత్తరంలో ఆయన పట్టించుకున్న సంఘటన ఇదీ:

... — ఒకసారి నేనూ, నాన్నగారూ చీపురుపల్లినుండి విజయనగరం వస్తున్నాం. దారిలో గరివిడి దగ్గర నాన్నగారు బండి ఆపమన్నారు. బండి ఆగింది. దాహంవేస్తోందని ఆయన బండిదిగారు. దగ్గరలోవున్న చెరువునుంచితెంతకువెళ్ళారు. వెళ్ళిన మనిషి రావలసిన టైములో రాలేదు ; కొద్దిగా ఆలస్యమయింది. నాన్న గారింకా ఎందుకు రాలేదోనని నామనసు పరిపరి విధాల పోయింది. ఎవరి జాగ్రత్త వారికి తెలుసునని, అందులో ముఖ్యంగా వృద్ధులు మరీ జాగ్రత్త పడతారని నాకా క్షణంలో తోచక పోయింది.10

ఇప్పుడేమయింది వృద్ధులకుండే జాగ్రత్త ? విజయనగరానికి నెల్లిమర్లకూ మధ్యగల ఊటగడ్డ దాటుతున్నాడు – ఇంతలో ఏరు వచ్చింది. నాయన మునిగి చనిపోయాడని 1905 ఏప్రిల్ 24న అప్పారావుకు తెలిసింది. ఊటీ ఎక్కడ ఊటగడ్డ ఎక్కడ ? విజయనగరానికి ఆగ మేఘాల మీదవచ్చి కర్మ క్రతువులన్నీ నిర్వర్తించి, మళ్ళీ మే 7న నీలగిరులకు బయలు దేరాడు.

ఈ నీలగిరి యాత్రలలోనే అప్పారావుకు ఆరోగ్యాని కారోగ్యమూ తిరుబాటుకు తిరుబాటూ దొరికాయి. 'రొజ్జగాలి' గానీ ఎండపొడగానీ తన దేహ తత్వానికి వికటిస్తుంది గాని ఈ కొండల మీద ఉన్నప్పుడు మాత్రం రెపరెప ఆకలివేసి దేహం దివ్యంగా ఉంటుంది. అందుచేతనే మళ్ళీ అప్పారావుకు కలం చేతికి వచ్చింది. *కన్యాశుల్క* నాటకప్రతులన్నీ ఎన్నడనగానో చెల్లుకున్నాయి. రెండవసారి అచ్చు వేయించవలసిందని స్నేహితులంతా ఒత్తిడి చేస్తున్నారు. మొదటి కూర్పును మార్చాలని మనసౌతున్నది. భాష యింకా నాగరికమూ నవీనమూ కావాలి; పాత్రలలో మానవాంశ యింకా పరిపూర్ణం కావాలి; మధ్యకాలంలో వచ్చినమార్పులుకూడా కథాగర్భంలో దూరాలి. కాబట్టి పునస్సృష్టిలాంటిది జరగాలి గాని వట్టి పునర్ముద్రణవల్ల ఫాయిదా ఏమిటి? మూడు విడిభాగాల పెద్ద నాటకం (Trilogy)గా రూపొందిస్తే? ఈ అనిశ్చిత భావాలు మనస్సునుంచి అదృశ్యం కాక మునుపే సరికొత్త నాటకం గురించి ఒక పథకం యేర్పడింది. 1906 వేసవిలో రెండవ వచన నాటకం రాశాడు. ఆ పుస్తకం ఎంత వెదికినా కనిపించకుండా పోయింది. రెండేళ్ళ తర్వాతగాని మళ్ళీ సరికొత్తగా రాయడానికి మనసు కాలేదు. అలా తయారై పూర్తికాకుండానే నిలిచిపోయింది, *కన్యాశుల్క* నాటకానికి పైదోడనదగిన *కొండుభట్టీయం.* రాజకీయ, మత, సంఘ జీవితంలో వచ్చిన మార్పులు – వందేమాతరం ఉద్యమం, దివ్యజ్ఞాన, బ్రహ్మసమాజాల కార్యకలాపాలు, వేశ్యల అగచాట్లు, విధవల గ్రహచారాలు, నవయువకుల బోళాభాయి చేష్టలు వగైరాలు అద్దంలోలాగా అందులో ప్రతిబింబించాయి.

ఈ రెండవ నాటకంలో, తన వృత్తిని నిజాయితీతో నిర్వహిస్తూ కూడా వ్యభిచారులైన స్త్రీ పురుషులకంటె భోగం పడుచు ఎలా మిన్నో చర్చించదలచు కొన్నట్లు, ఒంగోలు ముని సుబ్రహ్మణ్యంగారికి ఒక లేఖలో అప్పారావు రాశాడు.

మరికొంత కాలం గడిచింది. మూడో నాటకం గురించి ఆలోచన సాగింది. ఈ మారు చారిత్రకాంశం దృష్టి నాకర్షించింది. తన పరిశోధనను పురస్కరించుకొని ఎన్నడో క్రితంలో తాను రాయబూనిన *సౌదామిని* సౌదామినిలాగానే మెరిసి మాసిపోయింది. మరిప్పుడు బిల్హణకవి కథను చేబట్టాడు. కాశ్మీరదేశం విడిచి కొన్ని రాజపుత్ర కుటుంబాల వెంట ఘూర్జరసీమకు వచ్చి, అనిహిల్వాడా ప్రభువైన కర్ణమహారాజు ఆస్థానంలో వేళ్లూనివున్న ఉద్దండ పండితుల ఈసురోసాలను అతిక్రమించి, రాజపుత్రికకు విద్యాగురువైన ఒక సుకవి నాయకుడు. 'శృంగారం'

నోద్యం తీయూతెన్నూ గురజాడ అప్పారావును కవ్వించడమేగాక నొవ్వించింది కూడాను. పడుపువనిని మెచ్చలేదుగాని ఆయన పడుపుకత్తెల కడుపుగొట్టే పనిని హర్షించలేకపోయాడు. వేరే బతుకుదెరువు చూపకుండా, సానివాడలను నిర్జనం చెయ్యమనడం, ఫక్తు దౌర్జన్యమే కాగలదు. సంస్కరణవాదం క్రౌర్యం కాగబదు. రోగంతోబాటు రోగినికూడా హతమార్చడం, వైద్యమనిపించుకోదు. అది నరవధ. 'వీణ' ధనం వంటి విద్వాంసురాలి పాటవినం, వేశ్యగుమ్మం తొక్కడం, అనడం వట్టి అవివేకమే. కొక్కొండ వెంకటరత్నం పంతులు దర్గాగావెళ్ళి కచేరీలో కూర్చుని చెవులారావిని పొందిన ఆనందానుభూతిని వీరేశలింగం భక్తులు తమకు తామే నిరాకరించుకొన్నారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం రాసిపెట్టిన ఉదంత మొకటి వీళ్ళ ఉగ్రనీతివాదానికి మచ్చుతునక.

....బందరు జాతీయ కళాశాలలలో పనిజేస్తూవచ్చిన రఘుపతి వేంకటరత్నం నాయుడు సంఘ పారిశుధ్యం గురించి ఉపన్యాస పరంపరచేస్తూ యువకులను ఆకర్షించాడు. ఒకమారు జాతీయ పాఠశాల స్థాపననిమిత్తం రాజమండ్రిలో వీధులవెంట తిరిగి చందాలెత్తుతూ, తన ఇంటిపక్క వీధిలోఉంటున్న వేశ్యలను విసర్జించమన్నా, ఆ పై వీధికి పోతున్నాడు చిలకమర్తి. ఒక సాని వీధిలోకి వచ్చి ఆయనను నిలేసింది: "మా లోపలకువచ్చి యడిగినపక్షమున నేనుగూడ చందానిచ్చెదను." నియమ మేమై పోవాలి? అయినా ఇది తన స్వకార్యంకాదు. [illegible]వాసిష్ఠంలోని శ్లోకం గుర్తుకు వచ్చింది. అమ్మయ్య! శాస్త్రప్రమాణం కూడా దొరికింది. "దేశ సేవనిమిత్తమై" ధైర్యం తెచ్చుకొని సానిగుమ్మం తొక్కి చందా వసూలుచేశాడు....11

జంకుతూ కొంకుతూ చిలకమర్తిలాంటి అనేకులు చేసినపనిలోని సహజ సామంజస్యాన్ని నిండుమనస్సుతో అప్పారావు గ్రహించాడు. తమ వృత్తిలోని హీనతను మధురవాణీ, మంజువాణీ గుర్తించారు; అయితే వేశ్యలపరమై మూడు పువ్వులారు కాయలుగా వర్ధిల్లిన లలితకళలు వేశ్యలను కళావంతులుగా గౌరవించాయి. వాటిని అభివృద్ధిపరిచి, సానిపనినుంచి మనస్సులు మరల్చివేయాలని ఆనంద గజపతి చెప్పుకొన్న సంకల్పమిప్పుడు విజయరామగజపతి హయాములో సంగీత కళాశాలగా ఫలించింది. ఈ విషయమై గురజాడ అప్పారావు రాసిందీ, చెప్పిందీ, సంఘ సంస్కర్తల కృషి సాఫల్యానికి విరోధమైనదేమీకాదు. కాకపోగా, దాని వంకరలు దిద్ది నిండుదనమిచ్చేది. లోపాలను చూపడంద్వారానే ఇది సాధ్యం

కాగలదు. సంఘంలో పలుహోదాలకు చెందినవాళ్ళే — వృత్తిపరులు, రామప్పంతులు, గిరీశం, కొండుభొట్లు — 'నాటుకుక్కలూ, సీమకుక్కలూ' పోషించినా వేశ్యావృత్తికి స్తంభాలౌతున్నారు; ముద్దాయిలూ వీళ్ళే. పాపం [illegible] నగిలు మాత్రమే 'యాంటీ నాచ్'. లేకుంటే 'ఒడయూరి'లో మాత్రమే.

బ్రహ్మసమాజం ఒంటబట్టించిన 'తీవ్రనీతివాదం,' వేశ్యాసంపర్కాన్ని భోగం మేళాలనూ కంటగించుకోవడంతో ఆగిపోక, పత్రికావాదాలు పెరిగిన [illegible] కూడా ఖండించింది. ఏ రోజుకారోజు పత్రికల్లో [illegible] హోదాలను మన్నించమంటూ మొరపెట్టుకొంటూ, కొందరైనా అభ్యంతరపెడుతుండేవి. అయితే రఘుపతి వెంకటరత్నం ఉద్యమాన్ని ఆయన సంపూర్ణంగా ఖండించ గూడదు. అప్పారావు ఆ పని చెయ్యలేదు. కాకుంటే వీరేశలింగం వెంకటరత్నం ప్రభృతి 'తీవ్ర నీతివాదులు' చూపిన ఆవేశం, [illegible] మహోన్నత గిరిశిఖరమనీ, నిర్దేశించిన జీవనవిధానం కటినమైనదని [illegible] రక్తమాంసాలు కలిగి సహజవాంఛలు నిండారే సాదా మనుషులకు అది దుస్సాధ్యమైన పనీ, ఒక విమర్శ వుంది. కారుణ్యవాదమూ, కార్యవాదమూ పరిష్కార మార్గాలేమీ కావు. వితంతువులకు పెళ్ళిళ్ళు చేయించినప్పుడూ, సంఘమంతా వ్యతిరేకించినా [illegible] అనుభవిస్తూవచ్చిన ఈనాము భూములను కొంత 'పేర్'లుగా మార్చడానికి యత్నం చేయించినప్పుడూ, వెంకటరత్నం నాయుడు కార్యవాదివిధానాన్ని [illegible] తున్నావి. స్వయంగా ఆయనే ఇలాగన్నాడు:

"భోగం స్త్రీ అంటే ఏవగింపు, అసహ్యంపట్లగాక, ఆమె అభ్యున్నతి [illegible] అవశ్యం అపేక్షణీయం కాబట్టే" భోగంమేళాల బహిష్కారోద్యమం నడపవలసి వచ్చింది. ఇలాంటి సంఘ దౌర్బల్యాన్ని పోగొట్టాలనే ప్రయత్నం దేశంనుండి హిమాలయములను పెరికివేయాలనుకోవడం లాంటిదని, "గౌరవమూర్తులైన ఒక పెద్దమనిషి, దేశంయొక్క మన్నన సంఘ సంస్కర్తగా గణించుకొన్నవారు" — కొంపదీసి వీరేశలింగం కాదుగదా? అన్నారు. "సువర్ణమృగ అన్వేషణ" అని కొందరనగా, "చచ్చుభావ దౌర్బల్యము" అని మరికొందరు. వేశ్యావృత్తికీ జాత్యున్నతికీ లంకెగలుపుతూ మతనీతికిగూడా వేశ్యలు అత్యవసరమని ఛాందసులన్నారు.12 గురజాడ అప్పారావు విమర్శ ఈ ఏ గదిలోనూ ఇమడదు. ఆయన తపనపడింది పరిపూర్ణతరమైన మానవీయత గురించే.

# 3

విజయనగరం సంస్థాన వ్యవహారాలతో తలబట్టగట్టసాగిన దినాళ్లలోనే గురజాడ అప్పారావు దృష్టి పౌరహిత కార్యాలవైపు మళ్ళింది. చదివిన చదువు ఫలింపుకు రాసాగింది. ఇంతవరకు మహోద్యమ ప్రవాహాలగట్టున నిలబడి ఉండిపోయిన మనిషి, ఒక్కొక్క అడుగూ నీటివైపు దిగివస్తున్నాడు. సాక్షిగానో తటస్థుడుగానో వుండి, ఇప్పుడు భాగస్వామి కాగోరుతున్నాడు. రాజమహేంద్రవరం విజయనగరంమీదికిగూడా దండెత్తింది. వీరేశలింగం తన మదికే ఎక్కుతున్నాడు. వెంకటరత్నం తన గుండెనూ కదల్చివేస్తున్నాడు. మహాపురుషులతో ఒకలాంటి భావైక్యత చేకూరుతున్నది. తనకు తెలియకుండానే తాను చరిత్రకు చెంది పోతున్నాడు. ఆయన జీవితాన ఇది నడిపొద్దు; ప్రతిభావ్యుత్పత్తులకిది పూలకారు. అదే ఆయన జీవితావసాన దశకూడా కావడమే, దేశమూ నవ్యసాహిత్యమూ నోచుకొన్న కొరనోము.

ఆనందగజపతి తన ఆశ్రితులకు చెప్పి చేయించిన పనులలో క్షామనివారణ కృషి ఒకటని, అప్పారావు దినచర్య గ్రంథంబట్టి తెలుస్తున్నది. ఆయన చని పోయాక నగర వ్యవహారాలలో అప్పారావు వేలుబెట్టాడు. నగరవీథుల శుభ్రత గురించి శ్రద్ధవహించడం ఘనకార్యమేమీ కాకపోవచ్చుగాని, విజయనగర వీథుల శుభ్రతగురించి ఆలోచించడమే అప్పట్లో మహా ఘన విషయం. బయటివాడు ఆ నగరాన్నిగూర్చి ఏమనుకొనేవాడో, రాయసం వెంకటశివుడుగారి ఆత్మచరిత్ర వెల్లడిస్తుంది. మహారాజావారి కాలేజీలో ఆయనకు నౌకరీ అయింది 1905 లోనే:

> ఆ కాలమున విజయనగరమునకు నీటివసతిలేదు. అచట మంచినీటికి చెఱువులే యాధారము. కాని, యా చెఱువునీరు అపరిశుద్ధముగ నుండెడిది. మంచినీళ్ళ బావులు కొంచెమె. అవి పట్టణమున కతిదూరమున నుండెడివి. అందువలన విజయనగర నివాసము మాకు దుస్సహమయ్యెను... అంతకంతకు నాకు మశకగానము సింహగర్జన మయ్యెను.[12]

ఇలాంటి పరిస్థితిలో పౌరహితకార్యతత్పరు డెవ్వడేగాని చేయవలసినపని, నీటి వనరులను శుభ్రతరం చేయించడమే. మద్రాసు గవర్నరుగారు విజయనగరాని-

విజయం చేసినప్పుడు అప్పారావుకు మంచి అవకాశం లభించింది. గవర్నరుగారి సమక్షంలో రీవారాణిచేత వాగ్దానం చేయించగలిగాడు. సంస్థానమూ, ప్రభుత్వమూ చెరిసగం ఖర్చు భరించే షరతుమీద, 1912 ప్రారంభంలో రెండులక్షల రూపాయల సొమ్ము మంజూరైంది. అయితే 1915 నాటికిగాని 'ప్రొటెక్టడ్ వాటర్ సప్లై' పథకం పూర్తయింది కాదు. దాన్నిచూచుకొని గర్వించేందుకు అటుతర్వాత అప్పారావే లేకుండా పోయాడు.

ఆయనకోర్కెకు ఇతరపనులుకొన్ని తగిలాయి. "రారాజు" పంచమజార్జి ఢిల్లీకి వచ్చి దర్బారు చేసినప్పుడు, ఆయన దర్శనం చేసికొని రావాలని రీవారాణి సతిపోరీ ఫలితం లేకపోయింది.* డిసెంబర్ మాసాంతంలో (1912) శ్రీవారు కలకత్తా నగరం దర్శింపనున్నారు కాబట్టి ఈదఫా అయినా కనిపించుకోవాలి. ఐదునిమిషాల మహాభాగ్యానికి ఎంతశ్రమ! ఎంతసన్నాహం!! అయితే శ్రమపడిగిన సంతృప్తి కలిగినట్టు అప్పారావు లేఖలనుబట్టీ, వ్యాసాన్నిబట్టీ తెలుస్తున్నది. కలకత్తాలో

* రీవారాణి అప్పారావుతో చెప్పి రాయించిన గేయం 1929 లో గురజాడ రామదాసుగారు ముద్రించిన 'ముత్యాలసరము'లో ఉంది. విశాలాంధ్ర ప్రచురణాలయంవారి ప్రచురణలో లేదు. అందుచేత దాని నిక్కడ ఇస్తున్నాను:-

## ముత్యాలసరము

వెల్లువగ నారోగ్యసంద, ఉల్లములరుచు నిచ్చుగావుత
తల్లి భారతమాత పంచమ, జార్జికెల్లపుడున్.
జార్జి సమ్రాట్ఛాసనంబుల. జాజిపూవులదండ మాడ్కిని
రాజరాజులు శిరములందున, దాల్చిమనవలయున్.
మర్మమెరుగని ధర్మమనియెడి, నిర్మలంబగు నీతిపథమున
పేర్మి ప్రజలను మంచునేర్పరి, జార్జి మనవలయున్.
భరతఖండం బెన్నడెరుగని, నిరతశాంతి నొసంగి విద్యల
నెరయనించిన యాంగిలేయుల, రేడు మనవలయున్.
కొల్లబోతగజంపి శత్రుల, ఢిల్లి పట్టముగట్టు బలిమిని
తొల్లినల్లని దేవుదొక్కడ, జాతశత్రునకున్.
తెల్లవారలు నీతినిపుణులు, ఢిల్లిపట్టము గట్టి రిపుడే
కల్లయెరుగని జార్జిరేని, కజాతశత్రునకున్.
నల్లవాడును తెల్లవాడును. నెల్లశుభముల గూర్చుగావుత
తల్లి మేరీమహారాజ్ఞికి, జార్జి నరపతికిన్.

*లేన్ అంట్ రయత్* పత్రిక కొత్త సంపాదకుడైన జోగేశంద్రదత్‌ను కూడా కలిశాడు. మైకేల్ మధుసూధనదత్ మహాకవి గురించి ముచ్చటించాడు. జస్టిస్ అశుతోష్ ముఖర్జీని చూడవెళ్ళాడు; బెంగాలీ సాహిత్యోపజీవులను కలుసుకోవాలని కోరికగా ఉందని ఆయనతో చెప్పగా, ఆయన హేమచంద్ర దాస్‌గుప్తాకు ఈపని పురమాయించాడు. 'వంగీయ సాహిత్యపరిషత్తు' కార్యదర్శిగా దాస్‌గుప్తా ఒక టీపార్టీ ఏర్పాటు చేయించాడు. అప్పర్ సర్క్యులర్ రోడ్‌లో జైనమందిర సమీపానగల పరిషత్తు సొంతభవనంలో ఆరోజున వంగదేశపు విద్వాంసులను కలిసి పరిచయం చేసుకున్నాడు.

"రారాజు"ను చూసినకళ్లు "కవిరాజు"ను చూడగోరాయి. 'రామానుజాచార్య విద్యాసమితి' వాళ్లు 1939లో అచ్చువేసిన *సుభద్ర, మాటా-మంత్రిలో* చివరిది *ముద్దుల రాజులు* అనే రచన; విశాలాంధ్ర ప్రచురణాలయంవారి *వ్యాస చంద్రికలో రవీంద్రకవి* అనే రచన – ఈరెంటికీ మూలం ఒకటే అయినప్పటికీ, విశాలాంధ్ర ప్రచురణాలయంవారి గ్రంథంలో రారాజు ప్రశంసే లేదు. బ్రహ్మసమాజోత్సవం ఆ రోజుల్లో టాగూర్ గృహంలో ఏటేటా జనవరి మాసాంతంలో జరిగే ఒకేఒక్క ఉత్సవం; మహావేడుకగా ఉండేది; కుటుంబంలోని వారేగాక మిత్రులు, నగర ప్రముఖులువచ్చి కూడేవారు; ఉత్సవమైపోయిన తర్వాత వినోద ప్రదర్శనలు ఉండేవి. 14 అప్పారావు కలకత్తాకు వెళ్ళింది జనవరి మూడవవారంలో నని వంగీయ సాహిత్య పరిషత్తువారు చేసిన తేనీటివిందు తారీఖు (3-1-1912) తెలుపుతుంది. బ్రహ్మసమాజ మహోత్సవ దినాన చీకటి పడుతున్నవేళ తానక్కడికి వెళ్ళినట్లు అప్పారావు రాశాడు. జనవరిలో సాధారణ బ్రహ్మసమాజ ప్రార్థనా మందిరంలో *ఆత్మ పరిచయ్* (Introducing Myself) అనే పత్రాన్ని రవీంద్రకవి చదివాడు. ఆ నెలలోనే 12వ తేదీన బెంగాల్‌లోని మేధావులందరూ పురమందిరంలో సభచేసి రవీంద్రుణ్ణి అభినందించి ఉన్నారు. అలాంటి గొప్ప సన్నివేశాలు కిక్కిరిసిన సమయంలో అప్పారావు రవీంద్రుణ్ణి దర్శించాడు. ఆ అనుభూతి చిరస్మరణీయమైనది. "పట్నం పల్లె విరగబడి" రారాజును "ప్రేమార్ద్రములైన చూపులతో.... పూజించడము" చూచిన మనిషి ఇలాగంటున్నాడు: "కవిరాజైన రవీంద్రునికి బంగళా చూపిన మిక్కుటపు పేరూ, పొరలేని భక్తీ యేనాడేరాజెరుగును?" బ్రహ్మ సమాజోత్సవం రోజున, చిత్పూరు రోడ్‌లోని పెద్దమేడలో, లోపల పూజా

మందిరంలో, "ఆకులలో పండ్లవలెనూ చదువుచీకట్ల మరుగున ముక్తికాంతల వలెనూ" కానీ కానరాక ఉండిన బ్రాహ్మ సుందరుల సమక్షంలో, ఉన్నత వేదికపై కూర్చుని ఉపదేశంచేస్తూ కీర్తనలు పాడుతూ ఉన్నాడు రవీంద్రకవి. ఆ సంవత్సరం డిసెంబరులో మళ్ళీ కలకత్తాకు పోయినప్పుడు నేరుగా ఆయనతో మాట్లాడాడు: నాటకం, గేయం, గ్రంథాలభాష, ఆంగ్ల సారస్వత బోధన పద్ధతులు వగైరా వగైరా. కావ్యభాష గురించి ఒక వ్యాసం రాసిపెడతానని రవీంద్రుడు మాటిచ్చాడుకూడా. అయితే 1913లో నోబెల్ బహుమతి వచ్చాక విదేశాలనుంచి తిరిగివచ్చి అలసి, తన శక్తిని కూడదీసుకొనేందుకని రామ్‌ఘర్ కొండలకు వెళ్ళిపోవలసి వచ్చింది— కాబట్టి వాగ్దానభంగం చేసినందుకు మన్నించమంటూ అప్పారావుకు లేఖలో కోరాడు (24-5-1914).

ఆ సంవత్సరాంతంలో (1912) రీవారాణి పోయింది — సంస్థానంతోటి తనను అనుసంధించి ఉంచిన చివరిలంకె, ఆనందగజపతి రక్తాన్ని పంచుకొన్న ఏకైకవ్యక్తి. "నా కిది ఎన్నటికీ తొలగని ఆపద." లలితకుమారి మంచిదేగాని మెతక. విజయరామ గజపతికి తానంటే గౌరవం ఉండవచ్చుగాని ఆయన ప్రేమను మిత్ర సలహాదారులు చూరగొన్నారు.

రీవారాణి కనుమరుగయ్యేకగాని సంస్థాన వ్యవహారాలన్నీ ఒక కొలిక్కి రాలేదు. జిల్లాకోర్టులో కక్షిదారులే నెగ్గారు; కాబట్టి హైకోర్టుకు అపీలుచేయక తప్ప లేదు. మైలాపూరు వకీళ్లలో దిగ్గజాలు ఒండొంటితో ఢీకొన్నాయి. సంస్థానం తరపున భాష్యమయ్యంగారు పప్పులో కాలువేశాడు. దత్తతను గురించి నొక్కిచెప్పాడు. అదే తమ కేసులోకెల్లా 'వీక్ పాయింట్'. దత్తత తీసుకొనే అధికారం అసలు రాజ్యేరికెక్కడిది? అందుచేత 'ఎగస్పార్టీ' వకీలు కృష్ణస్వామయ్యంగారికి బలం చేకూరింది. హైకోర్టులో చుక్కెదురౌతున్నదన్న భయం కలగసాగింది. రీవారాణి బతికినన్నినాళ్లు రాజీకి ససేమిరా ఒప్పుకోనని భీష్మించింది. ఆవిడ శాసనాన్ని కాదనే ధైర్యం ఎవరికీ లేకపోయింది. చివరకు మద్రాసు గవర్నరు పెంట్లాం (Pentland) స్వయంగా ఆవిడకు సలహా చెప్పి మెత్తబడేటట్లు చేశాడు. ఇంతకూ ఆవిడ దాటుకున్నాకనే రాజీ రాయబారాలు ఫలించాయి. పి. యల్. యస్. రాజు లాంటి కక్షిదార్లకు పెద్దమొత్తమే ధారబోయవలసి వచ్చినా విజయరామగజపతి హక్కు గుర్తింపుకు వచ్చింది. రీవారాణి చేసిపోయిన సూచనపై ఆయన తన కుమాళ్ళపేర 'ట్రస్టు' ఏర్పాటుచేసి ఉన్నాడు. 'ట్రస్టు కౌన్సిలు'లో రీవారాణి స్మృతి

వల్ల ఏర్పడిన ఖాళీలో ఎవరిని నియమించాలి? లలితకుమారీదేవికీ ఆ స్థానం మీద చూపుబడింది; అప్పారావుకు ఆస్థానంలో అధికారంమీది నుంచి చూపు మరలలేదు. లలితకుమారి తండ్రి సూర్యబక్సింగ్ అప్పారావు 'పండిత్'ను ఆశ్రయించాడు. లలిత కుమారి అప్పారావును ఎంతో సత్కరిస్తూ గౌరవిస్తూ వచ్చింది. పైగా ఆమె ఇప్పటి మహారాణి. కొబట్టి మాటఇచ్చాడు. దానిమేరకు 'ట్రస్టుకౌన్సిలు'లో ఆమెకు సభ్యత్వం ఇప్పించాడు. అంతవరకు ఆయనకు నిద్రపట్టలేదు.

వదల్చుకొందామనుకున్నా సంస్థానం తన కాళ్ళకు తీగలాచుట్టుకుంటున్నది.* లలితకుమారి మరొక లంకె అయి,తనను మళ్ళీ సంస్థానంతోటి అనుసంధించి ఉంచు

---

* కొత్తరాజా విజయరామ గజపతి విజయనగరానికి కొద్ది దూరాన కోరుకొండలో (ఇప్పుడక్కడ సైనిక్ స్కూల్ ఉంది) దివ్యమైన భవంతి కట్టించి 1911 లో గృహప్రవేశం చేసిన సందర్భాన. రాజకుటుంబీకుల కోరికపై అప్పారావు రాసిన గేయం, విశాలాంధ్ర ప్రచురణాలయంవారి ముత్యాలసరములులో లేదు. గురజాడ రామదాసుగారి 1929 ముద్రణలోఉంది.

## కోరుకొండ

కనుల పండువయ్యె నగరు కొంత కంటిపే
విజయరామ నిర్మితమై
విపుల ప్రథా వర్మితమై
విబుధ బలము కలిమి విజయ
శ్రీల నలరుచూ ॥

కొండ యిదా గోపురమా
దండి నృపతి కాపురమా
రండు. కండు, ఆనందమొందు
కలదె యింత మెండు ॥

కోరుకొండ, కోర్కొండ, కోరకుండ నిత్తు
వరము లూరకుండ వలదు రండు
రండనె నట నృపవరుండు ॥

శుభ విభవము లభయదాత ఇభరాట్
శ్రీ విజయరామ విభువరున కొసంగి
లలితలక్ష్మి ప్రోవగా ॥

మాట మర్మ మెరిగినట్టి మేటికవుల జాడలరసిబోటి.
అప్పకవి యమర్చె మాటల ముత్యాలపేట ॥

తుందా? "క్రొత్త" పరిపాలన పూర్తిగా తనకు సుముఖనుకొనే వీలులేదు తానిక తప్పుకోవడం మంచిది.

ఇరవై ఏళ్ళ క్రిందటిమాట (1891). ఆనందగజపతి ధర్మకిమా అని సంస్థానానికి చెందిన ఒక పాత ఇంటిలో కాపురముండిపోయే వసతి కలిగింది. నెలకు ఐదు రూపాయలు, అదీ ఏడాదిలో ఒకటి రెండు నెలలు మాత్రమే, చెల్లిస్తున్నట్లు చూపుతూ రశీదులు తీసుకొమ్మన్నారు. చనిపోయే ముందు శిబిరం సరదారీవారాణి ఆ యింటిని ఇచ్చివేస్తానంటూ వచ్చింది. ఇప్పుడేం చెయ్యాలి? రెండేళ్ళ క్రిందటనే (1910) ఇంటకోడలైన మాణిక్యాంబ మరి ఒకటి రెండేళ్ళలో కాపురానికి రాబోతుంది. పైగా, రెండోకుమార్తె అప్పలకొండమ్మకు పెళ్ళీడు వచ్చి పైబడుతోంది. పెళ్లి చేసెయ్యండి మొర్రోమంటూ, తల్లిఘోష పెడుతున్నది. 1913లో పదేళ్ళ ప్రాయమున రెండవ కుమార్తె వివాహము జరిగింది. * ఇప్పుడున్న ఇంట్లో మనుషులు మసలేందుకు మూడే మూడున్నాయి గదులు. పై గదులు రెంటి నిండా పుస్తక సంపద. ఇక మిగిలింది ఒకే ఒక్కగది; వంటకూ వార్పుకూ, స్నానాలకూ, భోజనాలకూ వేరే గదులున్నా నివాసానికి పనికివచ్చేది దొక్కటే.

మహారాణి వారితో తనకుగల అనుబంధం "ఒక వ్యాపారం లాంటిది కాగూడ"దనిపించి అప్పారావు మిన్నకుండి పోయాడు. వారసత్వపు దావాలో పని చేసినందుకు పారితోషికంగా సంస్థానంవారు తన కివ్వజూపిన పైకంలో ముందుగా 'సంచకరువు' రూపేణా కొంత ఇస్తే, తాను ఈ ఇంటిని కొని వెయ్యడానికి సిద్ధపడ్డాడు. దాని ధర పదిహేను వందలకూ రెండు వేలకూ మధ్య ఉంటుంది. కొన్నాళ్ళ తర్వాత రిపేర్లకు బోలెడౌతుంది. "చాలాకాలం ఉద్యోగం చేసినా, నేను ఏమీ వెనక వేసుకోలేదు. అందువల్ల మీ తోడ్పాటు లేనిదే, ఇల్లుకొనే స్థితిలో లేను," అంటూ అధికారులకు రాసుకొన్నాడు. లలితకుమారి మనస్సు కరిగింది.ి క్రయచీటీ తీసుకొన్నా, ఇల్లు ఉచితంగానే దక్కింది. దాన్ని విరగదీసి బాగుచేయించుకొన్నాడు.

పాత ఇల్లేంఖర్మ? కొత్తఇల్లుకూడా ఒకటి త్వరలోనే అవతరించింది. సంస్థానం వారు నెలకు రు. 140/- చొప్పున ప్రత్యేక పించను మంజూరు చేయడమే గాక (1913), ఉచితంగా రు. 2500, అప్పుగా అంత మొత్తమూ దయ చేయించారు. కోటలోని పాతభవంతుల స్తంభాలను ఇనపదూలాలను వేలంలో

* ఈ పెళ్ళితాలూకు శుభలేఖ గ్రాంథిక భాషలోనే ఉన్నట్లు కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి "క్రొత్త తెలుగు-మంచి తెలుగు" అనేకరపత్రానికి ఉపోద్ఘాతంలో రాశారు. (1914) పు. 14.

కొనుగోలు చేశాడు. కంట్రాక్టరు కె. అప్పన్నదొర పర్యవేక్షణకింద గట్టి కట్టుబడితో కొత్త ఇల్లు పైకి లేచింది. భూమిలో ఐదడుగుల లోతున్నే చట్టు తగిలింది; దాని మీద నాలుగడుగుల ఎత్తు బేస్‌మెంటు; దానిపై మరో పదునాలుగడుగుల ఎత్తు గోడలు – చాద స్తమే కావచ్చుగాని, గాలి వెల్తురూ రావడానికి గదుల్లో చల్లగా హాయిగా వుండడానికీ ఇది అవసరమే. చీఫ్ ఇంజనీరు పేజస్ దొర కటాక్షం వల్ల రంగూను టేకు దూలాలు ఉచితంగానో 'సలీసు' గానో దొరికినట్లున్నాయి. లండన్ రేట్లకే ఇనప సామాన్లు సప్లయిచేశాడు రామలింగమనే పాత విద్యార్థి. ఇలా 1914 సంవత్సరం చివరకు ఒకటికి రెండిళ్ళు ఏర్పడ్డాయి. 1915 ప్రారంభంలో గృహప్రవేశం జరిగింది.

ఎంత బీద అరుపులరచినా, చనిపోయేనాటికి భూస్థితి అనదగింది అప్పారావుకు రాస్తోహాస్తో సమకూరిందని డైరీలను లేఖలను బట్టి తెలుస్తున్నది. చివరి రోజుల్లో భూమిమీద మమకారం యావగా మారినట్లుంది. లేకుంటే, బల్లి గుడ్లు పెట్టే మెరక పొలాలను 'లాట్లులాట్లుగా' కొని ఉండడు. మద్రాసులో 'మోడల్ ఫార్మ్' (Model Farm) దర్శించి వచ్చాక, శాస్త్రీయ పద్ధతులలో వ్యవసాయం చేయించాలని అనిపించింది. ఊటిగెడ్డ వద్దనూ మరి కొన్ని స్థలాల్లోనూ ఉన్న ఈ మెరక పొలాల్లో 'నేంద్రకోజా' జాతి అరటి మొక్కలు వేయించాడు, రాగి చల్లించాడు. అయితే ఇవేవీ అంతగా కలిసి రాలేదు. 1915 లో ఫౌండు దొరకు రాసిన లేఖను బట్టి, బగ్గిపురంలోనూ, కృష్ణ సాగరంలోనూ ఉండిన పొలాలకు రైతులు శిస్తు చెల్లించకుండా ఇబ్బంది పెడుతూ వచ్చారని తెలుస్తున్నది.

సాలీనా అర్థకోటి రూపాయల వరుమానం వచ్చే సంస్థానం ఇప్పుడిరకాటంలో పడి ఉంది; అది అప్పారావుకు సంకటం కలిగిస్తూనే వచ్చింది. మహారాణీ వారికి జవాహరీమీద దాదాపు పదిహేను లక్షల రూపాయిల అప్పుపెట్టిన కోవాజీ నాలుగైదేళ్ళలో వస్తువులన్నీ విడిపించుకోవాలని ఒక షరతు పెట్టాడు. కాసల్‌దాస్ మరో రుణదాత; గడువు దాటేలోపల బాకీ జమకట్టకపోతే దావా చేస్తానని బెదరించసాగాడు. ఇలా అప్పులపుట్టగా మారిపోయింది సంస్థానం. 'రిసైవరు' అయ్యాడనే గాని అప్పారావు సలహాలు చెప్పలేక చస్తున్నాడు; చెబుతూకూడా చస్తున్నాడు.

అప్పారావు తీరా చనిపోయాక, మదరాసులో ఆండర్సన్ హాలులో బుర్రా శేషగిరిరావు ఒక సంతాప సభ ఏర్పాటుచేశాడు. యస్. శ్రీనివాసయ్యంగారు

అధ్యక్షుడు. "చాణుక్యుని, యుగంధరుని జ్ఞాపకము చేసిన మహా నీతిజ్ఞు"డని అనేకులు ప్రస్తుతించారు. 15 ఈ పెద్దపేర్లకు అప్పారావు తగడేమోగాని వాటి అంశ మాత్రం ఆయనలో లేక పోలేదు. ఆంధ్రదేశపు జమీలలో కెల్లా పెద్దదైన సంస్థానంలో, ఉన్న పరిస్థితుల్లో, ఇంతటి నేర్పుతో 'సుఖా'గా అన్ని చిక్కు వ్యవహారాలను చక్కబెట్టగల వ్యక్తులు ఎందరో ఉండరు. వీరేశలింగంలా స్వతంత్రంగా జీవించక, మరొకరిలా భద్రమైన వృత్తి చేసుకోక, తన శక్తియుక్తుల నన్నిటినీ జమీందార్ల ఊడిగంలో వ్యయపరచుకొన్నాడని అప్పారావును తెగనాడు తప్పెన్నుతున్న వాళ్లు కొందరున్నారు. "జమీందార్ల చంకబిడ్డ" అని నిందిస్తున్నా రిక కొందరు. వ్యక్తిగా తన స్వాభిమానాన్ని ఎన్నడూ విడనాడి 'చిత్తం చిత్తం' అనలేదని తానే రాసుకొన్నా నమ్మని వాళ్ళ నెవరు నచ్చచెప్పి నమ్మించగలరు? జమీందార్ల కొలువు తన శత్రువులకేమోగాని కన్నబిడ్డకు వద్దని ఆయన చెప్పిపోయాడంటేనూ, "రాజుల కొలువులో కుమ్మరిపురుగు వలె వ్యవహరించవలసినదని నే నలవాటు పడ్డాను" అని గిడుగు సీతాపతిగారితో చెప్పారంటేనూ, అప్పారావు వేదన బోధపడుతుంది. అయినా జీవితం తనకు చూపించిన 'కులవృత్తి' అది. సమకాలికుల దృష్టిలో అది అపరాధమేమీ కాకపోయింది. సురేంద్రనాథ బెనర్జీవంటి మహా వ్యక్తికి ఆప్తమిత్రుడైన ఆనంద గజపతిగానీ, ఆయన సోదరి రీవారాణిగానీ అప్పారావును 'భృత్యగాడు'గా తక్కువ చేయలేదు. 'సేవకుడు' అని వారి ఆహ్లాదం కొరకో తృప్తికొరకో తనను తాను తగ్గించుకొని ఉండవచ్చునుగాని తాను మంత్రిననే తన ధీమా.

అందుచేతనే లోకులకు అప్పారావు పంతులుగారయ్యాడు. నీతిజ్ఞుడనిపించుకొన్నాడు. ఆ కాలానికి అది వన్నె.



మూడు తరాలు

క్రింద కూర్చున్నవారిలో : 1. అప్పారావు (ఒడిముందు కుర్రవాడు) 2. కుమారుడు రామదాసు (టోపీ) 3. కుర్చీలో కూర్చున్నది అప్పారావు తండ్రి వెంకట రామదాసు ( 1904-5లో గురజాడ పేర్రాజు పంతులు సమాక్తైను, రాజా కొచ్చర్లకోట వెంకట కృష్ణారావు పెళ్లాడినప్పటి ఫోటో నుంచి. )

# 4

సురేంద్రనాథబెనర్జీ హయాముకూ బాలగంగాధరతిలక్ హయాముకూ ఎంత తేడా ఉందో, అంత తేడా *కన్యాశుల్కం*, *కొండుభట్టీయ* నాటకాలకులేదు. వాటి కథావాతావరణానికిగూడాలేదు. కాగి చల్లారి మితవాదానికి మనసై చివరకు 'సర్' బిరుదుతోటి పిల్లిలా చరిత్రనుంచి నిష్క్రమించిన బెనర్జీ రావడానికేమో రంగం మీదికి పులిలా వచ్చాడు. *కన్యాశుల్కం* నాటకంలో వెంకటేశానికి పలుమార్లు గిరీశం చూపెట్టింది ఈ 'బెంగాల్ కేసరి' ఆదర్శమూర్తినే! * కృష్ణారాయపురాగ్రహారపు బండివానికి కాంగ్రెస్ అంటే స్థానికమైన పోలీసు జబర్దస్తీ వైదొలగడమే అయింది. మార్చి సరికొత్తగా రాసినా, ఆ నాటకం కింది శతాబ్దానికే అంకితమైన రచన. *కొండుభట్టీయం* అలాకాదు. ఆనాటికే కాంగ్రెసు గదులనుంచి వీథుల్లోకి వచ్చిపడింది; తీర్మానాలనుంచి హర్తాళాలవరకు పయనించింది; నాయకులైన కొద్ది మందిని ఊతగొని జనసమూహాల నాశ్రయించ గలుగుతున్నది; 'లిబరల్స్'ను కాదంటూ 'నేషనలిస్ట్స్'ను వరిస్తున్నది. 'వందేమాతరం గుంటడు' నేపథ్యంలోంచే అయినా ఆ నాటకంలో ఒక పాత్ర.

అయినా ఆనాటికింకా కాంగ్రెసుసంస్థ పూజావేదికగా మారలేదు. రాజకీయాలను మతస్థాయికీ, మతాన్ని రాజకీయాలస్థాయికీ ఎత్తిదించిన గాంధీమహాత్ముడింకా దక్షిణాఫ్రికాలో ఉంటూవచ్చాడు. గోపాలకృష్ణగోఖలే మకుటంలేని మహారాజు. ఆ రోజుల్లో తెలుగుదేశపు విరాట్ వ్యక్తులలో ఏ ఒక్కరూ కాంగ్రెసుకు అంకితమైపోలేదు. సుబ్బారావు వీరేశలింగం వ్యతిరేకి. కొండా వెంకటప్పయ్య ఇంకా తెరమరుగునవున్నాడు. టంగుటూరి ప్రకాశం పైచదువులు చదువుతున్నాడు. మోచర్ల రామచంద్రరావుగానీ, బయ్యా నరసింహేశ్వరశర్మగానీ గోఖలే సూక్ష్మకృతులే. 1893 లోనే 'రావుబహదర్' బిరుదనే ఎరవేసి వీరేశలింగాన్ని బ్రిటిషు ప్రభుత్వం బుట్టలో వేసుకొన్నదని చెప్పలేము. 1913లో గిడుగు రామమూర్తి 'రావుసాహెబు' అయ్యాడు. మదరాసు యూనివర్శిటీ సంస్థలలో సభ్యుడై గురజాడ అప్పారావు ప్రభుత్వాధికారులకు సమీపవర్తి కాగలిగాడు. ఆయన మరణానంతరం రఘుపతి వెంకటరత్నం 'సర్' బిరుదుకు చెయ్యి చాపాడు; జస్టిస్ పక్షానికి మనస్సు పడ్డాడు. ఇవన్నీ ఈ మహాపురుషుల నోళ్ళకు తాళంకప్పలో, కాళ్ళకు గుదిబండలో అయ్యాయనుకోవడం, వాళ్ళు జాతీయోద్యమ విరోధులయ్యారనుకోవడం న్యాయం

---

* మహావక్తలలో అగ్రగణ్యుడని హ్యూమ్ దొరచేత పొగడ్తలందిన సురేంద్రనాథ్ బెనర్జీ ఆనందగజపతికి ఆప్తమిత్రుడని ఆయన స్వీయచరిత్ర The Making of a Nation 97-98 పుటల్లో ఉంది.

కాదు * వీరికి కాంగ్రెసు సంస్థతో బుట్టువుకూడా కాదు. వీరేశలింగం ముప్పయ్యేడో ఏట కాంగ్రెసు జన్మించిన నాటికి, మిగతా వారికి ముగ్గురికీ రెండు పదుల ప్రాయం దాటింది. తమ కళ్ళముందే అది బాల్యారిష్టాలు దాటుకొంటే, కాబట్టి దాన్ని గురు పీఠంగా అతిశయ దృష్టితో వాళ్లు చూడకపోయారు. అయితే దాని పుట్టుకనూ పెరుగుదలనూ అందరితోబాటు హర్షించకపోలేదు. తొలి సభల్లో సభాదేశాల్లో పాల్గొన్నారుకూడా. 1887 మద్రాసు కాంగ్రెసులో ఆనంద గజపతికూడా ఉన్నాడు. చిలకమర్తి, కొండ, టంగుటూరి, భోగరాజు పట్టాభి గారాలు మరోతరం మనుషులు; ఊహ తెలుస్తున్న ప్రాయంలోనే కాంగ్రెసుపై భక్తి పెంచుకొన్నారు పితృస్థానంలోని వాళ్ళకూ పుత్రస్థానంలోని వాళ్ళకూ మధ్యగల భిన్నతలాంటివే కాదిది. ఒకేతల్లి గంపెడుబిడ్డల్లో పెద్దవాడికీకడగొట్టువాడికీ ఆలోచనల తీరులోగల భేదంలాంటిదికూడా.

ఈ సరైన దృష్టితో చూచినప్పుడే, 1908 లో మద్రాసు కాంగ్రెసు విషయమై అప్పారావు రాసిన విమర్శలోని ఆంతర్యం అవగతం కాగలదు. లేకుంటే, అప్పారావు పట్టి బ్రిటిష్ ప్రభుత్వ భక్తుడనిపిస్తాడు.

అప్పటికే రెండుమూడు మార్లు వచ్చి బిపిన్‌చంద్రపాల్ ఆంధ్ర యువకులలో 'జాతీయ' భావాన్ని ఉద్బోధించి ఉన్నాడు. 'వందేమాతరం' ఉద్యమం కాంగ్రెసులో గల 'లిబరల్' నాయకత్వానికి చెంపపెట్టు పెట్టి ఉంది. హైందవ పునరుద్ధరణోద్యమం గణపతి ఉత్సవాల ద్వారా మహారాష్ట్ర ప్రాంతంలో తిలక్‌ను కాళీపూజ ద్వారా వంగదేశంలో అరవింద ఘోష్‌ను ఆశ్రయించి ఉంది. 'వందేమాతరం' బిళ్ళలు అమ్ముతూ వీథుల్లో కొందరు నినాదాలిస్తూ విశాలాల్లో కొందరు, దీనికి విశాల జనతా లోకంతోటి లంకెలు కలిపి ఉన్నారు. నాయకులేగాక అనుచరులు కూడా, అతివాదులుగా మితవాదులుగా చీలిపోతున్నారు. 'టెర్రరిజం' వ్యాపించ సాగింది. సూరత్ కాంగ్రెసులో (1907) ఈ కీచులాటలు కుర్చీ పోటాటలుగా విషమించి ఉన్నాయి. ఈ ఉద్రిక్త పరిస్థితిలో కాంగ్రెసు మహాసభ మద్రాసునగరానికి తిరునాళ్ళలా తరలి వచ్చింది 1908 డిసెంబరు మాసం చివరి మూడురోజులు మౌంట్‌రోడ్ లోని ఎల్ఫిన్‌స్టన్ గ్రౌండ్స్ కిటకిటలాడి పోయింది. ప్రతినిధులే 628 మంది. ఇక 'విజిటర్సు' సంఖ్య చెప్పాలా? అధ్యక్ష పీఠంమీదినుంచి రాస విహారి ఘోష్ మింటో–మార్లే సంస్కరణల పట్లసంతృప్తి ప్రకటించాడు.

---

* చివరకు వేదం వేంకటరాయశాస్త్రికూడా విక్టోరియారాణి స్వర్ణోత్సవ సందర్భంలో (1896) ఒక సంస్కృతగీతం, పంచమజార్జి చక్రవర్తికొక మంగళగీతం రాశాడు. 'బొబ్బిలి యుద్ధం' నాటకంలో దూర్చాడు.

రాజభక్తిని మొట్టమొదటి తీర్మానమే పునరుద్ఘాటించింది. ఒకవైపున, రాజద్రోహ నేరం బనాయించి ఇరవై మందిని శిక్షించి "చట్టంగాని చట్టమైన" 1818 రెగ్యులేషన్ III కింద ద్వీపాంతర వాస శిక్షలు గూడా అమలు జరిపారంటూనే. 'బల ప్రయోగ చర్యల' (Violence) ననహ్యించుకొంటూగర్హిస్తున్నామని మూడవ తీర్మానం రెండు నాలుకలు వెళ్ళబెట్టింది. 16 Hunting with the hound and runnig with the hare అనే ఇంగ్లీషు సామెతకు అతికినట్లు సరిపోయే పని ఇది.

వేడుకజూడ వెళ్ళిన గురజాడ అప్పారావు ఈ రెండునాలుకల వ్యవహారాన్ని గేలిచేశాడంటే చెయ్యక ? కాంగ్రెసు దీక్షాకంకణం కట్టుకొన్న టంగుటూరి ప్రకాశం కూడా ఈ తంతు నంతటినీ చూచి రోత పడ్డాడు. మద్రాసు కాంగ్రెసు మహాసభ "కేవలం మితవాద మహాసభ" అంటూ లక్నో కాంగ్రెసు వరకున్నూ కాంగ్రెసు "కేవలం మితవాదుల రంగస్థలమై ప్రభుత్వాన్ని యాథాలాభంగా విమర్శిస్తూ తీర్మా నాలు పాసు చెయ్యడమే కాని కోట్ల కొలదిగా ఉన్న జన సామాన్యాన్ని రాజకీయం గాను, ఆర్థికంగాను, అభివృద్ధిలోకి తీసుకొని రావటానికి ఎటువంటి కార్యక్రమమూ ఇవ్వలేక పోయింది," అని విమర్శించాడు. మద్రాసు సమావేశంలో మితవాదులు "ప్రభుత్వం మాట అల్లా ఉండనిచ్చి, జాతీయ వాదులపైని తమ తీవ్ర వాగ్ధాటి అంతా వినియోగించారు."17

గురజాడ అప్పారావు రాసిన అపహాస్య వ్యాఖ్యానికి ఇంతకంటె అదనంగా వ్యాఖ్యానం అవసరంలేదు. ఆ సిక్కు సభలో గుండెలుచించుకొంటూ ఉద్రేకంతోటి సరోజినీదేవి చేసిన ప్రసంగమే ఆయనకు నచ్చింది. మరింత రాజభక్తిని చూపెట్ట లేదంటూ కాంగ్రెసుకు వంకబెట్టలేదు సరిగదా, ఈ రాజభక్తి నాటకాన్ని అసహ్యించు కొంటూ అతివాదిలాగా రాశాడాయన సూరత్ మహాసభలో కుర్చీలను గాలిలో ఎగర వేసి చరిత్రను నిర్మించాడని తిలక్‌ను వర్ణించాడు; కాంగ్రెసు సంస్థ మరమ్మత్తు కోసం ఆ 'ఇంజనీరు' చేసిన సూచనలు గమనిస్తే, వాటి విలువ ఎంతటిదో తెలుస్తుంది.

వేడుక చూద్దామ ప్రతినిధులుగావచ్చి, మూణ్ణాళ్ళ ముచ్చట తీరాక రాజకీయ నిద్రలోపడి కూరుకుపోయే ధ్రువమంచులపు ఎలుగుబంట్లకు (Polar Bears) కాంగ్రె సులో స్థానం ఉండకూడదు. కొద్ది మందే అయితేనేం కార్యాశూరులు? విషయనిర్ణయ సంఘంలో ఒకడు చెప్పిందా కల్లా నిలువుగానో అడ్డంగానో పదుగురు తలూపే పద్ధతిపోయి మరింత మంది చర్చల్లో పాల్గొవాలి.సరోజిని ప్రబోధించిన సోదర త్వమనే ఆదర్శం ఈ చీకటికొక వేకువ, కావలసిన కార్యాచరణ కొక కోడికూత అని

ర్ణించాడు శుష్కోపన్యాసాలూ శూన్యహస్తాలూ చేస్తూ చూపుతున్న వారిని గురించి వ్యంగ్యంగా ఇలా రాశాడు :

> Lives of Moderates all remind us
> We should wisely keep from crime ;
> Open sedition only finds us
> Shelter in a far-off clime.
>
> Let us then line up and be speaking,
> Speaking at a furious rate ;
> Not always some benefit seeking,
> Learn to be loyal and to wait. [18]

ఇంతకూ అప్పారావు ఏ వాది అయినట్లు ? "నేను అమితమైన మితవాదిని, మితమైన తీవ్రవాదిని" అని వర్ణించుకున్నాడు తనను తానే. ఆయనది కార్యవాదం, ప్రజాహితవాదం మాత్రమే. సంఘ సంస్కరణోద్యమాలలో పాల్గొంటున్నట్లు నటించి ప్రభుత్వాన్ని మెప్పించి పై పదవులకు దోట్లువేసే స్వార్థపరులను కొంతసు భట్టీయంలో బయల్పరిచిన మనిషే, ఒకనాటి ఆరాధ్యపురుషుడైన సురేంద్రనాథ్ బెనర్జీనికూడా వాచాలునికిందనే జమకట్టాడనిపిస్తుంది. స్వయంగా రాజకీయాలలో తలదూర్చలేదనేగాని, గురజాడ అప్పారావు కాలం తోటి నమగతితో పరుగుదీసిన 'ధీర విచారుడు.' సంస్కర్తలకు ఉత్తమ సంస్కరణ పథాన్ని నిర్దేశించినట్లే 'దేశ భక్తుల'మని పేరుబెట్టుకు ఊరేగుతుండినవాళ్ళకు పనికిరాగల సుద్దులు నాలుగు చెప్పబూనాడు. అయినా ఆయనది సంకుచితమైన మనస్సుకాదు; మామూలు 'దేశభక్తి' ఆయనకు సరిపడలేదు. ముఖ్యంగా బంకించంద్ర ఛటర్జీ 'వందేమాతరం' గేయంలోని నదులు, కొండలు. గాలులూ, నీళ్ళూ వగైరా ప్రస్తావన గురించి ఆయనకు అంతగా సదభిప్రాయంలేనట్లు, గిడుగు రామమూర్తితో ఆయన చేసిన సంభాషణ బట్టి తెలుస్తుంది. అప్పారావు కుమారుడైన రామదాసుగారి జ్ఞాపకశక్తిని ఎవరైనా శంకిస్తే, వారికి అప్పారావు గేయ చరణాలే జవాబు చెబుతాయి. అంతే గాక, గిడుగు సీతాపతిగారితో ఒకమారు అప్పారావు స్వయంగా ఇలాగన్నాడు:

> చూశావా ఈ దేశభక్తీ, ఈ స్వదేశాభిమానం మన హృదయాన్ని ఎంత సంకుచితమైన దానినిగా చేస్తుందో....మన అభిమానాన్ని సంకుచితం అయేటట్టు చేస్తుంది దేశాభిమానం .... లోక కళ్యాణానికి భంగం రానీయకుండా, పెద్ద సంఘాల మేలు చెడగొట్టకుండా నీ చిన్న సంఘం మేలు నీవు కాపాడవలసినదే.

కాని, నీవు చేసే మేలు ఈ విశ్వంలో ఎంత మేర వ్యాపిస్తే అంత గొప్ప దౌతుంది. 19

మద్రాసు కాంగ్రెసు తర్వాత రెండేళ్ళకు (1910) రాసిన "దేశభక్తి" గేయం ఈ భావాలనే కవిత్వమయంచేసి చెప్పింది. దేశాభిమానం ఎంతగా ఉన్నా, బ్రిటిష్ పాలనగురించి గురికూడా చివరివరకూ అప్పారావులో ఉంటూవచ్చింది. కాంగ్రెస్‌లోని 'లిబరల్స్'కే ఉండేదది. గ్లాడ్‌స్టన్ హయాము 'లిబరలిజం' వారి మదికెక్కింది. అరాచకాన్ని అణిచి 'శాంతి'ని నెలకొల్పి ప్రాణానికి ధనానికీ ఇతోధికమైన భద్రతను చేకూర్చడ మేమి, రైళ్లు, టెలిగ్రాపులు వేయడమేమి, ఇంగ్లీషు భాషద్వారా విశ్వ సంస్కృతిని అందించడమేమి – ఇంగ్లీషు దొరతనం నాగరకతా సాధన మనిపింప జేశాయి. సంఘ సంస్కరణలపట్ల ప్రభువుల సుముఖత్వాన్ని హర్షిస్తూ, సామ్రాజ్య సభ్యత్వమే సౌభాగ్య పథమని భ్రమపడ్డారు. జాన్‌లాక్, డేవిడ్ హ్యూమ్, ఎడ్మండ్ బర్కు, జాన్ స్టూవర్ట్ మిల్ దివ్యసందేశ హరులనిపించారు. బెంటింక్, రిప్పన్ ప్రభువులు దేవతలనిపించారు. కొందరు దొరలపేర్లు సంస్కృతంలోకి పరివర్తనం చెంది ఆత్మీయాలయ్యాయి : మన్రో మాండవ్యఋషి, బ్రౌన్ నిఘంటువు బ్రౌఢ్యం, మాక్స్‌ముల్లర్ మోక్షమూలరు. ఈ మనస్థితిని చరిత్రకారు లిలా వర్ణిస్తున్నారు.

> One marks the same unflinching faith in the providential character of British rule, the robust and sincere sentiments of devoted loyaly to the British Crown, and the same pathetic, almost abject, belief in the sense of justice of the British peoples who would concede all the reasonable demands of the Indians as soon as they were properly approached. 20

యమధర్మరాజు రాజ్యంలాంటి బ్రిటిషు సామ్రాజ్యం గురజాడ అప్పారావుకు "ఆంగిలేయుల ధర్మ రాజ్యము" అనిపించడానికి కారణం, స్వాతంత్ర్యం మాట ఏమోగానీ జ్ఞానం ఇవ్వడమే. "వస్తుతత్వము" వారినుంచి నేర్చానని మరొక గేయంలో ఆయన ఉన్నాడు. కళ్ళకు సీమవాడి అంజనంపెట్టుకొన్నప్పుడు, మాయ పొరలుకరిగి వస్తువులు తమ అచ్చపు రూపాన్ని చూపెట్టాయి. వెర్రి మొర్రి పురాణ గాథలు దమ్మిడీకిగూడా కొరగాలేదు; ఈ అంజనం విజ్ఞానశాస్త్రమే. మత విశ్వాస యుగాంతాన విజ్ఞానదీపాంకురంగా కనిపించే 'తోకచుక్క' ('ముత్యాల సరం') గేయం రాసినప్పటి ఆలోచనలు ఇవీ.

---

* 'కన్యాశుల్కం నాటకం'లోని గ్రామస్థులైన పాత్రలు 'ఈ మెరుపుటపా' గురించి మాట్లాడుకోవడం గమనించదగింది.

ఆ గేయాన్ని రాసిన సందర్భం ఇదీ :

గత శతాబ్ది మధ్యకాలంనుంచీ తెలుగు బస్తీలలో సహపంక్తి భోజనాలు సాహసుల నందరినీ ఒకదగ్గరకు తెస్తూ వచ్చాయి. పీఠాధిపతుల శ్రీముఖాలూ ఆంక్షలూ చెల్లుబడి కావడంలేదు. వెలిగురించి చలి వదిలింది. ఆంధ్ర యువకులు సముద్రయానంచేసి చదువులకై పరదేశాలకు వెళ్ళకముందునుంచీ, సంస్కర్తలు వర్ణాలను ఒకచోటికిచేర్చి భోజనంపై నిషేధాన్ని ధిక్కరించివున్నారు. మళ్ళీ మరో మారు గ్రామాలపై అగ్రహారాలపై బస్తీలూ, నగరాలూ దాడిచేసినట్లయింది; గ్రామీణమైన ఆచారపరత్వంపై నగర సంబంధమైన నవ్యజీవనావసరాలు యుద్ధాన్ని ప్రకటించినట్లయింది. రైళ్ళేకాక హోటళ్ళుకూడా తోడ్పడ్డాయి. కోనసీమలో పుట్టి అగ్రహారాలలో పెరిగి ఉగరాగానే బస్తీలలో తిరిగి పిలకతీయించి క్రాపుపెట్టిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రికి రాజమండ్రిలో తొలిసారిగా పూటకూటి ఇంట్లో నోటికి ముద్దదిగకుండాపోవడం ఆశ్చర్యం కలిగించదు. హేమచంద్ర సర్కారు రాజమండ్రికి వచ్చిన సందర్భంలో (1904) సహపంక్తి భోజనంగురించీ మాంసాహారంగురించీ దేశిరాజు పెదబాపయ్య ఊగిసలాడడమూ వింత గొలుపదు. అలాగే బిపిన్ చంద్రపాల్ శూద్రుడైనందుచేత అతనితో కలిసి భోంచేస్తే అగ్రకులం వాళ్ళు వెలివేస్తారని కొండ వెంకటప్పయ్య జంకడం విచిత్రమనిపించదు. ఈ పరిస్థితిలో నూతన శతాబ్దం తెలుగు నేలపై కాలుమోపింది.

వెలి ఇంకా అమలు జరుగుతూనే వచ్చింది. టంగుటూరి ప్రకాశం బారిస్టరు ప్యాసై వచ్చినప్పుడు రాజమండ్రిలోనూ బెజవాడలోనూ జరిగిందదే. అయినా వెలి వేసిన వాళ్ళనే వెలివెయ్యడం జరిగిందికూడా. విశేషం అదే. ప్రకాశం బరంపురం పోయినప్పుడు పెద్ద రచ్చే అయింది. సంస్కరణ వాదులకు వరహగిరి వెంకట జోగయ్య నాయకుడు. ప్రకాశం వచ్చి వెళ్ళాక (1906) పూర్వాచారపరాయణులు తమ కుటుంబాన్ని వెలిపెట్టజూచారుగాని తాము దానిని ఖాతరు చేయలేదంటూ, వి. వి. గిరిగారు నాకొక ఉత్తరంలో రాశారు. ఆ రోజుల్లో బరంపురం ఒక యుద్ధ రంగమై ఉండేదని చిలకమర్తి లక్ష్మీనరసింహం పుస్తకం మరొక సాక్ష్యం. అక్కడి వకీళ్ళల్లో కోపర్గాము రామమూర్తి సంస్కరణాభిమాని. 'జయంతి' కుటుంబం కూడా అగ్రగామి. విజయనగరంలో విశాఖపట్టణ మండల రాజకీయ మహాసభ జరిగి నప్పుడు (1911) వరహగిరి జోగయ్య ప్రభృతులు అక్కడికి వెళ్ళి పాల్గొన్నట్లు

గానే బరంపురంలో జరిగిన సర్వవర్ణసుల విందులో అప్పారావు పాల్గొన్నాడు (1910). మూడేళ్ళక్రితం ఆంధ్ర దేశానికి రాజమండ్రి పెట్టిన భిక్షే అది.

'ముత్యాల సరములు' రాయడానికి అప్పారావును ప్రోత్సహించిన ఇంకొక విశేషం 'హేలీస్ కామెట్' (Halley's Comet). క్రీ.శ. 1704లో ఎడ్మండ్ హేలీ ఒకానొక తోకచుక్క డెబ్బయ్యయిదేళ్ళ కొకమారు కళ్ళబడుతుందని తేల్చి చెప్పిన దరిమిలా, క్రీ.శ. 1759, 1835, 1910 సంవత్సరాలలో అది కనిపించింది అప్పారావుకు ఇరవై ఒక్కేళ్ళ వయస్సున–1882లో–ఒక తోకచుక్క కనిపించిందని, సూర్యుణ్ణి సమీపించే దారిలో అది శకలప్రాయమై వేలాది మైళ్ళమేరా ముత్యాల లాంటి వెలుగులు విరజిమ్మిందనిన్నీ, అందుచేతనే దానికి 'ముత్యాలహారం' *(String of pearls) అని పేరుబెట్టారనీ నార్ల వెంకటేశ్వరరావుగారు రాశారు; 'ముత్యాల సరములు' అనే శీర్షిక పెట్టడానికి కారణమిదేనేమో అని ఊహిస్తున్నారు. 21. అప్పారావు పెట్టిన శీర్షిక 'తోకచుక్క' మాత్రమే ; అయినా నార్లవారి ఊహ సరైనదే. 'హలీస్ కామెట్' కూడా ఇలా వెలుగు ముక్కలై ముత్యాలసరాన్ని తోపింపజేసింది. ఆ దృశ్యంకోసం అనేకులు కాచుకూర్చున్నారు. వారిలో వేటూరి ప్రభాకరశాస్త్రి ఒకడు. వేపారామేశం తాలూకు దుర్భిణితో ఆకాశాన్ని గాలిస్తూ వచ్చాడు. "ఆ ధూమకేతువు తొలుత అరుణోదయ మగుచుండగా తూర్పు దిక్కున గోచరించెను. అది యుదయించునంతలో ఉదయారుణకాంతులు క్రమ్ముకొనఁగా కానరాకపోయెడిది.... అటుపై నాల్గయిదు రోజులకుఁ గాబోలు నది యందఱ యెఱుకకు నందినది" 22.

దుర్భిణి సాయం లేకుండానే అందరితోబాటు తోకచుక్కను చూచిన గురజాడ అప్పారావు, అందరిలాగా మాత్రం ఆలోచించలేదు. * మహోత్పాత కారణమని

---

* "ముత్యాలు" అనేవి అప్పారావుకు చాలా ఇష్టంలాగుంది. "ముత్తెపుసరులు" (డామన్ పితియసు) "ముత్యాలపేట" (కోడుకొండ) వంటి ప్రయోగాలు తెలియజేసేదిదే.

ధూమకేతువులు అనే వ్యాసంలో (త్రిలింగ, సంపుటము 1 సంఖ్య 2 ఫిబ్రవరి 1914) కపిస్థళం కృష్ణమాచార్యులు ఈ వరకే వ్యాప్తిలో ఉండిన భయాలను విశ్వాసాలను కొండంతలుగా చూపాడు:

1910 సం॥మున నిది గోచరమయినప్పుడు మనదేశపుఁ జక్రవర్తియగు సప్తమైడ్వర్డు ప్రభువు స్వర్గతుఁడాయెను. ప్రవాహాదులచే ననేకులు మృతినొందిరి. ఆ సంవత్సరమున ధూమకేతువు సూర్యునికిని భూమికిని మధ్యమునఁబోయెను. అప్పుడు విషవాయువు లనేకము

తోకచుక్కను జూచి భయపడే రోజులో, "చన్నకాలపు చిన్నబుద్ధులను" కాదంటూ ఆకాశానికి మేలినగగా అచ్చరచేతి కలువ పువ్వుగా ఉపమించి సంబరపడ్డాడు: తోకచుక్క,

తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు జెందుటదేమి కార్యము?
తలతు నేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకగాన్.

---

ఉత్పత్తియగుననియు నందుచే జనులు మరణింతురనియుఁ గొందరు చెప్పుచుండినందున ననేకులు భయగ్రస్తులయి యాత్మహత్యలు చేసికొనిరి. (పు. 55)

లోక సామాన్యాభిప్రాయానికి భిన్నంగా ధూమకేతువులోని బంధుగుణాన్నీ స్నేహశీలాన్నీ భూజనులకు తెలియజేసే గురజాడ అప్పారావు వైఖరి, ఆ నాటికి ఉలిపికట్టెలనమేనని ఇది రుజువుచేస్తున్నది. ఊరందరి అభిప్రాయానికి ఈ చాటువు నిదర్శనం:

కనబడవు తోకచుక్కలు
మినుచక్కని విప్రగాండ్రు మృతులై యుండన్
పనివడి రాజులు చావన్
జనములకు దమంత బయలు చాటుచునుండున్.

ఎడ్వర్డు చనిపోయింది 1910 మే 6 సగంర్రాత్రివేళ. 7వ తేది అరుణోదయకాంతిలో బ్రిటిష్ ప్రధాని AdQuith ఈ తోకచుక్కను చూశాడు:

1. గు. ర. మ. డై : 1898 జూన్ 24—పు. 158 - 159
2. గు. ర. మా. మం : ఆనంద గజపతి : దర్బారు వింతలు, పు. 143 - 144
3. గు. ర. లే : పించనీ : శ్రీ జి. అప్పయ్య రిమార్కులు. పు. 235
4. గు. శ. జం. హై : గురజాడ - చరిత్ర పరిశోధన (వ్యా) మల్లంపల్లి సోమశేఖరశర్మ. పు. 103 - 107
5. గు. ర. మా. మం : ఉమ్మిడూ ! —పు. 21 - 22
6. గు శ జం. హై : గురజాడ సమకాలికులు (వ్యా) వసంతరావు బ్రహ్మాజీరావు. పు. 24
7. గు. ర. లే : వాదదీపిక, పు. 108 - 109
8. గు. ర. మా. మం : పీఠిక : ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం. పు. iii
9. గు. ర. ము : పు. 70
10. గు. ర. మా. మం : ఉమ్మిడూ ! పు. 20
11. స్వీయచరిత్రము : చిలకమర్తి లక్ష్మీనరసింహం. పు. 206-207, 263
12. శ్రీ బ్రహ్మర్షి వేంకటరత్నమ్యతులు : పు. 38-40
13. ఆత్మచరిత్రము : రాయసం వేంకటశివుడు. పు. 459
14. Tagore : 1861-1941 : Acentenary Volume : Uncle Rabindranath : Indira Devi Chandhurani. p. 7
15. గు. ర. డై . మదరాసులో సంతాప సభ, పాదదీపిక, పు. 222
16. How India Wrought for Freedom : Annie Besant P. 473–490.
17. నా జీవితయాత్ర: టంగుటూరి ప్రకాశం. పు. 235
18. గు. ర. వ్యా: మదరాసు కాంగ్రెసు మహాసభ పు. 135
19. ఆదర్శ పురుషుడు (వ్యా) గిడుగు వెంకట సీతాపతి : పరిశోధన. డిసెంబరు-జనవరి 1956.
20. British Paramountcy And The Indian Renaissance- Vol-II : Bharatiya Vidya Bhavan, P. 572.
21. 'ముత్యాలసరములు' (వ్యా) : 'ఆంధ్రజ్యోతి' సంపాదకీయం, 13-10-1965
22. ప్రజ్ఞాప్రభాకరము : పు. 37-38.

# అరుణోదయం

## "THE BATTLE OF STYLES" *

**నాది ప్రజల ఉద్యమము,** దానిని యెవరిని సంతోష పెట్టడానికైనా వదులుకోలేను.

"ఆంధ్ర సారస్వత ప్రపంచమున మహాకవి 'మాగ్నకార్టా' ప్రకటన" అంటూ పై ప్రకటనను వర్ణించిపోయాడు అవసరాల సూర్యారావు. సాహిత్యంలోనేగాక జీవితంలోనూ ఈ ప్రజాదృష్టి ఒక్కటే గురజాడ అప్పారావు విశిష్టసిద్ధి. 27-3-1911 నాటి దినచర్యలో కనిపిస్తున్న ఈ నాలుగు ముక్కలు, అంతకు రెండేళ్ళక్రితం ఒక లేఖలో అప్పారావు కలంనుంచి వెలువడినవే గాని కొత్తవేమీ కావు.

My cause is the people's cause. I hove cultured opinion at my back.

వేర్వేరు సందర్భాలలో రాసినవైనప్పటికీ ఒకేవ్యక్తి రాసినవి కాబట్టి అతని మనస్సు నివి పట్టివ్వకపోవు. 1911లో అప్పారావలా రాసుకోవలసి రావటానికి కారణం ఉండింది. ఇరవయ్యేళ్ళ పరిశ్రమ ఫలితంగా కళింగదేశ చరిత్ర రచనకు కావలసిన సామగ్రి సిద్ధంగాఉంది. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి పక్షాన కొమర్రాజు లక్ష్మణరావు ముందుకువచ్చి ముద్రించిపెడుతా నన్నాడు. అప్పారావు ఒప్పుదల వెలువడకముందే, 1911లో రెండవకూర్పు పొందిన లక్ష్మణరావుగారి *మహమ్మదీయ మహాయుగము* గ్రంథంలో నాల్గవ అట్టమీద 'తయారగుచున్న గ్రంథములు' గురించిన ప్రకటనలో ఏడవదిగా,

*కళింగదేశ చరిత్రము—*

*గురుజాడ-అప్పారావుగారు, బి. ఏ. బి. ఎల్.*

ముగ్గులోకివచ్చింది. అప్పారావుఎప్పుడు బి.ఏ.బి.ఎల్. అయ్యాడో ఆ ముద్రాపకులకే తెలియాలి. కడుపులో ఉన్న బిడ్డకు నామకరణం చెయ్యడమంటే ఇదేనేమో! ఇంతకూ జరిగిం దిది. ఈ గ్రంథంగురించి లక్ష్మణరావు తనతో ప్రస్తావించినప్పుడు, యిదివరదాకా నలుగురూ రాస్తూవచ్చిన భాషలోనే తానూ రాస్తానని అప్పారావు

---

* 1914 అక్టోబరు 10 నాటి 'ది హిందూ' ఉపసంపాదకీయానికి పెట్టిన శీర్షిక.

మాటయిచ్చిఉన్నాడు. దేశంలో చరిత్రజ్ఞానం వ్యాపించేందుకు మిత్రులు సాగిస్తున్న మహోద్యమానికి ఉడతాభక్తి చందంగా తోడ్పడగోరి ఈనలుగురితోబాటు నారాయణ త్వానికి ఒప్పుకొన్నాడు అంతే. లక్ష్మణరావు ఈ అవకాశాన్ని వృథాపోనివ్వలేదు :

> ఇప్పుడు లక్ష్మణరావు పంతులుగారు నాకు వొక చిక్కు తెచ్చిపెట్టారు. వారువ్రాసిన లేఖలో లక్షణ ప్రయుక్తమనే మాటొకటి ప్రయోగించారు. ఈ లక్షణ స్వభావం ఎట్టిదో వారు కొంచం శ్రమపడి పత్రికాముఖంగా లోకానికి వ్యక్తీకరిస్తే ఉపయోగంగా వుంటుంది. 1

ఆ పని నీవరకే లక్ష్మణరావుగారూ తదనుచర బృందమూ చేసే ఉన్నారు. 1906 లో భాషాభివృద్ధి సంఘాన్ని ఏర్పాటు చేస్తున్నప్పుడు, గ్రంథాలలో ఎటువంటి తెలుగును వాడుకచేస్తే తాము ప్రకటింప బూనుకొంటారో స్పష్టంగా చెప్పలేదనే గాని, "సకల జనాదరణీయంబును సకల జనానుకరణీయంబును నగు శైలి" వీరేశలింగం వినిర్మించియుండినట్లు వర్ణించినందుచేత వాళ్ళమొగ్గు ఏవైపో తెలుస్తూనే ఉన్నది. ఆయన ప్రచురంచేస్తూవున్న సులభ గ్రాంథికశైలినే వీళ్ళు తలదాల్చి నట్లయింది. 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' కార్యదర్శిత్రయంలో ఒకడైన అయ్యదేవర కాళేశ్వరరావు తన జీవితచరిత్ర గ్రంథంలో తమ భాషానియమం గురించి ఇలా రాశాడు :

> గ్రామ్యమనుపేర ప్రజల కర్థము గాకుండ వ్రాయుటమాత్రము మేము ఒప్పుకొనము. పూర్తి గ్రాంథికమే కావలయునని మాకు పట్టుదలలేదు. తెలుగు ప్రజలకు హృద్యముగా నుండునట్లు వ్రాయుటయే మాకు కావలసినది. 2

ఈ సర్దుబాటు పద్ధతికి సరసుడైకూడా అప్పారావు ఒప్పుకోలేదంటే, భాషా విషయంలో ఆయన కేర్పడి ఉన్న ప్రజాహిత చింతే కారణమనాలి. విజ్ఞాన చంద్రికలు లక్ష్మణరావును ఆశ్రయించినంతకంటె మెండుగా అప్పారావు నాశ్రయించాయి. ఆ ఇద్దరినీ విడదీసిన భావాల అగడ్తపేరు, ఆధునికత, పురాణయుగం నుంచి లేవదీసి సాంఘిక రాజకీయ యుగానికి దేశాన్ని కొనిపోవాలనుకొన్న 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' సంకల్పం గొప్పది కాదని ఎవడూ అనడు. దేశ చరిత్ర, మహా పురుషుల జీవితాలు, ప్రకృతి (భౌతిక) శాస్త్రాలు, రాజకీయ, ఆర్థిక శాస్త్రాలు వగైరా గ్రంథాల ప్రచురణద్వారా "'యుడుత భక్తి' చందంబున మా యల్పశక్తి కొలది యాంధ్ర మాతృభాష సేవచేయ ప్రయత్నింప వలయుననెడు యిచ్ఛ" మెచ్చదగిందే. విజ్ఞాన వ్యాపనకు పరమావశ్యకాలైన విద్యావకాశ విస్తరణ,

దానికి ద్వార మనదగిన భాషా సంస్కరణ – ఈ అంశాలలో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వీరేశలింగం పేరు స్మరిస్తూ వేంకటరాయశాస్త్రి వంటి పండితుల పక్షాన నిలిచి సంస్కర్తల నెదుర్కొంది. చారిత్రకంగానూ దాని చూపు గతైక మగ్నమే కావడమనేది యాదృచ్ఛికం కాదు. హైందవ పునరుద్ధరణ క్రతువులో దాని ప్రచురణలు అనేకాలు దర్భపుల్లలయ్యాయి. కొత్తగా కల దెలుసుకొని ఒళ్ళు విరుచుకుంటూ ఇల్లు చక్కబెట్టుకోసాగిన మధ్యమవర్గంలోనే దాని స్థావరం; దాని చందా దార్లు, పాఠకులు మధ్యమవర్గీయులే; అయితే దాని స్థాపకులూ పోషకులూ జమీందార్లు. ఇక, దాని దృక్పథంలో భూస్వామ్య, 'పాండిత్య' సంబంధి అంశాలు వూరకే కానరాలేదు. నవీనత సాంకర్యంగానూ ప్రాచీనత పావిత్ర్యంగానూ కనుపించక తప్పలేదు. భాషలోనే గాక చరిత్రలోనూ సంకుచితమైన, మత పరమైన, విశాల జాతీయ భావనిరోధకమైన వైఖరి పట్టుబడక తప్పలేదు. విజ్ఞాన చంద్రికలిలా మలినపడబట్టే, అప్పారావు వచనశైలి 'విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి' సారథుల మది కెక్కలేదు.

వీరేశలింగం సులభ గ్రాంథిక వచన శైలికూడా గ్రాంథికమే. కాకుంటే *సంధి, విగ్రహం* అనువాద శైలికంటె మెరుగు. ఈ అంశాన్ని గుర్తిస్తూనే భాషా సంస్కరణ వాదులు సులభ వచనశైలి చేసిన అపరాధాన్ని కూడా గమనించారు. ముఖ్యంగా చిలకమర్తిలక్ష్మీనరసింహంలాంటి వీరేశలింగ అనుయాయుల చేతుల్లో బడి అది సంధి సూత్రాలను యథేచ్ఛగా తెంపి తుంటలు చేయసాగింది. తద్వారా గ్రాంథిక భాషావ్యాకరణ మర్యాదలను తోసివేసింది. అందుచేత దాన్ని గ్రాంథిక మనడమే సరికాదు. అట్లని, అది గ్రాంథికమూ కృతకమూ కాకుండా పోనూలేదు. ఇలా అది రెంటా జెడింది. కావలసిందిది కాదు. గిడుగు రామమూర్తి అన్నట్టుగా, "కేవలగ్రంథస్థములు, ప్రయోగ శరణముగానే" ఉన్న ఈ గ్రాంథిక భాషస్థానే, "అపరిమిత ప్రయోజన మైన" వ్యావహారిక భాషను గ్రంథకర్తలు వాడుక చెయ్యాలి. అలా చేసినట్టాయెనా, "ప్రజలందరూ, నిరక్షరుడు ఒక్కడైనా లేకుండా ఎవరి వృత్తికి ఉపచరించే వృత్తులు వారు సులువుగా నేర్చుకొని, తెలివితేటలు గల వారయి, స్వతంత్రులయి, రాజ్యవ్యవహారముకూడా స్వయం నిర్వహించుకొంటూ వృద్ధి పొందడము" తథ్యమనే అవగాహన కొందరికైనా ఏర్పడుతున్న దిప్పుడిప్పుడే. భాషా విషయాలకూ ప్రజాజీవిత విషయాలకూ జీవసంబంధం ఉంది :

ప్రజల వాడుక భాషయొక్క ప్రయోజనములు అంగీకరించని పండితుల

చేతిలోనున్న అంకుశము తీసివేస్తేనేగాని, ప్రజల హక్కులను నిరోధిస్తూవున్న ప్రభుత్వము వారి చేతిలోని అంకుశమును లాగివేసిన ప్రయోజనముండదు.[3]

ఈ విషయాన్ని గతశతాబ్ది చివరి భాగం లోనే అప్పారావు గమనించి ఉన్నాడు. తన మహానాటకాన్ని వ్యావహారికంలో రాయడమిందుకే కావ్యభాషా సంస్కరణను కూడా ఉపలక్షించాడు. 1897 లో కన్యాశుల్క నాటకం మొదటి కూర్పుకు రాసిన ఉపోద్ఘాతంలో ఇలా గ్రాంథికాంధ్ర వచన, కవిత్వ భాషలను విమర్శించి ఉన్నాడు.

The Telugu literary dialect contains many obsolete grammatical forms, an inconveniently large mass of obsolete words and arbitrary verbal contractions and expansions which were necessitated by a system of versification based both on alliteration and on quantity. A license which!, no doubt, has its own advantages of introducing Sanskrit words to an unlimited extent has been but too eagerly availed of by poets who brought glossaries into requisition, revelled in fantastic compound formation, and made the Telugu literary dialect doubly dead...... If it is intended to make the Telugu literary dialect a great civilising medium, it must be divested of its Sanskrit elements, and brought closer to the spoken dialect from which it must be thoroughly replenished......

ఇలా విదియ నాటి నెలలా సన సన్నగా మొదలైన అవగాహన, 1909 లో ఆ నాటకాన్ని సరికొత్తగా మార్చి అచ్చు వేయిస్తూ పీఠిక రాసేనాటికి బాగా బలపడి వెన్నెలలు కురియ సాగింది. మెకెంజీ సేకరణల మొదలుగా, బ్రౌన్ కృషి ద్వారా వీరేశలింగం ప్రహసనాల వరకు వ్యావహారిక భాష పొందిన అభివృద్ధి గోచరించింది. వేదం వేంకటరాయశాస్త్రి నాటకాల పాత్రోచిత భాషకూడా మెప్పు పొందింది. నిర్బంధాలు బదాబదలై పోతున్నాయి. కావ్య భాషకూ, నోటిభాషకూ బాంధ్యవం బలపడుతున్నది. ఇంకా ఆ సగంచచ్చిన సంస్కృత సమాస భూయిష్ఠ శైలిని మెచ్చుకొనే వాళ్ళుంటే మెచ్చుకోనీ —

Let those who love fetters venerate it. My own vernacular for me, the living Telugu, the Italian of the East, in which none of us is ashamed to express our joys and sorrows, but which some of us are ashamed to write well...

వ్యావహారిక భాషలో ఉన్న సాహిత్యం, ఆంగ్లేయుడి గుండెను కదిపినా కదపకున్నా, రైతును మేల్కొలుపుతుంది. "దానిశక్తికి అపారం. అవకాశాలు అనంతం." ఈ వాక్యాలే 'నవీనాంధ్ర' భాషా మహోద్యమానికి స్వస్తి వాచకాలు.* అప్పారావిలా నొక్కి రాయడానికి ప్రోద్బలం ఈ నాటకం తొలి మలి కూర్పుల నడిమి కాలాన, కొత్త శతాబ్ది ఐదారేళ్ళప్రాయంలో భాషాబోధన పద్ధతుల విషయమై ఆంగ్లేయుడైన ఒకానొక విద్యాశాఖోద్యోగి చూపెట్టిన కొత్త దృక్పథమే.

జె. ఎ. ఏట్సు (J.A. Yates) ఇన్స్పెక్టరు హోదాలో విశాఖపట్నంలోని మిసెస్ ఏ.వి.యన్. కాలేజికి అనుబంధించిన హైస్కూల్లో తనిఖీ చేస్తున్నాడొక రోజున. తెలుగు పండితుని క్లాసుకు వెళ్లాడు, పాఠం విన్నాడు. గంటకు పద్యం ఒక్కటైనా పూర్తి కాలేదు సరిగదా, అందులో పదోవంతైనా కాలేదు. రెండు నెలల నుంచి చెబుతున్నా నాలుగు పద్యాలే అయ్యాయట! పదవిభాగం దండాన్వయం ప్రతి పదార్థం తాత్పర్యం, ఇది తంతులాగుంది. ఇంగ్లీషు చెప్పడమే సులువులాగుంది. కాలేజి ప్రిన్సిపాలు పి.టి. శ్రీనివాసయ్యంగారు కూడా సరైన వివరణ నివ్వలేక పోతున్నాడు. భాషా బోధనలో పశ్చిమ దేశాల విద్వాంసు లమలు పెట్టసాగిన నవీన పద్ధతులను ప్రవేశ పెడుదామంటే, తెలుగు భాషా పండితులకు గొంతులో వెలక్కాయ పడినట్లౌతున్నది. వీధుల్లో మనుషులు మాటాడే భాషగా

---

* ఆధునికాంధ్ర వచనశైలి విషయంలో అప్పారావు తనకు ఆదర్శంగా బెంగాలీ రచయిత టేక్ చంద్ పేరు స్మరించాడు. వంగీయ సాహిత్య పరిషత్తు వాళ్ళు ఆయనకు టేక్ చంద్ విశిష్టతను విశదపరిచారు. (గు. ర లే పు. 124 - 126)

టేక్ చంద్ బెంగాలీ వచనశైలిలో విప్లవం తెచ్చిన రచయిత. అసలు పేరు ప్యారీచంద మిత్ర (1814-1883), ప్రసిద్ధమైన పేరు టేకచాంద ఠాకూరు. రామమోహనరాయలతో స్వతంత్ర జీవికను సేకరించుకొన్న బెంగాలీ వచనం, దేవేంద్రనాథఠాకూరు, అక్షయ కుమారదత్తు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులద్వారా ఆధునికతను సంతరించుకొని. టేకచాంద ఠాకూరుతో వ్యావహారిక భాషకు సమీపంగా వచ్చింది. దానికి విశిష్టతను చేకూర్చింది మట్టుకు బంకించంద్ర ఛట్టోపాధ్యాయ (1838 - 1898). "గద్య ఎంత సుబోధకమైతే సాహిత్యం అంత ఉన్నతికి వస్తుంది. ఏ సాహిత్యం అయిదారుగురి కోసం మాత్రం వ్రాయబడుతుందో ఆ సాహిత్యం జగత్తులో ఎందుకూ పనికిరాదు," అన్నాడాయన. ఏకతార వాద్యం లాగుండిన బెంగాలీ వచనాన్ని బంకింబాబు వీణాయంత్రం కావించాడని రవీంద్రు డన్నాడు.

ఉత్తర భారత సాహిత్యములు : వంగసాహిత్య చరిత్ర : పురిపండా అప్పలస్వామి. పు. 77, 81 - 83.

పుస్తకాల్లోని భాషకూ సంబంధమే కనిపించడంలేదు. వాగ్వ్యవహార మొకటెన్నూ, గ్రంథభాష మరొకటెన్నూ. వీటి మధ్యగల అఖాతాన్ని పూడ్చాలి. లేకుంటే విద్య ప్రజా సామాన్యానికి తలకెక్కేట్టు లేదు.

గోదావరి, విశాఖపట్నం, గంజాం జిల్లాలు కలిసిన 'ఫస్ట్ సర్కిల్'కు ఇన స్పెక్టరుగా మొదట రాజమండ్రిలోను, తర్వాత విశాఖపట్నంలోనూ కార్యస్థానాన్ని పెట్టుకొన్న ఏట్సు, మద్రాసులోని పచ్చియప్ప కాలేజికి ప్రిన్సిపాలుగా ఉండి వచ్చాడు. అక్కడ తమిళమూ, ఇక్కడ తెలుగూ నేర్చాడు. ఇప్పుడు పి. టి. శ్రీని వాసయ్యంగారు చేసిన సూచన మేరకు పర్లాకిమిడి రాజావారి కాలేజీలో పనిచేస్తూన్న గిడుగు రామమూర్తినీ, విజయనగరం సంస్థాన వ్యవహారాల్లో "కుమ్మరిపురుగు వలె" వ్యవహరిస్తూన్న గురజాడ అప్పారావునూ కలిసి మాట్లాడి చూడమని సలహా చెప్పాడు. అది 1906 సంవత్సరం. అలా మొదలైంది ప్రభుత్వ విద్యాశాఖాధికారు లకూ, నవీనాంధ్ర భాషావాదులకూ లావాదేవీ. భాషాధ్యయన పద్ధతుల్లో కొత్త మార్గాల నవలంబించేందుకు విశాఖపట్నంలో ఒక సమాజం ఏర్పాటయింది. దానికి ఏట్సు అధ్యక్షుడు, శ్రీనివాసయ్యంగారు కార్యదర్శి. అలాగే విజయనగరంలో ఏర్ప డిన ఆంధ్ర భాషా సంఘానికి కాలేజీ ప్రిన్సిపాలు కిళాంబి రామానుజాచార్యులు అధ్యక్షుడు, గిడుగు రామమూర్తి ఉపాధ్యక్షుడు బుర్రా శేషగిరిరావు కార్యదర్శి. ఏట్సు పూనికతో 1907 నుంచి ప్రతి వేసవిలోనూ ఫస్ట్ సర్కిలు ఉపాధ్యాయ పరి షత్సమావేశాలు జరగసాగాయి. గిడుగు రామమూర్తి వీటికన్నిటికీ వెళ్ళి భాషా తత్వం గురించి, విద్యావిధానంలో రాదగిన మార్పుల గురించి ఉపన్యసించారు. ఇలా వ్యక్తులనుంచి సమావేశాల వరకు పయనించి వచ్చింది భాషా సంస్కరణ వాదం. 1910 వరకు విద్యారంగానికే పరిమితమై ఉండింది.

సరిగ్గా ఈ సమయానికే విద్యాప్రణాళికలో మార్పులు మొనజూపాయి. ఐదారేళ్ళ కిందటే (1905-6) దేశ భాషాబోధనపట్ల ప్రభుత్వ దృక్పథం మారింది. కర్జను (Lord Curzon)హయాములో విద్యావిధానాన్ని అంతటినీ పరిశీలించిన మీదట, ఆంగ్లభాషస్థానే దేశభాషలే విద్యాద్వారాలు కావలెనని ప్రభుత్వం తీర్మానించింది. లేకుంటే విద్యాభాగ్యం సమాజంలోని అట్టడుగు భాగాల వరకు విస్తరించేటట్టు లేదు. ఇంతవరకు విద్యాధికులు దేశభాషలను చిన్నచూపు జూచారు; ఇంగ్లీషుకే మనస్సు లర్పించుకొన్నారు; విద్యా విజ్ఞానాలను తమ కాణాచి జేసుకొని సామాజికాభ్యున్నతి విషయం పట్టించుకోకపోయారు. ఆధునిక విద్యా విషయ పరిజ్ఞానం దేశపురోగతి

మార్గం కాబట్టి, శాస్త్రీయ విద్యపై దృష్టిని కేంద్రీకరించవలసి ఉంటుంది. ఈ మార్పు భాషాబోధనను కూడా స్పృశిస్తుంది. దేశ భాషలలో ఆధునిక జీవనానికి ఉపయుక్తం కాగల పదజాలం ఉన్నదీ లేనిదీ తెలుసుకొని, లేనిపక్షాన సమకూర్చి పెట్టేందుకు పూనుకోవాలి. వ్యాస రచన, భాషాంతరీకరణ, అవశ్యం బోధనా ప్రణాళికలో భాగంకావాలి. అలాకానప్పుడు, గ్రాంథికాంధ్రభాష ఎటుపడితే అటు వంగకుండా బిర్రబిగిసి ఉన్నందుచేత విద్యార్థులనోటికి ఇనుపగుగ్గిళ్ళతిండి సమకూరి అసలుకే మోసంవచ్చే ప్రమాదం లేక పోలేదు. కాబట్టి విద్యాశాఖవారి దృష్టి భాషా విషయాలమీది కిప్పుడు ప్రసరించింది.

కన్యాశుల్కం తొలికూర్పు రచన వ్యావహారికంలో జరిగినప్పుడు గురజాడ అప్పారావు ఏకాకి. ఇప్పుడిప్పుడు మందిబలం సమకూరుతున్నది. తన చిన్ననాట వీరేశలింగం ఒక వైపు కొక్కొండ వేంకటరత్నం మరోవైపు చేరి "గజకచ్ఛపాల" చందంగా పోట్లాడుకొన్నది "తిమితిమింగలభాష" గురించే. దొందూ దొందే అయినా, వీరేశలింగం త్వరలోనే పాతరాతియుగాన్ని విడిచివచ్చి సులభ గ్రాంథికాన్ని చేబట్టటమేగాక తన ప్రహసనాలలో వ్యావహారికభాషను ప్రవేశపెట్టాడు. అభిజ్ఞానశాకుంతలం అనువాదంలో బెస్తవాని పాత్రకు సంస్కృత పద భూయిష్ఠమైన తేటగీతిని పెట్టినా, ప్రహ్లాదనాటకంలో పాములవాని పాత్రకు ఉచితమైన గ్రామ్యాన్నే పెట్టాడు. అయినా వావిలికొలను సుబ్బారావు, నాగిపూడి కుప్పుస్వామయ్య, కొక్కొండ వేంకటరత్నం తదితరులు ఈ మాత్రపు సడలింపుకూడా ససేమిరా కూడదన్నారు. అలాంటి స్థితిలో వేదం వేంకటరాయశాస్త్రి తన నాటకాలలో పాత్రోచిత భాషను ప్రవేశపెట్టడమేగాక, దాన్ని సమర్థించుకొన్నాడు కూడా. "పండిత" సాంప్రదాయానికి నిర్భేద్య "వజ్రకవచము"లా నిలిచిన కొక్కొండ వేంకటరత్నంతోటి వేంకటరాయశాస్త్రికి అక్షర ఘోరయుద్ధం మొదలైంది. వేంకటరత్నం శిష్యగణం నడుపుతూవచ్చిన 'కవిపండిత సంఘము'పై దాడిచేసి కోటలగలకెక్కి లోనదూరి ప్రతిపక్ష విధ్వంసనానికి పూనుకొన్నట్లు, "బళ్ళారి భవకవి పండిత సంఘంబు/మద్రాసులో రూపుమాపినాడు" అని తనగురించి ఒకనాటకపాత్ర చేత తానే చెప్పించుకొన్నాడు. 'గ్రామ్య' భాషగురించి వేంకటరాయశాస్త్రికి చిన్నచూపులేదు; కనీసం ఆ రోజుల్లోలేదు. జానపదవీరకథాగేయాలంటే చెవిగోసుకొనేవాడు. ఎటొచ్చీ, అవి నిర్బంధ పఠనీయాలు కాగూడదనే ఆయన పట్టుదల. ఇంతకూ 'గ్రామ్య'భాష పండిత లోకంలోకూడా ఏదోఒక రూపాన ఏదోఒకవైపాన ఆవరికే దూరిఉంది. వేంకటరాయశాస్త్రివంటి పండితులు దానికేదోఒక ఉపపత్తి



గురజాడ అప్పారావుగారు :

"మాతెలు క్కేడదండీ? చదువరి?"

విశ్వవిద్యాలయము వారు :

"మే మిప్పు డేమియుఁ జేయలేము."

(త్రిలింగ, సంపుటం 1, సంచిక 5. 1914 మే.)



కుక్క నడుము పటకా మీది అక్షరాలు: "గ్రాంధికము"

కుక్క తోక మీద అక్షరాలు: "సంధి, సరళాదేశము, అర్ధానుస్వారము, శకట రేఫము."

గ్రాంథిక వాది :

"మీ కష్టము లేదుగాని అయినను మీ పనికి అక్కఱకు వచ్చునేమో తోకవఱకు కోసి యిత్తును దీనిని పెంచుకొందురా ?"

రామమూర్తి పంతులు :

"పీకిపట్టుకు గోసెయ్యండి."

గ్రాంథిక వాది :

ఓహో ! మీ యత్నము సంస్కారమునకు గాదు. అసలుకే."

— త్రిలిఙ్గ, సంపుటము 1, సంచిక 7, 1914 జులై.

చూపిఉన్నారు. ఉదాహరణకు, *గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము*ద్వారా ఆయన చేసిన సిద్ధాంతం. "గ్రామ్యత్యాగి రూపకమే గ్రామ్యరూపకము,అశాస్త్రీయము, కురూపకము. గ్రామ్యగ్రాహియే అగ్రామ్యము,శాస్త్రీయము సురూపకము".కొక్కొండ పండితుని ఎడ్డెనికి వేదం పండితుని తెడ్డెం ఇది. ఇలా ప్రహసనాలనుంచి 'గ్రామ్య' భాషను రూపకాలవరకు స్వచ్ఛంద ప్రస్థానయోగ్యత కలిగింది. ఈ భాషకువ్యాకరణ మేదీలేదని చేసే ఆక్షేపానికిగూడా వేంకటరాయశాస్త్రి సమాధానమిచ్చాడు :

> సాక్ష్యమున కుందవలయునేని, ఆంధ్ర గ్రామ్యమునకు సి. పి. బ్రౌన్ దొరగారు, ఉదయగిరి శేషయ్యగారు, మహోపాధ్యాయ శ్రీ శేషగిరి శాస్త్రులవారును చేసిన లక్షణగ్రంథములు సాక్ష్యమున కున్నవి .. ఇవి సమగ్రలక్షణములు కావా ? వాల్మీకి సూత్రములపాటి, వరరుచి వ్యాకరణము పాటి, సమగ్రములే ఇవియు

నవీనాంధ్ర భాషావాదులలో ఇలా వేంకటరాయశాస్త్రికూడా ఒకడౌతున్నాడు. అందుకే గురజాడ అప్పారావుకు శాస్త్రిపై అంతటిగురి ! ఉదాత్త గంభీర భావాల అభివ్యక్తికిగూడా ఈ వ్యావహారికాంధ్రవచనం పనికిరాగలదని నిరూపించేందుకే, బిల్హణకవి కథను చేబట్టి వంపులుదీరుస్తూ సమకాలికమైన కొన్ని అనుభవాలను గ్రంథస్థంచేస్తూ అప్పారావు *బిల్హణీయం* రచింపబూనాడు. *కొండుభట్టీయం* హాస్యప్రధాన రచనేకాబట్టి దానిలో వ్యావహారికాన్ని ప్రవేశపెడితే ఏప్రత్యేకతా లేదు. ఈ కాలంలోనే వ్యాకరణ రచనవైపుకూడా మనస్సు మళ్ళింది. ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి 1909 లో ఒకలేఖరాస్తూ, నెల్లూరుజిల్లా వాడుకమాటలు, ముఖ్యంగా క్రియా భేదాలు విశేష్యాలలోని రూప భేదాలు తెలిపే పట్టికను తయారు చేసి పంపమని అడిగిందిందుకే. అలా ఆయన పంపాడుకూడా. అయితే అనారోగ్యం వల్లనూ, ఇతరవ్యాపకాల వల్లనూ ఈ పథకం మూలబడిపోయింది.

ఆ ఇతర వ్యాపకాలలో ముఖ్యమైనది సృజనాత్మక సాహిత్యకృషి. ప్రారంభ దశలో ఇంగ్లీషులో కవిత్వమ్ముక్కలు నాలుగు గెలికి రచనా సన్యాసం పుచ్చుకొన్న మనిషి ఆ తర్వాతికాలంలో మనీషి అయేంతగా మేధశ్శక్తిని పెంపొందించుకొన్నాడు. ఆస్థానంలో ఉన్న కవిపండితుల సహవాసదోషం వల్ల సమస్యా పూరణంవంటి 'క్షుద్ర' కవిత్వం వెలగబెడుతూ వచ్చాడేగాని, సాహిత్యాన్ని చేరబిలుచుకొని ఆదరించలేదు, రచయిత నౌదామనే తనకు కోరిక చచ్చింది. ఇప్పుడు వ్యావహారికోద్యమ ప్రభావంవల్ల తెలుగుకవిత్వం మళ్ళీ తనకు గుర్తువచ్చింది. అక్షరరాజ్యం

అరాచకంగా ఉందని తోచింది. గతానుగతికమైన కవిత్వం పండితాధీనమై ఉంటున్నది. "ఇక్కడ పండితుడైనంత మాత్రంచేత ఎవడైనా కవే" కాగలుగుతున్నాడు. 4 కావ్యశైలి సరేసరి, కొరుకరాని కొయ్య. ఇతివృత్తాలా, జీవిత వాస్తవానికి పుట్టి తల్లి మొక్కట్లుగల బిడ్డలు కావు; ప్రాచీన, పురాణ కథలకు చిలవలు పలవలుగా ఉంటున్నాయి. భావాల దారిద్ర్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. పట్టి వ్యుత్పత్తి ప్రతిభాశూన్యతకు మేలిముసుగో ముఖాచ్ఛాదనమో కాగలుగుతున్నది.

నాటకకర్తగా మట్టుకే స్మరణీయుడు కావలసిన వ్యక్తి, కవిగా ప్రాతఃస్మరణీయుడు కాగలిగినందుకు అనుకూలించిన ప్రతికూల పరిస్థితులు గురజాడ అప్పారావును అక్షరాలాకూడా "వాల్మీకి" నే చేశాయి. ఆ వల్మీకం నామమాత్రమయింది మాత్రమేకాదు. 1910 తర్వాత అరేళ్లకూడా జీవించని మనిషి ఈ కొద్దివ్యవధిలో పండితజన హూత్కారాల నుంచీ ఛీత్కారాలనుంచీ తప్పించి అతి కొత్తతెలుగు కవిత్వానికి ప్రాణదానం చేయగలిగాడు. ఇది తనజీవిత చరమ సంధ్యయని ఆయనకు తెలియకపోవడమే మంచిదయింది. ఆధునికాంధ్ర కవిత్వానికి అదే ఉదయ సంధ్య కూడా. ఇలా చూస్తే, నవీనాంధ్ర భాషోద్యమమూ నవ్య కవిత్వమూ అమడబిడ్డలే.

లోకముక్క శీర్షికతో 1910 జూలై నెల ఆంధ్రభారతి పత్రికలో ముత్యాలసరము అచ్చుపడింది లగాయితు, 1912 లోపల పరంపరగా ముత్యాల జల్లులాంటి నిసర్గసుందరమైన కావ్యసంతానం అనుక్రమించి వచ్చింది. భాష, భావం, ఇతివృత్తం, ఛందస్సు—అన్నిటా ఆధునికత. కలకత్తాలోని మోడరన్ రివ్యూ పంథాలో బందరు నుంచి వెలువడసాగిన ఈ పత్రిక "అప్పారాయోపజ్ఞమైన రస గీతాల"కు డోలిక. రచనలుపంపమంటూ సంపాదకులు కోరినప్పుడు. తనరచనలశైలి నవీనంకాబట్టి "మీరు ప్రచురించు నటులలే"దని ఆయనజవాబిచ్చాడు. కాని వాళ్లు పట్టు బట్టి దిద్దుబాటు కథను తెప్పించుకొని అచ్చువేశాక ఈ అనుమానం తీరింది. క్రమేపీ ఆయన ఆ పత్రిక 'లేఖకు'లలో ఒకడుగా ప్రతి సంచిక అట్టమీద కెక్కి కూర్చో గలిగాడు. ఇన్ని రచనలను వెంబడి వెంబడిగా రాసే తీరికా ఓపికా ఆయనకులేదని మనకు తెలుసు కాబట్టి, ఎంతో కొంత ముందుగానే వీటిలో కొన్నింటిని రాసి ఉంటా డని ఊహించుకోవసి వస్తుంది. ఎంత ముందని అనుకున్నా, 1906 కంటె వెనక్కు పోనక్కరలేదు. అప్పటికి భాష, ఛందస్సు, కవిత్వ ప్రయోజనం మొదలైన అంశాల గురించి ఆయన అభిప్రాయాలు పరిణతస్థితి పొందుతున్నాయి. సంకల్ప పూర్వకంగా గ్రాంథిక భాషాశబ్దాలను క్రమేపీ తన రచనలో దూరకుండా జాగ్రత్త పడుతున్నాడు. సంభాషణాచ్ఛాయలను కావ్యచరణాల కంటిస్తున్నాడు. ఆధునిక

జీవితానికి సంబంధించిన విషయాలను ఇతివృత్తాలుగా ఎన్నిక చేసుకొంటున్నాడు. ఇంతెందుకు, తెలుగు కవిత్వాన్ని చెడనలిగిన గాటినుంచీ డొంకనుంచీ తప్పించి క్రొత్తదైనా గట్టిదైన నేలపై కెత్తి రింపి నడుపుతున్నాడు. ముందుముందు ఈ అడవిత్రోవ ఘంటాపథం కాగలదని ఆయన ఆశించాడు. సమకాలికులు దీన్ని ఆనాడే గుర్తించక పోలేదు. ఉదకమండలంలో 1912 వేసవి దినాన అప్పారావు పరిచయం పొందిన పచ్చియప్ప కాలేజీ ఆంగ్ల సాహిత్యాధ్యాపకుడు పి. శేషాద్రి అప్పారావు రచనలను చదివి వాటి అందచందాలను వివరిస్తూ ఆంగ్లంలో ఒక విపుల వ్యాసంరాసి ప్రకటించాడు. ఆ వ్యాసం చివరివాక్యంలో రెండవ భాగం ఇది :

... Who will be so rash as to forecast the scope and significance of this movement which has the genuine ring of poetry and applies itself to the treatment of the primary emotions of humanity in a commendable spirit of high seriousness? [5]

నవ్యత అనేది అప్పారావు ఒక్కని కపోల కల్పితమేమీ కాదు కాలికమైన భావ నవ్యత అనేకానేకుల ఎదలలో రాపాడి కవిగట్టించింది. అయితే ఆ తదితరులలో కనిపించనంతటి విశదమైనచూపు అప్పారావులో కనిపిస్తుంది. అది సమకాలాన్ని మీరి, అజ్ఞాతంగా ఉండిన అప్పటి భవిష్యత్తును చీల్చి, స్పష్టాస్పష్టమైనా సరే ఒక స్థూలరేఖా చిత్రమైనాసరే ఇవ్వగలిగింది. ఇతరులది ఇంకా వెదుకులాట కాగా తనది స్థిమిత మనస్థితి అయింది. ఆ ఇతరులు గాకుండా, అప్పారావే నవ్యతను ప్రపంచించిన కవిగా గుర్తింపు పొందగలుగుతున్నది ఇందుచేతనే. పూర్వోదాహృత వ్యాసప్రారంభంలో శేషాద్రి రాసినమాటలను మళ్ళీ ఉల్లేఖించ వలసిఉంది:

A review of some of his recent productions must thus be of considerable value for a study of some of the possible developments of Telugu poetry in the future, and more generally, as affording an instance of literary evou ion, in obedience to external impulses of a powerful and desirable type in a country in which progress is retarded at every step by the purblind champions of conservatism, it becomes almost a duty to welcome such well-meaning reformers.

నవ్యత కాలవిశేషమేమీకాదు;భావ విశేషమే అది.గేయకథారూపంలో మాత్రాచ్ఛందస్సులో తెలుగువాడి గుండెగూళ్ళను కదిలిస్తూ దేశిసరస్వతిని భూగర్భపిస్మృతి నుంచి పండితజనాదరాదృతినుంచీ మళ్ళీ ఆవిష్కరించిన మనిషి,కాలికభావ స్రవంతిగా దానికి రూపు కల్పించాడు. ఇది పునరుద్ధరణకాదు – అభినవ కల్పన. శతాబ్దాల నుంచి

జాతి ఆదరిస్తూ వచ్చిన కవిత్వ పద్ధతులకు మళ్ళీ గౌరవాన్ని ప్రసాదించాడు. సామాన్య జనసంబంధంవలన వాటిక కలిగిన 'నీచత'ను తుడిచి వేశాడు. పలుకుబడిలోని దేశితనాన్నీ, పదాలకు జాతితోగల చుట్టరికాన్నీ కవిత్వం ద్వారా ప్రదర్శించాడు.

సంఘ సంస్కరణోద్యమాలన్నీ జాతీయ మహోద్యమంలో సంగమించి కోటినిధులు ధనుష్కోటిలో కలిసినవిధంగా, వెనకటి తమ విడివిడి మనుగడనూ లక్షణాలనూ కోల్పోసాగిన రోజులవి. తొల్లిటి తమ తీవ్రత, స్వచ్ఛత సన్నగిల్లుతున్న రోజులు. జాతీయవాదమే హైందవ పునరుద్ధరణోద్యమ స్వభావాన్ని అలవరచుకొని తిలక్, అరవిందఘోష్, బిపినచంద్రపాల్, లజపతిరాయ్ లాంటి ఉద్దండ పిండాల నాశ్రయించుకొంటున్నది. అయినా ఆ దినాళ్ళలోగూడా మంగిపూడి వేంకటశర్మ, చిల్లరిగె శ్రీనివాసరావు వంటి రచయితలతో చేతులు కలుపుతూ సంఘ సంస్కారోద్దేశాలుగల రచనలు చేశాడు అప్పారావు.

కన్యాశుల్కం నాటకంలోని నిగ్గే అశ్రుపూర్ణమైన పూర్ణమ్మ కథ. ఆడవాళ్ళకు, ముఖ్యంగా పసిపిల్లలకు ఉద్దిష్టమైన గేయాలలో ఇది ఒకటి. మగజాతి అనుకంపను సంపాదించినంత మాత్రాన స్త్రీజాతి దైన్యం తుదముట్టబోదు. దమితులే ఆత్మ విమోచనానికి ఆయత్తపడాలి. స్వేచ్ఛగానీ, సౌఖ్యంగానీ, సమానత్వంగానీ, మరొకరెవరో దయదలచి ఇస్తే పుచ్చుకొనే వరాలుకావు; పోరాడి వాదాడి గెలుచుకొని నిలబెట్టుకోవలసిన హక్కులు. ఈ విషయాన్ని కన్యకకథ నిరూపిస్తుంది. లవణరాజు కథ గాంధీశకానికి తొలి వెలుగురేక. అస్పృశ్యత దేహమాలిన్యాన్ని బట్టిగాక మనోమాలిన్యాన్ని బట్టివుంటుంది. గుణాన్ని బట్టి మాత్రమే కులం నిర్ణయంకావాలిగాని జన్మనిబట్టి వంశాన్నిబట్టి కాదని చాటుతుంది. తోకచుక్కను గురించి చేసిన రచన నవీన శాస్త్రవిహితమైన నాగరిక మనస్తత్వాన్ని "చన్నకాలపు చిన్న బుద్ధుల" వెర్రిమొర్రి విశ్వాసాలకూ భ్రాంతులకూ పోటీగా నిలుపుతుంది. మనిషి గురించి చేసిన మూడుచరణాల కావ్యం మానవీయ సిద్ధాంత పతాక. దంపతులమధ్య వుండవలసిన సంబంధం సేవ్యసేవక సంబంధం కాదని, "మగడు వేల్పన పాతమాట"ని మరొక చమత్కారభరితకావ్యం సిద్ధాంతం చేస్తుంది. తత్వం కొండ దిగివస్తుంది. జీవిత వాస్తవ దర్శనం తత్వం వైపుగా ఎదురు వెళ్లుతుంది; ఫలితం, జీవన నవీన తత్వ స్థాపన.

ఈ అభిరుచుల్లోనూ అభిప్రాయాల్లోనూ ఏ ఒక్కటీన్నీ అప్పారావు కొక్కనికే ప్రత్యేకమైనదికాదు. అయినా అనన్యస్ఫూర్తితో వాటిని కవిత్వమయంచేసి

వాటికి నిత్యాకర్షణనూ తనకు చరితార్థతనూ ఏకకాలంలో చేకూర్చుకొన్నా డాయన. అందుచేతనే సమాజంలోని అగ్నిహోత్రావధాని ప్రాత్రధారుల ఆగ్రహం ముఖ్యంగా ఆయన మీదికే మళ్ళింది. శేషాద్రి రాసినట్లు —

Numerous social principles, full of the liberal impulses of to-day are skilfully woven into the Poems of Mr. Appa Rao without the least detriment of their artistic merit. Orthodox Hindu sentiment may stagger at some of the radical ideas embodied in his Poems, but to the cultured mind they are significant of the new light that is illumining our social life, enabling us to perceive the wrongs of centuries... There is in the Poems a rude shock to popular sentiments as in the plays of Ibsen and Bernard shaw, but the effect must be whole some...

ఈ భావ విప్లవీకరణ రణరంగాన అప్పారావు ఏకాంగి వీరుడేమీకాదు. విపరకు, ఆయన పేరుతోటే ముడిబడి ఉన్న ముత్యాల సరాల ఛందస్సుకూడా. గారడివాని మామిడి మొక్కలా, శూన్యంనుంచి మొలకెత్తలేదు. పార్వీగజలు వాణీనిబట్టి రాసి వుండవచ్చుగాని, ఆంధ్రభారతి పత్రిక తొట్ట తొలిసంచికలోనే అచ్చుపడిఉన్న మేలుకొలుపు నడకకూ ఆటుతర్వాత అప్పారావు రాసిన తోకచుక్క నడకకూ చెప్పుకో దగిన భేదం కనిపించదు - పాదవిభజనలోని భేదమే భేదం. భావ సానురూపతకూడా కనిపిస్తుంది.

మేలుకొనుమీా ! భరతపుత్రుఁడ !
మేలుకొనుమీా ! సుజనమిత్రుఁడ !
మేలుకొనుమీా ! సచ్చరిత్రుఁడ !
మేలుకొనవయ్యా ! వత్సా ! మేలుకో !

జాతీయత అనే వేగుజుక్క పొడిచింది. వందేమాతరం కోడికూత అయింది. ఇక —

అల్లనను విజ్ఞానమనియెడు నట్టి యరుణోదయము నాయెను
చెల్లె నంతః కలహము లనెడు చీకటు లవెల్లన్. ॥
తరలి మూర్ఖాచారములనెడు తారకంబులు నస్తమించెను
సొరిది తూరుపు దిశను జ్ఞాన సూర్యుఁ డుదయించెన్. ॥

అంతటను నవశక్తి యనియెడు కాంతి పుంజము తేజరిల్లెను
మంతనంబున నూతనోద్యమ మూరుతము వీచెస ॥

అంటూ నవయుగ ప్రభాతాన్ని వర్ణించే ఈ గేయంలో కవిత్వానికి కావల సిన ముడిసరుకు మాత్రమే వుందిగాని, వాటి రంతటికీ ఒవరికళవంటి కావ్యగుణమే లోపించింది. అలాగే మహాత్మాంకనముకు శీర్షికతోటి చిల్లరిగె శ్రీనివాసరావు పంతులు రచించిన పద్యాలు, ఆ పత్రిక ఐదవ సంచికలో ఉన్నాయి కాబట్టి మరో నెల తాళిన పిమ్మట తన శ్లోకచుక్కను ప్రచురణార్థం పంపిన అప్పారావు పై పద్యాలను చూచివుంటారు.

చ॥ ధరణి కవగ్రహం బనుచు ధారుణి రాజులు చత్తురంచు నా
తరపడి కాకతాళముగ దార్కొను దానిని గట్టిపెట్టి పా
మరులు సరోషులై మిగుల మాటల నాడుదురయ్య నిన్ను వే
దిరముగ నీయథార్థగతి దెల్పెడు మార్గము లేద ఖేచరా !

వెనక పేర్కొన్న చాటువులో తోకచుక్కలకూ రాజుల చావులకూ ప్రజల మనస్సులలో స్థిరపడిఉన్న సంబంధాన్ని ఈ పద్యం తోసిపుచ్చుతున్నది. ఆ పత్రిక లోనే ఏడవ సంచికలో చెన్నాప్రగడ భానుమూర్తి రచించిన పద్యాలున్నాయి. ఆ నాటి కవులకు పురుషకారం గురించి ఉండిన ధీమా వాటిలో గోచరిస్తుంది. మేలు కీడూ కాలాన్నిబట్టిగాక, మానవ ప్రయత్నాన్ని బటి, నమకూరుతాయని తెలుసుకున్నవాళ్లు శుభాలు పొందుతారంటూ, "గత కాలము మేలనుమాట కల్లయౌ"నని ముందు చూపు చూస్తాడు కవి. "మంచి గతమున కొంచమేనోయి" అన్న గురజాడ అప్పారావు భానుమూర్తి కంటె భిన్నుడేమీ కాదుగాని అధికుడు. ఆయనది సర్వతోముఖమైన ప్రగతివాదం.

ఆదిమత్వం వల్లనే ఏ కవికిగానీ అగ్రతాంబూలం లభించదు. భావసారళ్యం, దర్శనవైశద్యం, అభిరుచి సున్నితత్వం, ప్రకటనా సూక్ష్మత్వం—కవిత్వ రామణీ యకత్వం—కవుల ఉత్తమాధమత్వాలను నిర్ధారించే ద్రవ్యాలు. గురజాడ గురుత్వ రహస్యం ఇదే. జ్ఞాన సూర్యరశ్మి రాలమీద రత్నాలమీదా ఒక్క చందంగానే ప్రసరిస్తుంది గాని పేటి అందాలు వాటివే.

# 2

నవ్యకవిత్వమూ నవీనాంధ్రభాషోద్యమమూ చెట్టపట్టాలు పట్టుకొని మునుసాగిన ఆ తొలి దినాల్లలో అప్పారావుకు తగిలినవి రాళ్ళేకాదు, పూలు కూడా. శతావధానులు వెక్కిరించారు; శతశ్లోకులైన పండితప్రభువులు దూషించారు. అయినా విద్యాధికారులు అభిమానించారు, సంస్కృతి పరులు అభినందించారు. సంప్రదాయం పేరు పెట్టుకొన్న గతానుగతికత్వం ప్రయోగపరతను విదిలించి కొడుతూంటే, ప్రయోగ సాహసికత్వం పేరిట నవత్వం ఛాందస శరత్వాన్ని రోయించుకొంది. నిజానికి, పాతకొత్తల మేలు కలయికకే అప్పారావు పూను కొన్నాడని ఎందరికో ఆనాడు తెలియదు. ఇంగ్లీషు చదువుకొన్న 'జెంటిల్‌మేను' గానే అప్పారావు ఆ రోజుల్లో పండితుల లెక్క. వ్యావహారిక భాషావాదులందరూ ఈ దూరుపడక తప్పలేదు. వేదం వేంకటరాయశాస్త్రి వచోధాటిలో వాళ్ళు తమ రూపే కోల్పోవలసి వచ్చింది.

> ....ఇటీవల రాఁగా రాఁగా ప్రాయికముగా సంస్కృత మెఱుఁగని కవులు, చదువని కవులు. సమాసమొల్లని వారు, అలంకారము నొప్పని వారు, యతిప్రాసల హితశత్రువులు, అక్షరద్వేషులు, ఔచిత్య బాహ్యులు – ఏవమాదులు వాగ్దేవికి ఈ చరమదశను సాధించినారు....6

జెరిమియాడ్ (Jeremiad) అని వర్ణింపదగిన ఈ దూషణ పద పరంపర తాకిడికి తట్టుకొని నవీనాంధ్రభాషావాదానికి సుస్థితిని చేకూర్చగల నాథుడవసరమయ్యాడు. ప్రామాణికతను చేకూరుస్తూ సాంప్రదాయమంటే తెలియపరుస్తూ దానికి వేళ్ళు దింపవలసివచ్చింది. భగీరథ ప్రయత్నమూ, భల్లూకపు పట్టూ కలగలిసిన ఒక మహావ్యక్తి కావలసి వచ్చాడు. అతనే గిడుగు పిడుగుగా పేరుబడిన జీ. వి. రామమూర్తి. 1911 వరకు పర్లాకిమిడి రాజా కళాశాలలో చరిత్రాధ్యాపకుడుగా పనిచేస్తూ వివిధ విద్యారంగాలలో అప్పటికే పేరుమోసి ఉన్నాడు. ఉపాధ్యాయ పరిషత్తులలో ఏట్సుకు కుడిభుజమై నిలిచి భాషాబోధనలో శాస్త్రీయమైన నవీన పద్ధతులను అవలంబించవలెనంటూ, విద్యా విధానంలో రానున్న మార్పుల సాఫల్యంకోసం నవీనాంధ్ర భాషలో వ్యాసరచన, భాషాంతరీకరణ జరగవలసిన అవసరం గురించి ఉపన్యసించి ఉన్నాడు. 1911లో ఉద్యోగం నుంచి విరమించాక, అహోరాత్రాలు ఈ భాషాశాస్త్ర పరిశ్రమ

సాగించాడు. కౌముది లాంటి సంస్కృత వ్యాకరణ సముద్రాన్ని అగస్త్యుడై ఆపోసన పట్టగాలేనిది చిన్నయసూరినీ, వెంకయ్యనూ ముగించడంలో ఉంటుందా? భాషా కురుక్షేత్రాన తాను గాండీవి. తాళపత్ర గ్రంథాలూ ప్రాచీన గ్రంథాలూ తన బాణాలు. ధ్వని శాస్త్రంలాంటి అధునాతన విషయాల పరిజ్ఞానం ఆయన దేవదత్తం. ఈ వాదానికంతటికీ నిమిత్తమాత్రుడైన ఏట్సు, గిడుగు పండితునిగురించి రాసినమాటలు స్మరణీయాలు: అంతటి పాండిత్యానికి చాదస్తం అంటగాలేదు. ఆయన తెలిపేటటువన్నీ పరమ నవీనమైనవి; అణగారి ఉన్న సామాన్య జనులయెడల సానుభూతి మాత్రమే ఆయన నీ మహోద్యోగానికి పూన్చింది: కందుకూరి వీరేశలింగం భాషలో మార్పు తెచ్చినా, గురజాడ అప్పారావు నాటక కథావస్తువును కూడా మార్చినా, ఇంతటి మహోద్యమానికి సారథిగా ఒక మహా పండితుడే కావలసివచ్చిందంటూ, ఏట్సు ఇలా రాశాడు :

> But what was wanted was a leader, one who would make incessant war on the forces of reaction; who was a fearless, watchful scholar, who could authoritatively counter, with chapter and verse, the contentions of his opponents; who had the scrupulous exactitude of the scholar; who was inexorable, yet fair and friendly in debate; who never let his enthusiasm for the cause override his zeal for the truth. Ramamurti was this leader that the scattered reformers looked for. [7]

గిడుగు ప్రభుశక్తికి గురజాడ ఉత్సాహశక్తీ అంతకంటే అదనంగా మంత్రశక్తీ తోడయ్యాయి. గిడుగు గాండీవికి గురజాడ కృష్ణుడు. జి. వి. అనే పొడి అక్షరాలు కూడా గ్రామ్యవాది రామమూర్తి గ్రామ్యవాది అప్పారావు అని ప్రతికక్షులు హేళన చేసేట్లు, ఇద్దరికీ ఒక్కలాగే అమిరాయి. ఆ ఇద్దరు కూడా ఏక లక్ష్యంతోనే పని చేసినట్లు, ఏట్సు రచన అచ్చుపడిన వ్యాససంగ్రహం లోనే మరొక వ్యాసక్రమంలో ఏ. గెలెటీ (A. Galleti) వివరించాడు: ఇటాలియన్ మహాకవి డేంటీ లాగా, మాతృభాషపట్ల అభిమానాతిశయం ఉన్నందుచేత, వ్యాకరణం ఒప్పుదలచేసిన భాషకంటె ప్రజల వ్యవహారంలోనిభాషే ఉన్నతమైనదని భావించారు. ఇలా భావించటానికి, ఈ భాష సహజమూ అకృత్రిమమూ సామీప్యం వల్లనూ ఉత్కృష్టత వల్లనూ ప్రేమపాత్రమూ కావడమే కారణమంటాడు గెలెటీ.

విద్యా ప్రణాళికలో 1910 నాటికల్లా మార్పు మొదలైంది. అంతవరకు ఉండిన మెట్రిక్యులేషను బదులు స్కూల్‌ఫైనల్ (S. S. L. C.), యఫ్.ఏ బదులు ఇంటరు (Intermediate) రానున్నాయి. విద్యాసంవత్సరం ఇదివరకటి మోస్తరుగా

జనవరి నుంచి జనవరి వరకు గాక, ఇప్పటి మోస్తరుగా వేసవి మాసాలైన జూన్ జూలైలనుంచి మరో వేసవి వరకూ ఉండబోతున్నది. పరీక్షలుకూడా మును పటిలా డిసెంబరులోగాక మార్చిలోనో ఏప్రిల్‌లోనో జరగ బోతున్నాయి. పై చూపులకు మాత్రమే తేలిక మార్పులుగా కనిపిస్తూ, భాషాబోధనకు సంబంధించి నంతవరకు పెనుమార్పులనే కలిగించాయి ఈ ప్రతిపాదనలు. ప్రభుత్వ విద్యాశాఖ వారు ఈ వరకే దేశభాషాభ్యసనం విషయంలో ఆంగ విద్యాధికులు చూపెడుతూ వచ్చిన అనాసక్తిని గుర్తించి ఉన్నారు. 1906 డిసెంబరు 27 న జి. వో. నం. 841 ఎజుకేషనల్‌లో ఇలా ఉంది :

The neglect of these languages by the ordinary university graduates of the present day is notorious. 8

ఈ శోచనీయావైఖరిని మార్చివేసేందుకు విద్యాశాఖవారు తలపెట్టిన బోధనా క్రమాన్ని అనుసరించేటట్లయితే, యస్.యస్.యల్.సి పరీక్షకు రెండవ విభాగం (part II)గా అనువాద రచన ఉంటుంది. వ్యావహారిక (నవీన) భాషలోగాని, గ్రాంథిక (ప్రాచీన–Classical) భాషలోగాని అనువాదంచేసేవీలు విద్యార్థులకు ఉంటుంది. స్కూలు ఫైనలుబోర్డు కార్యదర్శి జార్జిమెడాక్స్ (Gearge Maddox) పంపిన తాఖీదులను గమనిస్తే, ఈ విషయమై ఆదిలో బోర్డువారికే స్పష్టమైన అవగాహన ఉండినట్లులేదని తెలుస్తుంది. అయినా 1912 అక్టోబరు 29 నాటి తాఖీదు (నెం. 3479) 'నవీన' మంటే బోర్డువారు దేనినుద్దేశించారో స్పష్టంచేసింది:

By 'Modern' Telugu, the Board means language of the kind used in such books as Brown's *Reader*, the first part of Arden's *Telugu Grammar* and Enugula Veeraswamayya's *Kasiyatra Charitram*... 9

విద్యార్థులకిష్టంవచ్చిన ఏశైలిలోనైనా అనువాదం చేయవచ్చునని అనుమతిం చడం ఎన్నో చిక్కులకూ తబిశీళ్ళకూ దారితీసి 'తంటాల బేరం'గా పరిణమించింది. నవీనాంధ్రశైలినే ఎక్కువమంది అభిమానించారు. అది సులభం కదా మరి : దీనితో భాషా సంరక్షణకు పండితులూ, భాషాభిమానులూ కాసెలు బిగించి బరిలోకి దిగారు. ది హిందూ పత్రిక గోదాగా ఉపకరించింది. సంపాదకీయ లేఖలద్వారా వాదోప వాదాలుసాగాయి. హెడ్మాష్టర్లు, యం.ఏ.లు, మెడలిస్టులు, ఎందరో 'మల్లగూడాలు' పడ్డారుగాని వ్యవహారం ఎటూతెగలేదు. పరస్పరారోపణలు చేసుకొన్నారు. ప్రభుత్వ విద్యాశాఖాధికారులకు ఎక్కజెప్పి మచ్చిక చేసుకొన్నారని వ్యావహారిక భాషావాదు లను తద్విరోధులు అంటే, చివరకు మీ కన్నబిడ్డలనుగూడా వ్యావహారిక శైలిలో

రాయమని లోపల్లోపల పురమాయించి బయటికిమాత్రం గ్రాంథిక భాషాభిమానుల మంటూ డాబులు చూపుతున్నారని గ్రాంథిక భాషావాదులను ఇతరులు అనసాగారు. అవన్నీ పత్రికలకూ, పుస్తకాలకూ ఎక్కి ఉన్నాయికూడా. మెట్టుమెట్టుగా స్కూలు ఫైనలుబోర్డు విద్యార్థులకు అపరిమిత భాషాస్వేచ్ఛనిస్తూ రావడం ఈ వివాదాలను విరోధాలుగా మార్చింది. 1912 సెప్టెంబరులో వచ్చిన తాఖీదు ప్రకారం, స్కూలు అధికారులు తమ విద్యార్థులే శైలిలో అనువాదరచన చేయబూనిందీ తెలుపవలసి ఉంది. 1912 అక్టోబరు 29 నాటి తాఖీదు ప్రకారం, ఒక స్కూలులోని యావన్మంది విద్యార్థులు ప్రాచీన శైలిలోగాని, నవీన శైలిలోగాని అనువాదం చేయాలేగాని రెండింటిలోనూ కాదని తేలింది. 1913 జనవరి 10 నాటి తాఖీదు మరో అడుగు ముందుకు వేసింది: ఒకే విద్యార్థి వేర్వేరు శైలులలో రాయవచ్చును. ఒకే స్కూలుకు చెందిన విద్యార్థులుకూడా అలా చేయవచ్చును. ఇంతకూ, విద్యార్థులది ఇష్టారాజ్యమయింది; నవీనాంధ్రభాషోద్యమాన్ని బలపరిచిన మొనగాళ్ళంతా ఆదిలో విద్యార్థులేకావడం గ్రాంథిక భాషావాదులకు కన్నెర్ర కలిగించింది. కలవరపెట్టి వాళ్ళకు గంగవెర్రులెత్తించింది.

దీనికంతటికీ మూలమేమిటి? దేశభాషలలో గ్రాంథికం మడిగట్టుకొని వ్యావహారిక భాషను అస్పృశ్యంగా ఎంచుతూ రావడమే. రెంటిమధ్య ఉండేది వెర్రే కాదు, గండీ కాదు, ఒక అఖాతం: దీన్ని పూడ్చాలి. ప్రామాణిక (Standardized) భాష ఏర్పడాలి. గ్రాంథికం తన ప్రాచీనతనూ నన్నుముట్టుకోకు వైఖరినీ వదులుకోవాలి. భాషలో వచ్చిన మార్పులకు తలఒగ్గి తదనుగుణంగా వ్యాకరణాన్ని మార్చుకొని నోటిమాటల ప్రామాణికతను గుర్తించాలి. ప్రజలలో శిష్టులైన వారి భాష గ్రంథభాషకుగూడా తల్లి. సంధిసూత్రాలను బిగపంతులు శాపెనకే సడలించలేదా అంటే, అదొక్కటే చాలదు. అన్యదేశ్యాలను గ్రంథభాష స్వీకరించలేదా అంటే, నవీనయుగంలో ప్రజల నాగరిక జీవనానికి తగినంతగా గ్రంథభాష బహుముఖ్యమైన వ్యాపినీ, వైశాల్యాన్నీ, సంపుష్టినీ సంపాదించుకోలేదు. ఉన్న గ్రంథభాషకే మాట్లు వేసుకొని, బొంతకు అతుకులింకా వేసి, బాగుపరచుకోరాదా అంటే, అది అలా బాగుపడే దశ దాటి చిల్లులూ, చిరుగులూ పడిపోయింది. పూర్వ గ్రంథ భాష గౌరవింప దగిందే, అభ్యసింప దగిందే గాని అందరికీ అదే నిర్బంధం కాగూడదు. ఇలా సాగాయి వాద ప్రతివాదాలు.

శైలుల కొట్లాట అనదగిన ఈ వ్యవహారాన్ని ప్రారంభించింది (గ్రీక్పురాణ కథలు పేరుతో హాల్కారు టేంగిల్‌వుడ్ టేల్సు* కు సెట్టి లక్ష్మీనర

* ఇది మూలమనడం పొరబాటేమో? అమెరికన్ రచయిత హాథార్న్ (Nathaniel Howthorne) రాసిన The Tangle wood Tales మూలమనుకోవాలి.

సింహం చేసిన ఆంధ్రానుసరణ. అది వ్యావహారిక శైలిలో రాసిందేమీ కాదు. కాకుంటే సంధిని దాదాపు మొత్తంగా విసర్జించిన రచన. ఇది పాఠ్యగ్రంథ మైనప్పుడు జరిగిన రచ్చ ఇంతా అంతా కాదు. మాలినీవిజయము ద్వారా పండితుల మెప్పు పొందిన లక్ష్మీనరసింహమేనా ఇలా భాషను చెరపబూనింది: పండితుల కోపం ఆయనమీదికిగాక, ఆ పుస్తకానికి ఆంగ్లంలో పీఠిక రాసిన పి. టి. శ్రీనివాసయ్యంగారుమీదికి మళ్ళింది. అనరాని మాట లన్నారు: పొట్ట చేతబట్టుకొని తెలుగు దేశానికి వచ్చిన అరవవాడు; తెలుగు ముక్కా మొహమూ తెలియనివాడు! అప్పటికే అయ్యంగారు ఫెలో ఆఫ్ ది మద్రాస్ యూనివర్శిటీగా ఉన్నాడు. ఏట్సు నూరిపోసింది తలకెక్కించుకొన్నాడు. ఇప్పుడు గ్రాంథిక భాషకుగల "గాంభీర్యము, బిగువు, సాధుశబ్ద ప్రయోగము, జాతీయములు, వాక్య రమ్యత" 10 లను చెడగొట్ట బూనాడు. దేశ భాషలను నవీన మొనర్చాలంటూ, సజీవమైన వ్యావహారభాషా పరిణామ క్రమానికి గ్రంథభాష చేరువ కావలె నంటున్నాడు. సంధి సూత్రాలకు తలకొరివి పెట్టే విధంగా రాతలో ఏకపద సంధి మాత్రమే నిత్యముగాని వివిధ పదాలమధ్య సంధి అనావశ్యక మంటున్నాడు.

All people that speak any language use *Sandhi*, the degree of *Sandhi* or coalescence of words *depending upon the rapidity of utterance.*

But there is no reason for registering *Sandhi* in writing, seeing that each man will make his own *Sandhi* when he reads.

The only *Sandhi* that ought not to be given up in writing is what is called *internal Sandhi;* the unit of speech is the sentence, but the unit of writing is the word and whatever *Sandi* occurs *within a word* has to be recognised as fixed.

But the liasion of word with word is *justifiable only if* unintelligibility is the object of writing and the function of language to conceal thought. 11

అర్ధానుస్వారానికీ శకటరేఫకుగూడా అయ్యంగారు ఎసరుపెట్టాడు. ఇవన్నీ పండిత పుంగవుల పాలిటికి ఎర్రగుడ్డ పీలికలే. మద్రాసులో ప్రెసిడెన్సీ కాలేజి తెలుగు పండిత పదవిలో ఉండిన వావిలికొలను సుబ్బారావు విద్యార్థుల ఆంధ్రభాషాభివర్ధనీసమాజమువారి కోరికననుసరించి The Modern Telugu Prose-A Review అనే పుస్తకాన్ని ప్రకటింపజేశాడు. అయ్యంగారు చేసిన వాదాలను ఈకెకు ఈకె

పీకెను పీకెగా ఒలిచివేద్దామని పూనుకొన్నాడు. అందుచేతనే చాలాకాలందాకా నవీనాంధ్ర భాషావాదుల కోపానికి ఆయన అగ్గంకావలసి వచ్చింది.

తన విపరీత ప్రతిపాదనలవల్ల మాత్రమేగాక, మరొకపని చేసినందువల్ల కూడా, శ్రీనివాసయ్యంగారు నవీనాంధ్ర భాషావాదానికి పునాదిలోనే సంధికొట్టినంత పని చేయించాడు. లాంగ్‌మెన్సు (Longmans & Co) వారికి ప్రాక్టికల్ అరిథ్మెటిక పుస్తకం రాసిచ్చాడు, అది పాఠ్యం అయి పండితుల ఛిద్రాన్వేషణకు ఎంతో పనిబెట్టింది. ఈ పుస్తకంలో ఆయన అనవసరమైన చోట్లకూడా ఇంగ్లీషు మాటలు కుప్పించాడు. ఉదాహరణకు —

> 4 అంగుళముల హారిజాంటలు గీతగీయి. ఒక చివరనుంచి 2 అంగుళముల దూరమున 'పి' అనే పోయింటు పెట్టి అక్కడినుంచి 2 అంగుళముల వర్టికలు గీతగీయి. ఈ రెక్టాంగిలును పాళ్ళు చేయి. ఒక పాళ్ళలో ఎన్ని అంగుళము చదరములున్నవి? 80లో ఎన్ని సొలగలున్నవి? 12

విదేశభాషల నుంచి మాటలను అరువు తెచ్చుకోవడం గురించి అయ్యంగారికి సిద్ధాంతం ఒకటి ఏమంటే ఈ ఆదానం భాషను సంపన్నం చేస్తుందేగాని భ్రష్టుపట్టించదు అని. అయితే ఇలాంటి రచన భాషను ఎప్పుడూ భ్రష్టు పట్టిస్తుందని పండితులూ, పండిత పక్షపాతులూ అనడంలో వింతలేదు. వాళ్లు ఈ సంకర తెలుగును "తత్తర బిత్తర తెలుగు" అని వర్ణించడంలో తప్పుకూడా లేదు.

అక్కడితో శ్రీనివాసయ్యంగారు ఊరుకోలేదు. తన చేతనైన సమగ్రత పొందని నవీన భాషావాదాన్ని యథాశక్తి స్థాపిస్తూ ఇంగ్లీషులో LIFE OR DEATH? A PLEA FOR VERNACULARS అనే గ్రంథం వెలువరించాడు. 1906లో విద్యాశాఖవారు దేశభాషా నిరాదరణ విషయమై పట్టభద్రులను తప్పెన్ని ఉన్నారు. దానికి అయ్యంగారిచ్చిన వివరణ, సంస్కృత పదభూయిష్ఠమూ వ్యవహారచ్యుతి పొందిన శబ్ద సంక్లిష్టమూ అయి కావ్యభాష కొరకుడుపడకుండా వచ్చిందని మాత్రమే. పండితుడు విప్పిచెప్పందే ఏ మాటా బోధపడదు. మరి ఇలాంటి భాష మాతృభాషా? వాస్తవానికి మాతృభాష అనేది నిత్యవ్యవహారంలో వాడుకొంటున్నట్టిదే. గ్రంథాల భాష మృత భాషమాత్రమే. పాఠశాలల్లో బోధించవలసింది విద్యార్థులు అలవరచుకోవలసిందీ జీవద్భాషనుమాత్రమే. దాని ద్వారానే విద్యవలని సత్ప్రయోజనాలు సమాజాని కంతటికీ చెందగలవు. గ్రంథభాష పండితాధీనమై monopoly of the few గా మాత్రమే వుండగలుగుతున్నది.

పండితుల కిప్పుడు 'ఉగ్రమే' వచ్చింది. భాషా సంరక్షక సమాజాలు ఊరూరా వెలిశాయి. సభలు జరిగాయి. తీర్మానాలు నెగ్గాయి. నవీనాంధ్ర భాషా వాదులకు విద్యాశాఖ పెట్టనికోటకాగా, గ్రాంథికభాషా వాదులు రాజాలను ఆశ్రయించారు; 'ప్రజల'ను రెచ్చగొట్టారు; ప్రతికక్షులను దుయ్యబట్టారు. భాషా 'విప్లవం' జరుగబోతున్నట్లు బెదురు పుట్టించారు.

స్కూలు ఫైనలులో అనువాద రచనగురించే ఇంత దుమ్ము రేగితే, ఇక ఇంటరులో వ్యాసరచన గురించి లేచినదుమ్ము తెలుగు దేశాన్ని శ్రీకాకుళంనుంచి మద్రాసువరకు కమ్మివేసింది.

ఇంటరు పరీక్షలో వ్యాస రచన (Composition)కు ప్రామాణిక శైలిని నిర్ధారణ చేసే విషయమై 1910 జూలైలో మద్రాసు యూనివర్సిటీ సిండికేటువారు దక్షిణాది భాషలకన్నిటికీ కమిటీలు వేశారు. మొదట తమిళభాషకు సంబంధించిన కమిటీని వేసి దాని నివేదిక నాధారం చేసుకొని ఇతర భాషలకు కమిటీలు వేయవలెనని. దాని అభిప్రాయాలను ఇతరకమిటీలకు తెలియజేయవలెనని నిర్ణయించారు. తెలుగు భాషకు సంబంధించి ఏర్పాటైన కమిటీలో రావు బహాదూర్ యం. రంగాచారియార్ (సమావేశకర్త), కందుకూరి వీరేశలింగం, కొమర్రాజు లక్ష్మణరావు, పి. టి. శ్రీనివాసయ్యంగారు, పి. రామారాయణింగారు, రివరెండ్ జె. ఆర్. స్టిల్‌వెల్ (Rev. J R. Stilwell) సభ్యులు. ఈ కమిటీలు నెరవేర్చవలసిన పనులను సిండికేటు వారిలా నిర్వచించారు :

1. *To seek to establish a standard of colloquiality in Composition for each language* and to consider especially the following points :

   (a) The circumstances under which and extent to which the strict rules of grammar may be departed from, attention being paid, among others, to the questions of *Sandhi* and archaic forms.

*Note :-* The results of their labours might be set forth in a syallabus of the grammar of the language.

   (b) The extent to which *borrowed words* should be used, particularly words of Sanskrit, English and Urdu origin.

*Note :-* An attempt might be made to frame a list of desirable English and Urdu words, which list could be revised from time to time.

(c) The existence in each language of prose works which can be taken as *models of composition.*

*Note* :— Lists of such which could be revised from time to time might be drawn up.

ii. To consider the character of the subjects that should be set for vernacular composition, whether, e. g. Candidates may be asked to handle subjects connected with the sciences they study under the "Groups." 13

మధ్యలోవచ్చి అప్పారావు ఈ కమిటీలో ప్రవేశించాడు. అప్పటికే గుమ్మిడూరి వేంకటరంగారావు వచ్చిచేరి ఉన్నాడు. అప్పటివరకు యూనివర్శిటీ పరీక్షాధికారిగా మాత్రమే ఉంటూవచ్చిన అప్పారావు 1912 జనవరిలో యూనివర్శిటీ ఫెల్లో. కాగలిగాడు. గిడుగు రామమూర్తికి 'రావుసాహెబ్' బిరుదప్రదానంతోనే అందల మెక్కినంత సంబరపడిన అప్పారావు ఈ ఫెల్లోగిరీతో సంతృప్తిపడి ఉంటాడనుకో వచ్చు; ఇకముందు తన పేరుకు తోకగా Fellow of the Madras university (F. M. U.) ఉంటుంది. అలా ఉండిందికూడా. తెలుగువాళ్ళలో వీరేశలింగం 1898 లోనే ఆ గౌరవానికి పాత్రుడై ఉన్నాడు. అయితే 1904 కు ముందు ఈ ఫెల్లో లకు చెప్పుకోదగ్గ మన్నన ఉండేదికాదు. శక్తిసామర్థ్యాలనుబట్టిగాక, ప్రభుత్వాను గ్రహం లాంఛనప్రాయంగా ఈ రూపేణా వ్యక్తులకు చేజిక్కేది. అధ్యాపకులే ఫెల్లో లుగా ఉండాలనే నియమంగానీ, ఉండగల అవకాశంగానీ లేకుండేది. ఆ సంవత్సరం వచ్చిన ఇండియన్ యూనివర్సిటీస్ యాక్టు ప్రతి యూనివర్సిటీలోనున్నూ ఏబై మందికి తగ్గకుండానూ నూర్గురికిమించకుండానూ ఫెల్లోలుండాలని ప్రతిఫెల్లోకూడాయావజ్జీవం గాకుండా ఐదేళ్ళవరకే సెనెటులో సభ్యుడుగా ఉండాలని, కొందరిని ఫెల్లోలుగా ఎన్నిక చేసుకోవచ్చునని, మరింత వెసులుబాటు కలిగించివుంది. మరి అప్పారావునిలా ఫెల్లో చెయ్యడంలో, మార్క్ హంటరు రాసినట్లు, "ఏ రాజకీయపు కారణాలు లేవు కేవలం మీ పాండిత్యాన్ని ప్రతిభను పురస్కరించుకొని మిము నామినేటుచ్యాము"14 అనిగాక, ఏ లోగుట్టు ఉండిందో పెరుమాళ్ళకే ఎరుక. ఎలాగైతేనేం ఫెల్లోగిరీ ద్వారా సెనేటు లోనూ, తద్వారా ఈ ఇంటర్మీడియేటు తెలుగు కాంపోజిన్ కమిటీలోనూ సభ్యుడు కాగలిగాడు.

ఈ విషయాన్ని పక్కకునెట్టి నవీనాంధ్ర భాషావాదపు తొలికాకలో గురజాడా గిడుగూ సాగించిన కార్యకలాపాలను స్థూలంగానైనా పరిశీలించాలి. భాషగురించి

జరిగిన వాదోపవాదాలలో వాళ్ళకు తలలుదూర్చక తప్పిందికాదు. శశిరేఖ పత్రికలో లక్ష్మణరావు ప్రభృతులు రాసినలేఖలు చదివాక 1910 నవంబరులో *గ్రామ్యశబ్ద విచారణము* అని ఒక వ్యాసమే రాశాడు అప్పారావు. ఈనాటి కొమ్ములు తిరిగిన హేమాహేమీ పండితులుకూడా ప్రాచీన కవుల గ్రాంథిక భాషలో రాయ లేరని నిరూపించడమే ఆయన ఉద్దేశమైనట్లు తెలుస్తుంది. 'బాలకవి' భోగరాజు నారాయణమూర్తి పద్యాలలో 'గ్రామ్య' శబ్దాలను, వావిలికొలను సుబ్బారావు రామాయణానువాద రచనల్లో 'మ్లేచ్ఛ' శబ్దాలను ఎత్తి చూపినవాడు. లక్ష్మణరావు సారథ్యాన నడిచే విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలివారి ప్రచురణలలో కోకొల్లలుగా ఉన్న 'గ్రామ్య'శబ్ద కదంబాలను చూపడం అవలీల:

> మన ప్రాచీన కవుల గ్రాంథిక భాషలో రాయడమన్నది గరిడీ విద్య. భగవంతుడు కాళ్ళు ఇచ్చినందులకు సుఖంగా నడవక గెడలెక్కుదురు ఏమి చెయ్యను ?

గ్రాంథికంలో రాయబూనిన వాళ్లు "సలక్షణ" గ్రాంథికంలోనే రాయాలిగాని, అలా రాసి చూపగల వాళ్లు బహుసకృత్తు బ్రాహ్మణాదులైన శిష్టులు మాటాడే నాగరికమైన polite భాషను గ్రామ్యమని (Vulgar) నిందించడం, ఆ శబ్దాల అర్థాన్ని గౌరవించక పోవడమే.

వాడుక భాషలు : *గ్రామ్యము* అనేదీ ఇటువంటిదే. కృష్ణాపత్రికలో వ్యావహారిక భాషావాదులను పడదిడుతూ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి కొన్ని పద్యాలు ప్రకటించిన దరిమిలా, సదరుశాస్త్రి పద్యాలలోనే "చీకటి రాత్రిలో చుక్కలవలె" గ్రామ్యోక్తులు బహుళంగా మెరుస్తూ ఉన్నాయి కాబట్టి తన సర్వ చనం ప్రకారమే శాస్త్రి గ్రామ్యావలంబకుడైన "కూళ" గాక తప్పలేదంటూ చురక అంటించవలసి వచ్చింది:

> ఆనాడు శ్రీరాముల వారి బాణములు శత్రువులను కొట్టి తిరిగి శ్రీరాముల వారి చేతిలోకి వచ్చేవట. యీనాడు శ్రీరాముల వారైన సచ్చిదానందశాస్త్రిల గారి బాణములకు కూడా ఆ ధర్మం పట్టింది. ఒక విశేషంతో అనగా, వెయ్యగానే వెనక్కి తిరుగుతాయి శత్రువును ముట్టవు.

మూగదెబ్బలా లోలోపలనే సలిపే ఈదెబ్బ అవతలి మనిషిని రెచ్చగొట్టింది. "దిక్కుమాలిన" అప్పారావు హాస్యం బ్రహ్మాస్త్రం కంటె తీక్షణంగా పని జేసినట్లుంది. ఆకాశరామన్న బయల్దేరాడు. ఆకాశస్థానం నుంచి టపా పంపసాగాడు.

తుసటోయిన టపాకాయలా అప్పారావు అపహాస్యాన్ని మరింత రవ్విస్తూ వెనక్కు-చీది నపై ఆకాశరామన్న చేతులనే కాల్చింది. "బహుదొడ్డ మనిషి" అయిన ఆకాశ రాముల వారికి 1910 డిసెంబరు 29 న జవాబిస్తూ అందులో చివరకు చెప్పిన మాటలు—

> నా అంత మృదువుగా తప్పులు విజ్ఞాపన చేసేవాడు లేడని నా అభిప్రాయము. కోరి వెళ్ళి నేను తప్పులు పట్టలేదు. గ్రామ్య భాష దిక్కు-మాలిన స్త్రీ. ఆమెను పండితులు నిష్కారణముగా దూషించి అవమానించగా కనికరించి ఫీజు లేకుండా వకాల్తా పట్టితిని. సమయాసమయములలో ఆమెను అవలంబించినవారే తిట్టడము భావ్యం కాదంటిని. వకీలుకు యేమన్నా చెల్లుతుంది గాని, అంత అధికారముండే నేనేమంటిని? ఒక్క దూషణవాక్కు-పలకలేదే! పెన్ను మృదువు తప్పితినని నిందించుట మొగనిగొట్టి మొగసాలకెక్కిన రీతి నున్నది. ఆకాశ రామన్నగారు పేర్కొ-న్నవారలలో శ్రీ బ్రహ్మయ్య, సుబ్బారాయ పంతులుగారి యెడల నాకు భక్తి భావము కలదు. శ్రీ లక్ష్మణరావుగారు నాకు ముఖ్యమిత్రులు. వారి విద్యను, దేశాభిమానమును నే నెరిగినట్టు ఆకాశరాములు యెరగరేమో:...

—చాలా విలువగల మాటలేగాక అప్పారావు వ్యక్తి విశేషాన్ని వెలగట్టి చూపగల మాటలివి. తనతో భేదించిన వారిని గౌరవించడమునే పెద్దమనిషి తరహా అప్పారావు ముఖ్యగుణమని ఆయన చనిపోయాక మదరాసులో జరిగిన సానుభూతి సభలో ఒకరని ఉన్నారుకూడా.

అప్పారావిలా వ్యాస పరంపరను వెదలిస్తూ ప్రతిపక్షులను నిస్తేజులనుగా చేస్తూ ఉండగా గిడుగు రామమూర్తి ప్రచండ భార్గవుడై పరశు ధాటికి సమాయత్త మౌతూ ఉండేవాడు. 1911 తో ఉద్యోగ విరమణచేసి, "మా తండ్రిగారు రాత్రింబవళ్ళు పరీక్షకోసము చదివినట్లుగా తెలుగు సాహిత్య గ్రంథములు, వ్యాకరణములు దీక్ష వహించి చదివి నోట్సు వ్రాసి పెట్టుకొన్నారు."[15] లండన్ యూనివర్సిటీలో ఫొనెటిక్సు ప్రొఫెసర్‌గా ఉండిన డేన్యెల్ జోన్సు (Daniel Jones) చేత ఆ విషయమై ఉపన్యాస పరంపరను మద్రాసు యూనివర్సిటీ వా రేర్పాటుచేసినప్పుడు ఆ ఉపన్యాసాలకు తండ్రీ కొడుకులు కలిసివెళ్ళి విని నేర్చుకొనివచ్చారు (1912). విశ్వవిద్యాలయంలో దేశభాషలకు రీడర్లను (Readers) ఏర్పాటుచేస్తూ ఉండడం చూచి, అప్పారావు రామమూర్తిపేరు సూచించాడు:

> తెలుగుభాషను శాస్త్రీయ పద్ధతులమీద పరిశీలించానని ఇప్పుడు చెప్పుకోగల పండితుడు భారతీయుడుగానీ లేదా యూరోపియన్‌కానీ మన దేశంలో

కనిపించదు. ఒకేఒక శ్రీ గిడుగు రామమూర్తిపంతులు తప్ప ఈ విషయంలో నిర్దుష్టమైన ప్రామాణిక శాస్త్రపద్ధతులలో కృషిచేసిన పండితు డంటూ యింకొకడు లేడు. 16

అంతటిదీ గిడుగు రామమూర్తిపై అప్పారావుగురి. అయినా ఈ ఎత్తు పారలేదు. కట్టమంచి రామలింగారెడ్డి అడ్డుచెప్పినట్లు రామమూర్తి వయోధిక్య మొక్కటే అభ్యంతరమైనట్లు, పూర్వోదాహృత గ్రంథంలో డా॥ జి. వి. సీతాపతిగారు రాసి ఉన్నారు. పాశ్చాత్యదేశాలన్నీ తిరిగి శిక్షణ పొందవలసి ఉంటుంది గనుక వృద్ధులైన రామమూర్తిగారికంటే యువకులెవరైనా ఉంటే బాగుంటుందని రామలింగారెడ్డి వివరణ. చివరకు, ఆ పదవి విజయనగరం కళాశాలలో ఆంగ్ల భాషాధ్యాపకుడుగా ఉండిన గిడుగు శిష్యుడూ గురజాడ సహచరుడూ బుర్రా శేషగిరిరావుకు దక్కింది. గుడ్డిలో మెల్ల. అప్పారావు 'మంత్రశక్తి' అని పైన చెప్పిందల్లా ఇలాంటి తెరవెనక వ్యవహారమే. అంతేగాక పత్రికలకు లేఖలు రాసిపంపుతూ, ఆంగ్లేయోద్యోగుల మనస్సులలోనైనా ఇప్పటికీ నవీనాంధ్రభాషపట్ల సౌముఖ్యాన్ని కలిగించబూనాడుకూడా. కళాశాలల్లో మాతృభాషల అధ్యయనం గురించి 1910 జనవరి 4 న అప్పారావు తనకు రాసిన లేఖను ఇంగ్లాండులో సెక్రటరీ ఆఫ్ స్టేటుగా ఉన్న విద్వాంసుడు జాన్ మోర్లే (Lord Morley)కు పంపుతానంటూ గెల్లెటీ అప్పారావుకు రాశాడు. క్రమేపీ అప్పారావు గురించి గ్రాంథిక భాషావాద కూటమిలోని పండితమాన్యులకు గూడా సదభిప్రాయమే కలుగుతూ వచ్చిందనడానికి, మద్రాసులో వాళ్లు కొందరు ఆయనను కలిసి మాట్లాడ రావడమే నిదర్శన మనుకోవాలి:

> ఇన్నాళ్ళకి వాళ్ళు నన్ను గౌరవించడం నేర్చుకున్నా రనుకొంటాను.... నాతో కత్తులు దూయడానికి ఎవరూ తొందరపడడం లేదు. సంశయిస్తున్నారు. వ్యావహారిక భాషా ఉద్యమం సాధించిన పురోగతికి నేను పూర్తిగా సంతృప్తి పడుతున్నాను. 17.

సంతృప్తి! ఇది అల్ప సంతృప్తి కాకపోవచ్చుగాని అకాలతృప్తి. దానిని ప్రకటించిన మానసంరోజుల వ్యవధిలోనే అది అదృశ్యంకాక తప్పలేదు. ఈ వ్యవధిలోనే ఆంధ్ర సాహిత్య పరిషత్తు (ఆం. స. ప.) పడగెత్తి బుసగొట్టింది.

# 3

ఆంధ్ర భాషా మహాసంఘం ఒకటి రావలెనంటూ ఆంధ్రపత్రికలో జయంతి రామయ్య పంతులు రాసిన వ్యాసం అనేకుల కళ్ళబడి మెదళ్ళకు పని పెట్టింది. ఆ దినాళ్ళలో ఆయన మద్రాసులో ప్రెసిడెన్సీ మేజస్ట్రీటుగా పనిచేస్తూ ఉండేవాడు. తన అభిప్రాయాలు నచ్చిన నలుగురినీ కూడగట్టి మాట్లాడి సరే ననిపించాక ఇంగ్లీషులో ఒకవ్యాసం రాసి అచ్చుగొట్టించి దాని ప్రతులను పిఠాపురం, వేంకటగిరి రాజాలకు పంపాడు.

.... 1911 మార్చి 26....మధ్యాహ్నం రెండుగంటలవేళ....తేనాంపేట లోని పిఠాపురం సంస్థానం బాలూకు 'దనోమ్రి' మండపం తెలుగు పెద్ద తలకాయలతో కిక్కిరిసింది. వీరేశలింగం, వేంకటరాయశాస్త్రి, వావిలికొలను, కొమర్రాజు, చెన్నాప్రగడ భానుమూర్తి, గోటేటి కనకరాజు, పిఠాపురం దివాను మొక్కపాటి సుబ్బారాయుడు, అందరూకూడి మాట్లాడాక, సమగ్ర మైన తెలుగు నిఘంటు నిర్మాణంగురించి వీరేశలింగం చేసిన ప్రతిపా దనకు పిఠాపురంరాజా ధనసహాయం చేస్తానని మాటయిచ్చాడు. చిట్టచివరకు సూర్యరాయాంధ్ర నిఘంటువుగా వెలువడినదానికి బీజావాపం ఇదే.

భాషా సంఘనిర్మాణంగురించి మే 12 న మరొక సభ ట్రిప్లికేనులో హిందూహైస్కూలు భవనంలో జరిగింది. స్వయంగా రాజావారు అధ్యక్షత వహిం చారు. వేంకటగిరిరాజా ధనసహాయం చేస్తానని చీటీరాసి పంపాడు. బొబ్బిలిరాజా, సౌముఖ్యం కబురుచాడు. చల్లపల్లికుమారరాజా పిడుము జరుపూడు మునగాల పోలవరం భద్రాచలం మైలవరం జమీందార్లు విక్రమదేవవర్మ, వాడ్రేవు వేంకటకృష్ణారావు బహద్దరు, పానుగంటి రామారాయణింగారు — 'ప్రథమ సభ్యులు'గా చేరుతామన్నారు. ప్రభుత్వ ప్రాపకమో బిరుదులో సంపాదించు కొన్న ఘరానా వ్యక్తులొక పదిమందిదాకా ఉన్నారు. వారిలో 'ఆనరబిల్' (Hon'ble) బిరుదధారులు పిట్టి త్యాగరాయశెట్టి, మోచర్ల రామచంద్రరావు, జి. రాఘవరావు—అందరూ శాసనమండలి సభ్యులన్నమాట 'దివాన్ బహద్దరు'లు ముట్నూరి ఆదినారాయణయ్య, కంచి కృష్ణస్వామిరావు యస్. వి రామదాసు నాయుడు, 'రావుబహద్దరు'లు కందుకూరి వీరేశలింగం, బయ్యా నరసింహేశ్వర

శర్మ. ఒక 'రావుసాహెబు' టి. రాఘవయ్య. ఇతరులలో ముఖ్యులు జయంతి రామయ్య, వేదం వేంకటరాయశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం కొమర్రాజు లక్ష్మణరావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, జి. వి. రంగారావు, గోటేటి కనక రాజు, మొక్కపాటి సుబ్బారాయడు, రెంటాల వెంకటసుబ్బారావు, వేపా రామేశం, ఆచంట లక్ష్మీపతి, నెమలి పట్టాభిరామారావు, 'పండిత' పి. గోపాలాచార్యులు, వరహగిరి జోగయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు – గురజాడ అప్పారావు. 18

ఇన్ని పేర్లను గుదిగుచ్చడంలో ఒక ప్రయోజనముంది. జమీందార్లొకవంక భాషాపండితు లొకవంక పల్లకీ బోయీలు కాగా, జస్టిసు కాంగ్రెసు పక్షాలకు రెంటికిన్నీ త్వరలోనే మూలవిరాట్టులు గానున్న తెలుగు పెద్దలు పరిజనంకాగా, సంఘసంస్కరణకు అనుకూలురూ ప్రతికూలురూ పార్శ్వవర్తులుగా, ప్రభుత్వ భక్తులూ, జాతీయవాదులూ ధనుర్ధారులై రక్షణ ఇవ్వబూనగా, గ్రాంథిక భాషావాదం ఉత్సవ విగ్రహమై ఊరేగింపు మొదలైంది. అపూర్వమూ, అసహజమూనైన ఐకమత్యమిది. సంఘంలో ఇంకా పెత్తనం చేస్తున్న జమీందార్లు, భూస్వాములు; ఇప్పుడిప్పుడే అధికార ప్రాభవానికి నిచ్చెనలు వేసుకొంటున్న మధ్యమవర్గ వృత్తిజీవులు, ఉద్యోగులు; దేశభాషా పండితులు, రచయితలు – ఒక్కటయ్యారు. భాషాభిమానం వారినీ సంఘటనకు పురికొల్పింది. అంతకంటే నవీన భాషావాద ప్రాతికూల్యం అందరినీ ఒక్క చోటికి తెచ్చి నిలిపిందనాలి. మధ్యమ వర్గంలోనే రెండు కూటాలు: ఒకటి వెనకచూపు గలది, భాషా విషయాలలో మార్పునొల్లనిది; రెండోది జీవితం లోనూ సాహిత్యంలోనూ ప్రజాహిత వైఖరితో పనిచేసేది. ఈ రెండవ కూటా నికి చెందినవారే భాషా సంస్కరణనూ, విద్యా ప్రణాళికా సంస్కరణనూ అభిమానించిన కొద్దిమంది.

పిఠాపురం, వేంకటగిరి రాజాలు పదివేల రూపాయల మూలధనం ఇచ్చి "ప్రతిష్ఠాపకు" లయ్యారు వెయ్యేసి ఇచ్చినవాళ్లు "పోషకులు". నూటికి తక్కువగాకుండా యిచ్చినవాళ్ళు యావజ్జీవ సభ్యులు కాగలిగితే, సంవత్సర చందాలిచ్చిన సామాన్యులు సాధారణ సభ్యులే కాగలిగారు. అక్టోబరు 29 న పచ్చెయప్ప కాలేజిలో జరిగిన సమావేశంలో కార్యనిర్వాహకవర్గం ఎన్నికైంది: అధ్యక్షుడు జయంతి రామయ్య; కార్యదర్శిత్రయం పురాణం నాగభూషణం, వేదం వేంకటరాయశాస్త్రి, ఆచంట లక్ష్మీపతి; 'ట్రస్టీ'లు కంచి కృష్ణస్వామిరావు, పిట్టి త్యాగరాయశెట్టి. ఇలా వ్యవస్థాపితమైన ఆంధ్ర భాషా మహాసంఘం తన

పేరు మరిచిపోయి వంగీయ సాహిత్య పరిషత్తునడిగి ఆ పేరు తెచ్చి పెట్టుకొని ఆంధ్ర సాహిత్య పరిషత్తు (Telugu Academy) అయింది.....

దాదాపు ఈ సమయానికే ప్రభుత్వ విద్యాశాఖవారు "శృంగార" కావ్యాలపై ధ్వజమెత్తి ఆంధ్ర సాహిత్య పరిషత్తు (ఆం. స. ప.) నోళ్ళనూ, చేతులనూ మంచి పనిబెట్టారు. పుస్తక నిషేధంగురించి అప్పారావుకుగూడా అట్టే సదభిప్రాయం లేదు. ఈ విషయంలో గిడుగు రామమూర్తి తీవ్ర నీతివైఖరి అవలంబించారు. కావ్యాలలో శృంగారం అనే వ్యాసంలో అప్పారావు దృక్పథం వెల్లడిఅయింది: ఏ పుస్తకంలో నుంచిగానీ పదిబంతులు తీసి వాటిని "పచ్చి" శృంగారంగా ఎంచడం "అల్పదృష్టి". యూరపియన్ సాహిత్యంలోనూ శిల్పంలోనూ అగత్యంగా అలాంటివి కనిపించకపోవు. మైథునాన్ని మర్మావయవాలనూ వర్ణించడం ఆంధ్ర కావ్యాలకేపట్టిన సుగుణమేమీకాదు. బొకాచియో (Boccacio) రాసిన Decameron లాంటివి బూతుల బుంగలు. ఫ్రెంచికవులేకాదు, చాసరు (Chaucer) మార్లో (Marlowe) షేక్స్పియరు (Shakespeare) ప్రభృతి ఆంగ్లకవుల రచనలలోనే ఈ 'శృంగార' ఉల్బణం ఉంటున్నది. కాబట్టి ఈ అంశాలలో తెలుగు కవులను వేలెత్తి చూపే నైతికాధికారం మరి ఎవరికీలేదు. కాదంటే శృంగారానికి మరో ముఖంఉంది. వేదం వెంకటరాయశాస్త్రి [illegible], కందుకూరి వీరేశలింగం అనువదించిన ప్రహసనాలు, పరకీయా శృంగారానికి (ఇదే "నిజమయిన పచ్చి శృంగారమన్నది") స్థానం కల్పించాయి. ఒకరు భాషా సంస్కర్తలు, మరొకరు లాక్షణికాగ్రగణ్యులు: [illegible] రసికజన మనోరంజనములో స్త్రీ పురుష సంపర్కానికి తెరమరుగు దాపరికమటుంచి సిగ్గెగ్గుల చింతకూడా లేకుండాపోయింది. "ఇట్టి గ్రంథరచన లోకమునకు హానిచేయును. దీనిని నిలుపవలెనని మా మతము."

ఇంగ్లాండుదేశాన రెండవచార్లెసు (Cherles II) హయాములో కుప్పతెప్పలుగా ఉత్పత్తిల్లిన క్షుద్ర "శృంగార" రచనలను తలదన్నే విధంగా ఆంధ్రప్రబంధాలలోనూ ఆధునిక గ్రంథాలలోకూడానూ మట్టుదప్పిపోయి ఉన్న "శృంగారం" సామాన్య పాఠకులనూ విద్యార్థులనూ ఎలా ప్రభావితులను చేస్తుందనేదే ప్రశ్న. దీనికి జవాబు పుస్తకాలను నిషేధించడం మాత్రంకాదని అప్పారావు ఎంచాడు, వావిళ్ళవారి ప్రచురణలు కొన్నిటిపై ప్రభుత్వ విద్యాశాఖవారి శీతకన్ను పడినప్పుడు మదరాసులో జరిగిన ఒక సభకు అధ్యక్షత వహించి, తాము తీసుకోబూనిన నిషేధ

చర్యలు ఉపసంహరించుకోవలసిందిగా వారికి విజ్ఞప్తి చేశాడు. ఆం. సా. ప. ఇందు గురించి ఏర్పాటుచేసిన సంఘంలో అప్పారావు సాదాసభ్యుడేగాక, ఆ కమిటీ ఏక గ్రీవాభిప్రాయాన్ని అక్షరబద్ధం చేసింది కూడా ఆయనే.19 (ఎప్పైతేనేమి, విజయ నగర సంస్థానం పెద్దదావాలో సాక్ష్యం చెప్పడానికి విశాఖపట్నం వెళ్ళినప్పుడు వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రితో అప్పారావు కేర్పడిన పరిచయం క్రమేపీ స్నేహంగా మారి ఇప్పుడిలా పరిణమించింది. వావిళ్ళవారి ఆ పత్రకోటిలో తానొకడై ఆ ప్రచురణ సంస్థచేత మంచి పనులే చేయించాడు. ఉదాహరణకు, గురుజాడ శ్రీరామమూర్తిగారి *కవి జీవితములు* 1915 లో తిరిగీ అచ్చువేయించడం "సంస్కృతాంధ్ర భాషా విశారదులగు" అప్పారావు ప్రేరేపణపై జరిగినట్టు ఆ గ్రంథానికి ముందు 'ముద్రాపకుల విన్నపము'లో ఉంది.)

1912 ఏప్రిల్ లో ప్రథమ సాంవత్సరిక మహాసభ తదనంతర మే 15 న పచ్చియప్ప కాలేజిలో ఆం. సా. ప. ఆంధ్ర పండితసభ జరిపారు "శృంగారం" చర్చకు వచ్చింది. దాని గురించి ఒక తీర్మానం నెగ్గింది: శృంగారం ఉత్తమరసం. అలంకార శాస్త్రానుగుణంగానే కవులు దాన్ని పోషించారు. అశ్లీలాలుంటే అవి దోషాలే. అతివేలంగా "ఇంచుక నొక్కి" వర్ణించిన పట్ల "పండితైక వేద్యమగు ప్రౌఢభాష" ఉపయోగించబట్టి, ప్రజాసామాన్యం చదివినా బోధ పరచుకోలేరు, కాబట్టి చెడిపోయే సమస్యే లేనేలేదు. ఈనాడు భావాలలో మార్పు వచ్చింది కదా అని, పూర్వగ్రంథాలను మార్చబూనడం పరిమార్చ బూనడమే. "కాబట్టి పూర్వ కవికృత శృంగార ప్రబంధములు రూపుమాపుటగాని యందలి భాగములను లోపింప జేయుటగాని కూడదని యీ సభవారి దృఢాభిప్రాయము20."

అంతే, అక్కడితో ఆం. సా. ప. తోటీ, పండితసభతోటీ అప్పారావు ఏక వాక్యత కొసముట్టింది. మరురోజున వ్యావహారిక భాషా విషయం చర్చకురాగానే అభిప్రాయాలు స్పర్థించక తప్పలేదు. గ్రంథాలలో వ్యావహారిక భాషాప్రయోగౌచిత్యం, సంధి, అర్ధానుస్వార శకటరేఫలు, అన్యదేశ్యపద ప్రయోగం గురించి పొద్దున ఏడింటి మొదలు రాత్రి తొమ్మిదింటిదాకా ఉపన్యాసాలు వగైరా సాగాయి. గిడుగు రామమూర్తి రాసిపంపిన వ్యాసం చదివాక సభకు హాజరైన యాభై ముగ్గురు పండితులు మాట్లాడారు:

అంతట శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు వ్యావహారిక భాషలో గ్రంథములఁ గూర్చినఁ దప్పసవలదనియు నుత్తమజాతివారు సంభాషించు భాష

సకల జాతులవారును సద్భాషగా గ్రహించు వాడుక కలదనియు, ఇదివఱ కంగీకరింపఁ బడిన లక్షణము ననుసరించి గ్రాంథిక భాషను గ్రంథములు రచించుట ప్రాయశః సాధ్యముకానందున వ్యావహారిక భాషను రచించిన గ్రంథములు గూడ నాదరణీయము లనియు నుడివిరి. 21

దొరికిందే సందు అన్నట్లుగా వేదం వేంకటరాయశాస్త్రి, పురాణపండ మల్లయ్యశాస్త్రి, దివాకర్ల తిరుపతి శాస్త్రి ప్రభృతులు ప్రతివాదానికి తలపడ్డారు: ఉచ్చారణ సౌలభ్యలకోసం జనం లక్షణవిరుద్ధంగా మాట్లాడే "గ్రామ్యాన్ని" సంస్కరించి గ్రంథస్థం చేసుకోవాలి. గ్రంథభాష నోటిమాటల నీచస్థాయికి దిగి రాగూడదు. నోటిమాటలు సంస్కారంపొంది గ్రంథభాష స్థాయి నందుకోవాలి. అంటే, వ్యవహార సిద్ధమైన భాషను కృతకంగా పరివర్తన చేసుకొని గ్రంథాల కెక్కించి దానికి తాతాచార్యుల వారి ముద్ర వెయ్యాలి. శంఖంలో పోయాలేగాని, మురికి నీరు కూడా తీర్థ జలమౌతుంది!

పాడిదప్పిన ఈ పండిత ప్రవచనాలను విని సుప్రసిద్ధ వైయాకరణి పేరి కాశీనాథ శాస్త్రి దిగ్గున లేచి వేదికమీదికి వెళ్ళి పండితులు నిశ్శబ్దం భజించే విధంగా వారివాదాన్ని ఖండించాడు: సంస్కృతంలో వైదిక భాషకూ లౌకికభాషకూ వ్యాకరణ సిద్ధంగానే భేదం ఉంది. అలాగే తెలుగులో గ్రాంథిక వ్యావహారికాలమధ్య భేదాన్ని గ్రహిస్తేతప్పేమిటి? "గ్రామ్య" మనిపేరుపెట్టి వ్యావహారికాన్ని వెలిపెట్టకుండా, దానికీ ఒకవ్యాకరణాన్ని ఏర్పాటుజేసి తదనుసారంగా గ్రంథాలకెక్కిస్తేపోయేదిఏముంటుంది? ఈ మాటలు గాలిలో కలసిపోయాయి. వైద్యుడి పథ్యం రోగికి సరిపడలేదు. కాబట్టి సభాంతాన చేసిన తీర్మానాలలో ఈ సమరస ధోరణి కలికానికిగూడా కనుపించలేదు. ఆ వేళకు అప్పారావు సభలోలేకుండా పోయాడని మాత్రమే గమనించిన పండిత పత్రిక ఆం. సా. పత్రిక, పాండిత్యపు పసరంటే పండితులపస ఎక్కువైనట్లు గమనించలేదు. దేశయాత్ర పత్రికలో ఇందు గురించి అచ్చుపడిన ఒక వ్యాసభాగాన్ని అనువదిస్తూ వేంకటరాయశాస్త్రికి అప్పారావిలా రాయవలసివచ్చింది: (1912జూన్2)

> Where are the Pandits? I would like to see them of the persons who assembled at Pachayappa's I wonder how many deserve that name. 22

సన్నిధిలో ఎంతో సౌమ్యంగా కనుపించే వేంకటరాయశాస్త్రి సభలలో చండ భానుడేనని గమనించడానికి అప్పారావు కెంతోకాలం పట్టలేదు. నిడదవోలులో జరిగిన ఆం. సా. ప. సభలో ఆయన చేసిన ఉపన్యాసం గ్రామ్యాదేశ నిరసనము

(1912) గా పుస్తకరూపం ధరించి గ్రాంథిక భాషావాద శిబిరానికి ఆయనను నాయకుణ్ణి చేసింది. వీరేశలింగంవాహ్లికుడై వెనకవరసకుచేరిపోతున్నాడు. వేంకటరాయ శాస్త్రి భీష్ముడై కౌరవుల అక్షౌహిణులకు సేనాపతి అవుతున్నాడు. భీష్మాచార్యునితో యుద్ధంచేయడానికి పాండవులాకువృద్ధుని అనుజ్ఞను ముందుగా అర్థించిన చందాన ఎంత గౌరవభావమూ గురీ ఉన్నప్పటికీ, మీతోటి కత్తులు దుయ్యటానికి నాకు అనుజ్ఞ నివ్వండి, అంటూ శాస్త్రికి అప్పారావు రాసుకొన్నాడు. నిడదవోలులో శాస్త్రి ఉపన్యాసధాటి మార్గాంతరం చూపితేకదా ?

> ఈ నిర్బంధ గ్రామ్యము మన మత నౌక క్రిందదూఱిన టార్పిడో; లేదా దాని క్రిందఁ బొడచిన చిన్న బొక్క, క్రమ క్రమముగా పెద్దదగునది. మన మతమును కుమ్మరయావములో పైచిన గ్రచ్చకాయ. ఇది చల్లని కత్తి. తియ్యావి షము. 23

భాషా సంస్కరణకూ సంస్కరణవాదుల నాయకులకు గల జీవిత వైఖరి సమస్తానికీ సంబంధం లేకపోలేదు. ఆ విషయాన్ని వేంకటరాయశాస్త్రి గ్రహించి నంత సాకల్యంగా మరెవ్వరూ గమనించలేదు. భాషా సంస్కరణను కూడా బల పరచి యుండవలసిన వీరేశలింగం ప్రాణావసాన వేళకు కొద్ది ముందటి వరకూ సంఘ సంస్కరణను కూడా నిరోధించిన వారితో చెలిమి చేస్తూ వచ్చాడు. వేంకట రాయశాస్త్రి అన్ని విషయాలలోనూ యథార్థమైన 'కన్సర్వేటివ్': ఆంధ్రానికి బర్క్ (Edmund Burke) లాంటి వాడు; అగ్రవర్ణాల ఆధిక్యాన్ని రక్షింపబూను కొన్నాడు. ఆయన ప్రోద్బలంతోనే ఆంధ్రపండిత సభ ఒక్క తాటిమీదికి వచ్చి, "ఆంధ్రభాషా మాధుర్యమును, పావిత్ర్యమును, సమైక్యమును" ధ్వంసం చేస్తూ మతవిజ్ఞానాన్నీ ప్రాచీన నాగరికతనూ నిక్షేపించుకొన్న గ్రంథాల భాషను తెలుగు వారికి అందకుండా చేయజూస్తున్న వ్యావహారిక భాషావాదాన్ని నిరాకరించవలసిం దిగా అధికారులను కోరుతూ తీర్మానించింది. సంధిని తగ్గించవచ్చును గాని పద్య కావ్యాలలో విసంధి దుష్టమని చెప్పింది. అర్ధానుస్వారాన్నీ శకటరేఫనూ నిలుపు కోవాలని పట్టుబట్టింది. లక్షణభంగం కాకుండా భాషలో వైచిత్రిని చూపవచ్చును గాని లాక్షణిక మతానుసారమైన భాషనే ఉపయోగించాలి; అయితే శైలి మృదు మధురంగా ఉండాలని గ్రంథకర్తలను ఆదేశించింది. ఇకముందు పాఠ్యగ్రంథాలను ఎన్నికజేయడానికై విద్యారంగంలో అనుభవజ్ఞులనూ, పండితులనూ సభ్యులుగా జేసి ఒక కమిటీని నియమించడమే గాక వ్యాకరణ సూత్రబద్ధమైన భాషను వాడిన

గ్రంథాలనే పాఠ్యాలుగా చెయ్యవలెనని ప్రభుత్వాన్ని కోరింది. ఈ కోరికలన్నిం టినీ శ్రీశ్రీ గవర్నరు గారికి నివేదించేందుకని ఒక రాయబార వర్గాన్ని నియమిం చింది. ఆగస్టు 7 న తాత్కాలిక గవర్నరు కోక్‌బర్న్ (Cock burn) రాయబారులు చెప్పింది విని, "శృంగార" గ్రంథాలను హెచ్చువెలతో [illegible], గ్రంథా లయాలకున్నూ మట్టుకే విక్రయించేట్టయితే ప్రచురణ కర్తలపై చర్య తీసుకో బోమంటూ హామీ ఇచ్చాడు. "గ్రామ్య" భాష విషయంలో ప్రభుత్వం తటస్థంగా ఉండబోతుందని, పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘంలో తెలుగు మాతృభాషగా గల వారిని మరికొందరిని చెర్చుకుంటామని ఉపశాంతి చేశాడు

ఆం. సా. ప. విషయం పూర్తిగా జరగలేదు. డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్స్ట్రక్షన్ ఆల్ఫ్రెడ్ బర్న్ (Alfred Burn) పని పట్టించాలి. నవీనాంధ్రమనే పేరుతో పాఠ శాలల్లోకి ఎగబాకివచ్చుతున్న "గ్రామ్యాన్ని" తన్ని తగల వేయించాలి. సంతకాలు పెట్టించి మహజర్లు అందజెయ్యడమేనా, తీర్మానాలు చేయించ కాపీలు పంపడమేనా, ఎన్ని విధాల ఒత్తిడిపెట్ట వీలుంటుందో అన్ని విధాలా ప్రయత్నించింది. పదివేల మంది సంతకాలు పెట్టిన మహజరులో చెప్పింది గమనార్హం. తెలుగులో గ్రాంథిక భాష అనబడేది ఆ పండితులకుగూడా దురవగాహమేమీకాదు. పై వాదాన్నిబట్టి కొన్ని ప్రాచీన గ్రంథాలు అతి "ప్రౌఢము"గా ఉంటాయిగాని వాటిసంఖ్య కొద్ది. సలక్షణ భాషలోఉండీ సుబోధకమై ఉన్నవే హెచ్చు. తెలుగనేమిటి, ఏ భాషలోనైనా "ప్రౌఢకవులు కొద్దిమంది; చదివి గ్రహింపఁగలవారు పెక్కురు." మాతృభాషను పెడమొగంపెట్టి ఆంగ్లభాషనే ఒంటబట్టించుకొన్న ఈ కాలంవారికి సలక్షణాంధ్ర గ్రంథాలు ఇనప గుగ్గిళ్ళు కావచ్చుగాక, వీరికోసం భాషను మార్చడం సబబుకాదు. దేశాన్నిబట్టి మారవలసిన ఖర్మ గ్రాంథిక భాషకేంపట్టింది? ఇంగ్లీషులా తెలుగు మారాలనడం "అశాస్త్రీయము". ఇంగ్లండులోకూడా, గ్రాంథిక భాషా సంపర్కంచేత సంభాషణ భాష ప్రౌఢమైంది అంతేకాని సంభాషణభాష స్థాయికి గ్రంథభాష దిగి రాలేదు. సులభశైలిలో "ద్రాక్షాపాకమున" రాస్తూన్న నేటి గ్రంథకర్తల ధర్మమా అని, అక్షరాస్యుల సంభాషణస్థాయి ముందు ముందు ప్రౌఢం కాబోతుంది. అంతే గాక, ఎల్లవారికీ అన్ని ప్రాంతాలకూ తెలిసినది గ్రాంథికభాష ఒక్కటే. సంస్కరణ వాదుల గ్రంథాలేగనక ప్రచారంలోకివస్తే, ఇప్పటి మహామహా తెలుగు పుస్తకాలన్నీ ముందొకనాటికి తెలుగువారికి దురవగాహమై పోగలవు :

మీఁదఁ గనపఱచిన హేతువులంబట్టి యీ యపూర్వ సంస్కారవాదుల వాదమును నిషేధించి వర్తమాన మర్యాదానుసారముగా సలక్షణభాషనే రచింపఁ

బడిన గ్రంథములను మాత్రమే పాఠశాలలయం దుపయోగించునట్లును, తదితర గ్రంథముల నుపయోగింపకుండునట్లును శాసింప వలయునని దొరతనమువారి నిందుమూలముగా మరిమరి వేడుచున్నారము. 24

రాయబారం ఫలించి టెక్స్టుబుక్ కమిటీలో వెనువెంటనే జయంతి రామయ్యకూ, వావిలికొలను సుబ్బారావుకూ స్థానం లభించింది. ఏట్స్ వర్ణించినట్లుగా, ఏ. పి. ఐ. అనుమతి కోసం వచ్చి చేరిన పుస్తకాలను తైపారువేసి వ్యావహారిక వాదిష్ట కొన గాలులనుకూడా పట్టి గేలిచేస్తూ ఆ పుస్తకాల పాలిటికి సైంధవుళ్లై అడ్డుతగలడమే ఈ ఇద్దరి పనిగా మారింది. వ్యావహారిక భాషావాదులు చేతులు గట్టుకు కూర్చున్నా రనికాదు. సెనేటు సభ్యుడైన మిడిల్ మూస్ట్, 'లా' సెక్రటరీ సర్ హెరాల్డ్ స్టువర్ట్, విద్యావేత్తలయిన లాసన్, యంగ్ ప్రభృతి ఆంగ్లేయులను కలిసి తమ వాదంలోని సబబును విప్పిచెప్పి ఒప్పిస్తూ వచ్చారు. మార్క్ హంటరును సెనేటుకు గెలిపించారు. గవర్నరు విశాఖపట్నం పోయినప్పుడు ఏట్స్ సూచన ప్రకారం గిడుగు, గురజాడ, పి. టి. శ్రీనివాసయ్యంగారు కలిసి మాట్లాడారు. అయితే పదివేలమంది దస్కత్తులు పోగుచేసిన కౌరవబలంముందు తామేపాటి? పరిషత్తు మహాజనులో సగర్వంగా చెప్పుకొన్నది నిజమే—"రెండుకోట్ల కధికమగు నాంధ్రులసంఖ్యలో" ముగ్గురో నలుగురో అయిన నవీనాంధ్ర భాషావాదులు "అణుమాత్రం." అయినా వీరి వాదంలోని బలం పాశ్చాత్య విద్యావంతుల మది కెక్కింది గనకనే రెండుమూడేళ్ళమేరకైనా ప్రభుత్వమూ విద్యాశాఖాధికారులూ గట్టిగా ఎదురొడ్డి నిలవగలిగారు. అతి నెమ్మదిమీదనైనా దేశీయులలో చూపరుల ఆదరాభిమానాలు తమ ఉద్యమానికి చేకూరసాగాయి. కాకినాడ, మచిలీపట్నం వంటి స్థలాలలో అభిమానం ననలు వేస్తున్నది. "అవహేళన దశనుంచి ఉద్యమం సానుభూతిని పొందే దశకు పరిణతి చెందుతున్నందుకు సంతోషం. మీరు ఎదుర్కొనవలసిన ప్రతిఘటన సామాన్యమైనది కాదు" అంటూ ఏట్స్ అప్పారావుకు రాసిన లేఖాంశం ప్రత్యక్షరసత్యమే. 25.

తొలిరోజుల్లో విజయనగరాన కూడ వీరికి పూర్తి మద్దతు లేకపోయింది. తెలుగుభాషా మాధుర్యమును చెడగొట్టదలచినారా ఏమిటని కిడాంబి రామానుజాచార్యులవంటి విద్యావేత్త ఈ ఉద్యమాన్ని అపార్థం చేసుకొన్నాడంటే యనమండ్ర నారాయణమూర్తి లాంటి క్షుద్రవాళ్ళమాట చెప్పేదేముంది? పరిషత్ మహాజనుపై సంతకాలు కూడబెట్టి అప్పారావు కోపానికి అగ్గమయ్యారు. కలకత్తానుంచి అప్పారావుకు రాసిన లేఖలో నారాయణమూర్తి చెప్పిన సంగతులను బట్టి, అప్పారావంటే

భయంవల్లనో భక్తిచేతనో స్థానికులు కొందరు సంతకాలు చేయ జంకారని, ఇరుపక్షాలుగా చీలి మాటకుమాట రెట్టించుకొన్నారని తెలుస్తుంది. నారాయణమూర్తి ధిక్కారవైఖరి నవలంబించి ఇలా రాశాడు :

> మీరు మద్రాసులో బొడిచే పొడుపుకై యెదురు చూచుచున్నాను. రామయ్యను రెండు సంగతులలో గెల్చుకొందురు. కాని మెమోరియల్‌లోని విజ్ఞప్తి న్యాయము కాదని వాదించిరేని యాంధ్ర ప్రపంచమంతయు మీ తోకకు తాటాకులు కట్టక మానదు. ఒక్క శుభ (మీకశుభ) వార్త తమకు విన్నవించ వలసి యున్నది. శ్రీశ్రీశ్రీ విజయనగర మహారాజావారు మాపక్షము !!! ఇప్పుడు మా బలమొక్కమారు తలచుకొండి.

రీవారాణి చనిపోయి ఏడాది నిండలేదు. సంస్థానం తనను తోసి వెయ్యబోతున్నదా ? తన కాలికింది నేల కదులుతున్నదా ? ఇది తన ఇంటి వ్యవహారం కాదు, దేశ సమస్య. మిత్రులు శత్రువులైపోయినా, పోషకులు మొండిచెయ్యి చూపినా, ఇందులో లొంగుబాటు లేదు సరిగదా, రాజీకూడా ఉండబోదు. బొంబాయి నుంచి కాశీనాథుని నాగేశ్వరరావు సమరస మార్గాన్ని చూపెడుతూ ఉత్తరాలు రాస్తున్నాడు. కాని, సామరస్యానికి ఇదేమి సొంతపనా ? విద్యద్వారా సమాజమంతా నాగరికం కావడమో లేక యథాపూర్వంగా పండితవ్యవస్థ కొనసాగి ప్రజలకు నోరూవాయీ లేకుండా సంస్కృతి కొందరి కాణాచిగా పడి మూలుగుతూ ఉండడమో – ఇందులో సమరసానికి తావేది ?

విశ్వవిద్యాలయంలో సంస్కృత, మాతృభాషల అధ్యయన విషయమై భారత ప్రభుత్వం ఇవ్వబూనిన 'గ్రాంటు'ను వినియోగించు కోవలసిన పద్ధతులను గురించి, సిండికేటు సభ్యుడైన జస్టిస్ పి. ఆర్. సుందరయ్యరు కోరికపై అప్పారావు తయారుచేసిన నివేదికనిండా ఈ భాషా యుద్ధ ఛాయలు కమ్ముకొని ఉన్నాయి : శాస్త్రీయ పద్ధతులలో భాషలను నేర్పాలీ అంటే జీవద్భాషలతో మొదలెట్టాలి. ప్రజలను విద్యావంతులుగా చెయ్యాలీ అంటే మాతృభాషను శాస్త్రీయ పద్ధతులపై పెంపొందిస్తూ స్వతంత్ర సాహిత్య సృజనను ప్రోత్సహించాలి. ఉపాధ్యాయ శిక్షణతోబాటు నిఘంటు నిర్మాణానికీ సమీప ద్రావిడ భాషాధ్యయనానికీ ధనాన్ని కేటాయించాలి. ఆధునిక భాషాధ్యయన పద్ధతులకు పండిత వ్యవస్థ సమ్మతించదు. జీవద్భాషకూ, గ్రాంథికభాషకూ అంతరమెంచకుండా "రొడ్డకొట్టుడు" చదువులే చెబుతూ ప్రతిభను కుంచించి బుద్ధిమాంద్యాన్ని కలిగిస్తూ సాహిత్య

సృజనలో మందకొండితనాన్ని ప్రోత్సహిస్తున్నారు. వీరిలో "పాండిత్యానికి కావల సిన ఆధునిక విజ్ఞానం మృగ్యం." కావ్యభాషను బోధించడానికి, అధ్యాపకులకు కావలసింది ఒక్క పాండిత్యమేకాదు. విమర్శచేసి విడమర్చేశక్తి, పరిశోధనాశక్తి ఉండాలి. వ్యావహారికానికీ కావ్యభాషకూ మధ్య వీరాంజనేయులుకూడా దాటజాలని అఖాతమొకటి ఉండబట్టి, మాతృభాషాబోధన సంస్కృతి శూన్యులైన "మిడిమిడి జ్ఞానం గల మహామహుల" చేతుల్లోబడి విద్యార్థులకు శిరోవేదనగా పరిణమిస్తున్నది. పండితులకు మృతభాషగురించి తెలిసినంత జీవద్భాష గురించి తెలియదాయె! ఆ మృతభాషలోనైనా కృతకమేదో ఏదికాదో తెలియని "దిక్కుమాలిన అవస్థ" ఎదురౌతున్నప్పుడు, నానార్థాలు చెబుతూనో ప్రామాణికాలుగాని వ్యాకరణాల సూత్రాలను వల్లెవేస్తూనో నెట్టుకుపోయే అధ్యాపకులు భాషనెలా ఉద్ధరించగలరూ, పుష్కలమైన సాహిత్య సృజనకెలా ప్రాతిపదిక సమకూర్చగలరు? కాబట్టి విశ్వ విద్యాలయంలో తెలుగు పరిశోధనకు ఫెలోషిప్పులూ, స్కాలర్‌షిప్పులూ ఏర్పాటు కావాలి. అధ్యాపకులకు ఆధునిక పాశ్చాత్య పద్ధతులు ఒంటబట్టించాలి:

> మాతృభాషలను బోధించే వారి, రూపొందించే వారి భుజస్కంధాలపై నేడు మహత్తరమైన బాధ్యతవుంది. ఈ సత్యాన్ని వారు గ్రహిస్తారని నేనాశి స్తున్నాను.

అప్పారావు తయారుచేసిన యీ నివేదికలోని సూచనలెలా అమలు జరిగిందీ హావిశ్వవారి పత్రిక (1933) ఒక వ్యాస క్రమంలో వివరించింది. మృత, జీవద్భాష లను రెంటినీ బోధించగల సమర్థుడైన పండితుణ్ణి ఏ జర్మనీ దేశంనుంచో తెచ్చి భాషాచార్య పదవిలో నియమించమని అప్పారావు అడిగాడు. సంస్కృతం, దానికి సంబంధించిన ఇతర భాషల తత్వ పరిశోధనకు ఇంగ్లాండునుంచి డా. కాలిన్సును తెచ్చి నియమించారు. ద్రావిడ భాషల తత్వాన్ని పరిశోధించడానికి రీడర్లను నియ మించారు. కాలిన్సు "చేతిక్రింద" నలిగిన తర్వాత వీరిలో ఒకరిని యూరపుకు బంపించి శిక్షణ నిప్పించి "ద్రావిడ భాషాతత్వజ్ఞ పదవి నధిష్ఠిమ్పఁ జేయుదురు." ఆంధ్రేతరుడెవరో ఆంధ్రభాషా తత్వాన్ని పరీక్షించవలసిన "దుర్గతి యేల?" అని అప్పారావు ప్రశ్నించాడు. కనీసం "తెలుఁగు చదువరిని నిర్ణయించెడు పని సగౌర వముగ ఆంధ్ర సాహిత్య పరిషత్తున కొప్పగింపుమని కోరిరి." ఆ కోరిక నెరవేరిందికాదు. 26

అధ్యాపకులనుంచి ఉన్నత ప్రమాణాల నాశించిన అప్పారావే విద్యార్థులను మరింత పకడ్బందుగా తీర్చిదిద్ద బూనాడు. పరీక్షాధికారిగానూ, ప్రశ్నపత్రకాటుడు

గానూ ఆయన చేసిన పనులే ఋజువుకు సాక్ష్యాలు. [illegible] పు. 61-68 మధ్య అచ్చుపడివున్న ప్రశ్నపత్రాలను గమనించిచూస్తే (1912) విద్యార్థుల సాహిత్య జ్ఞానాన్ని పెంపొందించేందుకు విమర్శదృష్టికి పదునుపెట్టేందుకే ఆయన [illegible]డని తెలుస్తుంది. వసుచరిత్రముపై ఆయన వేసిన ప్రశ్నలు విద్యార్థుల కేమనిపించాయో తెలియదుగాని పండితులకుగూడా మార్గదర్శకాలైనట్లు వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి రాసిన వసుచరిత్ర విమర్శనము (1915) ఉపోద్ఘాతాన్నిబట్టి తెలుస్తున్నది. ఈ ప్రశ్నలు "విమర్శన యోజనములయి గ్రంథ విమర్శనమునకు దారిచూపుచున్నవి" అని ఆయన రాశాడు.

భాషాయుద్ధ కథలో రాయబార ఘట్టం అలా ముగిశాక, ఇరుపక్షాలు కత్తులు నూరుకొంటూ రాగల యుద్ధానికి సన్నాహాలు చేసుకోసాగాయి. ఈ లోపల పరస్పర నిందారోపణలూ, నిష్ఠురోక్తులూ ఆయుధాలకు మారుగా [illegible]. ప్రభుత్వాధికారులకు పండితులపై లేనిపోని నేరాలు ఆరోపించి చెప్పి గ్రాంథిక భాషా వాదులను ప్రభుత్వంవారు రాజద్రోహులుగా పరిగణించి శిక్షించబోతారని భీతాహం కలిగించి తమ వాదం నెగ్గించుకో జూస్తున్నారని జయంతి రామయ్య, వేమవరపు రామదాసులవంటి పెద్దమనుషులే తమ ప్రత్యర్థులపై నింద మోపారు. సెట్టి లక్ష్మీనరసింహం, బుర్రా శేషగిరిరావుల వంటి నవీనాంధ్ర భాషోత్సాహులు పని గట్టుకొని చెన్నపట్నం దాకా ప్రయాణించి ప్రెసిడెన్సీ కాలేజీలో సభ చేసి తమ వాదాన్ని వివరించడంలో తబ్బిబ్బుపడి ఒకరు చెప్పింది మరొకరు చెప్పకా ఇప్పుడు చెప్పింది మరునాడు చెప్పకా, గొడవ పడ్డారు. కన్యాశుల్కం, అపవాద తరంగిణి గ్రంథకర్తలతోనూ వి. టి. శ్రీనివాసయ్యంగారితోనూ తనకెలాంటి ఏకవాక్యత లేదని సెట్టి లక్ష్మీనరసింహం 'పబ్లిక్'న ప్రకటించి గ్రాంథిక భాషా వాదులకు ఊరట కలిగించాడు. సంస్కృత శబ్దబాహుళ్యానికి తాను ప్రతికూలుడట, సులభ శైలిలో రాసిన సాహిత్యం స్త్రీలకూ కర్షకులకూ ఉపయోగ పడడమొక్కటే తన లక్ష్యమట. పురాణం నాగభూషణం, సోమంచి భీమశంకరం వంటి గ్రాంథిక భాషావాదులు తామున్నూ సులభశైలి వరకైతే లక్ష్మీనరసింహంతోటి ఏకీభవిస్తామంటూ హిందూ పత్రికకు లేఖలు రాశారు. ఎటొచ్చీ గిడుగు రామమూర్తి ఉపన్యాసమే వాళ్ళకు మింగుడు పడలేదు. కాశీ బెంచీలకు ఉపన్యసించ వలసి వస్తుందని ఆయనను బెదిరించారుకూడా. ఉపన్యాసాన్ని మధ్యలోనే ఆపు చేయించారు.[27]

గిడుగు రామమూర్తి అలా ఆగేవాడు కాదని త్వరలోనే గ్రాంథిక భాషావాదులకు తెలిసి వచ్చింది. A memorandum on Modern Telugu అనే గ్రంథాన్ని రాసి 1913 లో ఆయన యూనివర్సిటీ వారికి సమర్పించాడు. మద్రాసులో ఆంధ్రపండిత సభ జరిగిన వెనువెంటనే గొప్పదైన ఈ రచనకు ఆయన పూనుకొని ప్రధానమైన భాగాన్ని ఆ సంవత్సరమందే పూర్తిచేశాడు

My object in writing it was (1) to vindicate the dignity of Modern Telugu, the guenine mother-tongue of the educated classes and its right to be used as the best medium of instruction and literary expression; and (2) to refute the arguments advanced by the Pandits and the Academy against the "Modern Telugu Movement."

దేశభాషాద్వారాన సామాన్యప్రజలలో పాశ్చాత్య ఆధునిక శాస్త్రీయ విజ్ఞానాన్ని వెదజల్లవలెనంటూ 1854లో భారత ప్రభుత్వం, విద్యావిషయాలలో తన నిర్దిష్టమైన వైఖరిని ప్రకటించింది అగాయితు, ఈ యాభై ఏళ్ళ కాలంలో దేశభాషాబోధన పండిత హస్తగతమై, పనికిరాని పాతపద్ధతులను ఇముడు వెడుతూ నవ్యమైన ప్రతిదానినీ అడ్డుకొంటూవచ్చిందని రామమూర్తి ఇందులో ఎత్తిచూపాడు. విద్యావిషయక ప్రతిష్టంభన కంతటికీ గల మూలకారణం, గ్రాంథిక భాషాబోధనమే. వీరేశలింగం సులభ గ్రాంథిక వచనంకూడా పండితుల కృతక భాషావ్యాకరణ నిర్బంధాలకే లొంగి పూర్తి ప్రయోజనాల నివ్వజాలక పోయింది. డా. గ్రియర్సన్ (Grierson) బెంగాలీ. హిందీభాషలలో తత్సమ పదజాలం విస్తారంగా విరాఘాటంగా ప్రవేశించి దేశ ప్రజలనుండి సాహిత్యం దూరమై పోవడం గురించి రాసింది తెలుగు భాషకు గూడా అన్వయించక పోదు. నేటికాలంలో కొమ్ములు దిరిగిన పండితుడైనా నిర్దోషంగా సుష్టుగా రాయజాలని ప్రాచీన కావ్యభాషను విద్యార్థులపై నిర్బంధంగా రుద్దడమే ఈ "వంద" కంతటికీ కారణమైంది. భాషాశైలిని మాత్రమేగాక విషయాన్ని (Contents) కూడా మార్చుకోవలసిన ఆధునిక యుగావసరాన్ని విస్మరిస్తూ, సంస్కృత పదభూయిష్టమైన శైలినీ సంస్కృతసాహిత్య క్షీణయుగంలో తలెత్తి తెలుగులో చొరబారి పిలక లెన్నోవేసి తెగబలిసిఉన్న క్షుద్ర "శృంగార" ఇతివృత్తాలనున్నూ విపరీతంగా అభిమానిస్తూన్న పండితులు గతైకమతులై జీవిస్తున్నారు. సమాజంలోని అన్నిఅంతస్తులలోని జనానికి సమంగా విద్యాభాగ్యం అందుబాటులోకి వచ్చి, ఏకవిధమై అఖండమైన సంస్కృతి సర్వతోముఖంగా వ్యాప్తిచెందడానికి సర్వజనగ్రాహ్యమైన అవకాశపూర్ణమైన

వ్యావహారికంలోనే విద్యాబోధ జరగాలి. ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చెయ్య వలసిన అవసరం అందరికీ ఉండదు. అది ఐచ్ఛిక (Optional) విషయం కావచ్చు.

> ... In the present economic condition of the country the masses are seriously handicapped. The further progress and the welfare of the community depends on the removal of the barriers between the classes and masses, which a serious defect in the system of public education has set up and has been strengthening... The aim of the true social reformer in all civilized countries is toweld all classes of the community together for common citizenship by a culture which should be common as the light and the air...

ప్రభుత్వ సత్సంకల్పానికి విఘ్నాన్ని ఆపాదిస్తున్నది 'పండిత' వ్యవస్థ కాబట్టి దానిమీదికి మళ్ళీ విమర్శించక తప్పలేదు. పండిత ద్వేషం పాటించక పండితుల సహజ మనస్తత్వ విమర్శతో కొన్ని భాగాలీ గ్రంథంలో చోటుచేసుకొని ఉన్నాయి. నవీనాంధ్ర భాషావాదులకు పండితదూషణ సర్వసామాన్య లక్షణమై పోయిందంటూ గ్రాంథిక భాషావాదులు గోలపెడుతున్న రోజుల్లోనే పేరెత్తిన వేదం వేంకటరాయశాస్త్రినీ వావిలికొలను సుబ్బారావునూ విమర్శించడానికి సాహసం కావాలి. పండితుల పాండిత్యాన్ని గానీ, చిత్తశుద్ధినిగానీ శంకించకుండా, వారి పాదాలవద్ద కూర్చుని శిష్యరిక చేస్తానంటూ –

He is a pyramid, a museum, an encyclopaedia of ancient learning! We ought to be proud of him. అంటూనే, 'పండిత శబ్దంతా ని గ్రంథంలో Pedantry, bligotry, dogmatism, unreasonableness, impracticable purism, exclusive spirit and such other characteristics of the average Pandit కు పర్యాయపదంగా వాడుకోబడేవని స్పష్టం చేశారు. ఈ దృక్పథం నుంచి, 'పండితుడు' నాగరికతా విరోధి; దేశానర్థహేతువు ఎందుకంటే- అతడభిమానించే సాహిత్యం మరో యుగానికీ మరో జీవన విధానానికీ చెందినటువంటిది. జీవితంలో వచ్చిన మార్పులను సాహిత్యం ప్రతిబింబించవలెననే మాట అతనికి సమ్మతం కాదు. కాబట్టి సామాజికాభ్యున్నతినీ విద్యావ్యాప్తినీ అతడు నిరోధిస్తాడు. ఆధునిక బోధనా పద్ధతులను నిరాదరిస్తాడు.

> The subject-matter of the books he generally teaches is out of date and the knowledge embodied in them is in conflict with what is now believed to be true and good by the civilised world. The Pandit daily administers to the pupils small doses of the

superstition and of the exploded knowledge of the ancient world, lest they should grow too fat on the modern ware of western knowledge, which the government are so solicitous of diffusing among the masses.

ఆధునిక విషయపరిజ్ఞానానికి సంబంధించిన వస్తువులూ, భావాలూ మన విద్యార్థులకు పాఠ్యాలద్వారా తెలియజేయవలసిన అవసరాన్నిగానీ, శాస్త్రీయ బోధనాపద్ధతుల ప్రయోజకత్వాన్నిగానీ, వేంకటరాయ శాస్త్రి తన గ్రామ్యాదేశనిరసనములోనూ వావిలికొలను సుబ్బారావు తన THE MODERN TELUGU PROSE లోనూ సమీకరించి నిరాకరించి రామమూర్తి వాదానికి బలాన్ని చేకూర్చారు. 'శృంగార' రసం గురించి పండితసభ చేసిన తీర్మానాలను ఒక్కొక్కదానిని తీసుకొని పరిశీలించి తోసిపేశాడు కూడా వీరేశలింగం, లక్ష్మణరావుకూడా పండితసభ తీర్మానాలతో ఏకీభవించలేదని గమనించాడు. Apendix 'A' లో తెలుగుభాషా సూక్ష్మాలను ఆధునిక దృష్టితో పరీక్షించి వ్యావహారిక భాషావాదాన్ని నిరూపణచేశాడు.

భాషా యుద్ధక్రమంలో రామమూర్తిది తొలి తుపాకిగుండు కాదుగాని తొలి ఫిరంగి గుండు దీనికి జవాబు వెంటవెంటనే వచ్చింది: జయంతి రామయ్య రాసిన A DEFENCE OF LITERARY TELUGU (1913). బ్రౌన్ నాయుంతోటి కావ్యభాషను సమర్థించుకోవడమే ఈ గ్రంథంలోని ఆశ్చర్యకరమైన విషయమునాలి. బ్రౌన్ పరిష్కరించిన (1860) THE WARS OF THE RAJAHS ను పాఠ్యం చెయ్యడానికి గ్రాంథిక భాషావాదులు పెట్టిన అభ్యంతరాలే బ్రౌన్ దృక్పథం పట్ల వాళ్ళకుండిన గౌరవాన్ని సూచిస్తాయి విజయనగరం లోని తెలుగు భాషా సంఘం ప్రచురించిన ఈపుస్తకాన్ని 'ఎడిట్' చేసి HISTORY OF HADEH-ANANTAPURAM పేరుతో అప్పారావు వెలువరించనున్నాడు). ఆంధ్ర భాషా సాహిత్యాలను అభ్యసింపగోరే ఆంగ్లేయుల నుద్దేశించి భాస్కర శతకం ప్రభులింగలీల వంటి లఘురచనల నైతే వాళ్ళు సునాయాసంగా చదవవచ్చునని బ్రౌన్ చెప్పి ఉన్న మాటలకూ ప్రాచీన ప్రబంధాలనూ పిల్ల వసుచరిత్రలనూ సమర్థించే రామయ్య వైఖరికీ, భేదం మాత్రమే కాదు విరోధమే ఉంది. 'పండితప్రియమైన గ్రాంథికభాష గురించిదానూ దానికీ వ్యావహారికానికీ సాక్సన్ (Saxon) కూ ఇంగ్లీషుకూ గల భేదమే ఉన్నదని పటాటోపశైలిలో రాయాలని పండితుడు తాపత్రయపడతాడని నిజమైన పాండిత్యం గల వాళ్లు దీనిని అవగణిస్తారు కాబట్టి పండితమానుల దృష్టిలో వాళ్ళు గ్రామ్య (Vulgar) వాదులుగా చలామణీ అవుతున్నారని బ్రౌన్ స్పష్టంగా చెప్పి ఉన్నాడు కూడా.[28]

ఈ పుస్తకంలో రామయ్య చేసిన మరో ఘనకార్యం గిడుగు రామమూర్తినీ గురజాడ అప్పారావునూ వేరుజెయ్యబోవడమే. నవీనాంధ్రాన్ని నిర్బంధంగానూ గ్రాంథికాన్ని ఐచ్ఛికంగానూ పాఠ్యాలు చేయవలసిందని రామమూర్తి సతపోటుతూ

ఉంటే, గ్రాంథిక వ్యావహారికాలు రెండూ కలిసి కాపురం పెట్టాలని అప్పారావు అంటూ ఉన్నాడట. పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘ సభ్యుడిగా ఒకమాట, పరీక్షాధికారిగా మరోమాటా పలుకుతున్నాడట. పాఠ్య గ్రంథాలలో గూడాను వ్యాకరణ సూత్రాలకు లోబడి రాసిన వాటితోపాటుగా ఉల్లంఘించి రాసిన వాటిని గూడా ఎన్నిక చెయ్యమంటున్నాడట. అలాగే స్కూలుఫైనలు ఇంటరు పరీక్షలలో విద్యార్థులు తమ కిష్టమొచ్చిన శైలిలో రాయవచ్చునంటున్నాడట. అప్పారావుది అవ్యాఖ్యవ్యా పద్ధతి అని చెప్పడానికి రామమూర్తిని వాడుకొని, అక్కర తీరంగానే ఆయనను తోసిపుచ్చాడు రామయ్య. ప్రవృత్తమంటే పూర్వోత్తరాలు తెలిసి ఉండాలి నేటి కృతక భాషను సమర్థించడానికి నన్నయనుంచి చిన్నయ వరదా తమను చెపకు తెచ్చింది:

The propaganda of the "Modern" school goes very much beyond the necessities of the case. It is ill-conceived, revolutionary and Contrary to the law of the ordinary development of languages... It is professed but by a handful of persons who have no more right to speak for the Telugu People than the three Tailors of the Tooley street had to speak in the name of people of England. In fact, these "reformers" have come not to fulfil but to destroy and they have thereby put themselves out of court. [29]

మేజిస్ట్రేటు గాబట్టి నేరస్థులను విచారించి శిక్షించడం వరకూ సరిపోతుంది గాని, డిప్టీ కలెక్టరు కూడా అయి నేరారోపణ కూడా తానే చెయ్యాలనుకోవడమే అక్రమ మనిపిస్తుంది. భాషా సంస్కర్తలు 'ధ్వంసపు నారాయణులు'గా పితూరీదారులుగా నిరూపించా రాయనకు. వెంటనే వాళ్ళను వెలివేసి శిక్షించబూనాడు. భాషాపరిణామ ధర్మాలను వాళ్ళు ఉల్లంఘించారని ఆరోపణ: అందుచేత సంప్రదాయమునగా ఏమిటైనది వివరించే పనితోపాటు ప్రస్తుత గ్రంథభాష సంప్రదాయాని కెలా బాహిరమైనదో పరిశోధించి నిరూపించే పనిగూడా సంస్కర్తలపై బడింది. నిజమైన సంప్రదాయము అని గిడుగు ఒక పుస్తకం తయారుచేసింది ఇందుకే.

# 4

పరీధావి సంవత్సరంపోయి ప్రమాదీచ వచ్చింఁగాని ఆం.స.ప. పెద్దలు వేసిన గొంగళి వేసినచోటనే ఉండి పోయింది. ఏప్రిల్ 19,20 తేదీల్లో రాజమండ్రిలో రెండవ సాంవత్సరిక సభ జరిగినప్పుడు "గ్రామ్య" వాదాన్ని ప్రతిపాదించేందుకు మనుషులు కరవయ్యారని జాలి ఒలకబోస్తూనే పరిషత్పత్రిక ఇలా వాపోయింది: ఇంటరు పరీక్షకు తెలుగు వ్యాసరచనలో విద్యార్థులవలంబించ వలసిన శైలి గురించి నిర్ణయించేందుకు ఏర్పాటైఉన్న కమిటీలో "నలువురు గ్రామ్యవాదులు నలువు రగ్రామ్యవాదులు" సభ్యులుగా ఉండడం అన్యాయం. ఏమంటే, "గ్రామ్యవాదుల సంఖ్యయే వ్రేళ్ళ నెన్నఁదగియున్నది. అట్లుండ నల్ప సంఖ్యగలవారి పక్షమున నలువురిని, చక్కని యాంధ్రదేశ మంతకుఁగాను నలువురిని నియమించుట" అన్యాయంగాక ఏమౌతుంది? దీన్ని మార్చాలి. ఈ అంశంగురించి మొదలైన చర్చ "గ్రామ్య" భాష గుణాగుణ చర్చ—అంటే రచ్చ—గా పరిణమించింది. గిడుగు రామ మూర్తి "వీరావేశము"తో చేసిన ప్రసంగంలోని అంశాలను జయంతి రామయ్య "యుక్తియుక్తముగను సప్రమాణముగను" ఖండించాడు. 30.

మూకబలపు దబాయింపు పద్ధతులకు విద్యాశాఖ ఒకపట్టాన లొంగిరాలేదు. దానికి తోడుగా రాజకీయపు ఎత్తుగడలకు గూడా పూనుకొన్నారు. శాసనమండలి సభ్యులైన బి. యన్. శర్మ, మోచర్ల రామచంద్రరావు, ఆమంచర్ల సుబ్బకృష్ణ రావులను పురిగొల్పి, పాఠ్య గ్రంథాలుగా ఎన్నికైన ఏనుగుల వీరాస్వామయ్య *కాశీయాత్ర చరిత్ర* వంటి వాటిపై బడిపి తోలించారు వాడుకభాషలో గ్రంథ రచనకు "నెల్లూరు రెడ్లూ, తెలుగుదేశపు జమీందార్లూ" వ్యతిరేకులని చెప్పించారు. డి. పి. ఐ గా ఉన్న బర్న్ ఇంటరు పరీక్ష తెలుగు వ్యాసరచనకు నిర్ణయం కాబోయే శైలినే స్కూలుఫైనలు భాషాంతరీకరణకు గూడా అన్వయింపబోతాము లెమ్మని హామీ ఇచ్చాక, ఆం. సా. ప. పెద్దల ఆశలన్నీ ఇంటరు తెలుగు వ్యాసరచన ఉప సంఘ నిర్ణయంవైపు మళ్ళాయి. అందులో తమకు సంఖ్యాధిక్యతను చేకూర్చు కొనేందుకని ప్రాంతీయ తత్వాన్ని రెచ్చగొట్టి దత్త మండల సమాజం (Ceded Districts union) కోరిందంటూ, రాయలసీమ ప్రతినిధులను ఈ సంఘంలో చేర్పించారు. కొత్తగా వచ్చిన సభ్యులు కోలాచలం శ్రీనివాసరావు, టి. శంకరలింగ పిళ్ళై, నాగపూడి కుప్పుస్వామయ్య, బారిష్టరు కె. సుబ్బారెడ్డి.

1913 మార్చిలో ఈ కమిటీని పునర్నిర్మించినప్పుడు వేదం వేంకటరాయ శాస్త్రి, కొమర్రాజు లక్ష్మణరావు, జయంతి రామయ్య, వి. పి. రంగారావు (సమావేశ కర్త) ఒక కూటమి, గిడుగు, గురజాడలు, బుర్రా శేషగిరిరావు, పి. టి. శ్రీనివాసయ్యంగా రింకొక కూటమి, యం. రంగాచారియార్, ఆర్. డబ్ల్యు. రాస్ (R. W. Ross) తటస్థులుగానూ సభ్యులయ్యారు. రాయలసీమ ప్రతినిధుల చేర్పు గ్రాంథికభాషావాదుల సంఖ్యను రెట్టింపు చేసింది. 1913 సెప్టెంబరులో వేంకట రాయశాస్త్రి, లక్ష్మణరావు, అప్పారావులతో ఒక ఉపసంఘాన్ని నియమిస్తూ రెండు మాసాల గడువులోపల నామవాచక, సర్వనామ, క్రియారూపాల పరిశీలనచేసి జాబితాలు తయారుచేయవలసిందని కమిటీ ఆదేశించింది. ఇది జరిగేలోగా, అన్యదేశ్య పదాలను అరువుతెచ్చుకొనే విషయంలోనూ, సంధిసూత్రాల విషయంలోనూ గ్రాంథిక భాషావాదులు తమపట్టు నెగ్గించుకొన్నారు. ఎదుటివారు సూచించిన సవరణలన్నీ వీగిపోయాయి. తటస్థుల అండగాని తెలివిగా వ్యవహరించక పోయివుంటే, అప్పుడే వ్యావహారిక భాషావాదులు శృంగభంగం పొందవలసి వచ్చివుండేది. అప్పారావు చేర్పు ఈ దురంతాన్ని వాయిదా వేయగలిగిందేగాని నివారించలేక పోయింది.

పదాల వర్గీకరణకు సంబంధించి ఇరుపక్షాలు ఢీకొన్నాయి. వ్యవహారచ్యుతి పొందినవి (Archaic) వ్యవహార ప్రచురంగా ఉన్నవి (Current) అని రెండు జాబితాలుగా తయారుచేసి ఆధునిక వ్యాసరచనలో వ్యవహార సిద్ధరూపాలనే వాడవలసి ఉంటుందని విద్యార్థుల నాదేశించవలెనని అప్పారావు ఒక తీర్మానం ప్రతిపాదించాడు. ఈ ఉభయవిధరూపాలను Standard literary Telugu నుంచి మాత్రమే స్వీకరించవలెనని రామయ్య సవరణ. తటస్థుడుగా రంగాచారియార్ సవరణ సమన్వయ దృష్టితో చేసినట్టిది: Current forms being determined from usage in literature as well as in the polite speech prevailing among the educated Telugu people. * ఈ సవరణను అప్పారావు ఆమోదించడంతో తీర్మానం నెగ్గింది. ఇక ఉపసంఘం కదిలి పనికి పూనుకోవచ్చు.

---

* నవీనాంధ్ర భాషావాదం 'స్తా' భాషావాదమని గ్రాంథిక భాషావాదులు హేళన చేశారు. రంగాచారియార్ ప్రవేశపెట్టిన సవరణలో 'వచ్చును' అనే గ్రాంథిక రూపానికి నవీనరూపంగా 'వస్తాడు' అని ఉంది. క్రియాశబ్దాల కన్నిటికీ ఈ మార్పు వ్యవహారంలో వచ్చి ఉన్నదే. దాన్ని గ్రంథస్థం చేయడంలోనే పేచీ. విశాఖపట్నంలో జరిగిన ఒక సభలో సెట్టి లక్ష్మీనరసింహం మాట్లాడుతూ నవీనాంధ్ర భాషావాదులు కోరుతున్నదంతా కలిసి కొద్ది రూపాల మార్పులే నన్నాడు. "ఎన్నియోలేవు. విభక్తి వచనరూపములు కొన్ని, ఒకటి రెండు సర్వనామముల

**ఈ**కాలంలోనే అప్పారావు సుభద్ర కావ్యరచనకు ఉపక్రమించి పూర్తి చేశాడు. గ్రాంథికభాషావాదుల దెప్పిపొడుపులకు తానిచ్చుకోగలిగిన జవాబిదె. గ్రాంథిక శైలిలో సాగిన ఈ రచనకు విజయవిలాసం మేలుబంతి అయినా ఇందులో అప్పారావు చమక్కులు లేకపోలేదు.

1913 అక్టోబరు నాటికి ఉపసంఘ నివేదిక తయారైంది. మెజారిటీ సభ్యులిద్దరూ చెరొక తెన్ను పట్టినా, వారి గమ్యమొకటే గనుక అప్పారావుకు సుఖం లేకుండా పోయింది. రాజీ పద్ధతి సూచించిన రంగాచారియార్ కూడా ఈ జాబితాల గురించి పూర్తి సంతృప్తి ప్రకటించలేదంటేనే, మెజారిటీ సభ్యులెలా ఉమ పంతం నెగ్గించుకొన్నారో తెలుస్తుంది.* Current అనే మాటకు లోకంలో ఉన్న

---

రూపములు, క్రియలలో భావార్థకాది రూపములు కొన్ని, స్వల్పముగఁ గొన్ని ప్రశ్నార్థకాది రూపము; లేవో మూడు నాల్గు మాత్రమే గ్రాంథిక భాషలోఁ జేర్పఁదగినవి." అది నిజంకావని గ్రాంథిక భాషావాదుల అనుమానమూ భయమూ. "ఆ మూఁడు మాటలు వామనుఁడు చాఁచిన మూఁడడుగులు సర్వజగము నాక్రమించినట్లు సర్వాంధ్ర భాషా జగత్తును సంకర పఱచినవి." గిడుగు రామమూర్తి సూచించిన మార్పులలో విభక్తి, వచనరూపాలు, 'అవి' అనే సర్వనామం యొక్క విభక్తి రూపాలు, శత్రర్థక రూపాలు, చేదాద్యర్థక రూపాలు, భవిష్యత్కాలరూపాలు, 'కొను' యొక్క రూపాంతరాలు, భావార్థక అప్యర్థక ప్రార్థనార్థక రూపాలు, అవ్యయాలుగా వాడే క్రియారూపాలు, ప్రశ్నార్థక నిషేధార్థక సముచ్చయార్థక రూపాలు - ఇలా ఎన్నో ఉన్నాయి. వీటినన్నిటినీ ఒప్పేసుకొంటే, గ్రాంథిక భాష తారుమారై పోక తప్పదు. విమర్శాదర్శవిమర్శాదర్శము : ప్రథమ భాగము, పు. 76-81

---

* సబ్‌కమిటీలోని మెజారిటీ సభ్యులు చేసిన అవకతవకలనూ, సంఘ సమావేశకర్త అయిన వెంకట రంగారావు చేసిన పొరపాట్లనూ వెల్లడిచేస్తూ, 'కన్వీనర్స్ రిపోర్టు'పై అప్పారావు 'రిమార్కులు' రాశాడు. 1914 ఆగస్టు 2) ఇది 'మినిట్ ఆఫ్ డిసెంటు'కు అనుబంధంగా ఉండదగింది. ఇందులో మొత్తం 21 పేరాగ్రాఫు లున్నాయి. (Report of the. ITC, PP 109 - 112):

(1) తమిళ భాషకై ఏర్పాటైన కమిటీ తీర్మానాలను అనుసరించామని వెంకట రంగారావు చెప్పుకొంటున్నాడుగాని వాటిని 'కాపీ' కొట్టమని సెనేట్ ఆదేశించలేదు. తమిళ భాషా వ్యాకరణం ఎన్నోమార్పు చేర్పులకు లోనౌతూరాగా, నన్నయ్య కాలపు వ్యాకరణాన్ని పాటిస్తూ బహు సకృత్తుగా మాత్రమే తదనంతర ఆంధ్రకవులు వ్యావహారిక రూపాలను గ్రంథస్థం చేశారు. ఆది కవుల ప్రయోగాలను తప్ప తక్కినవాటిని తెలుగు వైయాకరణులు తిరస్కరించారు. కావ్య భాషా వ్యాకరణానికి అనుగుణంగా ఉన్నవే వ్యాకరణ సాధువులని ఈ కమిటీ వాదించింది. అలా అయితే ఈ కమిటీల నెందుకోసం ఏర్పాటు చేసినట్లు? To fix a standard of-

అర్థాన్ని తుంగలో తొక్కి, సాహిత్యంలో ('లోకవాడుక'లో గాక) వాడుకైనదనే విపరీతార్థాన్ని చెప్పుకొని, తదనుగుణంగా తమ జాబితాలు తయారు చేసుకొన్నారు. కాబట్టి అప్పారావు మెజారిటీ నివేదికను నిరాకరించి తానే వేరొక నివేదికను తయారుచెయ్యక తప్పలేదు. ఒక్కసారి కూడా తన అసమ్మతి పత్రాన్ని (Minute of Dissent) ఇవ్వలేదంటూ అప్పారావుపై సమావేశకర్త అయిన రంగారావు నేరం మోపాడు. దఫాలు దఫాలుగా మూడుసార్లుగా (1913 అక్టోబరు 31, 1914 జనవరి 17, 1914 జనవరి 24) ఇచ్చిన మాట నిజమే. డిసెంబరు 13 న మెజారిటీ నివేదికను కమిటీ ఆమోదించింది. వాయిదా వేయించాలని అప్పారావు చేసిన ప్రయత్నం కలిసి రాలేదు. అదనుతా, అప్పారావు ఆ సంఘ సమావేశాలకు హాజరు కాలేదు. ఇది వీలుచేసుకొని, సంఘంలోని ఇతర సభ్యుల గురించి పత్రికల కేదో రాసి రచ్చకెక్కాడంటూ అప్పారావును అభిశంసిస్తూ తీర్మానం చేయాలని బారిష్టర్ కె. సుబ్బారెడ్డి సూచన చేశాడు కూడా. రెండోమాటు, మూడోమాటు అప్పారావు తన అసమ్మతి పత్రానికి చేసిన చేర్పులను కమిటీ తోసిపేసింది. కమిటీలోని మైనారిటీ సభ్యులు – వ్యావహారిక భాషావాదులు – అందరూ కలిసి తమ అసమ్మతి పత్రాన్ని సమర్పించారు (1914 ఫిబ్రవరి 17). దానికి విజయనగరం నుంచి అప్పారావు తన ఆమోదం తెలిపాడు. ఇదంతా సంకులమైన ఒక సమరం తాలూకు స్థూల చరిత్ర.[31]

---

Colloquiality అనే ఆదేశం ఏమైనట్లు? తెలుగు భాషలో వాడుకై ఉంటున్న పదాలుగు రూపాలను గిడుగు రామమూర్తి ఇచ్చి ఉన్నాడు. అయితే అవి కమిటీకి ఒప్పుదల రాలేదు. తీర్మానం చేసేముందు వీరేశలింగంతోటి సంప్రదించవలసిందని 1911 లో చేసిన తీర్మానం ఆచరణలో అమలు జరగలేదు.

(2) సంధిని ఐచ్ఛికం చేసినందుచేత తమ వ్యాకరణ సూత్రాలకు తామే తలకొరివి పెట్టినట్లయింది. శబ్ద రూపాల విషయంలో ఈ వెసలుబాటు నెందుకు చూపలేకపోయారో?

(3) Current, Archaic అనే పదాలకు మెజారిటీ సభ్యులు చెప్పుకొన్నవి వేదర్థాలు మాత్రమే. వాటికి వెంకటరంగారావు తన ముద్రను వేశాడు. శిష్ట వ్యావహారికానికి సమీపంగా ఉన్న కావ్య భాషా రూపాలేమో Current. చాలా దూరంగా ఏ పోలికా లేకుండా ఉన్నవి Archaic అట! 'ఏను' Archaic, 'నేను' current అని వివరణ. అయితే ఈ 'నేను' కావ్య, వ్యావహారికాలకు రెంటికీ సమానమైన రూపమే. 'పడియెదను, పడెదను, పడతాను'లలో మొదటి రెండూ archaic, చివరిది current గానీ కావ్య భాషేతరమైనది! ఇలా వెంకట రంగారావు చేసిన నిర్వచనం ఎన్నో ఇబ్బందులకు దారి తీసేదిగా ఉంటున్నది.

అప్పారావు ప్రతిభకూ పాండిత్యానికీ ఘనమైన నిదర్శనమూ, ఆదర్శకమూ ఈ Minute of Dissent to the Report of the Telugu Composition Sub-Committee యే. నవీనాంధ్ర భాషావాదం 1906 లో తలఎత్తింది లగాయతు గిడుగు రామమూర్తి ప్రభృతులు దానికి సమకూర్చిపెట్టిన వాదపటిమ చివరకు ఈ అంతిమ ఫలస్వరూపాన్ని ధరించింది. అప్పటివరకూ తాను సేకరించుకొని ఉండిన అంశాల నన్నింటినీ క్రోడీకరించుకొంటూ ప్రస్తుత వివాదావసరాలకు అనువుగా సమన్వయ పరచుకొని అప్పారావు దీన్ని రచించాడు. ఆ అహోరాత్ర పరిశ్రమగురించి ఆయన కుటుంబం వాళ్లు ఇప్పటికీ కథలు చెప్పుకొంటారు. "భారత ఘోరరణంబునందు" అర్జునునికి కృష్ణునిలా గిడుగు రామమూర్తి సహకరించగా, రాత్రినిక్కూ పగలు చేసుకొని ఈ చిచ్చరపిడుగును నిర్మించి గ్రాంథిక భాషావాదుల గుడారంమీద విసిరి వేశాడు. అయితే ఈ "పరిశోధనాత్మకమైన నివేదిక" కూడా సమగ్రమేమీ కాదు. మొదటిభాగాన్నే ఆయన పూర్తిచెయ్యగలిగాడు

అట్లాంటిక్ మహాసముద్రజలాన్ని తన చిన్న చీపురుకొంపలోకి రాకుండా చేద్దామని పొరక్కట్ట చేదాల్చి సాగరునితో వీరోచితంగా స్పర్థించి పోరాడిన బ్రిటిషు ముసలావిడలా, జయంతి రామయ్య బృందం మూర్ఖంగా ఎదురొగ్గి నిష్ఫలంగా పోరాడుతున్నారని అప్పారావు హాస్యం చేశాడు. గ్రంథభాష పండితులకైతే చిరుదిండి కావచ్చునేమోగాని సామాన్యులకు పుష్టికరమైన ఆహారంకాజాలదు. తొలి కావ్యభాష వ్యవహారంనుంచి పూర్తిగా తప్పిపోయిగానీ తప్పిపోతూగానీ ఉండి నేటివాళ్ళ చేతుల్లోబడి కృతకమయింది కాబట్టే ఆధునిక ప్రామాణికభాషకు అగత్యమంటూ ఏర్పడుతున్నది. పూర్వ కావ్యభాషను డబ్బగుంటలో వెయ్యాలనికాదుగాని దాన్ని విమర్శగా పఠిస్తూనే ఆదికావ్యాలలోని పదాలను కోశాలుగా కూర్చడమూ, వాటి వ్యాకరణాన్ని నిర్మించడమూ జరగాలి. నవీనవచనం దేశావసరం. *

---

* సబ్‌కమిటీలో మెజారిటీగా ఉండిన వేదం వేంకటరాయశాస్త్రి, కొమర్రాజు లక్ష్మణరావు గార్లకే ఏకాభిప్రాయం లేకుండా పోయింది. ఒక్క గుక్కలోనే ప్రాచీన కవుల ప్రయోగాలనూ వీరేశలింగం చిలకమర్తి ప్రభృతి నవీన రచయితల ప్రయోగాలనూ కలిపి కొట్టజూచాడు లక్ష్మణరావు. ఈ నవీనుల ప్రయోగాలు కొన్ని వ్యాకరణపరంగా అసాధువులని గుర్తించ లేకపోయాడు. ఇక వేంకటరాయశాస్త్రి దృష్టికి కొన్ని క్రియారూపాలలో 'చ' సరిపడదు; 'వ' ఉండాలి. భవిష్యదర్థక, ప్రార్థనార్థక, వ్యతిరేకార్థక, తుమున్నాద్యర్థక క్రియారూపాలలో 'వ' బదులు 'చ' ను వాడవచ్చునని ఆయన ఒప్పుకోలేదు. అయినా కమిటీ అంగీకరించింది. (Report of the ITC, p. 22. Footnote) లక్ష్మణరావు తన నివేదికలో చేసిన వాదా

వేంగీ చాళుక్యుల కాలంనుంచీ ఆంధ్రదేశానికి సరిహద్దుగానూ అందుచేతనే సంస్కృతికి పుట్టిల్లుగానూ ఉంటూ వస్తూన్న గోదావరీసీమ శిష్టజనుల వాగ్వ్యవహారంలో ఉన్న భాషఒక్కటే, ఈ ప్రామాణిక భాషకు పునాది కాదగినటిది. మౌలికమైన భిన్నత ఏదీలేని విధంగా, మాండలికాలు రూపొంది ఉన్నందుచేత అవి దేశ సమైక్యతను నిరోధించవు. ఈ సరికే వ్యావహారిక వచన వాఙ్మయ మొకటి పెంపొంది ప్రజాభిమానం పొందిఉంది. గ్రాంథికభాషకు ఎన్నడున్నూ పూరాగా ఈ అభిమానం చేకూరియుండలేదు. అతి సంకుచితమైన కూటము తాటాకుల పొంత ఆసనానే దాని బతుకు తెల్లవారింది. ఆధునిక వచన గ్రంథాలలో ఆ భాషనువాడ బోవడం "ఈనాటి రైలు రోడ్డుపై జగన్నాథ రథాన్ని నడిప యోచించడ మంతే తెలివైన పనేమీకాదు".

ఉపసంఘంలోని మెజారిటీ సభ్యులు తయారుచేసిన పాఠాలను తప్పులెన్ను కొని చూస్తే, వాళ్లలోనే ఏకవాక్యత ఉన్నట్టు కనిపించదు. [illegible]ల్లో ఉన్న వ్యాకరణ సూత్రాలకు ఒదిగే శబ్దాలనే గ్రహించవలెను కానా, ప్రాచీన కావ్యభాషా

అను అప్పారావు తిప్పికొట్టవలసి వచ్చింది. లక్ష్మణరావు [illegible] నవీన [illegible] సంప్రదాయాను మైనది అప్పారావుకు నవీన గ్రాంథిక వచన సంప్రదాయంగా [illegible] కనిపించింది. పైగా ఇది గ్రాంథిక వ్యాకరణ సూత్రాలను ఇష్టారాజ్యంగా ఉల్లంఘించినట్లు వీరేశలింగం, చిలకమర్తి రచనలనుంచి సోదాహరణంగా చూపవలసివచ్చింది. భాషా సంస్కర్తలు తెలుగు భాషను చెడ్చి పెట్టిన దానికంటే, లక్ష్మణరావు ప్రశంసించి ప్రామాణ్యమిచ్చిన ఈ 'నవీన' గ్రాంథిక కర్తలు చెడ్చిపెట్టిన కీడు ఎక్కువ అని నిరూపించవలసి వచ్చింది. ఎవరి నియమాలను [illegible] ఉండవలసిందేనని అప్పారావు వాదం. ఇంతవరకూ గ్రాంథిక, వ్యావహారికాలను రెండు వేర్వేరు భాషలని గుర్తించనందువల్లనే ఈ పేచీ వచ్చింది. ఈ రెండూ రెండు భాషలు (dialects) కావటమేగాదు. రెంటికీ వేర్వేరు వ్యాకరణాలున్నాయి. బ్రౌన్, ఆర్డెన్ ప్రభృతులు వ్యావహారికానికి వ్యాకరణాన్ని ఇచ్చిపోయారని వేంకటరాయ శాస్త్రి కూడా క్రితంలో గుర్తించి ఉన్నాడు. జీవద్భాషను పాఠశాలలనుంచి వెలివెయ్యడానికి కృతక గ్రాంథిక భాషావాదు లెంతో పంతంగానూ చేసినట్లు అప్పారావు ఆరోపణ. దాని ఉనికినే వాళ్ళు గుర్తించ నిరాకరించారు. The Real Problem అనే ఉపశీర్షిక కింద అప్పారావు రాసిన ఈ మాటలు, భాషా సమస్యకూ దేశ ప్రయోజనాలకూ గల సంబంధాన్ని స్పష్టంగా తెలుపుతాయి (The Minute of Dissent, p. 62) :

Social, political and literary ideals have changed. Literature is no longer confined to a cult; and mass education which is one of the greatest blessings of British rule has necessitated the creation of a modern prose in Telugu.

వ్యాకరణానికి ఒదిగినట్టివేనని అంటూనే, వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం లాంటి ఆధునిక వచన రచయితలు వాడుక చేస్తున్న రూపాలనికూడా లక్ష్మణరావు చెప్పాడు. ఈ రచయితల వచనం రెంటికించెడిన రేవడ. కుహనాసంస్కర్తలే ప్రాచీన కావ్యభాషా వ్యాకరణ సూత్రాలను తరతమభేదాలతో తెగడేవారుగాని వ్యావహారికభాషావాదులు కాదు.

వాగ్వ్యవహారంలోని భాషకు నీచార్థంకల్పించి గ్రామ్యమని పేరెట్టి నెట్టివేస్తూ యావదాంధ్ర దేశానికి ఒకే విధమైన శిష్ట జనవ్యావహారికం లేదని ముందుగానే తీర్మానించుకొని దానికి గ్రంథ ప్రవేశయోగ్యతను నిరాకరించారు గ్రాంథిక భాషా వాదులు. అపజను రూపాలను మించి, అదీ వ్యాకరణం సూత్రాలకు భిన్నంగానే, దేశమంతటా ఒకేవిధమైన "గ్రామ్య" రూపాలు లేవు పొమ్మన్నందుకు లక్ష్మణ రావు తన విప్పు కోసమైనాసరే బహుళసంఖ్యలో ఉన్న ఏకవిధ శబ్దరూపాలను చూపవలసి వచ్చింది.

రాజకీయాలలో ఎలాగో భాషావిషయంలోనూ అలాగే కులీనత్వమూ (aristocracy) సంకుచితత్వమూ (exclusiveness) చిట్టచివరకు కుప్పకూలక తప్పదంటూరాసిన విట్నీవాక్యాల నుద్ధరించి, కాంబెల్, బ్రౌన్‌ల అభిప్రాయాల నుదహరించి, భాషాబోధనలో గల అవక తవకలను చూపి, వ్యాకరణమనేది చేర్పులనూ మార్పులనూ ఒల్లని జడపదార్థమేమీ కాదని, ప్రజల నవజాగృతిని గమనిస్తూ, ప్రాథమికస్థాయినుంచి కళాశాలస్థాయిదాకా భాషాబోధనలో అవలంబించక తప్పని ఆధునిక శాస్త్రీయ పద్ధతులను నిర్దేశిస్తూ చివరకు అప్పారావిలా అన్నాడు :

We stand at the parting of the ways, and our decision will affect the future destinies of the Telugu people. It lies with us to chain and strave Telugu literature or to give it liberty and make it a great civilizing force. [32]

గ్రాంథిక వ్యావహారికశైలుల నడిమి గండిపూడ్చి ప్రామాణిక భాషాశైలిని సాధించవలెనన్న విశ్వవిద్యాలయ సంకల్పం ఇలా భంగపడింది. గ్రంథభాష బోధనా భాషగా కొనసాగగలిగింది. కమిటీవారు సూచించిన పాఠ్యగ్రంథాలలో మచ్చుకుగూడా గ్రాంథికభాషను సుష్ఠుగా వాడుకొన్న రచయితలు అత్యల్ప సంఖ్యాకులైనప్పుడు, స్కూలుఫైనలు ఇంటరు విద్యార్థులు ఆ భాషనెలా సులువుగా

వాడుకోగలరో తెలియదని మైనారిటీ అసమ్మతిపత్రం ఆశ్చర్యం ప్రకటించింది *
తెలుగు 'నాగరకతా సాధనం' కాలేకపోయిందిగదా, నాగరకతా సాధనాలను మొక్క-
బరిచేందుకే నేటివరకూ ఉపయుక్తమౌతున్నది. భూస్వామ్యమూ వర్ణాధిక్యమూ
పాండిత్య దుర్బలత్వమూ కలిసి నిలబెట్టిన "ఏర్పాటు – సంపతి" సాహిత్య
సంప్రదాయానిదే గెలుపైంది. 1914 తదనంతరం వ్యావహారిక భాషోద్యమం [illegible]

---

*గ్రాంథిక భాషావాదులు వ్యావహారిక భాషను నిర్వచిస్తూ. The deliberate speech of the educated classes of the higher order of society in the Telugu country as a whole and not the speech either confined to any particular area or to any particular clan or tirbe అన్నారు. కాని అనుకొన్నా. ఈ నిర్వచనానికి అనుగుణంగా సబ్‌కమిటీ వ్యవహరించలేదని కమిటీలోని మైనారిటీ సభ్యుల బాధ. అలా అనుసరించి ఉంటే మెజారిటీ తయారుచేసిన జాబితాలు గిడుగు రామమూర్తి సూచించిన చేర్పులను ఒప్పుకోవలసి ఉండేది. కృష్ణా గోదావరి మండలాల్లోని శిష్టుల వాడుక భాష ప్రామాణికం కాదని మెజారిటీ అభిప్రాయం పడినట్లు కాంబెల్, గ్రౌస్. మారిస్, ఆర్డెన్, కాల్డ్వెల్ ప్రామాణిక మన్నారు. 1911 సెన్సస్ ధృవీకరించింది. వీరేశలింగం కూడా అన్నారు. మాటల తొందరపాటు వల్ల, అశ్రద్ధవల్ల, అజ్ఞానం వల్ల గ్రామ్యం బయలు దేరుతుందని మాత్రమే మెజారిటీ అభిప్రాయం కాబట్టి ప్రయత్నపూర్వకంగా (deliberate) పట్టి పట్టి అన్ని ప్రాంతాల శిష్టులు మాట్లాడేదే వ్యావహారిక భాష కాబోదు; ఇలా నిర్వచిస్తే వ్యావహారిక రూపాలను గ్రంథ భాషలో ప్రవేశించకుండా చెయ్యవచ్చునని వాళ్ళ ఎత్తుగడ. వ్యావహారిక భాషావ్యాకరణాన్ని గుర్తించ నిరాకరిస్తూ గ్రాంథిక భాషావ్యాకరణ సూత్రాలకు ఒదిగి ఉండే శబ్దరూపాలనే Archaic, current అని రెండుగా విభజించుకొని మెజారిటీ సభ్యులు తమ జాబితాలు తయారు చేశారు. అసలే కృతకంగా ఉంటున్న గ్రాంథిక భాష మరింత కృతకం కావలసి వస్తుంది; దాని పరిధి సంకుచితంకాక తప్పదు కొన్ని గ్రాంథిక పదాలకు గల వివిధాలైన రూపాలను సాకల్యంగా కొన్నిటిని, సగం సగంగా మరికొన్నిటిని జాబితాలు చేర్చి మెజారిటీ తృప్తిపడింది. వాడుకలో ఉన్న రూపాలు కొన్ని archaic అని జాబితాలు చూపాయి. మెజారిటీ లక్ష్యమే తప్పు: They thought they were asked to galvanise into life the dead forms of the old poetic dialect and graft the living forms on them and no wonder that they failed. They classified the fossils into old, older, oldest and recommended the option of excluding the last.

ఇలాసాగింది కమిటీలోని మైనారిటీ సభ్యుల అసమ్మతి పత్రం. అప్పారావు 'మినిట్ ఆఫ్ డిస్సెంటు'కు ఇది కూడా చేర్చవలసి ఉంటుంది. *(Minute of Dissent to the Intermediate Telugu Composition Sub-committee Report – Report of the ITC,* pp. 103–108.)

స్థానాల నందుకోలేక పోవడానికి కారణం చూపుతూ, శ్రీరంగం శ్రీనివాసరావు 1948 లో రాసిన ముక్కలు ప్రస్తుతాంశాన్ని స్పష్టతరంచేస్తాయి. ఆ కారణం "రాజకీయంగా మధ్యతరగతుల విప్లవం జయించడం మాత్రమే.... ఇంకా అసంఖ్యాకులగు ప్రజలు మూగతనంలోనే మ్రగ్గుతున్నారు.... ఈ ప్రజలను ఈ స్థితిలోనే ఉంచడం తమకి చాలా సదుపాయం అని గ్రహించిన పండితమ్మన్యులే నేడు అధికార స్థానాలలో ఉన్నారు." 33

పాఠ్యపుస్తకాలలోనూ స్కూలుఫైనలు భాషాంశరీకరణం ఇంటరు వ్యాసరచనలకున్నూ వ్యావహార భాషకు స్థానంలేకుండా సిండికేటు వేసిన తీర్మానాన్ని (1914 ఆగస్టు 11) అనుసరించి ప్రభుత్వం G. O No. 196 Educational జారీ చేసింది ఈ గెలుపు గ్రాంథికభాషావాదుల తలకెక్కి కొందరిచేత తైతక్కలాడించలేకపోలేదు. మరికొందరి పైత్యం కవిత్వమయి విజయగీతాలు పాడించింది. "మూడు సంవత్సరము లాంధ్ర లోకమునంతను గలవరపెట్టిన గ్రామ్యవాద మంతటితో నంతరించెను" అని జయంతిరామయ్య సంతృప్తిపడ్డాడు. 34 హితకారిణి, సువర్ణలేఖ, ఆంధ్రపత్రిక ఉబ్బితబ్బిబ్బౌతున్నప్పుడు మరింత ముందుచూపుతో త్రిలిఙ్గ రాసిన మాటలు గమనింపదగ్గవి:

.... దూరదృష్టితో ఆలోచించిన వారెవరును ఈ వాదముల జీవమరణములకు విశ్వవిద్యాలయము కర్తయని యెప్పుడును తలంపరు. దానినిగాని దీనినిగాని విద్యాధికులైన గ్రంథకర్తలు పరిత్యజించినప్పుడే అదిగాని ఇదిగాని ఓడినదని చెప్పవలసియున్నది....గ్రంథకర్తలకు తీర్పుచెప్పెడి అధికారము విశ్వవిద్యాలయమునకు లేదు....

విశ్వవిద్యాలయం ఏర్పరచిన తెలుగు వ్యాసరచనా సంఘ తీర్మానాలనుబట్టి అర్థానుస్వార శకటరేఫలు రచయితల యిష్టానికి లోబడ్డాయి; వ్యాకరణ సూత్రాలు కొన్ని సడలేందుకు వీలుకలిగింది; సంధి కొన్నివిషయాలలో ఐచ్ఛికమైంది; సంభాషణ ధోరణి ననుసరించి వీలైనంత వరకు రచనలు చేయడం మంచిదేనని తేలింది. కాబట్టి

దీనివలన ఏమి తేలుచున్నది ? గ్రాంథికభాషకు కట్టుబాటులు కొన్ని పోయినవి. వ్యావహారిక భాషకు లేని అంగీకారము కొంతవచ్చినది. ఇది గ్రాంథిక భాషకు విజయమా ? వ్యావహారిక భాషకు విజయమా ?....35

ఎటొచ్చీ గ్రాంథికభాషా ప్రాచుర్యమే అపారమైన నవ్యసాహిత్యానికీ వాఙ్మయానికీ వెలిబడి పాఠ్యగ్రంథాలను ఆశ్రయించుకొని జీవద్భాషకు దూరంగానూ వెలిగానూ కాపురం చేయవలసివచ్చింది. అది జీవసమాధి.

1914 ఏప్రిల్‌లో కాకినాడలో ఆం. స. ప. మూడవ సాంవత్సరిక సభ జరిగినప్పుడు మళ్ళీ ఇంకొకమారు గిడుగు, గురజాడలిద్దరూ వ్యావహారిక భాషా వాదాన్ని ప్రస్తావించారు. "గ్రామ్య" గ్రాంథికాల తారతమ్యపరిశీలనకోసం కొంత కాలంకిందట ఏర్పాటైవున్న ఉపసంఘమొకటి కాలం వెళ్ళబుచ్చిందేగాని పనిచెయ్య లేదు కాబట్టి కార్యనిర్వాహకవర్గ సభలో "గ్రామ్య" గ్రాంథికచర్చ వాయిదావెయ్యవల సిందని గిడుగు ఒకతీర్మానం ప్రతిపాదించారు. గురజాడ దాన్ని బలపరుస్తూ మాట్లాడాడు. అధ్యక్షస్థానంనుంచి కిడాంబిరామానుజాచార్యులు సూచించిన సవరణ వైఖరి విజయగర్వోన్మత్తుల చెవికెక్కేటంత కాదు. 1912 లో మద్రాసు పండిత సభ ఏతీర్మానాలను చేసిందో వాటికే ఆం. సా. ప. కట్టుబడి ఉంటుందని నిర్ణయమైంది.

ఆంధ్ర సాహిత్య పరిషత్తులో అప్పటికే కొత్త గొంతులు వినిపిస్తున్నాయి. కుర్రవాళ్ళు అప్పారావునూ రామమూర్తినీ చూచీ వినీ మెప్పును చెప్పిపెట్టుకొని వుంటున్నారట. ఆంధ్రోద్యమంలోని "స్వదేశాభిమానులు" సాహిత్య పరిషత్తు అట కట్టిస్తారని అప్పారావు ఆశలు పెట్టుకొంటున్నాడు.* ముందు మదరాసులో జరుప దలచిన కార్యవర్గ సమావేశాన్ని చెప్పాపెట్టకుండా బెజవాడకు మార్చుకొన్న సందర్భంలో "మోడ్రన్ పిల్లకాయలు" గోల చేస్తారేమోనని నేడు "బెజవాడకు దేకిరించినవారు రేపు ఉత్తర ధ్రువానికి దేకిరిస్తారు," అని రాశాడు. ఆంధ్ర మహా సభకు అంటకుండా పరిషత్తును కాపాడుకు వస్తున్నట్లుందిగాని, పదిమంది మెదిలే చోట పదుగురూ హాజరయ్యే విధంగా సభలు జరపకపోవడం చూస్తుంటే, పరిషత్తు ముఠాగా తయారైందని అనిపించకపోదు.36

భాష గురించీ దేశం గురించీ ముందుచూపూ మేలుచూపూ కలిగిన వారికి కొత్తతరం మీద ఇంత గురి ఉండటం సహజమే. అయితే దేశానికి దేశం, భాషకు భాష, ఒకటి విజాతీయ ప్రభువులకూ మరొకటి జాతీయ పండిత ప్రభువులకూ ఊడిగం చేసే దురవస్థ తప్పలేదు. దేహం అలిసిపోయి, మనస్సుపెట్టే శ్రమకు ఎదురు తిరిగింది. అప్పారావు మంచం పట్టాడు. ప్రపంచయుద్ధం వెనువెంటనే

* ద్వితీయాంధ్ర మహాసభ (1914) బెజవాడలో జరిగినప్పుడు అప్పారావు హాజరయ్యాడు.

గురజాడ అప్పారావులో జీవన్మరణాల మధ్య అంతర్యుద్ధం ప్రారంభమైంది. కాకినాడ మహాసభలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చూచిన అప్పారావు రూపం–

తెల్లటి పంచ, నల్లటి పొడుగు కోటు, ఆ కోటుమీద ఆకుపచ్చని జలతారు శాలువ, శిరస్సున తేజో మండలంలాగ నిండైన పాగా, పరిణత వయస్కతకు సూచకంగా తిలతండుల న్యాయంగా వుండిన గుప్పెడేసి మీసాలు, పట్టి పల్లారుస్తున్న దీర్ఘవ్యాధికి గుర్తుగా చప్పిదవడలు, కాని దూసుకుపోయే చురుకైన చూపులు.37

— త్వరలో మబ్బు మరుగుకు వెళ్ళింది.

---

1. గు. ర. వ్యా. గ్రామ్యశబ్ద విచారణము, పు. 59
2. నా జీవితకథ : నవ్యాంధ్రము : అయ్యదేవర కాళేశ్వరరావు, పు. 138-148
3. వ్యాసావళి : వ్యావహారిక భాషాబహిష్కార నిరసనము : గిడుగు రామమూర్తి, పు. 29
4. గు. ర. లే. పు. 16
5. New currents in Telugu Song : *P. Seshadri*, The Fducational Review July 1913.
6. గ్రామ్యాదేశ నిరసనము : వేదం వేంకటరాయశాస్త్రి, పు. 2
7. వ్యాససంగ్రహము : Reminiscences : *J. A. Yates*, పు. 25
8. Cit. in The Gramy acontroversy : *Ed. P. Suri Sastri, p. 25*
9. Cit. in Modern Telugu : *Ed. Secretary, Andhra Bhasha Samrakshaka Samajam, Cocanada.*
10. The Modern Telugu prose – A Review : *V. Subbarow, p. 9*
11. Cit. in 10, p. 11–12
12. Cit. in 8, p. 11
13. University of Madras : Report of the Intermediate Telugu Composition Committee together with a Minute of Dissent there to signed by four Members and Remarks thereon by *Mr. G. V. Apparao*, (Abbr. Report of I.T.C.) Annexure No. 1 : p. 5
14. గు. ర. లే., పు. 95
15. సాహిత్యోపన్యాసములు : గిడుగు వెంకటరామమూర్తి పంతులు ; గిడుగు వేంకట సీతాపతి, పు. 21
16. గు. ర. వ్యా : విశ్వవిద్యాలయములు : సంస్కృత, మాతృభాషలు : పు. 103

17. గు. ర. తే; పు. 106
18. ఆంధ్రసాహిత్య పరిషత్ ప్రథమ సాంవత్సరిక సభా వృత్తాంతము :
ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక : సంపుటం 1 సంచిక 1
19. A Defence of Literary Telugu : *Jayanti Ramayya,* *p. 14*
20. ఆంధ్ర సాహిత్య పరిషద్వృత్తాంతము : జయంతి రామయ్య;
ఆంధ్ర సాహిత్య పరిషత్తు రజతోత్సవ సంపుటము. పు. 35-37
21. చూడు 18
22. చూడు 'మబ్బుచాటు కిరణాలు' : అనుబంధం 1
వేదం వేంకటరాయశాస్త్రి లేఖలు. నెం. 2
23. గ్రామ్యాదేశ నిరసనము, పు. 49
24. చూడు 20. పు. 44
25. గు. ర. తే., పు. 131
26. విశ్వవిద్యాలయము : త్రిలిఙ్గ. సంపుటము 1 సంచిక 5. 1914 మే
27. The Telugu Language : Kelleth Hall Meeting :
*Letters to the Editor THE HINDU -- cit in No. 8*
28. Introduction to the Dictionary of the Telugu Language :
*C. P. Brown*
cit. in A Memorandum on Modern Telugu :
*Rao Saheb G. V. Ramamurti.*
29. చూడు 19. పు. 75-76
30. చూడు 20. పు. 7
31. చూడు Report of the ITC (13)
32. The Telugu composition controversy Part I. The Minute of Dissent to the Report of the Telugu Composition Sub-Committee : *G. V. Appa Rao, B. A., F. M. U., p. 114*
33. గి రాం మూర్తి (వ్యా) : శ్రీశ్రీ· నవోదయ : వారం-వారం, 17.1.1948
34. చూడు 20, పు. 44
35. విశ్వవిద్యాలయముచే నేర్పఱుపఁబడిన తెలుగు వచన రచనా
సంఘము(వ్యా) త్రిలిఙ్గ, సంపుటం 1 సంచిక 10. 1914 అక్టోబరు
36. గు. ర. తే., పు. 188 - 191
37. మార్గదర్శి గురజాడ అప్పారావు (వ్యా) :
శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, నవోదయ 8-2-1946

# అరుణోదయం

"ప్రమందుటున్నది బొందెమార్చుట"

..."విజయనగరం వద్దామనుకున్నప్పుడు నాకుజ్ఞాపకం రాలేదు గాని, ఇది గురజాడ అప్పారావుగారిఊరు. అప్పారావుగారిల్లుకూడా చూశాను. ఇవన్నీ చూస్తుంటే నాకేదో గర్వంగా ఉంది." నారాయణ అనే ఒకానొక విద్యార్థి పై చదువులకోసం విజయనగరం వెళ్ళి అక్కడి వింతలూ విశేషాలూ తనమేనమామ వెంకటేశ్వర్లుకు ఒక లేఖలో వర్ణిస్తున్నాడు. ఈ నారాయణ, కొడవటిగంటి కుటుంబరావుగారి తాజానవల *అనుభవం*లో నాయకుడు. ఆయన చదివింది కూడా విజయనగరంలోనని తెలిసినప్పుడు, అలాఎందరు ఆంధ్ర విద్యార్థులు విజయనగరాన్ని గురజాడ అప్పారావుగారి ఊరుగా ఎంచుకున్నారో ననిపిస్తుంది.

కథను చదివి వాస్తవ జీవితానికి వచ్చినా ఇదే కనిపిస్తుంది. గురజాడ రామదాసుగారు ఒక ఉదంతం చెబుతున్నారు:

తమ ఇల్లు "లలిత్" దాపున కొందరు విద్యార్థులు అద్దెఇంట్లో ఉండే వారు. వారిలో *శుక్లపక్షం* కవిగానున్న అనంతపంతుల రామలింగస్వామి గారొకరు. ఒక రోజున ఒక అబ్బాయి ఆయనతో, తనకు *కన్యాశుల్క* నాటక కర్త అయిన శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారిని దర్శించాలని ఎన్నాళ్ళ నుంచో కోరిక ఉందని చెప్పాడు. రామలింగస్వామి నవ్వుకొన్నాడు. రేపొద్దుట చూపిస్తాను అన్నాడు. ఎక్కడ, అని ఆత్రంగా అడిగాడు ఆ అబ్బాయి. ఎక్కడ బడితే అక్కడే!....ఇదుగో, ఈ మన గడపముందే చూపించగలను అన్నాడు రామలింగస్వామి. తెల్లారింది. శ్రీశ్రీశ్రీ అప్పారావు పంతులుగారు పదిమందిని వెంటబెట్టుకుని ఆ వీధి మీదుగానే కోటకు వెళుతున్నారు. రామలింగస్వామి ఆ అబ్బాయినిపిలిచి చూపించాడు. పాగాచుట్టుకుని శాలువా కప్పుకుని గొడుగు వేసుకొని వెళుతున్నారు చూశావా, వారే శ్రీశ్రీశ్రీ ...., అన్నాడు. ఆ అబ్బాయి మరి నిలవలేదు. అంగలు వేసుకొంటూ వీధిలోకి దూకి

అప్పారావు ముందుకు వెళ్ళి అడ్డంనిలిచి నమస్కరించి, తమరేనా కన్యాశుల్కం రాసిన ....? అని అడిగాడు. ఆ అప్పారావుని నేను కాదు, నేనింకో అప్పారావుని, అని జవాబు వచ్చేసరికి అతగాడు తెల్లబోయి ఆశాభంగం చెంది, రామలింగస్వామి వద్దకు గబగబా నడిచిపోయి, ఎవరో దారినిబోయే దానయ్యను చూపెట్టి పంతులుగారని చెప్పి టోకరా ఇస్తావా నాకు, అని నిలదీశాడు. రామలింగస్వామి విరగబడినవ్వి ఓరి పిచ్చిసన్నాసీ : ఇంతేనా నీ తెలివి ? ఆయన ప్రతీ మాటలోనూ హాస్యం ఉంటుంది. అర్థంకాదాను; ఆ మాటలకు అర్థమేమిటో తెలీలేదూ ? కన్యాశుల్కం రాసినప్పటి అప్పారావును కానిప్పుడూ. నేను మారిపోయాను సుమీ, అని అర్థమోయ్, తెలిసిందా ? అని అన్నాడు. రెండోసారు తెల్లబోయాడా కుర్రాడు. అయితే ఇంతలో ముఖం విప్పారింది. కళ్ళలో తృప్తి....

కుటుంబరావుగారి కథనంలాగే ఇదికల్పితమూకాదు. యథార్థ వాస్తవమూఅయి ఉండకపోవచ్చు. రెండూ నమ్మదగ్గ కథలే. ఇంతెందుకు ? తాను కొత్తగా స్థాపించబోతున్న అచ్చుపనిశాలకు విజయనగరం సంస్థానం వారి తాలూకు ఇల్లొకటి రాజమండ్రిలో అద్దెకు దొరుకుతుందేమోనని, చిలకమర్తి లక్ష్మీనరసింహం విజయనగరానికివెళ్ళి అప్పారావునూ, ఫౌలర్ (Fowler) దొరనూఆశ్రయించినట్లురాసుకొన్నాడు. అది 1915 సంవత్సరం. అప్పారావు పసిదప్పి ఉన్నాడని ఆయనకు తోచలేదు. తన పని సానుకూలం చేసిపెట్టలేదనే బాధ. నిన్న మొన్నటివరకు వ్యావహారిక భాషావాద వ్యతిరేక ప్రచారం చేయడానికి పిఠాపురం రాజా ఇచ్చిన డబ్బుతో తానూ పురాణపండ మల్లయ్యశాస్త్రీ, పానుగంటి లక్ష్మీనరసింహారావూ, కూచి నరసింహమూపోయి వచ్చి ఉన్నారు.[2] అయినా తనకుచేతనైన పనైతే అప్పారావుచేసిపెట్టేవాడు. ఇలాంటి విషయాలలో ఆయనకు అరకొరలులేవు ప్రచండగ్రాంథికభాషావాదిగా వుండినవేదం వేంకటరాయశాస్త్రిఅప్పారావుకుఅత్యంతమిత్రుడే. 1915 జనవరిలో కాఫీకాచుకుంటున్నప్పుడు మరిగేనీళ్ళు చేతులపైబడి బొబ్బలెక్కి అప్పారావు బాధపడుతున్నాడనివిని, నెల్లూరు నుంచి ఉత్తరం రాస్తూ వేంకటరాయశాస్త్రి చూపెట్టిన మిత్రభావం స్మరింపదగింది. ఆయనకుగూడా అప్పారావు గురించి చిన్నమెత్తు అసంతృప్తి ఉండేది. మెట్రిక్, ఇంటర్, బి. ఏ. ల పరీక్షాధికార్ల బోర్డునుంచి తనను తొలగించారు; "మీరే గనక నా యెడల దయచూపి వుండినట్లయితే యిది సంభవించెడిదికాదేమో అనుకుంటాను." [3]

ఒకందుకొకరు ఇంకొకందుకు ఇంకొకరు, అనేకులిలా అప్పారావును గౌర

వించకతప్పని రోజులవి. కందుకూరి వీరేశలింగంతోకూడా ఆయనకు సత్సంబంధాలే ఉండేవి. కలకత్తాకు పోయే దారిలో విజయనగరం స్టేషనులో ఆయనకు ఉపాహారం తెచ్చి యిచ్చింది అప్పారావు అయి ఉండవచ్చునని వీరేశలింగం డైరీలబట్టి తెలుస్తుంది. అలాగే అప్పారావు డైరీలలో, తాను మద్రాసుకు ప్రయాణంవేస్తున్న బండిలో వీరేశలింగం ఎక్కడమూ, ఇద్దరూ కలసి ప్రయాణం చెయ్యడమూ ప్రసక్తమైంది 4 మరొకచోట రెండు పుటల తర్వాతనే-వీరేశలింగం లైబ్రరీ గురించి ఆశ్చర్యార్థక సంజ్ఞతో మరో ప్రస్తావన. రాజమండ్రిలో వీరేశలింగం పబ్లిక్ లైబ్రరీ వార్షికోత్సవాలకు అధ్యక్షత వహించడంకూడా అప్పుడే జరిగింది. 1914లో ఒక మారు మద్రాసులో అప్పారావు తనను కలుసుకున్నాడనికూడా వీరేశలింగం తన డైరీలో రాసిపెట్టుకున్నాడు. కాబట్టి గ్రాంథిక, వ్యావహారిక భాషావాద వివాదాలవల్ల సమకాలిక ప్రముఖులతో అప్పారావుసంబంధాలు బెడిసిపోలేదు. పైగా, వారినివ్యక్తులుగానూ, పండితులుగానూ ఆయన గౌరవిస్తూనే వచ్చాడు. * అవసరమైనప్పుడు మాత్రం. వారి లోపాలను పరమ నిర్దాక్షిణ్యంగా ఎత్తిచూపాడు. *మినిట్ ఆఫ్ డిస్సెంట్*లో వీరేశలింగం, చిలకమర్తి వగైరాల లోపభూయిష్ఠమైన వచనశైలిని సోదాహరణంగా విమర్శించిగాని వదల లేదు. అలాగే, ఒక వైపు వేదం వేంకటరాయశాస్త్రి ఆంధ్రీకరించిన *కథాసరిత్సాగరము* ఆధునికాంధ్రవచనశైలికి ప్రామాణిక గ్రంథం కావచ్చు నా అని శాస్త్రి నడుగుతూ, ఇంకొకవైపు నిష్కర్షగా ఆయన నాటకాలను విమర్శించ గలిగాడు. మాటలునాన్చని ఈ ధోరణివల్ల ఆయన వాళ్ల గౌరవభావాన్ని రాబట్టాడు. మీదను పేర్కొన్న లేఖలో వేంకటరాయశాస్త్రి అప్పారావు నుద్దేశించి రాసినమాటలు ఆయన హృదయంనుంచి వచ్చినవే అనుకోవాలి. *ఆముక్తమాల్యద*కు ఆయన రాస్తూవచ్చిన వ్యాఖ్యానం గురించి వాకబు చేసినందుకే ఉబ్బిపోయి, సజ్జనుడైన శాస్త్రి ఇలారాశాడు : "నిజమైన సాహిత్యవ్యాసంగమును హర్షించ గలవారు మనదేశములో బహుకొద్దిమంది ఆ కొద్దిమందిలో మీరు ఒకరు. అలాంటి మీరు, *శృంగార నైషధము* పై నావ్యాఖ్యానము ఎలా వున్నదో వ్రాసినారు కాదు .... మీరు మీ అభిప్రాయముగా నాలుగు పంక్తులు వ్రాయనందుకు, నా మనసు క్షోభ పడుతున్నదంటే, మీరు ఆశ్చర్య పడనక్కరలేదు."

వ్యావహారిక భాషావాదం విశ్వవిద్యాలయంలో ఓడిపోయిందిగదాఅని

---

* ప్రతిపక్షులను గౌరవించడమనేది అప్పారావు సుగుణాలలో ఒకటని ఆయన సంస్మరణ సభలో (1915) ఒకవక్త పేర్కొన్నాడు.

దిగులుతో ఎవరూ మంచమెక్కలేదు. పైపెచ్చు, పరీక్షాధికారిగా పాఠ్యపుస్తక నిర్ణయాధికారిగా మునుపుగూడా చూపి ఉండని పట్టుదలను అప్పారావు ఇప్పుడు చూపసాగాడు. 1916 సంవత్సరపు మెట్రిక్యులేషను పరీక్షకు 1914 లోనే పాఠ్యాలను సూచిస్తూ, పూర్వకావ్యాలకు సంబంధించిన ప్రశ్నపత్రాలను దిద్దే సహాయ పరీక్షకులు శిష్ట వ్యావహారిక పదాలను వాడిన విద్యార్థులకు మార్కులు తగ్గించడం గురించి అభ్యంతరం చెబుతూ; యం. ఏ. విద్యార్థులలో ముగ్గురిని మాత్రమే ప్యాసు చేసినందుకు జయంతి రామయ్య విషయమై వ్యధ చెందుతూ: ఇంటర్మీడియెటు పాఠ్యపుస్తకాలను నిర్ణయించే విషయంలో గుమ్మడూరి వెంకటరంగారావుతో ఘర్షిస్తూ; యస్. యస్. యల్. సి. పరీక్షలో ఆధునికాంధ్రానికి సంబంధించిన విషయాలను గురించి సహాయ పరీక్షకులకు సూచనలిస్తూ: విశ్వవిద్యాలయ వ్యవహారాల్లో విశ్వరూపం ధరించి పోట్లాడుతూనే వచ్చాడు.

లోపల తన జవసత్వాలు హరించుకుపోతున్నాయనే స్పృహకూడా ఆయనకు లేదు. 1914 జూలైలో విశ్వవిద్యాలయ పరీక్షకుల సమావేశానికి ప్రయాణమై కూడా, వాల్తేరు రైలుస్టేషనుకు పోయేసరికే, ఆగిపోవలసివచ్చింది. ఆ నెలాఖరులో మళ్ళీ సుస్తీ. భాషాయుద్ధం ఆయన దేహాన్ని పీల్చి పిప్పిచేసింది. ఏట్సు ఒక లేఖలో రాసినట్లు, "నిరంతరం పనిచేయడంవల్ల మీ ఆరోగ్యం సడలి" పోయింది. నీరసం, దానితోబాటు చికాకు, నరాల నలుపు. లోగడకూడా 'కష్టం' తగిలేదిగాని ఇదిఅదికాదు. ఏదైనాకావచ్చు – మిత్రవ చూపుడువేలేనేమో – వైద్యులకు చూపించుకోవాలి. విశాఖపట్నం పెద్దాసుపత్రి డాక్టర్లు అఖండులు. కాబట్టి వాల్తేరు స్టేషనులో బండిచేసుకొని సరాసరి పి. టి. శ్రీనివాసయ్యంగారు ఇంటికి వెళ్ళాడు. జ్వరం రెండు మూడు రోజుల్లో తిరుగుముఖం పట్టింది. ఒక గండం గడిచింది.

జీవితం అంతా దిన దిన గండమేగాని ఆయుస్సు నూరేళ్ళలో సగమే. మళ్ళీ ఒంటికి శ్రమ. మిత్రులతో, విద్యాధికారులతో, ప్రముఖులతో ఉత్తరప్రత్యుత్తరాలొక వంక; ఇంటి కట్టుబడీ తోట సాగుబడీ ఇంకోవంక. నవంబరు 18 న విజయనగరానికి దాపునేవున్న పూటిగడ్డదరిని తన తోట చూడబోయాడు. ఎండ నిగిడి కాస్తున్నది. రెండురోజుల తర్వాతగాని దాని తడాఖా తన దేహాన కనిపించలేదు. మళ్ళీకాక. అయినా మొండికిపడ్డట్లు రేపటెండలోనూ మాపటెండలోనూ తోటకు పోయివస్తుండినట్లు డైరీ చెబుతున్నది. ఇంట్లోవున్నప్పుడు కుదురుగా పండుకోక, కాలక్షేపంకోసం

వంటింటికి దారితీసి, విస్తరంట్లు కుడుతూ కూర్చుంటున్నాడు. కిళాంబి రామానుజాచార్యుల ఇంటికో, కోటకో, లేకుంటే వీధుల్లోకో కాళ్ళను నడుపుతున్నారు. ఎండపొడ నీకుచెరుపుసుమీ, అని 1895 లోనే డాక్టర్ బ్రౌనింగుచేసిన హెచ్చరికలు గాలిలో కలిశాయి:

> పొద్దున్న యిల్లుకదలకుండా వున్నట్లయితే, టెంపరేచరు తగ్గివుండేదనుకుంటాను.
>
> ఇవాళవరకూ నేను ఉదయం బయటికెక్కడికీ వెళ్ళందే.
>
> మీకు జ్వరం సాధారణంగా రాదనీ, వస్తే ఆట్టేకాలం వుండదనీ డాక్టరు బ్రౌనింగు నాకుచెప్పాడు. వొంటికి యేమాత్రం ఎండతగలకుండా కాపాడుకోమని సలహాయిచ్చాడు.
>
> బహుశా ఊటీలో ఉండడంవల్లనేమో, నా శరీరానికేమాత్రం యెండంటే గిట్టకుండావుంది. నరాలను అది నీరసపరిచిందా యేమిటి చెప్మా : 6

థర్మామీటరు తప్పేమిటి, అది ఎప్పటికప్పుడు జ్వరాన్ని చూపెడుతూఉంది. కడుపులో చురుక్కుమంటూ మొదలై పరపరకోసేంతగా నొప్పి. నల్లమందు మింగితేనే గాని లాభంలేకపోయింది. ఆముదంతాగితే జ్వరం తగ్గువల చూపింది. ఇది కాకతాళీయమా లేక కార్యకారణ సంబంధమేదైనా ఉందా ? ఎలాగైతేనేమి, ఒళ్ళు మళ్ళీ తేలికపడింది. లోకాభిరామాయణాలకూ లౌకికవ్యవహారాలకూ మనస్సు మళ్ళీ మొగ్గింది. ఎస్టేటు కేసుతాలూకు పత్రాలను మహారాణీ లలితకుమారితో కలసిచూస్తూ, మళ్ళీ తోటకెసిపోతూ, మూడపమారు, ఆరోగ్యాన్ని అగ్నిపరీక్షకూ తనపాలిటికి అగ్నివంటిదే అయిన డిసెంబరు మాసపు ఎండ శిక్షకూ అగ్గంచేశాడు. జబ్బు తిరగదోడింది.

He is a fit Subject for the British Museum, అని అన్నాడు డాక్టరుబ్రౌనింగు. అయినా, తనకువచ్చిన ప్రమాదమేదీ లేదని భరోసా ఇచ్చాడు. నిజమే, చూట్టానికి 'ఒంటూపిరి'వాడే కావచ్చుగాని, సైకిలు తొక్కేవాడు, * స్వారిచేసేవాడు, ఈతకొట్టేవాడు, పింగ్‌పాంగ్ ఆడేవాడు : విశ్రాంతి లోపించడమే ఇంతవండ తెచ్చిపెట్టింది. వీరాంజనేయుడైనా బలభీముడైనా గుల్లకావలసిన వ్యాప

---

*ఆనందగజపతి తనసంస్థానోద్యోగులకందరికీ తలా ఒకసైకిలు మద్రాసునుంచి తెప్పించి ఇచ్చాడు. ఆరోజుల్లో అదేగొప్ప.

కాలూ వ్యాకులాలూ తనవి. తమ హోదాకు తగినట్లుగా తమ "భృత్యుడైన" అప్పారావుకు రీవారాణి ఇచ్చిపోయిన బెంగుళూరు ఎత్తబండి పుష్పక విమాన మేమీ కాదు. సూర్యుడికి గొడుగు గుడ్డ అడ్డమని తాననుకోవచ్చుగాని, ఎండ అనుకోవద్దూ? శాలువామీద శాలువా, కోటుమీద కోటు, కాళ్ళకుసాక్సూ, ఒంటికిరగ్గూ—చలినుంచి కాపాడుతాయిగాని, ఎండో?

బ్రౌనింగ్ స్థానే సర్జనుగా ఉంచిన నంజుండరావు సలహా మేరకు రాత్రి భోజనంలో పాలు తీసుకోవడం మామూలైంది. బాగా కాగి చల్లారిన పాలు. కాని 1912లో నాలుక పుండుపడినప్పుడు, పాలు ముట్టవద్దన్నారు. అది మానగానే పాలూ, కాఫీ మళ్ళీ ప్రవేశించాయి. మరి ఆ పాలే ఇప్పుడు వికటిస్తున్నాయి. విరేచనాలకు మందు పుచ్చుకోవడమే ఎరుగని మనిషికి పాలే మందుపని చేసేవి. ఇప్పుడు ఎంతేసి మోతాదులో కార్బనేటుమిక్సం తీసుకున్నా, మలవిసర్జనం కావడం లేదు. ఆముదం తాగి ఇటు మనిషి అలైపోయాడు. అరటికాయ, బెండకాయ శాకాలంటే నోరూరే జిహ్వకు అవి రెండూ సరిపడనివయ్యాయి. బర్నెయో మెన్యువల్ ప్రకారం మలబద్ధకానికీ తగుమాత్రపు జ్వరానికీ లంకె. జ్వరమే కాదిప్పుడు, దాని వెంట తలపోటు, నోటిపూత, అరుచి. ఆకలి వెయ్యదు. తిన్నా అరుగుడు పడదు. కడుపు నొప్పి.

బొంకుల దిబ్బగా పేరుబడినచోట నిల్చుని పదిమంది మధ్య చేరి లోకాభిరామాయణం మాట్లాడుతూ King of Bunk గా పేరుబడిన గురజాడ అప్పారావుకు, లోకం ఇప్పుడు అభిరామంగా ఏమీ కనిపించడం లేదు. ప్రపంచ రణం భీషణంగా తయారైంది.

1914 ఆగస్టు 4 న బ్రిటిష్ సామ్రాజ్యం జర్మనీతో ఢీ కొంది. ఆ తాకిడికి యూరపు ఖండం తూలిపోయింది. పరోక్షంగానైనా, యుద్ధం భారత దేశాన్ని తాకింది. 'ఎమ్డన్ దెబ్బ' నటుంచినా, సిపాయిల రూపేణా, రూపాయిల రూపేణా దేశీయ జన ధనబలాలు యుద్ధపు చిచ్చులో పడి బొగ్గుగా మాడక తప్పలేదు. బ్రిటన్ అనుకూల ప్రచారమనేది లేకపోయినా, దేశీయులలో 'లిబరల్సు' గానీ కాంగ్రెసు సంస్థగానీ ఆ దేశాన్ని కాదని జర్మనీని వరించే సమస్యఉండదు. మహాత్ముడు కాక ముందు మోహన్దాస్ కరంచంద్ గాంధీ, సామ్రాజ్యం కోసం ఒకప్పుడు ఐచ్ఛిక భటుల దళాన్ని నిర్మించాడని మరవగూడదు. ఆ సంవత్సరం డిసెంబరులో కాంగ్రెసు మహాసభ మద్రాసులో మళ్ళీ జరిగింది. గురజాడ అప్పారావు వెళ్ళలేదు. గవర్నరు

లార్డ్ పెంట్లాం (Lord Pentland) హాజరైన ఆ సభలో బెంగాల్ పులి సురేంద్రనాథ బెనర్జీ రాజభక్తి తీర్మానం ప్రతిపాదించాడు. అప్పారావు గుండె చప్పుళ్ళు కూడా ఆ తీర్మానంలో వినిపించకపోవు.

యుద్ధ ప్రారంభంలో "మిత్ర" రాజ్యాలకు చుక్కెదురు కావడం అందరికీ విస్మయాన్ని కలిగించింది. మూడంటే మూడు వారాల్లోనే జర్మన్లు ఫ్రెంచి సరిహద్దు చేరుకోగలిగారు. ఫ్రాన్సులో ఉన్న బ్రిటిష్, ఫ్రెంచి సేనల నడిమి జాగాలో దూరి చీలగొట్టి దెబ్బ తీద్దామనుకొన్న జర్మన్ పథకం మాత్రం దెబ్బతినింది. సెప్టెంబరు 1914 నుంచి యుద్ధ పరిసమాప్తిదాకా జర్మన్లూ, ఆంగ్లో - ఫ్రెంచి బలాలూ ముఖాముఖిగా నిల్చుని, కందకాలు తవ్వుకొని ఇనప ముళ్ళదీగె ఆవరణలతో కందక యుద్ధకాండ (Trench Warfare) చేస్తూ వచ్చాయి. జర్మన్ తొలి తాకిడికి వెనక్కు తూలి మళ్ళీ నిపాయించుకొన్న కొత్తల్లో, డరెల్ (Durrell) అనే స్నేహితుడు లండనునుంచి అప్పారావు కొకజాబు రాశాడు (అక్టోబరు 10 1914). అప్పారావు జాబుకు జవాబే అది. ఫ్రాన్సు నుంచి – అంటే బాంబుల వరాల నుంచి అతను బయటపడి, పదిహేను రోజులే అయింది. మళ్ళీ యుద్ధరంగంలోకి త్వరలోనే పోవాలి. పారిస్ లైబ్రరీల నుంచి తనకు కావలసిన సమాచారం కోసం అక్కడి విశ్వ విద్యాలయంలోని హిస్టరీ ప్రొఫెసరుకూ లైబ్రేరియన్‌కూ రాసిన విధంగానే, డరెల్‌కుగూడా అప్పారావు ఉత్తరాలురాసి ఉన్నాడు. డూప్లే (Dupleix) ని గురించి ఫ్రెంచి వాళ్లు రాసిన పుస్తకమేదైనా కావాలి.7 ఈ పని యుద్ధరంగంలో ఉండిన తన స్నేహితుడికి అప్పజెప్పాడు డరెల్.

డరెల్ జాబు అప్పారావు మనస్సును సామ్రాజ్యానుకూలంగా మార్చిఉంటుంది. జర్మనీదే యుద్ధానికంతటికీ బాధ్యత. ఈ పరాజయాలకు గూడా తమ గొప్పతనమే కారణమట : పార్లమెంటరీ వ్యవస్థగల దేశానికీ సైనిక నియంతృత్వం గల దేశానికీ ఇదేనట భేదం. ఒకటి త్వరగా దెబ్బ తీస్తుంది, మరొకటి నెమ్మది మీద బలం పుంజుకొని కలియబడుతుంది. జర్మనీలా బ్రిటన్ కూడా భయంకరాయుధాలను ముందుగానే నిర్మించుకోకపోవడమే తమ నాగరికత ఉత్కృష్టతకున్నూ, ప్రజాతంత్ర విధానానికిన్నీ గీటురాయి. అందుచేత భారతదేశం ఉదార హృదయంతో బ్రిటీష్ వారి అపరాధ సహస్రాన్ని మరచి కష్టకాలంలో ఆదుకొని "చరిత్రలో మన్ననలు పొందాలి. గౌరవమైన పద్ధతులతో ఈ రెండు దేశాల సంబంధం అభివృద్ధికి రావాలి. మా పరిపాలనలో అనేకలోట్లు, దోషాలు వుండ

వచ్చును. నిజమే అయినా మనం పేరు అనుకోరాదు. భారతీయులు ఇలాంటిస్వల్ప విషయాలను మరచిపోయి, మొత్తం యుద్ధాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించాలి." 8 మిత్రరాజ్యాల యుద్ధప్రచారం బ్రిటిష్ ప్రభుత్వ కరపత్రాల రూపాన తెలుగుదేశాన ప్రవేశించిన కాలంలో ఆంగ్లేయుల ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా యుద్ధప్రచారానికి ఉపకరించాయని ఈ లేఖ తెలియ జేస్తుంది.

దీని ప్రభావం ఒక విధంగా అప్పారావు చేత [illegible] గేయం రాయించిదనుకోవాలి. దరెల్ మాటలకు అప్పారావు మోసపోయాడని కాదు. చరిత్ర విద్యార్థిగా లోకఘటనా పరిశీలకుడుగా యుద్ధానికి గల పూర్వాపరాలు తనంతతాను తెలుసుకోగలడు. జ్ఞానాన్ని, స్వాతంత్ర్యాన్ని ఇచ్చే బ్రిటిష్ దొరతనం, వర్ధిల్లాలనడం అప్పారావు ఒక్కడికేగాక ఆ కాలపు 'లిబరల్స్' యావన్మందికీ పాతపాటే కొత్త యుద్ధాలకు పాతసంధులే కారణ మనడంలోనే, అప్పారావు ప్రత్యేకత ఉంది. వర్సెయిల్సు శాంతిసంధి నాలుగేళ్ళ కావలేకున్నా, గతచరిత్రనుబట్టి,

> పాతసంధులు కట్టిపెట్టుము
> యుద్ధముల కవి ఉనికి పట్టులు
> లోకమంతయు యేకమై
> యుద్ధమును పూరణము చేయును.

అని ముందుచూపుతో చెప్పగలడు. "నరుల పీనుగు పెంట"లలో "శాంతివృక్షం" నాటుకోవడం అప్పుడే — లోకమంతయు యేకమై యుద్ధ ప్రతికూల మైనప్పుడే — సాధ్యపడ గలదు. కవికున్న జ్ఞానం రాజకీయవేత్తకు ఉండి ఉంటే, 1919 శాంతిసంధి మరో మహాయుద్ధానికి రాదారి వెయ్యకపోను. "కత్తివైరము" గురించి ఎన్నడూ సహనంచూపని ఈ కవి, 17–1–1915 కు ముందు వేదం వేంకటరాయశాస్త్రికి ఒక లేఖలో "సైనిక అనుభవము వ్యసనములలో చేర్చ దగినదని" రాయడం వింతకాల్పదు.

# 2

శ్రీఆనందనామ సంవత్సరంలో ప్రపంచం గురించి మట్టుకే అప్పారావు బెంగ పెట్టుకోలేదు. తన మనస్సు వెనకతట్టు ఒకమూల అరలో మగతగా పడి ఉండిన కళింగదేశ చరిత్ర రచనా పథకం, ఉన్నట్టుండి ఇప్పుడు ఉపరితలానికి వచ్చి పీడించసాగింది. 1914 జూన్‌లో బందరునుంచి ఒక అభిమాని చేసిన హెచ్చరిక దాన్ని తట్టి లేవగొట్టింది:

మీ రిప్పటికే వృద్ధులయిపోయినారు వెనకటి ఓపికలేదు. చరిత్రరచన అలాగునే వుంచి వేసినారు. ఇతర వ్యాపకాలు తగ్గించుకొని, మీరు తలపెట్టిన చరిత్రను పూర్తిచేయడం మంచిది. 10

అప్పారావు ఆరోగ్యం సరిగాలేదని తెలియని వాడేమీకాదు ఈ లేఖరి. ఎలాగైనా సరే ఓపిక తెచ్చుకుని ఆచరిత్రనూ దానితోబాటు నిఘంటువునూ "దేశానికి" సమర్పించి పోవలెనని అప్పారావు మీద పెద్ద బరువే మోపాడు. దేశంవాణి అది కావచ్చు గాని దేహం ఎదురు తిరుగుతున్నది, ఏంచెయ్యడం ? తపనపడడం తప్ప ఈ రెండు విషయాల గురించి తానునిజంగా చెయ్యగలదేమీలేదు నిత్యాగ్నిహోత్రం వంటి మనస్సును సముచితంగా పోషించేంత దారుఢ్యం ఒంటికి లేకపోవడమే అప్పారావుకు ఒనగూడిన అనర్థకాలలోకెల్ల పెద్దదైన అనర్థకం. ఆ ఒళ్లు వట్టి వేపనాగేలు. సంస్థానం కలెక్టరు ఫౌలరుదొర అప్పారావు ఆరాటాన్ని గమనించి ధైర్యం చెప్పసాగాడు. తాను ఈ గ్రంథాన్ని స్వయంగా పూర్తి చెయ్యలేకనేపోతే, తగిన సమర్థులను నియమించి, "మీరు వుంటే ఎంత బాగుండునో, అంత బాగా వారిచేత వ్రాయించి నేను పూర్తి చేయిస్తాను .... మీ ఆశయాన్ని నేను నెరవేరుస్తాను. కాని మీ మీద నాకింకా ఆశపోలేదు. చరిత్రను మీరే పూర్తి చేస్తారని నా ఆశ !" 11

ఫౌలరు ఉన్నాడని తానిక దాటుకోవచ్చునన్నమాట ! గిడుగు రామమూర్తి కూడా ఉన్నాడు. "పెంపుడు బిడ్డ"కు ఏ లోటూ రానీయరు. చావు గురించి తనకు చింతలేదు. చావకముందు చెయ్యకుండా విడిచిపెట్టిపోయే పనిగురించే చింత. పనికిమాలిపోవడమే బతుకులో చావు. అప్పారావిలా అనుకొంటాడని ఫౌలరుకు తెలుసు; కాబట్టే ఆ జాబులో ఇంకా ఇలా రాశాడు :

మీరు ఆత్మజ్ఞాన సంపన్నులు. మానవుల కెరుకపడని అంతిమ యాత్రాస్థలానికి బయలుదేరవలసివస్తుందని మీరు భీతిల్లరు. చిరునవ్వుతో మృత్యువును పలకరించి, చిత్తస్థైర్యముతో పయనిస్తారు. మరణమును ఆనందముతో ఆలింగనము చేసుకోగలిగిన ఆత్మపరిపక్వమును జీవితమున సాధించడానికే, మీరు జీవించారు. నాకున్నూ అలాంటి ధృతి ఆత్మవిభూతి కలగాలని నా అభిలాష.

తన తప్పులేకుండా ధర్మామీటరు శరీర ఉష్ణోగ్రతను చూపుతూ ఉంది. 'నార్మల్' కంటె తక్కువ చూపిందని దాని ననవలసిన పనేమి లేదు. మలబద్ధకం పోతుందని ఆముదాన్ని ఆశ్రయిస్తే అది ఇలా పనిచేసింది కాబోలు : నూకలజావ, 'మెల్లిన్స్ ఫుడ్' తీసుకొన్నందువల్ల జ్వరం తగ్గినట్లనిపించినా నిస్సత్తువగా ఉంటున్నది. ఒంటిపూట తిండివల్లనేమో ననుకొని ఇరుపూటలా తిండి తినవలసివచ్చింది. ఇదేదో మామూలు జ్వరంలా లేదు. తనకు ఇరవైఏళ్ళ బట్టీ సుపరిచితమై పోయిన జ్వరం తీరే వేరు.

1915 ఏప్రిల్ నాటికి అప్పారావు ఆరోగ్యస్థితి గురించి ఆయనకంటె ఎక్కువగా ఇంట్లోవాళ్ళకు గాభరా పుట్టింది. మహారాణి లలితకుమారిగారూ ఆందోళ చెందసాగింది. నిర్లక్ష్యంచేస్తే మొదటికే మోసం రావచ్చు. "కంటికి రెప్పవలె" చూసి వైద్యం చేయవలసిందిగానూ, దానికయ్యే సమస్త ఖర్చులూ తాము అచ్చుకొనేట్లుగానూ విశాఖపట్టణం పెద్దాసుపత్రి సర్జను ఎల్లింగ్టను దొరకు స్వయంగా ఉత్తరం రాసింది. ఆ నెల 7 న అప్పారావు విశాఖపట్టణం బయల్దేరిపోయాడు. వెంట సోబరి జోగారావు అనే పనికుర్రవాడూ, కుమారుడు రామదాసూ ఉన్నారు. పి. టి. శ్రీనివాసయ్యంగారింట మకాం....ఎల్లింగ్టను చెయ్యగలిగిందంతా చేశాడు. కొన్నాళ్లు అక్కడే ఉంచుకొన్నాడు. ఈ వ్యవధిలో పర్లాకిమిడికి తంతికొట్టి గిడుగు రామమూర్తిని పిలిపించుకొని తనదగ్గర రెండురోజు లుండిపొమ్మన్నాడు అప్పారావు. ఆ రెణ్ణాళ్లూ ఒకరిమనస్సు నింకొకరి మెడలో పూలమాలగా కీలించుకొంటూ ఎలా వెళ్ళబుచ్చిందీ రామమూర్తి స్వయంగా వర్ణిస్తున్నాడు :

నే నతన్ని చూడ్డానికి వెళ్ళినపుడు డాక్టరు నా కిలా సలహా యిచ్చాడు : 'మీరు యెదుట కనిపించే సరికల్లా ఆయన వుద్రేకం పట్టలేక పోతున్నారు అదే పనిగా, జబ్బుమాటే మరచి మీతో సాహిత్యగోష్ఠి చేస్తున్నారు. చారిత్రక విషయాలను గురించీ, సారస్వతాన్ని గురించీ చర్చలు జరుపుతున్నారు. విపరీతమైన

అలసట కలుగుతున్నా లెక్కచేయడం లేదు. ఇలా అయితే ఆరోగ్యం మరీ పాడవుతుంది కద!' 12

పర్లాకిమిడికి తిరిగివెళ్ళాక అప్పారావుకు ఉత్తరాలు రాయవద్దనికూడా రామమూర్తిని కోరాడు డాక్టరు. రామమూర్తి మళ్ళీ అప్పారావును కలుసుకోలేదు. తానై ఉత్తరమ్మొక్కటి రాయలేదుకూడా. విడిచి వెళ్ళేప్పుడు రామమూర్తితో Ramamurty! Fight our language reform battle to the finish అని అప్పారావుచెప్పినట్లు, సమక్షంలో ఉండిన అప్పారావు కుమారులు రామదాసు పంతులుగారి స్మృతిశకలం. రామదాసుగారిని పక్కకు పిలిచి రామమూర్తి ఇలా అన్నాడట కూడా: "మీ నాయన శరీరస్థితి ఏమిబాగుండ లేదు. అది యెలా తిరుగుతుందో చెప్పలేము. నువ్వు ప్రాజ్ఞుడవై నావు. ఏది యెలాగైనా ముందు కార్యం నడపవలసిన భారం నీదై వుంది కనక జాగ్రతగా అన్నీ చూసుకో. మీ నాయనకి నాకు 'షోడశ' కర్మయందు నమ్మకము లేదు. అందు విషయమై నువ్వు అందరు చెప్పినవి విని అనవసరపు వ్యయ ప్రయాసలు పడకు."

జూలై వచ్చింది. వస్తూ వస్తూ అప్పారావు అనారోగ్యానికి కాసింత ఆటవిడుపు తెచ్చింది. అయినవారికి ఆశ రెక్కొంది. ఫౌలరుకూడా ధైర్యంచూపెట్టాడు. మరింకేం ఫర్వాలేదు. అప్పారావు ఆయనకు పళ్ళు పంపాడు. జబ్బు తిరుగుముఖం పట్టింది. "చివరికి మీరు జయించారు. మీరు అందుకోదలచిన ఆదర్శాలు మీరు అందుకుంటారు. మీ కలలు నిజమౌతాయి. అవి నిజమయ్యేవరకు మీరు జీవిస్తారు." చరిత్ర రచనకు కావలసిన పరికరాలు సమకూర్చుకొమ్మంటున్నాడు ఫౌలరు. 13

ఆగస్టు గడిచిపోయింది. సెప్టెంబరు వచ్చింది. 1916 సంవత్సరానికి విశ్వవిద్యాలయ పరీక్షాధికారిగా నియమితుడైనట్లు జి. వెంకటరంగారావు తెలియపరిచాడు. మెట్రిక్, ఇంటర్ తెలుగు పాఠ్యాల నిర్ణయంగురించి మళ్ళీ శ్రమ. మళ్ళీ జీవితం. మళ్ళీ కార్యోత్సాహం. ఆం. సా. ప. వారి నిఘంటు ప్రయత్నాలు ఒక కొలిక్కి వచ్చాయట. వేదం వేంకటరాయశాస్త్రి ఇబ్బందులు గట్టెక్కాయి, ప్రధాన సంపాదకుడుగా నెలకు రెండువందల పైచిలుకు ముడుతుంది, పోనీలే పాపం!

అక్టోబరు వచ్చింది. అయినా పూర్తి స్వాస్థ్యం చేకూరలేదు. జబ్బు నయమయ్యేట్లులేదు. భూముల గొడవలు వచ్చిపడ్డాయి. ఒగ్గిపురంలో పొలాలు చేస్తున్న రైతులు శిస్తులివ్వకుండా ఇబ్బందిపెడుతున్నారు. కృష్ణసాగరంవద్దనున్న పొలాలను సంస్థానంవారు కొనివేస్తే వాటిపీడా తనకు వదులుతుంది.

ఎండకాలం విజయనగరాన్ని నవంబరుదాకా వదలిపెట్టలేదా సంవత్సరం. ఎండలతోబాటు జ్వరం రానేవచ్చింది. గవర్నమెంటు ఆస్పత్రి డాక్టరు చాపా మంగపతినాయుడు — 'డాక్టర్ మేంగో' — చికిత్స చేస్తున్నాడు. పనిసాయానికి సెంబరి జోగారావు — 'హోల్కార్' — ఉండనే ఉన్నాడు.

రాతతప్పని చావును తలచుకొని దడుచుకోవడమెందుకని ? తన జీవితం ఒకకొనకు వస్తున్నట్లుంది. ఏంచేశాడు తానీ బతుకులో ఏమేం చూశాడు, ఏమేం కోరాడు, ఏమేంపొందాడు? తన జీవితనౌక ఏభై మూడేళ్లుగా నిలచిన ఈ ఆశ్రయాన్ని విడిచిలంగరెత్తి అజ్ఞాతసీమకు ప్రయాణం కట్టబోతున్నది. తిరిగి వెనక్కు చూచుకొని ఘనమైన ఈ జీవితాన్ని అంచనా వేసుకోవలసిన తరుణమిదే. ఈ ప్రయత్నంలోనే లంగరెత్తుదము అన్నగేయం మనస్సునుంచి కాగితంమీదికెక్కింది. భాషలోనూ భావంలోనూ టెన్నిసన్ యులిసిస్ (Ulysses) ఖండికతో సామ్యం లేకున్నా, నౌకాసంకేతం ఉభయసామాన్యమే. ఈ గేయానికి తానే నాయకుడై అప్పారావు చేరగోరుతున్నది భూప్రపంచకంలో స్వర్గతుల్యమైన ఏభాగాన్నీ కాదు. చావు కొననీడ కూడా దానిమీద ప్రసరించలేదు. జీవితాన్ని తులాదండాని కెక్కించి తూస్తున్నాడు, వెలకడుతున్నాడు.

అయిపోయిందా లెక్క అప్పుడే ? ఆయనకు తెలియకున్నా, ఆయనకథ కావచ్చింది. మృత్యుస్పర్శ ఏ పంక్తిమీదా లేదనేగాని, గేయంమొత్తానికిగల నేపథ్యమూ అంతరార్థమూ అదే. నవంబరుకూడా మున్పాతిక భాగం అప్పుడే వెనకబడింది. అప్పారావు ఆరోగ్యరేఖ నానాటికీ వంగిపోతున్నది. విజయరామగజపతి చెవిదాకావెళ్ళింది ఈవార్త. ఆయన కబురుపెట్టాడు. చివరికోరిక ఏమిటో నోటువిడిచి చెబితేతీరుస్తామన్నాడు. తనకుసంస్థానం నుంచి ఏమీవద్దు. తన కోర్కె, వేలసంఖ్యలో ఉన్న తన గ్రంథ సంచయం మహారాజా వారి కళాశాలలో ఉంచివేసుకొనేందుకు విజయరామ గజపతి అనుమతించడ మొక్కటే ! ఎందుకంటే తాను బీద బ్రాహ్మణ పిల్లవాడుగా ముప్పై మూడేళ్ళ కిందట విజయనగరం ప్రవేశించినప్పుడు, మహారాజావారి విద్యా సంస్థలే తనకింత విద్యాభిక్ష పెట్టాయి ; తరతరాల స్థానిక విద్యార్థులకు తన పుస్తక సంచయం ఇంత పెట్టగలిగితే చాలు.... చంద్రశేఖరశాస్త్రి .... ఆనంద గజపతి .... ఆస్థాన విద్వత్కవులు .... సహాధ్యాపకులు .... సహచ్ఛాత్రులు.... వెనుకటి రోజులు : మనుషుల మనస్సులలో దేవతల అంశనూ, రాక్షసుల అంశనూ చూశాడు తాను. కష్టమంటే ఎంత రుచి చూశాడో సుఖాన్ని అంత

అనుభవించాడు. పేదరికం నుంచి బయటబడి ఎంతో కొంత సంపన్నుడయ్యాడు. రాలే కోరికలు నేల రాలుతూంటే, కొత్త కోర్కెలు పూతబట్టి పిందె తొడుగుతూ వచ్చాయి. పంజరాన ఉండి నీలాంబరానికి మనస్సు పడ్డాడు....తానొక సూక్ష్మ ప్రపంచమే కాగలిగాడు.

స్థూల ప్రపంచానికేం, బోలెడంత : అప్పల నరసమ్మ తనకు భార్య మాత్రమే కాదు, నేస్తురాలున్నూ. మగడు కసరుకోవడాలూ ఆలు మూతి ముడుచుకోవడాలూ తమ సంసారంలో లేవు. తాను లోకాన్ని మూపున వేసుకొంటే ఆవిడ తనను కంటిపాపలా చూచుకొంది. కోటపేటలు తానేలితే, ఇంటి నావిడ చక్కదిద్దింది. అసిత్తుగా ఉన్న తనకు బిడ్డల నిచ్చింది. పెద్దమ్మాయి లక్ష్మీనరసమ్మ కడుపు బంగారంగాను, కడుపునిండా బిడ్డలే : ఆర్గురు. అందరూ తన కళ్ళముందు మసలుతున్నారు. మరి 'బాబు' ఉన్నాడు : బహు మెతక మనిషి; నోరెత్తి గట్టిగా మాటాడలేనంత సాదు; ఎలా నెట్టుకొస్తాడో ఏమో ! ఫౌలరు దొర హామీ ఇచ్చి ఉన్నాడు. తన కుమారుడికీ కుటుంబానికీ ఏలోటూ రానివ్వడు. అయినా 'బాబు' కూడా తనలా సేవకా వృత్తి చెయ్యడం తనకు సుతరామూ ఇష్టం లేదు. ఏ నౌకరీ చాకిరీ అక్కర్లేకుండా ఏదో ఇంత వసతి ఏర్పడి ఉంది. 'బాబు' కూడా తన కొక మనవణ్ణి ఇచ్చాడు. మొన్ననే బారసాలకూడా జరిగింది. ఇక చిన్నమ్మాయి అప్పల కొండమ్మకు మూడేళ్ళ క్రితమే పెళ్ళి అయింది. పిల్లదింకా కాపురానికి వెళ్ళలేదు.

కోడి సంతులా పిల్లలు....ఇలాంటి పిల్లలకోసమే తాను భాషగురించి, కవిత్వం గురించీ మార్పు కావాలి మొర్రో అని, నెత్తీనోరూ కొట్టుకొంటూ వచ్చింది. వీళ్ళందరి భవిష్యత్తు ఆశామయం కావాలి. దిగుళ్ళు వీళ్ళ గుండెల్లో గూళ్ళు కట్టుకోకూడదు. ఈ పిల్లలకోసం కూడా పాటలు రాశాడు తాను. (వాటిలో *మిణుగురులు* 1930 దాకా అచ్చుపడలేదు ఆ సంవత్సరం *భారతిలో* తొలిసారి అది అచ్చై వచ్చింది.)

సంవత్సరంలో చివరి మాసం మొదలు కావడానికి రెండు మూడు రోజులు వ్యవధిమాత్రమే ఉంది. షష్ఠిపూర్తికి ఆరుసంవత్సరాలు మాత్రమేఅడ్డు ఈ జబ్బేం చేస్తుంది ? 'డాక్టరు మేంగో' ధైర్యం చెబుతున్నాడు. అయినా అతని మాటల్లో అతనికే నమ్మకమున్నట్టులేదు. రోగి కోరిందల్లా పెట్టే వైద్యు దేంవైద్యుడు ? సామెత ఉండనే ఉంది. వైద్యుడు తాగమందీ రోగి కోరుకొందీ పాలేనని ; అలా ఉంది 'మేంగో' పెట్టేపథ్యం : కోరిన వంటకాలన్నీ చేసిపెట్టమంటున్నాడు. నవంబరు

27 న తనకొక కోరిక పుట్టింది. మాంసాహారం తనకు నిషిద్ధకాదు. కాలేజీలో పని చేస్తున్న స్ట్రైక్ బోర ధర్మమా అని కోడికూర అప్పుడప్పుడు అందుతూ వచ్చేది. మరి ఇప్పుడు వరిపిట్ట (snipe) మాంసం మీదికి మనస్సు పోయింది. ఎలా ? తినాలి, అంతే. కోటకు, రాణీవాసానికి, లలితకుమారీదేవికి అప్పారావు కోరిక రెక్కలు గట్టుకొని వెళ్ళి ఆత్మనివేదనం చేసుకొంది. ధర్మతల్లి సాయంకాలానికే వండించి భక్తితో అప్పారావు 'పండిత్'కు పంపించింది *

నవంబరు 29. కుమారుణ్ణి చేరదీసి గిడుగు రామమూర్తికి ఉత్తరం రాయించాడు—కట్టకడపటి ఉత్తరం.

... నవంబరు 30. కార్తీక బహుళ సప్తమి. లోకానికంటె ముందు తనకే తెల్లవారింది. తన కోసమే నన్నట్లు అరుణోదయమైంది. కుశల ప్రశ్నవేస్తూ శాంతాకారుడై సూర్యుడు మేడగది కిటికీగుండా దూరి పెదల్పాటి వెలుగు కాలు గదిలో మోపాడు. కింద అలికిడి లేదు. ఇంత నిశ్శబ్ద మెందుకు చెప్మా ? ఎవరికేనా సుస్తీ చేసిందా ? .... తనకేనా ! ఎంత మతిమరుపు ! .... అయినా తనకేం ? మహారాజులా గున్నట్లుంది. అదుగో 'మెంగో'....అదుగో 'హాల్కార్'.... మరి ఈవిడ అక్కడ చేతులు కట్టుకుని ముఖం నల్లకప్పు వేసుకొని వసలేని చూపులతో 'బాబు'.

గోడగడియారం సంగీతంతో సహా ఎనిమిదిమార్లు కొట్టింది గంటలు. చలిగాలి కొడుతూంది. అయినా లోలోపలనుంచి సెగ తెగటోస్తున్నది ఒళ్ళు అబ్బ.... ఈ దుస్తులు ....

---

* రోగుల దర్జాగురించి అప్పారావు స్వయంగా (గు. ర. మూ. ము.. పు. 162) ఇలా రాసుకొన్నాడు :

జబ్బుతో మంచాన పడ్డప్పుడు రోగికి చిరాకే; చేసేవాళ్ళకీ చిరాకే. చేయడం ఎంత కష్టమో. చేయించుకోవడం అంత.

* * *

సుస్తీచేసినప్పుడు రోగికి తనను జాగ్రత్తగా మర్యాదగా సున్నితంగా ఇతరులు కనిపెట్టుకొని వుండాలని వుంటుంది. తనకోరికలు చెల్లిస్తూవుంటే. ఆదేశాలు పాటిస్తూవుంటే, అదొక దర్జా. బాగా వున్నప్పుడు నోరు మెదపని మనిషికి సైతం మాట్లాడాలని కుతూహలం. ఎపుడూ మాట్లాడని విషయాలు మాట్లాడే ధైర్యం అతనికి వస్తుంది.

దుస్తులు తీసివేశారు. ఉన్నికోటూ, ఉన్నిషర్టూ, కాలికి 'స్టాకింగ్సు'కూడా తీసివేయవచ్చు, ప్లానలు షర్టుచాలు. ఇది తనకు కర్ణుని సహజ కవచమంతగా మచ్చిక పడి ఒంటి చర్మమంతగా మారిపోయింది. "ఇది ఉంటుందిలెండి :" తనమాటలు తనకే వింతగాఉన్నాయి ! రెండడుగుల యెడంలో ఉన్నవాళ్ళకు గూడా వినిపించినట్టులేదు. పిట్టా కూతా రెండూ చివరకు కొంచెమే అయ్యాయి లాగుంది. దంపిన తాంబూలం వేసుకొంటే నాలుక కాస్తసపసిగా ఉండవచ్చు. 'కోకోపైను' నరాలకు కాస్త చురుకెక్కించవచ్చు....కోరిక చెప్పాకగూడా 'బాబు' కదలదేమిటి ? డాక్టరువంక చూస్తున్నాడు. 'మేంగో' వద్దంటాడని భయమా ?....'మేంగో' ఒప్పుకొన్నాడు, బాబు కిందికి దిగివెళ్ళాడు. కావలసినవి పైకి వచ్చాయి. తాంబూలం ఎరుపు పెదాలకు పట్టింది. నాలుకపండింది. ఎర్రనైన చిరునవ్వు మీసాలగుండా తీగవంపులా సాగింది.

8_20 అవుతుంది ఒకటి రెండు సెకన్లలో.

"Mango, వీటిని వేసుకోవచ్చునో కూడదో, బతికుంటే ఆహారశాస్త్రం మీద ఒక పుస్తకం రాస్తాను".

తీగ వాగా సాగింది. ఇంకాసాగి పలచబడి సన్ననై పోగై పోయింది.... తెగింది....విస్మయం....తల తేలిపోతున్నది....గుండె సందడిస్తున్నది....మగత.

ఆరిపోయిన బొగ్గుల కుంపటిలా మారిపోతున్నది ముఖం. మేడమీద గది త్వరలోనే కిటకిట లాడిపోతున్నది. డాక్టరు మంగపతినాయుడు అప్పారావు వద్దకు వెళ్ళి కనురెప్పలు మూస్తున్నాడు. జేబురుమాలు తీసి ముఖాన కప్పుతున్నాడు. డాక్టరు ముఖం కనీళ్ళతో నిండిపోతున్నది. మేడమెట్లు గబగబాదిగి వీధిలోకి వెళుతున్నాడు. అప్పటికే ఆయనకు పైనుంచి ఏడుపులూ, శోకాలూ వినిపిస్తున్నాయి.

వీధి కలవరపడింది. పోయి తన కలవరపాటును సందు కందించింది. సందు గొంది కందించింది. ఊరు ఊరంతా కలవరపడింది. కెరటంమీద కెరటంలాగావచ్చి "కీర్తిశేషులైన" గురజాడ వేంకటప్పారావు పంతులుగారి ఇంటిమీదికి పొంగుతున్నది జనం. "లలిత్" తీర్థమోతున్నది .... ఇటు సూర్యు డటు తిరిగి మూడు గంటలైనా జనం తగ్గలేదు. ఇక తప్పదు. జనాన్ని తోసు కొంటూ అప్పారావును చేతులమీది మేడ మీది నుంచి కిందకు తీసుకువచ్చారు.

కాలేజీ మూశారు. కచ్చేరీలు మూశారు. దుకాణాలు మూశారు. ఇది శోక దినం....పాతికేళ్ళుగా ఆంధ్రదేశపు చిత్రపటంలో విజయనగరాన్ని ఉజ్జ్వలంగా వెలుగొందజేసి, ఆనందగజపతి ఇంకా జీవించే ఉన్నాడనిపించిన ఒక వ్యక్తి ప్రాణశక్తిని కోల్పోయి శ్మశానాన్ని చేరుకున్నాడు....

మహాభాగుడైన ఆనందగజపతి హయాము అంతరించింది నిజానికి 1897 మే 23 న కాదు, ఆనందనామ సంవత్సరం 1915 నవంబరు 30 న మాత్రమే. "పెరిక్లిజ్ హయాములో ఏథెన్సు నగరంలాగుండిన విజయనగరం"* ఆ తర్వాతనే రాజమహేంద్రవరానికి తీసికట్టయింది. అప్పారావు బ్రతికి వున్నాళ్ళూ, దానితో సమవుజ్జీ కావడమే గాక, కొన్ని విషయాలలో దాని తలదన్నేటట్లు వ్యవహరించింది.

అయినా ఆ మహోదయుని ప్రభావం స్మృతిని దాటి మూడు పువ్వులూ ఆరు కాయలుగా వికసించి ఫలించింది. అలా కలగలిసిపోయాయి పగటివెలుగువెల్లువలో అరుణ రేఖలు.

---

* ఈ పోలికను తెచ్చి చూపింది డా. బుర్రా శేషగిరిరావు వ్యాస సంగ్రహములో Our Master and the Modern Telugu Movement అనే వ్యాసంరాస్తూ ఆయన ఇలాగన్నాడు :

> ... having lost its courtly intellectual centre, literary life in Andhra became provincialized and Rajahmundry under Veeresalingam Pantulu continued its intellectual lead and became the leading open forum for Andhra literary effort.

1. స్వీయచరిత్రము : చిలకమర్తి లక్ష్మీ నరసింహం, పు. 330
2. అదే, పు. 316
3. గు. ర. లే. వేదము వేంకటరాయ శాస్త్రిగారు, పు. 187
4. గు. ర. మ. డై : 7-4-1913, పు. 186
5. గు. ర. లే, పు. 144
6. గు. ర. మ. డై : 24.11-1914, పు. 199
7. అదే : 15-9-1913, పు. 189
8. గు. ర. లే : హెచ్. డి. డరెల్, పు. 159-162
9. అదే : వేదము వేంకటరాయ శాస్త్రిగారు, పు. 184
10. అదే : వి. సూర్యనారాయణరావుగారు, పు. 179
11. అదే : చివరిరోజులు, పు. 244
12. గు. ర. మ. డై : వాగనుశాసనులు శ్రీ గిడుగు, పు. 228-229
13. గు. ర. లే : చివరి రోజులు, పు. 245

# సప్తాహ్వాలం

## రచనాతత్వం

గురజాడ అప్పారావు రచయితే కాదలచుకోలేదు. తలచిందొకటైతే జరిగింది పూర్తిగా ఇంకొకటి. ఇతరులు రాసింది చదివి ఆనందించడంలో తృప్తి ఉంది. స్వయంగా ఆనందగజపతి ప్రేరేపణ ఒక వంక, ఆస్థాన కవి పండితుల విద్యా స్పర్ధల ప్రభావ మింకోవంక. తనచేత మళ్ళీ కలం పట్టించాయి. అయితే సమస్యా పూరణం వంటి లఘు విషయాలవరకే ఈ బహిఃప్రేరణ వ్యాపించ గలిగింది. మరికొన్నాళ్ళకు కలిగిన అంతఃప్రేరణ అప్పారావుచేత ఏమి రాయించిందీ, లోకాని కంతా తెలుసు.

యశస్సు, అర్థమూ – ఇవి ఆయన నీ కావ్యసృజనవైపు ఆకర్షించలేదు. తనకొక ప్రయోజనం – సంఘాభ్యున్నతి, ఒక మార్గం – సులభ సుందర వచన రచన, ఉండి సాహిత్య సృజనవైపు నడిపించాయి. సామాజిక "దురాగతాలను బహిర్గతం చేస్తూ ఉన్నత నైతికభావాలనూ వ్యాప్తి చేయడంకంటె, మిన్న అయిన లక్ష్యమూ ప్రయోజనమూ సాహిత్యానికి వేరొకటిలేదు." పుక్కిటి పురాణాలతో రచయితలు కాలక్షేపం చేస్తూపోతున్నారు. జీవితం నుంచి వాస్తవ సంఘటనలను కావ్యవస్తువులు కావటంలేదు. ప్రజలను పైకెత్తగల రచనలు వెలువడడంలేదు. భాష గహనంగా ఉంటున్నది. గ్రాంథికాన్ని ఆ భాషలోరాసే కవి పండితులే "చావగొట్టి చెవులు మూశారు." నాటకరంగం దిక్కుమాలినస్థితిలోఉంది. పైహంగులు లావైపోయాయి. సీనరీలనీ చమ్కీదుస్తులనీ సంగీతమనీ కంటికీ చెవికీ మాత్రమే ఇంపుకూర్చి ప్రేక్షకుల హృదయసంస్కారాన్ని ఉపలక్షించిన నాటకాలూ, నాటక సమాజాలూ కుప్ప తెప్పలుగా వచ్చిపడుతున్నాయి. వచన యుగంలో పద్యనాటకం ఇంకా ఆదరణ పొందుతున్నది. ప్రజల అభిరుచి అధమ స్థాయికి చేరుకొంది. వాళ్ళకు గ్రంథ పఠనాసక్తిలేదు. ఏదైనా మార్పు ప్రజలలో కొనితేవాలంటే, ఇతివృత్తం, ప్రయోజనం, రచనాశైలి, అన్నీ ఏకోన్ముఖం కావాలి. తెలుగు సాహిత్యానికి ఒక ఉన్నత సుస్థితి ఏర్పడేది అప్పుడే.

యూరపుదేశాలలో 'రినేజాన్సు' ఫలితంగా లలితకళలన్నీ పుంజుకొన్నాయి గదా, మనదేశంలో వచ్చిన 'రినేజాన్సు' అలాంటి ఫలితాలను కలిగించలేదేమిటి, అని ఎన్నిమార్లో తనకు తానొక ప్రశ్న వేసుకొన్నాడు. రచయితలలో గతానుగతికత్వం కనిపించినంతగా స్వతంత్ర రచనోత్సాహం కనుపించడంలేదు. నవలలు గానీ, నాటకాలుగానీ ఒకటీ అరావస్తే సరిపోదంటూ, ప్రొఫెసరు పెయిటుతోటి అప్పారావు 1895లో ఒకమాట అన్నాడు: "స్వదేశ యువ సారస్వత విలుప్తతకు కారణం యొకటై వుంటుందనుకుంటాను. సాహిత్య పాఠములలో విద్యార్థులకు శైలిలోను, వస్తువిన్యాసములోను యిది మంచి, యిది చెడ్డ అని విడదీసి వాటి బాగోగులను బోధింపకుండుట, రసానుభవమూ, వివేచనా లేకుండుట, కారణమని నా ఊహ." 1 పునరుద్ధృతమౌతూన్న జాతి, రచయితల నెప్పటికప్పుడు విద్యాలయాలనుంచి పైకి తోస్తూ సంఘవ్యవహారాల్ని గుణాతిశయాన్ని చేకూరుస్తూ, సాహిత్య జీవితానికి మళ్ళీ ఊపిరిపోయవలసి వుంటుందని అనుకొన్నాడు. ఆయన దృష్టిలో, సాహిత్య పునర్వికాసం విద్యా పద్ధతుల సంస్కరణం తోటి ముడిపడింది. మరి ఈ రెండవది భాషాబోధన విషయంలో, ఆధునిక పద్ధతుల నమలు పరచడంతోటి లంకెపడింది. కొత్త రచయితల మీద అప్పారావు ఆశలు నిలుపుకోడానికి కారణమిదే.

అలాంటి కొత్తరచయితలను ఎక్కిరానీయకుండా సాంప్రదాయక పద్ధతులపేర పాండిత్యం పేర, ఒక కూటమి అడ్డుతగులుతూ వస్తున్నది. పండితుడే కవికాదగిన వాడనే దురభిమానంతో చూడిన అధికార దృక్పథం, గతచరిత్ర నుంచి సంక్రమించి వుంది. కొక్కొండ వేంకటరత్నం, వేదం వేంకటరాయశాస్త్రి కళ్ళకి, పట్టిపండితుడే గాని కవికాడు. మరి, వేంకటరాయశాస్త్రి కవనం నారికేళపాకం కంటె కఠినమాయె: వేంకటరత్నానికీ, వీరేశలింగానికీ, 'త్వంశుంఠా త్వంశుంఠా' వరసలేగాని సరసాలు లేకుండా పోయాయి. ఈ "ఉద్ధతుల మధ్య లేగలకుండ దరమె?" మాట మాట్లాడితే, అలంకార శాస్త్రాలనుంచీ లక్షణ గ్రంథాలనుంచీ శ్లోకాలకు శ్లోకాలే ఉద్ధరించి చెవులునించి నోరుమూస్తారు. స్థిరపడిఉన్నది ప్రతీదీ శిలాశాశ్వతమే. దాని యోగ్యత విషయమై ప్రశ్నించినవాడు అపండితుడు, పితూరీదారు, హూణ విద్యామాత్రపరిచయుడు, సంప్రదాయద్వేషి, పండిత విరోధి, బ్రాహ్మణ కులం పైనీ, హైందవ మతంపైనీ కత్తిగట్టిన ఆతతాయి. అతనిది, వేంకటరాయశాస్త్రి చూపించిన విధంగా, "శుష్కస్తనీ కంచుకన్యాయము". 'ఎడ్యుకేటెడు జెంటిల్‌మెను' గురించి శాస్త్రి ఇలాగన్నాడు :

"ఈ యెడ్యుకేటెడు జెంటిల్‌మెను హూణ విద్యయందు ఎడ్యుకేషన్ గలవారేగాని ఆంధ్రంబున ప్రవీణులుగారు....వీరు ప్రాయికముగా రెండు తెలుఁగుమాటలకు మూఁడు ఇంగ్లీషుమాటలు కలుపక నోరు తెరువలేరు...."
"ఆంధ్రంబున ఎడ్యుకేషను గలవారు ఇతరులు...."[2]

సంస్కృతాంధ్రోభయ భాషాప్రవీణులైన మహాకవులు పూజించిన ఆంధ్ర వాగ్దేవికి "చరమదశను సాధించినవారు" ఎలాంటివారట? "సంస్కృతమెఱుఁగని కవులు, చదువని కవులు, సమాసమొల్లనివారు, అలంకారము నొప్పనివారు, యతి ప్రాసల హితశత్రువులు, అక్షరద్వేషులు, ఔచిత్య బాహ్యులు....".[3] క్రిశ్చియన్ కాలేజిలోతనను కలసి ప్రస్తుతాంధ్ర సాహిత్యస్థితిని గురించి ప్రసంగించినప్పుడు, "ఆధునిక ఆంధ్రసాహిత్యం యేమైతేనేం; దాన్ని నేను పట్టించుకోను" అనేధోరణిలో మాట్లాడినట్లు అప్పారావు డైరిలోవుంది. వేంకటరాయశాస్త్రిపై అప్పారావుకుఉండిన గురిఅంతా ఇంతాకాదు. అయినా వారిపై ఖరుటూ, లక్ష్యాలూ పరస్పరం భిన్నమైనవే గాక బాహ్యమైనవి కూడాను. ముందు తరాలువారు "గ్రామ్య వీరులు" కాగూడదని, "సలక్షణాంధ్ర" భాషలో రాయనూ, మాటాడనూ నేర్వాలంటే "సుషు"గా చదువు కోవాలని వేంకటరాయశాస్త్రి వంటి పండితుల అచంచలాభిప్రాయం. విద్యావిజ్ఞానాలు సామాన్యులవరకూ విస్తరించేందుకు రచయితలు వ్యావహారికంలో రాయాలని విద్యార్థులు వ్యావహారికాన్ని అలవరచుకోవాలని అప్పారావు వంటి "అపండితుల" అభిలాష.

వీరేశలింగం, ఆయన అనుచరులూ వాడుకచేస్తూ వచ్చిన సులభగ్రాంథిక శైలి గురించి, కొన్నాళ్ళవరకూ అప్పారావుకు సదభిప్రాయమే వుంటూ వచ్చింది. గ్రాంథికం ఆధునిక సులభవచన రూపంలో వ్యావహారికానికి దగ్గర పడుతున్నదని సంతృప్తి కలిగింది. పరుషసరళాది హల్లులవల్ల ద్రుతప్రకృతికాలకు కలిగే సంధి కార్యాలను కొన్నిచోట్ల పాటించకుండా వీరేశలింగం మార్గం చూపాడు. సంధి సూత్రాలను సర్వత్రపాటించాలనే నియమాలను స్కూళ్ళలో పండితులే సడలించారు. వేంకటరాయశాస్త్రి తెలుగు నాటకంలో తొలిసారి గ్రామ్యభాషను ప్రయోగించాడు. వ్యావహారిక సన్నిహిత గ్రాంథికభాషను రచయితలు ధారాళంగా వాడుకుంటున్నారు. భావప్రకటనకు ప్రాచీన గ్రాంథికం తగినటువంటి సాధనం కాదని పదిమంది గ్రహిస్తున్నారన్నమాట![4] బాగుందిగాని, అక్కడితో అప్పారావు ఊరుకోలేదు. ఈ

తృప్తి తాత్కాలికమే అయింది. సులభగ్రాంథికం చెడిపోయిన గ్రాంథికమే. వ్యావహారికం అలాకాదు. ఇష్టా రాజ్యంగా సంధిసూత్రాలను ఉల్లంఘించడం, గ్రాంథిక భాషా శ్రేయస్సుకు తగని పని. అవీ ఇవీగాని ఈ సులభ గ్రాంథికాన్ని నిరాకరించి, వ్యావహారిక భాషనే రచయితలందరూ ఆశ్రయించవలసి ఉంటుందని, 1910 తర్వాత అప్పారావుగట్టిగా వాదించసాగాడు. సులభమనే కాదు, భావప్రకటనకు అది చేకూర్చగలన్ని వీళ్ళను గ్రాంథిక భాష చేకూర్చజాలదనికూడా ఆయన అభిప్రాయం. ప్రజాహృదయాన్ని చేరుకోవడానికి ఇది రాచబాటే.

వచనానికీ కవిత్వానికీ కూడా వాడుక భాష ఉపయుక్తం కాగలదా? బియ్యానికీ పిడుగుకీ ఒకే మంత్రమా? దీర్ఘ సమాసాలు, నిఘంటువులను గాలిస్తే గాని కనిపించని శబ్దాలు, ఏడెనిమిది వందల సంవత్సరాల క్రితం వాడుకనుబట్టి ఏర్పాటు చేసిన వ్యాకరణ సూత్రాలకు అనువుగా ఉండే పరమ ప్రాచీన శబ్ద రూపాలు, వీటితో నిండి ఉన్న కావ్యభాష, రాసే వాడికీ చదివేవాడికీ పూర్తిగా ఒంటబట్టి రక్తసారంగా మారిపోయే వీలులేదు పండితులైన వాళ్ళే కవిత్వాధికారిగా నిలబెట్టడానికి పనికి వస్తున్నదిదే. "ఇక్కడ పండితులైనంత మాత్రం చేత ఎవడైనా కవే. భాషను రూపుమాపి వీరు తాము రాసిన పుస్తకాలను నోరూ వాయీ లేని స్కూలు పిల్లల నెత్తిన రుద్దుతున్నారు."[5] ప్రాచీన పద్యకావ్యాలను విద్యార్థులు చదవ గూడదని అప్పారావు అభిప్రాయమెన్నడూ కాదు. వాటికి తోడు నవీన పద్య కావ్యాలను కూడా వాళ్ళచేత చదివించవలసి ఉంటుంది. అయితే ఇది వేంకటరాయ శాస్త్రికి సమ్మతం కాలేదు. ఆయన గారి నిర్ణయం ఇలా ఉండింది: "ఇప్పటి కవిత్వము చాలమటుకు పట్టి ఊక.... వ్యాకరణము దుష్టము: ఛందస్సు లోపభూయిష్టము; నాట్యశాస్త్ర మర్యాదలు బొత్తిగా శూన్యము, ఔచిత్యము వివేకజ్ఞానము మృగ్యము."[6] తన ప్రతాపరుద్రీయము, ఉషానాటకమూ ఈ లోపాలకు అతీతం కావచ్చునని ఆయన అనుకోకపోలేదు. అప్పారావు కూడా వేంకటశాస్త్రి నాటక కవిత్వం ప్రాచీన కవిత్వంతోటి సరితూగుతున్నదని భావించాడు.

రచయితలు ప్రధానంగా వ్యావహారికంలోనే కావ్యాలు రాయవలెనని అభిలషించినా, అది ఇప్పుడప్పుడే పూర్తిగా సాధ్యపడక పోవచ్చునని అప్పారావు

అనుకొన్నట్లుంది. అందుచేతనే, రచయితలకు గ్రాంథిక శబ్దాలపై మోజుఉంటే పద్యాలలో వాడుకొని సంతోషించనిమ్మనుకొన్నాడు. వాడుకలో నశించిన శబ్ద రూపాలను పద్యం వచనంకంటె ఎక్కువగా ఇమిడించుకోగలదు. గ్రాంథికవాదులకు కవిత్వరంగాన్ని పూర్తిగా విడిచిపెట్టేందుకైనా సమ్మతించాడు గాని, వచనంలో మట్టుకు వ్యావహారికమే అవలంబనీయమని అప్పారావు గట్టిపట్టు బట్టాడు. తాను మాత్రం 1910 తర్వాత వాడుక మాటలతోనే గేయాలు రచించడం ప్రారంభించాడు.

పద్యాలు రాయలేక అప్పారావు గేయరచనకు పూనుకొన్నాడనుకోవడం సరి కానేకాదని సుభద్ర వగైరా పద్యాలు రుజువు చేస్తున్నాయి. పద్యచ్ఛందస్సుకూ వ్యావహారిక శబ్దబాహుళ్యానికీ పొత్తు కుదరదని అనుకోబట్టే ఈ పని. ప్రతిభా దారిద్ర్యాన్ని ఛందస్సు కప్పివేస్తుంది. కేవలవ్యుత్పన్నతకు తోడ్పడుతుంది. నిఘంటు శబ్దాలూ వ్యాకరణ ప్రత్యయాలూ వగైరా "గంగిరెద్దుమీది గుడ్డ పాతల వలె .... లోపల పసను కమ్ముతవి." రసం చాలని చోటకూడా పద్యాలు రాస్తూ తలపులతక్కువను కప్పిపెడుతూ గణా నింపడంకోసమని అన్వయాన్ని చెరిచి వంకరటొంకర నడకలతో పద్యాన్ని నడిపి అంత్యగురువు కోసం ఏకాక్షర శబ్దాలను అతికి యతిప్రాసలకోసం నిరర్థక పదాలను ఫర్లాంగురాళ్ళవలె నిలవేస్తూ కవిత్వాన్ని కపిత్వం చేస్తున్న మహనీయులకు దండంపెట్టాడు. 7

వాడుక మాటలకూ రసస్ఫూర్తికీ చాలా దగ్గరి సంబంధ మనిపించినందు చేతనే ఆ మాటలకు వీలుకలిగించే మాత్రాచ్ఛందస్సులవైపు దృష్టి మరలించ వలసి వచ్చింది. వర్డ్సువర్తు తెచ్చిన మార్పు తన మనస్సులో ఉంది. కావ్యభాష లోను, వస్తువులోను, దృక్పథంలోను మార్పురావాలి. శతకాలు, ద్విపద కావ్యాలు, జానపద గేయాలు, వీరగాథలు ప్రజల మెప్పుపొంది ఉన్నా యంటే, శబ్దాడంబరాన్ని చాలా మట్టుకు విసర్జించి నందుచేతనే. ముఖ్యంగా జాన పద గేయాలలో శబ్దసౌష్ఠవం లేకపోయినా, కవితా శిల్పం లేక పోలేదు. "సర్వజన సంవర్థితమైన జానపద గేయములు విదేశీయులకు ఆకర్షణీయములు". 1895 లో తాను మద్రాసుకుపోయి అక్కడ కొన్ని నెలలపర్యంతం ఉండిపోవలసి వచ్చినప్పుడు, కాంటెన్ హాల్ మేగజీను సంపుటాలను తిరగవేస్తూ, ఆసక్తితో చదివిన వ్యాసాలలో కొన్ని, ఇంగ్లీష్‌రూరల్ పొయిట్రీ, ద్రవిడియన్ ఫోక్‌సాంగ్స్,

డాలెడ్, పొయిట్రీ ఆఫ్ ఇటాలియన్ డయలెక్ట్సు వగైరా. వీటన్నిటి ప్రభావం తనమీద అదృశ్యంగానైనా ఉంటూవచ్చి, [illegible]గా తొలుసారి బయల్పడివుంది. వ్యావహారిక భాషోద్యమం దానికి మరింత పదును పెట్టింది. ఎన్నడో తననాటకానికి పీఠిక రాసుకొంటూ, కావ్యభాషను వ్యావహారికానికి సన్నిహితం చేసుకోవలెనని, సంస్కృత శబ్దరూపాలను పరిహరించుకోవలెనని పెద్దలను ఉద్బోధించి ఉన్నాడు. నాటినుంచి తానే ఆపనికి పూనుకోవలసి ఉండినా పూనుకోలేదు. ఆ నాటకానికి రెండవకూర్పు వేస్తూ మరొకమారు పీఠిక రాస్తున్నప్పుడు, నూతనకావ్యభాషను ఏర్పరచుకోవాలనే "అప్రయత్నపూర్వక కృషి" కొనసాగు తోందని గమనించాడు. ఇక చేయవలసిందంతా, దాన్ని ప్రయత్నపూర్వకంగా మార్చడమే.

మునుపొకమారు వినివున్న పార్శీగజలు గుర్తుపచ్చి కొత్తఛందస్సుకు దారి చూపిందని స్వయంగా ఆయన రాసుకొన్నాకగూడా, ముత్యాలసరాల ఛందస్సు కొత్తదేమీకాదని, అక్కిరాజు ఉమాకాంత పండితుని [illegible] కవిత్రయము మొదలు డా. సి. నారాయణరెడ్డి [illegible] వరకు ఎందరెందరో విమర్శకులు అందరూ ఒకమాటే అంటున్నారు. 'సుభద్రదేదే గోపిదేవీ' దీనికి మాతృక కావచ్చు. 'కన్నడకస్తూరి'గా ప్రసిద్ధికెక్కిన భామినీ షట్పది, అప్పారావు మనస్సులో పనిచేస్తూ ఉండవచ్చు. ఆయనకు కన్నడభాషా వ్యాకరణాలతోటి వాలినంత పరిచయం ఉండేదికూడా. కన్నడ భామినీ షట్పదికి మన హరిణగతి వృషభగతి రగడలకూ సంబంధం ఉందని నామిత్రులు బండి నాగరాజు ఒకవ్యాసంలో రాశారు. కావచ్చుగాక : ఇంతరగడ అక్కరలేకుండానే, అప్పారావు మాటమీద నమ్మకముంచి పార్శీగజలుకూ ఈ ముత్యాలసరానికీ గల సంబంధాన్ని గుర్తిస్తే సరిపోతుంది. నాగరాజు నాకు రాసిపంపినది అలాగే ఈ కింద ఇస్తున్నాను.

....'ఘజల్' కావ్య విశేషములో వాడబడు ఛందస్సంప్రదాయము లనేకము గానే ఉన్నవి. అందులో 'బహరె రమల్' ఛందము ఒకటి. దీనిలోను గతిభేదములు గలవు. ఇందు సప్తమాత్రాక గణము నిలుచును. అది, త్రిమాత్రక చతుర్మాత్రాక ముల మిశ్రమము (మిశ్రగతి – $3+4$). ఇట్టి సప్తమాత్రాకములతో – గణ సంఖ్య యొక్క హెచ్చుతగ్గులతో – ఇందనేక గతిభేదములేర్పడుచున్నవి.

"రమల్ ఛందము నడక –

"ఫాయిలాతున్ ఫాయిలాతున్
ఫాయిలాతున్ ఫాయిలున్
"(ఇదియొక గతిభేదము.)

"ఉదాహరణము—

"సబ్ కహా౯ కుఛ్ లాల వోగుల్
మేను మాయా౯ హోగయా౯
(ఇది ఒక 'మిస్రా' – అనగా పాదము.)

"ముత్యాల సరముయొక్క నడకయు నిట్టిదేగదా !
"కచ్చితముగా సరిపోవు పాదమొక్కటి ఉదహరింతును –

"క్రొత్త పాతల మేలు కలయిక
"సబ్ కహా౯ కుఛ్ లాల వోగుల్
"క్రొమ్మెరుంగులు జిమ్మగా
"మేను మాయా౯ హోగ యా౯."

*సుగ్రీవ విజయ* యక్ష గానములోనే గాక గుమ్మడి పాట వంటి జానపద గేయాలలో కూడా కన్నడ భామినీ షట్పదిని కొద్ది మార్పుచేసి మనవాళ్లు వాడుకచేశారు, అంటూ *లవణరాజు కల* లోని

"పంపె నీకీ యశ్వరాజం
బెందులే దిద్దాని కీడనె ;
చెవిని మాటలు సోకి సోకక
లవణు డక్కన్నెం
జూచె, స్మయ హర్షాతి రేకము
లాత్మ పెనగొన ; డాసి, చేకొని
'వచ్చితివ నా ప్రాణసఖి !' యని
గద్దియను జేర్చెన్."

ఈ చరణాల పాద విన్యాసమే ఆ యక్షగానంలోనూ గేయంలోనూ ఉన్నట్టు కూడా నాగరాజు నిరూపించారు. యతిప్రాసల నిర్బంధాన్నిగానీ, అంత్యప్రాస నియమాన్ని గాని సర్వత్రా పాటించక తద్వారా, రగడలతోనూ జానపద గేయాలతోనూ

షట్పదితోనూ ముత్యాల సరాల ఛందస్సుకు గల తల్లి పేగును అప్పారావు కోసి వేశాడు. ఇది గమనిస్తూ డా. సి. నారాయణరెడ్డి, పార్సీ కవి హాఫిజ్ (Hafiz) గజలు నొకదాని నుదహరించి అది ముత్యాలసరాని కనుకూలంగా ఉన్నదని రాశారు. ఇదంతా ఎందుకు, తాను చేసుకొన్న నియమం గురించి కవి ఇలా చెప్పుకొన్నారు :

ముత్యాల సరములలోనే చేసుకొన్న నియమమిది: మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పద్నాలు గేసి మాత్రలుండును. నాలుగో చరణమున యేడు మొదలు పద్నాలుగు వరకుండును. విరామమును అర్థాను సారముగా చెవికింపగు నట్లు మార్చ యత్నించితిని."

"నేను యెరిగియె యతిప్రాసములను అలంకారములను ముత్యాల సరములలో ప్రయోగించితిని. నియమముగా నుంచిన యెడల, యతిప్రాసము లకు గాను తెచ్చిపెట్టుకొన్న శబ్దములు అర్థ పటుత్వమును చెరచి, సందర్భ మును తప్పించి, యీడ్చుకు పోవును.8

ఈ ఛందస్సు బాగా మెరుగెక్కి నునుపు దేరకముందే అప్పారావు దాటు కొన్నాడు. వాడుక చేస్తున్నప్పుడు ఎక్కువ జాగ్రత్త వహించినట్లు కనబడదు. అందుచేత అది "ప్రయోగదశ"లోనే ఉండిపోయినట్లు అనేకులు అనక తప్పలేదు. ఒక్కొక్కచోట నాల్గో పాదము పరిమితి ఎనిమిది, తొమ్మిది, పన్నెండు, పదనాలుగు మాత్రలుగా ఉంది. ఏడు మొదలు పదనాలుగువరకు ఉండవచ్చునని స్వయంగా కవే రాసిఉన్నాడుకదా! ఇక కొన్నిటిలో నాలుగుకంటే ఎక్కువ చరణాలు పెట్టి నందుచేతనూ, ఎక్కడికక్కడ గతిమారినందుచేతనూ అది "స్వరూపరహితం"గా తయారైందని అంటూ, గనిలోనుంచి తీసిన ముడి లోహానికి దీనికీ శ్రీశ్రీ సాటువ తీసుకొచ్చాడు; ఛందస్సు "అపరిపక్వమనీ" తీర్పు చెప్పాడు : "ఎటూకానిచోట విరువబడి పాడయిన పాదాలు అప్పారావుగారి ఛందోవ్యవస్థకు బలహీనత ఆపాది స్తున్నవి."9 పైచెప్పిన అవలక్షణాలవల్ల లక్షణానికే వియావత సిద్ధిస్తున్నది కాబట్టి, అప్పారావు చేతిలో ఇది "వ్యర్థ సామగ్రి" అయినట్లు భావించడం సరికాదేమో.*

---

* ముత్యాల సరములు-చిన్నకథలు అనేపుస్తకాన్ని సమీక్షిస్తూ (భారతి : డిశంబరు 1929) కొంపెల్ల జనార్దనరావు నిష్కర్షగా కొన్ని అభిప్రాయాలు వెలువరించారు. ఆధునిక వాఙ్మయానికి ఈ కావ్యాలు "శక్తిచేతగాని, పరిణామముచేతగాని" అధినాయకత్వం వహింపలేదనడం సాహసమే. లవణరాజుకల వంటి కావ్యాల ప్రోద్బలంచేత "ఒక నూతనమైన అభిరుచి" కలి

నిర్వాహణ వైవిధ్యం" లేదనడం సత్యంకూడా కాదు. ఆ వైవిధ్యం గురించి డా॥ సి. నారాయణరెడ్డి తమ పరిశోధనా గ్రంథంలో విపులంగా చర్చించారు. సంకల్పపూర్వకంగానే ఆయన పాదనియతిని పాటించలేదని తేల్చారు. పూర్ణమ్మ కథ, దేశభక్తి వంటి గేయాలలో తీరికగా చెక్కి నగిషి తీర్చినవీ, కన్యకలో ముడిసరకువలె ముందు పారవేసినవీ, ఒకటి రెండుచోట్ల ఒకటి రెండు మాత్రలు లోపించినవీ, ఇలా వివిధంగా ఉండటం రచనలో వైవిధ్యముకొరకు, కథా కథనములో సౌలభ్య సౌకర్యములకొరకు" మాత్రమేనన్నారు. స్థూలదృష్టికి ఛందోభంగమనిపించే కాసులు, నిజానికి Run - on verse గా రాసింది – అంటే "లయబద్ధమైన నడకయేతప్ప ఇన్ని పాదములని, పాదమునకిన్ని మాత్రలని నియమములేదు." అది ఇప్పుడు అచ్చుపడియున్న పద్ధతిలోగాక ఇంకొక పద్ధతిలో చరణాలను కూర్చి ఇంకో విధంగా విరుపులు సాధించిచూపితే, ఏమాత్రం ఛందస్సుగానీ లయగానీనడకగానీ బెణకనిగేయ మౌతుందంటారు.10 డా.సి. నారాయణరెడ్డి గారి సహృదయత గురజాడ అప్పారావు లోపాలను కూడా గుణాలుగా చూపేంత మేరకు వ్యాపిస్తున్నదని ఎవరైనా అనగలరు గాని, గుణాన్ని లోపంగా చూపడం కంటె ఇది మేలు.

అప్పారావు స్వతంత్ర సృష్టి అయినా కాకున్నా, ముత్యాలసరాల ఛందస్సు లోపరహితమే అయినా, వస్తువునుబట్టి మాత్రమేగాక, ఆ గేయాల భాషనుబట్టికూడా దానికి విలువ నివ్వవలసి ఉంటుంది. నిఘంటువు నాశ్రయించ దది. వ్యాకరణ సూత్రాలనుబట్టి సాధించిందికాదు. మొదటమొదట సాంప్రదాయిక పదజాలమే అధిక

---

గించిన జనార్దనరావే అంగీకరిస్తాడు. ఇక 'ముత్యాల సరము' గురించి రాస్తూ. తరువాతి కవుల చేత పొలుపులు ఏరిన ఈఛందస్సు, "లౌలిత వీరిచే మాత్రము నియమాగత సౌందర్యము కొంత కొలుపడినమాట నిజము. అయితే చిరకాలమునుండి వాఙ్మయములో అవలంబనము పొంది ఉన్న ఉత్కృట నియమాల నిరంకుశతకు ఎదురొడ్డి నిలిచి వీరు తమ నుడికి ఒక విచ్చలవిడి అయిన, సున్నితమైన ఛందస్సు లలిత సంగీతముతో వెలయించుకోవలెనని పూనిన సంకల్పమే ఈ యతియతికి వాచ్యముకావలెను. ఇంక, 'సాటివా రోదార్చె'వంటి వాక్యదోషాలుకూడా రచయిత లక్ష్యపెట్టలేదు. శైలిలో అసంస్కృతి వీరి సంస్కారలాలసకు ఒప్పునది..." అని రాశాడు.

అదే జనార్దనరావు 1935 నాటికి అప్పారావుపట్ల మరింత సద్భావం పెంచుకొని ఉదయిని (సం. 1, సంచిక-3)లో "కిరణాలు" రాస్తూ, గురజాడ భాషలో బంధవిముక్తివేర చూపిన విచ్చలవిడి తనాన్ని గుర్తిస్తూనే, భావంలో ఏర్పడిన ఐకాంతికత(Individualism) భాషలో ఒక ప్రత్యేకమైన రీతిని సంతరించిందని అన్నాడు.

సంఖ్యలో ఉన్నా, పోనుపోను సంకల్ప పూర్వకంగా ప్రజా వాక్వ్యవహారాన్ని ఆశ్రయించింది:

నేను నా మొదటి గేయాలలో సాధ్యమైనన్ని వాడుకమాటలను, గ్రాంథిక వ్యాకరణ సూత్రాలకు లేదా ప్రాచీనకవుల పద్ధతులకు ఒదగని శబ్దాలను ప్రయోగించాను. 'ముత్యాలసరాల'లో వాడిన పదాలకంటే, గ్రాంథిక వ్యాకరణ సూత్రాలకు సరిపడని శబ్దాలు ఎక్కువ: ఇవి 'కన్యక'లో మరీ హెచ్చు.11

పాఠకుని సాంప్రదాయికదృష్టికి బాధాకరమని అనిపించక తప్పని శబ్దాలను అప్పారావు గేయాలనుంచి ఏరి జాబితా కట్టవచ్చును. మాండలిక ప్రయోగాలు కొన్ని, శుద్ధగ్రామ్యాలు కొన్ని, వ్యాకరణ సూత్రాలను పాటించని ప్రయోగాలు కొన్ని-ఇలా వర్గీకరణకూడా చేయవచ్చును. "బట్టుకొని", "పుష్కరి"వంటి పదాలు పూర్తిగా ఆ ప్రాంతానివని మిత్రులు రోణంకి అప్పలస్వామి గారంటున్నారు. "కేలించు" అనే మాటకు "వెక్కిరించు" అని, "మట్టిపచ్చట" అనే స్థానిక ప్రయోగానికి "తొక్కట" అని, "పుట్టకీట్లు" అంటేపుట్టమట్టితో పెచ్చుపైన పేర్పుగా కట్టిన పునాదులని అప్పలస్వామిగారు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి ఉత్తరాల ద్వారానూ, సంభాషణలోనూ తెలియజేశారు. అయినా ఇంద్రజాలంచేసి చూపేవాడిని "జాలికుడు" (నిఘంటువిచ్చే అర్థం - దోయవాడు, చెంబటివాడు, మోసగాడు)గా, వ్యథలను "వేథల్" (నిఘంటువు అర్థం - బ్రహ్మ, విష్ణువు, విద్వాంసుడు) గా భ్రమించడమేమి, "మిడునె" "నట్టిపీథిని" (నట్టిల్లులాగా) "వావుచు" వగైరా వింతప్రయోగాలను చెయ్యడమేమి, అప్పారావు భాషా విషయంలో తీసుకున్న స్వాతంత్ర్యానికి తార్కాణ లనవలసి వస్తుంది.

వ్యాకరణ సూత్రాలను పాటించనివని సామాన్య విమర్శకుడు పొరబడే కొన్ని ప్రయోగాలకు గిడుగు రామమూర్తి బాల కవి శరణ్యము ద్వారా మద్దత్తు గమనించ దగింది. ఉదాహరణకు కొన్ని :-

1. 'కూచున్ని' : ప్రాచీనభాషలో 'కూర్చుని' 'కూర్చొని' 'కూర్చొనెను' వంటివే లేవు. ఇవి వర్తమాన వ్యవహారంలో ఉన్నాయి. గోపీనాథ వేంకటకవి, పానుగంటి లక్ష్మీనరసింహారావువంటి వారుకూడా వాడారు. "పలుగురి కూచుని నవ్వే వేళల" అని అప్పారావు వాడాడు *

---

*మిథ్యాపవాద ములో గిడుగు రామమూర్తి ఈ అప్పారావు ప్రయోగాన్నిచూపి వేంకటరాయశాస్త్రి వాదాన్ని ఖండించాడు. (పు. 51)

2. "కూతున్" (కన్యక) : ద్రావిడ భాషాజన్యమైన 'కూఁతురు' శబ్దం 'అల్లుఁగుఱ్ఱ' 'తమ్ముఁగుఱ్ఱ' వలెనే సమాసములో 'కూఁతుఁగుఱ్ఱ' అనే రెండక్షరాల తోనే 'కూఁతు' శబ్దం కనబడుతున్నది. ప్రాచీనదశలో ఇది అనౌపవిభక్తికం కాబట్టి 'కూఁతును,' 'కూఁతులు,' 'కూఁతునకు' అనే రూపాలున్నాయి.

3. "మొగుడుకు" "ఒరుకు" వగైరా : ఇటువంటి రూపాలు నన్నయ కాలమునుంచి కవులు వాడుకచేసినవే. షష్ఠి ఏకవచన 'ప్రత్యయ', కు వర్ణానికి నకారాగమం విధాయకమేమీకాదు. రాముచేత, రాముకొఱకు, రాము నందు అని నకారలోపము కలదని ఎలకూచి బాలసరస్వతి చెప్పాడు కాబట్టి దాన్ని శిరసావహించాలని కూచిమంచి తిమ్మకవి అన్నాడు. అప్పారావు వాడిన "చంద్రుసాక్షిగ" "వెన్నుచేతను" అనేవికూడా గ్రాహ్యాలే.

4. మొగుడు : ప్రాచీనాంధ్రంలో 'మగణ్డు', 'మగండు' అని గవర్ణము గురువుగా ఉండేది. గనుక దాని మీది అకారము మారలేదు. ఉత్తరాంధ్రములో బిందువు పలుకదు ; గనుక ఇట్టి శబ్దములలోని అచ్చులకు సానురూప్యం కలుగుతుంది. అంతేకాక మకారము ఓష్ఠ్యమవడంచేత "మొ" అవుతుంది.

5. చూపుసు; కాసుకొనుటకు ; ఉత్తరాంధ్రములో ఏర్పడి తరతరాల నుంచి ప్రజల వాడుకలోనున్న "సు"వర్ణ శబ్దాలు "మోసువానికి", "ప్రాసుటకున్" "షేసుట" — వీటికి అనుగుణంగానే పై ప్రయోగాలు.

ఆద్యక్షర రేఫతో కూడుకొనివున్న గ్రాంథికభాషలోని మాటలు కొన్ని చెవికి ఇంపుగా ఉండవని మాట నటుంచి, రేఫ ఆద్యక్షరాలలోగల పదాలనుంచి అది ఈ వరకే వ్యవహారచ్యుతి పొందిందని గమనించి, తదనుగుణంగా అప్పారావు ఈ పదాలను రేఫలేకుండా ప్రయోగించి ఉన్నాడు. ఇదంతాకూడా తాను చేయబూనిన 'ఎక్స్పెరిమెంటు'లో ఒక భాగమే. మనిషి గేయం మరీ బరితెగింది. అందులో పాత శబ్దాలు కటువయ్యాయి. వాడుక పదాలకు కవిత్వస్ఫూర్తిని కలిగించే విధంగా ప్రయోగిస్తూ, వాటిని సులువుగా యిముడ్చుకోగల ఛందస్సులను సృష్టించుకొంటూ ఒక నూత్న కావ్యశైలిని అనుసరించవలసి ఉంటుందన్నాడు. పూర్వకవుల పద్ధతినే పోయిన నన్నయను కూడా కాదని, తన నవీనతను ఒకచోట చాటుకున్నాడు. తాను మహాకవి కాకపోవచ్చు — ముందు రాగల మహాకవికి మార్గం సిద్ధంచేస్తున్నాననే స్పృహతోటి ఈ ప్రయోగాలను చేశాడు.

కావ్యభాష విషయంలో అప్పారావు చేసినపని, ఇంగ్లీషులో ఛాసరు (Chaucer) చేసినపని లాంటిది. కావ్యభాషకు గ్రంథ ప్రమాణంగాక జాతిసాంఘిక ప్రమాణమే ముఖ్యమని ఎంచి, ప్రజలకు సుబోధకమయేందుకు నిత్య సంభాషణ

నుంచి ప్రాణవంతంగా గ్రహించి స్పష్టమైన సుపరిచితమైన భాషను చేబట్టడంలో ఇద్దరికిద్దరే. పూర్తిగా భాషను మార్చటం ఏ కవికీ సాధ్యంకాదు: అలా మార్చే వాళ్లు ప్రవక్తలైనా కావాలి ఉన్మాదులైనా కావాలి, అంటాడు భాసరుసుసంచించిరాస్తూ వాల్టర్ రాలీ (Walter Ralcigh). కావ్యభాష బాగా కృతకమై అర్థావబోధ దుష్కరమైపోయిన రోజులలో, మళ్ళీ మామూలు మాటల సత్తాను కావ్యానికి సట్టించిన వర్డ్స్‌వర్తు(Words worth), తన జాతి జనుల గ్రామ్యాన్ని కావ్యానికెక్కించి దాని చేవను లోకానికెరిగించిన రాబర్టుబర్న్సు (Robert Burns) అప్పారావుగారి అభిమాన కవులు కావడం గమనింపదగింది. ఇంగ్లాండులోని "రొమాంటిక్ రివైవల్" ఛందస్సులోనూ మార్పు తెచ్చింది. 'సిలబుల్స్' (Syllables) కిచ్చింపుగాక 'యాక్సెంట్స్' (Accsnts) కు ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చింది. ఇక ఇంగ్లీషు 'బాలడ్ పొయిట్రీ' (Ballad poetry) రచనంలో ఈ జాతి గీతాలు ఎంతో పొరునూ ఊపునూ చూపెడుతూ, పాత్రీకరణను దాదాపు పూర్తిగా విస్మరించి సంభాషణనుంచి సంభాషణకు పరుగెడుతూ వర్ణనను అత్యంత ప్రముఖ విషయాలకే పరిమితపరచి ప్రత్యక్ష పద్ధతిని అనుసరిస్తూ విలక్షణతను గడించుకొంటాయి అనే విషయం ఆయనకు తెలుసు. సహజ సంభాషణాపూర్వకమైన శైలి, ద్విపద కావ్యాల నుంచికూడా గ్రహింపదగింది.

కావ్యాల వస్తువుగురించికూడా, అప్పారావు అభిప్రాయాలు సరికొత్తవి. జ్ఞానవాసిష్ఠం నుంచి లవణరాజుకలను, స్థలపురాణాల నుంచి కన్యక కథను, గ్రీక్ కథలనుంచి డామన్ - పితియస్ కథను గ్రహించినప్పటికీ, ఆయన దృష్టి మధ్యయుగీనం కానేకాదు, కాల్పనికత ఆయనచేత చరిత్రకథలకు తోకలూ పీకలూ పెట్టించలేదు. వర్తమానం మీదికంటే భావిపైనే ఆయనకు ఎక్కువగురి. యథార్థ జీవిత దృశ్యాలను కావీకరించడమే ఎక్కువ ప్రియం. పూర్వకథలనూ గాథలనూ గ్రహించినప్పటికీ, వర్తమాన కాలపు జీవితానికి వాటి ద్వారా మరింత వివాద రహితంగా వ్యాఖ్య చేయవచ్చునని భావించినట్లుంది. తమంత తాము అవి ఆయన మనస్సును హరించలేదన్నమాట. ప్రాచీన పద్యకావ్యాల వస్తువు "ఎపిక్"లతోటీ పురాణాలతోటీ అంటకాగుతూ వచ్చినందుకు కారణం, అది మత సంబంధం కలిగిఉండడమే. శృంగారం ప్రబంధాల కన్నింటికీ ప్రాణం పోసింది. దానికి గూడా నేటి కవుల చేతిలో కొంతకుకొంత సంస్కారం చేకూరి, అది ఉదాత్తతను సంపాదించుకోవలసి ఉంది. మిథునానురాగాన్నిగాక, అతిలోలత్వాన్నీ ఇంద్రియ చాపల్యాన్నీ రచయితలు తమ కావ్యాలలో చిత్రించడం మానవలసి

ఉంటుంది. ముఖ్యంగా పరకీయా శృంగారం పరమహేయమైనది. అంగాంగ వర్ణనల కంటె రత్యాది వర్ణనల కంటె, పరకీయా శృంగార వర్ణనలు చేకూర్చగల కీడు చాలా ఎక్కువ ఈ దృక్పథం ఏర్పడ బట్టి, అప్పారావు సగర్వంగా తన కావ్యాల గురించి ఇలా రాసుకొన్నాడు :

తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం; కావ్య యితివృత్తాలు భారతీయం. కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను; జీవితాన్ని నూత్న దృక్పథంతో దర్శించి, కథా, కవితారూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను. నాకా కళల పట్ల, జీవితం పట్ల, కొన్ని ఆదర్శాలు వున్నాయి; వాటిని సంస్కృతి పరులు మాత్రం అర్థం చేసుకొని హర్షించ గలరు. సంస్కృతి శూన్యులు కావ్య కథా సంవిధాన, హాస్య ధోరణులను గమనించి అంతటితో సంతృప్తి పడుతారు.[12]

# 2

మంధిర సుబ్బన్న దీక్షితుల కాశీమజిలీలు, ఎఱ్ఱమిల్లి మల్లికార్జునుడి చార్ దర్వేషుకథలు, [illegible] కథలు వగైరావగైరా తెలుగువాళ్ళకు కాలక్షేపాన్నీ వినోదాన్నీ కలిగించే రోజులలో, గురజాడ అప్పారావు కథా రచనలలో పరిపూర్ణమైన విప్లవమే కలిగించాడు. చిన్నకథ అప్పారావు మానస పుత్రిక.

కాశీకి విజయనగరం ఎంతదూరమో, కాశీమజిలీ కథలకు అప్పారావు కథలు అంతదూరం; ఇంకా దూరమే. అయితే వాటి రచనాకాలంలో ఇంత ఎడం కనిపించదు. గొలుసుకట్టు కథలు సంస్కృతంనుంచి అనువాదాలుగా పరవస్తు చిన్నయసూరిచేత, వీరేశలింగంచేత కొత్తమూసలకెక్కుతూ వచ్చాయి. వేదం వేంకటరాయశాస్త్రి కథాసరిత్సాగరం పాలిటి అభినవ అగస్త్యుడై ఆపోసన పట్టి ఆంధ్రీకరిస్తూ వచ్చాడు. Tanglewood Tales ను సెట్టి లక్ష్మీనరసింహం, Annals of Rajasthan ను చిలకమర్తి లక్ష్మీనరసింహం ఆంధ్రులకందిస్తూ వచ్చారు.

ముందు మార్గదర్శకుడంటూ ఒకడెవ్వడూ లేకుండా, స్వయంభువులాగా అప్పారావు తెలుగు కథానికను స్వకపోలకల్పితంగా సృష్టించాడు. పుక్కిటి పురాణాల, కల్పనాకథల పైడొల్లలను తొలగించి, తెలుగు కథకు తనదని చెప్పుకో దగిన మూర్తినీ విస్ఫూర్తినీ కల్పించాడు. అరడజనుకంటె లోపుగావున్న ఈ కథలు ఒక్కొక్కటీ ఒక్కొక దీపస్తంభంగా నిలిచి తరువాతి కథకులకు యావన్మందికినీ మార్గాన్నీ గమ్యాన్నీ కాంతిమయం చేసినట్లు తెలిసివస్తుంది. ఆయొక్క విక్టోరియా రాణీకాలపు రైలుబద్దీలమీదనే మనరైళ్లు ఈ నాటికీ నడుస్తున్నట్లుగా, గురజాడ కథల జాడలనుబట్టే మన కథకుల నడకలు మును సాగుతున్నాయి.

అప్పారావు ఈ కథలను రచించినకాలం ముఖ్యంగా పందొమ్మిదో శతాబ్దమే అయినా, కథాకాలంకూడా అదేకావడం వాటి విశిష్టతకు ఒకవిధంగా హేతువనాలి. అయితే ఒక్కషరాఉంది. ఆకథలలో కనిపించే సమస్యలు ఇరవయ్యో శతాబ్దానికి గూడా చెందడమనేది మరీమరీ గమనింపదగిన విషయం : వాటికి అప్పారావు

సూచించిన పరిష్కారమార్గాలు ఈనాటికీ సాహసోపేతాలనిపించేంత కొత్తవి కావడం' ఆయన వ్యక్తిత్వానికి ఘనతను ఆపాదింపగల విశేషమే. కొత్తదనమంటే కాలపు ఇటీవలితనమే కాదు; కొత్తదనమంటే నిజమైన తాత్పర్యం సమకాలికత్వమే* అలా చూచినప్పుడు అప్పారావు నవ్యులనిపించుకొనే పశ్చాద్దృక్కులకే నవ్యుడు. తన కావ్యరచనలో కనిపించే సమకాలికత్వం కంటె కథానికలో కనిపించేది నిజంగా ఎక్కువ.

కథలు రాయడమనేది అప్పారావు వేసిపెట్టుకున్న రచనా ప్రణాళికలో ముఖ్యమైన అంశం కాదనేకాని, మొదటినుంచి కథలపై ఒక కన్నువేసి ఉంచాడు. ఎవరు రాసినట్టివో తెలియని కల్పనాకథల పుస్తకాలను మద్రాసులో అప్పుడప్పుడు కొని చదవడం జరిగినట్లు డైరీలు పేర్కొంటున్నాయి. విజయనగరం సంస్థానోద్యోగిగా ఉండిన 'మిస్టర్ అండర్‌వుడ్'కు కథలు అనే శీర్షిక కింద ఎలాంటెలాంటి చిత్రమైన అంశాలున్నాయో తెలుస్తుంది. "వైద్యుడు, గుర్రం; వైద్యుడు, కరక్కాయ; రాజు మంగలిని మంత్రినిచేయుట; మిడతంభట్లు సవారి; ముందూ వెనకా; జ్యోతిష్కుడు; మంచి గంధపుచెట్లు అమ్మడం; ససేమిరా; ఏకఃపంథాను కర్తవ్యం; రాజుభార్య రాజును చంపుట; మంత్రిభార్య బ్రతికించుట; పక్షులు మాట్లాడుకోవడం; రాచకన్యతాలూకూ బట్టల నిమిత్తం రాకుమారుడు;" పుట12 లోనే మరొక జాబితా: రెండుపుటల ముందు మరొకటి; కథాసప్తతి, *తెనాలి రామలింగని కథలు, పరమానందయ్య శిష్యుల కథలు*. ఆంగ్లేయులకు ఆసక్తికలిగించే ఇలాంటి జానపద కథలు బ్రౌన్ కాలంనుంచీ వారి ఆదరణకు నోచుకున్నాయి. Good models of colloquial Telugu అని 1855లో బ్రౌన్ దొర మెచ్చుకొన్న కథలు ఇలాంటివే. ఆయన వద్ద పండితుడుగా వుండిన రావిపాటి గురుమూర్తిశాస్త్రి వ్యావహారికంలో *విక్రమార్కుని కథలు, పంచతంత్ర కథలు* రచించాడు.** అయితే అలాంటివాటికీ అప్పారావు కథలకూమధ్య చెప్పలేనంత దూరం. ఇది అచ్చసృష్టి. అయినా దానికీ ఒక నేపథ్యం ఉంది :

19 వ శతాబ్ది పరార్ధమందు ఆంధ్రభాషలో కొన్ని పత్రిక లవతరించినవి. ఆ తొలినాటి పత్రికలందు ఆంగ్ల, ఉర్దూ భాషలనుండి కొన్నికథలు అనూదితములై ప్రచురితములైనవి. ఈ జాతికిచెందినవి *షేక్స్పియర్ కథలు*,

---

* *The struggle of the Modern* లో నవ్యత్వమంటే సంప్రదాయ సాహిత్యంతోటి సమకాలిక జీవనవిధానాన్ని ఎదుర్కొంటూ ఐకాంతికనూ వ్యక్తిస్వీయాత్మికతనూ పెంపొందించుకొని కాల్పనిక దృక్పథాన్ని అవలంభించడమేనని *Stephen Spender* రాస్తున్నాడు.

** అలాగే బేతాళపంచవింశతి, శుకసప్తతి, పలుకని పద్మాక్షికథలు, కాంభోజరాజు కథలు వగైరా.

[illegible] లు అను పేరునవచ్చిన [illegible] కథలు, [illegible] కథలు, [illegible] అను కథలు.

నేటి కథకు విఘ్నేశ్వరపూజ చేసినవారు శ్రీ గురజాడ అప్పారావు. ఆయన రచించిన [illegible], [illegible] అను కథలు ఆ ప్రాంతమున [illegible] మాసపత్రికలో ప్రచురితములైనవి. వీటిని కథలనుటకంటె 'స్కెచెస్' అనుట సమంజసము. ఆచ్చపు తెలుగు వాడుకభాష సజీవముగా చిన్న కథలు వ్రాయుటకు తొలుత వాడినవారు శ్రీ గురజాడ.[13]

అప్పారావు కథలన్నీ జీవిత వాస్తవాన్ని ఆశ్రయించుకొన్న సామాజిక చిత్రణలు. పెద్ద మసీదు అనే అతి చిన్న కథతప్ప తక్కినవన్నీ సమకాలిక జీవితం నుంచి తీసుకొన్నవే. భారతీయ జీవితాన్ని ప్రతిబింబించే కథలు అయిదు వేల మాటలకు ఎక్కువగాకుండా రాసిపంపమంటూ, 1904 లో ఇంగ్లాండులోని హాంప్‌స్టెడ్‌నుంచి మాక్స్‌పెంబర్టన్ (Max Pemberton) చేసిన అభ్యర్థన గమనింపదగింది.* తదనుగుణంగా అప్పారావు రాసిన కథలలో *Stooping to raise* అనే

---

* ఇంగ్లీషున రచనలు చేస్తూ వచ్చిన స్వదేశీయ రచయితల గురించి హరిశ్చంద్ర నాటక పీఠికలో అప్పారావు మెచ్చుకొన్నారు : ఆంగ్లభాష గురించి ఆయన అభిప్రాయాలు ఎలాంటివో కూడా ఇందుబట్టి తెలుస్తుంది.

ప్రభుత్వ భాషగా స్థిరపడి ఉన్నత వర్గాల వారిని ఆకర్షిస్తున్న ఇంగ్లీషులో రచనలు చేయడం. పండితులు మాత్రమే ఆనందించగల కృతక ద్రావిడ భాషల్లో రాయడం కంటె ఎక్కువ ప్రయోజనకారి. తద్వారా ఇంకా ఎక్కువ మందిని మెప్పించవచ్చును అని రచయితలు ఆశపడడం సహజమే. అయితే ఆంగ్లభాషలో రచన సాగించే ప్రయత్నం "హర్షణీయం కాక పోయినా, పోనీ అభ్యంతరకరం మాత్రం కాదు."

వివిధ రాష్ట్రీయులైన భారతీయుల భావ సమైక్యతను సాధనచేస్తూ, సంస్కృతాన్ని హిందీని అవలకు నెట్టి, విద్యార్థులలో జాతీయ భావ చైతన్యం కలిగిస్తూ, వాల్పనికతను పెంపొందింప జేస్తున్న ఇంగ్లీషు భాషలో చేసిన రచనలు మన దేశం గురించి పాశ్చాత్యులకు సదభిప్రాయాన్ని కలిగించగలవు. మన జాతీయ జీవిత స్వరూపం వాళ్ళకు ఈ రచనల ద్వారా అవగతం కాగలదు. "అలాంటప్పుడు మన జీవితంలో ఆకర్షవంతమైన సంఘటనలను అన్య దేశీయులకు చూపుతూ ఆంగ్లభాషలో రచనలు సాగించే భారతీయులు తమ మాతృదేశానికి అపారమైన సేవ చేసిన వారౌతారు." (గు. ర. మా. మం. పు. 110 - 112)

అప్పారావు ఆంగ్లభాషలో కథలనూ, నవలలనూ రాయబూనినది ఎందుచేతనో, దీన్నిబట్టి తెలుస్తుంది.

దొక్కటే ఉంది. దానిని తెలుగుచేసి సంస్కర్త హృదయం పేరున ఆణి ముత్యాలులో అవసరాల సూర్యారావు చేర్చిఉన్నాడు. మీ పేరేమిటి అనే కథ మాత్రం ఏదో పూర్వకాలానికి సంబంధించినట్లు కనిపిస్తుంది. దీన్నీ పెద్ద మసీదునూ ఒక కూటమి చేస్తే, మిగతావన్నీ బస్తీలలో విద్యావంతుల మధ్య అత్యంత సమీచీన కాలంలో జరిగిన కథలు. వేశ్యాసంస్కార సమస్య సంస్కర్త హృదయంలోనూ, దిద్దుబాటులో పూర్వరంగంగానూ కనిపిస్తూంది. స్త్రీ భిన్నురాలు కావడమనేది అన్ని కథలలోను అప్పారావు చూపెట్టిన సామాన్య లక్షణం. అప్పారావు జీవితాన్ని ఎలా దర్శించిందీ తెలుసుకొన్నప్పుడు, సదరు దర్శనం కథల్లో ఎలా సమన్వితమైందీ తనంతట తానే తెలియవస్తుంది.

కన్నదీ విన్నదీ కన్నట్టుగా విన్నట్టుగానే కాగితాని కెక్కదు. కొందరు రచయితల పాత్ర సృష్టికి యథార్థ జీవితమూలాలు లభిస్తాయి. అయితే పాత్రీకరణ విధానం గురించి ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలున్నాయి :

> రచయిత తాను రూపొందించే పాత్రల నన్నింటినీ జీవితం నుంచి పరిగ్రహించడు. పరిగ్రహించిన పాత్రలను అచ్చంగా పరిగ్రహించనట్లే చిత్రించడు. వెనకటి కవులు నిర్మించిన భావనాత్మక మూర్తుల లక్షణములు, అతనికి తెలియకుండానే, అతనిలో ద్యోతకమౌతాయి.[14]

అప్పారావు కథలలో రంగనాథయ్యరు, సరళ, మెటిల్డా వగైరాల మూలాలేమిటో తెలియకున్నా, కొంతవరకు ఊహించవచ్చు. నాటకాలకు వస్తే గిరీశం ఏ ఒక్క వ్యక్తికీ నకలు కాదు. రామప్పంతులు పాత్ర గురించి "విజయనగరంలో అలాంటి కొందరు వ్యక్తులను మనం ఎరగకపోము" అని ఒంగోలు ముని సుబ్రహ్మణ్యం గారు వట్టినే రాయలేదు.[15] ఎందరో భుజాలు తడుముకొని ఉంటారు. తనను రచ్చకెక్కించి నవ్వుల పాల్జేశాడని అప్పారావుపై ఆనందగజపతికి ఫిర్యాదు జేసిన ఒక పెద్ద మనిషిలో గిరీశం పోలికలుండేవి. 'భ' గా రప్పాయి కూడా గిరీశానికి మాతృకే.[16]

అప్పారావు పాత్రీకరణ విధానం ఫొటోగ్రాఫు వ్యవహారమేమీ కాదు : కొన్నిచోట్ల అది 'పెన్సిల్ స్కెచ్', మరికొన్ని చోట్ల 'పోర్ట్రైట్'. ఆయన సుగుణమల్లా సూక్ష్మ పరిశీలన శక్తి. వ్యక్తుల గుండెలను దూసుకుపోగలంత చురుకైన చూపు. ఒకసారి తన గుమాస్తాతో రివారాణి అందట : అప్పారావు చూస్తూ ఉండగా నువ్వేమి రాయకు ; ఎందుకంటావా, నీ కలం తిరిగే

తిరుగుళ్ళనుబట్టి కూడా నువ్వేమిరాస్తున్నదీ ఆయన కనిపెట్టేయగలడు, ఏమను కొన్నావో ! రిట్టగించిన కంటితోటి చూడనట్లే ఉంటూ ఎదుటివాడిని అప్పారావు చూస్తుంటాడని ఆనందగజపతికూడా అని ఉన్నాడు. చూడడమనేది అప్పారావు బాల్యంలోనే పెట్టుకొన్న లక్ష్యం. వెలగాటి కొండమీద మహారాజావారి విలాసినీ జనంలో ఒక్కొక్కరి విలక్షణమూర్తినీ గమనిస్తూ వచ్చినట్టే, తన జీవిత ఘట్టాలలో ప్రతిఘట్టంలోనూ తారసిల్లిన వ్యక్తులను పరిశీలిస్తూ వచ్చాడు. కొందరి రూపురేఖలను పెన్సిలుతోటి నోటుబుక్కులో చిత్రించి పెట్టుకొన్నాడటగూడా, అది పోయింది. ఎన్నడో చిన్ననాడు రాయవరంలో తాతగారి వ్యవసాయం చూస్తూవచ్చిన ఒకపనివాడు నాటకంలో అసిరిగాడైనట్లే, పరిచితులే కథలలో పాత్రలయ్యారు. అగ్రహారీకులు, వెర్రివాళ్లు, బట్టికోర్లు, వేదాంతులు, జులాయిమనుష్య, శ్రీకాకుళం మనిషి, అత్తరుపులమ్మే సాయిబు, ఒక రాజపుత్రుడు, స్త్రీ పునర్వివాహోద్యమంలో చేరి అపిమ్మట ప్రాయశ్చిత్తం చేసుకొన్నవాడు.– ఇలా ఎందరినో పరిగ్రహించుకొని కొద్దిపాటి వర్ణనలతో చిత్రించి పెట్టుకొన్నట్లు డైరీలలో : కావ్యసృష్టి అనే శీర్షికగల రచనాశకలాలు తెలియ జేస్తాయి. [17] ఆ విధంగా అప్పారావు మనస్సు పోలీసు ఫైలులాంటిది గాకున్నా, మానవ మహాసముద్రమే.

కథలుకూడాకాదు, అప్పారావుపేరు ఆంధ్రజాతికి ప్రీతిపాత్రం కావడానికి నాటకమే ప్రధాన కారణమనాలి. వీరేశలింగం మొదలు వేటూరి ప్రభాకరశాస్త్రి లాంటి (ఆనాటికి) పిల్ల రచయిత వరకు, రెంటాల వెంకట సుబ్బారావు మొదలు పురాణం సూరిశాస్త్రి లాంటి నాటక విమర్శకుల వరకు అప్పారావు నాటకాన్ని మనసారా ఆనందించారు. పత్రికలు దాని నొక 'సంఘటన' గా పేర్కొన్నాయి.

కోరాడ రామచంద్రశాస్త్రి *మధుకరీమంజరీయము*, వావిలాల వాసుదేవ శాస్త్రి *నందకరాజ్యము* స్వతంత్ర నాటకాలే అయినా, అవి గీత నాటకాలు. మొట్టమొదటి సాంఘిక వచన నాటకం రాసిన ఘనత, అదీ వ్యావహారికంలో, అప్పారావుదే. కొక్కొండ వేంకటరత్నం *ప్రసన్నరాఘవ* నాటకం రాసినా, బళ్ళారి ధర్మవరం రామకృష్ణమాచార్యులు *చిత్రనళీయం* రాసినా, వేదం వేంకట రాయశాస్త్రి *ప్రతాపరుద్రీయం* రాసినా, పండితులలో నాటకాలపట్ల పూర్తి

సుముఖత ఇంకా ఏర్పడని రోజులు. తెలుగు నాటకాలలో నీచ పాత్రలకు తగిన గ్రామ్యభాషను పెట్టడం గురించి *అముద్రిత గ్రంథ చింతామణి*, *ఆంధ్రభాషా సంజీవని* వంటి పత్రికలలో పండితులు కుమ్ములాడుకొన్న రోజులు. ఆంధ్ర లక్షణ గ్రంథాలలో నాటక లక్షణ ప్రకరణమేదీ లేదుకాబట్టి, నాటక రచన ఆంధ్రభాషలో నిషిద్ధమని కొందరు వాదించారు కూడా.[18] అలాంటి రోజుల్లో *కన్యాశుల్క* నాటకం మొదటిసారి వెలువడింది.

నడుస్తున్నది వచనయుగమని, నాటకభాష వ్యావహారిక వచనంకాకతప్పదని తద్వారానే ప్రజాహృదయానికెక్కి చిత్తసంస్కారం కలిగింప వీలౌతుందని అప్పారావు సిద్ధాంతంచేసుకొన్నాడు. అంతేగాని, ప్రహసనాలలోమాత్రమే గ్రామ్యం ప్రయోగింపదగునని పండితులు చేస్తూవచ్చిన వాదాన్ని పాటింప బూనుకొనలేదు. *బిల్హణీయం* ప్రహసనం కాకున్నా, శిష్టవ్యవహారికమే ప్రయుక్తమై ఉంది.

నాటక రచనలో అప్పారావు ఆశించిన ప్రయోజనాలు సంఘ సంస్కరణ, నాటకరంగ సంస్కరణ, నాటక భాషా సంస్కరణ. షేక్స్పియరు, బెన్ జాన్సన్, మోలియెరు వంటి పాశ్చాత్య నాటక కర్తల ప్రభావంవల్ల, తన ప్రతిభకు తగినట్లుగా హాస్య పద్ధతిని చేబట్టి, సంఘపు కుళ్ళును శుభ్రపరచడానికి — "నైతిక పతనం వల్ల ఉత్పన్నమైన సామాజిక రోగ లక్షణాలతో నిండివున్న దుర్భర హింసాత్మక బానిసత్వంలో క్రుంగిపోయే స్త్రీ జాతిని ఉద్ధరించడమెలాగ అనే సమస్యపై .... ప్రజా బాహుళ్యపు దృష్టిని మళ్ళించి ఆలోచింపేటట్లు చేయడానికై సామాజిక దోషాలను బహిర్గతం చేస్తూ" ఈ నాటకం రచించినట్లు తానే చెప్పుకొన్నాడు.[19] బాహాటంగా తన రచనకు ఉపదేశాత్మకత ఉందని చెప్పుకొన్నందుచేత, దాని కళామూల్యానికి దెబ్బతగులుతుందని సందేహించ నవసరం లేదు. సాహిత్యం ఒక ఆయుధ విశేషం. చెప్పుకొన్నా చెప్పుకోక పోయినా ప్రతి రచయితకూ ప్రయోజనపరమైన దృష్టి ఉంటుంది. అది కొందరిలో నిద్రాణమై ఉండవచ్చునేమోగాని పూర్తిగా లేదనే వీలుండదు. సంకల్ప పూర్వకంగానే అప్పారావు తన రచనలకు సాంఘిక ప్రయోజనమున్నదని చాటుకొని తదనుగుణంగా రచన చేశాడు.

వీరేశలింగం లాగే నీతివాది అనిపించినా, అప్పారావు కళాకారుడు కూడా. బహుముఖమైన ఇతివృత్తం, పాత్రీకరణ, ఔచిత్య పోషణ— వీరేశలింగం ప్రహసనాలలో లేని, అప్పారావు నాటకంలోనూ కథలలోనూ ఉన్న, అంశాలు. ఉన్నతమైన నైతిక భావాలను వ్యాప్తిచెయ్యడం, సాహిత్యానికి ఉదాత్తతను కలిగిస్తూ, దాని కళా

గుణాన్ని మాత్రం అతిక్రమించి వెయ్యగూడదు. వీరేశలింగంతోనేగాక వేంకటరాయ శాస్త్రితో కూడా ఈ విషయంలో అప్పారావుకు పేచీ ఉంది. తాను కాల్పనికవాది కాకపోయినా, [illegible] లోని దేశభక్తి పూరితమైన కాల్పనిక వాతావరణాన్ని మెచ్చాడు. పాత్రల మెరుగుదలకు ఉపకరించని నాటక కథా విస్తరణకు తోడ్పడకుండా ఉన్నభాగాలను విమర్శించాడు కూడా. [illegible] ఈ పాటి మెప్పుకైనా నోచుకోలేదు. విష్కంభాలను ఆశ్రయించి, ఔచితి తప్పిన పాత్రలను సృష్టించినందుకు శాస్త్రికి 'కళ' ఏమిటో తెలియదనికూడా తీర్పు చెప్పవలసి వచ్చింది. నీతిపరమైన దృక్పథంతోనే గాక, కళా పరీక్షలో కూడా, వీరేశలింగం ప్రహసనాలను కొన్నిటిని అప్పారావు 'ఫెయిల్' చేయక తప్పించదికాడు. శృంగారం ఎంతో మెలకువతో నిర్వహించనప్పుడు, రచయిత పాఠకుడికి దుష్టాభిరుచి పుట్టిస్తాడు. కవితా న్యాయం (Poetic justice) ప్రకారం కాకున్నా, పాఠకుల మానసికారోగ్య దృష్టితోనైనా, కథలో చెడుకు గెలుపు చేకూరకూడదు. వీరేశలింగం రాసిన [illegible] ప్రహసనాన్ని విమర్శిస్తూ, పరకీయ శృంగారం నిజమైన పచ్చిశృంగారమని తేలుస్తాడు. "దుష్ట వర్తనుడకు తగిన శిక్ష జోడు కంచు కాగడాలు వేసి వెతికినను కానరాదు" 20

సాహిత్యానికీ నీతికీ ఏమి ఇలాకా, అని అడిగేవాళ్ళు లేకపోలేదు. నిరంజన కళావాదులు రసాన్నిమించి సాహిత్యానికి పరమమైన ప్రయోజనం సమర్థనం లేదంటారు. ఉపదేశ కర్తవ్యాన్ని గాలికి వదులుతారు. అప్పారావు అలాకాదు. అట్లని, వాస్తవాన్ని యథాతథంగా చిత్రించాలని కూడా అనడు. దాన్ని ఆదర్శీకరిస్తానంటాడు ఆదర్శీకరించడమంటే అబద్ధీకరించడ మని అర్థంకాదు. వాస్తవాన్ని తాను అవగతం చేసుకొని, దాని అందమైన అంశాలను మాత్రమే పాఠకుని ముందు పెట్టి అతని సౌందర్యస్పృహను మన్నించడాన్ని ఆదర్శీకరణమనవచ్చు. అంటే, వాస్తవ చిత్రణమనేది సౌందర్య దృష్టికి విధేయురాలౌతుంది. ఈ దృక్పథమే 'కవితా న్యాయ' సిద్ధాంతానికి గూడా దారితీస్తుంది. విషాదాంత నాటకాలు తప్ప తక్కిన సృజనాత్మక రచనల కథ మోదాంతం కావాలి; ప్రపంచంలో మంచి గెలిచి, చెడు వీగిపోతుందనే భావాన్ని కలిగించాలి. అంటే, లోకేశ్వరుడు చెయ్యవలసిన పనిని రచయిత తానై చేస్తున్నాడన్న మాట. ఇది లోక వృత్తానికి విరుద్ధం కావడం లేదా? తద్వారా దాని విశ్వసనీయత దెబ్బతినదా? అందుకోసమనే, సాహిత్యానికి ఉన్న పడికట్టు రాళ్ళన్నిటిలో ఈ వాస్తవికత–యథార్థ సాన్నిహిత్యం–

ప్రధానమైనది. * 'కవితా న్యాయం' పాటించవలెనని రచయితలను కోరినప్పటికీ, అప్పారావు ఈ రెండవ విషయాన్ని విస్మరింపలేదు. "ఐడియల్" ("ఏది ఎలా వుంటే బాగుండునో అలా భావించుట"- "లోకోత్తర కల్పన") ను పాటిస్తూ లోకోత్తరమైన రచనలు చేయబూనుతూ కూడా, మానవ సమాజం పట్ల తనకు గల "మహత్తరమైన బాధ్యత" ను గుర్తించవలసి వస్తుంది. ఒక పాత్రను (ఇక్కడ మధురవాణి) చిత్రించేప్పుడు ఆ పాత్రలోని దోషాన్ని దుర్మదతను ఆకర్షవంతం చేసేలా చిత్రిస్తే పాఠకులు తప్పుదారులు పట్టవచ్చు. అందుకోసమనే మధురవాణి పాత్రను చివరి అంకంలో సంస్కరించవలసి వచ్చింది. అలాగే మీనాక్షి పాత్ర కనిపించే దృశ్యాలు నీతిదాయకమైనవి కావుగాని వాస్తవాన్ని విస్మరించి వెల్ల కొట్టడమెలా ?

నువ్వు వాస్తవిక విషయాలను యధార్థాలను కప్పిపుచ్చకు. ఇంతే నేను నిన్ను కోరుతున్నది. రోగికి డాక్టరు శస్త్రచికిత్స చేసినట్లు సమాజంలో గల దుష్కృతలను కత్తి తీసుకొని కోసి దేనికది విడదీసి అన్ని భాగాలనూ పరీక్షించి చూడు.21

నీతి దృష్టితో చేసిన ఆదర్శీకరణ కూడా యదార్థం ముందు తలవంచుకో

---

Idealization applies only to creative literature. As applied to it, it enjoins that the mental aspect of reality should be presented by the author, and a selection from this mental aspect of reality should first be made, excluding such matter as affects unpleasantly the aesthetic consciousness of the reader.

The most prominent application of the principle of Idealization is the doctrine of Poetic justice. The plot of a work of creative literature should, with the sole exception of tragedy, end "happily" and so give expression to the deeply rooted sentiment of optimism which results from the belief that the universe is governed and controlled by an all-powerful and all-wise being.

There is however a limit to idealization. Truth is the supreme test of all literature This principle of truth requires that idealization shall be consistently applied through out' and that it shall be itself guided by that wide and exact knowledge of men and thing which is expressed by the term 'philosophy,

JUDGEMENT IN LITERATURE, W. BasliW orsfold (P.81-88s(

వలసింది. సామాజిక వ్యవస్థలను నిలబెట్టిన సూత్రాలను విశ్వసనీయంగా చిత్రించ వలయుకొన్నప్పుడు, అనివార్యంగా మానవప్రవృత్తి పైన ఏ ధర్మానికి వాస్తవంలోని గౌరవంతో యిలాంటి స్థిరమైన పొత్తు కలిగేది కాదు. మనుషులలోనే వైరుధ్యాలుంటున్నాయి. ... మంచి చెడుల సమ్మిశ్రణాలుగానే చిత్రించాలి గాని, ... రాక్షసప్రాయులుగానో ఒక 'అతి' గానుంచే ఇంకో 'అతి'కి పోగూడదు. యీ పద్ధతి వల్ల ఒక్కొక్కప్పుడు అవినీతిని అనుకూలీయం చేసినట్లు కనిపించినా అది తాత్కాలిక దృష్టాంతంగానే ఉంది. మొత్తంమీద చిట్టచివరకు నాటకంలో సరిపట్ల మార్పువిధానాలు కలుగుతాయి. వనిగట్టుకొని నీతిబోధ చేస్తే, తద్విరుద్ధఫలితమే ఎక్కువగా కలుగుతుంటుంది. నీతి అవినీతులను శతకోటి యాసాలలో మూర్తీభవించిన పాత్రల పరస్పర సంఘర్షణలో, ఉండవలసిన విధంగా నీతికి విజయం చేకూర్చే, నాటకప్రయోజనం అదృశ్యంగా ఉన్నా చాలా బలంగానే పనిచెయ్యకపోదు.

> కన్యాశుల్కం నాటకం నీతిని చెప్పటానికి 'మా అమ్మ తప్పుచేసిరె పట్టుకొస్తా'నని బయలుదేరి యేటో చెయ్యాలనే నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలపరుస్తంగా నెత్తిన పెట్టదు. కాని దానికి ఒక మహత్తరమైన నైతిక ప్రయోజనం వుంది.

> మానవజీవితంతో నేను చెలగాటం ఆడటం లేనేలేదు....ఎట్టి ప్రతీకార భావమూ లేకుండా మానవజీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి యీ నాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను.[23]

## 3

కాల్పనిక వాదానికి అప్పారావు రచనాతత్వంలో ఏదైనా ఒక స్థానముంటూ ఉండిందా, ఉంటే ఏ మేరకు ఉండింది, అనే విషయాలను స్పృశించి ఈ ప్రకరణాన్ని ముగించవచ్చు.

కాల్పనిక వాదమంటే ఏమిటో ఇక్కడ నిర్వచించవలసిన అగత్యంలేదు. నిజానికి, యావన్మందికీ అలాంటి నిర్వచనం గురించి ఇప్పటివరకూ ఏ ఆమోదం కూడాలేదు. దానిని ఉద్యమ మనడంకంటె ఒక చిత్తవృత్తి అనడం సబబుగా ఉంటుంది. లోకగతి తోటీ స్థితితోటీ సమాధాన పడలేక, స్పర్థిస్తూ అసంతుష్టి చెందుతూ అంతకంటె మంచిదానిని గురించి కలగంటూ కామిస్తూ అసాధ్యాలకు అర్రులుజాచే ఒకానొక మనస్థితిని కాల్పనికమని వర్ణింప వచ్చునేమో; నియమాలు నిర్బంధాలనిపిస్తాయి.

యథేచ్ఛ స్వేచ్ఛ అనిపిస్తుంది; ఆకాశం అవధి అనిపిస్తుంది. ఆరాటం ఆందోళన ఆవేశం సంఘర్షణ నిజమైన జీవితమనిపిస్తాయి. ఉన్నది, ఉండవలసినదిగా కనిపించదు. లేనిది, పరమ రమణీయమౌతుంది. కల వాస్తవాన్నీ, వాస్తవం కలనూ శాసిస్తాయి. మార్పు ఊరొస్తుంది; వస్తువులు అపరిచిత రూపాలతో దర్శనమిస్తాయి; ఏదో మర్మం పొరలు విచ్చుకొంటూ స్వాత్మావిష్కరణం చేసుకొంటుంది. సౌందర్య తృష్ణ మనస్సులను వివశం చేస్తుంది; సౌందర్య దర్శనం వాక్కులకు అవ్యక్త మధురిమ నిస్తుంది. అర్థం కంటె అర్థచ్ఛాయ ఎక్కువ అనిపించి, వ్యంజనకు అధికతర ప్రాముఖ్యం చేకూరుతుంది. క్లుప్తంగా చెప్పవలెనంటే, అది ఒక ఉన్మత్తమైన మనస్స్థితి.

కాల్పనికవాదం, తద్భిన్నమైన 'క్లాసిసిజం' చర్యా ప్రతిచర్యల వతుగా ఒకదానినొకటి అనుగమిస్తూ వస్తున్నాయి. హేతుబుద్ధి క్లాసిసిజానికి, ఉద్రిక్తభావన కాల్పనిక వాదానికీ జీవగర్ర. స్థిమిత చిత్తం తోటి కడుపులో చల్ల కదలనట్లుగా, ప్రశాంతికి నిలయంగా లోకాన్ని చూచేదొకటి; ఈ కుహనా ప్రశాంతిని కాదని కల్లోలాన్ని వరించే దింకొకటి. ఇలా ఇవి పరస్పర బాహ్య ధోరణులు.

19 వ శతాబ్దిలో ఫ్రాన్సులోనూ, ఇంగ్లండులోనూ, జర్మనీలోనూ 'నియో - క్లాసిసిజం' అనే నిష్ఫలమైన సాహిత్య ధోరణితో విసుగెత్తి కవులు ఈ కాల్పనిక వాదానికి మనసయ్యారు. సాహిత్యంలో ఈ కొత్తమోజు కొని తెచ్చిన మార్పులను ఫ్రెంచి దేశపు మేటికవియైన విక్టర్ యూగో (Vitor Hugo) ఇలా వర్ణించాడని అండ్రే మోర్వా (Andre Maurois) రాస్తున్నాడు :

> Romanticism was not just the mingling of tragic and grotesque, the giving of new blood to an old Vocabulary or the freedom to cut his coat according to his cloth, but something that went far deeper. It was the spirit of the age; it was an anguish, a discontent, a conflict between man and the world in which he lived.23

పారిశ్రామిక విప్లవం పాశ్చాత్య దేశాల సమాజాలలో కలిగించిన పెను మార్పులు సాహిత్యంలో ఇలా పరిణమించాయి. యంత్రాలయాలు వచ్చి ప్రకృతి దృశ్యాలను ఖరాబుచేశాయని, సౌందర్యప్రియులు మనస్సు కష్టపెట్టుకొన్నారు. మనిషికీ ప్రకృతికీ ఉండవలసిన సామీప్యమూ సాన్నిహిత్యమూ అంతరించాయని బాధపడుతూ అలా మనిషి ప్రకృతిస్తన్యాన్ని తాగుతూ ఉండి సరళ సుందర జీవనాన్ని గడిపిన వెనకటి రోజులను తలచుకొని పరవశిస్తూ, ఆ నాళ్ళ కాల్పనికతను పునఃపున

స్మరించుకో సాగారు. ప్రపంచాన్ని ఒక మహాయంత్రంగా దేవుణ్ణి యంత్రచాలకుడుగా భావిస్తూ, ప్రపంచంలోగల ప్రతి ఘటనకూ ఏవేవో వివరణలిస్తూ ఉపపత్తులు చూపుతూ, సృష్టి తమ కరతలామలకమైనట్లుగా హేతుచింతద్వారా విశాల విశ్వాన్ని అవగతం చేసుకోగలమనే తాత్విక ధోరణి, ఈ కొత్తకాలపు కళాకారులకు సంతృప్తి కలిగింపలేదు సరికదా, చిరాకు పుట్టించింది. పరిచిత ప్రపంచంకంటె, దృశ్యమాన వస్తువుల వెనకాతల గల అదృశ్యవ్యవస్థ మరింత పరిపూర్ణమైనదని అనుకోసాగారు. అది భావనైకవేద్యమైనది. అది ఒకటే అందమైనది. అందమైన దొక్కటే సంభావింప దగినది. ఎవరెవరి అనుభూతి తీవ్రతనుబట్టి వారికి సౌందర్యం అనుభవానికి వస్తుంది. కాబట్టి వైయక్తికానుభూతికీ, ఏకాంతికతకూ వాళ్ళు అతిశయమైన స్థానాన్ని ఇచ్చుకొన్నారు.

మనదేశంలో ఇరవయ్యో శతాబ్ది ప్రారంభకాలానికి ఈ కాల్పనిక వాదం భౌతిక పరిస్థితులతో ఎలాంటి సంబంధమూలేని సాహిత్య ధోరణిగా ప్రవేశించి, రవీంద్రకవి ప్రభావంద్వారా, అన్ని ప్రాంతాల కవులనూ కదిపింది. రవీంద్రకవితో పరిచయం ముదిరినప్పటికీ, అప్పారావుకు ఆయన కవిత్వంమీద అతిశయమైన అభిప్రాయమేదీ ఉండేదికాదని, గిడుగు రామమూర్తితో మాట్లాడుతూ ఈ తన ఉలిపికట్టె తనాన్ని ఒకటి రెండుమార్లు ప్రకటించుకున్నాడని, రామదాసు పంతులుగారంటున్నారు. నిజానికి రవీంద్రుని కంటె ముందే కాల్పనికవాదం బెంగాలీ సాహిత్యంలో ప్రవేశించింది. మైకెల్ మధుసూదన దత్తు, బంకించంద్రచటర్జీ, దాని ప్రభావానికి తమ రచనలను లోబరచుకొన్నారు. బంకించంద్రుడు తన నవలల ద్వారా బెంగాలీ కాల్పనిక వాదానికి * హైందవ పునరుద్ధరణోద్యమ స్వభావాన్ని చేకూర్చాడు. తెలుగులో బంకించంద్రుని నవలలకు అనువాదాలూ అనుకరణలూ అసంఖ్యాకంగా వెలువడసాగిన కాలాన అప్పారావు తన వైఖరిని నిర్ణయించుకోవలసి వచ్చింది. దేశభక్తి పూరితమైన కాల్పనిక వాతావరణం చేదనిపించలేదుగాని, దాని కోసమని చరిత్రను తారుమారు జేయడం విపరీతమని తోచింది.

*బంకించంద్రుని నవలా రచన* అనే వ్యాసాన్నిబట్టి, కాల్పనిక వాదపు యీ పెడధోరణిపట్ల అప్పారావు ఏర్పరచుకొన్న అభిప్రాయాలను తెలుసుకో వచ్చు. 'రొమాన్సు' జాతి రచనలు జరగనేరని సంగతులను వర్ణిస్తాయి ; జరగదగిన

---

* ఇది నిజానికి కాల్పనికవాదం కిందికిరాదు. (Historical Romance) మార్గానికే చెందుతుంది. అయినా కాల్పనిక వాదంలో కూడా గత కాలానురక్తి ఒకానొక అంశమే.

సంగతులను వర్ణించేదే ఉత్కృష్టకథ. బంకించంద్రుడు సర్ వాల్టర్ స్కాట్ (sir walter scott) నుంచి ఈ ధోరణిని స్వీకరించాడు కాబట్టి స్కాట్ నవలలనే అప్పారావు విమర్శింప బూనాడు. స్కాట్ నవలా నాయకులు అవాస్తవిక వ్యక్తులు. ఐవాన్‌హో (Ivanhoe) నవలలో రాబిన్‌హుడ్‌కు గుణసంపత్తి కలిగించడం స్కాట్‌లోనే కావ్యదోషమని అప్పారావు తీర్పు. ఆ నవలలో లాక్‌స్లీ పాత్ర నిజానికి రాబిన్‌హుడ్‌దే. స్కాట్ నిర్మించినపాత్రలు Wooden ideali-zations;awkward stage figures of an imagination that is cut off from the sap of life అని ఇంగ్లీషు విమర్శకులుకూడా రాసి వున్నారు.[24] అయినా రాబిన్‌హుడ్ లాంటి వ్యక్తి సమస్తసద్గుణ శోభితుడుగా ప్రజల భావనలో కల్పనలో చాలా వందల సంవత్సరాలనుంచి రూపుగట్టుకొని ఉన్నాడు కాబట్టి, అతన్ని అలా చిత్రించడంలో స్కాట్‌చేసిన అపరాధమేమీ లేదు.*

బంకించంద్రుని ప్రఫుల్ల నవలలో నాయకుడైన భవానీ ఠాకూరు, స్కాట్ రాబిన్‌హుడ్‌కు ప్రతికల్పుడు. రాబిన్‌హుడ్‌లా గాక, ఇతడు కల్పితవ్యక్తి దొంగతనాలు చేస్తున్నా, ఇతడు గుణసముద్రుడే. ఉత్తర భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనను వ్యతిరేకిస్తూ సన్యాసులు సాగించిన సమరాలు బంకించంద్రుని నవలలకు ఇతివృత్తాన్నిచ్చాయి. ఆకోవలోనివాడే భవానీ ఠాకూరు. ఎంతటి దేశాభిమాని అయినా కావచ్చుగాని, ఆదర్శ మానవమూర్తి ఎలా కాగలడొకవ్యక్తి ? అంటే, కాల్పనిక భావనలోనే లోటువుంది. ఆదర్శీకరణమనేది యాథార్థ్యానికి చేరువగా ఉండక దానిసీమను అతిక్రమించి, అబద్ధీకరణగా పరిణమించగల ప్రమాదం ఉంది. "చిత్రాన్ని కళ్ళెంవదలి" పరుగెత్తనివ్వడం అప్పారావుకు నచ్చలేదంటే, సత్యంమిది

---

* Robin Hood : what perhaps is its greatest interest is its expression of the popular mind about the close of the middle ages. Robin Hood was at that time the people's idol as Arthur is that of the upper classes. He is the ideal yeoman, as Arthur is the ideal knight. He readjusts the distribution of property; he robs the rich and endows the people. He is an earnest worshipper of the virgin, but a vigorous hater of monks and abbots. He is the great Sportsman, the incomparable archer, the lover of greenwood and of a free life, brave, adventurous, jocular, open - handed, a protector of women.

— Encyclopaedia Britannica:
(14 th Editon) Vol 9. P .583

నిఘాచేతనే నడకోవాలి. అప్పుడు అందరూ పోకడ పొందక అభూతకల్పనలు తయారౌతాయి. బంకించంద్రుని నవలలో 'పర్యంత ప్రపంచం' (Social Setting) లేదా నేపథ్యంలోపించడానికి ఈ అవాస్తవికదృష్టే కారణమని అన్నాడు.

ఆధునిక ఆంధ్ర వచన రచన శీర్షికలో మద్రాసు విశ్వవిద్యాలయానికి 1914-1915 లో అప్పారావు ఒక నివేదికను సమర్పించాడు. (కట్టమంచి రామలింగారెడ్డి చూపెట్టిన అభ్యంతరాలను పురస్కరించుకొని విశ్వవిద్యాలయంవారు ప్రభుత్వం మంజూరుచేసిన గ్రాంటుధనాన్ని ఖర్చుచేయకుండా నిలిపి ఉంచారు; అందు మీదట రెడ్డి వాదాలను పూర్వ పక్షం చేస్తూ అప్పారావు కొన్ని సూచనలు చేశాడు. పాఠ్య ప్రణాళికనూ పాఠ్యగ్రంథాలను పరిశీలిస్తూ ఈ నివేదికను తయారుచేశాడు.) 1914 లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి పక్షాన వెలువడిన విజయ నగర సామ్రాజ్యము నవలను ఈకకు ఈక పీకకు పీక పద్ధతిలో విమర్శిస్తూ, ఆయన రాసిన మాటలివి :

> బంకిం చంద్రుణ్ణి అనుకరించడం తెలుగు నవలా రచయితల కొక అంటువ్యాధి అయింది.

దీనితో చరిత్ర చట్టుబండలౌతున్నది. వాస్తవం వికృతి పాలౌతున్నది. దేశభక్తి పేర అభూతకల్పన చలామణి కాగలుతున్నది. హిందువులు మహా వీరులూ, ఆదర్శ పురుషులూ అవుతూ, ముస్లిములు రాక్షసతుల్యులుగా చిత్రితు లౌతున్నారు. సంఘానికి చెప్పరాని అపకారం జరుగుతున్నది. ఇలాంటి రచనలే చిలకమర్తి లక్ష్మీనరసింహం రాసిన హేమలత, రాజస్థాన కథావళి వగైరాలు.

తానే చారిత్రక ఇతివృత్తాన్ని చేబట్టి నవల రాయబూనితే ఎలా రాసి ఉండే వాడో ఊహకు వదిలిపెట్టకుండా, శకలప్రాయంగానైన అప్పారావు చూపెట్టి పోయాడు. రాయసామ్రాజ్య చరమ సంధ్యాకాలంలో, రామదేవు మాధవ వర్మ అనే బెజవాడ పూసపాటి వంశ ముఖ్యుడు విజయనగర ప్రభువైన అళియ రామరాయల తోను, బిజాపుర సుల్తాను అలీ ఆదిల్షాతోను రాజకీయ చదరంగ మాడుతూ బెజవాడను స్వాధీనపరచుకో నెంచింది వర్ణించబూని, కొన్ని సంభాషణ లనూ, ఘట్టాలనూ చిత్తుగా రాసిపెట్టుకొన్నాడు.[25]

ఇంతకూ అప్పారావు చారిత్రక కాల్పనిక వాదానికి దాసోహం చెప్పుకో లేదని నిర్ధారణ చేసి చెప్పవచ్చు. తాత్వికంగా కూడా, వస్తువును విడిచి దాని

గురించి భ్రమలు కలిగే విధంగా వర్ణించే పద్ధతి ఆయనకు సరిపడదు. వస్తువును ఉన్నది ఉన్నట్టుగా – వస్తుపరంగా నన్నమాట (Objective) –చూసి విలువ కట్టే పద్ధతి ఆయనది. ఇలా చూస్తే ఆయన వాస్తవవాద రచనా పద్ధతిని చేబట్టాడనవలసి వస్తుంది. సుదూర భవిష్యత్తు పైకి ఊహల నల్లించుకొంటూ ఆదర్శ సంఘాన్ని గురించి కలగనే వైఖరిని కూడా ఆయన హేళన చేశాడొక అసంపూర్ణ రచనలో. కవులూ, తత్వవేత్తలూ తమ కాలం కంటె ఒక్కడుగు ముందుంటారని ఒక కవి పాత్ర ద్వారా చెప్పించి నప్పటికీ, సదరు కవిగారి స్వప్నలోకానికి మరొక పాత్ర చేత తూటు పొడిపించాడు. 26కాల్పనిక వాదమంటే ఊహాగానం మాత్రమే అయితే, ఆయన ఆ వాదికాదు. వర్తమానకాలం ఆయనకు చాలు. వాస్తవ విశ్లేషణ ఆయనకు కావలసింది.

కాల్పనిక వాదం ఎన్నో భిన్నధోరణుల కలగూర గంప. కృతకభాషతో ప్రాచీన మహా కావ్యాలను పరమ దుర్బలంగానూ హేయంగానూ అనుకరిస్తూ, సాహిత్యాన్ని పండితాధీనం చేసిన అభినవ ప్రాచీనతా వైఖరి (neo-classicism) ని ఆయన ధైర్యంచేసి ధిక్కరించాడు. దేశభాషను నవీన జీవనావసరాలకు తగినట్లు మలుచుకొంటూ, నిరాదరణకూ విస్మృతికీ లోనైన దేశి కావ్యధోరణులను తవ్వి తలకెత్తుకొంటూ, నవ్యసాహిత్యాన్ని వెలయించడంలో మట్టుకు కాల్పనిక వాదుల 'పాండిత్య' ప్రాతికూల్యాన్నీ నియమ నిరసనాన్నీ అప్పారావు పంచుకొన్నాడు. తనకు తెలియకుండానే ఇంగ్లీషు చదువులమూలంగా ఈ కాల్పనికవాద పరమైన స్పృహ ఆయనలో ఉండిపోయింది. కాల్పనిక వాదానికీ, వాస్తవ వాదానికీ చరిత్రలో మూలం ఒక్కటే. సంపన్నుల పెత్తనానికి లోబడిన ప్రపంచంపై తిరుగుబాట్లే ఆరెండున్నూ. యూరపుఖండంలోకూడా విమర్శాత్మకవాస్తవ వాదానికి (Critical Realism) నేపథ్యంవంటిదే ఈ కాల్పనిక వాదధోరణి. అందుచేతనే, కాల్పనిక వాదుల్లా విజ్ఞానశాస్త్ర వైముఖ్యాన్ని అప్పారావు చూపెట్టలేదు. ఐకాంతికతను అభిమానించినట్లు స్వకీయానుభూతి ప్రాశస్త్యాన్ని గుర్తించినట్లు *దించులంగరు, లంగరెత్తుము*లాంటి ఖండికలు చూపెడుతున్నా, లోకంతో కయ్యానికి తలపడి సంఘాన్ని విరోధిగా ఎంచి విరాణ్మూర్తిగా అహంత (Napoleonic 'I') పెంచుకొన్న వితండ వ్యక్తివాదం, అప్పారావు భావసీమలో చొరబడలేదు. కాల్పనిక వాదపు ఒకానొక పాయమాత్రం అప్పారావును లోగొన్నది. యాంత్రికమైన దాన్ని

కాదని సహజమైన దాన్ని (organic) పరించే వైఖరి, కాల్పనిక వాదులను మళ్ళీ ప్రకృతి ఒడిలోని బిడ్డలవంటి సామాన్య ప్రజలనూ వారి ఆట పాటలనూ అభిమానించేట్లు చేసింది.

వర్డ్సువర్తు అప్పారావుకెంతో ప్రీతిపాత్రుడు కావడం, ఈ సందర్భంలో అవశ్యం స్మరించుకోదగింది. 1909 లో రాసిన కవిత్వము : వర్డ్సువర్తు వ్యాసంలో, కావ్య భాషా సౌలభ్య సౌందర్యాల గురించి, కావ్య గత వ్యక్తుల సామాన్యత్వ గంభీరత్వాల గురించి వర్డ్సువర్తు అభిప్రాయాలను సూక్ష్మంగా వర్ణించాడు. సామాన్యమైన వస్తువులను వాడుక మాటలతో వర్ణించి కవితా సామర్థ్యం వలన వాటికి సొంపు తేవచ్చునని వర్డ్సువర్తు చేసి చూపాడు. ముఖ్యంగా, ఆయన రాసిన * మైకేల్ (Michael) ప్రస్తావనకు వచ్చింది. ఆ కవితో అప్పారావుకు గల అనుబంధం ఈ మాత్రమే గాని, అతని తాత్విక ధోరణి సమస్తమూ ఇతన్ని తీర్చిదిద్దిందని అనుకోవలసిన అగత్యం కనిపించదు. అతనిలా ఇతను శుద్ధప్రకృతి వాదేమీకాదు. ప్రకృతి శిశువులుగా ఆదిమానవులు చేసిన స్వేచ్ఛా సంచారాలు అప్పారావు మనస్సును ఆకట్టుకోకపోలేదు. "దివ్యాంశ గల ప్రకృతిలో, చేతనా చేతన వస్తు సముదాయములో, మానవునిలో. మనోహరమైన కాల్పనికత కనిపిస్తుంది," అని కూడా రాసిపెట్టుకొన్నాడు 27 అయితే అవి చిన్ననాటి తలపులు మాత్రమే. రచనాకాలం 1882 దరిదాపుల్లో. పెద్దపెరిగాక అప్పారావు చూపు మరింత పదనెక్కింది. ప్రకృతి రామణీయకతను వర్ణించినంత మాత్రాన, ప్రకృతిని ఈశ్వరుని రాజ్యంగా ఎంచినాడని అర్థం కాదు. మాయాయవనిక, అని అద్వైతివలె దాన్ని తిరస్కరించనూ లేదు. కనీసం రవీంద్రుని వలె మర్మవాది (Mystic) అయి ఉంటే, అదికూడ సత్యమేనని దాన్ని కీర్తించి ఉండును.

ప్రకృతి తోటి మనుష్య హృదయానికి గాఢానుబంధమున్నదని వర్డ్సువర్తు భావిస్తే, మనిషిపై పారిసర్యాల ప్రభావం బలంగా ఉండవచ్చునని అంటాడు అప్పారావు. ఇది శాస్త్రవిహితమైన దృష్టి, మత పరమైనదికాదు. కవిగా, వర్డ్సువర్తుకు విశాల ప్రకృతిలో మెరుపులా ఒక అవబోధ స్ఫురిస్తుంది; దాని వెంబడి తదనుకూలమైన ఒకానొక మనస్థితి (mood) ఏర్పడి కావ్యరచనకు ప్రోద్బలం కలుగుతుంది. ఇది హఠాత్స్ఫూర్తి. అయితే కావచ్చు గాక, వర్డ్సువర్తు ఆరాధించిన

* మైకేల్ కావ్యంలో ఆ పేరు గొల్లపిల్ల వానిదని అప్పారావు పొరబడ్డాడు. అతని తండ్రి పేరది. గొల్ల పిల్లవాని పేరు లూక్ (Luke).

ప్రకృతి తన మనః ప్రవృత్తికాక బాహిర రూపమే. అందులో క్రౌర్యానికీ నైచ్యానికీ తావులేదు ; అది అందాలరాశి మంచికనాల నిగ్గు, ఆదర్శాల కొలబద్ద.

గ్రామీణ సమాజంలోని కశ్మలాన్నీ కాలుష్యాన్నీ నిర్దయగా వెలికీడ్చిన అప్పారావుకు, ప్రకృతి ఒడిలోని బిడ్డలాంటి మనిషి భావాలు అకృత్రిమంగానూ ఆచ్ఛికంగానూ ఉంటాయనే వర్డ్సువర్తు సిద్ధాంతంతోటి పొత్తేమిటి ? సామాన్యులు కావ్య నాయకులయేంత మేరకైతే ఫర్వాలేదుగాని, నాగరికత స్పర్శ సోకని ప్రాకృతికుల అస్ఖలితమైన సాధుత్వం గురించి ఆయన కెలాంటి భ్రమలూలేవు. తక్కువవారిలో కూడా (తక్కువవారిలోనేకాదు) సుగుణాలుంటాయని, ఆ స్తిపాస్తులు అంతస్తులు హోదాలు మనిషికి లేని గొప్పను కలిగించజాలవని, మనిషైనవాడు మనిషికాబట్టే ఇంకొక మనిషితో సరిసమానుడని అప్పారావు భావించాడు. వారి గురించి కూడా (వారిగురించేకాదు) కావ్యాలు రాయవచ్చునన్నాడు. పుట్టుకకూ ఘనతకూ సంబంధం లేదన్నాడు.

వర్డ్సువర్తు గొప్పదనం గురించి రాస్తూ, పరమ సరళాలూ ప్రముఖాలూ అయిన మానవ అభిమానాలనూ మన ఆ అనుభవానికి తెచ్చేట్టు కవిత్వం రాశాడని మేథ్యూ ఆర్నాల్డ్ ఒక చోట అంటాడు. వర్డ్సువర్తు తత్వాన్ని నిరాకరిస్తూ కవిత్వాన్ని ఆమోదిస్తాడు. ఈ simple primary human affections and duties[28] అప్పారావు కవిత్వంలోకూడా కనిపిస్తాయి. కాని, ఎంత మేరకు, అనేదే ప్రశ్న. కన్యకలో స్వాభిమానం, డామన్ పితియస్‌లో స్నేహబంధం, పూర్ణమ్మలో కరుణం – ఇలా అప్పారావు రచనలను పిండి ఆ సారాంశాన్ని ఈ simple primary human affections and duties కిందికి తీసికొని రావచ్చుకూడా. *

*Wordsworth endeavours to bring his language nearer to the real language of men, to the real language of men, however, not on the dead level of their ordinary intercourse, but in select moments of a vivid sensation, when the language is winnowed and ennobled by excitement.

— Appreciations : Wordsworth — Walter Pater.

కావ్యభాషా సంస్కారం తాత్త్వికోద్దేశంతోనే జరిగింది. మనుషుల యథార్థ సంభాషణను కావ్యాల కెక్కించడమేగాని, సాంప్రదాయికమైన కావ్యభాషను మార్చడం, వర్డ్సువర్తు ఉద్దేశం కాదు. ఆ యథార్థ వ్యవహార భాష ఉన్నది ఉన్నట్టుగాక, ప్రబలోద్రేకవశానవిశిష్టత చేకూరిన సందర్భాలలో ఆభాషకు కావ్యార్హత కలిగించడం వర్డ్సువర్తు ప్రయత్నమైనట్లు వాల్టర్ పేటర్ వివరణ. ప్రాథమికానుభూతులను (elementary feelings)ను ప్రాథమిక రూపాలలో

అప్పారావుది ముఖ్యంగా ఆధ్యాత్మిక దృక్పథంకాదు. అది నైతికమైనది మట్టుకే. వర్డ్స్‌వర్తులా ప్రకృతిని ఒక దేవాలయంగా ఎంచలేదాయన. సర్వాంతర్యామి అయిన ఒక చైతన్యానికి దేవత్వాన్ని ఇచ్చుకోలేదు. మతమనేది ఒకటి ఉండవలసివస్తే, అది ఆశామయమైన దృక్పథమే. సమగ్రమైన సర్వోత్కృష్టమైన ఈశ్వరభావన మానవ స్వభావానికి ఒక ఆదర్శాన్ని ప్రమాణాన్ని (Measure) చేకూర్చవచ్చుగాక, అప్పారావుది మతవిహితమైన, విశ్వాసపరమైన మన సత్వం కాదు. ఆయనది సర్వజన ఆచరణ యోగ్యమైన ఐహికజీవనతత్వమే. దేహాన్నీ దాని కోరికలనూ ఒత్తిళ్ళనూ అంగీకరిస్తాడు. ఇంద్రియాలు సేకరించే అనుభూతులే తాత్కారానికి వాస్తవాలంటాడు.

వర్డ్సువర్తు కంటె ఎక్కువగా అనేక విషయాలలో అప్పారావుకు సన్నిహితుడైన ఇంగ్లీషుకవి రాబర్ట్ బర్న్స్ (Robert Burns)· వాడుక మాటలతో రసవంతంగా కావ్యాలు రాయవచ్చునని బర్న్స్ నుంచి వర్డ్సువర్తు నేర్చాడని ఆర్నోల్డ్ రాస్తాడు :

> Wordsworth owed much to Burns, nda a style of pefect plainness, relying for effect solely on the weight and force of that which with entire fidelity it utters, Burns could show him. 29

అతి సహజంగా పరిపూర్ణమైన చిత్తశుద్ధితో కూడుకున్నట్లు, తనవారి నిత్య నికృష్ట జీవితం నుంచి వెలువడిన మాటలతో, బర్న్స్ అద్భుతమైన కావ్యాలే రచించ గలిగాడు. వర్డ్సువర్తు ఈ సులభ కావ్యభాషకు ఒకానొక తాత్వికార్థం ప్రసాదించి ఉండవచ్చుగాక, బర్న్స్ దృక్పథం పూర్తిగా భిన్నమైంది. మనిషి మనిషిగా గణుతింప దగినవాడు; మనిషికీ మనిషికీ, ఆస్తిగానీ పదవిగానీ మరేదిగానీ అంతరాల నేర్పాటు చేయగూడదు; మనిషి స్వేచ్ఛకు ఆటంకాలూ, ఆత్మగౌరవానికి పరిమితులూ సహింపరానివి; జీవితోల్లాసం పరమ ప్రేమపాత్రమైనది. ఇలాంటి జీవన తత్వం అప్పారావు మదికెక్కిందనేందుకు సందేహంలేదు. బర్న్స్‌లా అప్పారావు Immune from all the feverishness of the heart or of the head. 30

ఈ హృదయ సంరంభమూ నిర్భరత్వమూ గనక కాల్పనిక వాదానికి చిహ్నాలయేట్టుంటే, అప్పారావు కాల్పనికవాది కాడు; తత్పూర్వుడో (బర్న్స్‌లాగా)

---

ప్రకటించినప్పుడు, సాధారణభాషకు సహజ సంగీతగుణం చేకూరుతుందని పేటర్ అంటాడు. ఆ భాషను language of pure passionఅని లెగ్వీ, కెజామియాఁ తమ ఆగ్లసాహిత్య చరిత్ర గ్రంథంలో వర్ణించారు.

తద్భిన్నుడో అవుతాడు. ఆ రెండింటి మంచినీ స్వీకరించాడు. ఏ వాది అయినా కాక పోయినా, జీవితంలోనూ సాహిత్యంలోనూ అప్పారావు సామాన్య ప్రజావాది.

---

1. గు. ర. మ. డై : 4-4-1895, పు. 38.
2. గ్రామ్యాదేశ నిరసనము : వేదము వేంకటరాయశాస్త్రి, పు. 44-45
3. అదే, పు. 1-2
4. కన్యాశుల్కం రెండవకూర్పు పీఠిక : గు. ర. లే., పు. 40-41
5. గు. ర. లే.. పు. 15
6. వేదము వేంకటరాయ శాస్త్రిగారు, గు. ర. లే., పు. 185
7. వాడుకభాషలు : గ్రామ్యము : గు. ర. వ్యా., పు. 49
8. ముత్యాలసరాల లక్షణము : ,, ,, పు. 22-23
9. ముత్యాలసరం : (వ్యా) : గురజాడ : శ్రీశ్రీ : పు. 24-25
10. ఆధునికాంధ్ర కవిత్వం : డా॥ సి. నారాయణరెడ్డి, పు. 227-235
11. మహాకవి లేఖలు : గు. ర, లే., పు. 201-202
12. గు. ర. లే.., పు. 205
13. కథా సాహిత్యము (వ్యా) : వావిలాల సోమయాజులు, తె. భా. చ. సం, పు. 743-744
14. రచయిత : కావ్యసృష్టి : గు. ర. మా. మం., పు. 155
15. కన్యాశుల్కము, ప్రదర్శన, ప్రశంస : గు. ర. లే., పు. 21
16. 'భ' గారబ్బాయి : , గు. ర.మా. మం., పు. 168-169
17. గు. ర. మా. మం., పు. 155-167
18. గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము : వేదము వేంకటరాయశాస్త్రి, పు. 43-44
19. కన్యాశుల్కం, అంకితం:గు. ర. మా. మం., పు. 102
20. కావ్యాలలో శృంగారం : గు. ర. వ్యా., పు. 12
21. సాహిత్యలేఖలు : నాటకగోష్ఠి : గు. ర.లే., పు. 86
22. అదే. పు. 81
23. *Victor Hugo :* Andre Maurois, P. 135
24. *The Living Novel :* V. S. Pritchett, P. 55, P. 58
25. కొన్ని పాత్రలు : గు. ర. మా. మం., పు. 186-193
26. నవల : సన్నివేశాలు : ,, పు. 219
27. ప్రకృతి అనే పుస్తకం : ,, పు. 31-32
28. *Essays in criticism : Second series,* Matthew Arnold, P. 91
29. ,, ,, P. 93
30. *A History of English Literature :* Legouls and cazamlan

# సప్తాశ్వాలు

## "కవిత కోవిల"*

**కోకిల శబ్దంకూడా తెలియనివాడు** తగుదునమ్మా అని కలం పట్టి కవిత గిలకడమా! ఇలా నోరు నొక్కుకొనేవాళ్ళు నాడూ నేడూ ఉన్నారు. అయినా జాతి సంస్కృతిలో అప్పారావు కవిత్వం అంతర్భాగమై పోయింది. సహృదయులకు అప్పారావు కావ్యాలు "*రసగీతాలు*"గా కనిపించాయి.

దేశంలో అభిమానాలు మొలకెత్తే విధంగా 'కవిత కోవిల' పలకవలెనని సంకల్పించుకోకముందు, చాలా వెనకటి రోజుల్లో ఇంగ్లీషున *కకూ* (cuckoo) అనే గేయ మొకటి రాశాడు అప్పారావు. యఫ్. ఏ. చదివే రోజుల్లో అంతకన్నా బారైన ఇంగ్లీషు కావ్యాన్ని రచించేందుకు పూనికచేసి *సారంగధరను* విజయనగరంనుంచి కలకత్తా నగరానికే రవాణా చేయించ గలిగాడు. అప్పారావు చేసిన ఇంగ్లీషు కావ్యరచనలలో లభ్యమౌతున్నది ఇదొక్కటే. రాజకీయ వ్యంగ్య కావ్యాలు రాసిఉండినా దొరకడంలేదు — మద్రాసు కాంగ్రెసు సభ గురించి రాసిన చాలాచిన్న వ్యంగ్యరచన తప్ప. ఆయన చిత్తు పుస్తకంలో, 'రమ్' గురించి 'రైము', పెట్టి రాసిన పద్యాలు డజనుదాకా కనిపిస్తున్నాయి — అన్నీ వేడుక రచనలే.

పిట్టకొంచమైనా కూత ఘనమని నిరూపించిన రచన ఈ ఇంగ్లీషు *సారంగధర*. దీనిలో మూడు భాగాలు : మొదటిభాగం (208 పంక్తులు)లో — గోదావరీనదీ తీరాన పావురాలాట ఆడుతూ తన పావురంవెంట చిత్రాంగిమేడకువెళ్ళి ఆమె ప్రేమోన్మాదాన్ని నిరాకరిస్తాడు రాకుమారుడు. రెండవభాగం (104 పంక్తులు)లో — వేట తమకాన ఉన్న ముసలిరాజు పీడకల నుంచి మేల్కొని రాజధానికివచ్చి కోప గృహంలోఉన్న చిత్రాంగి చెప్పే చాడీలువిని సారంగధరునికి కఠినదండన విధించాక, కాలుజేతులు తెగి విలపిస్తున్న సారంగధరుణ్ణి సిద్ధుడొకడువచ్చి మంత్రజలం చిలకరించి వెంటబెట్టుకునిపోతాడు. చివరిభాగం(70 పంక్తులు)లో పశ్చాత్తాపంతోటి అడవు

---

*లవణరాజుకల గేయంలో 'కోకిల' అనే ఈ శబ్దాన్ని అప్పారావు వాడి ఉన్నాడు. 'కోవిల' అని వాడడం వాడుక రూపాన్ని గౌరవించడం కోసమే.

లకువచ్చిన చిత్రాంగి ఏకాంతంలో తనసోదర వెళ్ళబోసుకొని రాకుమారునికి సేవచేస్తున్నట్లు సూచన విడుస్తుంది. మొదటి రెండుభాగాలు కథాకథనానికి (narration) సంబంధించినవి. మూడవది మాత్రం, బృందగానం (Chorus) అని పేరున్నప్పటికీ, ప్రణయగేయ వైఖరికి చెందినది.

నవనాథచరిత్రలో చౌరంగినాథుని కథను సారంగధర కథగా గౌరనకవి మార్చినప్పటినుంచి, చేమకూరవేంకటకవి, కూచిమంచి తిమ్మన, బాణాలశంభుదాసుడు దానికి చిలవలు పలవలు పెట్టి కవి చెప్పారు. కవుల వంకరలను దిద్ది ప్రజలు ఆ కథను సొంతపరచుకొని ప్రతి తెలుగుజిల్లాలోనూ ఆ కథాస్థానాలను కల్పించుకొన్నారు. చేమకూరవాని కావ్యం తెలిసి ఉండకపోతే, దానికి నకలన్నంతగా అప్పారావు రచన సాగివుండేది కాదు. తిమ్మకవి ద్విపద రచన తెలియకుంటే, మాళవదేశాన్ని విడిచి రాజమహేంద్రవరాన కథ జరిగి వుండేదికాదు. రాజుపేరూ, అతని రాజధానిపేరూ స్మరించలేదనేగాని, గోదావరి గట్టును వర్ణించినందువల్లనూ. King of kings అన్నందువల్లనూ, అప్పారావుదృష్టి వెల్లడిఅవుతుంది. అయితే, 'జనవాడుక'నుబట్టి రూపొందిన కావ్యకథను అప్పారావు మార్చుకొన్నాడు. రాజరాజు కట్టుకోకముందు, సారంగుని రూప చిత్రం చూసిన చిత్రాంగి పరోక్షంలో తాను మాత్రం అతణ్ణి ప్రేమించింది. ఇది ఏకపక్ష వ్యవహారంకాబట్టి ఆభాస. అందుచేతనే విషాదానికి తోవతీసింది. అయినా చిత్రాంగి 'కామినీపిశాచి'గా మారిపడిపోకూడదని రచయిత నిశ్చయించుకొన్నట్లుంది. చిత్రాంగి శీలాన్ని సంస్కరించి ఉదాత్తం చేయబూనాడు కాబట్టి సారంగధరుని వెదుక్కొంటూ కొండలకూ కోనలకూ పంపి వేయవలసి వచ్చింది. ఇంతచేసీ, చిత్రాంగికి వైరాగ్యం తలకెక్కించలేదు. అది ఆదర్శీకరణ అవుతుందని భయమేమో ! వృద్ధరాజును వెంట ఉంచుకొని అరణ్యంలోనే ఉండిపోగోరిన ఈ రాచకూతురు ఉదాత్తతనూ చేకూర్చుకొంది, యథార్థతనూ అంటిపెట్టుకొంది. తాత్కాలి కోద్రేకంలో ఆశాభంగంవల్ల సారంగుని ఘోరశిక్ష పాల్జేశాక, స్తిమితంలో తన తప్పు తెలిసికొనింది. అయినా ప్రణయభంగం ప్రళయంకరమైపోయింది.

“అంగన నమ్మరాదు”, అనే సిద్ధాంతానికి చిత్రాంగిని తార్కాణజేసి, చిత్రపట వృత్తాంతాన్నీ, తొలివలపునూ కవులు సృష్టించి ఉంటే. అవి చాలక అప్పారావు ప్రణయ సిద్ధాంతాన్నికూడా సాయం పిలుచుకొన్నాడు. స్త్రీపురుషులకు వివాహబంధం కంఠపాశం కాబనిలేదు. మనసున్నచోటనే మనువు : ఔచిత్య పోషణకు,

ఏకాంతంలో చిత్రాంగి సారంగునికి "కామశాస్త్రోపాధ్యాయిని" యైనట్లు ప్రవర్తించ వలసి వచ్చింది. ఏ మానవ సామాన్య గుణాలు చిత్రాంగిలో నిండి వికటంగాకూడా వెలికివచ్చాయో, అవి సారంగధరునిలో దాదాపు ఎండిపోయాయి. శ్రీరాముడికీ హరిశ్చంద్రుడికీ సమవుజ్జీ కావటంలో, యాథార్థ్యాన్ని కోల్పోయి వట్టి దుస్సాధ్యమైన ఆదర్శంగా మిగులుపడ్డాడు. అయితే కావ్యాల చిత్రాంగి, రాజరాజు ధర్మపత్నికాదు; భోగవనిత. వివాహితుడూ ఏకపత్నీ వ్రతుడూనైన సారంధరునికి చిత్రాంగి మాతృపదాన్ని ఆక్రమించింది. మిత్రుల తోటీ, భార్యతోటీ ఎంతో సహజంగా ఉల్లాసంగా ఉండగలడుగాని, చిత్రాంగి ఎదుటబడితే మట్టుకు బిర్రబిగుసుకుపోయి యతిలా సంయమిలా "మునిముచ్చు"లా అతి వేలమైన నీతిదృష్టి ప్రదర్శిస్తాడు. కఠోరమైన సౌశీల్యాన్ని శిలా ప్రాయంగా ప్రదర్శిస్తాడు. ఇది 'అచ్చాడీ'తనమైతే కావచ్చుగాని. వట్టి ఆదర్శానికి నాటకీయత దిగదుడుపే. అప్పారావు చేతిలోగూడా సారంగధరుడొక మానదండంగానే, అందమైన ఆదర్శంగానే రూపొందాడు.

'బ్లాంక్ వెర్స్' పద్ధతిలో రాసిన యీ కావ్యం ఛందోవ్యవస్థకు దౌర్బల్యాన్ని కలిగించిందని, ఆ రోజుల్లోనే శంభుచంద్రముఖర్జీ అని ఉన్నాడు. దొరబాబు తల దన్నే విధంగా ఆంగ్ల విద్యావంతులైన భారతీయులు బ్లాంక్ వెర్స్‌కు పెడమొగం చూపి, అలెగ్జాండర్ పోప్ వాడుకచేసిపోయిన కమ్మటి ఛందస్సు లంటే చెవికోసుకుంటూన్న రోజులవి. గోల్డుస్మిత్ (Goldsmith)కు ఈవలి ఆంగ్లకవులకింకా మనస్సు మొగ్గని తెలుగు రచయితలు అనువాదాలతో తృప్తిపడుతూన్న రోజులు. అలాంటి కాలాన ఈ పిల్లకవి సీమవాడి పెరటిగోడ దాటి తోటలో దూకి వాడి మాటల మామిడిచెట్టెక్కి పళ్ళను రాల్చి నోటబెట్టాడు.

మాటలే పరాయివిగాని, తలపులు తనవారివే. "రాజిపు డూరలేడు చెలిప్రాయపు బిత్తరి...."పద్యం, ఇంగ్లీషులో ముక్తసరిగా The king's abroad to hunt and thou art fair)అయినిలిచింది. చేమకూరవాని చిత్రాంగి ఔచిత్యంపాటించి సఖీజనం చేత సారంగుని కాళ్ళను పన్నీటితో కడిగిస్తే, గురజాడవాని చిత్రాంగి ఒక ఆకు ఎక్కువే చదివి తానే అతని కాళ్ళు కడిగి తన చీరతో ఆ తడి ఒత్తింది. అయితే, సారంగునిలో వృద్ధాప్యాన్ని విడనాడిన రాజరాజు చిత్రాంగి కంటికి కనిపిస్తున్నాడట. ...(and in thy beauteous form / I see the king to lusty youth transformed) అలా అంటే తన పతిభక్తి వెల్లడౌతుంది; అంతకంటె ఎక్కువగా తన మనోనురక్తి సారంగధరునికి తెలిసి వస్తుంది. ఈ చిత్రాంగి చేమకూరవాని దానిలా నరరూప రాక్షసి కాదు. అది రాజరాజు భోగవనిత మాత్రమే.

సారంగుని తన కామాగ్నికి వర్షంగానే తప్ప మరోవిధంగా సంభావించలేదు. దానికి అనుభోగ్యం కానిదేదీలేదు. వరసా వావీ తనకు పనికిమాలిన మాటలు. గురజాడ వాని చిత్రాంగిలో, తానొకనాడు సారంగధరుని మనసారా వలచాననే స్పృహ ఉండి, ఒకప్పుడు పరమ కర్కశత్వంగా మారినావెంటనే తొల్లిటి మార్దవాన్ని పొందుతుంది. అతన్ని నిజంగానే ప్రేమించబట్టి చిత్రాంగి ప్రేమ ఉదాత్తం కాజూచింది. "కులసతులే యూరు – వలపులే యూరు" అంటూ రాణుల సంసారాల్లో నిప్పులు పోసిన రంగాజమ్మ లాంటి భోగపత్నుల యుగంలో, ఆ తంజావూరిలోనే, చేమకూర వాని చిత్రాంగి పుట్టింది; "భోగకుటిల శిరోజాతిలకము" అయింది; రత్నాంగిలా "కులసతి" కాదు. ఈ కొత్త చిత్రాంగి సారంగధరుని భార్య కాజాలక వంచితురాలైంది. తనది పరస్త్రీశృంగారమని సారంగుడు అనుకోకూడదని ఆమెకోరిక;

వివాహబంధ మొక్కటే విశృంఖ లాసుభోగపరత్వానికి ఆటంకం కావడం, చిత్రాంగికి సమ్మతం కాదు. ప్రణయ బాహిరమైన పెళ్ళి, వట్టి తంతే ! (Where love is strong there hearts may wed) అంటుంది. వివాహ వ్యవహారంలో హృదయానికే సర్వాధికారమనే మాట, సంప్రదాయాన్ని మన్నిస్తుందా ? కృష్ణుడేమి చేశాడు ? ముని ముచ్చులెందరు సుందరీ మణుల బందాలు కాలేదు ? ఇది చిత్రాంగి ఎదురు సవాలు ఇక్కడ మళ్ళీ చేమకూర వానితో బాటు దక్షిణాంధ్ర దక్షిణ నాయక యుగపు కవులంతా కట్టగట్టుకొని "తాటాకుల పాటు" జూచి వికటంగా పరిహసిస్తున్నారు. అయితే సారంగధరుడు పెద్ద చదవరి. రాధా మాధవ శృంగారంగానీ, గోపికా శృంగారంగానీ దేహపరమైనది కాదు, పొమ్మంటాడు. గొప్పవారి పనుల్లో తప్పులెన్నేంత గొప్పవాణ్ణి కాను, పొమ్మంటాడు. ఇది సమాధానంకాదు. అందమైన కుర్రకారంతా ఇలా గోచీ బిగగట్టుకొంటే సంసారచక్రమెలా తిరగాలి ? శృంగారం సుప్రజాతంత్ర నిర్వాహక సూత్రమైనప్పుడు, దాన్ని తిరస్కరించే వాడు లోకవిరోధికాడా ? ఇక స్త్రీ జాతిని దేవుడెందుకు సృష్టించినట్లు ? మనుషుల మనస్సుల్లో శృంగార భావాన్ని ఎందుకు ముట్టించినట్లు ?

చిత్రాంగి సవాళ్ళకు దేవుడొక్కడే సమాధానం చెప్పాలి. అయినా ఆ సవాళ్ళుచేసే అధికారం, చిత్రాంగికి రాజరాజుతో పెళ్ళి జరిగిన మరుక్షణమే పోయింది. శృంగారం పేరుచెప్పుకొని పశుత్వం కాయలమ్ముకొనే వ్యవహారానికి దిగి, యవ్వన మదంతో, సంఘభద్రతకు మూలకందమైన వైవాహిక వ్యవస్థను తూట్లుబొడిచే పని తనది. కాబట్టి తాను వాక్చాతుర్యానికే మెప్పుపొందగలదుగాని మంచితనానికి కాదు. అయినా ప్రణయభంగం పొందిన స్త్రీగానే ఈ ప్రశ్నలు

వేసింది. కాబట్టి ఆమె కోరికలో సబబుమాట ఎలావున్నా, సవాళ్ళలో పటుత్వం లేకపోలేదు. ప్రేమయుగానికి ఈ సవాళ్ళే మేళతాళాలు. *

-మిల్టన్ ప్రభృతిమహాకవులువాడి ప్రశస్తిచేకూర్చిన దీర్ఘోపమ (Epic simile) ఒకటి రెండుసార్లు యథాశక్త్య వాడజూచి, టెనిసన్ కవి కావ్యాలలోని ప్రణయ గీతాల (Love lyrics) పద్ధతిని అనుకరించి రాసిన ఈ ఇంగ్లీషు కావ్యం అప్పారావుకు ఏవిధంగా జూచినా ప్రతిష్ఠాకరమే. అన్వయ కాఠిన్యం, ప్రాచీన క్రియారూపప్రయోగం వంటివి చిల్లర మల్లర లోపాలు. గురి దొరది. ఐస్మృతః ఇంగ్లీషు భాషలోవ్యుత్పత్తి పెరిగినవానిలా రాయబోయాడు. నాటు వాసనలు (Indianisms) సోకనీయ లేదు. చక్కదనాల పేర్పులవంటి ప్రకృతి దృశ్యాలను వర్ణిస్తున్న భాగాలు ఎన్న దగినవి. సూత్రప్రాయంగా కొన్ని సత్యాలనుగానీ అభిప్రాయాలనుగానీ ప్రకటించే వైఖరి ఆనాడే అప్పారావు కుందేదని ఈ చరణాలు తెలుపుతాయి.

In nature all is playfull, all is mirth,
And beauteous things to beauteous things are [linked.

---

* ఈ కావ్యంలో రాజరాజు మెరుపులా మెరసి ఉరుములా ఉరిమి పిడుగై ఉత్పాతం కలిగించి కథనొక కొలిక్కితెచ్చి కనుమరుగై పోతున్నాడు. ఇలా రాజారాజును కొట్టివెయ్యడం సబబు కాదనుకున్నాడో ఏమో, తాను ముసలివాడౌతున్నప్పుడు అప్పారావు ఆ ముసలిరాజు మీదికి మనస్సు మళ్ళించి, ఇంగ్లీషున రాద్దామని ప్రారంభించిన చిత్రాంగి నాటకాన్ని పూర్తిచేయకుండానే పోయాడు.

నెల్లూరి రాజకుమార్తె అయిన చిత్రాంగిని సారంగధరునికిచ్చి పెళ్ళిచేద్దామనుకొని, చిత్రపటాలూ గట్రా పంపకుండా తన వయస్యునితో వేటగా బయల్దేరి వెళ్ళిన రాజరాజు ప్రచ్ఛన్న వేషంలో చిత్రాంగినిచూచి తనకే భార్యగా నిశ్చయించుకొంటాడు. అప్పటికే చిత్రాంగి సారంగునికి తనమనస్సు ఇచ్చుకొనిఉంది. అయినా రాజరాజైన తనకు నెల్లూరి రాజొకలెక్కా ? మాటమాత్రానికే భయపడి కన్యాదానానికి - త్యాగానికి - ఒప్పేసుకొన్నాడు. శ్రమపడి, పైగా మోజుపడి పెళ్ళాడాడుకాబట్టి ముసలివాడికి కుర్రపెళ్ళాం విలువ బాగా తెలిసింది. పిల్లతనంచూపిన ఈ ముసలివాడు నిజంగా వృద్ధబాలుడే అని. చిత్రాంగి పరిచారిక మీనాక్షి గుర్తించింది. "ముద్దు చెల్లిస్తే, ముసలి మగడే చెల్లించాలి." దశరథుడికి కైక, రాజరాజుకు చిత్రాంగి. అయినా చిత్రాంగికి రాజరాజు పంచదారకూరిన విషం. పంచదార కూరినా విషం పాయసంకాదు- సారంగుని పసుచదనాన్నేగాక గుణసంపదను తాను మెచ్చింది. మనస్సు తనది అతనిదే. బొంది ? ఈ ముసలిపీనుగది కావచ్చు.

ఇంతకూ అప్పారావు చెప్పదలచుకొంది, రాజరాజు అకాల చాపల్యమే అతనివృద్ధాప్యానికి శాపమై పితృత్వానికి మచ్చదెచ్చింది. (గు. ర. మా. యం : చిత్రాంగి, పు.226-250)

# 2

అడపాదడపా చిల్లరమల్లర పద్యాలు రాస్తూవచ్చాడేగాని తన ప్రతిభకు తగిన ప్రవృత్తి లేకపోయింది. కొత్త శతాబ్దంవచ్చి కాలు నిలదొక్కుకున్న కొంత కాలానికిగాని, సంస్థాన వ్యవహారాలపై నిలిచిఉన్న తన చూపును ఇటు మళ్లించలేదు. ఈలోపల నిరంతర పఠనం వల్లనూ, చింతన వల్లనూ తన దృక్పథమే మారిపోయింది. ఇంగ్లీషున కావ్యాలురాసే భారతీయుల వలని ప్రయోజనాన్ని తాను అర్థంచేసుకోగలడు గాని తానిక ఇంగ్లీషునకావ్యం రాయబోడు. తన జనం చదివి ఆనందించి మనసుమార్చుకోగలందులకై తాను తెలుగున "తేటమాటల" తరితీపి కవిత్వం చెప్పాలి. జానపదుల గేయాల వాసనలను పట్టించాలి. ఈ కొత్తనడకల పాటలకు వాటిపాటలనుంచే రావాలి వెలికి, శతాబ్దాల పర్యంతం తెలుగుజాతి చెవిలో రింగులు వారుతూ సుపరిచితమైన సంగీతభణితులు. నాగరికతలోనినాణ్యాలను జాతిజీవితంలోని మంచితో అంటుకట్టాలి. దురాచారాలను హేళన చేస్తూనో దూషిస్తూనో కూచోక, వాటి పాలబడి బతుకులు బుగ్గిచేసుకొన్న అమాయకులను గురించి కన్నీట తడిసిన చూపుతోటి, కంపమానమైన కంఠస్వరముతోటి, గుండెలను కోసివేసే ధార్మికావేశంతోటి హితవుగరిపే హృదయమార్దవంతోటి, కవిత్వంచెప్పాలి. కవిని మళ్ళీ జబ్బ పట్టుకొని వచ్చి నిలపాలి తనవారైన ఈ ప్రజలకూ నడుమ కవికీ ప్రజలకూ మధ్య పాండిత్య దుర్విగ్ధత మూలంగా ఏర్పడివున్న గండిని పూడ్చివేయాలి. సాహిత్యం జాతిపరంకావాలి. సంస్కృతి సమిష్టిసంపత్తి!

ఆకులందున అణగి మణగి
కవిత కోవిల పలక వలెనోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్త వలెనోయి!

నవ్యమేగాక భవ్యంకూడా అయిన ఈ కవిత్వావేశంతోటి అప్పారావు పుంఖానుపుంఖంగా కావ్యాలు రాసినకాలం, ఆయన చరమదశ కావడం విచారకరం.

ప్రయోగశాలనుంచి బయటబడి విజయముద్రతో ఇవి బహుళ ప్రచారం పొందక మునుపే, ఆయన దాటుకొన్నాడు. పనిగట్టుకొని వ్యాకరణ సూత్రాలను తెంపుతూ వ్యావహారిక రూపాలను నింపుతూ, కావ్యభాషా విషయంలో ఆయనచేసిన సాహసం నేటి విప్లవవాదులకుగూడా మింగుడు పడని పెద్ద ముద్ద అయింది. గిడుగు రామ మూర్తి మెచ్చి ఒప్పిన సాహసిక పదప్రయోగాలను శ్రీ శ్రీ వంటివాళ్ళు కూడా ఆమోదించజాలకున్నారు. ఏకవచన బహువచన నియమాలను కూడా పాటించని ఒకటి రెండు చోట్ల ("పొరుగు వారోదార్చె, పోనీ") కొంపెల్ల జనార్దనరావువంటి సహృదయులుకూడా ఉలికిపడక తప్పిందికాదు. మరి, యడ్ల రామదాసుకూ, * గురజాడ అప్పారావుకూ అభేదాన్ని చూసేవాళ్ళ ఊసెందుకు ?

....ప్రయోగ సాహసమున్న ప్రతిభావంతుడు. తీవ్ర సమీక్షకు లభ్యములయ్యే సత్యాలను అనుభవముతో పిండి పలికినా ఆయన కవితా రచనలో ఛందచ్ఛాయ కనిపించదు. కాని కొన్ని పంక్తులు మాత్రం అర్థ గౌరవములోనేకాక శిల్పదృష్టిలో కూడా ప్రౌఢములై సచేతనములుగా ఉంటాయి. అంతమాత్రానికే అతనిని మహాకవి కోటిలో చేర్చడం సముచితంకాదు. అతడు మహాకవి కాకపోయినా ఖండకావ్య రచనకు ప్రేరకుడు, మార్గదర్శి. 1

సరసంగా ఉన్నట్లనిపించే ఈ అంచనా, గుడ్డిలో మెల్ల. లయమే ఛందస్సునకంతటికీ ప్రాణ పదార్థ మనుకొన్నప్పుడు, ఆ లయ అప్పారావు కవిత్వంలో ఆద్యంతమూ జీవధారగా ప్రవహిస్తుందంటే ఎవరూ కాదనరు. స్వకపోల కల్పితమైనా,

---

1. * యడ్ల రామదాసు పుట్టింది విజయగర సంస్థాన సమీపగ్రామంలోనని తెలిసిఉంటే ఈ విమర్శకులు రామదాసుకూ, అప్పారావుకూ మరొక పోలికకూడా తెచ్చివుండేవారు. అయినా రామదాసు బొత్తిగా కొట్టివేయవలసిన వాడేమీకాదు. "ఎన్నిమాయలు నేర్చినాడమ్మా" అనే పాట ఒకటిచాలు, "వచో రచన కవిత్వమను నొక ధోరణిగలిగి" ఆయన రాసిన కీర్తనలు పాడ దగ్గవీ, వినదగ్గవీ అని చెప్పడానికి. "తత్వములను గద్యపద్యాదులతో రచించి"న యడ్లరామదాసు వేరొక సంప్రదాయానికి చెందినవాడు. పండితుల మతానికి జతగా దేశంలో అనాదినుంచీ సామాన్య జనులతత్వం ఒకటివుంది. దానికి చెందినవాడే ఈ రామదాసు. పైగా, ఆ విమర్శకుల లాంటివారిని ముందుగానే ఊహించుకొని వినయంతోటి, "నేను విద్యావిహీనుడను, కవిత్వ మన నెట్టిదో యెరుంగని వాడ" నగుటచే "బుద్ధి చాంచల్యమును మరలించుకొనలేక" ఆ తన గ్రంథాన్ని (సుజ్ఞాన చంద్రిక) రాశానని చెప్పుకొన్నాడు.

అప్పారావుకూడా అలా భయభక్తులు చూపెడుతూ రాయలేదని ఈ విద్వద్వరేణ్యులకు కన్నెర్రా ఏమిటి చెప్మా ?

మాత్రాబద్ధమైన ముత్యాల సరాల ఛందస్సు తత్పూర్వ సాంప్రదాయిక ఛ్ఛంద స్సులతోటి ఈ ప్రాణ మూలంలో స్పర్ధించదు. మహాకవి ప్రశంస దేవుఁడెరుగు, 'అకవి' బిరుదు అల్పమానవుడిచ్చిన కితాబు ! శుష్క విషయోద్ఘాటనకూ జీవిత సత్య నిరూపణ పరమైన సూత్రప్రవణత్వానికీ అంతర మెంచని 'ప్రతిపద రసోదయ' సిద్ధాంతులు అప్పారావును గూడా మన్నించరు; కవిగాకూడా ఆయనను గుర్తించరు.2*
ఇలా అతి ప్రశంస, అతి అభిశంసన – ఈ రెండు తిరగలి బండల మధ్యపడి కవిగా అప్పారావు వ్యక్తిత్వంనలిగి నుగ్గౌతున్నది. కాబట్టి ఆయన ఖండికలలో ఒక్కొక్క దానినీ పైకెత్తిపట్టి సూక్ష్మ పరీక్షకు నిలపాలి.

కాలక్రమణిక విభాగంలో ఇచ్చివున్న క్రమాన్నిబట్టి ఓంప్రథమంగా తీసుకోవలసిన రచన తోకచుక్క. ముత్యాలసరము అనే పేరున అచ్చుబడుతూ మొదటి శీర్షికను మాటుపరుచుకొన్న ఈ కావ్యం, "అప్పారాయోపజ్ఞకమైన రసగీతాలకు" శ్రీకారంచుట్టింది.

ఇది పూర్తిగా స్వకపోల కల్పితమైన రచన. వాస్తవజీవితంలో ఒక చిన్న ఘటననుంచి భావనాత్మకంగా కవి ఈ గేయవస్తువును రాబట్టుకొన్నాడు. ఆఘటనలో

---

2, * కవులుగా చలామణిగా బ్రయత్నించెడి కీర్తికాములను "అకవు"లని వర్ణిస్తూ "గురుజాడఅప్పారావు రచనా శైథిల్యమునకు, అస్ఫుటమైన భావవ్యక్తీకరణమునకు పథి ప్రవర్త కుడు." అని పొట్లపల్లి సీతారామారావుగారు తేల్చివేశారు. "ఆయనలో కనుపించునది రచయితకు రచనా ప్రథమావస్థలో, భావములు శబ్దములకందని స్థితిలో, ఏర్పడెడి రచనా శైథిల్యము. అది మెత్తదనము కాదు." అకవుల ప్రతిష్ఠకు అప్పటి కాలమాన పరిస్థితులే హేతువులు అన్నారు.

"కథావస్తువునకు తీసిపోని కవితాశక్తియున్నవారే అసలుకవులు." అంటూ, ఛందస్సు తీసివేసినప్పటికీ "వస్తువును భావనా మయము చేసుకొనెడిశక్తి" ఉంటే చాలునని చెప్పారు. "కవియైన వానికి వస్తువుముందు భావనామయమైగాని రచనగా పరిణమించదు. అకవియైన వానిలో వస్తువు భావనా స్పర్శలేకుండనే యున్నది యున్నపాళముగా రచన యగుటకు ప్రయ త్నించును. గురజాడ అప్పారావుగారి రచన ఈ శ్రేణిలోనిది."

జాతీయ సంప్రదాయములు, స్వతంత్రభావములు అప్పారావులో లేవట. ఆధునిక కవి త్వమునకు పునాదులు ఆయనలో కనుపించవట. "ఆంగ్లప్రభుత్వమువలన ఆంగ్లభాషవలన దేశ ములో నేర్పడిన కృతక సమాజము యొక్క అభిప్రాయములను కప్పుకొని కవి యనుపించుకొను టకు ప్రయత్నించిన యొక వ్యక్తి ; అంతే".

"ఎల్ల రామదాసు మహాకవి యనిపించుకొనినపుడు గురజాడ అప్పారావుగారు కవి గావచు నేమో." —జయంతి : జనవరి 1959

(బరంపురంలో జరిగిన సహపంక్తి భోజనం) తాను స్వయంగా పాల్గొన్నాడు గనక ఇది స్వీయచరిత్రాత్మకం కావలసిన పనిలేదు, అలా కాలేదుకూడా. పట్నంపోయి పదినాళ్ళపాటు "సంఘసంస్కరణ ప్రవీణుల సంగతుల మెలగి," ఒకనాటి వేకువ సమయంలో ఇల్లు చేరినవాడు, ఇల్లాలిని నిద్రలేపి తాను కనీవినీ వచ్చిన విషయాలను వినిపించేసరికి, భార్య సంతోషించవలసిందిపోయి, కన్నీల నీరునించి ఇరుగు పొరుగులు తన నెలా ఆడి పోసుకుంటున్నదీ ఏకరూపెట్టి భర్తగార్ని దెప్పుతుంది. భర్త విస్మితుడౌతాడు. భార్య, తల్లి, ఇరుగు పొరుగు ఆడంగులు, అసలు ఈ ఊరివాళు (అది పల్లెటూరు అయి ఉంటుంది; కాకుంటే, తాను వెళ్ళివచ్చినది పట్నమని చెప్ప వలసిన పనిలేదు.) ఇలాంటి వేలాది ఊళ్ళవాళ్ళు – గ్రామీణులు – ఇంకా ఇలా గున్నారేమిటి చెప్మా అనిపిస్తుంది.

తోకమందలి మంచిచెడ్డలు
తోకు లెరుగుదురా ?

అనుకొంటాడు.

భార్యకు ఒక తోడికోడలుండడం, మామలు ఒకరి కిద్దరుండడం వగైరా అంశాలను బట్టి ఇది స్వీయచరిత్రాత్మకం కాదని నిర్ధారణ చేయవలసి వస్తున్నా, అప్పారావు స్వీయానుభవమే దీనికి మూలమనాలి. ఆ అనుభవం ఉన్నది ఉన్నట్లు గానే కాగితాని కెక్కలేదు. కొన్ని పాత్రలను కల్పించి, అవి మసలే వాతావరణం ఏర్పాటుజేసి, వాటి పరిమితులను నిరూపిస్తూ, తన అనుభవాన్ని కావ్యానుభూతిగా మార్చుకొన్నాకనే అప్పారావు ఈ గేయాన్ని రచించాడు; ఇదినిజంగా కవిత్వమౌతుందా, కాదా అని తేల్చుకోవాలంటే, *తోకచుక్క* అచ్చుపడిన *ఆంధ్రభారతి* పత్రికలోనే ముందు సంచికలో *హాలి తోకచుక్క* శీర్షికతో చిల్లరిగె శ్రీనివాసరావు పంతులు రాసిన పద్యాలనుతెచ్చి దానిపక్కనుంచి సరిపోల్చే ఓపిక ఉంటే, తెలుస్తుంది. అప్పారావు కల్పించుకొన్న ఊహాసంభాషణ గాని, గ్రామీణ సాంఘిక వాతావరణమూ, తత్సంబంధి భావజాలమూ లేకుండా, తన అనుభవాన్ని ఉన్న పాళంగా కాగితంమీదికి దించడం ఎవరు చేసిందీ తెలుస్తుంది. ఇక "సంప్రదాయాన్ని" వెక్కిరించడమంటే, మూఢాచారాలను అసంబద్ధ విశ్వాసాలను మర్యాదగా విడిచివేయడం కాదని అప్పారావుతోబాటుగా శ్రీనివాసరావు పంతులు, మంగిపూడి వేంకట శర్మ ప్రభృతులు భావించినట్లు తెలుస్తుంది. కాకుంటే, వారి

తలదన్నే విధంగా ఆంగ్ల విద్యా ప్రభావాన్ని మెచ్చుకొని, తోకచుక్కకు శాస్త్రీయ వివరణ నిచ్చినందుచేత, మత విశ్వాస యుగావశేషాలవంటి ఈ విమర్శకులకు అప్పారావంటేనే గంగ వెర్రులెత్తు తున్నాయి. సరిగా ఇలాంటి "గ్రామీణ" భావ జాలాన్నే ఆయన ఆ కావ్యంలో ఈసడించింది. కవుల కల్పనా బలాన వస్తువు లకు లేని రూపులు చేకూరుతూన్నప్పుడు, అందులోనూ

.... వెఱ్ఱి పురాణగాథలు
నమ్మ జెల్లునె పండితుల్ ?

నమ్మే 'పండితు' లికముందూ ఉంటారని ఆయనకు తెలియదు. భావనాబలమే కవితే, అకవితే వేరుచేసి నిలిపేట్లయితే, ఈ ఒక్క కావ్యం ద్వారా అప్పారావు అసామాన్యమైన కవిగా నిలువగలదు. ప్రతీకరణ నటుంచి, పాత్ర నోటి మాటల నటుంచి, కవి కల్పించిన సాంఘిక వాతావరణాన్ని కూడా అటుంచి చూచినా, గేయ ప్రారంభంలో ఆయన చేసిన ప్రకృతి వర్ణన ఒక్కటీ హృదయంగమం కాగలదు. అంతేకాదు. రాత్రి అంతరించడమూ, పగలు సమీపించడమూ సూర్యుని కభిముఖుడై కవి రాత్రిని వేగించడమూ - ఇవన్నీ కావ్యంలో సేకరించుకొన్న సాంకేతిక ప్రాముఖ్యాన్ని అటుంచి, లోక జీవిత క్రమంలో సేకరించుకొన్న ప్రాముఖ్యం, గొప్ప కవికిగానీ పట్టుబడని సార్థక వచోవిద్య. "క్రొత్త పాతల మేలు కలయిక" చిమ్మే "క్రొమ్మెరుంగులు" ఈ కావ్యమంతటా ప్రసరిస్తున్నాయి. అర్థానికి తగిన శబ్దం కవికి అందకపోవడం కాదు, మార్దవమూకాదు. సంప్రదాయ సిద్ధమూ పాండిత్య మాత్ర సాధ్యమూనైన గ్రాంథిక శబ్దం తానుద్దేశించిన విపు లార్థాన్ని పాఠకుని కందింప జాలదనుకొని, వెదికి వెదికీ సుపరిచితమైన శబ్దాన్ని తెచ్చి ఇందులో వాడుక చేయబూనాడు కవి. "తేటైన మాటలు" అని తానే నోరు విడిచి వర్ణించుకొన్న దిందుకే. లేకుంటే "మించిపోయెను", "కొసరెనోయన", "దబ్బుడి", "పుట్టకీట్లు" వంటి పదాలను వాడేఉండడు. తన కావ్యభాషగురించి ఆంధ్రపత్రికలో ఒకశతావధాని ఆక్షేపించినప్పుడు, తాను "కలమునకు వచ్చినట్లు" రాయలేదని చెబుతూ, ఈ కావ్యానికి సంబంధించికూడా వాస్తవం కాకతప్పని ఒక వాక్యం రాశాడు అప్పారావు :

చిత్రము వ్రాయునప్పుడూ, జిలుగుచెక్కునప్పుడూ శిల్పి యెట్టి పరిశ్రమను చేయునో అట్టిపరిశ్రమము చేసినగాని కావ్యగుణము లబ్బనేరవని మా మతము.2

రేఫతో కూడుకొన్న గ్రాంథికశబ్దాలు పెటుకని తోచినందువల్లనూ వాడుకలో రేఫ రాలిపోయిన పదాలున్నందువల్లనూ, ఉకార ఓకార శబ్దాలు వు వోలతో వాడుకైనందుచేతనూ, డెబ్బది, డెబ్బైకంటే 'డబ్బది' తన చెవికింపుగా వినిపించినందు చేతనూ, వ్యాకరణ సూత్రాలు తెగి తుత్తునియలైనాసరే, నవీన కావ్య భాషకు శిష్ట జన వ్యవహారాన్ని ఒరిపిడి రాయిగా చేయ బూనుకొన్నాడు. ఇవన్నీ అపశబ్దాలని అనుకొంటే, మొదటికే మోసం తెచ్చి వ్యాకరణ నిరంకుశత్వాన్ని ఎదిరించ బూనిన ఈ 'అప్పళాచార్యుల' ముందు 'అపశబ్ద భయం నాస్తి' !

తోకచుక్కనూ వేగుచుక్కనూ మానవీకరించి "వెడలి మెరసిరి" వంటి సాహసాలొకటి రెండు చేసినా, ఈ కావ్యంలో ప్రాచీన కవి సమయాలను నిరాకరించలేదు. సఖి నెమ్మోము చంద్ర సఖమే. చంద్రునికీ కేతువుకూ తగవే. అచ్చరల చేతి లీలా పుష్పం స్పృహణీయమే. * శ్రీనాథకవి తోకచుక్కలకూ స్త్రీ చూపులకూ సామ్యం చెప్పడమే అనుకొంటే, సాధువైన పోతన్న కూడా పూబోడి చీర చెరగును "కందర్పకేతువు" తోనూ "ఘన ధూమకేతువు" తోనూ ఉపమించడం, అప్పారావు ముందుండనే ఉన్నదాయె ; ఆ తోకచుక్క సాదృశ్యాల వల్లతోచని కీడు దీనివల్ల తోస్తుందని ఎందుకనుకోవాలి ? తోకచుక్క శాస్త్ర రీత్యాకూడా విస్మయమాదకరమైనదే కాబట్టి, దాన్ని చూడనొల్లని భార్యకు ధైర్యం చెప్పబూని అచ్చరలవంటి అందకత్తెలుకూడా లీలాపుష్పం ధరించేంత సుకుమారసుందరమైన వస్తువే. అని భర్త అనవలసి వస్తుంది.

ఇంతకూ ఈ గేయ ప్రాముఖ్యం ఉనోదయాన్ని సూచించే సంకేతాలలో లేదు - జ్ఞానోదయాన్ని సూచించే సంభాషణా భాగంలో ఉంది. భర్త ఉత్సాహి. పైగా 'కొత్తబిచ్చగాడు.' భార్యలెప్పుడూ ముందుబడి మార్పుల నొల్లరు. మత విశ్వాసం మగవారికంటె స్త్రీలనే ఎక్కువగా ఆశ్రయిస్తూ వచ్చిన కాలమది. పైగా, పట్నాన పొందిన అనుభవాలు మనస్సు నిండుగా ఉంది, ఎప్పుడెప్పుడు బయట పడుదామా అని త్వరపడుతున్నాయిలాగుంది. భర్త కొత్తమతం పుచ్చుకొంటే, మొదట మార్చజూచేది తన భార్యనే కదా! మరెవరు తనకు లోకువ గనక ? అందు చేతనే ఈ భర్త - అప్పారావు కాదు సుమా, ఆయన నిర్మించిన ఒక భావోద్రేకి పాత్ర మాత్రమే - భేషైన ఒక ఉపన్యాసం చెస్తాడు. వేళాపాళాలేదా అంటే, అది

---

* "వేల్పుటిలనల కేలి వెలితోగ" అనడంలో చుక్క కలువగానూ, దాని తోక పుష్ప కాండంగానూ ఉపమితాలయ్యాయి. పైగా రాత్రి కాబట్టి పద్మంగాక కలువ అవసరమైంది.

తూర్పు "బలబల" తెల్లనారే సమయమాయె; తాను రాత్రంతా జాగారం చేసి ప్రయాణపు వేడిలో ఉంటే; ఇటు చూడమంటే భార్య అటుచూస్తూ ఉండె; పైగా తీరా తెల్లారాక అత్తగారి అజమాయిషీలో తోడికోడలి పిల్లిచెవులదాపున ఇరుగు పొరుగు చూరుల మధ్య భార్య ఉండక తప్పదాయె; ఇక ఇదే సుముహూర్తమయిం దాభర్తగారికి, భార్యాగారికి ధర్మోపదేశం చెయ్యడానికి!

అయితే ఈ భర్తలో అప్పారావు అంశ అంతర్లీనంగా ఉంది. ప్రతి కల్పిత పాత్రలోను తత్కర్త ఉండ నక్కర్లేదుగాని, ఈ పాత్ర అప్పారావు గుండెలు దూసుకు వచ్చిన పాత్ర; దానిమాటలు అప్పారావు నోట్లోంచి ఊడిపడ్డ మాటలు. మంత్రాలకెంత విలువకద్దో వాటికంత కద్దు. * అంటే వారికి Magical quality ఉంది. ముందుముందు మానవాళి కొనగూరనున్న శుభాలనూ సుఖాలనూ ఇప్పటి కిప్పుడే ఒనగూరబోతున్నట్లు అనుకొని చెప్పిన ఈ మాటలు, వట్టి సూత్రీకరణలే అయేట్టుంటే కవిత్వంకాబోవు. సూత్రీకరణలుకావవి. వాటినిర్మితిలో మనస్సుకంటె హృదయం చేసిన పనే ఎక్కువ. అవి కావ్యాంతర్భాగం కాకుండా తనీగా ఉంటే, సూత్రీకరణలకిందనో ఉద్ఘాటనల కిందనో జమపడిపోను. అలా లేవవి.

చూడు మును షును మేటివారల
మాట లనియెడి మంత్ర మహిమను
జాతి బంధము లన్న గొలుసులు
జారి, సంపద లుబ్బెడున్.
యెల్ల లోకము వొక్కయిల్లై,
వర్ణ భేదములెల్ల కల్లై, * *
వేల నెరుగని ప్రేమ బంధము

---

* "మాటలనెయెడి మంత్ర"ములని కవేచెప్పాడు కూడా. మంత్రాలకూ కవిత్వానికీ ఏం సంబంధం పొమ్మంటారు, 'రస' వాదులు! మంత్రాలు కాబట్టే కవిత్వం కాదంటారు.

** భర్త ఆదర్శవాదికాగా భార్య లోకవాస్తవాన్ని విస్మరించని బుద్ధిమంతురాలు. అందు వల్లనే భర్తతో చమత్కారం కలిసిన ఎత్తిపొడుపు ధోరణిలో ఇలాగంటుంది. నానా వర్ణాలవాళ్లూ

వేడుకలు కురియు,
మతము లన్నియు మాసిపోవును,
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును ;
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్.

ఇది భవిష్యద్దర్శనం. *పల్నాటి వీరచరిత్ర*లో బ్రహ్మన్న (శ్రీనాథుడెందుకు కాడు ?) "ఎంగిలి చండాల మేమియులేక" పుట్టిన "మాధవ కులము" లోనివారు

కులము లెన్నిటికైన గుఱుతైనవారు
తెసర పూసలతోని దారంబువలెను
మలగి భేదములేక మలయు చుండుదురు

అని తత్కాలీన వాస్తవాన్ని ఉన్నదున్నట్లు చెప్పినప్పుడుగానీ ; కవులకు అన్ని కాలాలలోను సమానమైన ధర్మాన్నే నిర్వహించారు. వెనక ఎన్నడనగానో ఆదిమ 'స్వర్ణ' యుగాన మానవజాతి అనుభవించిన సుఖాలూ సంతుష్టి ఒద్దికా తోడ్పాటూ తదనంతర కాలాన అంతరించి, వర్ణాలూ వర్గాలూ జాతులూ రూపొంది ఏక కుటుంబమల్లా తుంటలు తునకలై పోగా, ఆదిమ సమాజాన సమిష్టి హృదయాన్ని గానంచేస్తూ సంఘవాణి అయిన కవి దఫదఫాలుగా ఆ 'స్వర్ణ' యుగాన్ని ఊహించుకొని తన ప్రాక్తన కర్తవ్యాన్ని నెరవేర్చుకొంటూ వస్తున్నాడు. రాజకీయ విషయం మాత్రమే కాదది. రాజకీయం కూడా సంఘచిత్రంలో, 'ఒకానొక' ఏమి,

---

కలిసి సహపంక్తి భోజనాలు చేసినంత మాత్రాన్నే, ఈ వర్ణభేదాలూ వగైరా అంతరిస్తాయా ? నిజంగా అవి అంతరించాలని మీరు సంకల్పించినట్లయితే —

* మాల మాదిగ కన్నె నెవతెనో మరులు కొనరాదో ?

స్త్రీ మాత్రమే వేయగలిగిన సవాలిది. అంతర్వర్ణ వివాహాలు జరక్కుంటే వర్ణభేదాలు రూపు మాయబోవు. అప్పారావు హేళనకు మాత్రమే ఇలా అన్నాడని ఎందుకనుకోవాలి ? అప్పుడప్పుడే ఆయన మదికెక్కుతూ ఉన్న (చూడు : గు. ర. మ. డై. పు. 190-1914, జనవరి 1) బెర్నార్డ్‌షా తన theIntelligent women's Guide to socialism and communsm లో, ఆస్తిపాస్తుల భేదాలను నిర్మూలించేందుకు పటిష్ఠమైనసాధనం..."widen the field of sexual selection to the extent of making the nation completely inter marriageable" అని అన్నాడు. *లవణరాజు కల*"లో రాజు మనసారా "మాల మాదిగ కన్నె"నే మరులుగొని పెళ్ళాడాడు. ఇతరులు ఖండించి గర్హించిన ఈ పెళ్ళిని అప్పారావు సమర్థించాడు.

ఖర్మ, అతి ప్రముఖమైన, అంశమే కాబట్టి, ఆ వంకపెట్టి ఇలాంటి పద చిత్రాలను తూట్లు పొడవడం, ఎవరి కళ్ళువారు పొడుచుకోవడమే. మనస్వి అయిన కవి కాబట్టే గురజాడ అప్పారావు, గుడ్డిగా గాకుండా, సంకల్పపూర్వకంగా ఏవేవనా సహితంగా, తోకచుక్కలాంటి ఒక స్వల్పాంశాన్ని పట్టుకుని, దాని నుంచి కవిత్వ మయమైన తాత్వికార్థాన్ని ఆవిష్కరించగలిగాడు. కోమలిని కాదని కొయ్య బొమ్మలనే మెచ్చుజూచే సంప్రదాయ బుద్ధులుంటే వారి ఖర్మ అనుకోవలసిందేనని,

తలచు నేనిది సంఘ సంస్కరణ
ప్రయాణ పతాకగాన్-

కాసులు రెండవది. ముందటి దానికిది జతగా ఉండదగింది. శబ్దశైథిల్యానికి తోడు ఛందశ్శైథిల్యంకూడా వచ్చి చేరిందని దోష నిరూపణైకమతులు విమర్శింపదగిన రచన; ఎందుచేతనో వారి శీతకన్ను దీనిపై పడిందికాదు.

ముందటి గేయంలో ఉన్న సాంఘిక వాతావరణాన్ని, కల్పనా బాహుళ్యాన్ని తీసివేస్తే మిగులుతున్న భావనాత్మక సంభాషణ ఈ గేయం ఆదినుంచి అంతం వరకూ నడిచింది. ఇది ఒక కవిత్వపద్ధతి మాత్రమే. రెండుపాత్రలున్నట్లు ఊహించుకొని వాటిమధ్య సంభాషణ నడిపి, కవి తాను సూచింపదలచుకొన్న దాన్ని నేర్పుగా సూచిస్తాడు. ఒక్కొక్కసారి – ప్రస్తుత గేయంలోలాగున – ఆద్యంతమూ ఒక పాత్రే భాషిస్తుంది. రెండవది సన్నిధిలో ఉండి, దాని మాటలు వినబడకున్నా హావభావాలుగానీ, ఆంగిక సంజ్ఞలుగానీ మొదటి పాత్రకు అంది దాని మాటతీరును నిర్ణయిస్తుంటాయి. కాకుంటే, ఒకదానిమాటలే వినబడుతాయి.*

ఇందులో ఉన్నది రెండుపాత్రలు. అవి భార్యాభర్తలవి. భర్త మాటాడుకు పోతున్నాడు. ఆ మాటలు వింటూ భార్య మూగసైగలతో తన ఆమోదానామోదాలను సూచిస్తూ, భర్తమాటల క్రమాన్నేగాక పర్యవసానాన్నికూడా నిర్ణయించ గలుగుతున్నది. భర్త ధనంగురించి మాట్లాడుతున్నాడు. ధన మనంగానే భార్యమనస్సులో మెదిలేవి బంగారం. భూషణప్రియ అయిన ఆ అందగత్తె భూషణాలకే భూషణప్రాయురాలు. అది తనకు తెలియదు. భర్తకు తెలుసు. కాబట్టి నశింపులేని సొమ్ముల నామెకు బహూకరింప గోరుతాడు. వాటి పేరు అనురాగం. అదే ప్రేమ. అయితే ఇది మెరుపులా మెరసి మాసేది కాదు, పడుచుదనముతో బాటు పుట్టి

*ఈ ఊహా సంభాషణలతో కవిత్వ మల్లడం రాబర్ట్‌బ్రౌనింగ్ (Robert Browning) పద్ధతి.

గిట్టేదీ కాదు. ఈ రెండవదాని పేరు మోజు. అదే మరులు. ముక్కూ మొగమూ తెలియని కొత్త వారి మధ్య తాత్కాలికమైన అనుబంధాన్ని చేకూర్చ వచ్చునేమో గాని, ఈ మరులు దంపతుల మధ్య శాశ్వతానుబంధాన్ని కల్పించదు. మొదట్లో కల్పించినా, అది త్వరగా దేహ సౌందర్యాన్నీ దాని అశాశ్వతత్వాన్నీ మీరి హార్దిక సమ్మేళనగా పరిణమిస్తుంది. ఒకరి హృదయం మరొకరి కంఠహారమై సువాసనలు వెలయిస్తుంది. "మగువలకు మగవారి కొక్కటె" – ఈ "మాయ మర్మములేని నేస్తము" జీవన సౌఖ్య పథమౌతుంది. ఇది ప్రేమ– "హృత్కమలంపు సౌరభము." అది ఒకరు నేర్పితే నేర్చే విద్యకాదు. పారస్పర్యం వల్ల, ఆనుకూల్యంవల్ల బదులుకు బదులుగా సరికి సరి పద్ధతిలో నీకు చేకూరే పెన్నిధి. కావాలంటే ఈ కాసులదండ తీసుకొని మెడలో వేసుకోగాని, ఈ నా మాటలు మనస్సున నిలుపుకో. మనం స్నేహితులం. అధికారానధికార భావం గాని, సేవ్యసేవక సంబంధంగాని కాగూడదు మన దాంపత్యం. అలాంటి దాంపత్యంలో స్త్రీ చేయి కిందే. కాలం మారింది. దానితోబాటే భావజాలం.

మగడు వేల్పన పాతమాట ది ;
ప్రాణమిత్రుడ నీకు ........

వెనకటి భవిష్యత్కాల చిత్రణలా, ఈ ప్రణయోపన్యాసం కూడా ప్రభు సమ్మితమో మిత్ర సమ్మితమో అయి, సాహిత్య గౌరవానికి వెలిబడుతుందా? అంతా విమర్శకమ్మన్యులదయ. ఈ సంభాషణా రూపంలేక ఇదే వస్తువును నేరుగా, ఉపదేశంలాగా కూడా కాకుండా ఆజ్ఞాపనంలాగా, నిర్వహించిన ఒక ఆధునిక కవి బసవరాజు అప్పారావు.

ఎదమెత్త నౌటకై
సొదగుందరా అంత
మదిగల యహమ్మంత
వదలి పోవునురా !

అని ప్రారంభించి

ప్రేమ కన్నను యెక్కు
వేముందిరా యెల్ల

కామ్య పదవులకన్న
ప్రేమె యెక్కువరా !

ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
యేమింక వలయురా !

అని ప్రేమతత్త్వము ప్రవచించాడు. ప్రేమతత్వం గురించి ఆ ఇద్దరి మధ్య ఎట్లాగూ ఉన్న మౌలికమైన భేదమేగాక, మరి యే భేదమూ లేదా ? కావ్యగతమైన భావాన్ని ఎంత నేర్పుగా పాఠకునికి అందజెయ్యగలిగితే, ఆ కావ్యానికి అంతఎక్కువ సంవిధాన శక్తి ఉన్నదని అనుకోవాలి. నేరుగా, కవిత్వసాహాయ్య నిరపేక్షకంగా, భావాన్ని చేరవేయవచ్చు-బసవరాజు అప్పారావు సాధించినదదే. పాత్రద్వారానేగాక సంభాషణాక్రమంలో సూక్ష్మచ్ఛాయలద్వారా పువ్వులనీ, సొమ్ములనీ, తావిఅనీ, సొగసనీ కవిత్వమయమైన సంకేతాలను ఎన్నిటనో వాడి, మధ్యమధ్య సూక్తులవంటి కొన్ని మాటలను గురజాడ అప్పారావు పలికించాడు. పూల సువాసన ఆ పూలను కట్టిన అరటినారకు గూడా అంటుకొన్నట్లు, కవిత్వగుణం ఈ సూక్తులకూ సూత్రాలకూ సంక్రమిస్తుంది. ఉపన్యాసం మాత్రమే అయితే, అందులో ఈ కవిత్వ విన్యాసమే ఉండేది కాదు.

దంపతీ ప్రణయం, అప్పారావు సాంఘిక తత్వసౌధంలో ఒకనొక అంతస్తు మాత్రమే. దాన్ని గురించి వివరంగా ప్రకరణాంతరంలో చర్చించాలి. ఆంధ్రసాహిత్యంలో ఆత్మాశ్రయ కవిత్వ ధోరణికి ప్రముఖ లక్షణమైన విప్రలంభశృంగారప్రాచుర్యానికిమాత్రం అప్పారావు ఆద్యుడుకాడు. ఆయన ప్రపంచించి ప్రవచించిన ప్రేమతత్వం, దీనిలోనే భిన్నమైనది, ఉదాత్తమైనదిన్నీ. చెలి, దానికి వెలికాదుగాని, అదే సర్వస్వమూ కాదు. మానవ మహాసమాజాన వ్యక్తుల పరస్పర సహాయ సహకారాలకు, సమిష్టిపుష్టికి మూలకందమైన దేభావమో, దానినే, మరొకమాటేదీ లేనట్లు 'ప్రేమ' అన్నాడు కవి.*

* 1929లో తమ తండ్రి అప్పారావుగారి కృతులను ముద్రించే సందర్భంలో గురజాడ రామదాసుపంతులు గిడుగు రామమూర్తిని కలుసుకొని ముచ్చటించినప్పుడు, పంతులుగారి మాటల్లో రామమూర్తి చెప్పింది ఇది :

మీ నాయన ప్రేమ అనే అంశమును తీసుకొని అది మానవ జీవితంలో ఏ ఏ రూపాన

Run - on verse అంటూ డా॥ సి. నారాయణరెడ్డిగారు తమ పరిశోధన గ్రంథం చివర ఈ గేయాన్ని మరో విధంగా పాద విభజనచేసి కూర్చినంతవరకు, 3 వట్టి మనస్సు బద్ధకంవల్ల విమర్శకులు దీని ఛందోశైథిల్యా'న్నే గమనిస్తూవచ్చారు. పైపై చూపుతోనే సరిపెట్టుకొన్నారు. అచ్చతెలుగు మాటలతోను, వికృతి శబ్దాలతోను ముద్దులు మూటగడుతున్న ఈ ఉత్తమ రచనలో భాషా "శైథిల్యా"న్ని కూడా గమనించే దోషోద్ఘాటనైకమతులున్నారు గనుక మరొక్కసారి అప్పారావు కావ్యభాషను గురించి రాయాలి.

అప్పారావు ఆంధ్రభాషా పండితుడు కావచ్చు కాకపోవచ్చు. విమర్శకబాహుళ్యంవలె, ఆయన వృత్తిమాత్ర పండితుడు కూడా కాదు. నిఘంటు పరిశ్రమచేసి "మూగచెవిటివారి ముచ్చట"యిన శబ్దాలపై ప్రభుత సంపాదించి, ఉభయార్థాలలోను 'శబ్దప్రభువు' కాలేదు. అంత మాత్రాన, ఆయనకు శబ్దపరిజ్ఞానమే లేదనడం, స్వాతిశయభావం కలిగించిన పరనిరసనా ఫలితమే. ఆ పరిజ్ఞానం ఏపాటిది అనేది మరొక ప్రశ్న. ఏపాటిదైనా దాన్ని పట్టుకుని వేళ్లాడ దలవలేదు అప్పారావు. దానికి మారుగా, శబ్దాలకుగల సాంఘికమూలాల (communal roots) వరకూ పోయి, సమాజం ఒప్పుదల చేసిన విధంగా వాటిని కావ్యాలలో వాడడానికి ఆయన చేసింది భగీరథ ప్రయోగమే. ఇలా వాడేప్పుడు, ఆశబ్దాలకు గ్రంథప్రయోగ పౌనఃపౌన్యం వల్ల రాపిడిద్వారా కలిగే నునుపు చేకూరలేదు. కోసి అంచులు తీర్చని రత్నాలవలె కరుకుగానూ, మొరకుగాకూడా, అది దర్శనమివ్వక తప్పలేదు. శోధకుడు వాటిని సానబెట్టి చాదే పనికి పూనుకోలేదు. శబ్దజ్ఞానం లేక కాదు, వ్యావహారిక శబ్ద ప్రయోగ దీక్షవల్లనే అప్పారావు కవిత్వభాష ప్రౌఢతను సంతరించుకోలేకపోయింది.* శైథిల్య మనుకొనేవారిదృష్టి గ్రాంథిక భాషాభిమానంతో కూడినది మాత్రమే. ఇలాంటివారికి మొగదారు కాని రోజుల్లో, విశ్వనాథ సత్యనారాయణగారు నవ్యసాహిత్య పరిషత్తు సభాధ్యక్ష స్థానంనుంచి ఉపన్యసిస్తూ అప్పారావు సంకల్పాన్నీ సిద్ధినీ గొప్పవైన మాటలలో వర్ణించారు. వాటి సారాంశం ఇది: రసస్ఫోరకమైన శబ్దాన్ని వాడేప్పుడు (ఆశబ్ద వ్యాకరణ సుష్ఠువుగాకున్నా)

---

వుంటుందో ఏ ఏ సందర్భములలో ఎట్టి పరిణామాలు పొందుతుందో వాటన్నిటినీ పద్య రూపంలో వ్రాయుటకు ఒక పథకము వేసుకొని వాటిలో కొన్ని మాత్రమే రాశాడు. వాటిని **psychological order** లో వుంచలేదు...ముత్యాల సరములు, కాసులు, దమను పితియసు, లవణరాజు కల యివి అన్నియూ యీ కోవలో చేరినవే. ప్రేమ అన్నది, ఒకపవిత్రమైన విశాల భావము.

* అప్పారావు కావ్యభాష పరిణతి చెందింది కాదంటూ, శ్రీ నూతలపాటి గంగాధరం

నవ్యసాహిత్యానికి శంకుస్థాపన జరిగింది. "హృదయావధికమైన రసము పుట్టవలె నంటే దేశభాషలోని అచ్చమైన నుడికారంతోగాని పుట్టదు." దేశభాషలు వర్ణలోప వర్ణాగమ వర్ణ వ్యత్యయాలను జీర్ణించుకొనే భాషలయినందున, ప్రామాణికమైన భాషలో మాట్లాడుతున్న కొద్దీ మార్పులు వస్తుంటాయి. కవులప్రయోగాలకూ వైయాకరణుల సూత్రాలకూ భేదం కనుపిస్తుందనే జ్ఞానం ఆంధ్రంలో "శ్రీ గురజాడ అప్పారాయోపజ్ఞకం." 4

---

గారు తన వాదాన్ని ఇలా బలపరుచుకొన్నారు:

భాషలో నవ్యతకోసం వ్యావహారికాన్నయితే స్వీకరించాడుగాని, కవిత్వ విషయంలో అతని భాష ఎల్లావుంటుందంటే — ఎంత ఈతవచ్చిన మొనగాడైనా ప్రవాహంలో దూకి ఎదురీదినట్లు పసిపాప తప్పటడుగుల్లాగూ ఉంటుంది.

ఇందుకు కారణమేమిటంటే—గురజాడ భాషయొక్క ఆయువుపట్లు పూర్తిగా ఎరక్కపోవడం -ఒకటి! (కొత్తపాతలను మేళవించి ఎవ్వరూ తొక్కని ఒక నూతన పంథాకు దారితీయడం —మరొకటి!!

గురజాడ ఖండికలలో అలంకారాలు అంతా వెదికితే ఏ ఏడో - ఎనిమిదోకన్నా ఎక్కువ ఉండవు. వాటిల్లోనూ ఉపమానాలే ఎక్కువ. అవికూడా సమంజసంగానూ 'కథార్థంబు ఘటితపూర్వాపరమై' ఉంటాయి.—గురజాడకు మార్గదర్శి వేమన(వ్యా)భారతి, జనవరి 1965

# 3

అప్పారావు గేయాలలోకెల్ల నిరాదరణ పాలైనది, *డమను-పితియను* అన్నదే. విజాతీయాలైన పేర్లూ అపరిచితమైన వాతావరణమూ మట్టుకే, దీనికి కారణాలుగావు. కథ ఎంత చక చక నడిచినా, సంభాషణ లెంత ముక్తసరిగాఉన్నా, అప్పారావు ప్రతిపాదించ బూనిన తత్వం తలకెక్కనందుచేతనే పాఠకులు ముఖం తిప్పేసుకొంటున్నా రనిపిస్తుంది. నిజానికి, ఆ తత్వం విజాతీయమైనదేమీకాదు. ఉపనిషత్తత్వమే రూపాంతరం పొంది, ఈజియన్ దీవులలో ఒకటైన సేమాస్‌లో పిథాగరస్ (Pythagoras)ను ఋషితుల్యుణ్ణి చేసింది. డేమన్, పిథియస్ ఆ పిథాగరస్ శిష్యకోటిలోని వాళ్లు. వారి "స్నేహసంపద" చరిత్ర ప్రసిద్ధమైపోయింది.

ఉపాధ్యాయుడుగా ప్రాచీన గ్రీస్ దేశ చరిత్రను తత్వ శాస్త్రాన్ని బోధిస్తూ వచ్చినప్పుడు, ఈ కథ అప్పారావు మనస్సున కెక్కిఉంటుంది. ప్రాచీన రూపంలో ఉన్న కథకూ, అప్పారావు కావ్యంలోని కథకూ భేదం ఉంది. అసలు కథలో ఫింటియస్ (దాని భ్రష్టరూపమే పిథియస్) నిరంకుశ రాజాగ్రహానికి పాత్రుడై మరణ దండనకు లోనౌతాడు; డేమన్ తన మిత్రునికి మారు తానా శిక్షను అనుభవిస్తానని ముందుకు వస్తాడు. అప్పారావు కావ్యంలోని కథకు మూలం, మిస్ ఛార్లొట్ యంగ్ (Miss chorlotte yonge)రాసిన THE BOOK OF GOLDEN DEEDS అయిఉండదు. అందులో ఈ వ్యత్యయంలేదు. శిక్షపడింది డేమనుకు కాదు. ఉప్పారావు తన కావ్య కథను, ఆర్. ఎడ్వర్డ్సు రాయగా పదహారో శతాబ్దిలో రంగస్థలానికెక్కిన నాటకం నుంచి గ్రహించి ఉండవచ్చు. డేమను పిథియస్‌లు సిరాక్యూజ్ దీవికి వెళ్ళినప్పుడు, దాని నిరంకుశ ప్రభువైన డెయనీషియస్ (Dionysius) డేమన్‌ను గూఢచారిగా ఎంచి మరణదండన విధిస్తాడు. ఇంటికివెళ్ళి వ్యవహారాలన్నీ చూచుకొని రెండు నెలల వ్యవధిలో తిరిగి రాగలను, అనుమతించమని డేమన్ వేడుకొంటాడు. పిథియస్ తన మిత్రునికి పూచీగా ఉండి అతడు రానిపక్షంలో తన ప్రాణాల నిచ్చుకొంటానంటాడు. డేమను కొద్ది ఆలస్యంగా తిరిగి వస్తాడు. వచ్చేసరికి పిథియస్ దండన అనుభవించబోతూ ఉంటాడు. అతన్ని రక్షించాలని ఇతడు, ఇతన్ని రక్షించాలని అతడు, నేనంటే నేను ప్రాణత్యాగం

చేస్తానని పోటీ పడుతారు. డెయనీషియస్ కలగజేసుకొని, వారి స్నేహాన్ని మెచ్చి, క్షమించి. తానుకూడా వారిజట్టున చేరుతాడు.[5]

ఈ నాటక కథను కూడా యథామూలంగా అప్పారావు సొంతపరచుకోలేదు. అంతకంటె కూడా నాటకీయంగా తనకావ్య కథను మలచుకొన్నాడు. ఆలుబిడ్డలను చూచి పనులు తీర్చుకొని మరలి వస్తానని చెప్పి, పిథియసు పూచీపై రాజానుమతి పొంది ఇంటికి వెళ్ళిన "దమనుడు." శుక్లపక్ష తదియనాడు తన మందిరంలో పెద్ద విందుచేసి మిత్రులను బంధువులను పిలిచి కుడిచి తాగుతున్న అదనులో, తన వృత్తాంతమంతా వివరించి తనకై ప్రాణాలివ్వగల మిత్రుడుగానీ బంధుగుడుగానీ, ఎవడని ప్రశ్నిస్తాడు. అందరూ జారుకొంటున్నప్పుడు, తానంతకు మునుపు చెప్పిందంతా అబద్ధమేననీ, కాబట్టి భయపడకండని ధైర్యంచెప్పి పంపుతాడు. అక్కడ పిథియసు ఇంటిలో చతుర్దశినాడు విందు. దమనుడింకా రాలేదు కాబట్టి, తాను మరణానికి సిద్ధపడాలి పిథియసు. జీవన్మరణాలగురించి ప్రసంగిస్తున్నపుడు, పిథియసు భార్య కలిగించుకొని ప్రాణపుతీపి గురించి ఉపన్యసిస్తుంది. రాజ నిర్ణయం న్యాయాన్యాయాలతో ప్రమేయంలేకుండా అమలు జరగవలసినప్పుడు, తన భర్తకు మారు తానే ప్రాణాలర్పిస్తానంటుంది. అంతలో దమనుడు నీడపట్టునుంచి వెలువడి, ఆ భార్యాభర్తల విచారం బాపుతాడు. అంతటితో కథ పూర్తికాలేదు. అంతకంటె విస్మయకరంగా, రాజు వారికి కాన్పించుకొని దమనుని విడిచి వేస్తున్నానంటాడు. "అలఘురాజ్యము ప్రేమ సంపదకలతి" యని తెలుసుకొన్నాడు; చదువుల సారాన్ని ప్రేమమాధుర్యాన్ని అనుభవానికి తెచ్చుకున్నాడు. అలా వివేకోదయం కలిగించిన "మనుజులిద్దరు మగువ యొక్కతె/మాన్యులీ జగతిన్."

విద్యలేమిటి? ప్రేమ ఏమిటి? ఈ ప్రశ్నలకు ఆ ముగ్గురు మాన్యులూ తమ తమ సమాధానాలిచ్చుకొని ఉన్నారు. బతుకేమిటో చావేమిటో తెలిపారు దమను పిథియసులు. రెండూ ఒక్కటేనని తేల్చారు. 'పునరపి జననం పునరపి మరణం' సిద్ధాంతం వాళ్ళది. వాళ్ళ ఆచార్యుడైన పిథాగరస్ జన్మపరంపరా సిద్ధాంతాన్ని చేబట్టి సంసార చక్రవిమోచనమే – మోక్షమే – పరమధ్యేయమని నమ్మారు. ఆత్మ దేహంతోబాటు నశించక మరొక దేహాన్ని ధరిస్తుంది. "మ్రందుటన్నది బొందె మార్చుట." ఈ విధంగా నమ్మినవారంతా కలిసి ఒక బృందమయ్యారు, తమ జీవన విధానాన్ని నిర్మలం చేసుకొంటూ జ్ఞానాన్ని పెంపొందించుకొనే వాళ్ళు. వాళ్ళకు సొంత ఆస్తిపాస్తు లుండేవికావు. కలిసి భోంచేసేవాళ్ళు (Common Tables). దేమను, పిథియసుల నమ్మకమూ నడవడీఇలాంటివి. అంతే

కాదు; పిథాగరస్ సంఖ్యా సిద్ధాంతాన్ని ఒకదాన్ని రూపొందించాడు. దృశ్యమాన ప్రపంచాన్నంతటినీ క్రమబద్ధంచేసి నడిపే అదృశ్య శక్తిని సంఖ్యాత్మకంగా – రాశి రూపంగా – నిర్ణయించాలని అతని ప్రయత్నం. ఈ ప్రయత్నంలోనే సంగీత స్వరాలను, రేఖాగణిత సూత్రాలను పిథాగరస్ ఏర్పరచ గలిగాడు. 6

అప్పారావు కావ్యంలోని పాత్రల సంభాషణలఅర్థం, ఇపుడు మరి.తస్పష్టంగా అవగతమౌతుంది. మిత్రద్వయంలో ఏ ఒక్కరూ చావుకు వెరవలేదు. పైగా దాన్ని "ముందు భవమున కలుగు విభవము"నకు ప్రవేశద్వారమని భావించారు. రాజేది దండన అనుకొన్నాడో,దానిని బహుమాన మనుకొన్నాడు డమనుడు. చెడ్డను మంచిగా స్వీకరించాడు. నైకాన్ని ఏకమనుకొన్నాడు. "పెక్కులొకటిగ జూచువాడే ప్రాజ్ఞు" డనుకొన్నాడు. పిథియసు తక్కువ తినలేదు. వీరిద్దరూ ఒక ఎత్తు, పిథియస్ భార్య ఒకర్తే ఒక ఎత్తు. తత్వం చేకూర్చిన విజ్ఞానంతోటి ఇప్పటి ఈ బతుకును చేజేతులా నిశ్చింతగా వదిలివేసుకొనేంత వివేకిగాకపోవచ్చు నామె. చదవరుల వెర్రిభ్రాంతులు తన తలకెక్కలేదు. తనది లోకాతీతమైన జ్ఞానం కాదు. పరమ సామాన్యమైన లోక జ్ఞానం మాత్రమే. కాబట్టే ఇలా ఆ వెర్రి పరతత్వానికి సవాలు విసిరింది :

పండగలదని కాయ కుడుతురె
తిండియెల్లిది నేడు తిందురె
అండమందున చిలుక కలదని
అరచి జీరెదరే ?
బతకవలసిన కాలముండగ
బతుక నొల్లమికంటె పుట్టునె
బతుకు దునిమిన బతుకుభారము
పాయదే చెపుడా ?

ప్రాణత్యాగులు ఒక్క నిముషకాలం ఆగి ఆలోచించుకో వలసిన ప్రశ్నలివి. ముందెన్నడో చావుతథ్యంకదా అని, ఇంకా సాగించవలసిన ఈ బతుకును మధ్యలోనే తుంచివేసుకోవడం అవివేకంకాదా ? సంసారబంధాలనుంచి తప్పుకొని స్వేచ్ఛా గగన వీధులకు ఉత్క్రమింప జూచే మగవానికీ, సంసార జంబాలంలో కంఠదఘ్నంగా నిలిచి అనుబంధాలను పెనవేసుకొని వాటిలోనే సార్థక్యం పొందే గోరే ఆడదానికీ, అనాది నుంచి సాగుతున్న ద్వంద్వయుద్ధంలో ఇది మరొక ఘట్టం. ఆమె మాటల సామంజస్యాన్ని గ్రహించాడు గనకనే రాజు ఆమెను మాన్యకోటిలో చేర్చాడు.

శుష్కమైన తత్వ చర్చగానీకుండా, ఈ కావ్యాన్ని కాపాడింది కవి కల్పనా చాతుర్య మొక్కటే. నాటకీయమైన పద్ధతిలో రాజు దురాగ్రహం దమనుని వేడికోలు పిఠయును పూచి దమనుని స్వదేశ ప్రయాణం, సంభాషణల ద్వారా నిర్వహించాక, సేమాస్ దీవిలో దమనుని భవనం చుట్టూ ఉన్న ప్రకృతి దృశ్యాలను ఆ సీమ శీతోష్ణస్థితికి తగినట్లుగా వర్ణింప గలగడం, సామాన్యుడైన కవికి అలవిగాని పని. ఋతువు ఋతువుకు మారే రూపం తోటి, "కవుల పుట్టిలు" అయిన ఆ దీవి స్వర్గఖండమే ; అక్కడ

వాడి లేదట యినుని వేడికి
సీతువలికైనన్.

అనడం టెనిసన్ కవి (The Lotus - Eaters) లో చేసిన వర్ణనను గుర్తుకు తెస్తుంది. ప్రకృతి దృశ్యాలను ఇంత కొద్ది చట్రంలో కొద్ది మాటలతో చిత్రించి ఇమిడించ గలగడం, అప్పారావు కవిత్వానికి కూసువిద్య. మోడువారిన ("మొండు") మనస్సుకూడా దమనుని భవనంలో గనక నిలిస్తే, పూలెత్తుతుందట. కాంతి – సూర్యరశ్మి గానీ దీపప్రభగానీ – వస్తువులపై ప్రసరించినప్పుడు వాటి సాదా రూపాలలో వచ్చే ఐంద్రజాలికమైన మార్పును అవకాశం దొరికినప్పుడెల్లా వర్ణించకుండా విడిచిపెట్టడీ కవి. * ఇందులో–

* ఎండ, నీడ, వెన్నెల, దీపకాంతి – వీటి ప్రభావం వల్ల వస్తువుల రూపంలో వచ్చే మార్పును అప్పారావు తన కావ్యాలన్నిటా వర్ణింపబూనాడు.

లవణరాజు కలలో మలిసంజ :

వెలుగునీడలు కనుల కింపై
మెలగి చెలగెడి నాకసంబున
ప్రేలు మబ్బులయంచు లంటను
రగిలె రత్న రుచుల్.

అందులోనే, వెన్నెలలో నీడ :

పండు వెన్నెల పముదవనిపై
నిండు గమ్మిన నీడకై వడి
నిండె మోమున చింత యొక్కటి ;

చారు తరముగ పసిడి పమిదల
బారు తీరి వెలింగె జోతులు ;
వారి యంత్రము తళుకు ము త్తెపు
సరులు విరజిమ్మెన్.

తదియ చంద్రుడు అస్తమించగా చీకటి వ్యాపించింది. చీకట్లో జలయంత్రం (Fountain) విరజిమ్మే నీరు దృగ్గోచరం కాదు. ప్రమిదలలో వెలిగే దీపాల కాంతి దానిపై పడినప్పుడు, అది ముత్యాలసరమే అవుతుంది. అలాగే ఆ దేశ వాసులు పుచ్చుకొనే ఆసవాలు నురుగులెత్తుతూ పొగల నెగయించడం కూడా, కవి చూపు నుంచి తప్పిపోలేదు.

ఉండు+ఒక='ఉండొక', లేదని+ఉంటిని='లేదనుంటిని', 'యిల్లునందు', 'వావుచు' వగైరా పదాలే చెవికి కాస్త కొత్తగా కొరతగా ఉండి emphony ని చెడగొట్టగల వనిపిస్తూంది. 'కరకరి', 'నివ్వటిల్లు', 'షండము' వంటి గ్రాంథిక ప్రయోగాలు, 'జోతులు', 'వుమ్మిరి', 'పండుప' వంటి జీవద్భాషాపదాలతో సహ జీవనం చేస్తూన్న ఈ కావ్యాన ఎన్నదగిన గొప్పవిషయం, పరమ సత్యాలనిపించే కొన్ని సూక్తులు అక్కడక్కడ నిలిచి వుండడమే.

బ్రతికి, చచ్చియు, ప్రజలకెవ్వడు
బ్రీతి గూర్చునొ, వాడె ధన్యుడు ;
పొత్తులన్నవి సంపదలకే ;
ఆపదల కగునే ?
తప్పవొక యెడ దండమొక యెడ
అలఘు రాజ్యము ప్రేమసంపద
కలతి....

---

కన్యక లో 'నగల తళుకులు' సుభద్రలో 'చలదింద్రచాపంబు చాడ్పు' జూపే పచ్చల హారాలు, అలాగే

మెఱపు కెమ్మబ్బులోపల మెఱయునట్లు
వలిపమున మేల్మి మొలనూలు తళుకు లీన....

లాంటి వర్ణనలు భావనాత్మకమైనవి.

ఇలాంటి ప్రవచనాలు అకవిత్వమై కూర్చుంటాయని వాదించడం, కవిత్వ పరిధిని బాగా కుదించి వెయ్యడమే; కవులను పట్టి సౌందర్యారాధకులనుగా జేసి ఉంచే ప్రయత్నం, వారి మేధశ్శక్తిని తగ్గించి వేయకుంటే బాగుంటుంది. జీవితానుభవంనుంచి కవికి కలగవలసింది చిత్త ద్రవీభూతమైన రసానుభూతికాదని ఎవ్వరూ అనరుగాని, ఆలోచనను కదలించి కెరలించి వివేకానికికూడా ఉపకరించే విధంగా హృదయాలతోబాటు మనస్సులు పనిచేయావలసి ఉంటుంది.

పాఠకుల మదికెక్కినా ఎక్కకున్నా వితండ పండితుల తలకెక్కిన అప్పారావు కావ్యాలలో లవణరాజు కల ముఖ్యమైనది. పురాణాంతర్గతమైన లవణరాజు "దివాస్వప్న" వృత్తాంతాన్ని ఇరవయ్యో శతాబ్దపు దృష్టితో అప్పారావు చూచాడని, వర్ణ వ్యవస్థను దుయ్యబట్టడానికి మాత్రమే దాన్ని చేబట్టాడని నిర్ణయం చేసి. సుప్రసిద్ధమైన ఒకానొక కథను ఎవడంటే వాడు ఎలాగంటే అలా మార్చ గూడదంటూ "తేషుమార్గేషు స్వేచ్ఛానయోజ్యా" అనే నిషేధాజ్ఞను జారీచేస్తున్నారు:

> ఒకవేళ రసదృష్ట్యా కొంచెము మార్పు చేయవచ్చునేమో కాని మన యభిప్రాయముల కనువుగా అసలే మార్చకూడదు. అట్లుచేసినచో ననౌచిత్యము వచ్చును. విభావౌచిత్యము కవి జాగ్రత్తగా పాటించ వలయును. 7

పూర్వకవులు అలా పురాణ కథను తీసుకొని కావ్యాలు రాసినప్పుడు, "రస సమంచితముగా"నే తప్ప "వాతావరణ భంజకములు"గా మార్పులు చేయలేదని, అవి ప్రధాన రస వ్యతిరేకములుగా రూపొందలేదని, మరొక బాలపండితులంటున్నారు. 8 శాంత రసానికి ఆలంబన విభావమయిన లవణ మహారాజు నిలా శృంగార పరుణ్ణి చేయడం తగనిపని, అని వారి వాదాల సారాంశంలా కనిపిస్తున్నది. శృంగార సూచన అప్పారావు తెచ్చి తగిలించిందేమీ కాదు. మూలమైన యోగవాసిష్ఠము (యో.వా) లోను, మడికి సింగన (మ. సిం.) జ్ఞానవాసిష్ఠ రామాయణము (జ్ఞా.వా.రా.) లో దండిగాను, ఈ శృంగారం ఉంది. అప్పారావు చేసిందల్లా ఈ శృంగారానికిగాని, మరొకదానికిగాని, అచ్చమైన కావ్యంలో ఉండక విధిలేని నేపథ్యాన్ని (Background) లేదా, పర్యంత సీమను (Setting) ఇవ్వడమే. వర్ణిత విషయం విశ్వసనీయతను చేకూర్చుకోవడానికి ఈ పని జరగక తప్పదు.

ఈ వివాదాల్లోకి దిగితే ప్రస్తుత ప్రణాళికకు భిన్నంగా గ్రంథం పెరగవలసి వస్తుందనే భయంతో, లవణరాజు కథను (ల.క.) ఈ ముగ్గురూ ఎలా ఎలా నిర్వహించిందీ క్లుప్తంగా సూచించుకొంటూపోయి, అలా చేయడంలో వారి భిన్నోద్దేశాలను బయల్పరుస్తాను.

మూలమైన *యో. వా.* లో లవణుడు ఉత్తర పాండవ జన పదానికి రాజు; హరిశ్చంద్రుని వంశమువాడు; ధార్మికుడు, ధీరుడు, అతని కథను వసిష్ఠుడు రామునికి చెబుతాడు—ఆ కథపేరు *ఇంద్రజాలోపాఖ్యానము. చండాలీశోచనము* అనేదానిలోకూడా లవణుని ప్రస్తావన ఉంది. ఈ కథలు చెప్పడంలో వసిష్ఠుని ఉద్దేశం ఒకే ఒక్కటి. ప్రపంచ రూపమైన ఇంద్రజాలమంతా మనస్సునకు అధీనమై ఉన్నది. "మనోరథ, స్వప్న, సంకల్పాదులందీ చిత్తమనేక యోజనముల దూరమును గూడా గోష్పాద తుల్యముగ నొనర్చుచున్నది.... ఈ మనస్సు క్షణమును కల్పముగను కల్పమును క్షణముగను చేయుచున్నది. కావున, దేశ కాలములు మనస్సున కధీనములనియే విజ్ఞులు వచించుచున్నారు .. భ్రమ, వ్యామోహము, మొదలైన యనర్థములును, దేశకాలాదుల గమనాగమనములును, వృక్షమునుండి పత్రము లావిర్భవించునట్లు, చిత్తమునుండియే కలుగును."* ఈ చిత్తమాహాత్మ్యాన్ని నిరూపించేందుకు మాత్రమేగాని, కావ్యదృష్టితోకాదు. మూలంలో లవణరాజు కథాకథనం. అవిద్య భ్రమను కలగజేయగలదుసుమీ, అని రాముణ్ణి హెచ్చరించి జ్ఞానోపదేశం చెయ్యడానికే వసిష్ఠుడు ఈ కథను కల్పించి చెప్పాడు.

---

*సంస్కృత శ్రీయోగవాసిష్ఠమును తెలుగు వచనంగా అనువదించి అర్థ వివరణను ఇచ్చినవారు. ఏర్పేడులోని శ్రీ వ్యాసాశ్రమమునకు చెందిన పూర్ణానంద. ఈ వచనానికి మూలంలోని శ్లోకాలివి :

మనోరథే తథాస్వప్నే యథా రూపాన్యథాతరోః
గోష్పదం యోజన వ్యూహాః స్యాసులీలాసు చేతసః ॥
కల్పం క్షణీకరోత్యంతః క్షణం నయతి కల్పతామ్
మనస్తదాయత్త మతో దేశ కాలక్రమం విదుః ॥
వ్యామోహ సంభ్రమానర్థ దేశకాల గమాగమాః
చేతసః ప్రభవంత్యేతో పాదపాదివ పల్లవాః ॥

జ్ఞా. వా. రా. లో మ. సిం. ఉద్దేశంకూడా ఇదే. ఆరు విధాలుగానున్న జ్ఞానోపదేశ మార్గాన్ని బోధించి. "జీవుండు చిత్తంబనియును, చిత్తంబునంద జగత్తులు విస్తరిల్లుననియును, దత్సంకల్పంబ బంధంబు తన్నిరసనంబ మోక్షంబనియును. చిత్తశాంతియ జీవన్ముక్తియనియును" ఉపన్యసించగోరి, ఉత్పత్తి ప్రకరణములో లవణోపాఖ్యానం చెబుతాడు వసిష్ఠుడు. లయానంతర కాలాన నిలిచి ఉన్న పరమాత్మ (చిత్) కాలక్రమాన జీవాత్మ్మడైనప్పుడు అతని మనస్సు సంకల్పమయమౌతుంది. ఆ సంకల్పంనుంచి జగత్తు ఇంద్రజాలంలా పుదుతుంది. సంకల్పమే సంసారజాలం; అదే చిత్తవికారకారణం; నిస్సంకల్పమే మోక్షం. అవిద్యాప్రభావం వల్ల అసత్యం కూడా సత్యంలాగానే కనిపించి భ్రమ గొల్పుతుంది. దాన్ని నిరూపించడానికే లవణోపాఖ్యానం.

ఈ సూక్ష్మభేదాలను గురించి చెప్పడానికి అప్పారావు ల. క. ను రాయలేదు. పారలౌకికమైన దృక్పథమే కాదాయనది. అనుభవాలు అశాశ్వతాలు, అసత్యాలుఅని ఆయన నమ్మలేదు సరికదా, తద్భిన్నంగాపోయి, లవణునిచేత ఈ మాట లనిపిస్తాడు:

పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్త్వమెరుగక, శుకము లగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్ !
యెప్పటికి అనుభూత మెద్దియొ
అప్పటికి అది నిక్కువంబే;
యెప్పుడో లోకంబు కల్లగు
ననుట యిపుడెట్లో ? *

జన్మపరంపరా సిద్ధాంత ప్రసక్తి, ఐంద్రజాలికుని మహత్తు మూలంగా ఏర్పడి అనుభవానికి వచ్చి సత్యమే అనిపించిన భ్రమ-ఇలాంటి మూలానుసారమైన

* డా. సి. నారాయణ రెడ్డిగారి "ఆధునికాంధ్రకవిత్వము"లో ల. క. ఔచిత్యము గురించిన చర్చ ఉన్నది. ఈ పాదములను పేర్కొని ఆయన ఇలా వ్యాఖ్యానిస్తున్నారు:

ఈ చరణములలో ఇంద్రియ సన్నికర్షణ జన్యమైన అనుభూతి జ్ఞానము లసత్యము లనెడు వేదాంతుల సిద్ధాంతమును గురజాడవారు ఖండించిరి. వేదాంతులు సత్యమును వ్యావ

సామగ్రి ఉండికూడా, ఇది స్వతంత్రమూ, పైగా కావ్యమూ అవుతున్నదిగాని. a tale to adorn a moral కావడంలేదు. మూలంనుంచి అప్పారావు సాధించింది మౌలికమైన స్వాతంత్ర్యమే కాబట్టి మూలానుసారంగా శాంతరసపోషణం మాత్రమే ఆయనకు పరమాశయమై కూచోవలసిన పనిలేదు. ఒక వైపు ఆంధ్రీకరణమని పేరెట్టుకొని, మరొకవైపు శాంతాన్ని గింతాన్నీ తుంగలో దొక్కి ప్రబంధ శృంగార పద్ధతిలో మూలకథను తీన్‌తారు చేసిన మ. సిం. ను నోరుచేసుకోవాలిగాని, అనువాదమూ అనుసరణమూ కాని ల క లో అప్పారావు స్వాతంత్ర్యం చూపెట్టాడని కంటగించుకోదగదు.

కావ్యమైనందుచేతనే నేరుగా కథనెత్తుకొని ఘటనా క్రమాన్ని నిర్వహిస్తూ ఉచిత స్థానాలలో వర్ణనలను అత్యంత సహజంగానూ అకృత్రిమ రమణీయంగానూ నిలిపి, దంపతీనిష్ఠ 'జనానంతర సౌహృదం' మంచిచెడ్డల నిరూపణం కులాల కుత్సితం శాంతిజీవన సౌందర్యం వంటి సొంతభావాలను స్థాపించగలిగాడు.

మూలంలోని రాజ వర్ణనకు సంబంధించిన శ్లోకాలను విస్మరించి, నేరుగా కొలువులో రాజును ప్రవేశపెడుతూ, "జాలికుని" చేత "దండినృప" అని సంబోధింపజేస్తాడు.

దండి నృప! వొక గండు గారడి
కలదు కను మనియెన్.

---

హారికమనియు, పారమార్థికమనియు ద్వివిధముగా పరిగణించిరి...గురజాడవారు దైనందిన జీవితమున పారమార్థిక సత్యమునకు ప్రసక్తి లేదని భావించిరి. చిత్తములో కీలితములై భేదమును కలిగించు తలపులు సత్యములు కావను శూన్య వాదమును విమర్శించిరి. ప్రధానముగా జన్మజన్మాంతర సంస్కారమునుబట్టి ఏర్పడిన అనురాగ బంధము అవిచ్ఛిన్నమని, ఆదరణీయమని నిరూపించిరి. స్వప్నము మిథ్యయని మూలములోనుండగా, స్వప్నము నైతము సత్యము కావచ్చునని ప్రతిపాదించిరి. వ్యావహారిక సత్యమే జీవిత సత్యమని నిరూపించిరి. అందుకే 'పుస్తకమాత్ర పరిజ్ఞానము' నీసడించిరి అనుభవమున కగ్రతాంబూలమిచ్చిరి. అనుభవైక ప్రమాణమగు దర్శనమే నిజమైనదని చాటిరి. (పు. 254-257).

దీనిని ప్రత్యక్షవాదమంటూ బేకన్ ప్రతిపాదించిన Empiricism (ప్రత్యక్ష ప్రమాణం పై ఆధారపడే దృక్పథం) నకూ దీనికీ పోలిక కలదని డా. నారాయణరెడ్డిగారు ఊహిస్తున్నారు. బేకన్ ఈ ప్రత్యక్షానుభవవాదాన్ని పూర్తిగా అంగీకరించలేదు. అంతకంటే ఎక్కువ పోలికలు జాన్‌లాక్ John Locke ప్రతిపాదించిన ఇంద్రియానుభూతివాదం sensationalism తో ఉండే వీలుంది.

దండి, గండు శబ్దాలకు ప్రాసపెట్టాడని అప్పారావును వేలెత్తి చూపిన సీతారామారావు గారికి ఈ తిక్కన మహాకవి పద్యమే జవాబు చెప్పగలదు: స్త్రీ పర్వము (11.78) లోనిదిది:

క. పాండవులును పాంచాలురు
దండి మగలు వారుసూడఁదలఁకక నిన్నున్
ఖండనమునఁ బడవైవఁగ
గండుగలుగు టద్భుతంబుగాదె తలంపన్. *

రాజుకుగానీ జాలికునికిగానీ అప్పారావు రూపచిత్రాలు గీయలేదు. మాలెతకూ, ఆమె తండ్రికీ వాటిని అట్టిపెట్టాడు. మ. సిం. దేనినీ వదలలేదు. మూలంలో ఇంద్రజాలికు డొక్కడేగాక, మూర్తిమంతమైన వాయువులాంటి గుర్రాన్ని తీసుకొని అశ్వపాలుడొకడు ఆస్థాన ప్రవేశం చేసి తన ప్రభువు దానిని కానుకగా పంపాడని చెబుతాడు. దానినెక్కి లోకవిహారంచేసి రమ్మని ఇంద్రజాలికు డంటాడు. రాజు గుర్రాన్ని చూస్తాడు. ఇంతలో కళ్ళు మూతలు బడినట్లు చేష్ట లుడిగి నాల్గు గడియలవరకు సింహాసనంమీద వ్రాలిపడిఉండి, మెలకువ వడుతూ ఊగి సింహాసనం మీదినుండి తూలిపడబోగా, ఆస్థానికులు పట్టుకొంటారు. కలగన్నట్లు, కలదెలుసుకొంటున్నట్లు, ఇది ఏ ప్రదేశం, ఈ సభ ఏమిటి అని ప్రశ్నిస్తాడు. విస్మితులై, ఏమిటిలా మీరు ఎన్నడూ లేనిది మోహితులయ్యారు, అని వాళ్ళడిగితే రాజు తన స్వప్నకథ చెబుతాడు: సూర్యాస్తమయందాకా ఒక కీకారణ్యంలో అశ్వారూఢుడై సంచరించి, మరో అడవిలో దూరి ఒక జంబీర వృక్షతలాన్ని చేరి ఆ చెట్టున కల్లుకొని యుండిన తీగ తన మెడకు తగుల్కొంటే దాన్ని పట్టుకొని గుర్రాన్ని విడిచివేశాడు. చీకటి పడడంతో తరుకోటరంలో తల

---

* ఏ శబ్దం తర్వాత ఏ శబ్దం ప్రయోగించాలో రచయితకు తెలియదని చేసిన విమర్శకు కో. వా. తమ వ్యాసంలో ఇలా జవాబిచ్చారు:

'దండి' అనే శబ్దం రాజగతమైన సర్వోత్సాహాలకు స్థిరబుద్ధికి వ్యంజకం కాగా 'గండు' అనే శబ్దం అట్టివారలను గూడా భ్రమింపజేసే శక్తి తన గారడీకి వున్నదనే దర్పం ఆ పదాల్లో వున్నది.

గురజాడ వారి లవణరాజుకల _ రసచర్చ: శ్రీ కో. వా.
విశాలాంధ్ర: 29-11-1959

దాచుకొన్నాడు. తెల్లవారాక అడవిలో పడి తిరుగుతూ, నాల్గు గడియల పొద్దెక్కిన వేళ, "తరత్తారక నేత్రాంతాం శ్యామా మధవలాంబరామ్" (చంచల నేత్రాలూ మలిన వస్త్రమూగల నల్లనిస్త్రీ)ని చూశాడు. పేరు హారకేయూరి. అన్నం పట్టుకు పోతూ కనిపించింది. ఆగొని ఉన్నాడేమో, అన్నం పెట్టమని అడిగాడు. ఇవ్వక పోయేసరికి, వెంటబడి పోయాడు. ఆగి ఆ కన్య తనకులాదికాలు వివరించి చెబుతూ నిరుత్సాహపరుస్తూనే, "క్రీడాపూర్వకముగ జనుచుండి....కటాక్షాది చేష్టలనొనర్చుచు" అతన్ని రెచ్చగొట్టింది."దదామి భోజనమిదం భర్తా భవసి చేన్మమ"–నీవు నాభర్త వైతే అన్నం పెడతాను, అనింది. స్త్రీకి భర్త ప్రాణాధికుడు కాబట్టి అతనికి అన్నం పెట్టేందుకు (భర్త అయినప్పుడే) సిద్ధపడింది. అందుకే రాజు ఆమెను "సువ్రతా" అని సంబోధించవలసి వచ్చింది. ఆపత్కాలం గనక వర్ణధర్మకుల క్రమాదులను విచారింపక అలాగే నీభర్త నౌతానన్నాడు. ఆమెతండ్రి కురూపి; దుష్టుడు: "ధూళిచే ధూసరితమగు శ్మశానమున బేతాలునివలె" పొలాన్ని దున్ను తున్నాడు. చండాల వాటిక బీభత్సమయం. ఆమెను పెళ్ళాడాక రాజు చండాలుడే అయ్యాడు. ఆమెత్వరలో పుష్పవతీ గర్భవతీ అయింది. పీడ సంతానం కలిగింది. గృహకలహాలు, బంధుద్వేషాలు, అతన్ని సొంతకాపురం పెట్టించాయి. మాంస విక్రయ వృత్తి చేకూరింది. అరవై ఏళ్ళ పాటు నీచంగా జీవించి వృద్ధుడై, క్షామం వల్ల జనక్షయం వల్ల వలసపోయి కుమారుని ఆకటిచిచ్చును ఆర్పడానికి తన మాంసాన్ని ఆరగింపుచేయ సంకల్పించి మంటలో పడడమే తడవుగా, ఇక్కడ నిండుకొలువులో సింహాసనం నుంచి పడిపోతున్నట్లు భ్రమ పొందాడు. కల దెలుసుకొన్నాక ఇంద్రజాలికుడు అంతర్ధానం చెందాడు.

చండాలీ శోచనము అనేసర్గలో, ఆ మరునాటి కథ ఉంది. తన చండాల జీవిత స్థానాన్ని చూడగోరిన రాజు, వింధ్య పర్వత ప్రాంతారణ్య సీమలో పుష్కస ఘోషమనే గ్రామాన పుష్కసుడనే చండాలుని వితంతు భార్యను చూచి తన అత్తగా గుర్తించి, మిగిలిఉన్న చండాలుర నందరినీ పోల్చుకొని విస్మయ చకితుడౌతాడు.

యో. వా. లో వసిష్ఠుని ఉపదేశ మేమిటంటే, ఇంకొకని మనస్సులోని చండాల కన్యా వృత్తాంతం లవణుని మనస్సులో భాసించిన విధంగానే. లవణుని స్వప్న భ్రమ వింధ్యపర్వత ప్రాంతంలోని చండాలుని మనస్సులో భాసించింది;

స్వప్నంలో కూడా దేశ కాలక్రియలు సమంగానే ఉంటాయి. లోకమే స్వప్నం. నిజం అతిలోకమైనది.

ఈ మూల కథను మ. సిం. ఒక రకంగానూ, అప్పారావు ఇంకొక రకంగానూ వర్ణించారు. జ్ఞా.వా.రా లో ఇంద్రజాలికుడు మూలంలోవలె "దైవమాయ" కాదు. రాజసూయ యాగం చేసినవాడు పన్నెండేళ్లు దుఃఖమనుభవించాలి. గనక, రాజసూయ యాగకర్త అయిన లవణుడు ఇంద్రునికి అసూయకలిగించగా, ఇంద్రుని దూత ఈ జాలికునిరూపానవచ్చి "ముహూర్తద్వయంబునఁ బంద్రెండేండ్లదుఃఖంబు" లనుభవింపజేసి పోయాడు. ఇక, అరణ్యంలో ఆలంబిత శాఖుడై యున్న లవణుడు చండాల కన్యను చూచి, తన్ను దింప సాయం రమ్మని వేడుకొంటాడు. "కాని కులము దానఁగదియంగ వచ్చునే" అంటూ "వెలవెల నగుచున్" ఎట్టకేలకు రెండు రాళ్లు కాళ్ళకింద బెట్టుకుని యెక్కి "కొంకు కొసరిఁతలేక" కౌగలించి "వదనంబు నురంబునఁజేర్చి డింపుచోఁ జన్నులు సోఁకి మైఁ బులక జాలము నెక్కొన," మన్మథుని బారికి అగ్గమై వెన్నవలె కరిగిన మనస్సుతో లవణుడు కోరినదే తడవుగా, "నా యభిప్రాయం బెఱింగి తన తెచ్చిన పర్యుషితాన్నంబునం గామోపచారంబులం బరితోషితుం" జేసింది. దాని తండ్రి అనుమతిపొంది పెళ్ళాడి, నలుగురు కొడుకులను కని ఉండగా, ఆ దేశంలో రాజోపప్లవం ఘటిల్లి, ఊళ్లువిడిచి, వలసపోయారు. వెంటబడి ఆ పడతి తనను తిట్టుచు రాగా అడవులకు పోయి, ఆకటికి కొడుకులు చావగా, "వారిన్ బెడఁబాసిన బహుదుఃఖము దొడరిన సొదసొచ్చి మేను దొఱఁగితి నచటన్." ఈ కథ చెప్పగానే ఐంద్రజాలికుడు తిరోహితుడయ్యాడు. రాజు అంతఃపురంలోకివెళ్ళి ఈ విచిత్రానుభవం గురించి వితర్కించుకొని, మర్నాడు మంత్రులతో సహా వింధ్యపర్వత ప్రాంతానికి పోయి తన పగటికలలోని తావులన్నిటినీ పోల్చుకోగలిగాడు. కాబట్టి వసిష్ఠునిచేత మ.సిం. చెప్పించిన నీతి "స్ఫటికోపల రచితంబులగు విచిత్ర ప్రతిబింబంబులంబోలె నఖిల కార్యంబులఁ జేయుచు నిర్మల చిత్తుండవయి యుండుము."

జగన్మిథ్యావాదాన్ని తానుకూడా చేబట్టదలచుకొంటేనే, అప్పారావు మూల కథను యథాతథంగా అచ్చు గుద్దవలసి ఉండేది. అసభ్య శృంగార వికారాలను ప్రవేశ పెట్టదలచుకొంటేనే, మ.సిం.ను అనుకరించవలసి ఉండేది. అసలాయనకు మ.సిం. స్పృహలోనే లేదనుకోవాలి. మూలానికి వీలైనంత దాపుగానే ఉంటూ, తాను చేయబూనిన మార్పులన్నీ చేశాడు అప్పారావు. "భాషనేగాక భావమును

గూడ యథేచ్ఛముగ మార్చుకొనిన" యీ అనువాదాన్ని "ప్రత్యేక సంస్కృతి" అని రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు మెచ్చారు. (గు.శ.వి సం.)

లవణుడు చండాల స్త్రీని పెండ్లాడడం మాత్రమే ఈ రచనకు బీజమైనద నిగానీ, అందుచేత "తన సంఘ సంస్కారమున కనువుగా మార్చుటకు" ప్రయత్నిం చాడనిగానీ అనుకోవడం అప్పారావు ఉద్దేశించిన అనేక ప్రయోజనాలనన్నిటినీ ఒక్కముద్దగా చేసివేయడమే. పురాణకాలంలోని లవణుని కథలో "ఇరువదవ శతాబ్దపు అభ్యుదయ వాతావరణము" దోషమనికూడా విమర్శకులంటున్నారు. కావచ్చు, పదిహేడు పద్దెనిమిది శతాబ్దాల కాముక శృంగార వాతావరణముకూడా దోషమే అని మాత్రమేగాక, ప్రధాన రసమైన శాంతానికి ఈ వికృత శృంగారమే భంజకంగా పర్యవసించిందికూడా, అనాలి. అప్పారావు చొరనిచ్చిన శృంగారం పరమోదాత్త మైనది. లవణుని గుణోత్కృష్టకు తగినది. దుర్మోహ మలినస్పర్శ లేనిది. దాంపత్య పరమైనది, పైగా అనేక పూర్వజన్మానుభవ సంచయాన్నిబట్టి ఎంతో గాఢమైనది.

శృంగార సూచన మూలంలోనే ఉంది. అక్కడ ఆ భావం చండాల కన్యను ఆశ్రయించింది. అనువాదంలో, "క్రీడా పూర్వకముగా జనుచుండి లతా కుంజము లందాగుకొనుచు, వినోదముగ కటాక్షాది చేష్టల నొనర్చుచు తద్వారా తన యభిమతమును వ్యక్తమొనర్చుచు—"

దదామి భోజన మిదం భర్తా భవసి చేన్మమ

అన్నది. తనవంటి సామాన్యులు ఏదేని ఒక గొప్ప ప్రయోజనాన్ని ఆశించకుండానే లోకోపకారానికి పూనుకోరనికూడా చెప్పింది.

చండాలిక కాబట్టి జన్మతోబాటు మనస్సుకూడా నీచంగా సంకుచితంగా స్వార్థ దూషితంగా ఉండక తప్పదేమో, యో. వా. కర్తకే తెలియాలి. అప్పారావు విశిష్టత ఏదైనా ఉంటే, ఈ పట్టున ఆమె చేత వట్టి స్వార్థాన్ని గాకుండా ధర్మాన్ని ప్రసంగింప చేయడమే. తంత్రికని పట్టుకుపోతున్న చద్ది అన్నాన్ని ఎంత ఆగొని ఉన్నా, తనకు భర్తగాని ఇతరునికి పెట్టడ మన్నదే తనకు ధర్మ విరుద్ధమైన పని. మూలంలోకూడా రాజు ఈ మాటల ఆంతర్యాన్ని గ్రహించి "సువ్రతే" అని సంబోధిస్తూ, ఆపత్కాలం కాబట్టి వర్ణ ధర్మకుల క్రమాలను విచారింపక భర్త నౌతానని అంటాడు. మ.సిం. లాగా బిగికౌగిలినీ పాలిళ్ళ ఒత్తిడినీ ప్రవేశ పెట్టకుండా,

చంద్రోదయంతోపాటు ప్రణయ భావోదయాన్ని కూడా సూచిస్తూ ఈ వ్యవహారాని కంతటికీ ఒప్పందంకాగల రమణీయమైన వాతావరణాన్ని కల్పించాడు. మూలంలోని పూర్వ సంధ్యను తాను అపర సంధ్యగా మార్చుకొని, సమ్మోహన గుణంగల వెన్నెల రాత్రిని సాయం పిలుచుకొన్నాడు. పగలంతా నిద్రబోయి ఉన్నట్టుండి మేలుకొన్న లవణునికి అనిదం పూర్వ పరిచితమైన నూతన లోకంలా, సంజ కెంజాయలో ఒక 'వింతలోకం' జన్మాంతరానుభూతిలా కనులబడింది. ఇక్కడ ప్రతి మాటకూడా సార్ధకమే. ఆకాశాన వెలుగూ నీడా మెలగి చెలగుతున్నాయి. కోయిల జంటలు కూయుతున్నాయి.

చల్లగాలులు సాగి యలలుగ
జల్లుజల్లున రాల్చె పూవుల;
ఉల్ల మలరెను ;........ !

ఇంతలో దూరంనుంచి క్రమంగా దాపౌతూ, ఒక "వింత" గానం వినవస్తున్నది. ఆ శబ్దం "పూర్వవాసన"ను మళ్ళీ స్ఫురింపజేస్తున్నది. ఆకలి చిచ్చుగానీ, పడిన ఇక్కట్లుగానీ మరపునపడుతున్నాయి. చెట్లూచేమలుకూడ చెవులారవిని ఆనందిస్తూన్న ఆ కిన్నెరగానం చంద్రుడి గగనప్రయాణాన్నికూడా నిలిపివేసింది. ఆపాట తనగురించి పాడుతున్నట్లుగానే ఉంది లవణునికి; తనపేరే ఆమె నోటవెలువడినట్లుంది. ఎవరో గాని చిరపరచితురాలివలెనే ఉంది_ఆ శ్యామలాంగి పాటలాధరీ అయిన యువతి. ఆమెకు ఈ స్పృహలేదు. ఆ పాటలాధరి పాడుతున్నది ఎవరిని ఉద్దేశించీకాదు; ఆ పాట "చెట్లుచామలకై" పాడుతున్నదే. వికార రూపిణికాదు.... బింకంగల బెదురు నడకలు....అరమొగిడ్చిన కన్నులు .. దర్శనీయమైనరూపమే. రాజుకు ఆమెమూర్తీభవించిన "మంచి" అనిపించింది. వాళ్ళ సంభాషణకూడా, చిత్తవృత్తుల వలెనే, నిర్మలినమైనది. *

ఆ ముందునాటి నుంచి తిండి తిప్పలు లేకున్నా, ఈ కడుపాకలికంటె "అధికతర మొక వింత యాకలి" ఇప్పుడు మనస్సును బాధిస్తున్నది, అది తీర్చుకోడానికే తానామె వెనుదగిలి పోతున్నాడు రాజు. ఈ మాటలు విని, "అరమొగిడ్చిన కన్నుగవ"ను పూరా విప్పార్చి రాజువైపు మెల్లగా తిరిగి చూసింది. చూస్తే రాజుకు "పూర్ణ బ్రహ్మాండాధి రాజ్యము. పూనినట్లయ్యెన్". జవాబు చెప్ప

* ఇలా "ఆలంబనోద్దీపన విభావములను కడు జాగరూకతఁ గూర్చి శృంగార రసమునకు వలయు బీజమును" అందంగా చిత్రించుచున్నాడని రాంభట్ల లక్ష్మీనారాణశాస్త్రి.

కుండా, మళ్ళీ చూపులు దించుకొని ఆలోచించుకుంటూ పోతున్నప్పుడు, ఆ కన్యకు వెనకటి నడక బెడగులుగానీ వెనకటి పాట ఆలాపనగానీ దూరమయ్యాయి. మొగాన చింత. రాజే మళ్ళీ మాట్లాడాడు. ఈ సారి తన కడుపాకలీ, అన్నదాన పుణ్యం స్మరణకు వచ్చాయి. భర్తవు కమ్మని, ఆమె కాదు నోరు విప్పి అడిగిం దిక్కడ. కన్య కాబట్టి ముగ్ధ; పైగా అభిమానవతి; అంతకంటె కూడా, అడిగి లేదనిపించుకొంటే చులకన కాబట్టి ఆడది ఎప్పుడూ ముందుగా తన మనస్సు బయల్పరచుకోదు.

యో. వా. లోనూ జ్ఞా. వా. రా. లోనూ కనిపించే ఎగ్గుసిగ్గులులేని నీచ కులస్థురాలు కాదీ చండాల కన్య. పూర్వజన్మ వాసనలామెను పూర్తిగా విడనాడలేదు. రాజుకుకూడా ఆ స్పృహఉంది కాబట్టే, "భృత్యునౌదును" అనిన వెంటనే

చన్న బ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్ను మనసుకు కొంత తోచెడి

అనగలుగుతున్నాడు.

అన్యు నెట్లగుదున్ ?

అప్పటికే తానామెకు భర్త కాబట్టి, తండ్రికై ఉద్దిష్టమైన ఆ భోజనాన్ని, స్వధర్మ భంగం కాకుండానే, తనకామె పెట్టవచ్చు. అప్పటివరకు రాజు ఆమె కులాదికాల నడగలేదు. ఆమె ముఖంమీద ఫలానా కులమని రాసిలేదు. మాట తీరుగానీ, నడకహుందాగానీ, భావౌన్నత్యంగానీ తన జన్మను అతనికి పట్టివ్వలేదు సరిగదా, గౌరవభావాన్నే కలిగిస్తున్నాయి. తాను చండాల కన్యగనక అతనికి తన చేతిభోజనం తగనిదని బాధపడుతూ ఆమె తన కులాన్ని చెప్పుకోవలసి వచ్చింది. ఇంతదాకా ఆమెను గౌరవిస్తూ పూర్వజన్మలో తన ధర్మపత్నిగా గుర్తిస్తూ ఉన్న ధార్మికుడు గనక, రాజు చెవులు మూసుకొని గంగలో దూకలేదు. పురాణ కాలంలోనే గాక ఇరవయ్యో శతాబ్దంలో ఉంటూన్న అనభ్యుదయవాదులు కూడా వెనుదిరిగిపోయి ఉందురు. పురాణ కాలమే మేలులాగుంది. ఆపత్కాలంలో కులం గిలం లెక్కకురాదు. చచ్చిన జంతువుల మాంసం మహర్షులకైనా కటికి కరువులో భోజ్యమే అయిందొకప్పుడు. కులం పేరు చెప్పి చిన్నబుచ్చుకొని, కళ్ళు తడి చేసుకొన్న ఆ కన్యను చూచి, రాజు ఖిన్నుడయ్యాడు. కాబట్టి ఏ సూచననూ వీలు చేసుకొని లవణునిచేత వర్ణ వ్యవస్థ గురించి ఉపన్యాస మిప్పించలేదు అప్పారావు. ఆమె మనస్సులోని ముల్లు ఊడదీయాలి. జన్మనుబట్టే యోగ్యతాయోగ్యతలు కలగవు

లెమ్మని ఊరడించాలి. ధర్మాలలోకెల్లా "పరమధర్మము" మానవ ధర్మం - అన్ని కులాలకూ జాతులకూ సాధారణమైనది ఈ మానవత్వం; తనంత తానే అది మాననీయం; దానికి అడ్డుతగిలేవన్నీ అధర్మాలే; ధర్మాధర్మాల విలువను ఆ నికషోపలం సాయంతోనే నిర్ణయించాలి. కాబట్టి రాజు తనలోతాను కులంపేరిటి దారుణమైన అధర్మాన్ని గురించి వితర్కించుకొన్నాడేగాని, నోరువిడిచి ఉపన్యసించ బూనుకోలేదు. తన పూర్వీకుడైన హరిశ్చంద్ర చక్రవర్తిని భ్రమపెట్టి ధర్మంనుంచి తొలగదోయ వచ్చిన మాతంగ కన్యల్లాంటిదే ఈవిడ అయితే, ఇలా మాటాడి ఉండడు.

తెలివి యొలికెడి తేట కన్నులు
మురువు గులికెడి ముద్దు మోమును
వేల్పు చేడియలైన నేరని
గాన మాధురియున్,
చిత్తరువులందైన గనని వ
విత్రరూపపు సౌష్టవంబును,
ఉత్తమోత్తమ జాతి లక్షణ
యుక్తి సంపదయున్,

ఉన్న ఈ కన్యలో ఏ కొరతా కనిపించనప్పుడు, కులధర్మాల ఊసెందుకిక? ఇంత మంచిదికూడా కులంవల్ల మాలల్లో జమపడి, మంచితనం లేకున్నా కొందరు కులంవల్లనే ఉచ్చస్థితిలో ఉండగలుగుతున్నారంటే, మనుషుల ఆలోచనాక్రమంలోనే పెద్ద పొరబాటేదో ఉండాలి. ఈ మంచితనంవెంట, కావలిస్తే, తాను సహజీవనం చెయ్యగలడు. ఈ మూర్తీభవించిన మంచితనాన్ని, నిశ్శంకగా వరించగలడు. ఈ కన్యను పెళ్ళాడాక, మరొక భార్య తన కక్కర్లేదు. తన హృదయంపు రాజ్యాన్ని ఆమెకు "నిస్సపత్నము"గా ఇచ్చుకొనేందుకు సిద్ధపడినాడు. రాజునోరువిప్పి కుల ధర్మం గురించి "ఉపన్యసించింది" ఒకే ఒక్క వాక్యం, ఇంతాజేసి: అంతకు ముందున్నదంతా అతని ఆలోచన మాత్రమే. ఆయన "ఉపన్యాసం" ఇంతమాత్రమే;

మంచి చెడ్డలు మనుజు లందున,
యెంచి చూడగ, రెండె కులములు:
మంచియన్నది, మాలయైతే,
మాలనే, అగుదున్.

వట్టి ఆపద్ధర్మంగానే మూలంలో ప్రసక్తమైన దానిని లవణరాజు శీలానికి ఔచిత్యాన్ని కలిగిద్దామనే, అప్పారావు సామాన్య మానవధర్మంగా వర్ణించాడు. ప్రాణాలు నిలుపుకోవడమొక్కటే యో.వా.లో వలె అతని ధ్యేయంకాదు. జ్ఞా.వా.రా.లో వలె వట్టి మోహావేశంకూడా కారణంకాదు.

ఇంకా ఆమె తొక్కిసలాడుతుంటే, చొరవచేసి చేయిపట్టి కౌగిలించి ముగ్ధా సహజమైన వ్రీడాభారాన్ని తొలగించి, చంద్రుడుకూడా ఈవిచిత్రమైన వివాహాన్ని చూచి ఆపుకోలేక నవ్వేటట్లుగా, చేబట్టాడు.

యో.వా. లోనూ, జ్ఞా.వా.రా. లోను ఆమె తండ్రిగానీ, ఆమె ఊరుగానీ హేయాతిహేయ వర్ణనంతోగూడిన వస్తువులుకాగా, అప్పారావు ఔచిత్యదృష్టితోనే వాటి బీభత్స రూపాన్ని తుడిచి వేశాడు. ఎంత శుభ్రమైన పరిసరాలలో, శిష్టమైన భావాల మధ్య పుట్టి పెరగండే, ఈ కన్యలో ఇంతటి వర్చస్సుగానీ, సౌశీల్యం గానీ ఉంటాయి : ఆమెను బట్టే ఆ వస్తువులన్నీ మారాలి ; ఆమె కోసమే అవి మారాలి ; ఆమెను పరిణయమైన లవణుడు ధర్మవేత్త, గుణగ్రహణ కుశలుడు గనక అతన్ని బట్టి అతని కోసం కూడా ఇవి మారాలి ; అందుకోసమే, ఆ పిల్లను కన్నతండ్రి జ్ఞాని కావలసి వచ్చింది ; రాజర్షిలా కనిపించవలసి వచ్చింది ; నీచవృత్తుల పాలై యుండిన స్వజనుల జీవన విధానాన్ని సంస్కరించి మంచి బుద్ధులను పెంచే శుభ్రమైన పరిసరాలకు తెచ్చిన సంస్కర్త కావలసి వచ్చింది. లేకుంటే, యో.వా లో లాగున చండాల వాటిక అప్పారావు కావ్యంలో ఇలా ఉండవలసి వచ్చేది :

> ఆ చండాల వాటిక యందు కోతులు, కోళ్లు, కాకులు ముక్కలు ముక్కలుగా కోయబడి పడియుండెను. రక్తముచే తడుపబడిన నేలపై దోమలు వ్రాలుచుండెను. ఎండ పెట్టబడిన తడి ప్రేవులపై పక్షులు తిరుగాడు చుండెను. ఎండుచున్న క్రొవ్వు గృహ బహిర్ద్వారమున పటపటమ, నచట పక్షులు వచ్చి చేరుచుండెను.

అప్పారావు చేసిన మార్పులు, "అభ్యుదయ" దృష్టితోనే గాక పాత్రౌచిత్య దృష్టితో చేసినవేననిపిస్తుంది. ఘోరాతిఘోరమైన నీచాతినీచమైన వాతావర ణంలో కూడా మేలిభావాలు ఉండగలవని, మహాభారతాంతర్గతమైన ధర్మవ్యాధుని వృత్తాంతం తెలియపరుస్తున్నది గదా (అరణ్య పర్వము), అప్పారావు కూడా అలాచేసి ఉంటే సరిపోయేది కాదా, అనవచ్చును. మంచిదైనా చెడ్డదైనా "నిజ కులోచిత పథము"ను తప్పి నడవగూడదని ధార్మికులంటారు. కాబట్టి మన భాగ్య

మింతే అని మనస్సును సమాధాన పెట్టుకొని ఉండాలంటాడు ధర్మవ్యాధుడు. పాపం చేస్తే బ్రాహ్మణుడు శూద్రునికంటే కూడా నీచుడే;

సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు
నతఁడు సద్ద్విజుండ....

అయితే ఏమాయె? బ్రాహ్మణుని సుస్థితి శూద్రునికీ, శూద్రుని దుర్గతి బ్రాహ్మణునికీ, తమతమ పనుల మంచి చెడ్డలమూలంగా, కలిగేనా? అప్పారావు రచనలోని చండాల వృద్ధుడు ధర్మవ్యాధునివంటివాడు కాడు. కులవృత్తిని విడిచాడు. పశుపోషక వృత్తి సాగిస్తున్నాడు. ఇతరులనూ ప్రాజ్ఞులుగా చేశాడు. "....హింస యిట్టిది యహింస యట్టిదని విభాగింప నెవ్వరికి నేరనగు?" నని ప్రశ్నించుకొని, లోకంలో హింస సేయని వాడే లేడంటూ,

హింస తెరువున కెడగల్గి యేఁగవలయు
నదియె చూవె యహింస నా నతిశయిల్లు.

అని, తాను మాత్రం జీవహింసచేయక ఇతరులు హింసించి తెచ్చిన అల్పమృగాల మాంసాన్ని అమ్ముకొంటున్న ధర్మవ్యాధుడెక్కడ,

జంతు హింసను చేయనొల్లము
భూతదయ మతము!

అనే ఈ దివ్య తేజస్సుగల ముసలివాడుచెప్పే "వేదవాక్కు" లెక్కడ? పరోక్షంగా నైనా జీవహింసకు తోడ్పడే ధర్మవ్యాధునికంటె ఇతడే ఎక్కువ ధార్మికుడు. అతని రూపుకూడా గుణానుగుణమే.

పండు గెడ్డము; నిండు కన్నుల
నిండ శాంత రసంబు; పలుకుల
కడలి గాంభీర్యంబు; యొడలిని
దివ్య తేజంబున్.

కనుకనే ఆ పిల్ల అంతటిదయింది. "పరము మరవక యిహమునందున మనెడు మర్మము" తండ్రి నేర్పగా నేర్చి, తన ఆత్మలో "ఇహములోపలి మంచి యంతయు" యిమిడించుకొని, లవణుని పాలిటికి "ముక్తికాంత" కాగలిగింది.

ముసలివాడు నివృత్తి మార్గం అవలంబించి యోగమున ప్రాణత్యాగం చేశాక, ఆ మాలపల్లెలో అశాంతి ప్రబలి, వ్యవసాయం మూలబడి పశుమాంస భక్షణ మళ్ళీ అలవడి, ఎక్కడి వారక్కడ ఊరు విడిచిపోగా చక్రవర్తుల్లాగున్న తన పిల్లలకు తిండిపెట్టలేని దీన దశలో లవణుడున్నప్పుడు, ఈ "ముక్తికాంత" చేసిన ఉపదేశం: ("స్మితముఖియై" చేసింది, జ్ఞా. వా. రా. లో వలె తిట్టుతూ కాదు)

కడకు జేరితి మీ భవంబున;
తడవు లేదిక; మనసు తిప్పుకు
గడగవలె రాబోవు భవమున
జ్ఞాన సంపదకై.

చితిజొచ్చి ప్రాణత్యాగం చేశారు. ఇంతవరకూ కల. అపైన నిండు కొలువున నుంచి రాజు వ్యాకులచిత్తుడై అనుభవ తత్వంగురించి వితర్కించుకొంటున్నప్పుడు, ద్వారపాలకుడు వచ్చి, ఎవరో ఆగంతుకులు వేచియున్నారంటాడు. వచ్చింది, పితృసఖుడైన సింధుదేశాధీశ్వరుడు లవణునికి కానుకగా పంపిన తన కుమార్తె, సింధుదేశోద్భవం కాబట్టి విశిష్టమైన సైంధవమూ. ప్రవేశిస్తున్నారు. లవణుడామెను చూచాడు. చూస్తుండగానే గుర్తించాడు. తన జన్మ జన్మాల ధర్మపత్ని! చండాలిక రూపంకాదిప్పుడు. ఇది మరొక జన్మ. ఇప్పుడు సింధురాజ పుత్రిక. విస్మయమూ, సంతోషమూ కలుగుతున్నాయి.

"వచ్చితివ నా ప్రాణసఖి;" యని
గద్దియను చేర్చెన్.

ఈ ముగింపు అప్పారావు స్వకపోల కల్పితం. "జనాంతర సహృద" విశేషాన్ని నిరూపించడం కోసమే ఈచేర్పు. ఈ కథలో శృంగారం ఉంది. శాంతానికీ దానికీ ఉప్పునిప్పు. అవ్యవధానంగా వైరి రసాలను సమసింపజేయడం ఆలంకారిక సిద్ధాంతం ప్రకారం, రసభంజకం.* కాబట్టి రససిద్ధాంతులు పెద్ద రాద్ధాంతమే

* శాంత. శృంగార రసాలు "అవ్యవధాన విరోధులు." రసములకు వ్యవధానము రసాంతరము వలనగాని యేర్పడదు. అనగా - నొక రసము స్ఫురించి తద్విరుద్ధమగు రెండవ రసము స్ఫురించు లోపల మఱియొక రసము స్ఫురించ వలయును. స్ఫురించునట్లుగా గూర్పబడియుండవలయును. అట్లున్ననే అవ్యవధాన విరోధుల విరోధము నిది తీర్ప గలుగును. వ్యవధాయకమగు రస మీ రెంటికిని నవిరుద్ధముగానే యుండి తీరవలయును. లేనిచో నిచటనే రస విరోధము ప్రసక్తించును. ఆంధ్రధ్వన్యాలోకము

చేశారు. అప్పారావు రససిద్ధాంత స్పృహతో ఈ రచన చేశాడని ఎవరూ అనరు కాబట్టి రసచర్చకు తావులేదంటూనే "శృంగార రసస్పర్శగల భావములు కొన్ని లవణరాజు కలయందు కలవు. రసత్వము వానికి సిద్ధించలేదు" అని పూర్వోదాహృత వ్యాసంలో కోటగిరి విశ్వనాథరావుగారన్నారు. దానిపై విశ్వనాథరావుగారి రస చర్చ 'ప్రతారణం' మాత్రమే అని నిరూపిస్తూ శ్రీ కో. వా. పేరుగల ఒక ఉభయ భాషావేత్త రాసిన వ్యాససారాంశాన్ని[9] ఈ దిగువ ఇవ్వడంకంటె నేను చేయదగినది లేదు :

....ఇందులో శృంగారం అంగిరసం ; అద్భుత, శాంత, కరుణ విప్రలంభాలు, అంగరసాలు. ఐంద్రజాలికుని గుర్రం ఆలంబనంకాగా, ఇంద్రజాలంమూలంగా రాజునకు కలిగిన నేత్రవికాసాదులు చేష్టారాహిత్యం సందేహ పూర్వకమైన ఆలోచనం వగైరా, అద్భుతాన్ని అంగరసం కావిస్తున్నాయి. "విభావాది పౌష్కల్యంలేకున్నా రసస్ఫూర్తి కిబ్బందిలేదు."లవణునికి గాకున్నా, 'పతాక'గా నిబంధింపబడిన మాలపెద్దకు సంబంధించి శాంతరసం అంగరసాలలో మరొక టైంది. దీనికి స్థాయీభావమైన తృష్ణాక్షయ సుఖమునకు కావ్యంలోనే ఎన్నో సూచనలున్నాయి. నాయిక యొక్క సుస్వభావాదులకు ఇది పరిపోషకం కాబట్టి కథలోలగించి అంగత్వార్హత పొందింది. చనిపోయిన ఆలుబిడ్డలను ఆలంబనంచేసుకొని, వారిగురించి దుఃఖాన్నిపొందుతూ, అనుభవాలను కాదనేవారిపై కోపపడుతూ, కరుణ విప్రలంభం లవణరాజుచేత పోషితమైంది. ఆలంబనం తుదముట్టా నశించిపోయిందని రాజు అనుకోలేదు. తనలాగే వాళ్ళుకూడా జీవించి ఉంటారనుకున్నాడు. ప్రాణసఖిని చూపమని అడుగుతున్నాడు. ఆ మాయదేశం యెక్కడ, నాబిడ్డలెక్కడ, అంటున్నాడు. అయినా ఇదమిత్థంగా తన ఆలుబిడ్డ లొకచోట ఉన్నారని తనకు తెలియదు. తన అనుభవసిద్ధాంతాన్ని అనుసరించి తను మరణించి బతికి ఒక చోట ఉంటున్నానని మాత్రం నిక్కంగానే తనకు తెలుసు. వారి విషయం అలాక్కాదు. ప్రత్యాశ లేదు కాబట్టి ఇక్కడ కరుణ విప్రలంభం అంగరసం అయింది.

ఇక ప్రధాన రసమైన శృంగారం – రతి విషయకమైన వాంఛ ఆది నుంచిన్నీ రాజు మనస్సులో బీజప్రాయంగా ఉంది. కథకూ రసానికీ ఏకముఖత్వం

ఉంది. నాయిక మొదట్లో అనురక్త కాలేదని అనడం, కాకుంటే, దోషమని నిర్ణయించడం, అసంగతం. కాళిదాసు తన శాకుంతలంలో, మొదట దుష్యం తుణ్ణే అనురక్తుణ్ణిగా చూపాడు. వ్యాసుడూ అంతే. నాయికానురక్తిని ఇంగితాల ద్వారా గ్రహించి నాయకు డనురక్తుడు కావాలని మాత్రమే, ఆలంకారికుడైన రుద్రుటు డన్నది. ఇక్కడ ఈ కావ్యంలో నాయిక పాడే పాటలో తనపేరే విని పించినట్లు లవణుడను కొన్నాడు కాబట్టి ఆమె ఇంగితం తెలిసింది. అలా తెలి శాకనే తన అనురక్తిని తెలిపాడు. దేవుడు నీకు అన్ని శుభములు కూర్చు గా వుత మని రాజన్నప్పుడు, నీవెవరి గురించి గానం చేస్తున్నావో ఆ చక్రవర్తిని నీకు భర్తగా చేయుగాత మని కూడా అర్థం ఉంది. కనుకనే ఆమె సిగ్గుపడింది.

నాయికాలక్షణాలు ఆ మాలెతలో లేవని మరొక విమర్శ. శకుంతల మేనక కుమార్తె కాబట్టి సామాన్య. తండ్రిగుణాలు మాత్రమేగాక, తల్లిగుణాలూ ఉండాలి. అలాంటి నాయికల్లో కూడా గుణాతిశయాన్ని సృష్టిస్తే వాళ్ళు నాయిక లుగా అర్హత పొందగలరు. అప్పుడు జన్మకు సంబంధించిన దోషాలు తొలగి పోతాయి. ఇందుకోసమే మాలెత తండ్రి రాజర్షి సన్నిభుడు కావడం, మాలెత "ముక్తికాంత" గావడం, ఆమె తత్వజ్ఞాని కావడం కూడా జరిగింది.

"ఉద్దీపనాదులు సుష్ఠుగ లేవు" అనడం నిజంకాదు. నాయికా నాయకుల రూప యౌవనాదులు, చేష్టలు, అలంకారములు, తటస్థములు (ప్రకృతి) ఉద్దీపన ములు. ఇవి చక్కగా నిరూపింపబడ్డాయి. కన్నీళ్ళు, గగుర్పాటు, వగైరా ఉన్నాయి. ఆలస్యం, చింత, విషాదము, నిర్వేదము, చపలత, మనస్సంకోచము హర్షము వగైరా వ్యభిచారి భావాలు నాయికలోనూ; మతి, గర్వము, విషాదం, ఔత్సుక్యం, ఆవేగం, ధృతి అమర్షాదులు నాయకునిలోనూ ఉన్నట్లు కవి చూపించాడు.

"మాలెత అందమునకు మురిసి వివాహము చేసికొనుటకు సమాజమును దూషించుట వలన లవణునిలోని భయంకర కాముకత్వము వెల్లడి యగుచున్నది" అని మరో నింద. మరి దుష్యంతుని మాటేమిటి? అందమునకు మురియడమే కాముకత్వమౌతుందా? దుష్యంతుని ప్రతిలోమ వివాహంలా కాకుండా లవణుడు అనులోమ వివాహాన్నైనా చేసుకొని, దుష్యంతునికంటె తక్కువ దోషాన్నే (కాముకత్వం) ఆచరించాడు. సమాజ విమర్శ, కాళిదాసులోనూ ఉంది. పశుహింస చేయకున్నా నిర్దయుడైన బ్రాహ్మణుడు నింద్యుడే. సమాజ

గతాలైన లోపాలను నిరూపించడం, ప్రతి కవీ చేసేదే. ప్రధాన కథకు పరిపోషకమయ్యేలా ఆ పని చేయడం, మహాకవుల లక్షణం. కడుపాకలికంటె భిన్నమైన "వింత యాకలి" కాముకునిదికాదు, ప్రేమికునిది; పైగా మాలెత తన పూర్వజన్మలో పత్ని, అనే స్పృహ ఉంది.

ఇరవయ్యోశతాబ్దపు 'అభ్యుదయ' వాతావరణంకాదు ఇందులో ఉన్నది, "*యోగవాసిష్ఠం*నుంచి నేటి వరకు ఉన్న వాతావరణానికి స్ఫూర్తి". మంచి అనేది మాల అయ్యే పక్షంలో నేనూ మాలనే అవుతానని లవణు డనడం, ఆదిశంకరుడు "చండాలోస్తు సతు ద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ" అని చెప్పిన భావానికి ప్రతిధ్వంది.

రసవిరోధం ఉన్నప్పుడు ఇతివృత్తాన్ని మార్చి తీరాలనడం, ఆనంద వర్ధనాచార్యుల ఆశయం. *యో. వా.*లోనే ఎన్నో అసంబద్ధవిషయాలున్నాయి. ఆ కథను తీసుకొని "రసభంగం వా సవికతాభంగం లేకుండా క్లుప్తంలో వివిధ రసాలను కాళిదాసులాగా లగింపింప చేశాడు." ఆ చేయడంలోనే ఈ మార్పులు....

శాంతరస ప్రధానంగా మూల కథను మార్చుకొని ఆయంగిరసమున కను గుణమైన వర్ణనలను మాత్రమే ఒకటి రెండు సార్లు చేశారని ఒకచోట చెప్పి నాలుగు పుటల తర్వాత "ఈ కథలో నే నిదివరకు మనవి చేసినట్లుగా శృంగార రసము అంగి; శాంతాద్భుతములు అంగరసములు" అని డా. సి. నారాయణరెడ్డి గారు రాశారు. అయినా ఈ కావ్యం గురించి తమ గ్రంథంలో వారు చేసిన చర్చ ఆసక్తిదాయకంగానే ఉంది. మూలకథను మార్చడంలో అప్పారావు ఉద్దేశం, "చిత్త సంబంధమైన బంధములకు సింహాసనము" వేయడమే, అని ఆయన వివరించారు. [10]

## 4

జమీందార్ల పెంపుడు బిడ్డగానూ, బ్రిటిష్ పాలకులకు పరమ విధేయుడుగానూ విమర్శకుల చేత ముఖానికి మసిపూయించుకొన్న అప్పారావురాసిన గేయాలన్నిం టిలోకీ, విశేష ప్రజాదరణపొందిన గేయం *దేశభక్తి* తెలుగు జాతికి అనధికార జాతీయ గీతమై ఉన్న ఈ రచన, దేశభక్తుల మనుకొనే వారికే కనువిప్పు. మద్రాసున 1909లో జరిగిన కాంగ్రెసు మహాసభను దర్శించి వచ్చాకనే, ఈ రచనకు ప్రోత్సాహం ఏర్పడింది. అప్పటికే బంకించంద్రుని *వందేమాతరం* గేయం,

జాతీయోద్యమ తరంగాగ్రాన నిలిచి ఉంది, దానికి పోటీగా కాదు, అప్పారావు తన గేయన్ని రాసింది: దానికి విరుగుడుగా కొంతవరకు.

ఒక మారు గిడుగురామమూర్తితో బంకిం గేయం గురించి ముచ్చటిస్తూ అందులో ప్రసక్తాలైన జడపదార్థాలను పేర్కొంటూ, ఇలా అన్నాడని అప్పారావు కుమారుడు రామదాసు పంతులుగారు చెబుతున్నారు :

> పెద్దకొండలు, నదులు, వృక్షాలు, నామాతలు– ఇవా ప్రజకు ధైర్యసాహసాలు, ఉత్తేజమూ కలిగించేవి ? అన్ని కాలాలలోనూ ఇవి స్థిరంగా ఉండేవే. ఒక్కొక్కయుగంలో ఒక్కొక్కజాతి ప్రజలు ఆయాప్రదేశాలలో ఉంటారు. వారిలో మహానుభావులు వారి గుణగణాలు జాతి జీవితం – ఇవే వర్ణనీయమైనవి. ప్రజలలో చైతన్యం లేవగొట్టే వివే.

అప్పారావు సరిగ్గా ఇవే మాటలు అన్నాడో లేదో గాని, అని ఉండదగిన మాటలే. అప్పటికింకా రవీంద్రుడు తన *జనగణమన* రాశాడో లేదోకూడా. లేక, ఈ రెండుగేయాలు కవలపిల్లలో! బెంగాలు విభజనను రద్దు పరుస్తూ ఢిల్లీ దర్బారులో (1911 డిసెంబరు) పంచమ జార్జిచక్రవర్తి (GeorgeV) ప్రకటన వెలువడ్డాక, కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో మితవాద పక్షనాయకులు చక్రవర్తిని ప్రశంసిస్తూ గేయాన్ని రాసి పెట్టవలసిందని అశుతోష్ చౌధురీద్వారా రవీంద్రునికి కబురు పెట్టారు. ఆయన కుపితుడయ్యాడు. ఆ కోపం నుంచి వెలువడిందే, నేటి మన జాతీయగేయం ! జార్జి డిసెంబరు 30 న కలకత్తా నగరం సందర్శించినప్పుడు ఈ నాయకులు ఆయనకు వినిపించిన గేయం ఇది కానేకాదు, హిందీ భాషలో మరొకరు రాసిన గేయం. రవీంద్రుని గేయంలోని 'రాజేశ్వర' సార్వభౌమపరమైన సంబోధనం కాదు, "సంకట దుఃఖత్రాత" అయిన సర్వేశ్వరుడికే ఆ పిలుపు. ఈ గొప్పగేయం దేశభక్తినీ, దైవభక్తినీ కలగలిపింది. ఒక ఆధునిక రచయిత వర్ణించినట్లు –

> It is the song of an ancient land, fallen on evil days, and now reborn to greatness: in the rosy dawn that follows a night of darkness, India salutes the Ruler of her Destiny, the king of kings himself. 11

ఇక్బాల్ Iqbai రాసిన *తరానా - ఇ హిందీ* (Tarana – I– Hindi) గేయం కూడా దేశభక్తి విషయంలో దేనికీ తీసిపోని రచన. యావత్ప్రపంచంలోను

హిందూస్థానమే ఉత్తమోత్తమమైన దేశమని, వేలాది నదులామె ఒడిలో బిడ్డలై ఆడుకొంటున్నాయని, స్వర్గానికే అసూయ కలిగేంత రమణీయమైన ఆరామమని, ఆ తోటలోని బుల్బులి పిట్టలే ప్రజలని, ఒకరి నొకరు ద్వేషించుకొమ్మని మతం బోధించదని చెబుతూ –

హిందీ హైఁ హమ్, వతన్ హై హిందోస్తాఁ హమారా

అంటూ ముగిస్తాడు ఇక్బాల్.

అప్పారావుకు మరింత దగ్గర్లో సుబ్రహ్మణ్య భారతి ఉన్నాడు. అప్పారావు మిత్రుడైన జి. సుబ్రహ్మణ్యయ్యరు స్థాపించిన *స్వదేశమిత్రన్* పత్రికలో ఉపసంపాదకుడుగా ఉంటూ, *స్వదేశ గీతంగళ్* (1908) రచించి ఉన్నాడు. మిగతా గీతాలకంటె, ఈ దేశాభిమానిపై అప్పారావు గేయంతో ఎక్కువ సరిపోలుతాయి. * సమకాలికుల భావప్రవంతినుంచి పూర్తిగా తప్పుకొనిపోవడం ఎవ్వరికీ సాధ్యం కాదు. సమస్యలకు పరిష్కారమార్గాలు, కవుల వ్యక్తిత్వంలోని సూక్ష్మభేదాలను బట్టి భేదిస్తాయి. ఈయుగానికి ఆంధ్ర దేశంలో ఆద్యుడైన వీరేశలింగం పంతులు అభిప్రాయాలను గమనిస్తే తదనుసారులైన ఇతరుల భావక్రమం తెలుస్తుంది. అప్పారావు తన గేయం రచించేందుకు ముప్ఫయ్యేళ్ళ క్రితమే వీరేశలింగం ఇలా హెచ్చరిస్తున్నాడు :

....దేశాభిమానుల మని నటించెడు మహానుభావులందఱును దేశక్షేమ[మే యణుమాత్రమైనను తమ మనస్సులలోనున్న పక్షమున, పనికిమాలిన పొగడ్తలు పొగడి జనులను గర్వితులను జేసి చెడఁగొట్టుటకు తోడుపడక సత్యమును దెలిపి చేతనైనంతవఱకు వారికన్నులు తెఱపి వారభివృద్ధి పొందుటకుఁ దగిన మార్గమును జూపుటకయి పాటుపడవలెను.

ఓ మహాశయులారా ! పూర్వాచారములను భూషించుటయు నూతనాచారములను దూషించుటయు దేశాభిమానము కాదు. దేశమునకు భంగకరముగానున్న దురాచారములను తొలఁగించుచు క్షేమకరములుగానున్న సదాచారములను నెలకొల్పుచు దేశాభివృద్ధికై పాటుపడుటయే నిజమైన దేశాభిమానము.12

ఇంగ్లీషు తాత్వికుల The Greatest Good of Greatest number సూత్రాన్ని వివరిస్తున్నట్లు మరోమారు ఇలా అన్నాడు :

---

* చూడు : తమిళ నవయుగప్రవక్త సుబ్రహ్మణ్య భారతి : చల్లా రాధాకృష్ణశర్మ ముఖ్యంగా "భారతి—గురజాడ, ప్రకరణం : పు. 108-119.

నిజమయిన దేశాభిమానము గలవాఁ డెల్లప్పుడును జన సామాన్యము యొక్క క్షేమ లాభములనే చింతించుచు .... దేశములో సాధ్యమయినంత మందికి సాధ్యమయినంత యధిక సౌఖ్యమును గలిగించుటకయి యుండవలెను.13

1880 కి 1912 కూ మధ్య కాంగ్రెసు సంస్థ దేశాభిమానాన్ని గుత్త గొన్నది. రాజకీయంగా మితవాదులైనవాళ్ళు సంఘాభ్యున్నతి విషయాలలో విశాలభావాలు కలిగిన వాళ్లేగాని, కాంగ్రెసులో వాళ్ళ పలుకుబడి నానాటికీ తీసికట్టుకాగా, 'జాతీయవాదు'లని పేరుబెట్టుకొన్నవారు గణపతి, కాళీ పూజలతో దేశాభిమానంతో మతాన్ని రంగరించి, సంప్రదాయం పేర సంఘస్థితిని సమర్థిస్తూ, రాజకీయ అతి వాదులై కూడా సాంఘిక మితవాదులయిపోయారు బంకించంద్రుని మొదలు అర విందునివరకు వీరి వైఖరి, హైందవ ప్రత్యేక తత్వమే. మరొకవైపు సురేంద్ర నాథ బెనర్జీ మొదలు బిపిన్ చంద్రపాల్ వరకు, ఉపన్యాస ప్రాగల్భ్యమే దేశభక్తికి గీటు రాయిగా గణనకు వచ్చింది – కనీసం సామాన్య ప్రజల హృదయాలలో. ప్రజాక్షేమం అడుగున పడింది. ఈ స్థితిలో పురోభివృద్ధి పంథాను ఎవరెవరి భావ బలానుగుణంగా వారు సూచింపవలసి వచ్చింది. ఇప్పుడు వెలువడిందే, భవ్యతర భవిష్యత్సమాజ నిర్మితికై భావనాత్మకంగా తయారీ చేసిన blue-print లాంటి అప్పారావు గేయం.

టెనిసన్ కవి (Tennyson) రచించిన "Love Thou Thy Land" అనే గేయం అప్పారావు మనస్సున ఉండవచ్చునని డా. నారాయణరెడ్డి గారంటున్నారు; ఆరెండింటి పోలికలూ చీలికలూ వెలికిదీసి చూపుతున్నారు. ఇదేగాక, ఆ కవేరాసిన Ode Sung At The Opening Of the International Exhibition గేయం కూడా కొన్ని భావాలను అప్పారావు కిచ్చి ఉండవచ్చు.

అయితే వీటిలో ఏ ఒక్కటీ అప్పారావుగేయానికి మూలమై ఉండదు. వాట న్నిటి సమిష్టి ఫలితమే కావచ్చునిది. "వేకువనే నిద్రలెమ్ము" వంటి ఉద్బాటనలతో నిండి, ఇది కవిత్వం కానేరదని విమర్శకులంటున్నారు. మరొకవైపు, రామాయణ భారతాది ఇతిహాసాల కున్న విలువ ఈ ఒక్కగీతానికే ఉన్నదని, ఇది మహా కావ్యమని, ఆధ్యాత్మిక యాత్రలో భగవద్గీతకు గల స్థానమే దీని కున్నదని, సార్వ కాలికమూ సార్వలౌకికమూ అయిన సందేశాన్నిస్తున్న ఈ రచన "పావురంలాగ ప్రశాంతంగా రవళిస్తూనే సింహంచేసే క్ష్వేళాధ్వనిని స్ఫురింప జేస్తుంది;" "ఏక కాలంలో ప్రభు సమ్మితంగాను, కాంతా సమ్మితంగాను కూడా" మానవత్వాన్ని

ఉపదేశిస్తున్నవని శ్రీశ్రీ రాశారు.[14] ఈ రెండు అభిప్రాయాలూ రెండు అగ్రాలు: అతి మాత్రాలనక తప్పదు. మల్లవరపు విశ్వేశ్వరావుగారు కవిగా స్పందించి రాసింది మరింత ఆమోద యోగ్యంగా ఉంది.

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్

అనే రెండు చరణాలను తీసుకొని తనలోకలిగిన భావాంకురాల నిలా వర్ణిస్తున్నారాయన:

> ఇక్కడ 'మనుష'లని అనగానే మనుష్య భౌతిక స్వరూపం నా కళ్ళకు కట్టదు. అమూల్యమైన మానవ జీవితమూ, జీవితకేంద్రములోని పిపాసలూ, పిపాస పరమావధిని చేరుకునే ఆందోళన, ఆందోళన విజృంభించి పరిణతి గాంచేందుకు తగిన సాధన సంపత్తి నాహృదయాంతరంలో ప్రవేశిస్తాయి.
>
> ఇట్టి ఖండికలలో శ్రీ గురుజాడ కవిలో తెలిసీ తెలియకుండానే ఒక నూతనమైన రూపకల్పన విధానం అంకుర ప్రాయంగా వ్యక్తమయింది.[15]

ఇలాంటి భావచిత్రాల (Imagery) అర్థపుష్టిని గ్రహించి వివరించేది సహృదయులైన విమర్శకుల పని. దానిని ఎందరో చేయరు. అందుకు ఓపిక మాత్రమేగాక భావమూలాలకు వెళ్ళగల పదనైన మనస్సుండాలి.

ఈ గేయం ఇస్తున్న సాంఘిక సందేశం క్లుప్తంగా ఇది: భౌతిక సంపత్తి, కళావిలసనం, వ్యాపార వాణిజ్యాల ఇతోధికాభివృద్ధి, ప్రగతి దృష్టి, సార్వత్రిక శాంతి, పరస్పర సాహాయ్య సహకార వైఖరి, జాతులమైత్రి, మతాల ఒద్దిక, సమాజంలోని అడ్డుగోడలను కుప్పగాకూల్చి ఆటంకాలను రద్దుజేసి దేశమంతటా ఒకే ఆర్థిక విధానాన్ని అమలుపరచి స్వదేశీ పరిశ్రమలు పెంపొందించుకొని ఇతర జాతులతో వర్తక వాణిజ్యాలు సాగిస్తూ దేశాల నడుమగల వైమనస్యాలను తొలగించి ప్రపంచమంతటా ఏకైకమైన అర్థిక వ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలని కోరుతున్న మధ్యమ వర్గ భావజాలమే, ఈ గీతంలో అడుగడుగునా కనిపిస్తుంది. "పరుల కలిమికి పొర్లి" ఏడ్వ గూడదన్నప్పుడు కలిమిలేముల అసమానతలు ఉన్నవి ఉన్నట్లుగానే కొనసాగడమటుంచి, వ్యక్తి ఆస్తి భద్రతకు ఆస్కారం ఏర్పడుతుంది. అప్పారావు మానవతావాదం, ఆ కాలానికి అభ్యుదయకరమే. ఎందుచేతనంటే, అప్పటికప్పుడే ఇతర దేశాలన్నిటా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసు

కొన్న మధ్యమవర్గం మనదేశంలో అప్పుడప్పుడే పైకి వస్తున్నది. అప్పటికింకా దాని దృష్టి వక్రించలేదు. తన స్వార్థమూ, సమాజ శ్రేయస్సూ ముడిబడే ఉన్నాయి. జాతీయోద్యమంలో భూస్వామ్య వర్గాల ఆధిక్యం క్రమేపీ మధ్యమ వర్గ ప్రాబల్యం ముందు వెనుకంజవేస్తున్నది. అది దేశాన్నంతటినీ కమ్ముకొంటున్నది. గాంధీ త్వరలోనే రానున్నాడు. స్వదేశీ ఒక ఉద్యమమే కానున్నది. ఈ సాంఘిక, రాజకీయ, భావ విషయిక పరిస్థితులన్నీ అప్పారావు గేయంలో కానవొస్తున్నాయి. ఇది సామాజిక పరిణామ దర్పణ మౌతున్నది. అందుచేతగూడా ఇది విశిష్టమైనది.

మతం వేరై తేను యేమోయి ?
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి !

When Creeds are dissolved,
Then is true faith born (ఇక్బాల్)

"క్రైస్తవులయినా, పార్శీలయినా, మహమ్మదీయులైనా, ఎక్కడనుంచి వచ్చి ఏ దేవుని పూజించినా, భారతదేశములో పుట్టి పెరిగి యీ దేశమునే నమ్ముకొన్న వారి నందరినీ భారతీయులుగానే భావించాలి. ఇది యేకజాతి; విభజింపరానిది...." (భారతి)

'అహరహ తవ ఆహ్వాన ప్రచారిత
సుని తవ ఉదారవాణీ
హిందు బౌద్ధ సిఖ జైన పారసిక
ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే
తవ సింహాసన పాశే
ప్రేమహార హయగాథా' (రవీంద్రుడు)

నవజాతి జాగృతిలో ఇవి వెలుగురేకలు. దేనిప్రకాశ ప్రభావాలు దానివే. టెనిసన్ వలె

There is no land like England
Where' ver the light of day be; (National song)

రాయప్రోలు త్వరలో "లేదురా ఇటువంటి దేశమింకెందు" అనబోతున్నాడు. ఆత్మ విశ్వాస సూర్యోదయం అచిరకాలంలో అహంకార దర్శనంగా మారబోతున్నది. ఈ వికృత వాదాన్నే రాజనీతి శాస్త్రంలో 'జాతీయ' వాదమని, నిజమైన దేశాభిమానం నుంచి వేరుచేసి వర్ణిస్తారు. రవీంద్రుడు గొంతెత్తి నిరసించిన ఈ స్వార్థ దూషిత ప్రవృత్తిని గురజాడ అప్పారావుకూడా యథాశక్త్యా గర్హించాడు. "వ్యర్థ" కలహాలు "కత్తివైరం", దీని దుష్ఫలితాలే. 'స్పర్ధయా వర్ధతే విద్యా' అన్నట్లు, విద్యా విషయాలలోనేగాని రాజ్య విషయాలలో స్పర్ధలు ప్రపంచానికి వికటించక తప్పవు. *Ode sung at the opening of the International Exhibition*లో టెనిసన్–

> O ye, the wise who think, the wise who reign,
> From growing Commerce loose her latest Chain,
> And let the fair white- wing'd peace - maker fly
> To happy heavens under all the sky,
> And mix the seasons and the golden hours;
> Till each man finds his own in all men's good,
> And all men work in noble brotherhood,
> Breaking their mailed fleets and armed towers,
> And ruling by obeying Nature's Powers,
> And gathering all the fruits of earth and crown'd with all her flowers

అని వ్యాపార స్వేచ్ఛను, యుద్ధ సన్నాహాల నిరసనను జోడించి, విశ్వ విపణి కోసం తహ తహను వ్యక్తం జేశాడు. మరింత సంకుచిత భావ పరిధిలో అప్పారావు–

> అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి
> దేశి సరుకుల నమ్మవలె నోయి
> డబ్బు తేలేనట్టి నరులకు
> కీర్తి సంపద లబ్బవోయి!

అన్నాడు.

సర్వ కాలాలకూ సర్వ స్థలాలకూ ఇది జాతీయగీతం కాగలదో లేదో తెలియదు గాని, అప్పారావు రాసిన కాలానికీ, దేశానికీ ఇంతకంటె నిండుగా సమాజ పథాన్ని గురించి ఆదేశించిన జాతీయగేయం మరొకటి లేకపోవచ్చు. రవీంద్రునిదీ ఇక్బాల్‌దీ కవిత్వానికి వాస్తవ దర్శనాన్ని లోబరచిన రచనలైతే, అప్పారావుది వాస్తవ దర్శనానికి కవిత్వాన్ని లోబరచిన రచన.

కన్యక, పూర్ణమ్మ రెండూ రెండు గొప్ప రచనలు. ఒకటి గాథగా మారిన చరిత్రాంశం: మరొకటి ప్రత్యక్ష కథగా తోచే జీవితాంశం. గ్రంథ మొకదానికీ, అనుభవ మింకొక దానికీ మాతృకలు. రెంటికీ విషాదమే బలమైనా, ఒకదానిలోని స్త్రీ ప్రకృతి రెండవ దానితో భేదిస్తుంది. ఆ భేదం మౌలికం.

గురజాడ అప్పారావు రాసిన కన్యక కథ విశ్వసనీయమైనది; జరిగి ఉండ దగునని పించేది. చారిత్రక గాథలోని దుండగుడైనరాజు, రాజరాజ విష్ణువర్ధనుడు. 'విష్ణువర్ధన' బిరుద నామంగల ప్రభువులు, వేంగిచాళుక్యులలో ఏడుగురికి తక్కువలేరు. ఈ విష్ణువర్ధనుని రాజధాని రాజమహేంద్రవరం. బయటివాడైనా వేంగి రాజ్యపాల కుడు కాబట్టి పశ్చిమ గోదావరిమండలంలోని పెనుగొండ అతని అధికార పరిధి లోనిదే. కుసుమ శ్రేష్ఠి వైశ్య సామంతరాజు ; పద్దెనిమిది పట్నాలకు పాలకుడు. వీటిలో 714 గోత్రాలకు చెందిన వైశ్యులుండేవారు. తమతమ నగరాలలో "నకరం" అనే శ్రేణి నేర్పాటుచేసునికొా వర్తక వ్యాపారాలను నగరపాలనను సరిచూచేవారు. నకర సభ్యులను 'శెట్టి' అనిగానీ 'పట్టణస్వామి' అనిగానీ పిలిచేవాళ్ళు. పెనుగొండ ఈ నగరాల సమాఖ్యకు కేంద్రం.[16] వైశ్యులు కొందరు తమ బిడ్డలను పరమేశ్వరి కర్పించేవాళ్లు; బాలికలలాంటివారు "గౌర బాలికలు", బాలురు "బాల నగరులు". గౌరవాలికలు బాలనగరులనే పెళ్ళాడాలి.

వేటకు పోయి అలసి, దాపున గల పెనుగొండకు వచ్చిన విమలాదిత్య విష్ణు వర్ధనునికి వైశ్యులు ఎదురేగి స్వాగతం చెప్పారు; కుసుమశ్రేష్ఠి పుత్రిక వాసవికన్య మంగళారతి పట్టింది. రాజు మోహించాడు. కుల నియమం వివరించి చెప్పారు కుల పెద్దలు. రాజు కోపగించాడు. ఎనిమిదిరోజులు గడువిచ్చాడు. ఈ లోపల సభపెట్టి వాదోపవాదాలు జరిపారు. అంగీకారం లేకపోయింది. రాజువద్దకు రాయబారం నడి పారు. అది విఫలమైంది. దండయాత్రకు భీతిల్లి అనేకులు వూరు విడిచి పోయారు. దండయాత్ర జరిగింది. అగ్నిగుండాలు పేర్చారు : ఒకటి కన్యకకు, మిగత 102 ప్రాణత్యాగానికి తలపడిన వైశ్య దంపతులకు. రాజు సేనలోనే "వీర ముష్టులు" తిరుగుబాటు చేశారు. "బాల నగరులు" విజృంభించి పోరాడారు. రాజు తల వెయ్యి ముక్కలయింది. అతని కుమారుడైన రాజరాజ నరేంద్రుడు వచ్చి, కన్యక అన్న అయిన విరూపాక్షుణ్ణి ప్రార్థించి, క్షమాభిక్షపొంది, పెనుగొండకు పట్టంగట్టిపోయాడు.[17]

మద్రాసులోని తెలుగు శెట్ల కోరికపై ఈ గాథను చేబూని అప్పారావు కావ్యం రాయడం జరిగిందని, ఆయన కుమారుడైన రామదాసు పంతులు చెబుతు

న్నారు. ఎవరికోసం రాసినా అప్పారావు ఆ కథను సొంతపరచుకోవడం జరిగిందని గుర్తించాలి. అడ్డుఅపులులేని రాజరికం కులధర్మాలకు స్త్రీల మానాభిమానాలకు తల కొరివిగా పరిణమించిందని చెప్పడానికే గాక, 'రసికత' పేర రాజరిక వ్యవస్థలో అమలు జరుగుతూ వస్తున్న దౌర్జన్యాన్ని ధ్వనించడానికి గూడా, తానీ కావ్యాన్ని రచించినట్లు తెలుసుకోవచ్చు. నగరినిండుగా ఉన్న సుందరులుచాలక, బహుభార్యాత్వం తృప్తినివ్వక, ("లంజ పెండ్లాములు" కూడా ఈ యుగంలో ఉండేవాట) దేవాలయానికి దేవకార్యం తీర్చిరావడానికి చెలికత్తెలతోసహా నడి వీథిని నడుస్తున్న ఆడదాన్ని, పట్టపగలు చుట్టివేసిన "పట్టపురాజు"కూ అచ్చువేసి విడిచిన పసరానికీ తేడా కనిపించదు. "నవల – సన్నివేశాలు" అని రాసిపెట్టుకొన్న అసంపూర్ణ రచనలో కూడా, సౌదామిని అనే కన్యను నీలగిరి కొండలపై ఒక జమీందారు లేవనెత్తుకు పోబోయే ఆగడాన్ని ప్రతిఘటించిన ఈ రచయిత[18] నిజోద్దేశమేమిటో కావ్యమంతటా కనిపిస్తుంది.

జారచోరులకంటె నికృష్టుడవని కన్యకచేత రాజును నిందింపజేసిన కవి, జమీందారీ యుగపు అవలక్షణాలనన్నిటినీ – పురుషాధిక్యం స్త్రీదాస్యం భిన్నత 'రాసిక్యం'– ఖండింప జేస్తున్నాడు. వెనకటి రోజుల గురించి రాస్తూ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి చెప్పినదానికీ, ఈ కథలోని అప్పారావు ధోరణికీ కార్యకారణ సంబంధం లాంటిది ఉంది:

> వెనకటికాలం అలాంటిదికాదు. ఒక జమీందారు మున్నాఁడంటే వాఁడికి వాఁడి గ్రామాల్లో వుండే స్త్రీలందరున్నూ అవసరమైతే భార్యాత్వానికి అంగీకరించ వలసిందే.... రాజులూ, రాజ పురుషులూ పూర్వం బకాసురుడులాగ నిన్న మొన్నటిదాఁకా సంసార స్త్రీలను బాధించడం వుండేది.[19]

అప్పారావుకూ ఇతర కవులకూ తేడా ఏమిటంటే, అనువైన ఇతివృత్తం లభించినప్పుడు ఆ వెనకటి రోజుల సామాజిక చిత్రాన్ని ఇవ్వడానికి ఆయన జమీందారీ సేవకూడా వెనకడుగు వేయించలేదు; దక్షిణాంధ్ర నాయక రాజుల యుగం ముందునుంచీ మన కవులుమాత్రం ఇలాంటి ఆగడాలకు శృంగారం వెల్లకొడుతూ వచ్చారు. జమీందార్ల కొలువులో ఉండీ, అప్పారావు నిర్భయంగా – పరోక్షంగానే అయినా – దౌష్ట్యాలతో భ్రష్టమైన ఒక సుదీర్ఘ చరిత్రను నిరాకరించి దాని నిజ రూపాన్ని చూపుతున్నాడు.

రాజు తలచిందేను ధర్మం,
రాజు చెప్పిందెల్ల శాస్త్రం,
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం ?

తాను ప్రత్యక్ష దైవతం కాబట్టి గుడిలోని దైవం పడియుండవచ్చునని అతని అహం. తాను తలపెట్టిన దుండగాన్ని గుడిలోనే సఫలం చేయించుకొనేందుకు పాపభీతి కూడా అడ్డుచెప్పదు. అందుచేతనే, "రక్తగంధం రక్తమాల్యం దాల్చి" ధర్మ స్వరూపిణిలాగ కన్యక అధర్మాన్ని ధిక్కరించింది. రాజులకు రాజొకడున్నాడు.

కండకావర మెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వొక దైవమంటూ,
వుండి వూర్కొనునా ?

కవితా న్యాయాన్ని లోకకవి అమలుజరిపాడో లేదో గాని, కవి మాత్రం అమలు జరిపాడు: రాజు గర్వం మట్టిలో కలిసింది. కోట పేటలు నక్కలకు ఆటపట్లయ్యాయి. కన్యక అగ్నిప్రవేశం చేసిన చోట, ఆకాశాన్నంటే సౌధ మొకటి లేచింది. ఆత్మాహుతి చేసుకోక ముందు, నిజంగా కన్యక తన కులం వారితో ఏమి చెప్పిందో తెలియదు గాని, ఇక్కడ కావ్యంలో మాత్రం వైశ్యకులం స్థితిగతులను మనస్సున పెట్టుకొని కవి తన కన్యకచేత ఇలా ఉద్బోధ చేయించాడు :

....కాసువీసం
కలిగివుంటే చాలు ననుకొని
వీర్యమెరగక, విద్యనేర్చక,
బుద్ధి మాలినచో
కలగవా యిక్కట్లు? మేల్కొని,
బుద్ధి బలమును బాహుబలమును

పెంచి దైవమునందు భారం
వుంచి, రాజులతో
రాజులై మనుడయ్యా! ....

శెట్లేకాదు, ఎవ్వరైనా మెచ్చగల ఉద్బోధ ఇది.

పరమేశ్వరి వాసవి అయిందో లేదోగాని వాసవి పరమేశ్వరిగా గణుతి కెక్కి-పూజ లందుకొంటున్నదంటే, మాన సంరక్షణార్థం ప్రాణత్యాగం చేసి ఒక ఉజ్జ్వలాదర్శాన్ని స్థాపించిపోయింది కాబట్టే. చరిత్రలో సరేసరి, మనుషుల స్మృతిలో కూడా స్థానం సంపాదించుకోనేరని సామాన్య కన్యలు అగణిత సంఖ్య లోనే ఉన్నారు. సహగమనం చేసిన సతులు గ్రామదేవతలైనా కాగలిగారు గాని, పెళ్ళిడుకూడా రాక అశుభమూ శుభమూ తెలియక తలిదండ్రుల ధనాశకు బలిపశువులై పండుముదుసళ్ళకు భార్యలు కావలసి వచ్చిన బాలకన్నెలు విస్మృతి గర్భంలో కలిసి పోయారు. ఎవరో ఒక దయామయుడైన కవి వేలాది ఇలాంటి దుర్ఘటనల కొక ఘటన నెన్నుకొని దానికి కావ్యరూపమిస్తేనే తప్ప, వాళ్ళ కన్నీళ్ళచిచ్చు లోకానికి తెలిసిరాలేదు.

గురజాడ అప్పారావు రచించిన కథాకావ్యాలలోకెల్ల విశేషంగా ప్రజాదర ణను పొందినకావ్యం పూర్ణమ్మ. పూర్తిగా స్వకపోలకల్పితమైన కథ, గాని అభూత కల్పనకాదు. ఆనందగజపతి ఆజ్ఞ మేరకు విజయనగరం సంస్థానంలో బ్రాహ్మణ వివాహాల లెక్కలు తయారు చేశాక, ఇలాంటి దురంతా లెన్నో అప్పారావుకు తెలిసివచ్చి ఉంటాయి. కన్యాశుల్క నాటకం వెలువడిన చాలా ఏళ్ళ తదనంతరం కూడా, ఆయన మనస్సు తిన్నగాయాలు సెలవేస్తూ వచ్చా యనేందుకు ఈ కావ్యమే దాఖలా.

కంటికి కట్టేంత స్పష్టంగా ప్రారంభంలో ఈ గాథకు నేపథ్య రచనచేసి, మనోనేత్రానికి మాత్రమే పట్టుబడేంత సూక్ష్మంగా దాని నుపసంహరించాడు. ఉపక్రమమూ ఉపసంహారమూ ఒక దానికొకటి అతికినట్లు అమరిన రచన ఇది. నేపథ్యం ఎంత నిసర్గ సుందరమైనదో, అంత భయానకమైనది. నాగరికత తొలి కిరణాలు సోకిరాని కొండలూ కోనలూ నిండిన గ్రామీణ వాతావరణంలోనే, గుండెలను పరపరకోసే ఈ ఘాతుకం అడిగేవా డెవడూ లేనంత మామూలు

వ్యవహారంలాగా జరగగలదు. అమాయకత్వమూ అజ్ఞానమూ పర్యాయ పదాలుగా పరిణమించిన సీమా విశేషమది. పూజా పునస్కారాలు గల పూజారి కుటుంబాన పాపభీతి బొత్తిగానే నశించిన పూజారి ఉండడంలోనే ఉంది, ఉండవలసినంతకంటె ఎక్కువైన విచిత్రం! ఆవులూ పెయ్యలూ ఇళ్ళకు చేరినా దుర్గ పూజకు వెళ్ళిన పూర్ణమ్మ ఇంటికి రాకపోవడం, అతని కేమీ విడ్డూర మనిపించలేదు. పెళ్ళాన్ని కాపురానికి తీసుకుపోదామని వచ్చిన అల్లుణ్ణి తలచుకొని ఉబ్బి తబ్బిబ్బౌతూ, క్రూర మృగాలు మసలసాగిన చీకటిపూట కన్నబిడ్డను గురించి చింతనుకూడా మరచి పోయాడు. మృగత్వం అతన్ని ఆవేశించింది.

ఈ కథను అప్పారావు ఎవరికి చెప్పి మనస్సులు కరిగింప జూచాడో మొదటి పాదమే తెలుపుతుంది. మగవాళ్ళ కుద్దేశించిన కావ్యం కాదిది. దాని సందేశం స్త్రీ జాతికి;* కన్యలకు, మాతలకు, ఆటపాటల చిరువయస్సునుంచి అమ్మలను గని అమ్మమ్మలయే ముదిప్రాయం వరకు అన్ని దశావస్థల్లోనూ ఉన్న ఆడవాళ్ళకు. పూర్ణమ్మ రూపవర్ణనలో కోమలత్వం, స్వభావ వర్ణనలో పేశలత్వం, రెండూ తానాశించిన ప్రయోజనాన్ని పూరా నెరవేర్చడానికే ఉద్దిష్టాలయ్యాయి. కొండల్లో కోనల్లో పుట్టి పువ్వులా పండులా పెరిగిన బిడ్డ. వనసంబంధమైన ఈ సంకేతాలు పూర్ణమ్మ ఆచ్ఛికత్వానికి మనోహరత్వానికీ బలమిచ్చేవి. లక్షణార్థంలోనే వీటిని గ్రహించాలి తప్ప, నడకకు తీపి ఉంటుందావంటి కుంటి ఆక్షేపణలతో ఉద్దిష్టార్థానికే ఎసరు పెట్టడం, వెకిలిపని. నిలిచి, కథను నిలిపి ప్రత్యంగ వర్ణన చేయకుండా, మనస్సులోని తీయందనాన్ని మెత్తందనాన్ని నడకలకూ, అవయవాలకూ సంప్రాప్తింపజేసి, వెనువెంటనే కథాకథనానికి సాగిపోయాడు కథన కుశలుడు కాబట్టి, అప్పారావు.

ఆ అచ్చపు సొగసులూ ముచ్చటలూ అన్నీ కూడా 'భర్త'ను చూడగానే వైదొలగిపోయాయి. ఇది కథలో మొదటి మలుపు. సావాసగత్తెల ఎకసక్కెం గుండె కుంపటిని రాజేసింది. తన గోడు వినేందుకు దుర్గాదేవి ప్రతిమ ఒక్కటే మిగిలింది. కాపురం చెయ్యను తీసుకుపోవచ్చిన భర్త, పూర్ణమ్మకు యమునిదూత. సాగనంపుతూ దీవించిన తలిదండ్రులను చూచి నవ్వింది– 'ఫక్కున.' "పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు!" అనో "దీర్ఘ సుమంగళీభవ!" అనో దీవించి ఉంటారు. ఈ మాటలు ఏపాటి? వాటి అర్థం ఎందుబోయింది? తనకంటె చిన్న వారిని కౌగలించుకొని పెద్ద

---

* అందుచేతనే దానిని 'ఆడపిల్లల పాటలు' అనే శీర్షిక కింద చేర్చడం జరిగింది.

వారిని చేరదీసుకొని, ఏడ్చి ఇంతలో నవ్వి, ఆ సాయంకాలమే దుర్గలో ఐక్యమయి పోయింది. అమ్మలకు అమ్మ కాబట్టే, అమ్మవద్దలేని చనువు దుర్గవద్ద చూపింది పూర్ణమ్మ. ఆమె చేసింది అపరాధమా? పుట్టింటికి పోయినంత సంబరంగా పోయింది దుర్గగుడికి. ఆ అంతం, పూర్ణమ్మ స్వభావ లాలిత్యానికి తగినట్టుగానే, శాంతంగా సుఖంగా సహజంగా జరిగిపోయింది. పంచభూతాత్మకమైన ఒక దేహం ఇప్పుడు ఋణవిమోచనం పొందింది. ఎవరెవరిచ్చిన వరాలు వారివారికి ముట్టాయి.

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేనిపసల్ !
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

విషయ నవ్యత్వంగాక, చెప్పేపద్ధతిలో విశిష్టతే కవి గొప్పదనానికి గీటురాయి అయితే, ఇది గొప్పకావ్యం. *కన్యకలో* నేరుగా కన్నులతోగల కాంతులను, నగల మించు తళుకులను, అంచలకు నడలు నేర్పే నడకలను వర్ణించిన కవే ఇక్కడ, అదే వర్ణనను ఇటునుంచి చేసుకొస్తున్నాడు. "సినిమాటోగ్రాఫిక్" అని శ్రీ శ్రీ వర్ణించింది, మామూలు చూపుకు పట్టుబడని దృశ్యం కవి కంటి కెమెరాకు పట్టుబడుతుందని. ప్రాచీన కవి సమయాలే అయినా, ఇక్కడ వాటికి అసాధారణమైన శక్తి సిద్ధించింది. వర్డ్సువర్తు (Wordsworth) Lucy Gray గేయంతోనూ, షేక్సుపియరు (Shakespeare) The Tempest నాటకంలోని Ariel పాటతోనూ, *రఘువంశం* అజవిలాపఘట్టంలోని శ్లోకంతోనూ ఈ చరణాలకున్న పోలికలను డా॥ సి. నారాయణరెడ్డిగారు బయల్పరిచారు.* 20 విషాదతీవ్రతను కొంతవరకు తగ్గించేందుకుగాక, ఒకఅమాయకురాలి ఆత్మహత్యలో ప్రకృతి ప్రతిచర్యనూ, పంచీకరణాన్నికూడా భావనాత్మకంగా ఔన్నత్య నిరూపకంగా చూపే కవితాన్యాయాన్ని సూచించేందుకుగూడా, ఈ చరణాలు పనికివస్తున్నాయి. పాఠకుని సహానుభూతి ఈ కావ్యంలో కలిగినంతగా అప్పారావు ఇతర కావ్యాలలో కలగక పోవడానికి, కథన

---

టెంపెస్టులో :

Nothing of him that doth fade,
But doth suffer a sea-change
Into something rich and strange. చరణం గమనార్హం.

సాంశ్యమూ, ఏకముఖత్వమూ ముఖ్యకారణా లనిపిస్తుంది. Ballad - 'బేలడ్' పద్ధతిలోని విశేషం ఇలాంటిది.

వ్యావహారిక పదాలనే పూర్తిగా వాడుకచేసిన గేయం మనిషి. అప్పారావు మతభావన ఎలాంటిదో, దీన్నిబట్టి కొంత తెలుస్తుంది. బ్రహ్మసమాజం వచ్చి విగ్రహారాధనపై బ్రహ్మాస్త్రం ప్రయోగించి పోయింది. నామతః ఆనంద గజపతి ప్రోత్సాహంపై అప్పారావు అందులో సభ్యుడయ్యాడు. ఆ సమాజం వారితో అంతకంటె ఎక్కువ ఇలాకాలేకుండా పోయింది. అలాగే దివ్యజ్ఞానసమాజంవారి పూర్వాచార సమర్థనం తనకు ఒప్పుదలకాలేదు. అయినా తనకు తనీగా మత విషయికంగా కొన్ని అభిప్రాయాలు లేకపోలేదు. తాను నిరీశ్వరవాది కాదుగాని మానవతావాది. మానవతావాదమంటే వట్టి గుండె మెతవూ, కంటితడీ వ్యవహారంకాదు. అది ఒక తత్వధోరణి. ఈ ప్రకృతిలో మనిషి కేంద్ర బిందువు; సమస్త మానవవ్యవహారాలను తానే అసహాయంగా చక్కజూచుకోగలడు; పరతత్వాన్ని తెచ్చి ఇహం మీద రుద్దనక్కర్లేదు. దేవు డున్నాడు సరే, ఆ దేవుడు మానవాతీతుడూ కాడు, మానవేతరుడూ కాదు. మనిషే దేవుడు, అతని మంచితనమే దేవత్వం. తోటి మనిషిని రాచిరంపానబెట్టి రాయిరప్పలకు మొక్కడం, జేలతనమేగాక మంచిని కుంచించేదికూడా కావడంచేత నిజమైన దైవభక్తికి జరుగుతున్న అనుదినాపచారమే.

పూంచు లంగరు ప్రథమ ప్రపంచ యుద్ధ ప్రారంభకాలంలో చేసిన గేయ రచన. ఇతర గేయాలలో కనిపించే భావాలే పునఃప్రసక్తాలయ్యా యిక్కడ. యుద్ధానంతర కాలంలో, భారతీయుల యుద్ధకాల సాహాయ్యాన్ని మెచ్చి, దొరతనంవారు అన్ని కోర్కెలను తీర్చబోతారని రాజకీయవేత్తలందరూ ఆశలు బెట్టుకొన్న రోజులవి. తోకచుక్క గేయంలో నాయకుని ద్వారా ఇంగ్లీషు విద్యలను పొగిడింప జేసిన కవి, ఇందులో నేరుగా తానే ఆ పని జేస్తూ, బ్రిటిష్ పాలన

జ్ఞానమును స్వాతంత్ర్య మిచ్చుచు
సంతతము వర్ధిల్లు గావుత !

అని ఆశించిఆశీర్వదిస్తున్నాడు. గ్లాడ్‌స్టన్ (Gladstone), రిపన్, (Ripon)ల లిబరల్ రాజకీయ సంప్రదాయం ఆంగ్ల విద్యాధికులలో కలిగించిన భ్రమలు, ఇంకా మిగిలిపోయాయి.

ఒక నెల రోజులకు నేలపై నూకలు చెల్లుకొంటాయనగా, 1915 అక్టోబరులో రాసిన గేయం *లంగరెత్తుము*. చావు గుమ్మం దాకా వచ్చి ఉంది. తన ఏభై రెండేళ్ళ జీవితమంతా కళ్ళ ముందు పటంలా గోచరిస్తూ ఉంది. ఇంతకాలం జీవించి తాను సాధించిందేమిటి అనే ప్రశ్న తలలో తలయెత్తుతూ ఉంది. దానికి జవాబే ఈ రచన. అప్పారావు రచనలన్నిటిలో ఆత్మనాయకాశ్రితమైన దిదొక్కటే. దీనికీ ఆత్మాశ్రయ కవిత్వ ధోరణికీ లంకె కలపడం, తగనిపని. స్వీయచరిత్రాత్మకమైనంత మాత్రాన, ప్రతి రచన ఆత్మాశ్రయ కవిత్వ సంబంధి కాదు. ఇది ఆయవ్యయ పట్టిక (Balance - sheet) లాంటిది మాత్రమే.

ఏంకెంసరయలు శీర్షికతో నున్న రచన, ఇటీవలి కాలం వరకు వెలుగు చూడలేదు. మొదటిసారి అది పత్రిక కెక్కింది 1930లో. ఆ సంవత్సరం ఫిబ్రవరి నెల *భారతి* లో అచ్చుపడింది. అప్పటిదాకా వచ్చిన అప్పారావు కావ్య ముద్రణలలో దేనిలోనూ ఇది లేదు గనుక, అప్పారావు దృష్టి వయోధికుల నుంచి బాలబాలికల మీదికి మరలిందని లోకానికి తెలిసి ఉండదు. అయినా బాల సాహిత్యానికి తెలుగులో అంకురార్పణ చేసింది. ఈ వృద్ధబాలుడే. * చింతాదీక్షితులు వంటి రచయితలు ఈ శాఖకు పెంపూ సొంపూ చేకూర్చారంటే, అప్పారావు సృష్టించిన బాలసాహిత్యంతోటి పరిచయం వల్ల అయి ఉండదు. అప్పారావు రచనలన్నీ సుబోధకాలూ సరళ సుందరాలూ కాబట్టి, ఈ ధోరణి వారికి పట్టుబడి ఉంటుంది.

---

* ఇంటిపట్టున ఉన్నప్పుడు పిల్లల పాటల వరసలతో వినోదంగా కాలక్షేపం చేసేవాడట అప్పారావు. 'నదూనదూనదు....'ఇలా సాగేది ఆ ధోరణి.

# 5

మంత్రాలసరాన్ని కూర్చకముందే సాంప్రదాయిక గేయ పద్ధతిలో ఆరు పాటలు రాసి వాటికి స్వరాలుపెట్టి *నీలగిరి పాటలు* అనే ఒక పుస్తకాన్ని అచ్చువేయించి, రీవారాణి అప్పల కొండయాంబకు కృతి ఇచ్చాడు. నీలగిరి కొండల అందచందాలను వచనంలోకూడా వర్ణించిన అప్పారావు దానికొక్క- దానికే ఈ పాటలు రాయలేదు. ఇంగ్లీషు అనువాదాలు కూడా దానికి చేర్చి అచ్చువేసిన ఈ లఘుగ్రంథంలో ప్రకృతి సౌందర్యదృష్టితోబాటు, అప్పారావు మది నలరించిన ఇతర విశేషాలు కూడా కానవస్తాయి. *ఉమాపతి యర్చన* లో కూడా నీలగిరి అందమే వచ్చి దూరిందిగాని *నాటిమాట, లేవొకో మంత్రములు* అందుకు పూర్తిగా భిన్నమైన ధోరణికి చెందినట్టివి. *చిత్తరువని చూడ* ఒక్కటీ ఒక ధోరణికి తార్కాణమైన మనోహర రచన.

ఈ చివరపేర్కొన్న మూడింటిలో మొదటిది, మాటతప్పిన ప్రియుని మెత్తగా మందలిస్తూ ప్రియోక్తుల దాట తప్పని గడసరియైన ప్రియురాలు చేసే ప్రణయ ధర్మోపన్యాసం లాంటిది. ఖండిత నాయిక, అందామా ఈమెను? ఆ కోపతాపాలు కనిపింప జేయని సరసురాలైన నెరజాణ ఈవిడ. మళ్ళీ మళ్ళీ అతని మాట నమ్మి భంగపాటు పడేందుకు గూడా వెనకాడదు. తనకు కావలసింది ఆ ప్రణయ భాషే. నీవే నాప్రాణం, నిన్ను ఎన్నడూ విడవను, అని ప్రియుడం టూంటే వింటూ ఆమాటల్లో సొక్కిపోవాలనే తన అభిలాష. అటు తర్వాత అత గాడు ధూర్తుడై మాట తప్పితే తప్పనీ, ఇప్పటి ఈ ఆనందమే చాలు.

మేటివైన నీ యెద మొగ
మాట మెటులఁబాసె, నొక్క-
మాటురా, నీ యోటుమాటె
కోటి ధనము లిచ్చి కొందు.

ప్రియుడు వంచకుడై పరకాంతను దగిలి తనను తృణీకరిస్తున్నాడని తెలుసు కొని ప్రియిరాలు అతనికి చెబుతున్న బుద్ధి, ఆ రెండవపాట ; మంత్రాలనేవి ఉంటే బాగుణ్ణు, వాటితో నిన్ను నాలాంటి ఆడదాన్ని చేస్తే, అప్పుడు తెలుస్తుంది నా బాధ

స్వానుభవంగా నీకు. నీవుకూడా ఒక మోసగానిచేత జిక్కి నాలా మోసపోతే అప్పుడు తెలుస్తుంది నీకు స్వయంగా నాలాంటి అభిమానవతి బాధ. ఇక నిను నమ్మి లాభంలేదు– ఆ నగధరుణ్ణి నమ్ముకొంటాను.

మూడవది ఇంకా చిత్రమైన పాట. అది ఒక చిత్రం కారణంగా వెలికి వచ్చిన పాట. నీ ఎదటనున్న ఒకానొక చిత్రపటంలోని స్త్రీ వ్యక్తి ఉన్నట్టుండి ప్రాణపూర్ణంగా మానవియైతే నీ వెలా విస్మయ సంభ్రమాలు పొందుతావో, తన గోడకు వేలాడుతున్న పటంలోని జపానీయ 'గీషా' (Geisha) సుందరిఒకక్షణంపాటు ప్రాణాలు పోసుకొని వచ్చినట్లు అప్పారావుకు భ్రమ కలిగిందొకమారు. అప్పుడు రాసిందీపాట. ఆ భావానికి బానిసయ్యాడు. తిరిగీ నిర్జీవ చిత్రమై తనను మోసంచేసి పోయిన ఆ సుందరిని— "చిత్తజు నపరంజి చిలుక"— చివరకు నీ మనసైనా ఈరాదా, అని వేడుకొంటున్నాడు. పోనీ, మనస్సెలాగూ దాని వశమై పోయింది తనది; మనస్సులేని ఈ మేను మాత్రం తనకెందుకిక? వీటన్నిటినీ పుచ్చుకొని, ఒక్కమాటను బదులిమ్మంటున్నాడు.

విలువ చాలదన్న - విరివిలుపైనాన
కలుగు జన్మములం - గానుక కొనవె!

సాంప్రదాయిక గేయపద్ధతికి చెందినవే గనుక అర్ధానుస్వార పూర్ణాను స్వారాలతోబాటు, ప్రాచీన కవి సమయాలను కూడా పాటిస్తూనే, భిన్న గతులతో రాసిన ఈ ఆరు పాటలు "అన్నమాచార్య కీర్తనలను బోలియున్నవి" అని డా. సి. నారాయణరెడ్డిగారంటున్నారు 21. 1907 లో ఈ పుస్తకం అచ్చుపడి వచ్చాక, *ఆంధ్ర భారతి* ఇలా సమీక్షించింది:

> ఈ గ్రంథమునందు నీలగిరిని గూర్చిన ఆరు కీర్తనలు గలవు. గ్రంథాంతమున ఆ కీర్తనల స్వరములును, ఆంగ్లేయ భాషాంతరీకరణమును, బొందు పరుపబడినవి. ఆ కీర్తనలయందలి వర్ణనలు స్వాభావికముగ నున్నవి. ముద్రణము బహు రమణీయముగ నున్నది. 22

**సుభద్ర** అప్పారావు రచనలలో ఏకైక పద్యకావ్యం. అసంపూర్ణ రచన. మూడు ఆశ్వాసాల వరకే సాగింది ముది మోపున పద్యరచనకు ఆయన పూను కోవలసి వచ్చింది. 'పండిత' వ్యవస్థ విసిరిన సవాలు నందుకొని గ్రాంథికభాషలో

వృత్తచ్ఛందస్సునుకూడా తాను నిర్వహించగలనని చూపేందు కోసమే ఈ రచన చేయవలసి వచ్చింది. దీన్ని గురించి అవమానం చెందవలసిన పనిలేనంత పకడ్బందీగానే రాశాడు. అప్పారావు కృతులను అచ్చువేయిద్దామనుకొని ఆయన కుమారుడు 1929 లో వఝుల చినసీతారామ స్వామి శాస్త్రి వద్దకు లిఖిత ప్రతులను తీసుకెళ్ళి చూపించినప్పుడు, ఆ మహా పండితుడు కొన్ని మార్పులను సూచించాడు. వాటిని గిడుగు రామమూర్తికి చూపించగా, మార్పులేవీ లేకుండానే అప్పారావు రచనలను అచ్చు కీయవలసిందని రామదాసుగారితో చెప్పాడు. ఎందుచేతనంటే, శబ్దగత దోషాలు తెలియని అర్భకుడు కాదు అప్పారావు; తెలిసి తెలిసీ వ్యాకరణ సూత్రాల నుల్లంఘించాడు, అని రామమూర్తి వివరించాడు. అలా ఉన్నది ఉన్నట్టుగానే అచ్చుకు వెళ్ళింది.

చేమకూర వేంకటకవి *విజయవిలాసం* (వి. వి.) అప్పారావు దృష్టిలో ఉండినట్లు, ఉభయ కావ్యాలను పరీక్షగా చూస్తే ఎవరికైనా తెలిసివస్తుంది. అర్జునుడు సుభద్రను చూడాలనుకొని యతిరూపం ధరించి ప్రభాస తీర్థంనుంచి రైవతకాద్రికి పోయి కృష్ణుని తలచుకొని ప్రత్యక్షం చేసుకొంటాడు. "తావకాభీష్ట మిపుడు సేయుదు నటంచు" ద్వారకకు పోయి రైవతకోత్సవం చాటింపించి బంధుమిత్రాదులతో అక్కడికి తరలి వస్తాడు: సుభద్రను చూచేసరికి వి. వి. లో ద్వితీయాశ్వాసం మూరవ పద్యం వస్తుంది. అక్కడ, అందుకొంటుంది *సుభద్ర* రచన. ఇందులో "పండుగ దండిగ" పర్వుతుండగా ఒక కోనలో కృష్ణార్జునులు విడిగా మంతనాలు సలుపుతున్నప్పుడు నవ్వుల సవ్వడి వినిపించి అంతరాయం కలిగింది. ఆ ధ్వని "అల విఱిగిన భంగి" సద్దు మణిగింది. నూపుర ధ్వని చేసుకొంటూ ఒక కాంత మాయాయతిని సమీపించింది. చేమకూర వాని సుభద్ర అద్రి పూజలు చేసి ఇష్ట సఖులతో వినోదిస్తుండగా అర్జునుని కంటబడింది; పడి పది పద్యాలు చెప్పించింది (101 – 111). "మహిలోత్తమంపు మేని పసవర్ణన"కు చేమకూర కవికి అవకాశం కలిగించింది. అప్పారావు సుభద్ర అర్జునునికి "వారిజ కింజల్కశ్రీ వారంబున వెలసి మెఱయు వరలక్ష్మి" వలె కనిపించింది; ఆమె నూపుర ధ్వని "వీణియ మీటు మాడ్కి" హృదయాహ్లాదం కలిగించింది.

వి. వి. లో ఉత్సవానంతరం సుభద్రను ద్వారకకు బంపుతూ బలరాముడు అర్జునుని "ఉత్తమయతిగా మదిఁదలచి" నమస్కరించి, తీర్థయాత్రా విశేషాలు

విని, చాతుర్మాస్యవ్రత మిచ్చటనే సలుపవలెనని సూచించి అతని అంగీకారం పొందుతాడు. సుభద్రను యతిసేవకు నియోగించమని బలరాముడడిగితే, కృష్ణుడు

వయసు వారును జక్కని వారు వీరు

అంటూ కన్నెను పంపడం తగునా, అని తెలివిగా మాటాడుతాడు. ముందు తన మీదికి రాగల సొద్దు బలరాముని మీదికే తిప్పడానికి ఇప్పటి నుంచీ ఎత్తు. మహాత్ములను శంకించడం అపచారమంటాడు బలరాముడు. ద్వారకకు పోయి, సత్యా రుక్మిణులకు మాత్రమే యతి రహస్యం చెప్పి, అతన్ని కన్యాంతఃపుర వన మంజుల కుంజ సంజ వనమున ఉంచి సుభద్రను అతని సేవకు నియమిస్తాడు. అప్పారాయ రచనలో అలా జరగదు. రైవతకాద్రిలోనే కృష్ణుడు సుభద్ర కాపని బెట్టి ఛలోక్తులాడుతాడు. ఈ మౌని దయవల్ల "సౌభాగ్యముల" పొందగలవని నర్మ గర్భంగా మాటాడుతాడు. రైవతకాద్రిని పూజించింది గదా, దీనికి కాగల భర్త ఎలాంటి మేటి మొనగాడో తెలపండని అర్జునుని అడుగుతాడు. ఇతని దయ వల్ల అర్జునుణ్ణే భర్తగా సంపాదించుకోవలెననుకొంటుందిసుభద్ర. ఇతనిది చూచిన ముఖం లాగానే ఉంది. కృష్ణుడేదరిగా, ఆ ఇద్దరి భావప్రవాహాలు సాగుతాయి. అప్పుడు వస్తాడు తొలిసారిగా రంగంమీదికి బలరాముడు. కురువీరులలో ఎవరెక్కువో పిల్లలు వాదులాడుకొంటున్నారు; అర్జునునియెడ పక్షపాతం లేకుండా నీవు చెప్పు వింటా నని కృష్ణుణ్ణి అడుగుతాడు. కృష్ణుడు యతిని చూపుతూ, ఇతడు వింటూండగాఎలా చెప్పడం, అంటాడు. యతి బలరాముని కీర్తిస్తాడు. మీకు తెలియందేముంటుంది, అంటాడు. పొగడికలకు బలరాముడు ఉబ్బిపోయి, యతిని గురించి సదభిప్రాయ మేర్పర్చుకొని, ఇతని సేవకు భద్రను నియమిస్తే రాజరాజును భర్తగా పొందగల దని అంటాడు. ఈ వరకే రణకౌశలంగల భద్రకు నీతిపథం తెలియ జెప్పవలసిం దని యతి నడుగుతాడు. తమవంటి శాంతుడు నాథుడయ్యేలా సుభద్ర ననుగ్రహించం డని ప్రార్థిస్తే, కృష్ణుడు 'తథాస్తు' అంటాడు. బలరాముని నిష్క్రమణంతో మొదటి ఆశ్వాసం ముగుస్తుంది.

వి. వి (ద్వితీయాశ్వాసం: పద్య సంఖ్య 130)లో, బంగరు పళ్ళెరంలో పళ్లూ పూలూ తీసుకొని యతి సేవకు పోతున్న భద్రను వర్ణించాడిలా వేంకటకవి:

చందురకావి పావడ పిసాళి రుచుల్ సరిగంచుఁజీరపైఁ
జిందులు ద్రొక్క వేణి కటిసీమ పయిన్నటియింప జాళువా

యందెలుఁ బ్రమోయ జంటి జవికంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ
జందన గంధివచ్చె రభసమ్మున నమ్మనిరాజు సేవకున్.

అప్పారావు రచన–రెండవ భాగంలో మొదటి పద్యం దాదాపుగా దీనికి విస్తృత ప్రతిబింబం లాంటిది : *

కస్తూరి గన్నెరు కావిచీర మెఱుంగు
మేని చాయకు వింత మిసిమిఁగొలుప
చెలరేగు ముంగురుల్ చేర్చి కట్టిన జోతి
యిరులపై రిక్కల కరణి వెలుఁగ
పైటపైఁదూగాడు పచ్చల హారముల్
చలదింద్ర చాపంబు చాడ్పుఁజూప

* తన రచన లన్నిటా అప్పారావు నయనేంద్రియానికి ప్రధానంగా పనిబెడుతాడు. నడకల బెడగులవంటి విశేషాలలో కూడా సూక్ష్మ భేదాలు చూపుతాడు. పూర్ణమ్మది ఎంత తియ్యటిమనస్సో ఆమె నడకలంత మంద మధురాలు. కన్యక స్వాభిమానం ఆమె నడకల్లో విశిష్టంగా వెల్లడికాలేదు గాని, కన్యక రూప చిత్రం కొద్దిదైనా నిండైనది. కట్టింది జరీచీర. పూలసరులు సిగలో అలంకరించుకొంది. ఎఱ్ఱటి బొట్టు ముఖాన పెట్టి కళ్ళు తళతళ లాడుతూంటే మేలి నగకట్టు మిలమిల లాడేట్లు, సంపదకూ కులీనత్వానికీ ప్రత్యక్షోదాహరణంగా, రాజవీథిలో చెలికత్తెలతో కదిలి పోతుంది. లవణరాజు వలరించిన మాలపిల్ల నల్లనిదైనా రూపసి. పాట పారవశ్యంలో అరమూసిన కళ్ళతో, చల్లగాలికి కదిలే ముంగురులతో. అదరు బెదురు లేని బింకపు నడకలతో. కూటికడవను బుజాన పెట్టుకొన్న వాటంకూడా అదనపు అందంకాగా, కనిపిస్తుంది. కాసులుకోరే యువతి ప్రత్యక్షంగా కనిపించదనేగాని, ఎదుటి వాని మాటలద్వారా కనిపిస్తుంది. అసలే పచ్చని ఒంటికి పసుపు పూసింది. మెత్తని కురులకు మెత్తని పూలతో కాచిన నూనె రాచింది. తాంబూలం కెంపు పెదాలకు పట్టించింది. పలువరసతో వెన్నెలలు కాయిస్తున్నది. ఇతని మాటల నమ్మీనమ్మనట్లు "వింతచూపు" చూస్తున్నది. తోకచుక్కను చూడమని అడిగే భర్తమీద అలిగి "దిగ్గునలేచి" కన్నుమిన్ను తెలియని కోపంతో "కురులుసరులును కుదురుచేయుచు" ముఖం ఓరగా తిప్పుకొంది భార్య. ఇలా బాహ్యాభ్యంతర రూపాలను, అవయవ చాలనాలను, వీలైనంత క్లుప్తంగా వర్ణించి, కళ్ళముందు యధార్థ మూర్తులను బొమ్మల్లా కట్టడంలో అప్పారావు నేర్పరితనం వెల్లడౌతుంది. కథల్లోనూ అంతే. నిశ్చల (Static) దృశ్యంకంటె అధిక విశ్వాసదాయకమైన చలద్దృశ్యాలు స్వల్పాకృతులతో (Miniature) దర్శనమిస్తాయి.

నిద్దంపుఁజెక్కుల దిద్దిన పత్త్రముల్
మకరాంకు బిరుదాల మాడ్కి వఱల

మెఱపు కెమ్మొబ్బులోపల మెఱయునట్లు
వలిపమున మేల్మి మొలనూలు తళుకులీన
భద్రనడలెంచె బంగరు పళ్ళెరములఁ
బండ్లుఁబూవులు గొనుచు సపర్య కొఱకు.

సుభద్ర మనోభావాలు వశం తప్పి అర్జునుని మీదనుంచి యతి మీదికి వచ్చి నిలుస్తూ తనకే సిగ్గు గొలుపుతున్నాయి. అర్జునునికి తెలిస్తే ఏమను కొంటాడు? యతి మీదికి మతిపోవడం, నిజంగానే మతిపోవడం లాగుంది. వదినలు నవ్వుకొంటు న్నారు. కాబట్టి హృదయాన్ని అదుపులోకి తెచ్చుకొని, యతివద్ద కికమీద ఛస్తే పోనని నిశ్చయం చేసుకొంటుంది. ఆ తర్వాత చాలా చింతిస్తుంది.

మూడవ భాగంలో యతివద్దకు పొమ్మని రుక్మిణీదేవి సుభద్రను పోరుబెడు తుంది. అక్కడితో ఈ భాగమూ కావ్యమూ ముగింపుకు వస్తాయి అర్థాంతరంగానే. వి. పి. లో (ద్వితీయ-139) సుభద్రకు యతిలో అర్జునుని మొక్కట్లు కనిపిస్తాయి. అయినా ఆ సుకుమారుడు కఠిన సన్యాసం పుచ్చుకొంటాడా, అని సందేహం. ఒక నాడు పాండవుల యోగక్షేమాలడిగి తెలుసుకొని అర్జునుణ్ణి గురించి యతిముందు పొగుడుతుంది. "ఆయనే మేమయియున్న వారముసుమీ" అని అతని చమత్కారం. తామిద్దరు కలిసే తీర్థయాత్రలు చేశారట. ఇక కాస్సేపటికి, అర్జునుదే యతి వేషం ధరించి నీ చెంతనే ఉన్నాడు, ఏడేవాడు అంటాడు. ఇకనేం? కథ రసకందాయంలో పడింది. తర్వాత సుభద్ర విరాళి. యతికి రుక్మిణి పరిచర్యలు.

ఇలా చేమకూర వెంకన్నకు కుడి ఎడమలుగానే గురజాడ అప్పారావు తన రచనాశ్వాన్ని నడిపించుకు పోయాడు. "అంతట నొక్కకాంత యలకాంతములల్లల నాడ" అంటూ శబ్దాలంకారాలను కూడా ఆశ్రయించాడు. "జఘనఘన" సరేసరి.

నిప్పు గప్పినట్టి నివుఱుగాదె?

అన్నప్పుడు అప్పారావు పోకిరితనం కనిపిస్తుంది. నివురు గప్పిన నిప్పును తారు మారు చెయ్యడంలో ఒక ప్రయోజనం ఉంది. లోన అర్జునుడు; పైనయతి: అసలు నిప్పును దాచి వేస్తున్నదీ నివురు. దుర్యోధనుని శీలచిత్రణలోనే, ఈ ఇద్దరి కవులకూ ఏదైనా తేడా.

"సాహిత్యరంగంలో ఇప్పుడు నేను కావిస్తున్న కృషికి సమతుల్యమైన కృషి భారత దేశంలో మరెక్కడా కనిపించదు."[23] అన్నప్పుడు, గురజాడ అప్పారావు మనస్సులో ఉండింది, ప్రబంధ రచనలకు నూటపదకొండో కాపీలు కావు.

---

1. ఖండకావ్యము- భావకవిత్వము (వ్యా.) సంపత్, తె. భా. చ. సం. పు. 781
2. ముత్యాల సరాల లక్షణము : గు. ర వ్యా. పు. 23
3. ఆధునికాంధ్ర కవిత్వము : డా॥ సి. నారాయణరెడ్డి, పు. 692-694
4. నవ్య సాహిత్య పరిషత్ సప్తమ సభాధ్యక్షోపన్యాసము : విశ్వనాథ సత్యనారాయణ, భారతి, ఏప్రెల్. 1940
5. *Damon and Pythias : The Oxford Companion to English - Literature, P. 205*
6. *Befare Philosophy :* Frankfurter and Others, P. 258 - 259
7. గురజాడ అప్పారావుగారు (వ్యా.) పొట్లపల్లి సీతారామారావు, జయంతి, జనవరి. 1959
8. గురజాడ- రసచర్చ (వ్యా.) కోటగిరి విశ్వనాథరావు, జయంతి, జూలై 1959
9. గురజాడవారి లవణరాజు కల - రసచర్చ (వ్యా.) కో. వా. , విశాలాంధ్ర, 29.11.1959
10. ఆధునికాంధ్ర కవిత్వము, పు. 250, 254
11. *The Lute And The Plough : A Life of Rabindhranath Tagore* : G.D. Khanolkar, P. 162 - 163
12. దేశాభిమానము (ఉ) 1883 ఆగస్టు 23 : వివేకవర్ధని : మూడవ భాగం
13. ,, (,,) 1880 జూలై : ,, : రెండవ భాగం
14. ముత్యాల సరాలు : (1955 ముద్రణ), పరిచయం : శ్రీశ్రీ పు. 9-10
15. నవ్యాంధ్ర కవిత్వము : భావచిత్రణ (వ్యా.) మల్లవరపు విశ్వేశ్వరరావు, భారతి, ఏప్రెల్ 1939
16. *Eastren chalukyas of Vengi :* N. Venkataramanayya, P.285
17. శ్రీ వాసవీ కన్య : విద్వాన్ గట్టి సత్యనారాయణ గుప్త
18. గు. ర. మా. మం : పు. 225
19. కళలకోసం దేవదాసీ జాతి (వ్యా.) కథలు, గాథలు : రెండవ సంపుటం పు. 68
20. ఆధునికాంధ్ర కవిత్వము, పు. 239.240
21. ,, ,, పు. 235
22. ఆంధ్ర భారతి : జూలై 1910
23. గు. ర. లే. : పు. 207.

# సప్తాశ్వాలు

## కథన కౌశలం

# గారడీవాని మామిడి మొక్క లాగా, గురజాడ

అప్పారావు చేతిలో తెలుగు కథ అప్పటికప్పుడు మొలిచి పూచి కాచింది. సాహిత్య విషయాలలో కూడా అద్భుతాలనేవి ఉంటే, ఇది అలాంటిది.

కథలు రాయడమనేది 1895 తర్వాతనే మొదలై ఉండవచ్చుగాని, పోకిరీ బడిపిల్ల వాడుగానే అప్పారావు కథలు చెప్పేవాడు. గిడుగు రామమూర్తికి చెప్పిన మేఘమల్హార రాగ కథలాంటి కథ లెందరి కెన్ని చెప్పాడో, మనకు చెప్పే వారొక్కరూ లేరు. మిత్రులనూ, పరిచితులనూ రూపుమార్చి కథల రంగాని కెక్కించే రూప శిల్పిగుణం, అప్పారావుకు మొదటి నుంచీ ఉన్న రోగ లక్షణమే. వసంతరావు బ్రహ్మాజీరావు గారి భోగట్టా నమ్మదగినదైతే, *మీ పేరేమిటి?* కథలోని పాత్రలకు మూలాలెవరో లోగడే తెలిసింది. అలాగే కవిలిగ శ్రీనివాస పంతులు *కన్యాశుల్కం*లో సౌజన్యారావుకు కొంతవరకు ప్రాణదానం చేస్తే, అంగర వెంకటరావనే మరో స్థానిక న్యాయవాది అదే పేరున ఆ నాటకంలో అదే వృత్తి చేస్తున్నట్లు కనిపిస్తాడు.[1] బ్రహ్మాజీరావు గారి దాకా ఎందుకు, అప్పారావు స్వయంగానే తన ఈ బలహీనతను బయట బెట్టుకుంటూ తన ఇరుగు పొరుగు వారు జట్టీకోరు పాత్రలకు, సిద్దరిన్లా వేదాంతి పాత్రకు, ఇలా ఎందరో రకరకాల పాత్రలకు పనికి రాగలట్లు రాసిపెట్టుకొన్నాడు. జీవితంలో ఎదురయ్యే ప్రతి వొక్కర్నీ అచ్చుకు మచ్చుగా పుస్తకాని కెక్కించడం తగని పని అని తానే మినహాయింపు చెప్పుకొన్నాడు కాబట్టి సరిపోయింది.[2] లేకుంటే ఎన్నెన్ని జట్టీలు వచ్చి ఉండేవో! రచయితది, ముఖ్యంగా ఇలాంటి కథకుడిది రసవాద విద్యలాంటి సిద్ధి. ఎందరెందరో తమ తమ అంశాలను అతనికి అర్పించుకొంటారు. ఈ నానా లోహాల నుంచి రచయిత గమ్మత్తుగా సువర్ణాన్ని బయల్పరుస్తాడు. అప్పుడు ఈ అంశ ఇతనిది, అది మరొకనిది అని గాకుండా, రచయిత పట్టుబడి పోకుండా, సాధారణ గుణం కలిగిన వ్యక్తుల కూటమి కంతటికీ ప్రతినిధి కాగలిగిన 'మచ్చు

తునక' లాంటి పాత్ర సృష్టి అవుతుంది. ఈ విద్యలో అప్పారావు మేటి. ఉదాహరణకు –

.... మెటిల్డా పేరుగల కథలో కథానాయిక మెటిల్డా అవతరించిన తీరే చూద్దాం. 1895 లో ఆరోగ్య దృష్ట్యా మదరాసుకు పోయి విజయనగర సంస్థానం వారి అడ్మిరాల్టీ హౌస్‌లో ఉంటూ వచ్చినప్పుడు, మాటకారీ పాటగత్తె అయిన వంటలక్కనోట అప్పారావు ఒకకథ విన్నాడు. ఎడ్గార్ ఆలన్ పో(Edgar Allan Poe) వంటి కథకుడు రాయగల భయంకర మర్మ కథ (Mystery) లాంటి కథ: వి. యస్. ఆర్. అనే వకీలు శ్రీ. ర. జమీందారుగారి కుమార్తెను పెళ్ళాడి అప్పడాలగంపలో కూలబడ్డాడు. భోగాలతో తులతూగుతూ బొంబాయి నగరంలో అనేక అంతస్థుల మేడలో ఉన్నప్పుడు, ఆ జగదేకసుందరి కొక విచిత్రాను భవం కలిగింది. నిలువుటద్దంలో ముఖం చూచుకొంటున్న తనకు చూడచక్కని తన ముఖమేకదా కనిపించవలసింది! ఉన్నట్టుండి బెబ్బులి కనిపించింది! తన శిరస్సునీ, ముఖాన్నీ, భుజాల్నీ, కంఠాన్నీ ఆక్రమిస్తూఉంది. ఆమె అక్కడే కుప్పగా పడిపోయింది. ఈ ఆఘాతం నుంచి మరి తేరుకోలేదు. అలాగే కృశించి కృశించీ నశించింది. ఇది వంటలక్క 'వెర్షన్'. ఎంత నిజమో, ఎంత కల్పనో తెలియదు. గ్రామాంతరంనుంచి తిరిగి వచ్చినభర్తను దగ్గరకు రాబిలిచి, కౌగిలించుకొమ్మని అడిగి, చివరి మాటలుగా తమ విపరీత వివాహాన్నిగురించి మాట్లాడి కాలం చేసిందిట.

ఈ విషాద గాథను విన్నంతనే నా హృదయ భారము మిక్కుటమయింది .... భరించలేని విషాదానుభూతి కలిగింది ....
భార్య పోయినప్పటి నుంచీ, వి. యస్. ఆర్. దాదాపు ఉన్మాదావస్థకు లోనయ్యాడుట. ఆమె గురించి కథలూ గట్రా రాశాడుట.
ఈ టాటాలతో అప్పారావు తృప్తిపడలేదు. అలా తృప్తిపడితే అంతటి కథకుడు కాగలిగేవాడే కాదు. అడ్డమైన వారందరి నుంచీ అదనపు భోగట్టా సంపాదించ సాగాడు. ఒకరు చెప్పిందే ఇంకొకరు చెబితే, మనిషి మనిషికీ ఒక్కొక్కజిహ్వఉన్న ప్రయోజనం ఎలా నెరవేరుతుంది?

ఆ మగడే చంపి ఉంటాడు. "ఎంత మూర్ఖాతి మూర్ఖుడు!" బహుశా ఆమె శీలం గురించి అనుమానం అతన్ని పెనుభూతమై పీడించి ఒథెల్లోగా మార్చింది కాబోలు!

అసలు మనిషి కూతవేటు దూరంలోనే ఉండగా ఈ లోకుల కౌకి వ్యవహారమెందుకని, అప్పారావొకమారు ఆ వి.యస్.ఆర్ నే అడిగాడు. మూడో 'వెర్షన్' తయారైంది. కథకు కాల్పనికత్వం వచ్చి జత చేరింది. ధనమంతా పోయినప్పటి నిరాశతో తాముభయులూ కలిసి విషం పుచ్చుకొని చచ్చిపోవాలని తలపెట్టారు: విషపాత్రలను ఎదుటపెట్టుకొని కూచున్నారు; ఇద్దరూ ఒక్కమారే తాగలేదు. ముందామె తాగింది: తానూ తాగేలోపలనే తమ పన్నాగం పొక్కి తన ఆత్మహత్యా ప్రయత్నం నడమంతరాన్నే ఆగిపోయింది.

నమ్మదగ్గ కథగా లేదిది. ఆడబిడ్డగానీ, తోడికోడలుగానీ విషప్రయోగం చేసి ఉంటారా? గొంతులో బలవంతాన విషంపోసి, కాళ్ళతో మెడతొక్కిపెట్టి చంపుతూంటే ఆమె పెట్టిన కేకలు, అరుపులు, మూలుగులు, అతన్ని నిద్రపోనీలేదు. పోలీసుల నోళ్ళకు వెండితాళాలు వేయవలసి వచ్చింది ఆతర్వాత.[3]....

ఇలా చిలవలూ పలవలూ అల్లుకోసాగిన ఈ కథ, కట్టుకథగాకుండా జరిగియుండదగిన కథగా అప్పారావు చేతిలోపడి రూపొందింది. పడుచు పెళ్ళాం, ముసలి మొగుడు. 'భార్యా రూపవతీ శత్రుః' చందం తారుమారైంది. ఆమె అతనికి శత్రువు కాలేదు; అమాయకురాలు, భయస్థురాలు, ఉత్తమా ఇల్లాలు. అయితే అతడు ఆమెకు శత్రువయ్యాడు; కట్టుబాట్లులావు. బయటి నీడకూడా నమ్మరానిది. కాలేజీ పిల్లకాయ ఒకడు హెచ్చులకారి పిందెగా మారి, దారిన పోతూన్న ప్రతీదఫా ఆ ఇంటిమీదికి చూపులు గుప్పిస్తూంటే, భార్యా అందం మాత్రమే దీనికంతటికీ మూల కారణ మనుకొని, ఆ కుర్రాణ్ణి గద్దించి పిలిచి, మెట్టిల్లాను అతనితో భేటీ చేయించి, "లేవదీసుకుపో దీన్ని," అనేస్తాడు. ఆ కుర్రవాడు ఏమంటాడో గాని, చచ్చినా మెట్టిల్లా గడపదాటి వీధిలోకి పోదు: వీధి అంటే లోకం. లోకమంటే అడవి. తనకు అక్కడ భద్రతలేదు. ఇక్కడ ఈ 'పులి' నోటికి లేడిపెంటిలా చిక్కింది. ఇది తెలిసిన పీడ. తెలియని పీడే భయంకరం; "నా పెళ్ళాం బహు బుద్ధిమంతురాలు. ఇచ్చిన స్వేచ్ఛనైనా పుచ్చుకోలేదు". నిజమే. మెట్టిల్లాకు కావలసింది స్వేచ్ఛకాదు, సంరక్షణ : తనకు వ్యక్తిత్వమే అక్ఖర్లేదు. ఆ కుర్రవెధవ నొకసారి పిలిచి మగనాలి అనవలసిన మాటలే అంది: "మీరూ మీ నేస్తులూ నాకాపరం మన్ననివ్వరా? మీకు నేనేం అపకారం చేశాను? తలవంచుకొని మీతోవను మీరు పోతే నే బతుకుతాను, లేకపోతే నా ప్రారబ్ధం."

విన్నకథకూ రాసిన కథకూ పోలికలే లేవు. అక్కడ ఆ జమీందారుకుమార్తె అద్దంలో పులిని చూసి జడుసుకొని పోయింది. ఇక్కడ అద్దంవంటి తన ముఖానికి పీడని చింతను నీడగా అంటించుకొన్నట్లు, 'పులి'తో సహవాసంచేసి సహధర్మచారిణిగా ఉంటూ, చావుకంటె హీనమైన బతుకు బతుకుతూంది మెటిల్డా. గ్రామదేవత బలివితర్దికముందు నిస్సహాయంగా నిలుచుకొన్న మేకపిల్లలాంటిదే గాని, వ్యక్తిత్వమూ మానవత్వమూ నశించిపోయిన మెటిల్డా, దయకు కూడా తగదు.

రసవాద విద్య అంటే ఇదే. విన్నదీ కన్నదీ అంతరాంతరాల్లో దూరి, అభిప్రాయాలతో అభిమానాలతో కలకలిసిపోయి, వాస్తవానికి కాస్తోకూస్తో పోలిక గల సరికొత్త రూపుతో సాక్షాత్కరిస్తేనే – వస్తువు భావనాత్మకమైపోతేనే – సాధారణమైన అనుభవం కూడా కళాంశను సంతరించుకొంటుంది. అప్పారావు కథలన్నీ – అన్నీ కలసి అరడజను కూడాలేవు-ఇలా భావనాత్మకంగా మదరమాగిన జీవిత ఫలఖండాలే. అప్పారావు కథలకు *ఆణిముత్యాలు* అని పేరు పెట్టి వాటి గుణాలను వివరిస్తూ అవసరాల సూర్యారావు రాసిపోయిన మాటలు ఇవి:

"కథానిక రచనలో నాటకీయత, క్లుప్తత వీరి పద్ధతి. అలాగని విషయాన్ని కుదించరు. పాత్రలను మరుగుజ్జులుగా తయారు చేయరు పాత్రల సన్నివేశాల సంఘటనల అల్లికలో గొప్ప తార్కిక శక్తీ, మహత్తర కల్పనా, యోజనా, విస్తీర్ణతా, అడుగడుగునా కన్పిస్తాయి. సన్నివేశానికి తగిన వాతావరణం, వాతావరణానికతగిన పాత్రీకరణ, కథానికలలో రమ్యంగా అమరి పఠిత హృదయంపై చెరగని మొహరులను వేస్తుంది."4

క్రొత్తనపు వెర్రితలపుల్లో ఒకటిగా కథారచనకూడా ఉండినట్లు వెలిగాడ కొండల పైకి షికారువెళ్ళి ఉండగా అప్పారావు రాసిపెట్టుకొన్న నోట్సుబట్టి ఊహించుకోవచ్చు. అనువాదం అనిపించని స్వకీయముద్రతో కొన్ని పేరాగ్రాపుల మేరకు ఒక కథాభాగం వ్యాపించి *ప్రకృతి* అనే పుస్తకంలో మాటుమణగి ఉంది. అప్పారావు రచనాశైలి తొలినాళ్ళలో ఎలాగుండేదీ తెలుసుకొనేందుకు కూడా ఇది సాయపడుతుంది:

— అతను తిరిగి వచ్చుసరికి అప్పక్షేమమును గూర్చి తనకుగల ఆతృతచేత కొన్ని అడుగులు చెలికత్తెతోడ ముందుకుసాగి సాయంత్రమగుట

దూరము పోవుటకు భీతిల్లి త్రోవకిందుగ కొండ దక్షిణపు కొసను నొకనల్ల రాతిపై గూర్చుండెను. చల్లగాలి గట్టిగ వీచి రొజ గొట్టుచుండ గడ్డితలలు పక్కపక్కకు నాట్యము సలుప, పొదలు ఆకులు పైకెగసి తెల్లని కిందిభాగముల గనపర్చుచుండెను; శుద్ధ ఏకాదశి రోజయినను మబ్బుచే గుడ్డివెన్నెల. మబ్బు గమ్మి వెన్నెలమసగ నిండియుండెను.

ఆవిడ దక్షిణవైపు తిరిగి కూర్చుండ, గాలి కురుల నెగరగొట్టుచుండ గాలి తాకిడిని యెదుర్చు రీతిని మోమెత్తి యుంచినది. తెల్లని శాలువ కప్పుకొని సరిచేసుకొని దారివంక చూస్తూయుండెను.

పదిగజములు క్రిందుగా నిలువచేత కాపాడబడి ఒక బిల్వము బంగారు పండ్ల బరువుచే కొమ్మల నొంచియుండెను.

కొంత తడువు తోవ కెదురుగా పక్కపక్కలకు తిరిగి తిరిగి చూచి చెలికత్తెతో ఆవిడ యిట్లనియెను: "యీ బ్రాహ్మణ చిన్నవాని యోగ్యత బహు యెన్నికగా నున్నది!"

* * *

మబ్బులుకమ్మి గుడ్డివెన్నెలను అడ్డిరవి. ఆమె కట్టుకున్న తెల్లనిచీర చీకటిలో నువ్వానేనా అన్నట్లుండెను. చీర అంచులు గాలికి కదులుతూ వుండగా ఆమె విగ్రహమువలె కూర్చుండి వుండెను. వనము నిశ్శబ్దముగా వున్నది. కొండ శిఖరములు కంటికి ఆనుటలేదు. శీతాఫలములు వాసనలను వెదజల్లు చుండెను.

"మిమ్ము యీ కొండను యేలే వనదేవత అనుకొంటిని. వట్టిచేతులతో దేవతలను చూడకూడదు. గనుక యిదిగో ఉపహారం!"

ఈ మాటలు ఆడుతూ వుండగా గతుక్కుమని లేచి ఆమె యేమి అనుటకు యెరుగక నిలిచివుండగా అతను: "మీ అప్ప ఖులాసాగా వున్నారు. కూర్చోండి. వక అరఘంటలో వస్తారు. నేను అడ్డు తోవను వచ్చాను...."5

చంద్రవదన, రామతిలకం,* కామాక్షీ వగైరా వారవిలాసినుల సన్నిధిలో ప్రథమ యౌవన సహజమైన కాల్పనిక మనస్కత, ఇలాంటి కథలనుగాక మరెలాంటి వాటిని అభిమానించగలదు గనక? సంభాషణలలో తప్ప కథకుడే నేరుగా చెప్పవలసినచోట కృత్రిమమైన వచనభాష, వీరేశలింగం మోతాదులోనైనా, ప్రయు

* ఈమెకు రామస్వామి అనికూడా పేరున్నట్లుంది. ఆనంద గజపతికికూడా మచ్చిక పడిన మనిషి ఈవిడే.

క్రమే ఉండడం గమనించ దగింది. పై గా వర్ణనాబాహుళ్యం కథా గమనవేగాన్ని అడ్డుకొంటుందనే కళారహస్యం, అప్పటికింకా అప్పారావు తలకెక్కి ఉండలేదని కూడా తెలుస్తుంది. ఇంతకూ ఈ విహార యాత్రలకాలం, కన్యాశుల్క నాటక ప్రథమ రచనకు కొద్ది ముందుగానే- 1882-'83 అయి ఉంటుంది. దిద్దుబాటు కథను రాసిందెప్పుడో తెలియదుగాని, అది అచ్చుపడింది మట్టుకు 1910లో. ఈ పాతికేళ్ళ కాలంలో ఆ తొలి అవలక్షణాలు పూర్తిగా అంతరించాయనేందుకు వీలు లేదు. పై జెప్పిన కథలో, తానై తాను రచయిత కథనం చెయ్యవలసినచోట కాస్త పట్టుబట్టి గ్రాంథికానికి సమీపంగా వెళ్ళినట్లు, ఈ కింది కథాభాగంబట్టి తెలుస్తుంది; ప్రారంభంలో,

"తలుపు ! తలుపు !

తలుపు తెరువబడలేదు. ఒక నిమిష మతడూరుకొనెను.

గదిలోని గడియారము టంగుమని ఒంటిగంట కొట్టినది.

కథాంతంలో మళ్ళీ,

అంతట మంచము క్రిందనుండి అమృత నిష్యందిని యగు కలకల నగవును కరకంకణముల హృద్యారావమును విననయ్యెను.

భాష నటుంచి, కథక శిల్పాన్ని గమనిస్తే, దానికీ దీనికీ, ఈ పాతిక శతాబ్ది వ్యవధిలో, కలుపుకూ పంట మొక్కలకూ గలంతటి తేడా ఉంది. 'సెట్టింగ్' కోసం పనిగట్టుకొని 'విశాఖపట్నం చేంతాడంత' వర్ణన చేసే పిల్లబుద్ధి ఎటుపోయిందో పోయింది. నేరుగా కథలోకి దూకుతున్నాడు. అవసరాంశాన్ని అనవసరపు చెత్త నుంచి, వేరుచేస్తున్నాడు. కథకుడుగా తనమీద తానే అంకుశాన్ని ప్రయోగించు. కొని, మదేభయానానికి బదులుగా హరిణగమనాన్ని అలవరచు కొంటున్నాడు. రష్యన్ కథకాగ్రగణ్యుడైన చెకాఫ్ (Chekov) ఒకసారి అన్నాడూ, కథల సాధారణ ఉపక్రమోపసంహారాలను నిర్దాక్షిణ్యంగా ఉత్తరించి కత్తిరించి వెయ్యాలి.

My own experience is that once a story has been written one has to cross out the begining and the end. It is there that we authors do most of our lying. 6

అప్పారావు కథలన్నీ ఇలా సెలగలాగా చువ్వలాగా ఉండి చకచకానడుస్తాయనికాదు. సంస్కర్త హృదయం కథా ప్రారంభమే దాదాపు రెండు పుటలు

పరచుకొంది. ఇంగ్లీషువాళ్ళ కోసమని రాసింది కాబట్టి, కథా వాతావరణం గురించి ఈ మాత్రం వివరణ తప్పదేమో లెమ్మనుకోవచ్చు. దేవుడు చేసిన మనుషుల్లారా! మనుషులు చేసిన దేవుళ్ళారా! మీ పేరేమిటి? శీర్షికకు తగ్గట్టుగానే మూరెడుబారెడుగా పెరిగిన కథ. ప్రధాన పాత్రలు ఇందులో నాలుగైదు పుటల తర్వాతగాని తల వెళ్ళబెట్టవు. ఇది వట్టి కథ అయితే, శిల్పలోపం ప్రముఖంగానే కనిపిస్తుంది. నిజానికి ఇది కథకాదు, నవలిక. 'సైజు'నుబట్టికాదు దానికీపేరు, కథా స్వభావాన్ని బట్టే, తగింది. కేవల ఘటన చుట్టూ వ్యాపించిన మతసంబంధమైన సాంఘిక వాతావరణం, మామూలు కథకైతే తలకు మించిన బరువయ్యేది. ఊరు ఊరంతా అందులో ఇముడుతుంది. అంతే కాదు, కథ చట్రంలో హైదరాబాదు వైపునుంచి వచ్చిన శివాచార్లు కూడా ఇముడుతారు. బౌద్ధ విగ్రహాన్ని కొనుగోలు చేయదలచిన దొరకుకూడా తావుంది. అందుకనే ఇది 'నవలిక' అంటున్నది. అప్పారావు మిగత కథలు అసలు సిసలు సరుకే, అవైనా ఎన్ని? మెటిల్డా ఒకటి పెద్ద మసీదు రెండు, దిద్దుబాటు మూడు, సంస్కర్త హృదయం నాలుగు, మీ పేరేమిటి ఐదు. ఐదే అయినా, రాశికంటె విలువ గొప్పది ఈ పంచరత్నాలకు.

# 2

“పుష్కలమైన అనంతమైన సంఘటనలలో నిండివున్న, ఎంతో గాంభీర్యమూ వైవిధ్యమూ గల నేటి” వాస్తవిక జీవితం నుంచి “సమకాలిక యితివృత్తాన్ని స్వీకరించి” అప్పారావు రాసిందొక్క నాటకాలనే కాదు, కథలను కూడా. *పెద్ద మసీదు* తప్ప తక్కినవన్నీ అలాంటివే.*

గురజాడ సాహిత్యాని కంతటికీ సామాన్య లక్షణాలలో ఒకటేమిటంటే, పురుష పాత్రలమీద స్త్రీ పాత్రల నైతికాధిక్య మనాలి. వేశ్య కావచ్చు, వ్యభిచారిణి కావచ్చు. అర్భకురాలో నెరజాణో ఎవతైనాసరే, స్త్రీవిషయంలో అప్పారావు అభిమానం సదవగాహనతో కూడుకొన్నది. కథలలో గుండె నిబ్బరం గల నాంచారమ్మ మెతక గొడ్డువంటి మెటిల్డా పక్కన; సూదంటురాయి లాంటి వేశ్యయువతి సరళ భర్త మనస్సును తన మీదికి మరలించుకొనేందుకు యుక్తి పన్నవలసి వచ్చిన కమలిని లాంటి సామాన్య సంసార స్త్రీ పక్కన, నిలిచి స్త్రీ పురుష సంబంధాలకు గల శతకోటి రూపాలలో కొన్నిటికి మూర్తి కడుతున్నారు. మన్మథానురాగం, వివాహం: నైతిక దౌర్బల్యం దాంపత్య జీవితం: ఎడపెడలుగా కనిపిస్తున్నాయి. స్త్రీ సర్వే సర్వత్రా బాధితురాలు గాక తప్పడం లేదు. సంఘశాసన సంపుటమైన నీతిసూత్రాలొక వంకకు లాగుతుంటే, మనోధర్మాలు మరొక వైపుకు లాగుతున్నాయి. కనకనే అంతస్సంఘర్షణ, చిత్తక్షోభ.

*దిద్దుబాటు* కథకూ వీరేశలింగం రాసిన *అపూర్వ బ్రహ్మచర్య ప్రహసన* కథకూ కొంతపోలిక ఉంది. అప్పారావు కథానాయకుడు గోపాలరావు, వీరేశలింగం ప్రహసన నాయకుడు రమాకాంతం పంతులులాగే స్త్రీలోలుడు. కాకుంటే అలా కాకలుదీరిన యోధుడు కాదు. పాటవిని ఆటచూచి మెచ్చి, మెప్పును దేహం మీదికి మరల్చి, వేశ్యాసాంగత్యం చేస్తూ పొద్దుపోయాకనే ఇంటికివస్తూ కమలిని మనస్సు చివుక్కుమనిపిస్తాడేగాని, రమాకాంతంలా, పెళ్ళాలున్న వారందరికీ సింహస్వప్నంలా తయారుకాలేదు. వాసుదేవరావు పంతులుగారి భార్య పుట్టింటికి పోయిఉంటే, ఆమెకోసం స్టీమరుమీద కొవ్వూరు వెళ్ళగోరడు; భృత్యుడైన కరటకరెడ్డి కొత్తగా పెళ్లాడివున్న మోహినితో సరసాలాడ జూడడు. ఇంకా

* I wondered why authors in variably draw their plots from old world romances when the present wonsfnll of varied and iutense life అన్న మాటలకు సూర్యారావుగారి స్వేచ్ఛానువాదం ఇలా వ్యాఖ్యానరూపం ధరించింది :

భార్యంటే గౌరవమూ ప్రేమా ఉన్నవాడు గనకనే, పుట్టింటికి పోయినట్లు దొంగ జాబు రాసి బల్లపై పెట్టి మంచంకింద దాక్కొని ఉన్న కమలిని గురించి గాభరాపడి బుద్ధివచ్చింది చెంపలు వేసుకొంటున్నాను కనికరించి తిరిగి రమ్మని-తా నొక జాబు రాసి కమలిని పుట్టింటికి పట్టుకెళ్లి చూపించి మంచి మాటలాడి వెంటబెట్టుకు రమ్మని భృత్యుడైన రాముణ్ణి ప్రాధేయపడడు. గోపాలరావులో మార్పు బీజప్రాయంగా ఉంది. రమాకాంతం పంతులు మనస్సు చేవ మాను; గొడ్డలికో, నిప్పుకో లోబడవల సిందేగాని, అది చచ్చినా వంగదు, చస్తేనే లొంగుతుంది. ఈ ఒక్క కథవాలు, వీరేశలింగానికీ, అప్పారావుకూ గల భేదమంతా, నీతివర్తన గురించి సాహిత్యపరుని దృక్పథం సదయుడైన న్యాయాధిపతి నిర్ణయంలాగుండాలిగాని పుండుపై వాలిన ఈగ చందాన నీచ శృంగారంలోనే మునిగితేలేదిగా ఉండగూడదని చెప్పడమే. అవినీతిని బజారుకెక్కించేప్పుడు, రంకుపురాణాన్ని రంకుపురాణంగానే రచ్చ కెక్కించగూడదు దాన్ని ఖండించిన సూచన మారుమూల వ్యంగ్యంగానైనా ఉండాలి. అప్పుడే సంస్కరణకు సాఫల్యం.

వికటమైన హాస్యంకాదు అప్పారావుది. పబ్లికున ముద్దులాటలతో హాస్యం కలిగించబోయి మరొకటి కలిగించడు. వ్యంగ్యానికి వ్యంగం, అపహాస్యానికి అపహాస్యం, నిర్మల హాస్యానికి అదీ, సంభాషణల్లోనే గాక కథా నిర్వహణలోనే ఇమిడిపోతాయి. భార్య ఆడిన దొంగనాటకం, అమాయకుడని పిస్తూనే తెలివిగా నౌకరు నడిపే తంతూ, వాళ్ళిద్దరి సమక్షంలో భర్త పశ్చాత్తాపమూ పాఠకునికి తెలీకుండానే హాస్యం కలిగిస్తాయి. కథలోని పాత్రలు - భార్య, నౌకరు- తామే లోపల్లోపల కడుపుబ్బా నవ్వుకొంటూ ఉంటే, పాఠకుడేం చెయ్యగలడిక, తానూ గోపాలరావు కంటబడకుండా నవ్వుకోవడం తప్ప?

వట్టి మాటలతో గూడా అప్పారావు హాస్యాన్ని పుట్టించగలడని ఈ తక్కువ ఒకపు సంభాషణ తెలుపుతుంది. నడివీధిలో చేరి చుట్టగాల్చుకొంటున్న రాముణ్ణి పిలిచాడు యజమాని.

"మీ అమ్మేదిరా?"

"మాయమ్మా? యింటున్నది బాబూ"

"మీ అమ్మకాదురా: బుద్ధిహీనుడా: నా భార్య."

"అమ్మగారా? యెక్కడుంటారు బాబూ? పడున్నారు."

"యింట్లోనే లేదు."

అమ్మగారెక్కడరా, అంటే వాడు తన తల్లి ఊసెత్తకనేపోను. ఎత్తనే ఎత్తాడు గాబట్టి కథకు పనికొచ్చేట్టు విశాఖపట్నం యాసతో "యింటున్నది" అని శ్లేషకూడా సాధించ గలిగాడు. నిజానికి కమలిని మంచంకిందనుండి వింటున్నది; రాముడి తల్లి యింటనున్నది. ఈ "యింటున్నది" రెండంచులా తెగింది.

ముద్దులు వీరేశలింగం ప్రహసనంలో ఉంటే, ఇక్కడ పిడిగుద్దులున్నాయి– "వీళగుద్దులు" పడీపడకముందే గోపాలరావు పశ్చాత్తాపపడి స్వయంగా రాముణ్ణి లేవనెత్తి వీపు నిమిరి గదిలోకి తీసుకెళ్ళి – దారి పొడుగునా హాస్యం కలిగిస్తూ – గొంతులో దైన్యం తోచేవిధంగా "రామా యేమాయెరా! "అంటే, ఆ రాము దేమనాలి? 'మాయె'ను మళ్ళీ విరిచి "యేటో మాయలావుంది బాబూ,"అంటున్నాడు. ఆడవాళ్ళకు చదువు చెప్పిస్తే, చీటికీ మాటికీ అలకపాన్పులు చేరడమో, పుట్టింటికి పోవడమో జరగాలి, అని వాడి అనుభవం. తానే తన కుమార్తెకు చదువెందుకు చెప్పిస్తున్నట్లు మరి?

కమలిని రాసిపెట్టిన జాబునిండా ఎత్తిపొడుపుతో కూడిన హాస్యమే. 'ప్రియా' అని సంబోధించేదల్లా ఇప్పుడు 'అయ్యా' వరకూ వచ్చింది. గోపాలరావుకు ఆశ్చర్యమూ విచారమూ కలిగాయి. రాముడికంతా నవ్వులాట–'ప్రియా'ను మళ్ళీ విరిచి, "పెయ్యపోయిందా బాబూ?" అని అడుగుతున్నాడు.

మీటింగులూ కాన్ఫరెన్సులూవంటి రాచకార్యాలమీద నెపంబెట్టి, లోకాన్ని మర మత్తు చేస్తున్నానని చెప్పుకుంటూ, గోపాలరావు భార్యవద్దనేఅబద్ధాలాడవలసివచ్చింది. భార్య అనే గ్రహం వుండబట్టిగదా, అతనికి అబద్దాలాడక తప్పని గ్రహచారం! "మీచే దినదినమును అసత్యమాడించుటకన్న మీ త్రోవకు అడ్డుగ నుండకుండటయే, పతిమేలుకోరిన సతికి కర్తవ్యంకదా?" అందుకనే ఈ పుట్టింటియాత్ర. ఇది కథకు పతాక. జాబు దెబ్బతో గోపాలరావు తలకెక్కి ఉండిన నిషా దిగింది. "గుణవతి, విద్యానిధి, వినయ సంపన్నురాలు" తనకు తగిన శాస్తే చేసింది.

ఉత్తరం ముగించి "నేను పశువును" అని గోపాలరావు అనెను.

"అదేటిబాబు అలా శలవిస్తారు?"

"శుద్ధ పశువును!"

రాముడు అతి ప్రయత్నముచే నవ్వు ఆచుకొనెను.

యజమానురాలు పుట్టింటికెళ్ళిందని యజమాను డంటున్నాడు. ఇదివిద్యారమే!

చెప్పక చెయ్యక పుట్టింటికి పరుగుదీసే ఆడదాన్ని, "లెంపలాయించి కూకోబెట్టాలి గాని, మొగోరిలాగ రాతలూ, కోతలూ మప్పితే ఉడోరంపుట్టదా బాబూ?" గోపాలరావు సమాధానం ఇది :.... "భగవంతుడి సృష్టిలోకల్లా ఉత్కృష్టమైన వస్తువ విద్య నేర్చిన స్త్రీ రత్నమే...."

గోపాలరావు ఒక సంఘ సంస్కరణోత్సాహి ; సంస్కర్తల అనుచరుడు. అయితేనేం, మనస్సుని ఖాయిదా చేసుకోలేని సామాన్యుడు. 'రిఫార్మర్' కాలేక 'రిఫార్మిస్టు' అయ్యాడు. సంస్కరణవాదమల్లా మతంగా మారింది. అలా మారిన ప్రతి మంచి భావం, బలహీనులనూ అషాఢభూతులనూకూడా సృష్టిస్తుంది. మతంగా కరుడుకట్టిన ప్రతిదీ మహాత్మ సన్నిభులైన వారితోబాటు (saints) మతవిద్రోహులనూ (heretics) తయారుచేస్తుంది. జీవిత ప్రయోగశాలలో స్వానుభవ రసాయనిక ఈ మత విశ్వాసాల సాఫల్యాన్ని ఎవడికివాడు పరీక్షించుకొని నిగ్గుదేల్చుకోవాలి. సంఘర్షణ ద్వారా వాటిసత్తాను మనస్సు కెక్కించుకోవాలి. అలా ఎక్కించుకోలేక ఓడిపోయిన వాడి కథ, అప్పారావుచేత (Stooping to Raise) (సంస్కర్త హృదయం) రాయించింది.

కాలేజీలో సైన్సు అధ్యాపకుడైన రంగనాథయ్యరు ఈ కథకు నాయకుడు కావడం సుముచితంగానే ఉంది. 'ఎక్స్పెరిమెంటు' ద్వారా శాస్త్ర సత్యాన్ని ధృవీకరించుకోవలసి ఉండగా, ఇతగాడు 'లెబొరేటరీ' పద్ధతిని జీవితంలో అమలు పెట్టకుండా వతి అభిమానంగా తనకు దగుమతి అయిన వేశ్యా సంస్కరణను మక్కీకి మక్కీ అమలుపెట్టబోయి భంగపడ్డాడు. షేక్స్పియరు రాసిన ఒథెల్లో నాటకంలోని 'దుష్ట' పాత్ర ఇయాగో (Iago) శీలాన్ని పరిశీలిస్తూ ఆడెన్ (W. H. Auden) ఒక సత్యాన్ని బయల్పరిచాడు* : ఫ్రాన్సిస్ బేకన్ ప్రాచుర్యం కలిగించిన ఈ శాస్త్రీయ ప్రయోగ పద్ధతిని చేబట్టి, డెస్డిమోనా మీద ఒథెల్లోకు అపనమ్మకమూ అనుమానమూ కలిగించాడేగాని, దుశ్చింతతో మాత్రమే అయిఉండదు. రంగనాథయ్యరు శిష్యుడైన చందర్, గురువుగారికి పంగనామాలు పెట్టే సరళను చేరదీసి ఉన్నాడు. ఆయన మీదనే ఈ ప్రయోగక్రమం జరిపాడు : ప్రయోగ పరికరం సరళ. పరీక్షకు

---

* "Iago's treatment of Othello conforms to Bacon's definition of scientific enquiry as putting nature to Question ... By the end of the play he does know the scientific truth about the object to which he has reduced Othello."

THE ALIENATED CITY : Reflections on Othello
W. H. Auden : ENCOUNTER, August 1961 (P 14)

గురై ఫలితం చూపవలసివచ్చిన వస్తువు, అయ్యరు గుండె దిటువు. సిద్ధాంతానికీ ఆచరణకూ సామరస్యం ఉందా, లేదా ?

బ్రాహ్మసామాజికులూ, సంఘసంస్కర్తలూ అయిన మహామహుల వైఖరికీ "బాజాలలో గర్భితమైన వేదాంతం" గురించికూడా తర్కించుకొనే మేధశ్శాలి అప్పారావు వైఖరికీ, కొట్టవచ్చేటంత తేడా ఉంది. శిఖరం మీద చేరి సామాన్యుల కలివిగాని నీతి సూత్రాలతోటి ఆదర్శాల గాలిపడగ లెగరవేస్తూ హృదయ దౌర్బల్యాలనూ రక్తనిష్ఠమైన ఆహార నిద్రా భయ మైథునాలవంటి సహజోద్రేకాలనూ గమనించని వాళ్ళు, మీదివాళ్ళు. మైదానాలే వాళ్ళ కళ్ళకు ఆననప్పుడు, బొరియలూ కలుగులూ ఆనుతాయా ? బోగంపిల్లలో మానవత్వాన్ని చూచి చూపింపబూనిన అప్పారావు, ఆ వృత్తిని ఆమోదించకుండానే, దాని యథార్థరూపాన్ని అవగతం చేసుకొన్నాడు. వివాహంలాగానే వివాహేతరమైన పడుపువృత్తి, ఒకానొక అవసరాన్నిబట్టి ఏర్పడి మనుషులకు యథాశక్త్యా ఉపకరిస్తూన్న ఒక సామాజిక సంస్థ. గుణాలకంటె అవగుణాలే దానిలో ఎక్కువకావచ్చు; దాని నాశ్రయించుకొని పొట్టబోసుకొంటున్న వాళ్ళుకూడా మనుషులే. సరళలాంటి పడుచులు ఇప్పుడిప్పుడు చదువుకొని సంస్కారవతులై కులవృత్తిని కంటగించు కొంటున్నారు. వాళ్ళకు సంఘం ఇచ్చే అవకాశం బట్టి ఈ మార్పు ఫలప్రదమౌతుంది. తిరిగీ వాళ్ల వ్యభిచారాన్నే నమ్ముకొని, అందరికీ గాకున్నా ఒక్కనికైనా ఉంపుడుగత్తెలయ్యేట్టుంటే, దానికంటె కులవృత్తి మేలు. వాళ్ళకు కావలసింది. ప్రేమతో గౌరవంతో కూడిన వివాహం. 'సామాన్య'లు 'స్వీయ'లు కావాలి. సరళలోని సరళోద్రేకం పట్టిన మేలైన తెన్ను ఇదే.

హృదయ దౌర్బల్యాలను కంటకాలుగా శల్యాలుగా ఎంచి వాటిని నిర్దయతో ఏరిపారవెయ్యాలనే పట్టుదలతో, రంగనాథయ్యరుగారు, ఎంతటి సంస్కరణాభిమాని అయినా కావచ్చుగాని, మూర్ఖుడే అయ్యాడు. రోజుతప్పక కొండమీది కోవెలకు పూజచేయబోయే సరళను చూడక, చూచి మెచ్చక, మెచ్చి ఆసక్తి కన్పరచక ఉండజాలని 'మనిషి'కూడాను. మొదట తనమనస్సు నోరుమూయాలి; సౌందర్యార్చన వాదంతో అంతరాత్మ అభ్యంతరాలకు జవాబిచ్చుకొన్నాడు. తర్వాత మానవతా వాదాన్ని సాయం పిలుచుకువచ్చి, తన బలహీనతను దాని ముసుగుమాటున కప్పెట్టుకొన్నాడు; ఆనందహేతువు బోగంపిల్లగా పుట్టినంత మాత్రాన, "మానవులు ఆమెను ఏవగించుకొని నేరస్తురాలికిమల్లే శిక్షించవచ్చునా ?" ఇంకా ముందుకెళ్ళి, వ్యక్తి మనో చాపల్యాన్ని సంఘదృష్టితో సమర్థించుకొన్నాడు: సంఘాన్ని కబళించి

వేయగల ఈ హాలాహలాన్ని నీలకంఠుడై సంస్కర్త తన కంఠసీమలో నిక్షిప్తం చేసుకొని, తాను బాధపడినాసరే. సంఘాన్ని నిష్ప్రమాదం చేయాలి: "ఇంతటి అందగత్తెను విచ్చలవిడిగా విహరించనిస్తే, సంఘమూ పాడవుతుంది; ఆవిడా చెడిపోతుంది" ఈ ఆత్మవంచనలో దానిపైమెట్టు ఇది: మనిషి బలహీనతలను దేవుళ్ళ కంటగట్టి దీనిద్వారా ముందుదాన్ని సమర్థించుకోవడం : అర్ధనారీశ్వరుడై సర్వేశ్వరుడే స్త్రీ పురుషుల సమాన హక్కులను చాటక చాటుతున్నాడుకదా! పూర్వం తనలో గట్టిపునాది లోపించిన ఆ స్త్రైక్యం ఇప్పుడు సొంత అక్కరకొద్దీ గట్టిపడది: "సాజాత్యంవున్న జీవుళ్ళమధ్య అమృతాకర్షణ వుండితీరాలి." సోపానపంక్తి చివర, గోపురాయమానంగా ఉంది సంస్కరణవాదం; రంగనాథయ్యరు వంటి సంస్కరణ 'వాది' చేతిలోపడి ఇది ఆత్మవంచన ద్వారా లోక వంచనగా పరిణమించింది: దుష్టుల స్వభావాన్ని సంస్కరించాలి. ఇంత పుష్కలమైన సౌందర్యం గల సరళ స్వభావంలో మార్పువచ్చి వ్యాఘ్రగుణం పోయి గంగిగోవు గుణం రాకుంటే, ఇకనేముంది, నిప్పుతో పని లేకుండానే లోకాలంటుకు పోవూ? విషం తియ్యగా కూడా ఉంటే ఎంత ఆకర్షణ!

సరళ సామాన్య వేశ్యకాదు. మధురవాణిలా మంజువాణిలా అసంస్కృత ప్రకృతి కాదు. పడుపుపని "మురికికూపం" అనుకోగలిగింది. తన కన్నతల్లి గదిలోని నలిగిన అరిగిన ఏలూరు తివాచీలా తన బతుకు గూడా పదిమంది కాళ్ళకూ చేతులకూ లోబడి పోగూడదు. తన మది తన గదిలాగే శుభ్రంగా దర్శనీయంగా సరళ సుందరంగా ఉండాలి. అలా ఉండేందుకు వివాహం తరణోపాయమా? "ఎవడో ఒక ఛండాలుడికి నేను కలకాలం పూర్తిగా బానిసనై పడివుండాలనా మీతాత్పర్యం?" అటు దాస్యమూ ఇటు విచ్చల విడితనమూ కాకుండా, మధ్యేమార్గం లేదా? ఉంటే, వ్యక్తికీ సంఘానికీ ఉభయార్థ సాధకమౌతుంది. చివరకు గూడా సరళకు ఈనడిమి జగా దొరకలేదు. 'సంస్కరణ' ఆమెకు బోధపడలేదు. సంస్కర్త ముద్దాడబోయే కుసరికి సరళచేతిలోని వీణకింద పడిపోవడం ఒక సంకేతమనుకొంటే, 'సంస్కర్త' సరళ లొంగిపోలేదను కోవాలి. కారణం? అతగాని లోపం! అందుచేతనే బయటి నుంచి ఎవరో. చందర్ కాబోలు, అన్నమాట : "సంస్కరణ అంటే యిదే! ఒకరిని లేవనెత్తబోయి మనమే కిందపడ్డం!" ఇది విని అయ్యరు గాభరా పడ్డాడు: "దగాలో పడ్డాను, మోసం మోసం" అంటూ నిష్క్రమించాడు. ఈ మాటకు సరళ తెల్లబోయింది, సిగ్గుపడింది. ఆశ్చర్యపడింది, అమాయకంగా

వచ్చింది. రంగనాథయ్యరు పతనానికి కారణం తానా? కాదు, అతనే. ఎలాగంటే, అతని "సిద్ధాంతాలు, నమ్మకాలు- అనంతమైన జీవిత సంఘర్షణ నుండి జనించినవి కావు. అందువలన బలీయమైనవి కావు." తనతో ప్రపంచపు అంచుల దాకా ప్రయాణం చేస్తానని పలికిన సరళను భోగం పిల్లగా తప్ప మానవవ్యక్తిగా, విలాస వస్తువుగా తప్ప భార్యగా, అతను చూడలేకపోయాడు. కనుకనే కథారంగం నుంచీ ఆ వూరినుంచి కూడా 'అయిపు' లేకుండా నిష్క్రమించక తప్పలేదు. ఇకనేం సంస్కారణం! ఆ తన మాటలనిక నమ్మే వాళ్ళెవళ్ళు?

# 3

వృత్తానికి మాత్రమేగాక హిందూ ముస్లిం సంబంధాలకు గూడా కొంతవరకు సంబంధించిన చిన్నకథ, పెద్ద మసీదు అనేది.

ఛప్పన్న శాస్త్రాలూ చదువుకొని కాశీనుంచి చికాకోల్లు చేరుకొన్న వైదిక స్వాములిద్దరు, తమ ప్రయాణానికి ముందు దేవళం గోపురం ఉన్నచోట ఇప్పుడొక మసీదు ఉండటం చూచి ఆశ్చర్యమూ, విషాదమూ పొందుతారు. అంతకంటె కూడా ఆశ్చర్యాన్నీ విషాదాన్నీ కలిగించిన విషయం, వాళ్ళిద్దరిలోనూ ఒకరిమేనమామ ఇప్పుడు శుద్ధఛాందస ముసల్మానై మసీదులో కూచుని మతతంతునంతా భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తూ ఉండడం. నారాయణభట్టు మనస్సు విరిగింది. ఆ వూరికీ తనకూ ఇక ఇలాకా లేదని వచ్చిన దారినే వెనక్కు కాశీకి వెళ్ళబూనుకొన్నప్పుడు, అంతరాత్మలాగా మాట మాటకూ అడ్డుతగులుతూ, ఉద్రేకాన్ని వివేకంతోటి అడ్డుకొంటూ, అతని సహచ్ఛాత్రుడూ సహపథికుడూ అయిన పుల్లంభట్టు నిలవేస్తాడు. ఛాదస్తమూ, లౌక్యమూ ఢీ కొట్టుకొంటాయి. విశ్వాసమూ సందేహమూ కుమ్ముకొంటాయి. హాస్యానికీ, తద్వారా విజ్ఞానబోధకూ మంచివీలు.

మ్లేచ్ఛులు గుడికూల్చి మసీదుకడితే దేవుడెందుకు ఊరకుండిపోయాడో, నారాయణభట్టు చదువుకొన్న శాస్త్ర గ్రంథాలలో ఎక్కడా రాసిలేదు. దేవుళ్ళకు పాట్లు వచ్చిందీ లేనిదీ తెలియదుగాని, పొట్టకు మాత్రం పాట్లువచ్చిన మాట పుల్లంభట్టుకు బాగానే యెరిక. "సాపాటుమాట" ఒక్కటే ఇప్పుడు అక్కరకు వచ్చేది.

ఇలా వాళ్ళను ఏడిపించి తాను నవ్వుతూ అప్పారావు సాధించదలచుకొన్న పరమార్థం, వట్టి అవహేళనం మాత్రం కాదు. ముస్లిములెవరో పరాయివాళ్ళుకూడా కాదు, ఎన్నడో ఏదో జరిగిందని ఇప్పుడు పంతాలు పెంచుకొని కొట్లాటలకు దిగడం తెలివితక్కువ. దేశభక్తి గేయంలోనూ ఇతరత్రానూ ఈ హిందూ ముస్లిం భాయీభాయీ వ్యవహారమే ప్రసక్తమౌతుంది.* మతం, మనుషుల మనస్సులను చీల్చి రణరంగాలనూ జన సంక్షోభాలనూ సృష్టించగూడదు. కన్యాశుల్క నాటకంలో

* "నిన్నవచ్చా రింగిలీషులు మొన్నవచ్చిరి ముసలుమను లటుమొన్న వచ్చినవాడ వీడని మరచి వేరులు పెట్టుకోకోయి" అని రాసికొట్టివేసిన చరణం, చారిత్రకంగా నప్పినంతగా హైందవులకు మానసికంగా నచ్చుబాటుకాదు.

ఏ మారుమూలలోనో ఒక ముసల్మానుని గురించి పరోక్ష ప్రస్తావన ఉందని వెతికి తీసి ఆ నాటకపు సర్వతోముఖ సమగ్రత గురించి వర్ణించిన వాళ్ళకు కొండు భట్టీయం నాటకంలోనేగాక, ఈ కథలోనూగాక, మీ పేరేమిటి ? లో పీరు సాయెబు ఉండనే ఉన్నాడు. అప్పారావు రాసిపెట్టుకున్న కథాప్రణాళికలలో మరిన్ని తార్కాణాలు :

> అత్తరువులు పూదొత్తులు అమ్మే సాయిబు. అత్తరువు సాయిబుతో పాటు, ఒక జ్యోతిష్కుని, భూతవైద్యుణ్ణి ప్రవేశ పెట్టాలి. అవసరమనుకుంటే ఇంకొక ముసల్మాను మిత్రుణ్ణి పరిచయం చేయాలి.
>
> ఒక ముసల్మాను ఒకానొక బ్రాహ్మణ కన్యను పెళ్ళిచేసుకోవాలను కుంటాడు. అతనొక రాష్ట్రానికి అధిపతి. ఆ పిల్లకు వివాహమవుతూ వుంటుంది. అతను ఆ వివాహమును ఆపు చేయిస్తాడు. ఆ పిల్ల మహమ్మదీయుల మతాన్ని స్వీకరిస్తుంది. కొంతకాలానికి అతను ఆమె చాలా యిష్టంగా వుంటారు.... 7
>
> ముసల్మానులేకాదు, క్రైస్తవుల్లో మతాచార్యులు (రివరెండు) 'ఇండో యూరోపియన్ల'ని ఇటీవలి వరకు పేరుబడిన ఆంగ్లో-ఇండియన్లు ఇంకా అసలు సిసలు సీమదొరకూడా ఈ కథకలాల్లోనూ దర్శనమిప్పిస్తున్నారు. వివిధ మతాల నటుంచి, ఒక మతంలోనే ఉన్న భేదాలు అప్పారావు దృష్టినుంచి తప్పించుకో లేదు సరిగదా, తన కథల కన్నిటికీ మకుటాయమానమైన దాన్ని రాయించాయి. దాని పేరే, మీ పేరేమిటి ?

శైవమూ వైష్ణవమూ 'వీర' స్వరూపం ధరించినప్పుడు, జాతులకూ మతాలకూ గల వైరంకంటె ఘోరమైన పోరే తలెత్తి, దక్షిణ భారతదేశాన్ని రక్త తటాకంగా మార్చింది. పామరులను ఆశ్రయించినందుచేత "ప్రపత్తి" పేరుతో అసహిష్ణత పెచ్చుమీరింది. శివకేశవ సమన్వయం సరేసరి. ఈ ఇంటిమీది కాకి ఆ ఇంటి మీదికి వాలగూడదన్నంతటి పట్టింపు, మాటకు మాటా చేష్టకు చేష్టా రెట్టింపు.* ఇది పూర్తిగా అసహనమూ కాదు. ఎందుచేతనంటే, పీర్లపండగ హిందువుల కనేకులకు గోకులాష్టమి లాగానే ప్రియమైన పండగై పోయింది. 'కాఫిర్లూ' (Kafirs) ముసల్మానులూ గ్రామ జీవితంలో ఇరుగు పొరుగు ఒదికను అవసరం కొద్దీ అలవరచుకొన్నారు. ఎటొచ్చీ హైందవ 'మతం'లోని అంతర్విభేదాలే ప్రాణాంతక మౌతూ వచ్చాయి. వాటికి సంబంధించే ఈ గొప్ప కథ.

---

* కన్యాశుల్కంలో గూడా ఈ పట్టింపులూ పంతాలూ వర్ణితాలు. మనవాళ్ళయ్యా, వీరేశ పాత్రల ద్వారా దీనిని నిరూపించాడు,

రచయిత ఎక్కడా నోరు విడిచి చెప్పకపోయినా, ఈ కథాస్థలం విజయనగర సమీపాన గల రామతీర్థాల అని ఊహించుకొనే అంతర్గతాధారాలున్నాయి. ఈ ప్రాంతాల ఒకప్పుడు బౌద్ధమూ జైనమూ వ్యాపించి ఉండేవని, గాంధార శిల్ప సంప్రదాయానికి చెందిన అద్భుత బుద్ధ ప్రతిమలు అక్కడక్కడా పడి ఉన్నాయని ఆయన గమనించి రాసి పెట్టుకొని ఉన్నాడు కూడా, కలకత్తా మ్యూజియంలో వాటిని కళ్ళారాచూచి ఉన్నాడు. ఇప్పుడు అలాంటి బుద్ధ విగ్రహమొకటి అక్కరకు వచ్చింది. కథాస్థలంలో - ఒక గ్రామం - శైవులు దాన్ని శివవిగ్రహమనుకొని పూజ చేస్తున్నారు. శైవుల నాయకుడైన జంగం శరభయ్య దాన్ని ఒక దొరకు అమ్మజూపాడు కూడా. తత్ఫలితంగా ఆ "నందికేశ్వరుడి అవతారం" బడితె పూజకు భయపడి కట్టురాళ్ళు తెచ్చుకొని వుడాయించ వలసివచ్చింది. ఇక విష్ణుస్థలం ఉంది. ఇటీవలి కాలంలోనే దాన్ని విజయనగర రాజాలు ఏర్పాటు చేశారు, సాతాని మనవాళ్ళయ్య వైష్ణవులకు కెప్తాను. శరభయ్య నంది అంశలో పుడితే, తాను "గరుడాళ్వారి నఖాగ్ర"మైనా కాకపోతాడా? ధర్మకర్త అయిన రంగాచార్యులు, ఆయన కుమారుడు కృష్ణమాచార్యులు, అతని భార్య నాంచారమ్మ "జ్ఞానులు". వాళ్ళు శైవులతో తలపడరు. కేశవుడే అధికుడైనా శివుడు అల్పుదేమీకాదు. దేవుళ్ల తెలివైనవాళ్ళు. ఒకళ్ళనొకళ్ల పూజించుకొంటారు. వాళ్ళ భక్తులతోనే వచ్చింది బెడద. ఆ వూరి నాయళ్లు "స్తోమం కలవాళ్లు". లక్షాధికారి సారథి నాయుడు వైష్ణవుడై ద్వాదశి ద్వాదశికీ స్వామి వారికి "రాగభోగాలు" నడిపిస్తూంటే, అతని బావమరిది రామినాయుడు చక్కెర పొంగలి ఆరగిస్తున్నాడు. హైదరాబాదు ప్రాంతం నుంచి వచ్చిన శివాచార్లు సారథినాయడి మనస్సు తిప్పగోరి నిప్పుల గుండం తొక్క బూనుకొన్నప్పుడు, ఈ పెద్ద కథలో అసలు కథ మొదలౌతుంది.

గుండం తొక్కడం వగైరా "తామస" వ్యాపారాలు. వైష్ణవంలో వాటికి తావులేదు. అయినా మనవాళ్ళయ్య వినడు. రాత్రిపూట మీటింగు పెట్టి నెత్తికి తెచ్చుకొన్నాడు. వైష్ణవ భక్తాగ్రేసరులందరూ చివరకు తననే అగ్గిలో తోసి బుగ్గిచేసేటట్లున్నారు. తూకమే వేస్తే తాను "పది యిరవై మణుగుల పట్టు." గుండంలో దిగి బతికి బయట పడడమే! కూరుకు పోవడమొక్కటే మిగిలేట్లుంది. నిజంగా ఒక అరగడియసేపైనా తాను గరుడాళ్వారు కాగలిగితే, యెక్కడికైనా ఎగిరిపోయి ప్రాణం కాపాడుకోగలడు.

సాతాన్లూ, నాయలూ, రామినాయని సారాదుకాణంలో "రహస్య శేవ"

సేవించి వచ్చి ఉన్నారాయె. వాళ్ళు మనవాళ్ళయ్య మొర వినేట్టుగా లేరు. "చులాగ్గా దేగలా" వున్న రామానుజయ్య మీదికి ఈ బరువు తోద్దామంటే, అత గాడు "మంద" లో మాయమయ్యాడు. పోనీ, తాను నీళ్లలో దూకేందుకు గూడా వాళ్ళు ఒప్పుదల చెయ్యలేదు. చివర కొక ఎత్తు ఎత్తాడు కెప్టాన్ మనవాళ్ళయ్య. ఉత్సవ విగ్రహం ఒకటి నెత్తికి కట్టుకొని నిప్పులో ఉరుకుతానన్నాడు. సరే, విగ్రహం బదులు రంగాచార్యుల వారిని నిద్దర మంచం మీదనుంచి పై మీది గుడ్డ యినా లేకుండా మోసుకొచ్చారు. ఆయన పుత్రరత్నం కృష్ణమాచార్యులు అట కెక్కి దాక్కున్నాడు. ముసలివాణ్ణి నిప్పులో తోసేట్టున్నారని కోడలు నాంచారమ్మ ఉగ్రురాలై బయల్దేరి వచ్చి, గయ్యాళ్వారి నఖాగ్రమైన సాతాని మనవాళ్ళయ్యకూ చక్కెర పొంగలి భక్తులైన నాయళ్ళకూ బుద్ధి జెప్పి, చివరకు పీరుసాయెబు చేత గుండం తొక్కించి, అసలు కథను ముగింప జేసింది. "యే మతమైనా ప్రవత్తి వున్న వాడికి తోవవుంది," అని రంగాచార్యుల సూక్తి. దానికి ప్రత్యక్ష తార్కాణ పీరుసాయెబు. "కపీరుదాసంత భక్తుడు"; "వెండి పీరు వకటి రెండు చేతులా పట్టి" భీమునివలె గుండంలోనుంచి నడుచుకుపోయిన వీరుడు. పీరైతేనేమి, ఉత్సవ విగ్రహమైతేనేమి ? నాంచారమ్మ అన్నట్టు, వైష్ణవులంటే మరెవరు, తురకలే.

పీరు అనేది యేమిటనుకున్నారు ? శ్రీ స్వామివారి తిరునామమే.

నాంచారమ్మ నమ్మి ఈమాట అన్నదో లేదో గాని, అసలు కథ వింటూన్న శాస్త్రిలుగారు మాత్రం కలియుగంలో దేవుళ్ల సంకరం గురించి బాధ చెందాడు. అయితే అంతలోనే ఆయన తన మనస్సును సమాధాన పెట్టుకొంటూ, శివుడన్నా విష్ణన్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మ మట్టుకు ఒక్కడేగదా, అనగలిగాడు. కిరస్తానులా, కాదు, కిరాతకుడిలా, దేవుళ్లనందరినీ పీనుగులన్న ఉక్కుపిండం వెంకయ్య సూచించిన పద్ధతి మాత్రం కిరాతకంగా లేదు. దేవుళ్ళంతా చేరి ఒక్కచే అయితే, వాళ్ళనందరినీ ఒక్కచోటే చేర్చి అందరూ కలిసి ఒకేమారు ఒకేలాగు పూజిస్తే సరిపోదా ? వెంకయ్య కూడా నాస్తికుడు కాదు. కాకుంటే కాస హేతు వాది. బుద్ధుడూ వగైరా "దేవుళ్ళు" అవతార పురుషులై ఇప్పుడు పూజలందు కొంటున్నారు గాని, లేకపోతే ఈ శరభయ్యలా, మనవాళ్ళయ్యలా వట్టి మనుష్య మాత్రులేగద: ఇక రామ్మూర్తి ఉన్నాడు, "శతపెంకె". పురాణాల గురించికూడా సందేహాలే. సర్వ దర్శన సారసంగ్రహం, బుద్ధచరిత్రం వంటి గ్రంథాలు చదు వుతూ, గురువు గారైన శాస్త్రులనే వాదంలో ఎదుర్కొని మెప్పించగలడు. అసలు

ఈ పాత్రలతోనే ఈ కథ మొదలైంది. అలాగే ముగింపుకు వచ్చింది. వాళ్ళంతా కలిసి "మా పట్నానికి యెనిమిది మైళ్ళ దూరంలో" ఉన్న రామగిరి అనే విష్ణు క్షేత్రానికి వెళ్ళి ఉండగా, శాయన్నభుక్త చెప్పిన అసలు కథను వింటారు.

ఇలా కథలో కథ దూర్చి మొత్తానికి విశ్వసనీయతను కలిగించే విధంగా నిర్వహించాడు రచయిత. వర్ణనలు కొద్దిగా వున్నాయి. అవి స్థలంగురించి గాఢ మైన ముద్రను మనస్సులపై వేసేవే. ఉదాహరణకు –

–మూడోనాడు రాత్రి భోజనం చేసుకొని, డాబామీద నలుగురమూ కూచున్నాం. చిన్నగాలిరేగి, తోటలో కొబ్బరి మట్టలు అల్లాడ ఆరంభించాయి. యెదట దేవుడికొండ బ్రహ్మాండమైన మహాలింగమువలె చీకటిని చీల్చుకొని మిన్నుముట్టి మనిషియొక్క అత్యల్పతను సూచించుచు, యేదో చెప్పరాని చింతను భీతిని మనస్సులకు కలుగజేయుచుండెను. దేవతలు పూజచేసిన దివ్య కుసుమములవలె చుక్కలు శిఖరముచుట్టు చెదిరి వెలిగెను ......

ధూర్జటి "ఉదయగ్రావము...." పద్యంలోని వర్ణన లాంటి దిది. కథా గత పాత్రలే ఈ వర్ణనచేసేవి. వాటి మనస్థితికి తగినట్టుగానే ఉన్న వర్ణన. మతం గురించి శివకేశవ భేదంగురించి పూజాదికం గురించిన ఇతివృత్తం కాబట్టి దానికీ దీనికీ అమరిక.

"మూర్ఖుల" మత విశ్వాసాల వికృత రూపాలను అవహేళన చేయడంలో రచయిత, ఉన్న అవకాశాలనన్నిటినీ పూర్తిగా వాడుకొన్నాడు. మనవాళ్ళయ్య "స్థూలకాయం, బట్టెనామాలు, రాగిధ్వజం," ఉపాదానానికి వచ్చి పెణక ఎగరకొట్టే టట్టు" చదివే స్తోత్రపాఠాలు – ఇవిచూసి కలెక్టరుగారి గుర్రం బెదరి కలెక్టరుగారికి కోపంవచ్చి మనవాళ్ళయ్యకు ఐదురూపాయల జుల్మానా పడడం ఒకటి; గుహఎదుట రాత్రిపూట వృషభరూపం ధరించి జంగం శరభయ్య "మేస్తూ" వుంటాడని నమ్మగల శైవులు బౌద్ధవిగ్రహం కోరిన దొర క్రిందటి జన్మలో పరమమాహేశ్వరుడని,శివునాజ్ఞ చేతనే శరభయ్య ఆ విగ్రహాన్ని అమ్మ జూపాడని, పారిపోవడంలో "వృషభరూపం ధరించి పంకెవేసి" దాటేశాడని, రేపట మాపట కొండపైనో గోపురంపైనో వీరాసనం వేసుకుని ధ్యానముద్రతో కనిపిస్తే బాజాభజంత్రీలతో కదిలివెళ్లి తోడు కొచ్చి, కంసాలి వీరణాచారిచేత ద్విపదకావ్యం రాయించవచ్చునని కూడా నమ్మి ఆశించగలరు. ఈ మూఢభక్తి – "ప్రపత్తి"–పండితులకు కూడాఉండదు గనకనే రంగాచార్యుల ఉదాసీనత, మనవాళ్ళయ్యచేత "ఈ బ్రాహ్మడికి వైష్ణవాభిమానం

తక్కువ" అనిపిస్తుంది. మంటలో దూకమన్నప్పుడు, రామినాయనితో మనవాళ్ళయ్య పెట్టుకొన్న మొర, అతనిపై జాలికలిగించడ మటుంచి, అతన్ని నవ్వులపాలు జేస్తుంది.

–అన్నల్లారా! తమ్ముల్లారా! పరమ భాగవతోత్తముల్లారా! .... యీ శరభయ్యే వచ్చి తాను వృషభావతారమని నిక్కి నీలుగుతున్నాడుగదా, మనం దెబ్బకి దెబ్బ తీదాం, అని కేవలం వైష్ణవాభిమానంచేత, నేను గరుడ వేషం వేశానేగాని, ఇంతభారవైన శరీరంతో నేను గరుడాళ్వారిని యెన్నడూ కానేరనే! ఆ మాట నాకు తెలియదా? రామానుజయ్య అయితే, చులాగ్గా దేగలా వున్నాడుగనక, అవశ్యం అతగాడే గరుడాళ్వారి అవతారం. అతణ్ణి గుండం తొక్కమనండి. నేనుగానీ నిప్పుల్లో కాలుబెట్టానంటే గజంలోతు క్కూరుకుపోయి చస్తాను. రామానుజయ్య తేలిగ్గా వున్నాడు; అంటీ అంటనట్టు చపచప అడుగేసుకుపోతాడు, అన్నల్లారా! న్యాయం ఆలోచించండి!...."–

వైష్ణవుడైనవాడు అగ్గితొక్క గూడదంటూ, ఏదైనా తొక్కవలసివస్తే మొదట భూమినీ తర్వాత జలాన్నీ తొక్కాలి కాబట్టి, కావలిస్తే యీ నిశీథంలో విష్ణునామస్మరణచేస్తూ అమాంతంగా సీతాగుండంలో వురుకుతానంటున్న మన వాళ్ళయ్య "పృథివ్యాపస్తేజోవాయు రాకాశాత్" కిచ్చిన అర్థ వివరణ సందర్భం కూడా, ఈ హాస్యరసోత్పాదనకు మరో అవకాశం.

వీళ్ళంతా ఒకెత్తు, నాంచారమ్మ ఒకర్తే ఒకెత్తు. సంస్కృతాంధ్రాలు చదువుకొన్నదని, గొంతెత్తి కమ్మగా పురాణాలు చెప్పగలిగినదని ఆమె గురించి చెబుతూ "ఆయింటికి వెలుగుతెచ్చినది"అంటాడు శాయన్నభుక్త. ఇద్దరుబిడ్డలతల్లి, అనికూడా ముందుగా ఆమె గురించి తెలుస్తుంది. "రూపమూ, రూపానికి సదృశమైన గుణ సంపత్తీ" కలిగిన నాంచారమ్మ పైకెంతో లోపల అంతమనిషి అని, విపత్సమయంలో గాని తెలిసిరాలేదు. భర్త కృష్ణమాచార్యులు "సంస్కారేగాని విశేష ప్రయోజకుడు కాడు" కాబట్టి "యిల్లూ దేవాలయం కూడా ఆమే చక్కబెట్టుకుంటారు." అంత మాత్రమే లోకులకు అంతదాకా తెలిసింది. ఆ రోజున నిద్రమంచం మీదినుంచి మామగారు నాయళ్ళ దౌర్జన్యం మూలంగా వెళ్ళిపోవలసి వచ్చినప్పుడు, నాంచారమ్మ దక్షత వెల్లడైంది. ఆమె మొదటిసారి కథారంగం మీద అడుగుపెట్టడమే, వీరోచితంగా ఉంది. ఉత్సవ విగ్రహం పట్టుకొని తానే గుండం తొక్కుతానని రంగాచార్యులు అనగా, "అయితే లెండోయి!" అని మనవాళ్ళయ్య మందను లేవదీస్తున్నాడు. పెద్ద ప్రాణానికే ముప్పు మూడనుంది....

–అంతట ఆ రావి చెట్టు మాను చాటున గప్పున ఒక వెలుతురు పుట్టింది. అందరూ భీతిల్లారు; నిషాలు దిగజార జొచ్చాయి. వెంటనే మాను వెనుక నుంచి ఒకచేత కరదీపము, రెండవచేత సూరకత్తి పట్టుకొని, వుంగరాల జుత్తు గాలికి తూగులాడుచుండగా, నిబ్బరంగా అడుగులేసుకుంటూ వచ్చి నాంచారమ్మ మామగారి పక్కను నిలిచి, ఆయన రెక్కలు పట్టుకొని వున్న నాయల వంక బాకుమొన జూపి "దుష్టుల్లారా యీ పరమ పవిత్రమైన బ్రాహ్మణ్ణి వొదుల్తారా, బాకుకు బలి యిచ్చేదా?" అని అడిగినది.–

పొట్టివైనా గట్టి ప్రశ్నలతో, ఎదురు సవాళ్ళతో, మనవాళ్ళయ్యనూ రామి నాయణ్ణీ ఆటకట్టించింది. వాళ్ళ బండారం బయట పెట్టించింది. "నేను మా మామ గారి పేరు స్మరిస్తూ గుండం దొక్కుతాను. నా వెంట రాగలిగిన వైష్ణవు లెవరైనా వుంటే, రండి!" ఎవరూ కదల్లేదు. తిరస్కారంతో నవ్వింది. ముసలివాణ్ణి మంటలో తోయడానికైతే, వాళ్ళంతా వీరులే. పీరుసాయిబును పిలిపించి పీరు 'మహత్యం' వర్ణించి, గుండం దొక్కేపని అప్పగించింది. ఆ కథ అలా నడిచి పోయింది. ఇక నాంచారమ్మ అవతారం చాలించాలి. ఆ నిష్క్రమించడం శృంగార రసాధిదేవతలా నిష్క్రమించింది. ఆశృంగారమంతా తన కృష్ణస్వామికే. నరకాసురుడితో యుద్ధానికి బయలుద్దేరి వెళ్ళిన సత్యభామ వీర, శృంగారాల నొక్కమారే చూపింది. నాంచారమ్మ ఆ రెంటినీ ఒకదాని వెంబడి మరొకటిగా **చూపుతున్నది.**

——అంతా చల్లారగానే అటక మీదనుంచి కృష్ణమాచార్యులు దిగాడు. కష్ట సాధ్యమును సాధించిన సంతోషముతో నాంచారమ్మ కరదీపం తిరిగీ చేతపూని, యింటికి సవిలాసముగా నడిచి పోవుచుండగా, పెనిమిటి యెదురైనప్పుడు ఆమె ప్రేమ పరిహాసములు పెనగొను దృష్టితో చూసెను. ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతారపురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మర్నాడు నాతో చెప్పి ఆ అర్థంతో శ్లోకం రచించాడు.——

కథాస్థలంలో ఒక మెరుపు మెరిసినంత సేపే నిలిచి, ఉన్న ప్రతి క్షణమూ హృదయ స్పందనానికి ద్రుతి కలిగించిన కార్యశూరురాలు, ఈ నాంచారమ్మ అప్పారావు సృష్టించిన స్త్రీ పాత్రలలో విశిష్టమైన స్థానానికి అర్హురాలు. కథకు గొప్పదనాన్ని కలిగించడానికి గొప్పదైన పాత్ర ఒకటి ఉన్నాచాలు. పనికిమాలిన పదుగురు వ్యక్తులలో తెలివీ, చొరవా కలిగిన ఒక్క నాంచారమ్మ, రాలలోరత్నమే.

వ్యక్తులుగా అప్రయోజకులేగాని, రామి నాయడూ మనవాళ్ళయ్యా ప్రభృతులు మచ్చుతునకల్లాంటి పాత్రలు. కన్యాశుల్క నాటకంలో సారాయి దుకాణంవద్ద తారసిల్లే పాత్రలకు వీటితో దగ్గర చుట్టరికమే కద్దు.

బతికి ఉంటే మరిన్ని కథలు రచించే వాడని అనుకొనేందుకు వీలుగా తన 'నోటు బొక్కు'లో కథలకు పనికివచ్చే ముడి వస్తువును సేకరించుకొని ఆ అస్థికలాలను అతికి రక్త మాంసాదులను ఐత జేర్చకముందే, అప్పారావు గతించాడు. పాత్రలు కొన్ని కాలీ కొన్నికాలక, ముక్కలై కొన్నీ బంకమన్నుగానే కొన్నీ, దొంతి గట్టుకొని ఉండిపోయాయి.

వేశ్యా సమస్య గురించి మరో కథ రాద్దామనుకొని, ఇంగ్లీషు పద్ధతులంటే నచ్చని తండ్రి, దివ్య జ్ఞాన సమాజ భావాలుగల ఒక పత్రికా సంపాదకుడు, బి. ఏ. చదువుతున్న తెలివైన ఒక కుర్రవాడు లాంటి పాత్రలను 'నోట్' చేసిపెట్టు కొన్నాడు. ఒక క్రిశ్చియను మతబోధకుని ఇంట తలదాచుకొని తర్వాత బోనెక్కి కోర్టువారితో నిర్లక్ష్యంగా మాట్లాడిన యువతి, ఇంటికంటె జైలే నదస్తు అనుకొని, అంతమాటా అనేస్తుందికూడా. నాయకుడు (ఆమెను ప్రేమించినవాడు) కూడా జామీను ఉంటానికి సందేహిస్తాడు. ఆమె బోగంపిల్లకాబట్టి, వదిలివేస్తే 'యాంటీ నాచ్' పార్టీకి తీరని నష్టమని కలెక్టరుకూడా అనుకొంటాడు. కాబట్టి జైలు తప్పదు. ముసల్దొకతె (ఈ యువతిని పోషిస్తూ సానిపనికి దింపదలచిన రక్కసి) వచ్చి ప్రాధేయపడినా, యువతి మొండికేస్తుంది. దరిద్రమంటే తనకు భయంలేదు. కాయ కష్టానికీ దరిద్రానికీ చుక్కెదురు. రెక్కలు విరుచుకు పనిజేసి తన అవసరాలూ ముసల్దాని అవసరాలూ సంపాదిస్తుంది. లేక, బలవంతాన మళ్ళీ తనను అధ్వాన్నపు అడవివంటి సానిపనిలోకే దించితే, నుయ్యో గొయ్యో ఉండనే ఉంది. విడుదలై వచ్చాక, ప్రేమంటూ మరొకటంటూ నాయకుడు మళ్ళీ తారసిల్లుతాడు. అయితే అతనంటే ఆమెకు నమ్మకంలేదు. వీళ్ళ నాన్నను వాళ్ళ నాన్న మోసంచేశాడని నాయికకు నాయకునిపై మంట. తన తల్లిని పెళ్ళాడకుండానే తనను పుట్టించిన ఆ తండ్రి "రాక్షసు"డనిపిస్తున్నాడు. ఆ మాటే మరెవరైనా అంటే తాను పడదు. ఈ నాయకుడు నిజానికి గిరీశం, మాయవేషం వేసుకొచ్చాడు. సొగసైన మనిషి "అరుంధతినైనా చెరపట్టే మహాయోగ్యుడు." 8

మరో రచన, పూర్తి అయితే నవలగా రూపొందివుండేది. ఇంగ్లీషున రచించిన కొన్ని ఘట్టాలను అవసరాల సూర్యారావు అనువదించి పోయాడు. దీనిలో

కూడా వేశ్యా సంతానంమీదనే! అప్పారావు చూపుపడింది. విశాఖపట్నప్రాంతపు నాయుడొకాయన నీలగిరిలో తన ఇద్దరు కుమార్తెలతో ఉండిపోయాడు. ఆ ఇద్దరూ తన పుంపుడుగత్తె బిడ్డలు. తమ జన్మ రహస్యాన్ని వాళ్ళనుంచి దాచివుంచలేక పోయాడు. ఇంటికి వచ్చి పోయేవారిని సత్కరిస్తూనే ఒక కంట కనిపెట్టివుంటాడు. ఒకనాడు వానలో చిక్కుకుపోయిన ఇద్దరు పెద్దమనుషులను ఆ ఇంటికి తీసుకొచ్చి ఆతిథ్యమిస్తూ తన బిడ్డలను పరిచయంచేస్తాడు. ఆ ఇద్దరిలో ఒకరు 'నేను' అనే వ్యక్తి; మరొకడు 'కవి' అనే వ్యక్తి. కవి సౌదామిని అ-దాన్ని మెచ్చి ఆమె వద్ద చనువు సంపాదిస్తాడు. ఆ ఇంటి యజమానిపేరు బాలయ్యనాయుడు. ఇతరుల కులం గురించి. కులమిచ్చే హోదాగురించి ఆయనకే ఎక్కువ గురి. అతిథులిద్దరూ బ్రాహ్మలు. పూర్వం దక్షిణాదిలో రాజ్యంచేసిన కుటుంబంతో చుట్టరికం వాళ్ళ గొప్పదనాన్ని తమకు సంక్రమింపజేసింది. "మా పూర్వీకులూ బ్రాహ్మలూ వాకేపం కిని భోంచేసేవారు. ఆరోజులు వెళ్ళిపోయాయి లెండి" ఇదీ అతని ధోరణి. బ్రాహ్మలై వుండికూడా ఆచారం పాటించని 'ఎడ్వాన్స్‌డ్' మనుషులు వీళ్లు. అలాంటివాళ్ళంటే ఆయన కాస్త నిషాలేదు. ఎవరు చేసిన కాఫీ అయినా తాగడానికి అభ్యంతరం లేదుగాని "అన్నం మటుకు బ్రాహ్మలు వొండితేనే తింటాను" అనే బ్రాహ్మణాతిథిని మహా గౌరవిస్తాడు. మామూలు మనుషులు కులాల కట్టుబాట్లు పాటించ వలసిందే. వర్ణాశ్రమ ధర్మాల గొప్పదనం తెలిపిన మనిషి వాటిని ఉల్లంఘించవచ్చు. జ్ఞానికి ఉండవలసిన స్వేచ్ఛ అజ్ఞానికి కూడదు; వికటిస్తుంది. మహర్షులకూ మామూలు వాళ్ళకు తేడాఇదే. వాళ్ళకేది దినసరితిండో, వీళ్ళకది విషతుల్యమౌవుంది. ఈ మాటలన్నీ తనకొక మహారాజు చెప్పాడట, (ఇతను ఆనంద గజపతి లాంటివాడైతే, ఈ బాలయ్యనాయుడు మద్రాసులో ఆనందగజపతి తాలూకు ఆస్తిపాస్తులుచూసే బాలయ్యనాయుడే కావచ్చు. పైగా, రామతిలకమనే వేశ్యకూ బాలయ్యనాయుడిద్వారా ఆనందగజపతికి ఇలాకా ఉండేదికూడా.)

ఈ 'నవల'లో ముఖ్యపాత్ర సౌదామిని. పరపురుష సందర్శనంకూడా అలవాటులేని అసూర్యంపశ్య, పేరుకుతగిన రూపసి. పైగా సిగ్గరి. తండ్రిగారు అన్ని కట్టుదిట్టాలూచేసి పెంచుతున్నారు. ఇంటికివచ్చిన అతిథులు కొన్ని మర్యాదలు పాటించాలి. ఏకాంతంగా ఉంటున్న ఇంటివారి గుట్టుమట్టు లోకంచెవిలో ఊద గూడదు. "నా ఇష్టంలేనిదే మా అమ్మాయినెవరూ చూడకూడదు. ఎవరితోనూ మా అమ్మాయి మాటాడకూడదు. పెళ్ళీడువచ్చిన పిల్ల, తన గుండెల్లో కుంపటే"

పైగా అందగత్తె. 'కో' అంటే కోటిమంది పెళ్ళికుమాళ్ళు — జమీందారు బిడ్డలు కూడా—వచ్చి అర్థిస్తారని అతనినమ్మకం. నిజంగాకూడా ఆమె అందం అంతటిదే ఔను.

.... ఆ అందం కొండలకులేని అందం. ఈ భవనం ఒక దేవాలయం' ఆమె ఒక దేవత, నీలగిరికీ ఆకాశపు అంచులకీ అందని అందాల అప్సరస.

"రకరకాల పూలపరిమళాల గాలులలో ఆమె సొగసు. దేనిసౌకుమార్యమైనా ఆమెదే. విశ్వమంతటా ఆమె తేజస్సు. ఆకాశంలో చుక్కలు ఆమె ఆభరణాలు. తెల్లని వెన్నెల కదా ఆ పిల్ల.

చిన్న ఆడ నెపోలియన్ లాంటి ఆ పిల్ల, అమాయకమైన బేలగుండెవల్లకూడా అధికారం సంపాదించుకొంది. ప్రేమించడమేగాని ద్వేషించడం ఎరగదు. కాబట్టి సర్వాధికారిణి. ఇంతకూ సౌదామినికి పెళ్ళి గిట్టదు. ఒకడికి జీవితాంతమూ లోబడి ఉండడం దాస్యమనే ఆమెభావం. తాను స్వేచ్ఛ నిండిన వాతావరణంలో పుట్టి పెరిగి, ఇప్పుడు మగవాడి కెందుకని అమ్ముడు పోవాలి? భర్త సరిపడకున్నా భార్య సంసారం కాడి మోయవలసిందే కదా! విడాకులు లేకపోయె. భర్త భార్యను విడిచినా భార్య భర్తను విడిచినా అరిటాకూ ముల్లూ చందమే. 'కవి' సౌదామినిని మచ్చిక చేసుకున్నాడు. 'ప్రేయసీ' అని పిలుస్తున్నాడు. ఆయుధ ప్రయోగం నేర్పి ఆత్మ రక్షణ చేసుకో మంటున్నాడు. అదీ అక్కరకు వచ్చింది. సౌదామినిని ఎత్తుకుపో జూచిన జమీం దారుని ఆమె బాకుతో పొడిచి బయటపడింది— "డేగబారినుండి తప్పించుకొన్న పిట్టలాగ" ఇంటికి పారిపోయింది. గాయాలతో 'కవి' రిక్షా మీద ఇల్లు చేరాడు. గుర్రం మీద పోతూవుంటే జమీందారును ఎవరో దొంగలు పొడిచారని అమర్నాడు ఊళ్లో ఒక వార్త పొక్కింది. 9

చివరగా పేర్కొనవలసిన మరొక కథ ప్రణాళిక — ఇది నాటక కథ—1895 లోనే అప్పారావు 'స్కెచ్' చేసి డైరీలలో రాసుకొన్నాడు. ఆయన సొంత మాట ల్లోనే అది ఇలాగుంది :

ది యూరేషియను డ్రామా. ఒక గొప్ప 'సివిలియను', ఒక కొండ జాతి స్త్రీని వుంచుకుంటాడు. అతనికి ఇద్దరు సంతానం. ఈ ఇద్దరూ ఇంగ్లండులో పెరిగారు. పరిస్థితుల ప్రభావం వలన తల్లీ పిల్లలూ ఒకరికొకరు దూరమౌతారు అతను ఆమెతో సంబంధాలను తెంచుకుంటాడు. అతడు ఎక్కడవున్నాడో, అతని అనుపానులేమో ఆమెకి తెలియదు. ఒక ముసల్మాను వర్తకుడు ఆమెకు ధనం

యిస్తూ వుంటాడు. ఇంటికి కావలసినవస్తువులు తెచ్చి పడవేస్తూవుంటాడు. ఇతను మొదట బట్లరు, తర్వాత వర్తకుడైనాడు. కొంత కాలానికి ఆమె కొడుకూ, కూతురూ తిరిగి వస్తారు. కొడుకుకు తన తల్లి కొండజాతి స్త్రీ అని మొదట తెలియదు. తన తండ్రి చనిపోయాడని అనుకుంటాడు కాని అతను ఇండియాకు రాగానే పరిస్థితులన్నీ అవగాహ నౌతాయి. ఇంటికివచ్చే సప్లయిలు కొన్నిరోజుల నుంచి ఆగిపోతాయి. కూతురు పనిచేస్తూవుంటుంది. ఆమెకు చదువు వచ్చును. సప్లయిలు బంద్ అయినప్పుడు, అట్టి సన్నివేశంలోనే పిల్లలిద్దరూ ఇండియా చేరినట్లు చిత్రించేదా ?

ఆ యూరోపియను ఒక పిల్లను పెళ్ళాడుతాడు. అతనికి పిల్లలు కలుగుతారు. దగుల్బాజీ. ఇంకొక పిల్లను ప్రేమిస్తాడు. 10

ఆంగ్లో-ఇండియన్లపట్ల జాలి కలిగించడమే ఈ నాటక రచనలో అప్పారావు సాధించదలచుకొన్న పరమ ప్రయోజనమని తెలుసుకొన్నప్పుడు. సాహిత్య సృష్టిలో ఆయన మనస్సు ఎలా పనిచేసేదో వివరించవలసినపని ఉండదు 11 "ఈ సంకరులను యింగిలీషులు పెట్టే క్షోభకు యింగిలీషులే తలవంచుకునేటట్లు నాటకము వ్రాయవలెను."[12] నిజంకూడా అంతే. ఈ సమస్యను పూర్తిగా చిత్రించదలచుకొన్న నాటకం, 'డైరీ' సంకల్పదశనుంచి బయల్పడనేలేదు.

అప్పారావు మనస్సు ఒక సంక్షుభిత సాగరతుల్యమైనది. అలలన్నీ ఒడ్డుకు వచ్చి గుద్దుకోవు. పెద్ద అలలో చిన్న అలలెన్నో కలగలసి దానికి తమ తమ సత్తాను అందించి అణగి దానిలో కలసిపోతాయి. ఒక రచయిత గొప్పతనాన్ని నిర్ణయించేప్పుడు, అండదశలోనే అణగారిపోయిన ఈ అల్పప్రాణులనుకూడా గణనలోకి తీసుకోవలసి ఉంటుంది. అలా తీసుకొన్నప్పుడు, జీవిత పరిశీలకుడుగా వ్యాఖ్యాతగా అప్పారావు ఆక్రమింపగల స్థానం, సాహిత్య నిర్మాతగా ఆక్రమించి ఉన్నదానికంటె, కొన్ని రెట్లయినా గొప్పది.

1. గురజాడ సమకాలికులు (వ్యా) : వసంతరావు బ్రహ్మాజీరావు, గు. శ. జం. హై.
2. రచయిత : కావ్యసృష్టి : గు. ర. మా. మం; పు. 155
3. గు. ర. మా. డై : పు. 93-96, 98-99
4. ఆణిముత్యాలు: ప్రవేశిక : అవసరాల సూర్యారావు, పు. iii

5. ప్రకృతి అనే పుస్తకం : గు. ర. మా. మం; పు. 36-37
6. The Art of writlng : *Andre Maurois, P. 242*
7. రచయిత : కావ్యసృష్టి : గు. ర. మా. మం; పు. 158-159
8. ,, ,, ,, పు. 179-185
9. నవల : సన్నివేశాలు : ,, పు. 199-225
10. గు. ర. మ. డై; పు. 112-1895 మే 11
11. ,, , పు. 107-1895 మే 4

KANYASULKAM

TRANSLATED FROM TELUGU
BY
S. N. JAYANTY



GURAZADA

GURAZADA MEMORIAL RESEARCH CENTRE
HYDERABAD

కన్యాశుల్కము ఇంగ్లీషు అనువాద ముఖపత్రం ప్రతి

# సప్తాస్వాలు

## నాటక ప్రకరణం

**జయంతి కుమారస్వామి** మరెవరోకాదు, నిన్న మొన్ననే చనిపోయిన జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారే! ఇంకా సజీవులై ఉన్న ఒక సుప్రసిద్ధ హాస్యరచయితతో కలిసి వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులవద్దకు వెళ్ళి ఉండినప్పుడు, వేలూరి శివరామశాస్త్రి తన చెవిలో ఊదిన విషయాన్ని 'జరుక్' ప్రస్తావించాడు: *కన్యాశుల్క* నాటకకర్త అప్పారావు కాదు!

వెనకటికి పాతికేళ్ళ క్రితం బెజవాడలో కొందరు ప్రబుద్ధులు ఇలాగే వాదించినప్పుడు డా. బుర్రా శేషగిరిరావు కలగజేసుకొని మందలించవలసి వచ్చింది. ఇంతకూ వాళ్ళు చూపిన ఆధారమల్లా *మాటా-మంతి*లోని అప్పారావుశైలికినీ నాటక శైలికినీ పోలికలేవీ లేవని మాత్రమే. నాటక పాత్రలన్నీ అప్పారావుకు ప్రతిబింబాలై ఉంటేనే ఈ వాదం నిలుస్తుందనే ఇంగితజ్ఞానం కూడా వాళ్ళకు లేకపోయింది. ఆ వాదమే ఇప్పుడు శివరామశాస్త్రి ద్వారా మళ్ళీ ప్రాణం పోసుకొంది.

*కన్యాశుల్కం* రెండవ కూర్పు ప్రతిని గోమఠం శ్రీనివాసాచార్యుల (జి. సి. వి) సాయంతోటి అప్పారావు రచించినట్లు తమవద్ద దాఖలాలున్నాయని వెంకటేశ్వరశాస్త్రి అనడంతో ఈ వాదానికి వెన్నెముక ఏర్పడినట్లయింది. ఆ 'ప్రెస్' కాపీలో జి. సి. వి. దస్తూరితోనే కొట్టివేతలున్నాయని కూడా అన్నాడు. ఆ తర్వాతనే జయంతి కుమారస్వామి అవతారమెత్తి ఒక 'క్వెరీ' తయారుజేసి తిరుపణ్ణామలై పోతూ పోతూ *ఆంధ్రపత్రిక*కిచ్చి పోయారు 'జరుక్'. ఆయనే నాకీ కథ చెప్పారు. వేదం వేంకట రాయశాస్త్రి నాటకాలలో గొప్పదైన *ప్రతాపరుద్రీయం*ను వెక్కిరిస్తూ అప్పారావు నాటకాన్ని మిన్నులకెత్తుతూ అప్పుడప్పుడు శ్రీశ్రీ ప్రభృతి మిత్రులు తన మనస్సును నొప్పించి ఉండడమే గాక, *కన్యాశుల్కం*లో బ్రాహ్మణ దూషణచేసి అప్పారావే తనకు కోపం తెప్పించాడని,

అందుచేతనే తా నీ అక్షరాల చిచ్చును ముట్టించవలసి వచ్చిందని కూడా లోగుట్టు విప్పిచెప్పారు.

'*కన్యాశుల్కం*' *రచన ఎవరిది?* అనే 'క్వెరీ'తో మొదలైన ఈ చిచ్చు,

'*కన్యాశుల్కము*'*ను వ్రాసినవారు మహాకవి అప్పారావుగారే* అంటూ రెణ్ణెల్ల తర్వాత ముగింపుకు వచ్చింది. అమ్మయ్య! కొండను తవ్వనైతే తవ్వారుకాని, ఎలుకనైనా పట్టలేకపోయారు ఈ చర్చలో పాల్గొన్నవాళ్ళంతాచేరి. షేక్స్పియరు రాసినట్లుగా కొన్ని శతాబ్దాలనుంచి లోకమంతా నెత్తినబెట్టుకొని పూజిస్తూన్న నాటకాలను అసలురాసిన అజ్ఞాతవ్యక్తి గురించి ఇంగ్లాండులో తరచు ఊహాగానాలు సాగుతుంటాయి కదా, ఆ సంప్రదాయాన్ని ఆంధ్రీకరిస్తే బాగుండు ననుకొన్నట్లుందిగాని ఈ రచనకు మరో మహత్తర ప్రయోజనమేమీ ఉన్నట్లు కని పించదు.

ఆ చర్చ మిగిల్చిపోయింది. పాఠకుల నాల్కలపై చేదురుచిని, అని ఇంగ్లీషు వాడిలాగా అనుకొందామనుకొంటే, గోమఠం శ్రీనివాసాచార్యుల (జి. సి. వి) వారు అడ్డువచ్చి తా మున్నామంటారాయె! ఆయనట ఆ నాటకకర్త! వ్యావహారికంలో రాసిన ఈ నాటకాన్ని చూచి పండితులు గేలిచేస్తారని జంకి, తన కన్నబిడ్డకు తండ్రిగా అప్పారావును చలామణి కమ్మని ఆనందజగపతి మహారాజాయే అప్పగించివేశాడట! ఇలా అని విజయవాడనుంచి కొందరు ప్రబుద్ధులు బయల్దేరినప్పుడు, బుర్రా శేషగిరిరావు తగిన ఉపపత్తులుచూపి 1938 లోనే దాన్ని ఖండించవలసి వచ్చింది. ఈ జరరాక్షసి మాంసకండాలు మళ్ళీ 1955 లో అతుక్కొని జరాసంధుణ్ణి తయారుచేశాయి. *మాట-మంతి, కొండుభట్టీయం* వగైరా రచనల శైలికీ ఈ మహానాటక శైలికీ కనిపిస్తున్న భేదమే, అప్పుడువారినీ ఇప్పుడు వీరినీ ప్రేరేపించింది. ఆంగ్లంలో నిష్ణాతుడు కాబట్టి అప్పారావు ఆభాషలోనే తన నాటకం రాసి జి. సి. వి. చేత తెలుగు చేయించాడు; ఇది "నిజమా? అభూత కల్పనా?!" అని కుమారస్వామిగారి కౌమారపు 'క్వెరీ'. దాంతో, సీసానుంచి భూతంలా, జి.సి.వి వెలికి దూకి వచ్చాడు. గోమఠం వాళ్ళు కొన్ని వంద లేళ్ళనుంచి ఆంధ్రదేశంలో స్థిరపడిపోయిన శ్రీ వైష్ణవులు కాబట్టి, ఇకనేం, జి. సి. వి. విజయనగరం వాస్తవ్యుడై పోయాడు. ఒక యింటిపేరుగల వాళ్ళు తెలుగు, తమిళ దేశస్థులుకూడా కావచ్చునని ముందు కొందరికి తట్టనైనా లేదు. చంగల్పట్టు జిల్లాలో పుట్టి చెన్న

పట్నంలో ఉపాధ్యాయ వృత్తిని చేబట్టి పార్శీ నాటక కంపెనీ ప్రదర్శనం చూశాక సంస్కృత నాటకాలను రంగ ప్రయోగం చేయ సంకల్పించి THE MADRAS ORIENTAL DRAMATIC COMPANY స్థాపించి దొరలను మెప్పించి INDIAN GARRICK బిరుదు పొంది ఆనందగజపతి నలరించి ఆస్థానాని కెక్కిన ఈ జి. సి. వి. సి అప్పారావు చూసే నాటికి (1889), ఆచార్యుల వారికి నలభై ఏడేళ్ళు, అప్పారావుకు ఇరవై ఎనిమిది అని ఆరుద్ర నిర్ణయించారు. [2] *కమలాపహరణం, వెంకిపంతులు* ప్రహసనం, *స్త్రీ సాహసం* ఇంగ్లీషున *హరిశ్చంద్ర* నాటకం వగైరా రచనలను చేసినంత మాత్రాన, విశాఖపట్టణ మండలీయుడు తప్ప తదితరు డెవ్వడు కూడా గమనించజాలని సూక్ష్మ వ్యావహారిక భాషాచ్ఛాయల వైవిధ్యంతో *కన్యాశుల్కం* జి. సి. వి. రాశాడని చెప్పడమే? ఆనంద గజపతి మదికెక్కినా, మద్రాసులోనే 'లజ్' ప్రాంతంలో ఉండి ఉపాధ్యాయ వృత్తి నిర్వహిస్తూ *'సూర్యాలోక'* మనే పత్రికను నడుపుతూ కల్యాణరామయ్యరు వంటి నటులకు తరిబీదిస్తూ, 1887 లో షరాఫ్‌ఖానా వెంకటకృష్ణారావు విజయనగరంలో స్థాపించిన 'ది రిప్పన్ థియొసాఫికల్ హిందూహైస్కూలు' హెడ్మాష్టరుగా వచ్చి[3] స్థిరపడి ఆనంద గజపతి ప్రాణావసాన వేళ (1887) వరకు ఉండిపోయిన జి. సి. వి. కి అరవ తెనుగే వచ్చు, తెలుగులో పాండిత్యం సంపాదించి కష్టపడి గ్రాంథికాంధ్రంలోనైతే రాయగలిగాడుగాని, ఇంతటి నాటకాన్ని రాయగలిగి ఉండేవాడా? [4] వ్యావహారిక భాషలో ఆయన రాసిన రెండు మూడు గేయాలను నిడదవోలు వేంకటరావుగారు అప్పారావు గేయకృతులలో చూర్చి వావిళ్ళ వారి తరపున ప్రకటించి ఉన్నారు, నిజమే.

ఇంతకూ అసలు దాఖలా లేమిటి? సీనుకి సీనూ తెలిగించి కాగితాలను వేదం వెంకటాచలయ్యా చేతికి జి. సి. వి. ఇస్తూ ఉంటే, అవి వావిళ్ళ వారి తరపున జి. ఆర్. పి. ప్రెస్సుకు పోతూ ఉండేవని, ప్రూపులను వేంకటాచలయ్యే దిద్దుతూ వచ్చాడని నిడదవోలు వేంకటరావు రాశారు. దానికి ఆధారం వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిల నోటిమాట.అదే యామిజాల పద్మనాభస్వామిగారి చేత కూడా రాయించింది, వీరు ఒకటి రెండు సొంత విషయాలనుకూడా కలిపి, *కొండుభట్టీయం* కూడా ఆచార్యులవారిదేనని, *లవణరాజుకల, ముత్యాలసరాలు* రచనకు రూప ఇచ్చింది విజయనగరాస్థానకవి ముడుంబై నరసింహాచార్యులని రాశారు. అప్పారావుకు రచయితగా అసలుకే మోసం వచ్చింది. "తెలుగులో అప్పారావు ఏ

ఇంపుగా రాయలేదయ్యా!" అన్నాడట వెంకటేశ్వర శాస్త్రి లీ లేఖకునితో. దాన్ని ఈయన ఒప్పేసుకొన్నారు. [5] శాస్త్రిల ఉద్దేశంగురించి ఉద్రేకపడుతూ, అప్పారావు కుమారుడు రామదాసుగారు, అప్పారావు రచనల ముద్రణాధికారాన్ని తమకివ్వలేదనే అక్కసుకొద్దీ శాస్త్రిలవారు ఇదంతా కల్పించారని అన్నారు. 1895 వేసవిలో విజయనగర మహారాజావారి మోతీమహలులో కూర్చుని వల్లూరి నరసింహం అనే గుమాస్తాచేత తమ తండ్రిగారు ప్రెస్సు కాపీ తయారుచేయించారని రామదాసు గారన్నది మొదటి ముద్రణకు మాత్రమే అన్వయిస్తుంది అది విజయనగరంలోనే విజయరామ విలాస ముద్రాక్షరశాలలో కొంకిపూడి భద్రయ్యచే "ముద్రింపబడి ప్రకటింపబడియె." (1897)

చివరకు ఆ దాఖలాలేమిటో శాస్త్రిలవారు చూపలేకపోయారు. ఇంతలో మరో మలుపు తిరిగింది ఈ వాదం. విశాఖపట్నంలో వైద్యంచేయించుకొనే రోజుల్లో అమృతబజారు పత్రికా సంపాదకుడైన మోతీలాల్ ఘోష్‌కు జి. సి. వి. ని చూపుతూ, తమ నాటకాన్ని ఆంగ్లీకరించింది వీరేనని అప్పారావు పరిచయం చేశాడట. ఆయన తిరిగి కలకత్తా చేరాక తమ పత్రికలో కొందరు తెలుగు రచయితలగురించి రాశాడటకూడా. ఆరుద్రగారిలాగే నేనుకూడా కలకత్తాలోని నా మిత్రులద్వారా ఆ పత్రిక పాతసంచికల్లో వెతికించి ఉత్తచేతులతో బయటపడ్డాను కాబట్టి, ఇది శుద్ధాబద్ధమని చెప్పక తప్పదు.

ఇంకొక మలుపు. కన్యాశుల్క మూలంకూడా అప్పారావుదికాదుట. బొబ్బిలి సమీపంలోని నగూరు వాస్తవ్యులైన నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి సంస్కృతంలో రాసిపెట్టుకొన్న కథాసంవిధానాన్ని ఆంగ్లీకరించుకొన్నాడుట. అందు చేతనేనట, బొబ్బిలిప్రాంత పాత్రలు, అక్కడి రంగస్థలాలు ఈ నాటకంలో అధిక సంఖ్యలో ఉండటం; [6] *

చచ్చీ చెడీ చేయంగల విన్నపాలన్నట్లు. ఈ పుండుకు మూలకారణమైన వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి, తమవద్ద సాక్ష్యం లేదని, అప్పారావు రాస్తే జి. సి. వి.

---

* ముఖలింగం వాస్తవ్యుడైన డబీరు కృష్ణమూర్తి సుభద్రా పరిణయము ప్రబంధానికి **కన్యాశుల్క** నాటకం 'కాపీ' అంటూ పి. వి. రమణగారు **'జయంతి'** (1959-60)లో ఒక వ్యాసమే రాశారు. అందులోనూ కన్యాశుల్క నిరసన ఉందట. ఇక, రమణగారి పరిశోధన వెలువరించిన గొప్ప విషయాలేమిటంటే, కృష్ణుని పాత్ర లక్షణాలను కరటక శాస్త్రికీ మధుర వాణికీ, సుభద్ర లక్షణాలు సుబ్బికీ, బలరాముడివి అగ్నిహోత్రుడికీ తెచ్చి అంటగట్టాడట అప్పారావు!

ప్రభృతులు మెరుగుమాత్రమే పెట్టారని, అప్పారావు పంపిన లిఖితప్రతి తెలుగులోనే ఉందని ఒప్పుకొన్నారు. జయంతి కుమారస్వామిగారి 'క్వెరీ' కి ఇప్పుడు 'యాన్సర్' తయారైంది:

క్వెరీ : "శ్రీనివాసాచార్యులుగారు తెనిగించడం నిజమా ? అభూత కల్పనా ?!"

యాన్సరు : "అభూతకల్పన మాత్రమే".

మొదటి ముద్రణ జరిగిననాటి కెన్నో ఏళ్ళముందుగానే అప్పారావు ఈ నాటకాన్ని రాయడం జరిగింది. లిఖిత ప్రతిగా ఉన్నప్పుడే ఆనందగజపతి సమక్షంలో రంగప్రయోగం జరిగి ప్రేక్షకులనూ పత్రికలనూ మెప్పించి ఒప్పించింది. అప్పటికే ఈ నాటకకర్త ప్రపంచ ప్రఖ్యాత నాటకకర్తల పోకడలనూ, ధోరణులనూ గమనించి ఉండినట్లు 'ప్రొలోగ్' (Prologue)భాగంలో స్పష్టంగా ఉంది. కాబట్టి నాటకరంగానికి అప్పారావు కొత్తబిచ్చగాడేమీకాదు.

మొదట రాసినప్పుడు, గ్రాంథికభాష వాడాడా ? అలాగని అప్పారావే తనతోచెప్పాడని వేలూరి శివరామశాస్త్రి ఉపన్యసించి పదిమందికీ చెప్పిపోయాడు :

—వాడుక భాషలో అందెవేసిన శ్రీ గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కంలోని సీసపద్యం ఒకటి నదను అముద్రిత గ్రంథ చింతామణిలో చూచి నే నాశ్చర్యపోయి 1913 లోనో 1914 లోనో ప్రెసిడెన్సీ కాలేజిలో జరిగిన ఒక సభలో దానిని గురించి అప్పారావుగారి నడిగాను. 'మొదట ప్రబంధ భాషలోనే కన్యాశుల్కం వ్రాసి, అది రుచించక పోవటంచేత గ్రామ్యంలో తిరుగ వ్రాశా'నని వారప్పుడు చెప్పారు. 7

శివరామశాస్త్రి అబద్ధీకు డెలా కాగలడుగాని, అచ్చుపడి ఉన్న మొదటి ముద్రణ ప్రతికి మునుపు గ్రాంథికంలోనే అప్పారావు రాసిఉంటే ఆశ్చర్యపో నక్కర్లేదు. కాకుంటే, శాస్త్రిగారి తొందరపాటు ఆ పత్రికలోని సీసపద్య విషయంలోనైనా వెల్లడౌతుంది.* 1897 లో మొదటి ముద్రణ ప్రతిని సమీక్షిస్తూ, ఇంగ్లీషు

* నిజానికి ఈ తొలికూర్పు నాటకంలో ఉన్న పద్యం వెంకపేశ్వర్లు చదివిన ఈ కిందిది. ఇది చాటు పద్యమణిమంజరిలో (పు. 205) కనిపిస్తుంది. చెళ్ళపిళ్ళ వరసకవి రాసినట్లు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తమ చాటు పద్యరత్నాకరము (పు. 70)లో పేర్కొన్నదానికి దీనికీ అట్టే భేదం లేదు. ఇంతకూ అప్పారావు రాసింది కాదిది.

పదాలను నిర్విచక్షణగా వాడడం బాగుండలేదని విమర్శించి, అందుకుఉదాం హరణగా మరెవరోరాసి వాడుకలో పెట్టిన ఒక సీస పద్యాన్ని చూపెట్టడం జరిగింది :

—"సీ॥" కడుశ్రద్ధఁగల్గి యకౌంటెంట్యాంటు లకౌంటెంట్లుస్ట్రిక్టుగాఁ గంపేరుఁ జేయుచుండ" ననునదియును, మఱియు" నెసఁగ ఫస్టెగ్జామినే షనిన్నార్పిచ్చి"యను వాక్యము లింగ్లీషురాని వారికెంత యర్థమగునో యీ గ్రంథమునందలి కొన్ని యింగ్లీషు పదము లంతమాత్ర మందఱకు నర్థమగు ననియెదము."8

కాలేజిలో అధ్యాపకుడుగా ఉంటున్నప్పుడే రాసిన ఈ తొలిముద్రణ ప్రతి ముఖ పత్రంమీద స్వదస్తూరీని

Kanya Sulka
a Comic Play
in seven acts
by
G. V. Appa Row, B. A.,
asst. Maharajah's College, Vizianagaram.

అని రాసిపెట్టాడు. Comic Play అనేమాటలు 'ప్రహసనం' అని అర్థం వచ్చే ఇంగ్లీషు మాటలేనా ? ఇది రాశాక వీరేశలింగంగారి బ్రాహ్మ వివాహం ప్రహసనం చదివినప్పుడు, రెంటికీ కొన్ని సమాన ధర్మాలున్న ట్లనిపించడంతోటే, తన నాటక ప్రత్యేకత నిలా చెప్పుకోవలసి వచ్చింది :

BRAHMA VIVAHAM was meant to be a pure comedy of manners, while in KANYASULKAM humour, characterization,

---

తవణింతున్నుతి కాలకంఠ మకుటాట్టాల ప్రతోళీ మిళ
త్స్రవమానామరసింధు బంధుర వయస్సంభార గంభీర వా
గ్వ్యవహారైక ధురంధరత్వమగు జిహ్వాలోల మత్తల్లికిన్
జవికిందల్లికి కారవేల్లికి ధనుర్జ్యావల్లి నీరుల్లికిన్.

చెళ్లపిళ్ల నరసకవిది :

తవణింతున్నుతి దైవతప్రమద దార్ఢ్యోన్మోహినీ నీరభృ
చ్ఛ్యవమానామృత శీకరాభ నవబీజ ప్రాంతరౌపమ్య స
ద్భవనాజాండకు షడ్రసప్లుత సముద్యత్స్వాదుమత్ఖండకున్
అవితుంగోద్భవ కాండకున్ సరసమోహాఖండకున్ దొండకున్.

ఇ ది శ్రీనాథకవి శైలి అనే వాళ్ళు కొందరున్నారు.

and the construction of an original and complex plot have been attempted with what success, it is for the public to judge [9].

ఇంతకు అంత పెరిగి సొంపుగూర్చుకొన్న రెండవ ముద్రణ ప్రతిని కూడా నాటకమని అంగీకరింపక, ధనంజయుని *దశరూపక* లక్షణానుసారం, ఇది హాస్యరస ప్రధానమైన రూపకమేగాని నాటకము కాదని కొందరంటున్నారు. హాస్య ప్రధానమై, "స్వల్పప్రయోజనము" గలదైన ఏకాంకిక మాత్రమే ప్రహసనంకాగా ఇందులో ఏడంకాలున్నాయి కాబట్టి శాస్త్రకారుని నిర్వచనాన్ని సాగదీసి "కన్యాశుల్కము రసవిషయమున ప్రహసనమును, అంక విషయమున నాటకమువలె నున్నది," అంటున్నారు.[10] నాటక లక్షణకారుడు బీజ, బిందు, పతాక, ప్రకరి, కార్యాలనే ఐదుభాగాలు గల కథ మాత్రమే నాటకమయేట్టుంటే, ఈ నాటక కథలో అవి ఉన్నట్లు శ్రీపాద కామేశ్వరరావు ఎన్నడో రాసిపోయాడని[11] ఈ కాలపు వారికెలా తెలుస్తుంది? ఏ తరాని కా తరమే పెద్దరికపు గద్దె దక్కించుకో గోరుతుంది. "ఏనియమాలబట్టి చూసినా *కన్యాశుల్కము* నాటక మనక తీరదు. ఇది ప్రహసనము (Farce) అనే విమర్శకులు ఈ గ్రంథమును చులకన చేసి 'It is after all a farce' అనుట విచారకరము". ప్రహసన మంటూనే కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి, దీనిని "మంచి ప్రహసనము" అని వర్ణిస్తూ, "రావు బహదూరు వీరేశలింగ కవిగారి ప్రహసనములకంటే చాల ప్రౌఢముగా నున్నదని నిస్సంశయముగా" జెప్పాడు.[12] అయితే ఈ ప్రశంస ఇప్పటి నాటక ప్రతి గురించి మాత్రమే. హాస్యస్పర్శ ఉన్నంత మాత్రాన్నే ఏ నాటకంగానీ ప్రహసనం కావలసివస్తే, ఇది కూడా ప్రహసనమే. పైపై చూపుల విమర్శే ఇది. అప్పారావు హాస్యం, హాస్యం కోసమే కాదు. దాని ప్రయోజనం గంభీరమైనది. ఆ హాస్యమైనా వెకిలి చేష్టలకూ వినోద కాలక్షేపాలకూ పరిమితమైనదికాదు. సంఘదౌష్ట్యాలపై అది ప్రచండపరశువు: మానవ హృదయాలకు శస్త్ర వైద్యుని చేతి శస్త్రిక. మోదాంత హాస్య ప్రధాన నాటక మనిపిస్తూనే, అది సంఘ బీభత్సాన్నీ తద్గతమైన భేదాన్నికూడా తోపింపజేస్తుంది. అందుచేతనే శ్రీపాద కామేశ్వరరావుకిది tragi - comedy అనిపించింది. పైగా, ప్రహసనంలో లాగు దానిది "స్వల్ప ప్రయోజనం" కానేకాదు. భమిడిపాటి కామేశ్వరరావు చెప్పినట్లు ఈ నాటకం "ఒక తాత్కాలిక దురాచారహేళన నెపంగా రచింపబడినా కథా చమత్కృతీ, భావ సామరస్యమూ, పాత్ర చైతన్యమూ అందులో కలకలలాడుతూండడంవల్ల జనహృదయానికి ఎక్కినిల్చిన అపూర్వ ఆంధ్ర పద బంధం."[13]

ఇంగ్లీషులోకూడా ప్రహసనానికి పర్యాయపదమైన farce కూ మోదాంత నాటకమైన comedy కీ భేదం కద్దు. * చివరకు 'ఫార్సు' మన ప్రహసనంకంటె

---

* ఇ. కె. చేంబర్సు రాసిన *Shakespeare : A survey* నుంచి ఈ దిగువ విషయాల నిస్తున్నాను : 'కామెడీ' అనేదాని నిజమైన ఆంతర్యం జీవిత విమర్శ. హాస్యం ద్వారా పలిన వస్తువుల గురించి మనుషుల మనస్సులలో నిర్మలమైన దృక్పథాన్ని కలిగించడమే దాని ధ్యేయం. "...Comedy in the true sense of a criticism of life, which is at heart profoundly serious, and employs all the machinery of wit or humour, with the deliberate intention of reaching through the laughter to the ultimate end of a purged outlook upon things (P. 28)

ఫార్సు అనే మాట రెండర్థాలలో వాడుకలో ఉంది. ఫ్రెంచి నాటక సాంప్రదాయంలో 'కామెడీ'కి దీనికి అట్టే తేడా లేదు. Farce is a comedy translated from the speech and manners of a cultivated society into the speech and manners of the bourgeoisie; or perhaps it would really be more historical to say that comedy represents a development out of farce, due to the sharpening of the wits and the refinement of the moral issues which accompany or form part of the growth of a cultivated society as distinct from a bourgeoisie. Such farce is a comedy of the ruder vices and the more robust virtues ... (P. 24) చారిత్రకంగా చూస్తే 'ఫార్సు' నుంచే 'కామెడీ' వెలువడింది; మొరటుతనం లేక నాజూకైనా ఫార్సే, కామెడీ, ప్రధానంగా అది పాత్ర వైచిత్రిమీద ఆధారపడుతుంది.

రెండో అర్థంలో, 'ఫార్సు' కూ 'కామెడీకి' కొట్టవచ్చేటంత అంతరం ఉంది. 'ఫార్సు' లో అసలు లేని నాటక కథా (Plot) ప్రాముఖ్యం 'కామెడీ' లో వుంటుంది. 'ఫార్సు' లో వికట హాస్యమే ఎక్కువ, అయితే దాని ప్రయోజనంకూడా, 'కామెడీ' కి లాగానే, గంభీరమైన యథార్థ జీవిత దృక్పథమే. దాని హాస్యం కూడా నాటక కథకు సంబంధించిన సన్నివేశాల నుంచి, సంభాషణలనుంచి వెలువడేదేగాని, పూర్తిగా వెలుపటి దేమీ కాదు.

It differs from typical comedy in two ways; firstly, not by the absence of outlook upon life but by an out look upon life definitely brutal or cynical, instead of sympathetic or at most ironical; and secondly, in that it proceeds at a greater distance from the normal facts of life of which it presents an extravagant or burlesque perversion, instead of merely a humorous or whimsical arrangement. (P. 42)

మంచి 'కామెడీ'కి విద్యాసంస్కారాలూ. బుద్ధిసూక్ష్మతగల ప్రేక్షకసమాజం ఉండాలి. సంభాషణలలోని సూక్ష్మాలను సులువుగా గ్రహించి మెచ్చగలగాలి. మెరిడిత్ (Meredith) అన్నట్లు A society of cultivated men and women is required, where i ideas are current and the perception quick, that he may he supplien with matter and an audience.

கன்யாசுல்கம்

(அற்புதத் திருமணம்)

குரஜாட அப்பாராவ்

தமிழாக்கம்

மு.கு.ஜகந்நாதராஜா

కన్యాశుల్కము తమిళ అనువాద ముఖపత్రం ప్రతి

భిన్నమైనది. ఎందుచేనంటే దానిలో సన్నివేశకల్పనకూ పాత్రపోషణకూ కొంతకు కొంతైనా అవకాశంవుంది. 'ప్రహసనం'లో అలాంటిది గగనపుష్పమే.

Comedy is more than farce, the play where untoward incidents render the character ridiculous, and it is also more than the play of intrigue with a happy ending, which the historians of drama so often for convenience classify under comedy. Nor is it burlesque, for there the movement, however amusing, depends upon some life other than its own.

Comedy in its truest interpretation depends, as Meredith says, upon a conception of Society and the Comic writer will hold up the mirror to his age, depicting its eccentricities, its deviations from some agreed norm. 14

ఆచార వ్యవహారాలను అవహేళన చేసేందుకని వికృత పాత్రలనూ వికట సన్నివేశాలనూకల్పించి, సంభాషణల మూలంగానే ఎక్కువగా హాస్యాన్ని కలిగిస్తూ Comedy of Manners రూపొందుతుంది. పిరేశలింగం ప్రహసనాలలాంటివే. అప్పారావు నాటకం వట్టి 'కామెడీ' కూడా కాదు. దానిపరిధి విరివి గలిగినది. ఒక బృహత్ గ్రంథం-ఒక నవలకు సరిపడేంతవస్తువు అందులో పోగుబడింది. నాటక కర్త ప్రవేశపెట్టనొల్లని విడివిడి సన్నివేశాలను ప్రవేశపెట్టి రచనను "అతిపూర్ణం"గా రూపొందించి, ఈ సన్నివేశాలనన్నిటినీ కలిపి నిలిపే సంధి సూత్రాన్ని బలహీన పరచాడు. దీనినొక Comic Epic అన్నా తప్పుండదు. నిజమైన 'కామెడీ'లో ఈ 'కామిక్' అతిమాత్రం కాగూడదు. అరిస్టోటిల్ ప్రకారం అది నాటక దోషమే. మెరిడిత్ (Meredith) అన్నట్లు the test of true comedy is that it will awaken thoughtful laughter.

వేమన హాస్యం కంటె కూడా ఎక్కువ నిర్మలమైన హాస్యాన్ని అప్పారావు అందించాడని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ రాసినమాటలలో అతిశయోక్తిలేదు. "వారి కన్యాశుల్కమందున్నంత హాస్యరస నైర్మల్యము తక్కిన యెవరి గ్రంథములందును లేదనుట యతిశయోక్తి కాదు." 15 అప్పారావు తరహా హాస్యం జీవిత తత్వానికి సంబంధించిన లోకదర్శన పద్ధతి తప్ప, వట్టి సాహిత్యోపకరణం మాత్రమేకాదు. * జీవిత పరిశీలనకు దానిలా పనికివచ్చే సాధనం మరొకటిలేదు సానుభూతిని

---

* అప్పారావు హాస్య ధోరణిని Jokes గానూ wit గానూ బోధపరచుకోకూడదు. అది Comic Spiritకూడా కాదు. Humour అనే ఇంగ్లీషు మాటే దీనికి తగింది.

చేకూర్చేందుకు దానిలా శక్తిగల హృదయపదార్థం మరొకటిలేదు. రచనకు రంగునీ కండనీ ఇచ్చేది ఇదే. దీని సాయంతోటే మంచినీ అందాన్నీ ఆవిష్కరిస్తూ చెడుగునూ వికారాన్నీ రచ్చకీడ్చి చూపుతాడు తాత్వికుడైన రచయిత. ఎంతటి చెడుగైనాసరే తొందరపడి దానిని నిర్దయగా ఖండించివెయ్యడు. దానికిగల మూలాలేవో వెమకుతాడు. దానికిగల కొద్దిపాటి సమర్థనలనూ ఇస్తాడు అసలు చెడుగనేది తనీగా ఉండదు. మంచితో కలగలిసి ఉటుందికాబట్టి ఈ కలుపుమొక్కల నణచి ఆ మంచిని పెంచడానికే.

ఇంతకూ అప్పారావు రాసి మళ్ళీ రాసిన నాటకం ఏమిటన్నమాట? ధనంజయుడౌనన్నా కాదన్నా అది ప్రహసనమాత్రంకాదు. ఇంగ్లీషువారి Comedy of Manners కాదు. ఇక శుద్ధమైన 'కామెడీ' యే. సంఘచరిత్రను చరిత్రకారుడికంటె ఎక్కువ రేఖా సుస్పష్టంగా చిత్రించగల రచయిత ధోరణిని ఒక ఆంగ్ల రచయిత ఇలా వర్ణించాడు :

...Comedy is generally a closer historian of its society than the members of it would easily admit and often indeed far truer than they would trouble to realise...the comic dramatist never ceases to scourge parasites, and lays the lash in all his plays on pimps and bawds and procurors... 16

సంఘ శత్రువులను రంగంమీదికి తెచ్చి ప్రేక్షకుల ముందు ఇతర పాత్రల చేత గేలిచేయించి సంఘటనలద్వారా అవమానపరిచే పని, 'కామెడీ' రచయితది. అందుచేత ఇలాంటి నాటకాలు కొన్ని సంఘ చిత్రాత్మకాలుగా రూపొందినప్పుడు, వాటికి కళాత్మకమైన ఐక్యత చేకూరదనికూడా ఆ రచయిత అంటాడు. కన్యాశుల్క నాటకానికి పట్టిన దురవస్థ, ఈ కారణంగా వచ్చిందే. ఈ విషయం గురించి అప్పారావే తనకు వివరించినట్లుగా గిడుగు రామమూర్తి గురజాడ రామదాసు గారితో చెప్పి ఉన్నారట కూడా : "పదిఅంకాల నాటకాలు కూడా ఉన్నసాహిత్యం మనది. భాగవత కలాపాలూ తోలుబొమ్మలాటలూ తెల్లారిందాకా చూచేసంస్కృతి కూడా. గ్రీసులోనూ, రోములోనూ పూర్వం, భోజనాలు తీసుకెళ్ళి Amphthea-tres లో కూర్చుని తెల్లవార్లూ ప్రదర్శనలు చూసేవాళ్ళు ప్రజలు. ఈ యుగంలోనూ కొన్ని పాశ్చాత్య దేశాలలో Serial dramas రెండు మూడు రోజులు కూడా ప్రదర్శిస్తున్నారు. ఈ నాటకాన్ని రెండురాత్రులాడితేనే రాగల ఇబ్బంది ఏమిటి?

దీనిలోని పాత్రలను సమగ్రంగా చిత్రించినప్పుడే రచయితనైన నాకు సంతృప్తి కలిగింది."

అనిదగి ఉండిన మాటలే ఇవి. ఒకలేఖలో అంతమాటా రాసిఉన్నాడు:

కన్యాశుల్కం యిప్పటికి నూటయాభై రెండు పేజీలు అచ్చయింది. చిన్నక్షరాలతో ముద్రించినా రెండువందల పేజీలు దాటేటట్టు వుంది. బిడియమనేది అడ్డువస్తున్నమాట నిజమే. అయినా కన్యాశుల్కం గొప్పరచనగా రూపొందించానని నేను అనుకుంటున్నాను. నాటకం చదివి నాకు నేనే ముగ్ధుణ్ణయ్యాను. అదే దీనికున్న గీటురాయి. మొదటి కూర్పుకంటె రెండవకూర్పు నా మనోభావాలను ఆలోచనలను సమగ్రంగా వ్యక్తంచేస్తున్నది. తొలికూర్పు అలాగాక, పై మెరుగులనే ప్రతిబింబిస్తోంది. 17

౩ తొలికూర్పు మోదుగ పూతలాంటిదైతే, మలికూర్పు రెల్లు పూతలాంటిది. మొదటిదానిలో అంకాలేమో అయిదు, రంగాలు ముప్పయిరెండు, పుటలు నూటెనిమిది. రెండోదానిలో అంకాలు ఏడు. రంగాలు ముప్పయి మూడు, పుటలు చిన్న చీమతలకాయల్లాంటి టైపుఅక్షరాల్లో కూడా నూటతొంబై ఆరు (1963 ముద్రణ.) స్థూలదృష్టికి కనిపించే భేదం ఇంతమాత్రమే.

తొలికూర్పు కథలో తర్వాత వచ్చిచేరినన్ని తిరుగుళ్ళులేవు. పాత్రలకు పాత్రలే మారిపోయాయి. మధురవాణి రామప్పంతుల ఉంపుడుగత్తె మట్టుకే. గిరీశం సానిపేరే ఉంది- పేరు మహలక్ష్మి. రామప్పంతులు నియోగికాదు, వైదీకే.* మహలక్ష్మి రంగంమీదికేరాదు. మధురవాణి రెండుమార్లే వస్తుంది.

....ప్రథమాంకం – బుచ్చమ్మను వెంకుపంతులుకిచ్చి కట్టి అగ్నిహోత్రావధాన్లు పదిహేనువందలు సంపాదించుకొన్నాడే గాని, సదస్యంనాడు పెళ్ళికుమారుడు "గుడ్లుపేలి చచ్చాడు" అని కథా నేపథ్యం కరటకశాస్త్రిలద్వారా ప్రథమాంకంలోనే తెలుస్తుంది. కరటకశాస్త్రి బుచ్చమ్మ మేనమామ. అతన్ని చూసీ చూడకమునుపే సంస్కృత నాటకకంపెనిలో విదూషక పాత్రధారియని గుర్తించి, "సంస్కృతం, అరవం, మహారాష్ట్రం యింకా యెన్నో భాషలు మంచినీళ్ళ

* వైదీకి నియోగి కొట్లాటలు రెండవ ముద్రణ కాలం నాటికి దేశంలో బాగారచ్చకెక్కాయి. అప్పారావుపై స్వకులాభిమానం ఉన్నట్లు కొందరంటారు.

ప్రవాహంలా మాట్లాడతారు" అంటాడు గిరీశం. బుచ్చమ్మ చెల్లెల్ని 1800 రూపాయలకు రామచంద్రపురాగ్రహారీకుడైన లుబ్ధావధాన్లు ("నాలుగు లక్షల కధికారి") బేరం పెడుతాడు. వెంకమ్మకు (బుచ్చమ్మ తల్లి) మేనరికంమీద మనస్సు. పెళ్ళి యెలాగూ తప్పేటట్టు లేదు. కాబట్టి శిష్యుడికి ఆడవేషం వేసి పెళ్లి ఆపుచేయించాలని కరటకశాస్త్రి బాహాటంగానే పథకం వేస్తాడు. కన్యాశుల్కం గురించి "మామగారికి లెక్చరు యివ్వడానికి కత్తి ఖటాయిస్తున్నారాలి" కాబట్టి "వీరేశలింగంపంతులుగారు కన్యాశుల్కము విషయమై వ్రాసిన పాంప్లేట్ ట్రంకులోంచి తియ్యమని గిరీశం వెంకటేశాన్ని అడుగుతాడు"

ద్వితీయాంకం —రామప్పపంతులు మధురవాణిని 'మైడియ్యర్' అని సంబోధిస్తూ సరసాలాడుతాడు. లుబ్ధుని పెళ్ళిలో సిద్ధాంతిని మంచిచేసుకోవాలని ఎత్తువేస్తాడు. మీనాక్షిని (లుబ్ధుని కుమార్తె) అమ్మి సంపాదించిన డబ్బుమీద నూటికి నెల ఒకటికి మూడు రూపాయిల వడ్డీ సంపాదించుకొంటున్న లుబ్ధుడు, గిరీశం అగ్నిహోత్రుని పేరున రాసిపంపిన క్లుప్తమైన లేఖను చదువుకొని సంతోషిస్తాడు. ఇంతలో కరటకునికీ రామప్పంతులుకీ భేటీ అయి "గుంటూరు శాస్త్రుర్లు" కుమార్తెను (ఆడవేషంలో వున్న శిష్యుడు) లుబ్ధునికి అంటకట్టాలని నిర్ణయం జరుగుతుంది.

తృతీయాంకం — రామప్పంతులు పౌరుగూరికి వెళ్ళి ఉన్న సందు చూసుకొని కరటకుడు పెళ్ళి అయిపోయిందనిపిస్తాడు. మధురవాణి కంటె తీసుకొని శిష్యుని పరారి తర్వాత, ఆపిల్లను మీనాక్షే నూతిలో వేసిందని రామప్పంతులు నేరారోపణ చేస్తాడు.

చతుర్థాంకం—సారాయి దుకాణం. హెడ్‌కానిస్టేబు లుబ్ధుని వద్ద నుంచి తన అప్పు పత్రమూ, అదనంగా 30 రూపాయలూ పుచ్చుకొని, ఈ హత్యకేసు మాఫీచేస్తూ పైకి రాస్తా నంటాడు. హెడ్డుకి ఉద్వాసన చెప్పించాలనుకుంటాడు రామప్పంతులు....ఈ లోపల పెళ్ళికి తరలివస్తూ దారిలో గిరీశం బుచ్చమ్మను పెళ్ళికి ఒప్పిస్తాడు. "వీరయ్యపంతులు గారు మహా యోగ్యులు, ఆయన్ని చేసుకుంటే మనకి లోపం వుండదు. యీ సొసైటీతాలూకూ లక్షలకొలది డబ్బు వున్నది."

పంచమాంకం—ఖూనీకేసులో మీనాక్షికి జైలు ప్రాప్తించింది. గుంటూరు శాస్త్రుర్లు లుబ్ధునికిమనియార్డరుద్వారా1200రూ.(తనశిష్యునికిశుల్కం)తిప్పిపంపాక

సౌజన్యరావుని ఆశ్రయించి. గిరీశంద్వారా లుబ్ధునికి కబురుచేస్తాడు. ఒక వీధిలో ఎదురైన 'గుంటూరు శాస్త్రుల్లు' కరటక శాస్త్రిలేనని లుబ్ధునికి గిరీశం తెలియజేస్తాడు. కాని, ఇతనికి ఎవరు ఎవరైందీ తెలీమగనక, గిరీశానికి డబ్బు ఆశజూపి గుంటూరు శాస్త్రుల్లను పట్టుకొమ్మంటాడు. గిరీశం శాస్త్రుల్లు వెంటబడి తరుము తూండగా. ఆ వీధిలోనే వకీలు నాయుడుతో మాట్లాడుతూన్న అగ్నిహోత్రుణ్ణి చేదుకొని శాస్త్రుల్లు దాక్కుంటాడు. బుచ్చమ్మను లేవదీసుకెళ్ళిన గిరీశాన్ని అగ్నిహోత్రుడు తరుముతాడు. అప్పుడు తెలుస్తుంది లుబ్ధుడికి గుంటూరు శాస్త్రుల్ల అసలు వైనం. సౌజన్యారావు చిక్కుముడి విప్పేస్తాడు. లుబ్ధుడు పెళ్లాడింది ఆడవేషం వేసుకొన్న కరటకుని శిష్యుణ్ణేగాని, అగ్నిహోత్రుని కుమార్తెను కాదని తేలుస్తాడు. కంటెకూడా వస్తుంది. రామప్పంతులుకి అందజేస్తానని సౌజన్యారావు తీసుకొంటాడు. గిరీశాన్ని స్టీమరెక్కి రాజమండ్రిపోయి కాలేజీలో చేరి బి. ఏ. వరకు చదువుకొమ్మంటాడు. ఈ లోపల బుచ్చమ్మను 'రామాబాయి విడోస్‌హోమ్'కు పంపించి విద్య చెప్పించవలసిందిగా కోరుతూ వీరయ్య పంతులుగారికి ఉత్తరం రాశానంటాడు. గిరీశం—"...డామిట్ ! వ్యవహారం అడ్డంగా తిరిగింది !"....

ఒకపూట నాటకానికి సరిపోవచ్చునేమోగాని వట్టి ఎముకల పోగులాంటి కథ అని, ఎవడైనా దీన్నిబట్టి గ్రహించగలడు. దీనికే వీరేశలింగంగారి బ్రాహ్మవివాహం ప్రహసనానికీ పైపై పోలికలైనా కొన్ని లేకపోలేవని అప్పారావే రాసుకొన్నాడు. కాబట్టి దానివిషయం కూడా ఇక్కడే చూడాలి : *

...ధనాల కామయ్య, అతని భార్య అజ్ఞానమ్మ, తమ కుమార్తెను ఏరీ కోరీ నాలుగో పెళ్ళివాడైన పెద్దయ్యకు అమ్మజూపుతారు. ఇందులో ఇద్దరు వైదికుల సాయం ఉంది. దొంగజాతకం బనాయించారు. ఆ పని చేసింది బొజ్జయ్య సిద్ధాంతి. పదేళ్ళకంటె ఎక్కువకాలం బతకడు కాబట్టి పెద్దయ్య ఆస్తి అంతా తమకే దక్కుతుందని కామయ్య ఆశ. పెళ్ళి కుమారుని ఇంటిలో "బట్టతల-అలివేణియు, సొట్టకాలి - హంసయానయు, చిలికి కన్నుల - చకోరాక్షియు, నత్తినోటి - మంజువాణియు" తయారౌతారు. సంభావనలకోసం బ్రాహ్మలరద్దీ. డబ్బు ఇరకాటాన పడిన పెద్దయ్య తన కౌలుదారైన వెంకటరెడ్డి

* వీరేశలింగం మరొక ప్రహసనంలో వర్ణించిన వకీలు వృత్తిలోని లోటుపాట్లను అప్పారావు, సౌజన్యారావు, వకీలునాయడు పాత్రలద్వారా నిరూపించాడు.

వద్ద రెండువేలు అప్పు పట్టవలసివస్తుంది. మాన్యాలిలాగైనా సొంతపరచుకో వచ్చునని రెడ్డి ఆశ.

పెళ్లి అయిన తర్వాత పదేళ్లు బతికాడు పెద్దయ్య. పెళ్ళినాటికే అరవై ఏళ్ళ బాలకుమారుడు: భార్యకు ముచ్చటగా మూడంటే మూడే ఏళ్ళు. భర్త పోయాక పదమూడేళ్ళ ప్రాయాన పూటకూటిల్లు పెట్టుకొనింది. వెంట్రుకలు తీయలేదు. భర్త ఏడాదిలో పోతాడనగా, రజస్వల కాకమునుపే గర్భాధానం జరిగింది! పేరుకే. పెద్దయ్య చెయ్యితీసి పెట్టేసితిలో కూడా లేడాయె! ఆ తర్వాత రెండు మాసాల్లో సమర్తాడి, భర్తను పున్నామ నరకంనుంచి తప్పించేందుకై సంతాన ప్రాప్తికోసం ప్రయత్నాలు సాగించింది గాని "యేటా యేటా పెళ్లాం బిడ్డలు కంటూవుండగా కన్నుల పండుగగా చూచుకుంటూ వుండే భాగ్యం పెద్దయ్యగారికి లేకపోవడం చేతనూ పుట్టబోయే సంతానానికి భూమిమీద బ్రతక వలసిన యోగం లేకపోవడం చేతనూ కొన్ని మాసాలకు భర్త వియోగం సంభవించి యీమె కృషి సఫలమయింది కాదు." కాబట్టి చివరకు "రంకు పురాణం" మిగిలింది....

ఒకే సమస్యకు సంబంధించి ముందు వెనకలుగా వెలివడిన ఏ రెండు రచనల్లోనైనా ముందుదాని మొక్కట్లు కొన్ని వెనకదానికి తప్పవు. అయినా, మరొక సందర్భంలో అప్పారావు వీరేశలింగంగారి నధిక్షేపించి వేలెత్తి చూపినట్లు, ఆయన ప్రహసనంలో "దుష్టవర్తనునకు శిక్ష" జోడు కాగడాలు వేసి వెదకినా కనుపించదు. గిరీశం శృంగ భంగం, రామప్పంతులు ఆటకట్టు, లుబ్ధునిక్షోభ, అగ్నిహోత్రుని ఖర్చు, సౌజన్యారావు తీర్పు – ఇలాంటి అంశాలు మందుకైనా వీరేశలింగం రచనలో కనిపించే వీలులేదు. కన్యా విక్రయం బాలవితంతువులచేత చెయ్యరాని తప్పుపనులు చేయిస్తుందని చెప్పడానికి మాత్రమే ఆయన ఆ రచన చేశాడు. మీనాక్షివంటి పాత్ర ఆ ప్రయోజనాన్ని ఇక్కడ నెరవేర్చినా, అప్పారావు సమస్యను అంత తేలిగ్గా కొట్టివెయ్యడు. ఇది మానవ మనస్సుకు సంబంధించిన సమస్య కాబట్టి, దాని లోతుపాతులు పరిశీలించి మంచి చెడ్డలు వేర్పరించాలి. ఎటొచ్చీ ప్రహసన లక్షణమొకటి అప్పారావు రచనను బలంగా అంటిపెట్టుకు పోయింది. పాత్రలపేర్లు స్వాభావికంగా యధార్థంగావుండక, ముక్కోపికి అగ్నిహోత్రుడు, పిసినిగొట్టుకు లుబ్ధుడు, జిత్తులమారికి కరటకుడు. (మరొక వీరేశలింగం ప్రహసనంలో 'కరటకరెడ్డి, పాత్ర ఒకటి ఉంది.) అని ఉంచడం అసహజమే * అయితే వీరేశ

* కరటకశాస్త్రి అనేపాత్ర జి.వి.వి. నాటకం వెంకిపంతులులో కూడా కనిపిస్తుంది.

లింగం ప్రహసన పాత్రల పేర్లకంటె మెరుగు. ఒక వ్యాసంలో ఈ లోపాలను ఎన్నుతూ, శ్రీశ్రీ ఇలా రాశాడు :

> —మంచివాళ్ళ పేర్లు మంచి గుణాలు సూచించేవిగానూ, చెడ్డ వాళ్ళ పేర్లు చెడ్డ గుణాలు సూచించేవిగానూ ఉండడం ప్రాచీన సంప్రదాయం. ధర్మరాజు, సత్యకీర్తి, దుశ్శాసనుడు, దుష్టబుద్ధి ఇత్యాదులు. కన్యాశుల్కంలో పేర్లు, ఇంటిపేర్లతో సహా లేనందుకే నేనెంతో ఇదవుతూవుంటాను. (సులక అగ్నిహోత్రావధాన్లు, యన్. గిరీశం అనే పేర్లు ఇందుకు మినహాయింపు).... ఆధునిక సాహిత్యంలో ఇది అవసరం. 18

రెండవ ముద్రణలో కూడా అప్పారావు ఈ మార్పు చేసుకోలేదు సరిగదా, లుబ్ధావధాన్ల పేరు తనకే అసహజంగా తోచిందేమో, అతనిగుణాన్ని గమనించిన తలిదండ్రులు దానికి తగినట్టే నామకరణం చేసి ఉంటారని తప్పించుకో జూచాడు. మధురవాణి పాత్రను పెంచి మెరుగుపెట్టి, మహాలక్ష్మిని తీసివేసి, రామప్పంతులుకి నియోగి లౌక్యం మప్పి, అన్నిటికంటె ఎక్కువగా గిరీశం విశ్వరూపాన్ని చూపి, ఈ గ్రంథాన్ని నాలుగింతలు పెంచాడు శ్రీనివాసయ్యంగారు ఇచ్చిన సలహా, నాటక పరిమితి విషయంకూడా అయిఉంటె బాగుండేది. రచయిత తన ధోరణిని తానే మెచ్చి దానికి లోబడినప్పుడు వచ్చే చిక్కు ఇదే. కొంతభాగం అచ్చులో వుండి నప్పుడుకూడా ఈ ప్రలోభంనుంచి తప్పుకోలేకపోయాడు రచయిత. మధురవాణి ముచ్చటగొల్పే విధంగా తయారైందని ఆత్మసంతృప్తి మిగిలించిగాని, ఆ పాత్రను సంస్కరించడానికి చివరిఅంకం బాగా పెరిగిపోక తప్పలేదు. ప్రథమాంకంలోనే పూటకూళ్ళమ్మ చీపురుగట్ట సరసం, మూడోఅంకంలో కరటకశాస్త్రి మధురవాణిని ఆశ్రయించి లుబ్ధావధాన్ల పెళ్ళి మాన్పించే ప్రయత్నం చెయ్యడం. నాల్గోఅంకంలో మును పటికంటె ఎంతో పెద్దదైకూడా సారస్యం కలిగించే గిరీశం ఉత్తరం, ఐదోఅంకంలో మొదటిరెండురంగాలూ – ఇవన్నీ కొత్తగావచ్చిదూరిన మార్పులే. వీటిని ఓపికగా వర్ణించాక, ఆబ్బూరి రామకృష్ణారావుగారు సమదృష్టితో చేసిన ఈ కింది అంచనా గమనించ దగింది.

> యీ మార్పులవల్ల రెండోకూర్పులో పాత్రపోషణ దృష్టితో చూస్తే నాటకానికి కొంత పుష్టి కలిగినా, ప్రతి సన్నివేశంలోనూ సంభాషణ చమత్కృతికి లొంగిపోయి అమితంగా పెంచి రాయటంవల్ల చక్కని వస్త్వైక్యంకలిగిన నాటకంగా రూపొందలేకపోయింది. 19

అబ్బూరివారిది ప్రధానంగా ప్రయోక్త దృక్పథమేగాని, రచయితదృక్పథం కాదు. ఏకైక్యతగురించి రచయితకు చింతలేకపోలేదుగాని, 'సమగ్రత' కోసం మాత్రమేగాక, బహు విషయస్వీకరణ దృష్ట్యాకూడా, ఈ నాటకం సంధిబంధాలు సడలిన దృశ్య సంపుటంకాక తప్పలేదు. దోషాన్నికూడా గుణమని ఎంచి "విశ్వతో ముఖమైన" ఈ నాటకం జీవితమంత గొప్పదికాబట్టి జీవితంలోవున్న చిన్నా పెద్దా విషయాలన్నీ ఇందులో చోటు చేసుకొన్నాయనడం, అభిమానాతిశయాన్ని సూచించి నంతగా విమర్శావైఖరిలోని విశేషాన్ని సూచించదు. షేక్స్పియరులా నటుడై మోలియేరు (Moliere) లా నటుడూ నటబృంద నిర్వాహకుడూ అయి ఉండవలసిన అవసరంలేకుండానే, చెకాఫ్‌లా ఒక గొప్ప నాట్యబృందంతోటి నిత్యసంబంధా ఉండవలసిన అగత్యంకూడా లేకుండానే, అప్పారావు ఆదినుంచీ 'స్టేజి దృక్కోణం' పెంపొందించుకొంటూ ఉండినట్లు డైరీలబట్టి తెలుస్తుంది. ధార్వాడ నాటక సమాజం వారి ప్రదర్శనలు, మద్రాసులో కల్యాణ రామయ్యరు పౌరాణిక నాటకప్రదర్శనలు, బాలామణి సాంఘిక నాటక ప్రదర్శనలు (ముఖ్యంగా డంబాచారి విలాసం) ఇలాంటి వెన్నో ఈ దృక్కోణానికి పదునుబెట్టాయి. శ్రవ్యంగానేగాక, దృశ్యంగాకూడా కన్యాశుల్క నాటకాన్ని తీర్చిదిద్దాలని సంకల్పించుకొన్నాడు. అయితే ఆ సంకల్పా నికి ఎన్నో విఘాతాలు :

'కవిరాజు' ఆదిభట్ల నారాయణదాసుకు రాసిన ఉత్తరంలో (1909) ఆయన ధీమా చూడండి :

> ఇతివృత్త స్వీకరణలో, నిర్వహణలో, హాస్యరస పోషణములో, పాత్రోన్మీలనములో, తెలుగు సాహిత్యములో ఇది అత్యుత్తమ నాటకమనే విషయాన్ని మరవకండి. 20

ఈ నాటక కథావస్తువు 1890 డిసెంబరులో క్రిస్మస్ సెలవులిచ్చిన సాయం కాలం మొదలౌతుందని, అంతర్గత సాక్ష్యంబట్టి సోమయాజుల వెంకటరామమూర్తి నిర్ణయించాడు. క్రిమియా యుద్ధం (1854-56) లో సెబాస్టపూల్‌నుంచి ఇంగ్లీషువాళ్లు రష్యావారిని తరిమికొట్టడం 5 వ అంకం 4 వ రంగంలో ప్రస్తావనకు వచ్చింది. బుచ్చమ్మను లేవదీసు కెళ్ళినందుకు గిరీశంపై విశాఖపట్నం డిప్టీ కలెక్టరు కోర్టులో అగ్నిహోత్రుడు పెట్టిన కేసు విచారణకు వచ్చినప్పుడు, ఆరోపణ రుజువు చేసేందుకు రామప్పంతులు సాయంతో బుచ్చమ్మ 'భావ' సంవత్సరంలో పుట్టినట్లు దొంగజాతకం

బనాయిస్తారు. బుచ్చమ్మకు పదహారేళ్ళలోపే అని రుజువుచెయ్యడానికే ఈ తంటా లన్నీ. 'భావ' అంటే 1874–75 కాబట్టి, అప్పటినుంచి 15 ఏళ్ళ లెక్క 1890 కే తీసుకొస్తుంది.

కథ మొత్తం 15 రోజులు జరిగింది. ఏడవరోజు రాత్రి నాటకంలో అది ఉత్కర్ష (climax) స్థాయి చేరుకొంటుంది. ఆ రాత్రి ప్రతిగంటా ఏదో ఒకటి జరుగుతూనో జరుగుతున్నట్టో ఉంటుంది. బుచ్చమ్మ పరారీ; కరటకశాస్త్రి శిష్యుని (మాయ సుబ్బి) పరారీ వగైరా. 21

# 2

"ఒక గొప్ప మేధావి యొక్క రచన" అని ఈ నాటకాన్ని సమీక్షించాక వర్ణిస్తూ, పూర్వోదాహృత వ్యాసపరంపరలో సోమయాజుల వెంకట రామమూర్తి ఆ నాటక కథను రెండు ఉపకథలుగా విభజించాడు. రెండూ రెండలల లాంటివై సమానాంతరంగా విడిగా ప్రవహిస్తూ చివరకు సప్తమాంకం చతుర్థ రంగంలో విశాఖపట్నాన సంగమిస్తున్నాయి. ఈ తరంగాలకు ఆయన రూపకల్పన కూడా చేశాడు: చేసి ఇలా గన్నాడు:

ఈ కథల్లోని ఉత్కర్షను తెలిపే భాగాలు నెం. 3 : మిక్కిలి బిగి కలిగిన భాగం కూడా (Period of high tension) ఇదే. ప్రేక్షకులకు కూడా ఎక్కువ ఔన్నత్యం కలిగిస్తుంది. "చతుర్థ పంచమాంకాలు నాటకాని కంతకూ బలిష్ఠమైన వెన్నుకుప్ప లాంటివి."

హూణ, గీర్వాణ నాటక ఫక్కీకల కోణం నుంచి ఈ నాటక కథను పరిశీలించి ఇది నాటకమే అని నిర్ణయించాక, మరొక గొప్ప ఆంధ్ర నాటక విమర్శకుడు, కథా నిర్వహణ గురించి రాసిన మాటలను ఇప్పుడిక్కడ చదువుకోవాలి:

> కథా విన్యాసమున ముఖ్యములైన ఘటనలు మాత్రమే చెప్పబడినవి. సుబ్బి పెళ్ళి మొదట స్థిరపడి తరువాత రద్దుచేయబడి, అనంతరము కొంచెము తడబడి, తుదకు భంగపడెను. ఈ కుంఠిత గతి నిరూపించుటయందు కవి చాతుర్యము కానవచ్చును. పెళ్ళి పక్షాన పనిచేసిన వాళ్ళు అగ్నిహోత్రావధాని, రామప్పంతులు, లుబ్ధావధాని. వీళ్ళ యత్నము నిరాటంకమయితే వివాహమై తీరును. అట్లే జరిగితే వస్తు జటిలత (Complexity of plot) ఉండదు. అందువల్ల కవి ఈ ఘటనకు ఘాత చేకూర్చెను. పెళ్లి ప్రతిపక్షమున పనిచేసిన వాళ్ళు కృష్ణరాయపురములో బుచ్చమ్మ, వెంకమ్మ, కరటకశాస్త్రి, గిరీశము, రామచంద్రపురములో మధురవాణి, రామప్పంతులు. ఈయిరువీడులవారి ప్రయత్నము ఒకదానితోనొకటి కలియనంతకాలము పెళ్లియొక్క గతి అనుకూలంగా నుండెను. కరటకశాస్త్రి రామప్పంతుల సహాయము సంపాదించి ప్రయత్నములు జోడించగానే పెళ్ళి ముహూర్తికపాలు ఆగినది. గిరీశమూ, రామప్పంతులూ

వ్రాసిన ఉత్తరాలు లుబ్ధునకు చేరినవెంటనే అడుసున పాతిన స్తంభమువలె ముందుకీ వెనకకీ ఊగులాడింది. గిరీశం ఉత్తరము పెళ్ళికి ప్రతికూలించగా రామప్ప ఉత్తరము పెళ్ళిని కొంత ఆపి మాయసుబ్బి పెళ్ళి కనుకూలించింది. తరువాత అగ్నిహోత్రుడు తరలిరావడము సుబ్బి పెళ్ళిని కొంచెము ముందుకు నెట్టగా, అతనికీ లుబ్ధునికీ జరిగిన జగడము దాన్ని వెనక్కి పూర్తిగా నెట్టివేసింది. ఇంతలో ఈ ఘటన అంతమై మాయసుబ్బి పెళ్ళి తలయెత్తింది. ఈ సుబ్బి పరారికావడముచేత కూనీకేసుపెట్టి లుబ్ధావధాని మనస్సు కలతపెట్టి పశ్చాత్తాపము పుట్టించి తలప్రాణము తోకకు తెచ్చింది. ఇంతవరకూ అధర్మమూ, అన్యాయమూ, అసత్యమూ ప్రజ్వరిల్లి కార్యక్రమమును వంచనా కలితముగా చేసినవి. ఇందుపాల్గొన్న వాళ్ళందరూ స్వార్థపరులు, మోసగాళ్ళు, ఈర్ష్యా పరులు. వీళ్ళ ప్రభ వెలిగినంతకాలము పాపము చెలరేగి అంవరిని శృంగ భంగమువేసి లుబ్ధావధాని పీక కురి అయినది. ముసలివాడు మతిపోయి ప్రాణాల మీద ఆశ విడిచి దిక్కులేనివాడయ్యాడు. పాపవృక్షము యొక్క ఫలము విషయుక్తమవుట వింతకాదు. ఈ సంతతి నిర్మూలనము కావలెనంటే ధార్మి కులు, పరార్థ వ్యాపృతులు, స్వార్థత్యాగులూ కార్యభారము వహించవలెను. ఇట్టి వారీ నాటక పాత్రములలో ముగ్గురున్నారు - కరటకశాస్త్రి మధురవాణి, సౌజన్యారావు. వీరు కార్యనిర్వహణము మొదలు పెట్టగనే వంచనామేఘము లొక్కొక్కటి విరియబారి క్రమముగా పటాపంచలై స్వార్థధ్వాంతము దిశలకు పారెను .... 'సత్యమేవజయతి నానృతమ్' - ఇదే కావ్యన్యాయము. (Poetic justice) 22

ఈ విమర్శకు లిద్దరితోనూ భేదించే మరొక విమర్శకుణ్ణి రంగంమీదికి రావిస్తాను. ఈ నాటకంలో చెడ్డనేగాని, హాస్యం విషయంలో కొంత తప్ప ఇసు మంత మంచినికూడా చూచి మెచ్చలేని వారి కందరికీ కేతవరపు రామకోటిశాస్త్రి గారిని ప్రతినిధిగా గ్రహించాలి. "కథ-తత్సంధానము అను విషయమున కన్యాశుల్క కర్త కృతార్థుడు కాలేదు. అందుకు కారణము కథాకథన కౌశల మతనికి లేదు." అని శాస్త్రిగారి తీర్పు * ఈ తీర్పు చెయ్యడానికి ఆయన ఇచ్చిన ఆధారాలివి :

---

*"సౌందర్యసమీక్ష" అన్న గ్రంథంలో ఈ నాటకంగురించి ఒక వ్యాసంరాస్తూ డా॥ వేమూరి వెంకట రామనాథంగారు, నాటక కథనంలో కొన్ని లోపాలను చూపారు :

1. కన్యాశుల్కానికి సంబంధించిన ప్రధానకథకు గిరీశం, బుచ్చమ్మల ఉపకథనం

1. ద్వితీయాంకం రెండవ స్థలంలో శిష్యునిస్వగతం, కరటకశాస్త్రితో అతని సంభాషణ ; పంచమాంకం మొదటి స్థలంలో బుద్ధుని అల్లరి – ఇవి ఇతివృత్తానికి కథా గమనానికి సహాయంచెయ్యవు.

2. పోలిశెట్టి వగైరాల పేకాటసీను 'ఆధికారిక వస్తువు' నకు ఆటంకం కలిగిస్తూంది

---

"చక్కని సంకలనములేదు" మంచి నాటకంలో ఇవిరెండూ "పడుగుపేకలవలె" అల్లుకుపోవాలి. (పు. 26)

2. కథాక్రమంలో ప్రధాన కథకు గిరీశం ఉపకరించడు. "పెరటిలోని ఆవులమందకు ప్రక్క ప్రక్కగా తారాడు అబోతువలె ఇటనట ప్రేలుచు" చివరకు ప్రయోజన రహితంగా అంతరించాడు.

బాలవితంతువైన బుచ్చమ్మను లేవదీసుకొని పోయినందుచేత. (బుచ్చమ్మ వైధవ్యం బాల్య వివాహ. కన్యాశుల్కాల దుష్ఫలితమే కాబట్టి) "ఈ అనర్థ ప్రవర్తనమువలన గిరీశం గాథకు కథలో కొంత నిశ్చయస్థానము చిక్కను" అనిరామనాథంగారే మినహాయింపుగా రాశారు. (పు. 28).

3. మధురవాణికంటె కరటకశాస్త్రి శిష్యుని (మాయసుబ్బి) ద్వారా తిరిగి మధురవాణికి చేరాక, దానిని తెచ్చిపెట్టవలసిన భారం రామప్పంతుల మీద బడి, దానిని కనిపెట్టుటకే మిగతా మూడు అంకాలు రూపొంది, విషయైక్యాన్ని చెరిచాయి. "ఇటనట కన్యాశుల్కము మాటలు దొరలినను, ఈ రంగములన్నియు కన్యాశుల్కమునకన్న 'కంఠాభరణము'నకు యోగ్యములై పోయినవి" (పు. 29)

4. పేకాటసీను, సారాదుకాణము సీను, సప్తమాంకంలో సగానికిపైగా, కోర్టుఫార్సు, సౌజన్యరావు సాక్ష్యసేకరణ ప్రయత్నం – ఇవన్నీ కథకు ప్రయోజనాన్ని చేకూర్చకుండా, "ఇంటజేరి యింటి వాసములు లెక్కపెట్టినట్లు, నాటకములో కూడి నాటకమునకే ఎగ్గుచేకూర్చినవి" (పు. 35) వీటివల్ల నిరర్థక పాత్రలకు అవకాశంకలిగి "తేనెలో పంచదార కలుపుటవలె" అనవసర మయ్యాయి. కంటె వ్యవహారమంతాచేరి "అతుకని ప్రహసనముగా" తయారైంది.

5. దీర్ఘనాటక స్వరూపంలోఉన్న అనేకరంగాల కూర్పులాంటి రచన. "కొన్నిప్రత్యేక నాటికలుగా చేయవీడి మెరయు పూసలవలె విశిష్టములు ; కొలది ప్రహసనరూపము దాల్చినవి. రెండు మూడు ప్రత్యేక నాటకములకు తగిన నిశిత సంఘవిమర్శ ఒక్క నాటకమనుపేర అయుక్తముగా నమర్పబడియున్నది." కాబట్టి ఉన్నదున్నట్లుగా ఇది "మహానాటకమని అనలేము" (పు.37) అయితే సారస్వతంసంఘజీవన ప్రతిబింబమనేట్టుంటే, ఇది ఉత్తమసారస్వతమౌతుంది.

ఈ కావ్యము సంఘమును సంఘముగా, నాటకము సరిహద్దులు సరుకుగొనక, నిరూపించిన దీర్ఘనాటకము. ఇందు ఆణిముత్తెములు గలవు; నత్తగుల్లలును ఉన్నవి (పు. 35)

3. బ్రహ్మరాక్షసి భూస్థాపనం గురించి గవరయ్య గొడవ కేవలము అసందర్భము.

4. బైరాగి సంభాషణలు 'నిరర్థకములు.'

ఇవన్నీ చేరి ఈ రూపక ఇతివృత్తాన్ని 'నిబిడబంధము' లేకుండా చేశాయి. ఇక అసంగతాల 'లిస్టు' ఒకటి ఉంది:

1. క్రిస్మస్ శెలవులప్పుడు ఆర్నెల్ల పరీక్షలే కాబట్టి పాస్ ఫెయిల్ తేలే సమస్య లేదు. సెలవులిచ్చే నాటికి తెలియవు.

2. పూటకూళ్ళమ్మ దాడినుంచి గిరీశం తప్పించుకు వెళ్ళాకగూడా రామప్ప మంచంకిందనే ఎందుకున్నట్లు ?

3. "తుమ్మెదపంకుల్లా ఉండే జుత్తు కూడా తినివేస్తారు కదా" అని గిరీశం బ్రాహ్మణ (అందులోనూ వైదీకి) వితంతవులగురించి జాలిపడుతున్నాడే. అంతటి "ఆచార పవిత్రు"డైన అగ్నిహోత్రుడు బుచ్చమ్మ జుత్తుతీయించాడు కాదేం ?

4. ఖూనీకేసు 'ముద్దాయి' లుబ్ధుడు జైల్లో ఉండక విశాఖపట్నంలో ఎందుకున్నట్లు ?

5. మధురవాణితో సహా పాత్రలన్నీ 'రూపకకర్తచేత శవము లాగబడుచున్నట్లు' విశాఖపట్నం వీధుల్లో తిరగాల్సి వచ్చిందెందుకు ? 'ఒక సూత్రమున ఇముడని ఇన్ని కేసులను ప్రవేశపెట్టి ఒకదానిని తేల్చక ఎక్కడివారి నక్కడ విశాఖపట్నపు వీధులలో తిరుగుడని వదలి' సౌజన్యారావుచేత గిరీశమును ఇంటి నుండి వెళ్ళగొట్టించి, మధురవాణిని సౌజన్యారావు ఇంటిలో నుంచి రూపకము సమాప్తము చేయుట ఇతివృత్త గ్రథనమునగాని, సన్నివేశకల్పనమునగాని పటిష్ఠము గామి తెల్లము చేయుచున్నవి.?[23]

ఇవి మహాగొప్ప అభ్యంతరాలేమీ కావు. రంగప్రయోగం ఒక్కటే అప్పారావు పరమాశయం కాదు; సంఘ చిత్రంలో ప్రముఖాంశాలు చిన్న అంశాల సాయం లేకుండా ప్రాముఖ్యాన్ని చూపెట్టుకోలేవనే చిత్రకారుని ఇంగితంతోటి, నేరుగా కథకు అవసరమైన వాటికి విశ్వసనీయత నిచ్చేందులకై రంగప్రయోగ దృక్కోణం నుంచి అనవసరమనిపించే వాటిని దన్నుగా నిలిపాడు.* ఆయన సందిలి పెద్దది.

---

మధురవాణి పాత్ర పొడిగించి నాటకాన్ని గిరీశం వ్యవహారంగా తయారు చేయడం గురించి ఆ నాళ్ళల్లోనే గిడుగు సీతాపతిగారు రామమూర్తి సమక్షంలో అప్పారావును ఆక్షేపించే సరికి అప్పారావిలా జవాబిచ్చారు :

—నాటకాలలో ప్రధాన వస్తువుతోపాటు అప్రధానమయిన కథావస్తువును జోడించడం వల్ల నాటకానికి రసపుష్టి కలుగుతుంది...

**నాటకాలు.నా అనుభవాలు–కన్యాశుల్కం** : డా. గిడుగు వేంకట సీతాపతి **కళావని** నాటక ప్రత్యేక సంచిక, పు. 30

విద్యలలో వచ్చిఉన్న మార్పులు సూచించి సంస్కృత భాషాధ్యయనం పంచకావ్య పఠనం వగైరాలతో ముఖం మొత్తిఉన్నదని చెప్పేందుకే శిష్యుడి స్వగతం. పల్లెటూళ్ళలో బోగంపడుచుకుగల పురుషాకర్షక శక్తికి పేకాటసీను ఒక ఉదాహరణ. పూజార్ల తంతుకు గవరయ్య నిదర్శనం. క్రిస్మస్ శెలవులు ఆ కాలంలో (1910 తర్వాత వరకూ) సాంవత్సరిక పరీక్షాంతంలోనే వచ్చేవి. వెంకటేశం చిన్నక్లాసు విద్యార్థి కాబట్టి స్థానికంగానే అతగాడి పసగురించి తెలుసుకొనే వీలుంది. ఖూనీ కేసు విషయమై హెడ్డు రాసిన రిపోర్టు లుబ్ధునికి అనుకూలంగానే ఉండి ఖైదు తప్పించిందేమో! సారా దుకాణం సీనూ పేకాటసీనూ అవాంతర ఘటనలే. బైరాగుల మోసపు మాటలు, మెట్ట వేదాంతాలు, పోలీసులు దొంగ కేసులు బనాయించడాలూ, 'పెద్ద మనుషుల' నిజ స్వరూపాలూ – వీటిని విమర్శించడానికి రచయిత నాటక కథా గమనాన్ని కూడా మందం చేసి వేశాడు. ఇవన్నీ అవాంఛనీయాలే అంటూనే, ముందు చెప్పిన వ్యాసంలో శ్రీపాద కామేశ్వరరావు "వ్యర్థమైన ఘటన కానరాదు" అని నిర్ణయం చేసి పోయాడు.

బైరాగి పాత్రగురించి అప్పారావు అభిమాని ఏమంటున్నాడో ఇక్కడే చూడాలి. అన్నివిధాల ఆ పాత్ర అనవసరమే అయినా, అది లేందీ నాటకానికి వెలితిగా ఉంటుందట. అందరి సలాములూ తానందుకొనే హెడ్డు, బైరాగికి గులాం! ఇలాంటి ఎన్నో సిద్ధుల విషయంలో పామరులకు నమ్మకం ఉందిగనకనే బైరాగి అవసర మౌతున్నాడు:

> కన్యాశుల్కంలోని యితరపాత్రలే బైరాగిని సృష్టించారు. బైరాగి నిత్య జీవితంలోనుంచి సరాసరిగా కన్యాశుల్కపు పుటలలోనికి ప్రవేశించాడు. కన్యాశుల్క నాటక గమనానికి బైరాగి ఎంత మట్టు కవసరం అని అడిగితే, జీవిత గమనానికి మనం మాత్రం ఎంత అవసరమని ఎదురు ప్రశ్న వెయ్యక తప్పదు. 24

రంగ ప్రయోగంలో అసిరిగాడు వంటి అల్పపాత్రలను కూడా మూర్తి కట్టింప యత్నించిన రచయితకు, నాటకంమీద కంటె జీవితంమీద గురి యెక్కువ. అప్పారావు స్థూలచిత్రంతో తనివిచెందడు. సూక్ష్మాంశాసహిత చిత్రణ కావాలి. శిల్పానికి అదికూడా ఒక గీటురాయి. అగ్నిహోత్రుడు జంధ్యాలు వడకడమూ, బండివాడు సామాన్లు దించడమూ, బుచ్చమ్మ పప్పు రుబ్బడమూ – యివన్నీ రంగశిల్పానికి సంబంధించిన అంశాలే. సోమయాజుల వేంకట రామమూర్తి చూపించిన మరో

సూక్ష్మాంశం (detail) అప్పారావు జాగరూకతకు దీపమెత్తి పడుతుంది: బుచ్చబ్బు హెడ్డుకిచ్చిన 25 రూపాయల్లో మూడు రామప్పంతులకు దక్కాయికదా, మరి అతడు మధురవాణి నడవడి గురించి ఆచూకీకి ప్రతిఫలంగా ఒక రూపాయి, మీనాక్షి . . . ము చుకు వచ్చినందుకు మామూలుగా యింకో రూపాయి. అసిరిగాని కిచ్చివేయగా మిగిలిన మూడో రూపాయి, దాసరివేషంలోవున్న మహేశానికి యిస్తాడు. రామప్ప శీలం ఈమూడింటిద్వారా బయల్పడుతుంది. బోగం దానిపై అనుమానం, మీనాక్షితో సంబంధం, నియ్యోగపు దర్పా. పేరుకు తగ్గట్టుగా కన్యాశుల్క సమస్య ఒక్కటే ప్రధాన యితివృత్తమై వుంటే, యీ నాటకంలో గిరీశానికిగానీ, మధురవాణికిగానీ చోటంతగా వుండనప్పుడు చిల్లరమల్లర పాత్రలకెలా ఉండగలదు? అయితే వాళ్ళం దరూ — సమాజం యావత్తు — ఈ రక్కసి సాలెగూటిలో పట్టుబడిపోయారు కాబట్టి కొద్దోగొప్పో వాళ్ళ ఊసురావాలి. అందుచేతనే ఒక వ్యాసంలో ఆరుద్ర యిలా రాశారు.

—కన్యాశుల్కమనే దురాచారం ఆనాటి బ్రాహ్మణ సంఘంలో మాత్రమే ఉండేది. అయితే దాని విషవాయువులు సమాజంలో అన్ని వర్గములనూ ఉక్కిరిబిక్కిరి చేశాయి.* అప్పారావుగారి బ్రాహ్మణేతర పాత్రలన్నీ ఆ సంకీర్ణ యితివృత్తపు పద్మవ్యూహంలో చిక్కుకున్నవాళ్ళే. మృచ్ఛకటిక లోని రాజ కీయ విప్లవంలాగ కన్యాశుల్కంలో సాంఘిక అవినీతి అంతర్లీనంగా వుంది. రెండు నాటకాలలోనూ అవి చిట్ట చివర తమ బృహద్రూపాన్ని ప్రదర్శిస్తాయి.25

పాత్రీకరణ విషయంలో నాటకీయ వైఖరిని మించిన మానవతావాద దృక్పథం ఒకటి అప్పారావుకు ఉండేదని లోగడే చెప్పడమయింది. సానుభూతి దాని ప్రధాన లక్షణం. సంభాషణలద్వారా చేష్టలద్వారా మాత్రమేగాక, స్వగతాల ద్వారాకూడా అప్పారావు వాటి లోలోపలి జాగాల నన్నిటినీ ఆవిష్కరింపబూని కృతార్థుడయ్యాడు. మచ్చుతునకల (types) లాంటి పాత్రలద్వారా సమాజంలోని వివిధవర్గాలనూ కూటాలనూ ధోరణులనూ పుస్తకాని కెక్కించగలిగాడు. గిరీశం లాంటి పాత్రలకు, తదనంతరకాలంలో జీవితంలోనే స్వతంత్ర జీవిక కల్పించ గలిగాడు. మధురవాణి పాత్రను ఆయనెలా మలిచిందీచూస్తే, పాత్రలపట్ల ఆయన దృక్పథం తెలిసివస్తుంది.

---

* ఇది కొంతవరకే నిజం. తక్కువ వర్ణాల్లో మారు మనువులుండేవి కాబట్టి కన్యాశుల్క సమస్య వారినంతగా బాధించదు. పైగా దాన్ని యెద్దేవా చేస్తాయగూడా.

....రెండవ ముద్రణకు ఈ నాటకాన్ని తిరిగి రాస్తున్న రోజుల్లో ఒక రోజున కుమారుణ్ణి వెంటపెట్టుకొని గిడుగు రామమూర్తి బరంపురంనుంచి విజయనగరం వచ్చాడు. మధురవాణికి సంబంధించిన దృశ్యాన్ని అప్పారావు చదివి వినిపిస్తే విని, ఇంత బాగా ఈ పాత్ర రూపొందిందంటే నువ్వు బోగమిళ్ళకు వెళ్ళివుంటావు, వెళ్ళావా లేదా, నిజం చెప్పమన్నాడు. నిజమేనంటూ తాను ఇద్దరు బోగంపడుచుల ఇళ్ళకువెళ్ళి వాళ్ళ అలంకరణ భాషణాదికాలను గమనిస్తూ వచ్చిన సందర్భంలో ఒక వేశ్య తనతో సమంగా వాక్చాతుర్యం చూపెడుతూ వచ్చిందని ఇంకా ఇలా చెప్పాడు అప్పారావు :

—వేశ్యకు మాత్రం నీతి లేదనుకున్నారా ?" అన్నది. ఏదో ఒక సమయంలో ఆ మాటలు నాకు ఆనందం కలిగించాయి. అప్పుడే నా మధురవాణి పాత్ర ఎట్లు పోషించాలో ఆలోచించాను. క్లియోపాత్రలాంటి ప్రేమాస్పదలు వేశ్యలలోను గలరని తెలుసుకొన్నాను.—

వేశ్యావృత్తిని సమర్థిస్తావా, అని రామమూర్తి ప్రశ్నించాడు. లేదు, గర్హిస్తానంటూ ఆ వృత్తి ధర్మాన్ని సాగిస్తూ వస్తున్న వేశ్యలను చూచిమాత్రం దుఃఖం కలుగుతుందేగాని కోపం కలిగి నిందించ మనస్సుకాదు; దూషించ వలసింది సంఘాన్ని, కావలసింది సంఘ సంస్కారం, అన్నాడు అప్పారావు.

—ఈ సంస్కారం వేశ్యలలో అనుభవం వివేకంగల వేశ్యవల్లనే జరగ గలదు గాని మగవారివల్ల జరగదు. వేశ్యలలో వివేకం కల్గించడానికే మనం ప్రయత్నించాలి. ఇది మనసులో పెట్టుకొనే నేను మధురవాణి పాత్ర చిత్రిస్తున్నాను.....26

తొలి కూర్పు నాటకంలో మధురవాణి 'పచ్చి లంజ'మట్టుకే. ఈ రెండవ దానిలో ఆ పచ్చి ఎగిరిపోయింది. * ప్రవేశించడం ప్రవేశించడమే "మొగవాడి

* ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన ఒక లేఖలో మధురవాణి పాత్ర గురించి చెబుతూ In the first Edition Madhuravani was *Colourless iniquity.* Now she is fully drawn, అంటాడు నాటకకర్త. గు. ర. లే. లో ఈ వక్కాణాన్ని అనువదించడంలో అవసరాల సూర్యారావు పొరబడ్డాడు. "కన్యాశుల్కం మొదటికూర్పులో మధురవాణి వర్ణింపరాని హేయమైన నడివడికగలది ; ఆ పాత్రకు ఎట్టి వన్నెచిన్నెలూ లేవు. నాటకం రచిస్తున్నకొద్దీ మధురవాణి పాత్రమీద నాకున్న దృక్పథం మారజొచ్చింది..." (పు. 81) ఇది అనువాదంకాదు ; అనుసరణం కావచ్చునేమో ! ఆసక్తిగొల్పని ఒకఅప్రధాన మైన పాత్రను ఇప్పుడు సర్వాంగాపూర్ణంగా చిత్రిస్తున్నానని మాత్రమే అప్పారావు లేఖలోని భావమైతే, సూర్యారావు దాన్ని పెంచి, పెంచినందువల్ల మార్చివేశాడు.

కయినా ఆడదాని కయినా నీతి వుండాలి" అంటూ, ఆ నీతికి కట్టుబడే సుబ్బి పెళ్లి తప్పించేందుకు కరటక శాస్త్రికి సాయపడడమే గాక తన నగ కూడా చేతబెట్టి పంపింది. డిప్టీ కలెక్టరు కొడుకు మొదలు రామచంద్రపురంలో కొండిభట్లు వరకు ఎందరో, ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ మధురవాణి వలపులో వాటాలు పంచుకొన్నవారే. శృంగారం సడలాక బంగారమే ప్రాణపోషణకు పనికిరాగలదని, జీవనస్పర్థలో చిక్కుకొన్న మనిషికి సహజంగా ఉండే స్వార్థంతోటి చెప్పినా, చెడని వారిని చెడగొట్టకుమీ అని తన తల్లి చెప్పిన మాటలను చివరి వరకూ వేదాక్షరాలుగా పాటించిన ఈ "సంసారులలో సాని", సంస్కర్తలకు సంస్కర్త కాగలిగింది. ఇలాంటి వివేకవతుల ద్వారానే వేశ్యా సంస్కారం జరగగలదని అప్పారావు చెప్పింది. చింతామణిలా విరక్తురాలై పోకుండా అనురక్తగానే ఉండి కూడా *భగవద్గీతను* చేబట్టింది. ఈ వృత్తిహైన్యాన్ని గుర్తించి, మిరపతోట వేసుకొన్న ఏ పల్లెటూరి రైతుకో భార్యనై ఉండగూడదా అనుకొంటూ, ఆ వృత్తికే కట్టుబడిపోయింది కాబట్టి, శుద్ధనీతివాదులను ఇబ్బంది పెట్టే విధంగా, ఉన్న వాస్తవాన్ని ఉన్నట్లుగానే అప్పారావు చూపెట్టవలసి వచ్చింది 'అప్పాడి' అయిన సౌజన్యరావును కూడ లొంగదీసి, మలినమైన వృత్తిలో కూడా మేలిమికి జాగా ఉంటుందని చూపించవలసి వచ్చింది. కన్యాశుల్క సమస్యతో సమతుల్యమైన ప్రాధాన్యం వేశ్యా సంస్కార సమస్యకు ఉన్నట్టు, చెప్పక చెప్పాడు నాటక కర్త.

చరమాంకంలో స్వయంగా కలుగజేసుకొని మధురవాణి పాత్రను రచయిత "సంస్కరించ"క ముందే, సంస్కారానికి తగిన బీజం ఆమెలో సహజంగానే ఉంది. దాని వివర్ధనం, ఆ తెన్ను తప్ప మరొక తెన్ను పట్టలేదు. కాకుంటే, రచయిత ఇంత బాహాటంగా తన పాత్రను కత్తిరించకుండా, ఉండవలసింది. సహజ వివర్ధనమే దానికి మరింత శోభ తెచ్చేది. ఈ 'బలవంతపు మాఘస్నానం' వల్ల వేశ్యా సంస్కార సమస్యకు ఒక మార్గదర్శకురాలి ద్వారా పరిష్కారం చేకూరుతుందని భావించి, రచయిత ఆత్మ సంతుష్టి చెందవచ్చునేమో గాని, కవితా న్యాయం దృష్ట్యా కూడా ఈ కళాపరాధం క్షంతవ్యం కాదని కళామర్మజ్ఞులనుకొంటున్నారు. సంఘ సంస్కరణమనే శక్తికి ఈ అందమైన పాత్రను అప్పారావు బలిగా ఇచ్చాడనే విమర్శ, కొంతమేరకు మాత్రమే న్యాయమైనది. మరో విధంగానైనా మధురవాణికి ఈ పరిణామమే కలిగి ఉండేది. అన్ని కథా సూత్రాలను తన చేతిలో పెట్టుకున్న రచయిత వాటిని చివరి అంకంలో కలగలిపి

బహుమానాలు పంచి జరిమానాలు విధించాడా? కొన్ని పాత్రలలో మార్పే రాలేదు. - ముఖ్యంగా రామప్పంతులు. లుబ్ధావధాన్లు పశ్చాత్తాపం చెందాడేగాని, బుచ్చమ్మను లేవనెత్తుకు పోయినందుకు గిరీశాన్ని మెచ్చుకొంటున్నాడు. అగ్నిహోత్రావధాన్ల అగ్గిభరాటా శాంతించిందనేగాని, వ్యాజ్యాలద్వారా కచ్చతీర్చుకోగోరుతున్నాడు. మీనాక్షీ, బుచ్చమ్మా, గిరీశం-వీళ్ళను బాగుపరచడానికి పొరుగూళ్ళకు పంపవలసివచ్చింది. ఎటొచ్చీ మధురవాణి ఒక రైలోనే కొట్టవచ్చినంత మార్పు కలిగింది. ఆ వృత్తి అంత నికృష్టమయినది. కాబట్టి, దానిలోనుంచి బయటపడదలచుకొనే వ్యక్తికి పెనుమార్పేరావాలి. సౌజన్యారావు సాధించిందల్లా, ఈ వరకే మధురవాణిలో బీజప్రాయంగా ఉన్న మంచినీ "నీతి"నీ వేశ్యావృత్తి అనే శిలాకుడ్యం నుంచి బయల్పడి మొలకెత్తి పెరిగేందుకు తగిన దోహదం చేయడమే. ఇష్టంలేని వ్యక్తిపై బలవంతాన బయటివాడెవడో రుద్దిందికాదు.

వసంతసేనతో గానీ చింతామణితో గానీ (పానుగంటివారి సుందరి అక్కరే లేదు) మధురవాణి పోటాపోటీలో నెగ్గుకు రాగలిగేదిక్కడే. వసంతసేన చూడ చక్కని బచ్చెన బొమ్మలాంటి పాత్ర; కడుపునిండిన మనిషి; పైగా కులవృత్తి చేబట్టవలసిన అవసరంలేనిది; అమ్మ తరంలోనో అమ్మమ్మ తరంలోనో అటించి గటించి సంపాదించిన ఆస్తి, ఏడు కక్ష్యాంతరాలుగల కోటలాంటి ఇల్లు, చిన్న సంస్థానంలో లాంటి దాస దాసీ జనం ఉండి, వసంతసేనను మధురవాణి పొట్టకూటి తిప్పట్లనుంచి తప్పించాయి. చదువూ, దానికి తగ్గ సంస్కారం; హోదా, దానికి తగ్గ హుందా-అన్నీ అమరిన భాగ్యశాలిని. గుణంగూడ ఉత్కృష్టమైనదే. దరిద్రుడైనా చారుదత్తుణ్ణేగాని, రాజశ్యాలకుడైనా శకారుణ్ణి ప్రేమించదు. ఆ చారుదత్తుడి కోసం తన సర్వస్వాన్నీ సమర్పణ చేసుకొనేందుకు గూడా సిద్ధపడుతుంది - ప్రాణాన్నికూడా. అయితే ఉపపత్నికూడా కాదు, భోగపత్నీ కాదు, పత్నే అవుతుంది. దొంగచాటు వ్యవహారం లేదు. ఇవన్నీ ఉత్తమకుల సంజాత అయిన, పతివ్రత కాదగిన, స్త్రీ లక్షణాలే. అలా ఆదర్శమూర్తి వసంతసేన. మధురవాణి నక్క; వసంతసేన నాకలోకం.

ఇక కాళ్లకూరి నారాయణరావు సృష్టించిన వేశ్యపాత్ర చింతామణిలో, పూర్వభాగంలో ఎంత భోగం గుణాలు ఉన్నాయో, చివరకు అంత అసాధ్యమైన భోగవైముఖ్యత ఉంది. ఆమె యోగిని కావడానికి ఎన్నెన్ని దురంతాలు అవసరమయ్యాయో చెప్పలేము. యోగిని కాకముందు, లేనివలపు చూపుతూ, ఎవణ్ణి

కనికరించక, హేయభయలజ్జాలేశాలు లేక, పాముకాటుకంటె తీవ్రఫలితాలు గల సుందరీరూప రాక్షసిగా రచయితచేత తయారైంది. రోత, కసికలిగేటంత గాఢమైన రంగులలో వేశ్యవాటికను వర్ణించి, వేశ్యలకూ మానవత్వానికీ చుక్కెదురన్న భావాన్ని కలిగించాడు రచయిత. చివరకు చింతామణి స్త్రీ స్వరూప సౌందర్యంపట్ల కూడా జుగుప్సకలిగేలాగు 'సౌందర్య మనఁగఁగలదె?' అని ప్రశ్నవేస్తూ, 'రక్త మాంస పురీషముల పాత్ర'గా వర్ణించాడు. చింతామణి విరక్తయాత్రకిది ప్రస్థాన భేరి. మధురవాణి జీవితం నుంచి నిష్క్రమించదు సరిగదా, భగవద్గీతను చేతబట్టి నప్పుడుకూడా గీతాకారుడైన శ్రీకృష్ణ పరమాత్మను విటరాయుణ్ణిగానే ఎంచుతుంది. చింతామణిది నివృత్తి మార్గం; మధురవాణిది ప్రవృత్తిమార్గం, అనికూడా చెప్పవచ్చు.

> "తనపూర్వ జీవితపు అంధకార కూపంనుండి సన్మార్గానికీ సజ్జనత్వానికీ హఠాత్తుగా ఎగిరి తేజశ్శిఖరాలను అందుకొన్నదికాదు మధురవాణి. జీవితమార్గంలో పడుతూలేస్తూ, కష్టసుఖాలను అనుభవించినది.... స్వీయానుభవంవల్ల మంచిచెడ్డల తత్త్వం తెలుసుకొని తన నడవడికీ, బ్రతుకుకూ ఒరవడులు దిద్దుకొంది." 27

ఇది చెయ్యనా, లేక అదా అనే సంకటావస్థ (Crisis) లో పడి, 'భావ సమరము' (internal conflict) లేకుండా ఈ మొత్తం నాటకంలో ఒక్క మధురవాణి పాత్రే రూపొందిందని శ్రీ పాద కామేశ్వరరావు రాశాడుగాని, అది నిజం కాదని తెలుస్తుంది. భావసమరం వాచ్యంకావలసిన అవసరం లేదు. ఒక్కొక్క నిర్ణయం చేసుకోకముందు, సమరం సాగి ఉంటుంది. సమరఫలితమే ముందుండిన నడవడికి భిన్నంగా అటు తర్వాత రూపొందే నడవడి. ఇలాంటి నిర్ణయాలు మెట్లుగా మధుర వాణి పాత్రలో పేర్పుగట్టుకొని ఉన్నట్లు, మీద ఉదహరించిన వ్యాసంలో సెట్టి ఈశ్వరరావుగారు వర్ణించిచూపారు. మొదట్లో మామూలు సానిగా డబ్బుగడిస్తూ ఒకొకప్పుడు నిర్దయగా కూడా వ్యవహరిస్తూ వచ్చిన మధురవాణి, కరటకశాస్త్రి తోబుట్టువుకి సాయంచేయడానికి డబ్బు ఆశించలేదు. కరటకశాస్త్రి బీదబ్రాహ్మడని దయదలచిం దనుకుందాం, తనను ఉంచుకొన్న రామప్పంతుల మోసాన్ని సాగ కుండా అడ్డుపడింది. అంతకంటె అధికారదర్పంగల డిప్టీకలెక్టరు పంపిన రాయ బారాన్ని కూడా తిరస్కరించింది. ఇలా క్రమక్రమాభివృద్ధి చెందుతూ, "కుక్కల"తో సంపర్కాన్నిరోసి, "పెద్దవారి యెడల గూడా మంచిగా" వుండడానికి పూనుకొని, మొగ్గగానే ఉండిన తల్లి ఉపదేశపు మేలిమిని రేకురేకుగా విప్పార్చు కొంటూ, చివరకు శతదళమౌతుంది. చలాకీతనం, చమత్కారం, సమయోచిత

భాషణం, సర్వసమత్వం, సౌజన్యం – ఒక్క మధురవాణిలో కూర్చాడు రచయిత, ఈ వర్ణనలన్నీ నాటక పాత్రలు చెయ్యడంలో ఉంది అతని ప్రతిభ.

"మధురవాణి అంటూ ఒక వేశ్యశిఖామణి యీ కళింగ రాజ్యంలో లేకపోతే, భగవంతుడి సృష్టికి ఎంత లోపం వచ్చి వుండును ?" అన్నాడు కరటకశాస్త్రి.

భగవంతుడి సృష్టికే మోగాని, గురజాడ అప్పారావు సృష్టికి పెద్ద లోపమే వచ్చి ఉండేది. ఎందుకంటే నాటకానికి మధురవాణి ఇచ్చేదే, ఆరుద్రగా రన్నట్లు, "జీవశక్తి".

శ్రీరంగం శ్రీనివాసరావుగారు దీనిని విపులీకరిస్తారు :

మధురవాణి అంత నాటకానికి అతి ముఖ్యమైన స్త్రీ పాత్రము. ఆమె వలన కథ సూటిదారిలో ప్రవహిస్తుంది. కథ యెదురు తిరిగితే 'చక్రం అడ్డు వేయ' గలిగినంత ధీమా ఆమె కున్నది. ఆ ధైర్యము ఎక్కడా ఆమె యందు తొణుకాడదు. పరిస్థితులు బాగా పఠించి తదనుగుణముగా సూటిగా ప్రవర్తిస్తుంది. కథలో చిక్కు (Complication) తీసుకొని వచ్చునదీ, విడగొట్టునదీ కూడ మధురవాణే....28

గొంగడి పురుగు కట్టింగు మీసలవాఁడు
గంపశ్రాద్ధపుఁ దలకట్టుఁవాడు
ఎపుడు కాఫీ దుకాణపు రేవిణీవాఁడు
సిగరు పీలుపు బుగబుగలవాఁడు
పై పటారమును లోపల లొటారమువాఁడు
పట్టుదప్పిన ఛలోభాయిగాఁడు
తుద మొదల్ లేని గాడిద గత్తరలవాఁడు
జలసాలతోఁబడి చచ్చువాఁడు
తడియనెడి దున్నచోఁ జేత తుడుము మొదలు
దేవతార్చన వఱ కొక్క తీరువాఁడు
వలను పడకున్న శ్రీశుకువంటివాఁడు
త్రోవ దొరికిన వట్టి గంధోళిగాఁడు. 29

ఎవరో చెప్పుకోండి చూదాం అన్నట్లు, 'కార్టూను' శిల్పంతో గీసిన ఈ అక్ష రాల బొమ్మ మరెవరిదో కాదు; తెలుగు ప్రజల అల్లారు ముద్దుపాత్ర యస్. గిరీశం – "గిరీశమా, నినదభీషణ శంఖము దేవదత్తమా?" – గారిది. అది అవత రించిన వేషా విశేష మెటువంటిదోగాని, జాతి సొత్తు అయి ఎన్నెన్నో కాలానుగుణమైన అవతారాల నెత్తుతూ చిరంజీవమై నిలిచి ఉంది. * ఆ రోజుల్లో విజయనగరంలో గిరీశమంటేనే ఎందరో బుజాలు తడుముకొనేవారట. ఎంద రెందరు వేషధారులూ, డాంబికులూ, వాచాలురూ మాటలతో కోటలు దాటించేవారు అరచేతిలో స్వర్గం చూపించేవారూ, పగ్గెలతో పబ్బం గడుపుకొనేవారూ, అక్కర తీరాక కుక్క అనే వాళ్లూ, ఏరుదాటి తెప్పతగలెట్టే వాళ్ళూ, ఆ ఒక్క 'గిరీశ'లో దాగొని ఉన్నారో లెక్కగట్టలేము, అంటే– ఒక వైయక్తిక లక్షణాన్ని గిరీశం మూర్తీభవించాడన్నమాట. నిజానికది అపుడపుడే బయల్పడుతూండిన సామాజిక రోగలక్షణానికి రూపకల్పన మాత్రమే. ముందు ముందు మరెంతో తీవ్రతరమూ బహుళతరమూ కానున్న ఒక అంటువ్యాధిని ముందుగానే కనిపెట్టి పేరుబెట్టిపోయిన భిషక్కు, గురజాడ అప్పారావు

కన్యాశుల్క నాటకాన్ని ఇంగ్లీషులో వర్ణించాలంటే The struggles and the Adventures of Gireesam అని కూడా వర్ణించేందుకు అనువుగా, నాటకమంతా కమ్ముకొని పోయిన పాత్ర ఇది. నిజానికి దీనితో కన్యాశుల్క కథకు అంతప్రమేయమే లేదు.

As far as the plot is concerned however, Girisam is not essential; as a matter of fact, he is out of place. In the drama, he is merely the person with whom Buchamma elopes. Girisam must have taken the author himself by storm, and argued and bluffed his way into the drama. 30

నాటక కళా మర్మజ్ఞునికీ, జీవిత పరిశీలకునికీ ఇది మరి ఒక పేచీ. దీని నటుంచి, గిరీశం ప్రత్యేకతనే గమనించవలసి ఉంటుందిక్కడ. సొంత ఇల్లనీ. చుట్టపక్కాలనీ లేనట్లుగా, అదృష్టాన్ని వెన్నాడుతూ, దేశం వెంటబడి సంచరిస్తూ వట్టి తెలివితేటలతో నోటి మంచితనంతో ఊరినీ మందినీ మంచిచేసుకొంటూ,

* గిరీశం లెక్చర్లు' ద్వారా శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ 'గిరీశం ది గ్రేట్ సినిమా ప్రవేశం' వగైరా రచనల ద్వారా వి. కుటుంబరావు గార్లు ఇటీవలి కాలాన ఈ పాత్రను సొంత పరచుకొన్నారు.

"వేళ్లలేని" యువకులు మధ్యమవర్గం కింది పాయానుంచి పైకి వస్తూ సమాజం మీదపడి బతుకుతున్నారని గమనించాడేమో, తెగులు లాంటి ఈ ధోరణిని గిరీశంలో చూపెట్టాడు రచయిత. పాశ్చాత్యదేశాల తోలి నవలల్లోని Picaresque tradition అనేది ఇలాంటి యువ సాహసికులను వర్ణిస్తుంది. కామెడీ నాటకాల్లోకూడా ఈ పాత్రలు దర్శనమిస్తాయి. చివరకు షేక్స్పియర్ చారిత్రక నాటకాలలో ఫాల్‌స్టాఫ్ (Falstaff), పిస్టల్(Pistol) పాత్రలు కూడా ఈ కోవకు చెందినవే. భూస్వామ్య వ్యవస్థలో నిలవనీడ లేకుండా దాన్ని కంటగించు కొని, దాని లక్షణాలన్నిటినీ గేలిచేస్తూ ఈ పాత్రలు విలక్షణంగా తయారౌతాయి. వాళ్ళంతా కలసి సమాజంలో ఒక కొత్త వర్గంగా ఇంకా రూపొందలేదు కాబట్టి వీళ్ళకింకా విడిగా ఒక నైతిక దృక్పథమూ, కట్టుబాట్లూ ఏర్పడలేదు. ఇలాంటివాడైన గిరీశం ఈ నాటకంలో చేసిన చిలిపి పనులన్నీకలసి తమదని కేటూగా చెప్పదగ్గ ప్రాముఖ్యాన్ని సంపాదించుకోలేకపోయాయి. ఆర్నోల్డ్ కెటిల్ (Arnold Kettle) అనే విమర్శకుడు An introduction to the English Novel-part I లో చేసిన విశ్లేషణను అనుసరిస్తే, గిరీశంపాత్రను పైవిధంగా బోధపరచుకొని, కేంద్ర స్థానంలో ఉన్నప్పటికీ గిరీశం ఈ కథకు పూర్తిగా అవసరమెలా కాకుండాపోయా డనేది వివరించవచ్చు. అతనిసాహసప్పనులన్నీకూడా Discontinued skirmishes lacking a central significance అనవచ్చు.

గిరీశంద్వారా సంఘ సంస్కరణనుకాదు అప్పారావు హేళనచెయ్యదలచింది, సంస్కరణవాదపు మేకవన్నె పులులను మాత్రమే. సమకాలిక మహోద్యమాలను 'ఫేషన్' (fashion) గానేతప్ప 'పేషన్' (passion)గా గాక, అరకొరగా బోధ పరచుకొని నినాదాలను మాత్రమే నాలుకకు పట్టించుకొని 'హృదయాన్ని' నిర్లక్ష్యం చేశాడు. పైకిపోయి బాగుపడడమే ధ్యేయం. జీవితం తనకు సింహద్వారాన్ని మూసేసింది. అందుచేతనే పెరటిగుమ్మంనుంచి జీవిత మధుశాలలో ప్రవేశించ గోరాడు. కావలసినంతకంటె ఇసుమిక్కిలిగానే ఊహాబలంఉంది. చొరవ, తెగింపు, మాటమార్చేనేర్పు, 'మస్కా'వేసే కౌశలం, వంచనాశిల్పం ఉన్నాయి. చిత్తశుద్ధి కూడా ఉందా ? ఉన్నా అది అక్కర్లేని దినుసు. బొమ్మ బొరుసౌతుంది, బొరుసు బొమ్మఅవుతుంది. అయినా అతను బాగుపళ్ళేదు సరిగదా, బాగుపడబోయి మధుర వాణి 'బెల్'వేస్తే సౌజన్యరావు సమక్షంలో బోర్లాపడిపోయాడు. 'నెపోలియన్ ఆఫ్ యాంటీనాచ్చి' విగ్గు ఊడిపోయింది. దొంగ దొరికిపోయాడు. సమాజ దేహంలోని మంచిభాగం అతన్ని రోగక్రిమిగాఎంచి బయటకు నెట్టివేసింది. అతనిది కాల్పనిక

మన స్తత్వంకాబట్టి వా స్తవం దాన్ని అబద్ధీకరించింది. కవి కావలసివుండి మాటకారి అయ్యాడు.* కట్టుబాట్లసడలింపు, ప్రేమ మహామంత్ర పారాయణ, వేషధారణ వగైరా లతో త్వరలోనే బయల్పడనున్న భావకవిత్వయుగానికి రావలసినంతకంటె ముందుగా వచ్చిన దూతలాంటివాడయ్యాడు. అతని ఉపన్యాసాలేమి,స్వగతాలేమి, Napo'eonic I తో నిర్భరంగా కవిత్వాంశ కలిగి ఉంటాయి. భంగపడితేనేంగాని, అతను Fashion - setter కాగలిగాడు. సాక్షాత్తూ వేషధారి–లాల్చీ, జులపాలు, గిరజాలు, పొగచుట్ట, తన పాత్రలో లీనంకాకుండా, లీనమైనట్లు ప్రేక్షకులకు నమ్మకం పూ ర్తిగా కలిగించకుండా. 'నటిస్తున్నాడురోయ్' అని మధ్యలోనే దొరికిపోయిన నటుడు గిరీశం. ఇలా మరెన్నివిధాలుగానో ఈ గొప్ప పాత్రను వివరించవచ్చు. కొన్నిటి నిక్కడ పేర్కొవాలి :

"గోడమీది పిల్లిలాగు జీవించే ఏబ్రాసి కాని స్థిర మనస్కుడు కాడు; పాపభీతిలేని పాషండుడు, ఋజుమార్గవ ర్తికాడు" అన్నాడు ముందు పేర్కొన్న వ్యాసంలో, శ్రీపాద కామేశ్వరరావు. కేవలం ఛట్కారీగా తిరిగి పుల్పాగా జీవనంచేసే సోమరి మాత్రం కాదు, "ఎప్పటికీ కూడా.... ఒక దారి తప్పిన యువ కుడుగాను, అందువల్ల తన తెలివితేట లన్నిటినీ స్వప్రయోజనానికి ఉపయోగించుకునే ఒక వ్య క్తిఅని మొదట్నుంచీ నా వుద్దేశ్యము. ఎంత దారితప్పిన వాడైనప్పటికీ, ఒక అవ్య క్తమో, సువ్య క్తమో అయిన గమ్యస్థానాన్ని చేరాలని, జీవితాన్ని అటు ఇటు పనగలిపి నెట్టుకొస్తున్నవాడు గిరీశం," అన్నాడు గిరీశం పాత్రధారణలో తల నెరిసిన గోవిందరాజుల వెంకట సుబ్బారావు. అతని మోసాలన్నీ "జానెడు పొట్టకోసమే"నని శ్రీనివాస చక్రవ ర్తిగారంటే. దాన్ని వివరిస్తున్నట్లు "భూపతన మైన దగ్గరనుంచీ గిరీశానికి పట్టుకున్న .... గొడవ ఈ పూటకు బిఛాణా ఎక్కడ వేయాలి అని .... పూటకు టికాణాలేని బుక్కాఫకీరతడు .... రాజస సమాజంలో వుంటూ కౌబేర సమాజపు తొలిరేకలు సోకినవాడు గిరీశం" అని రాంభట్ల కృష్ణ మూ ర్తిగారు వర్ణించారు [31] సెట్టి ఈశ్వరరావుగారికి గిరీశంలో కనిపించేది "పౌరహిత ఉద్యమాల్ని" తమ స్వార్థానికి వినియోగించుకొనే అనేకుల ప్రతిబింబాలే". [32]

సాహిత్య జీవులిందరికి ఇన్ని పోలికలుగా కనిపించిన గిరీశం సూర్యుడు ఆర్. యస్. సుదర్శనం గారికి ఇంకోపోలికలో కనిపిస్తున్నాడు.

---

* గిరీశం కవి కూడాను. ఎటొచ్చీ ఇంగ్లీషులోనూ బట్లేరింగ్లీషులోనూ కవిగట్ట గలిగినంతగా తెలుగులో కట్టలేక పోయాడు. చాటువులే తెలుసు.

The bliss of freedom gained in humour is the essence of Falstaff అని బ్రాడ్లే (Bradley) రాసిన నాలుగుముక్కలు గిరీశానికి అన్వయింపజేస్తూ, గిరీశం వ్యక్తిత్వంలో ప్రధానమైనది హాస్యదృష్టికాబట్టి అతను "నిర్లిప్తంగా సమయస్ఫూర్తితో" వ్యవహరించి "స్వేచ్ఛ"ను అనుభవించగలిగాడని సుదర్శనంగారు రాస్తున్నారు.* అభిరుచులకూ, అభిప్రాయాలకూ, ఆశలకుగూడా దాసుడుగాక, వచ్చినవాటితో తృప్తిపడుతూ, నిగ్రహం అలవరచుకొనికూడా, ఒక్క బుచ్చమ్మ విషయంలోనే కొంత మెత్తబడి, తనగురించి తనకే ఆశ్చర్యం కలిగేటట్లుగా 'మంచితనం' చూపివేస్తాడు. జీవితంమీద తప్ప మరి దేనిమీదా విశ్వాసముంచని "కార్యవాది" - "స్వకార్యవాది" అంటే మరీ బాగుండేది. అతనిలో మంచితనం పూర్తిగా చచ్చిపోలేదు. "గిరీశంలోని హాస్యదృష్టి ఈ మానవత్వపు చెలియలికట్టను యెప్పుడూదాటదు". కాకుంటే మంచితనాన్నికూడా ఒక policyగా నేఎంచినందువల్ల, అదే జీవితపరమార్థమని ఎంచనందువల్ల గిరీశం కథ కట్టింది. [33]

నైతికభావ ప్రబోధంకోసం పాత్రలను శాసించడం తగనిపనికావచ్చునేమో గాని "దుష్టవర్తనునకు తగినశిక్ష" ఉండాలని Poetic justice దృష్ట్యా గిరీశంలాంటి వంచకుల ఆట చిట్టచివరికైనా కట్టించగోరాడు అప్పారావు. నాటకాంతంలో రచయితచేతి కీలుబొమ్మగామారిన గిరీశం, నాటక ప్రారంభంలో మాత్రం ప్రపంచ ఉత్తమ హాస్యపాత్రలలో ఒకడుగా లెక్కకువచ్చేట్లు కనిపిస్తాడని, బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు రాశారు. ...Gireesam, who in the begining bids fair to rank with the world's best humorous characters for the Telugus dwindles into a mighty little man of virtue as the play progresses[34] సౌజన్యరావు ద్వారా అప్పారావు చేసిందల్లా. గిరీశం నడతలోని వంకరను దిద్ది, అతను పట్టే జీవనసూత్రంగా ఎంచుతున్న 'మంచి', నిజానికి జీవిత గోపుర కలశమని స్థాపించడమే. ఇందులో 'కళ' దెబ్బతిన్నా ఫరవాలేదనుకొన్నాడు. ఫాల్‌స్టాఫ్‌ను ప్రిన్స్‌హాల్ Prince Hall (ఇప్పుడు కింగ్ హెన్రీ) బహిష్కరించినట్లైనా బహిష్కరించలేదు. రాజమండ్రికి స్టీమరెక్కి వెళ్ళి బి. ఏ. దాకా చదువుకొని బుద్ధిమంతు డనిపించుకొన్నాక, బుచ్చమ్మ నిచ్చి పెళ్ళి చేయిస్తానని అతను బాగు పడేందు కొక తెన్ను చూపించాడు Deux ex Machina లాంటి ఈసౌజన్యారావు.

* గిరీశం అభిలషించిన స్వేచ్ఛ ఇతరుల స్వేచ్ఛనూ, సౌఖ్యాన్నీ గణించేదికాదు. కరడుగట్టిన స్వార్థాన్నే అతను స్వేచ్ఛగా భ్రమించాడు. పరోపకార శీలత లేకపోలేదు గాని, అది తన స్వార్థాన్ని స్వాతిశయాన్ని పెంచుకోడానికే.

ఫాల్‌స్టాఫుకూ, గిరీశానికీ పోలికచూపే వాళ్ళు, వాళ్ళ భేదాలను గమనించడం మంచిది. ఫాల్‌స్టాఫ్‌లో దుష్ట లక్షణా లెన్నో్న విదూషకుని లక్షణాలన్ని. అతి వాగుడు ఉభయ సాధారణమైన గుణం కావచ్చుగాని, గిరీశం ధోరణి * సురేంద్ర నాథ్ బెనర్జీ నుంచి పుణికి పుచ్చుకొన్న నవీన రాజకీయోపన్యాస ధోరణి కాగా, ఫాల్‌స్టాఫ్ అతనిమిత్రుడు సంబోధించినట్లు a creature of bombast మాత్రమే. పూటకూళ్ళమ్మమిస్ట్రెస్‌క్విక్లీలకుగూడపోలికలున్నాయి. ఫాల్‌స్టాఫ్‌కు ఆవిడదజనుషర్టు కొనిపెట్టినట్టుగానే, పూటకూళ్ళమ్మ గిరీశాన్ని మేపింది. తగవు పెట్టుకొని ఫాల్‌స్టాఫ్ డబ్బు ఎగవెయ్య జూస్తే, గిరీశం పూటకూళ్ళమ్మకు పత్తా లేకుండా పోతాడు. అప్పారావు నాటకం ప్రథమాంకం మొదటిస్థలంలోనే పొటిగ్రాపు పంతుల బంట్రోతుతోటి గిరీశం మోసపుమాటలకూ, HENRY IV Part II, Act I scene II లో లండన్ వీధిలో లార్డ్ ఛీఫ్ జస్టిస్ ఎదురుపడినప్పుడు ఫాల్‌స్టాఫ్ మాటలకూ చాలా పోలికే ఉంది. ఛీఫ్ జస్టిస్ సేవకుడు తనను పేరుబెట్టి పిలిచినప్పుడు, తన సేవకుడితో ఫాల్‌స్టాఫ్

Boy, tell him that I am deaf.

అంటాడు. కాని, వాడు ముఖా ముఖి వచ్చి నిలేశాక, వాణ్ణి బిచ్చగాడుగా తాను భ్రమిస్తున్నట్లు నటిస్తూ, అదిలింపుగా

What a young knave, and beg !

అంటాడు. ఛీఫ్ జస్టిసే స్వయంగా కల్పించుకొని, 'నీతో మాట్లాడాలి' అంటూ సమీపించినప్పుడు, అతని ఆరోగ్య స్థితి గురించి ఆదుర్దా కనపరుస్తూ అతను నోరెత్తి ఒక్కమాట చేప్పేలోపల తాను పదిమాటలు గుప్పించి, సంభాషణను పక్కకు తిప్పేస్తాడు. 'లోగడ నీకోసం కబురు పెడితే నువ్వు వచ్చావు కావు' అని ఆయన అంటే, ఇతను రాజుగారి అనారోగ్యం గురించి మాటాడుతాడు. 'ఇతనికి 'చెవుడు' కాబోలని ఆయన అనుకొంటాడు. దొంగెత్తనీ తెలుసుకొంటాడు. అయితే చివరకు మాటల్లో గెలాయించుకొంది ఫాల్‌స్టాఫే.

A good wit will make use of anything ...

అని సగర్వంగా స్వగతం చెప్పుకొంటూ బయటపడతాడు. ఆ చెవుడు నటన యావత్తూ గిరీశం తెచ్చిపెట్టుకొన్నది. బంట్రోతును తెగపొగిడాడు. సొమ్ము

* రాజకీయవాదుల ఉపన్యాస ధోరణిలో తనకు ముఖ్యంగా నచ్చనివల్లా ఆత్మస్తుతీ పరనిందా అని 'మాటా మంతి' లో ఒకచోట అప్పారావు రాసి ఉన్నాడు.

త్వరలో చెల్లిస్తానని గాయత్రి పట్టుకొని ప్రమాణం చేస్తానన్నాక, వాడు నిష్క్రమిస్తూంటే, ఫాల్‌స్టాఫ్ లాగానే స్వగతంగా "ఇన్నాళ్ళకి జంఝుపోస వినియోగం లోకి వొచ్చింది." అంటాడు.

మిస్ట్రెస్ క్విక్లీ విధవరాలయ్యాక ఆమెను పెళ్ళాడతానని ఆశగొల్పి, ఆమె యింట తిష్ఠవేసి అప్పుడప్పుడూ జగడాలు పెట్టుకొంటూ ఉండే ఫాల్‌స్టాఫ్, పూటకూళ్ళమ్మ పోషణలో వుండిన గిరీశం, అన్నదమ్ములే.

మధురవాణిని తలచుకుంటూ గిరీశం పాడిన ఇంగ్లీషు మాటల తెలుగుపాట లోని అంత్యప్రాస – డిలైటు, ప్లెయిట్, నైట్, వైటు, బ్రైటు వగైరా Merry Wives of Windsorలో ఫాల్‌స్టాఫ్ రాసిన ప్రణయలేఖలోని పాటకు పెట్టిన knight, light, might, fight ప్రాసలాగానేవుంది. ఈ నాటకంలోనే ఫాల్‌స్టాఫ్‌ను బుట్టలో కుక్కి ఏడ్పించిన మిసెస్ ఫోర్డు, మిసెస్ పేజ్ లాగానే, అప్పారావు నాటకంలో గిరీశాన్ని, రామప్పంతుల్ని కలిపి మంచం కిందికి నెట్టి మధురవాణి ఏడ్పిస్తుంది. తొలికూర్పు నాటకంలో "హేయమైన నడవడి" కలిగిన మధురవాణి, షేక్స్పియర్ పాత్ర అయిన డాల్ టేర్‌షీట్‌ను పోలి ఉండేదంటూ అప్పారావు నాటకానికీ షేక్స్పియర్ నాటకాలకూగల చాలా పోలికలు తెచ్చి చూపారు, మరో వ్యాసంలో ఆర్. యస్. సుదర్శనంగారు. 35 ఫాల్‌స్టాఫ్ ఆత్మకు పునర్జన్మ ప్రసాదిస్తూ ఆంధ్ర జాతి సాహిత్యంలో గిరీశంద్వారా శాశ్వత స్థానం కల్పించాడని అంటూ, పోనుపోను అప్పారావు సృష్టి షేక్స్పియర్ మాతృకకు దూరమై పోయిందని కూడా ఆయన గుర్తించారు. ఫాల్‌స్టాఫ్‌లోనూ, గిరీశంలోనూ మంచితనమే సామాన్య ధర్మమంటూ చెప్పనైతే చెప్పారుగాని, వారి భేదాన్ని నిర్ధారణచేసి చూపలేదు. గిరీశం ఎలాంటి వాడో లోగడ విపులంగా చెప్పడమైంది.

ఉల్లాస పరిచినా, నవ్వించడమొక్కటేకాదు అతని ప్రయోజనం. అతను విదూషకుడు కాదు. * తానే కథానాయకుణ్ణని భ్రమపడి ఆత్మవంచన, పరవంచనలకు పూనుకొని, కొద్దిగా 'విలన్' లక్షణాలను కలిగిఉన్నాడు. షేక్స్పియరు నాటకాలను చదువుకొన్నంత గట్టిగా చదువుకోలేదనేగాని, అప్పారావు రష్యన్ హిత్యాన్నికూడ పరిశీలించాడో ఏమో : గోగోల్ (Gogol) రాసిన The Inspector-General నాట

* ఫాల్‌స్టాఫ్ గురించి రాస్తూ (గు. ర. లే. పు. 80) అప్పారావు ఆపాత్రను "అవినీతి పరుడూ కుటిలుడూ అయిన ఫాల్‌స్టాఫ్, షేక్స్పియర్ పద్ధతి హాస్యానికి శిఖరాగ్రంవలె" ఉన్నాడని చెప్పాడు.

కంలోని క్లెస్టకాఫ్‌పాత్రతో కూడా గిరీశానికి పోలికలు కనిపిస్తాయి. లోకవంచన చేద్దామని సంకల్పించకుండానే లౌక్యాన్ని ఒంట బట్టించుకొని కమ్మగా మాటాడే నేర్పు సంపాదించి మంచినీళ్ళ మర్యాదగా అబద్ధాలాడుతూ 'ఎప్పటికెయ్యది ప్రస్తుత'మనే పద్ధతిలో ఏ అనుభూతినీ కొసముట్టా అనుసరించని ఈ క్లెస్టకాఫ్‌లో గిరీశం అంశ కొంతైనా లేకపోలేదు.

శూద్రక మహాకవి సృష్టించిన శకారుడు విదూషకుడని భ్రమపెట్టే దుష్టః దుష్టాధికారి. అనుభోగం అతనికి కావలసింది. రాజుగారి సాని దాని తమ్ముడుగా రాజశ్యాలకుడుగా అతని అనుభోగ దాహానికి మితిగానీ మట్టుగానీ లేవు: ఉండకూడదు; ఉంటే అతను సహించడు. "అతను కన్ను మెచ్చినదాన్ని కామిస్తాడు. పన్ను మెచ్చిన దాన్ని సేవిస్తాడు. ఆలోచనకన్న ముందు అమలు జరిగిపోయేజీవితం.... శకారునిపట్ల ఆలోచనకి మూఢత్వానికి అభేదాధ్యవసాయం కుదిరింది కాబట్టి మూఢత్వం అనే ముసుగులో శకారుడు లోకంమీద పడతాడు"అని మీద పేర్కొన్న వ్యాసంలో రాంభట్ల కృష్ణమూర్తిగారు రాశారు. అతని దుర్మార్గాలకు ఈ కుహనా మూఢత్వం ఒక సాధనోపకరణం మాత్రమే. అతని పురాణాల కలగలుపు మాటలూ గిరీశం దబాయింపు మాటలూ తెచ్చిపెట్టుకొన్నవే గాని యధార్థ విషయాలు కావు. గిరీశం బీదవాడు గాబట్టి సొంత ఆస్తిమీద, భద్రతమీద కన్నుంచి ఎన్నో ఎతులు వేశాడు. శకారుడి బతుకు వడ్డించిన విస్తరి గాబట్టి గిరీశంలా అతడు తరచూ "ఒపీనియన్సు చేంజి"చేసుకోనక్కర్లేకుండానే, అధికారాన్నీ, అది ఇవ్వగల అనుభోగాన్నీ చేజిక్కించుకొన్నాడు. అయితే ఇద్దరూ ప్రాప్తకాలజ్ఞులే. "ఇద్దరూ 'పొలిటీషన్సే'. గాని "ఎవరి పరిస్థితుల్ని బట్టి వారి శీలాలు ఏర్పడ్డాయి. ఒకరు పొలిటీషియనూ, మరొకరు ఆ పొలిటీషియనుకు ధ్యేయమైన పదవూ. అంతేతేడా." రాజకీయ నాయకుడు కాలేక గిరీశం ప్రైవేటు మాష్టరయ్యాడు.

గిరీశం పాత్ర మరలోనుంచి బయల్పడ్డవస్తువులాగా (manufacture)ఒక్క పెట్టున అప్పారావు 'మనః కార్మికశాల' నుంచి తయారై రాలేదు. మధురవాణీ అంతే. ఆ రెండుపాత్రలూ క్రమంగా వివర్ధనం చెందిన ప్రాణపూర్ణ పదార్థాలే (Organic growth). అందుచేతనే వాటికి అంత ఆకర్షణ, ఇంత జాగాకూడా. వట్టి హాస్యంకోసం తయారైన పాత్రకాదు గిరీశం. *కొండుభట్టీయం*లోనూ పూర్తిగాని రచనలతుంటల్లోనూ కనిపిస్తున్న ఈ పాత్ర, మరింత మహత్తరప్రయోజనంకొసమే అవతరించింది. ఆదేశానికీ ఆచరణకూ మధ్యగల భేదాన్ని చూపుతూ, ఇతర పాత్రల

వడవడికల్లో మెలికలు పెడుతూ, సంస్కరణవాద శిబిరంలోనే ఉన్న పంచమాంగ దళంలాగా తూట్లు కొడుతూ, పరార్థాన్నెప్పుడూ స్వార్థదృష్టితోనే తప్ప వీక్షించలేని ఒక మానసిక ధోరణికీ, మనుష్యుల కూటనికీ సంకేతంగానే, గిరీశంపాత్ర ఉద్దిష్ట మయింది. అతను వినా నాటకమే లేదనడం సాహసం; అతనే నాయకుడనటం దుస్సాహసమే

నిజానికి కన్యాశుల్క నాటక నాయకుడని చెప్పదగినవాడు ఎవడూ లేడు. సౌజన్యారావు కథాసమస్య పరిష్కారానికి పనికివచ్చాడు అంతే. పూర్వం పురాణ నాటకలలో దేవుడు ప్రత్యక్షమై రచయిత కథను ఒక కొలిక్కి తెచ్చి ముగించే వాడు. సౌజన్యారావు అలా యంత్ర సాహాయ్యాన రంగంమీదికి పైనుంచి దిగివచ్చిన దేవుని పాత్రలాంటివాడు – Deux ex Machina. అయినా అతనికీ ఒక నాయకుడున్నాడు. తొలిప్రతి నాటకంలో పేరెత్తి, వీరేశలింగం అనీ వీరయ్య పంతులనీ, గిరీశం, సౌజన్యరావు అతన్ని సూచిస్తారు. ఇక్కడ పేరు లేకున్నా వీరేశలింగం సాన్నిధ్యాన్ని ఊహించుకోవచ్చు. బుచ్చమ్మ పూనాలోని 'విడోస్ హోమ్'కు పోయిందిగాని గిరీశం చేరుకోవలసినచోటు రాజమండ్రి; మీనాక్షిని ఉద్ధుడు పంపివేసింది వీరేశలింగంగారి వితంతు శరణాలయానికి. కాబట్టి నైతికంగా ఈ నాటకానికి నాయకుడుగా ఎన్నదగినవ్యక్తి, సమకాలిక ఆంధ్రజనతా లోకనాయకుడైన పంతులుగారే. సౌజన్యారావు మహా అంటే, విశాఖపట్నంలో వీరేశలింగం గారి 'ఏజంటు' లాంటివాడు. ధ్వని పంతులుగారిదైతే సౌజన్యారావుది ప్రతి ధ్వని మాత్రమే.

ఈ పాత్రను మానవీకరించడానికి అప్పారావు ఎంతో శ్రమపడవలసి వచ్చింది. 'అప్పాడీ తనం', అలవికాని నీతిసూత్రాల కటికచల్లన, దీన్ని ఆదర్శం గానే తప్ప యథార్థంగా మానవవ్యక్తుల మధ్య నిలపలేవు కాబట్టి, భీష్ముని శపథం లాంటి సౌజన్యారావు భల్లూకప్పట్టు సడలిచ్చి మధురవాణి అనే ప్రాణపూర్ణమైన యథార్థానికి లొంగి, చివరకు ముద్దుపెట్ట బోనిచ్చేంతవరకు దిగిరావలసి వచ్చింది.

మీనాక్షి పాత్ర అణగదొక్క వీలులేనిది. బుచ్చమ్మలాంటి అమాయక బాలవితంతువుకు పోటీగా, ఈ గడసరి అవసరమైంది. అకాల వైధవ్యం స్త్రీల నెటు 'పాపపంకం' వైపు తోస్తున్నదో చూపడానికి వీరేశలింగం ప్రహసంలో లాగా మరీ బరిదెగించి 'రంకుపురాణం' నడిపే ఆడదిగాకున్నా, కొంతవరకైనా గ్రంథం నడిపే దక్షతగల ఆడది, అప్పారావుకుగూడా కావలసివచ్చింది. గిరీశానికి

ప్రేమ సందేశాన్ని బుచ్చమ్మ ద్వారానే పంపిన రాంభట్లవారి అచ్చమ్మకంటె, లుబ్ధుని పుత్రికా రత్నం తెంపరి మనిషి. దేహం పెట్టి ఒత్తిళ్ళను తాళలేక, అసిరిగాని ద్వారా రామప్పంతుల 'రాసిక్యానికే' పనిగల్పిస్తూ, సంఘం తనకు నిరాకరించిన సౌఖ్యాన్ని దఫాలవారీగా చీకట్లో సంపాదించుకోక తప్పలేదు. అయినా దొంగ కూళ్ళంటే ముఖం మొత్తక పోలేదు. రాజమండ్రిపోయి పట్టీకున రామప్పంతుల్ని పెళ్ళాడాలని కూడా తలపోసింది. తన 'పాపాల' గురించి తన కెలాంటి భ్రమలూ లేవు. నిజాన్ని – తన కెంత నిష్ఠురమైనా – తేరిపారచూడగలదు. తన 'పతనం' గురించి తనకేరోత. తన 'నీతి' గురించి తనకే ఎగతాళి. అసిరిగాడు దిగదుడుపు వడపప్పు తింటే "అపవిత్ర మ్మౌండాకొడు"కని రామప్పంతులన్నప్పుడు, అందుకొని మీనాక్షి "పవిత్రం అంటే మీదీ నాదే!" అంటుంది. ఎందుకలా అన్నావని పంతులడిగితే, "నేను వెధవ ముండనీ, మీరు సరసులున్నూ. మనకంటే పవిత్ర మైన వారు యవరుంటారు ?" అంటుంది

ఎవరికో ఒకరికి చెందిపోవాలనే మీనాక్షి కోరిక. అది గొంతెమ్మ కోరికని తెలియదు. ఇంట్లోంచి ఎలాగూ తనను రామప్పంతులు లేవదీసుకొచ్చాడు. నగలూ నాణ్యాలు లేకున్నా రాజమండ్రికి పోయి పెళ్ళిచేసుకోవాలను కొంటుంది. పంతులుకి "కాగల పెళ్ళాం". "కలగన్నావా యేవిఁటి" అంటాడు పంతులు. నిజంగానే కల గనింది—దొంగకూళ్లు అక్కర్లేని కల; పరువుగా కాపరం చేయాలని కల ! బుచ్చమ్మ పాత్రద్వారా బాల్య వైధవ్యంలోని దయనీయత ప్రదర్శించినా, దాని విషాద విహ్వలత, బీభత్స పూర్ణత మీనాక్షి పాత్ర ద్వారానే వెల్లడి చేశాడు రచయిత. మీనాక్షిలో అణగిఉన్న కామ ప్రవృత్తిని సీసాలో వున్న దయ్యాలకు, మగా ఆడా సంబంధాన్నీ మైథున సూచననీ, సంసార దృష్టినీ ఆపాదించటంవల్ల, బహు తెలివిగా వ్యక్తం చేశాడు.

పరిస్థితులు కొద్దిగానూ, స్వభావం హెచ్చుగానూ దుష్టులు గావించిన పాత్రలలో రామప్పంతులు ముఖ్యుడు. ఈ నాటకానికి 'విలన్' పేచీకోరు, కోర్టుపక్షి లంచగొండి, వ్యభిచారి, మోసగాడు, పిత్రార్జితాన్ని రంకులకు కరారావుడుచేసి, నోరులేనివాళ్ళ నోళ్ళుకొట్టి, కరణీకపు నిక్కూ టెక్కూ, నియ్యోగపు దర్జా అనుభవిస్తున్నవాడు. ఇతని సలహాతోనే, లుబ్ధుడు పెళ్ళికి సరేనంటాడు; కరటకశాస్త్రి దొంగపెళ్ళికి పూనుకొంటాడు. వైపరీత్యంగా మారిన ఈ గుటకాయస్వాహా పద్ధతికి తాత్త్విక సమర్థన కూడా కల్పించుకొన్నాడు. మోసానికీ లౌక్యానికీ అభేదం చెప్పి

లౌక్యాన్ని ఒక వృత్తిగా నిలుపుకొన్నాడు. "ఆ లౌక్యవృత్తి యెటువంటిది ? నిజాన్ని పోలిన అబద్ధవాడి ద్రవ్యాకర్షణ చేసేది". నమ్మినచోట చేస్తే మోసమయ్యేదే, నమ్మనిచోట చేస్తే లౌక్య మనిపించుకొంటుందట : బాగా కుళ్ళిపోయిన పండేమో, ఇతని స్వభావం పోను పోనూ చెడిందేగాని, మంచివైపుగా మారనూ లేదు, మారే సూచనాలేదు. అగ్నిహోత్రుడూ, లుబ్ధుడూ, చాలావరకు మార్పు జెందారు.

మీనాక్షి కనిపించే సీన్లు అవినీతికరంగా ఉన్నాయని అనాటి యువమిత్రుడు ఆక్షేపిస్తూ లేఖ రాసినప్పుడూ, అప్పారావిచ్చిన సమాధానం ఈ ప్రకరణాంతానికి సరిపోతుంది :

> *కన్యాశుల్కంలో* నాటకంలో, నిజమే, మీనాక్షి కనిపించే దృశ్యాలు అంత నీతి దాయకమైనవీ ఉపదేశకరమైనవీ కావు. మాటవరసకి షేక్స్పియరు నాటకాలలోంచి నీకు కొన్ని దృష్టాంతాలను చూపిస్తాను. నాలుగవహెన్రీ అయిదవ హెన్రీ మెర్రీవైవ్స్ అనే నాటకాలలో తటస్థపడే డాల్‌టీర్‌షీట్ మైన్ హాస్టెస్ దేమ్ క్విక్లీ మొదలైన పాత్రలు సర్‌జాన్ ఫాల్‌స్టాఫ్‌తో వొక కూటమిగా యేర్పడి యెంతో ఆసక్తిని కలిగిస్తాయి. ఈ పాత్రలలో యేదీ ఉజ్జ్వల నైతిక శక్తికలది కాదు. వీరిలో యెవరికీ మర్యాదా మప్పితమూ వున్నట్లు కనుపించదు....
>
> వాస్తవిక రచన అనే దానిని కళానైపుణ్యంతో ఎంత ఆదర్శపూరితం చేసినప్పటికీ, విధిగా అది కొన్ని లక్షణాలను ప్రస్ఫుటీకరింపక తప్పదు.
>
> కవితాన్యాయము నిన్నమొన్నటిలాగ నేడులేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను. చిత్రిస్తూ కళానైపుణ్యంతో ఆదర్శపూరితం చేస్తానే అనుకో. కవితాకళకు నేను ఒదిగి వుండవలసిన వాడినే ఐనా మానవ సమాజంపట్ల నాకొక మహత్తరమైన బాధ్యతవుంది. కనుక పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. నేను వొక దోషాన్ని, దుర్నడతను ఆకర్షవంతం చేశానా ? చేయలేదనే భావిస్తున్నాను....36

కవితాన్యాయమనేది పూజాపీఠంలా ఎంత ఆకర్షిస్తున్నా దానికోసంకూడా, వాస్తవాన్ని బలిపెట్టగోరని రచయిత అప్పారావు. 'అసభ్యత' అని ఘోషించేవారు అసలు నీతి సమస్యలను గుర్తించరు. ఇలాంటి 'ఫిలిస్టయిన్' (philistine) విమర్శ

కులు అప్పారావుపేర్కొన్న షేక్స్పియర్ నాటకాలనే 'నీతి' పేరున విమర్శించినప్పుడు కార్ల్ మార్క్సుకు ఆయన మిత్రుడైన ఎంగెల్స్ ఒక లేఖలో యిలా రాశాడు :

There is more life and movement in one first act of THE MERRY WIVES OF WINDSOR than in all German literature. Lamns and his dog Crabbe are worth more than all German comedies put together.

చురుకుగల మాటలే అయినా, ఆ విమర్శకుల గట్టి పుర్రెల గుండా దూరడానికి ఇలాంటి దబ్బనాలే కావాలి గాని, సూదులు పనికిరావు. రచయితకు లోకవాస్తవం ప్రభువు; కళలో అది ఒదగాలి; ఒదగనప్పుడు విడవాల్సింది దాన్ని కాదు, కళను : 'నీతి' దృష్టి అవసరమే, అయితే అది వాస్తవానికి లోబడాలి గాని వాస్తవం దానికి లోబడగూడదు.

గిరీశం శీలం గురించి మరికొన్ని మాటలు : 'శ్రుత పాండిత్యం' అతనిదేగాని అప్పారావుది కాదు. అప్పారావే గిరీశం కాదు. అప్పారావు హాస్యానికే గిరీశం పనికి వచ్చాడు : గాని ఆయన మది కెక్కిన పాత్ర ముఖ్యంగా మధురవాణి, తర్వాత సౌజన్యారావు. 'భట్రాజు గారి అబ్బాయి'తో అతనికి కొన్ని పోలికలున్నాయి. సత్యహరిశ్చంద్రుని నోట్లోంచి ఊడిపడి, రాజకీయమంటేనే మోస మనిపించి, రాజకీయవాది కాలేక బద్మాష్ అయిన గిరీశం అప్పారావు కావడమేమిటి ! బుర్రా శేషగిరిరావు అన్నాడంటూ కొడవగటింటి కుటుంబరావుగారలా రాయడం ఆయన గురుజన విధేయతను సూచించినంతగా గురజాడ హృదయానికి విధేయత సూచించదు.

బారోన్‌సేకర్‌లో Anntaylor గేయం MY MOTHER కు పేరడీగా THE WIDOW బాగానే రాసినంతమాత్రాన, గిరీశం మహాకవి అయిపోలేదు. Free will కూ, Pre-destination కూ సంబంధించిన క్రైస్తవమత భావనలోని మహోన్నత విషయాలను, A B C Dలే సరిగారాని గిరీశం నోట పెట్టించడం, ఆ పాత్ర నిర్మాణంలో ఒక అసందర్భమే. కొండు భట్టీయం లోని గిరీశం ఇలా అజ్ఞాని కాదుగాని ఇలాంటి మోసగాడే. గిరీశమంటేనే వంచకుడని లోకం అనుకోవలసిన స్థితి ఎన్నడో వచ్చింది.

# 3

జీవమూ జవమూగలిగిన వాడుకభాష ఒక్కటే అధునిక నాటకభాషగా యోగ్యత కలిగినట్టిదని నమ్మిన అప్పారావు, తొలికూర్పులోకంటె ఎక్కువ సొగసుగానేగాక వైవిధ్యంతోటి సంపన్నంగా రెండవకూర్పులో ప్రయత్నపూర్వకంగా వాడుకచేశాడు. వేదం వేంకటరాయశాస్త్రి నీచపాత్రలకు ఉచితమైన "గ్రామ్య"భాషనుపెట్టి సంస్కృత నాటక సంప్రదాయాన్ని అనుసరించానని తృప్తిపడితే, అప్పారావు తననాటకపాత్రల కన్నింటికీ వ్యావహారికాన్నిపెట్టాడు. ఎవరెవరి సంస్కారాన్నిబట్టి వారిభాషలో మార్పులు అనంతకోటి రూపాలతో కనిపించేలాగున, పాత్రోచిత వ్యావహారిక భాషను ప్రవేశపెట్టాడు వాడుకభాష అయినందుచేత, గ్రాంథిక భాషారచయితల్లా అర్థంలేని పదాలను, అవగాహన కాని భావాలనూ దూర్చే వీలులేకుండా పోయింది, అంటూ నిడదవోలు వేంకటరావుగారు ఇంకా ఇలారాశారు: "ప్రతిమాట, ప్రతిఊత, ప్రతి దీర్ఘస్వరము ఒక చరిత్ర – ఒక అర్థము– ఒక ధ్వనితో తొణికిసలాడుచుండును."37

నాటకమనేదే ప్రజాతంత్ర కళారూపం. సమాజాన తీవ్రసంఘర్షణ ఉన్న పరిస్థితిలో విరుద్ధశక్తుల కుమ్ములాటలను వెలువరించేందుకు నాటకంతప్ప మరొక సాహిత్యరూపం ఎక్కువగా ఉపకరించదు. ఆ కళారూపానికి మరింత బటువునిచ్చి ఇంకా ప్రజలదగ్గరకు తీసుకుపోయేందుకు, వాడుకభాష సహాయపడినంతగా, వ్యవహారచ్యుతమైన శబ్దజాలంతోకూడి, చెవులనేతప్ప మనస్సును రంజింపలేని గ్రాంథికం సహాయపడదు. ఇలా నాటకరూపానికీ, వ్యావహారిక భాషకూ పొత్తుఉంది. అందుకోసమే, అప్పారావు తన సాంఘిక నాటకంలో ఈ విశ్వప్రయత్నం చేయవలసి వచ్చింది. ఆ చేయడంలో విశాఖపట్నంమండలానికి సంబంధించిన వాగ్వ్యవహారాన్ని తీసుకోవడం తప్పనిసరిఅయింది.అందుచేత ఇతరమండలాలవాళ్ళకుబోధపడని మాండలికాలు కొన్నినాటకంలో దూరకతప్పలేదు. అందులోనూఅల్పపాత్రల సంస్కారాన్ని బట్టి మరీ పరిమితమైన వ్యాప్తిగల మాటలు ప్రవేశించాయి. ఆంగ్ల విద్యపై మోజు పెరుగుతున్న రోజుల్లో, సంఘంలో ఆధిక్యంకోసం ప్రజాసామాన్యాన్ని భ్రమ పెట్టడంకోసం ఇంగ్లీషు ముక్కలు వాడడమే పరిపాటి అయింది. గిరీశంలాంటి వంచకుడికి ఆ మాత్రపు ఇంగ్లీషు భాషా పరిచయం కూడా జీవన సమరంలో

ఆయుధమే అయిపోయింది. కాబట్టి, ఆ మాటలు అతని ద్వారానే బహుళంగా నాటకంలోకి చొరబారాయి. కోర్టులలోనూ, కచ్చేరీలలోనూ 'పార్శీ' (ఉర్దూ)ని నెట్టివేసి పాలకుల భాష వచ్చి కూచుంది. కాబట్టి వాటి చుట్టూ తిరిగే గ్రామస్థులకు గూడా ఇంగిలిపీసు ఎంగిలి ముక్కలు అలవడ్డాయి.* అయితే ఈ మాత్రానికే ఈ నాటకం పట్నవాసపు వాళ్ళకు కొంతైనా బోధపడుతుందేమోగాని, ఇతర ప్రాంతాల పల్లెవాసులకు బొత్తుగా బోధపడదని చెప్పడం సాహసమే. పూర్తిగా బోధపడడానికి విశాఖపట్నం మండలంలోనూ, తూర్పుభాగంలో, అన్ని వర్గాల వారి మాట తీరులతోటీ పరిచయంగల వ్యక్తి అయి ఉండాలి. ఆ మాట కొస్తే అందరికీ సుబోధకం కావడానికి అన్ని ప్రాంతాలకు సామాన్యమైన శిష్ట వ్యావహారికాన్ని వాడడం అవసరమైనా, స్థానిక ప్రత్యేకత (local colouring) ఇలాంటి నాటకాల విశ్వసనీయతకూ, బలానికీ అనివార్యమూ అవసరమున్నూ. తొలి కూర్పు ప్రతిలో గ్రాంథికరూపాలే బహుళం.

తొలి కూర్పు నాటకం అచ్చై సమీక్షలకోసం ప్రముఖ పత్రికలకు చేరిన వెంటనే నెల్లూరి నుంచి పూండ్ల రామకృష్ణయ్య సంపాదకత్వాన వెలువడుతూ వచ్చిన పండిత పక్ష పత్రిక *అముద్రిత గ్రంథ చింతామణి*, నాటకాన్ని

---

* ఈ నాటక పాత్రల సంభాషణాశైలిలో సవాలక్ష భేదాలను చూపాడు రచయిత. రామప్పంతులికి ఇంగ్లీషు రాదు. వచ్చిన వకీళ్ళు ఇంగ్లీషు ముక్కలు వాడరు. వచ్చీరాని గిరీశమే అవసరమైనచోటా కానిచోటా వడేస్తుంటాడు. రామప్పంతుల మాటల్లోనే ఉర్దూప్రభావంఎక్కువ: ఖాతరీ, మెహద్బీ, ఖొదా, బేహద్బీ, దగలా. సప్లైలాంటి ఒకటీ అరా ఇంగ్లీషు మాటలుకూడా. పోలిశెట్టి వాడేమాటలు భష్టాకారి ముణుకు, యిషపచేత్తో, రొండు, గాపకంలాంటివి, శూద్రుని భాషతో ఎక్కువగా భేదించవు. జంగం వీరేశ శాస్త్రిన్ని చాత్రం అనైనా అనకుండా, సాతాని మనవాళ్ళయ్యతో పోటీపడుతున్నట్లు, యథాశక్త్య గ్రాంథికంచేసి చాత్రంబు అంటాడు; మనవాళ్ళయ్య సరేసరి: "ఆకాశంబు శూన్యంబు"; "శాస్త్రంబులలోని రహస్యంబులు మ్లేచ్ఛులకెట్లు తెలియును?" మునసబు నాయడు జ్ఞానాన్ని ఘానంగా, రుష్యాను ఋస్యాగా మారిస్తే, హవల్దారు రుషియాచేసి, పాతశబ్ద రూపాలైన ఇంగిరీజు, గవునర్‌మెంటు, కుంపిణీ వగైరాలతోబాటు ఉర్దూమాటలుకూడా గుప్పిస్తాడు. దుకాణాదారు మరీ కిందికిదిగి, సమాది, బంగం, ప్రేహం, పరవాత్వా, ప్రయ,లను వాడుకచేస్తాడు. మధురవాణి మాటలు కొన్ని సామెతల్లా, సూక్తుల్లాగుంటాయి: "శృంగారం వన్నెచెడిన దగ్గిరనుంచీ, బంగారంకదా వన్నెతేవాలి?"; "డబ్బురానివిద్య దారిద్ర్యహేతువ". గ్రామస్థులైన రామన్న, లక్ష్మన్నలు తీగిటపా, నిమేటువంటిమాటలు వాడుతారు. ఇక అసిరిగాడున్నాడు. దిద్దుబాటు కథలో రాముడిలాగే వీడిమాటతీరు ఆ మండలపు నాటు పలుకుబడిని పుణికిపుచ్చుకున్నట్టు కనిపిస్తూంది. వాక్య విన్యాసంలోనే ఆ లక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

మెచ్చుకొంటూ పాత్రోచిత భాషావశ్యకతను కూడా గుర్తిస్తూ, ఆంగ్ల భాషా విషయంలో మాత్రం హెచ్చరిక పలికింది :

> ఇట్టి గ్రంథములకు సలక్షణమగు గ్రాంథిక భాష నిరుపయోగము గాన *గ్రంథకర్తల* యభిప్రాయముతో మే మేకీభవింపముగాని యింగ్లీషు పదముల విశేషముగఁ జేర్చినందులకై మాత్రము కొంచె మాలోచించుచున్నారము. గ్రంథకర్త యభిప్రాయానుసారముగ నీ కాలము నందలి తెలుఁగు సంభాషణలో నింగ్లీషు పదములు చేరుచున్న వనుమాట నిజమే. అయిన నవి యందఱకు వాడుకగా నుండు 'సైడ్డు — కాలవ – మిటికిలేషన్ – బియే పరీక్ష–ఫయిదుబాక్సు–ఆక్టింగు పని – మిషన్‌స్కూలు – కలక్టరుదొర – జడ్జీకోర్టు' యను నట్టి సర్వ సాధారణ పదములవలెఁగాక 'సింప్లిసిటీ – లవ్‌సిగ్నల్సు – ఇన్సిన్సిరిటి – కంపారిజన్ – డ్రెడ్ ఫుల్లీ యిన్‌లవ్' లోనగు నపూర్వపుఁబదము లింగిలీషురాని వారికెట్లు బోధపడునో తెలియదు. 38

ఇది గ్రంథకర్త ఉద్దేశాన్నే భంగపరిచే విధంగా పదిమందికీ సుబోధకం కాకుండా పోతుంది. కాబట్టి, కష్టమైన ఇంగ్లీషు పదాలకు అర్థప్రాయంగా ఉండే లాగున వివరణ రాసి ప్రకటించ వలెనని ఈ పత్రిక సూచించింది. ఒంగోలు ముని సుబ్రహ్మణ్యంగారిచేత రెండవ కూర్పు ప్రతిలోని ప్రాంతీయపదాల జాబితాను అప్పారావు తయారుచేయించారు గాని అది అచ్చుకాలేదు.

రెండవ కూర్పు నాటకంలోని భాషను మరో కోసనుంచి నరుక్కొని వచ్చేందుకు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి పూనుకొన్నాడు. *ఆర్య మత బోధిని* పత్రికలో *కన్యాశుల్కస్థ గ్రామ్య భాషావాద విమర్శనము* అనే వ్యాసాన్ని ప్రటటించి దానినే చిన్న పుస్తకంగా పునర్ముద్రింపించాడు. ఈ నాటకం "మంచి ప్రహసనము," "ఇట్టి ప్రహసనములందు గ్రామ్యము వాడుటయే యుచితము" అని అంగీకరిస్తూనే, గ్రామ్యం గ్రంథభాష కాదగునా అనే వివాదాంశం మీద ధ్వజమెత్తాడు. తర్వాత, నాటకంలోని ఇంగ్లీషు పదాలపై విరుచుకుపడి, "రెండువంతులకు పైఁగా నింగ్లీషు వాక్యములును నొక భాగమునకుఁబైగా తురక మాటల మున్నగునవియుం" గల ఈ నాటక భాష, "మసీదును గట్టుచు నందు విష్ణ్వాలయపు రాలను గొన్నింటి తురకలు తగిలించిన కారణమున నా మసీదు విష్ణ్వాలయ మగునేని, ఇది తెలుఁగు కాఁగలదు" (పు. 5) అని చమత్కారం ద్వారా నెగ్గుకురాసాగాడు. వ్యవహారంలో అప్పటికే వచ్చిదూరిన ఇంగ్లీషు, తురక పదాలు గ్రంథాలలోకి గూడా వచ్చేట్టుంటే, తెలుగు తొందరలోనే నశిస్తుందన్నారు.

ఈ నాటక పదాలలో "ఎచ్చట జూచినను హాలంతములే. ఎచ్చట జూచినను శ.ష. . వ(ం, ఇ మొదలగు సాధారణముగా నుచ్చరింపననువు పడని వర్ణములే." (పు 5)

ఉత్తమాధమ పాత్రలకు గూడా నింద్యగ్రామ్యాన్ని పెట్టి, ఇంగ్లీషు వాక్యాలలో పాటించిన పాచ వ్యాకరణాన్ని కూడా తెలుగు వాక్యాలలో పాటించలేదుట. పాత్రల దాకా ఎందుకు, తన వాక్యాలలో కూడా గ్రంథకర్త "సుశబ్దములం" ప్రయోగించ లేదు. పద ప్రయోగము కలమెట్లకుపోతే అట్లుపోయింది. "ఒక యుక్తిలేదు. ఒక వరుసలేదు" (పు. 8). 'స' కు 'శ' 'శ' కు 'స' పెట్టి వేశ్యను వేస్యగా మధుర వాణిచేత పలికించాడు. ఆ మధురవాణే "ఆశిహా" "గిరీశంగారు" అనగలిగింది. మరొకచోట "వేశ్య"ను అలాగే పలికింది. గిరీశం హ్మాణుడై ఉండి 'కేసు కొంలశిందే' అన్నాడు! శెట్టి ఇంకొక చోట సెట్టి అయ్యాడు పన్నెండు ఇంకోచోట పజ్యెంపు అయింది. శెలవు శలవుగా మారింది. అసిరిగ 'సప్పాన్రా' అని, రామప్పం తులూ 'సెప్పినాను' అంటాడా ? ఇంకోచోట 'సచ్చానే' అనకుండ సరిగా 'చచ్చానే' అన్నాడుకదా :

నియమమేది లేకుండా అర్ధానుస్వారం అన్ని అక్షరాల ముందు వాడుకై ఉందని మరో లోపం చూపాడు బ్రహ్మయ్యశాస్త్రి. అనునాసికం లేనిచోటకూడా అరసున్న ఎందుకు ? I employed the Ardhanuswara after a nasal 'వ' అ రాసుకొన్న అప్పారావే, దేవాది శబ్దాలలోని వకారం అనునాసి. మెట్లవుతుందో చెప్పలేదు. శకటరేఫ వాడాడు. "కాబట్టి వ్యావహారిక భాషను పూర్తిగా పాటించలేదు. "అరసున్నల యుప్పెనయు శకటరేఫముల సంకటము నేగాక లోకులు పలుకు పలు కులకు సంజ్ఞ లేర్పఱచుటలోగూడా వీరు చాల చిక్కులు కల్పించిరి." (పు. 11)

ఇలా సాగింది బ్రహ్మయ్యశాస్త్రి "ఘాటీగా" చేసిన విమర్శ.

ఈ నాటకంలోని హిందీ పదజాలం గురించి రాస్తూ, కాలిపు వీరభద్రుడు గారు, కన్యాశుల్క సంబంధి వాఙ్మయానికి మరొక వ్యాసాన్ని సమర్పించారు. ఈ పదజాలం మూడు విధాలుగా ఉందంటూ, చమడా, ఫైసలా, జరూరు, మగదూర్, వగైరా మాటలను హిందీలోవున్న రూపంలో ఆ అర్థంలోనే అప్పారావు వాడాడని. బిచానా, డంగు, కబురు, నౌకరు, ఆబోరు; ఆమేషా, కుమ్మక్కు కూనీమొదలైనవి హిందీలోని రూపాలకంటే కొద్దిగా భిన్నంగా ఉన్నాయని; బజాయించుట, బైతాయించుట, దౌడాయించుట, ఖరాయించుట వంటివి తెలుగుతనం తగిలించుకొన్న హిందీ పదాలని వర్గీకరించారు.

ఉరుదూ రూపంలో హిందీ, పాలకుల భాషగానూ అటు తర్వాతకూడా పరిపాలన భాషగానూ ఉంటూ వచ్చింది కాబట్టి, ఇంగ్లీషు భాషా ప్రాచుర్యానికి ముందటి తరం వాళ్ళంతా హిందీమాటలనే ఎక్కువగా వాడుకచేశారు. మహాప్రబంధ యుగం నుంచీ యివి సాహిత్యాని కెక్కాయి. సాధారణ వ్యవహారంలోనే 'ముసద్దీ' 'తుపాకీ' 'సికారీ', 'కులాసా'. 'అంగరకా' 'మోస్తరు', 'దస్త్రము', 'ఆసామీ', 'మామూలు' వంటి ఎన్నో మాటలు వచ్చిచేరాయని వావిలాల వాసుదేవశాస్త్రి చమత్కారంగా వ్రాసినట్లు బ్రహ్మయ్యశాస్త్రి పేర్కొన్నాడు. (పు. 3-4) వేదంవేంకటరాయశాస్త్రి నాటక పద్యాలలో ఎన్నో 'తురక' పదాలువచ్చినిలిచాయి. ఎటొచ్చీ 'పామరుల'కు సులువుగా బోధపడని గిరీశం ఇంగ్లీషే, అప్పారావు విమర్శకులకు అంతగా మింగుడు పడలేదు.

బ్రహ్మయ్యశాస్త్రి రాసిపోయిన ఏబై ఏళ్ళకు నిడుదవోలు వేంకటరావుగారు *గురజాడ అప్పారావు : కన్యాశుల్కము* అనే వ్యాసంలో (తెలుగుమహాజన సమాజము వారి ఆరవ వార్షిక సంచిక, మార్చి 1961) *కన్యాశుల్క* నాటకభాషను చర్చించారు; వ్యావహారికంలో మ వ లు పరస్పరంమారుతాయి. (ఉ॥ దేవుడు-దేముడు మామయ్య - మావయ్య. అందుకనే అర్ధానుస్వారం) అని అప్పారావు గుర్తించాడు. పదం మొదట 'ఎ' ని 'య' గా రాశాడు (ఉ॥ ఎలక - యలక). 'ఉ' ను 'వు'గా రాశాడు. వలపల గిలక పెట్టాడు. జ్ఞానం మొదలైన శబ్దాల ఉచ్చారణ స్పష్టపడే విధంగా రాశాడు. "పైభాషా లక్షణములన్నియు, పూర్వకవులు కొంతమంది తమ కావ్యములలో, మార్చరాని యతిప్రాసాది స్థలములలో ప్రయోగించిననియే. ఈ నాటి వారికవి తెలియక పోవుటచేత, యిట్టి ప్రయోగములు దుష్టములని యనుచున్నారు." ఇంగ్లీషుమాటలకు వస్తే అటు విద్యార్థి వెంకటేశంగానీ, పార్టీలతో తెలుగున మాటాడ నేరిస్తేనే తప్ప ప్లీడరీ నిలుపుకోలేని వకీలు సౌజన్యారావుగానీ, ఇంగ్లీషు మాటలే పలకరు. అన్ని పాత్రలూ వ్యావహారికాన మాట్లాడుకుంటే, సాతాని మనవాళ్ళయ్య పాత్ర మాత్రం గ్రాంథికాన్ని మాట్లాడడానికి వేంకటరావు గారు చూపించిన కారణం, సుప్రసిద్ధ పండితుడైన రేకము రామానుజసూరి రెండో కొడుకు రేకము మనవాళ్ళయ్య ఎప్పుడూ గ్రాంథికం మాట్లాడడమే. తెలికచెర్ల వారన్నట్లు——

అప్పారావుగారువ్యావహారికభాషలో*కన్యాశుల్కము*వ్రాస్తే, గ్రాంథికభాషా సముద్రముచుట్టూ ఆవరించి ఉండగా, ఆసముద్రమధ్యాన *కన్యాశుల్కము*తో అప్పారావు గారు ఒక ఒక దీవివలె, దివ్వెవలె వెలుగొందినారు.

అప్పారావుగారు రచించిన వ్యావహారిక భాషకు పూర్వులెవరూ పెట్టిన వరవడి ఎదుటలేక పోవడము స్పష్టము. శబ్దసిద్ధికి లోకమే ప్రమాణముగానూ ఏ సందేహము తీర్చుకోడానికైనా ఆత్మప్రమాణమే పరమప్రమాణముగానూ నిర్ణయించుకొని ఆయన వాడుక భాష వ్రాశారు. ఆ వ్రాతకు తెలుగులో ఉన్న కొన్ని అక్షరాలు తానుద్దేశించిన కొన్ని ధ్వనులకు సరిపడకపోగా, కొన్ని కొత్త గుర్తులు కల్పించుకొన్నారు .. కొత్త ధ్వనులకు కొత్త సంకేతము లేర్పరచడము విషయంలో నేటికీ తర్జన భర్జనలు మాత్రమే వేసే మన పండితులను చూస్తూ ఉంటే అప్పారావుగారు ఎంతటి ప్రతిభాశాలో తెలుస్తుంది. ...39

"ఆద్యంతము నవ్వు తొణికిసలాడేటట్టు" ఒక గంభీరమైన ఇతివృత్తాన్ని నిర్వహించిన అప్పారావే, హాస్యంతోటి సరిపెట్టుకొనే పాఠకులను అధమస్థాయికి చెందినవారని ఎంచాడు. తానెంత "హాస్య ప్రసన్నుడో "అంత "గంభీరుడూ భయంకరుడు" కూడానని, ఎన్నడూలేనిది, రచన సందర్భాన చెప్పుకోవడంలో విశేషం లేకపోలేదు.

కన్యాశుల్క నాటకాన్ని హాస్యమయం చేసినంతమాత్రాన్నే అది ప్రహసనమైపోదు. నాటకాని కవసరమయ్యే "స్వతంత్ర, సంఘర్ష" ఇతివృత్తమూ, అసామాన్యమైన పాత్రీకరణ శిల్పమూ దండిగా ఉన్నందుచేతనే ఇది "గంభీరం"కాలేదు. ఘటనాచక్రాన్ని తిప్పుతున్న రచయిత చైతన్యం, దానికొక ఉన్నతమైన ప్రయోజనాన్ని ఇచ్చింది. అంతర్లీనంగా ఉండి పాత్రల చేష్టితాలద్వారానూ, మాటలద్వారానూ ఘర్షణలద్వారానూ బయల్పడుతున్న ఈ ప్రయోజనపరత్వం-ఇదే ఈ నాటకానికి ప్రాణశక్తి.

హాస్యం శ్రుతిమించిందని సెట్టి ఈశ్వరరావు గారి లాంటి విమర్శకులు భావిస్తున్నారు. "తూకంలో హాస్యం బరువు కన్యాశుల్కంలో యెక్కువైపోయింది. ఏడిపించవలసిన పరిస్థితులు నవ్వి43యి. అగ్నిహోత్రావధాన్లు, రామప్పంతులు, గిరీశం మొదలైనవారు తీవ్రంగా గర్హించవలసినవారు. హేళనచేసి తేలికగా దాటిపోనియ్యవలసినవారు కారు". 40 ఆ హేళనే ఈ నాటకాన్ని వట్టి నీతిపుస్తకం గాకుండా కాపాడింది. ఆ హాస్యమే ఈ రచయితను మరొక వీరేశలింగం కాకుండా కాపాడింది. హాస్యం ఎన్నో రకాలు. ఒక పాత్రకు పెట్టింది ఇంకొక పాత్రకు

పెట్టకుండా, తాకీ తాకనంత సుతారంగా ఒకరిని, చెంపపెట్టు పెట్టినంత బలంగా ఇంకొకరిని పరాచికాలాడుతున్నట్లు ఒకచోట, పరుషంగా ఖండిస్తున్నట్లు మరోచోట-చిత్రకోటి రూపాలతో హాస్యాన్ని పోషించి చూపాడు. ప్రహసనాల స్థాయికి దిగిపోకుండానూ, ధర్మశాస్త్ర స్వరూపం తాల్చకుండానూ, ఈ నాటకం ఒక విశిష్టమైన స్థానాన్ని పొందగలిగిందంటే, కోమలాయుధం వంటి హాస్య ప్రసన్నతే కారణమనాలి. మనుషుల లోటుపాట్లను చూచి ఓర్వలేని రచయితే తిట్లకూ మొట్లకూ పూనుకొని, నైతిక నియంత కాగోరుతాడు. మనిషి మంచిలో మౌలికమైన గురి ఉన్న రచయిత, * ఈ మంచిని సంస్థా నీతిచట్టాల పారస్పర్య ఆనుజన్మ ప్రభావాల ముట్టడినుంచి తప్పించి, కరుణాదృష్టితో చూచి పెంచాలి మంచీ చెడూ ఒక్క-చోట కలగలిసి ఉంటాయి కాబట్టి ఒకదానినుంచి మరొకదాన్ని వేరువేసి, ఎవరి మనస్సును వాళ్ళకే చూపుతూ పదుగురుకు కూడా చూపి, ఆ చెడుగుపై వారి దృష్టిని పదుగుర దృష్టిద్వారా కేంద్రీకరింపజేసి, భిన్నులను గావించి, పరివర్తనం కలిగించాలి. ఇందుకు హాస్యదృష్టి పనిజేసినంతగా తీవ్రగర్హణ పనిచెయ్యదు. వైద్యుని శస్త్రిక వాడవలసినచోట కసాయికత్తి వాడడం తగనిపని.

మెరుపులాంటి మాటొకటి శ్రీ శ్రీ గారి ముఖతః వెలువడింది. ఈ నాటకం నిజానికి హాస్య ప్రధానం కాదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ, "గిరీశం రామప్పంతులు, లుబ్ధావధాన్లు మొదలైనవారు నవ్వు పుట్టించేటట్లు మాటలాడే ట్రాజిక్ హీరోలు. వీరిది శిథిలీకృత మవుతున్న ఒకానొక సాంఘిక వ్యవస్థయొక్క కరాళ నృత్యం. కన్యాశుల్కం బీభత్సరస ప్రధానమైన విషాదాంత నాటకం," అన్నారు. 41 హత్యలులేవు. కూనీకేసు కూడా హాస్యానికే పనికివచ్చింది. శవాలులేవు. మాయ సుబ్బిశవం బావిలోనుంచి పరారీ అయిపోయింది. రక్తపాతం లేదు. చీపురుగట్ట దెబ్బలకు రామప్పంతుల ఒళ్ళు నిజానికి హూనమైనా కాలేదు. సత్సంకల్ప విఘాతాలూ లేవు. విషాద రాహువు గ్రసించినా, కొన్ని పాత్రలు కథాంతాన గ్రహణం నుంచి బయల్పడుతాయి. కన్యావిక్రయ వ్యాపారానికీ వ్యాపారులకూ జైలుశిక్షలైనా లేవు. ఏ విధంగా చూచినా ఈ నాటకం విషాదాంత నాటకం కాదు. కాకుంటే, విషాదకర ఘటనలు, విషాదమగ్న పాత్రలు, సాంఘిక దుస్థితి దీనికి విషాదచ్ఛాయను పులుముతున్నాయి. ఒక సాంఘిక వ్యవస్థ అంత్య ఘట్టానికి ఈ నాటకం

---

* "సొగసులేని మనిషే వుండడు" అనేది, అప్పారావు సాధించుకున్న తత్వంలో పునాదిరాయి.

చారిత్రిక పత్రంలాంటి సాహిత్య సాక్ష్యం. ఆ వ్యవస్థా ప్రతినిధుల క్షోభ, తత్కాలానికి ప్రేక్షకులకు సంక్రమించినా, చివరకు 'చేసుకొన్నవారికి చేసుకున్నంత మహదేవ' అనుకోవలసి వస్తుంది.

అయితే శ్రీపాద కామేశ్వరరావు వర్ణించి నిర్ణయించినట్లు ఇది Tragi-comedy కానా? The Merchant of Venice వంటి నాటకాలను ఈ పేరున వర్ణిస్తూ ఉన్నారు. మామూలు 'కామెడీ'ల్లా గాకుండా, ఇవి పాత్రల ఉద్రేకాలకు సంబంధించి నాటకంలో ఒక పక్షం వైపు ప్రేక్షకులను మనసారా మొగ్గేట్లు చేస్తాయి. ఉద్రేకాల ఒత్తిళ్ళు ఉన్నప్పటికీ, సుఖాంతంగా పర్యవసిస్తాయి. అన్ని 'కామెడీ'ల్లో లాగానే వీటిలోకూడా జీవితవిమర్శ ఉంటుంది. భావ ప్రతిపాదన ఉంటుంది. సాంఘిక దృక్పథం ఉంటుంది. ఈకొన్ని గుణాలు 'ఫార్స్' (Farce)కు గూడా ఉన్నప్పటికీ, దీనిలో మొరటుగాఉండి నిస్పృహావహంగా ఉన్న జీవితవిమర్శ 'కామెడీ'లో సానుభూతితోకూడి అధిక్షేపాత్మకంగా గాక పరిహాసాత్మకంగా ఉంటుంది; అంతేగాక, జీవిత వాస్తవ విషయాలను వదిలి దూరంవెళ్ళి వికృతరూపాలతో 'అతి' మాత్రమైన చిత్రణలతో అపహాస్యానికి తావిస్తుంది. షేక్స్పియరు నాటకాలలో ఇది ఈ జాతిది, అది ఆ జాతిది అని దేనికది వేరుచేసి ఎల్లలు చూపి నిర్ణయించడం చాలా కష్టమైనపని, అని విమర్శకులు యావన్మందీ అంటున్నదే. నైతికదృష్టి ప్రధానంగా ఉండిన రోజుల్లో 'కామెడీ' కూడా 'ట్రాజెడీ' తాలూకు ఒత్తిళ్ళనూ, ఘర్షణలనూ, ఆశాభంగాలనూ, సంకల్ప విఘాతాలనూ ప్రదర్శించవలసి వచ్చింది అందుచేతనే వాల్టర్ రేలీ (walter Raleigh) ఇలా రాశాడు:

Shakespeare's Comedy is akin to his Tragedy, and does not come out of the other house. The kind of comedy which has been most famous and most influential in the world's history is satirical comedy which takes its stand on the best social usage, and laughs at the follies of idealists...But this is not Shakespeare's comedy His imagination is too active to permit him to find res tin a single atitude. 42

ఇతర విషయాలలో పోలికలున్నాలేకున్నా, ఇదమిత్థమని ఏకైకమైన నాటక పద్ధతికి కట్టుబడిపోకుండా, ఫార్సు, కామెడీ ట్రాజెడీల లక్షణాలను అవసరంచొప్పున గుదిగుచ్చిన సందర్భంలో అప్పారావు షేక్స్పియరు అభిమాని అనిపించుకొన్నాడు.

అయల సోమయాజుల నరసింహశర్మగారు ఈ నాటకంలో ప్రధానరసం హాస్యంకాదు: బీభత్సమేనని నిరూపింపజూచారు, గర్హ్యంగా వర్ణింపబడే ప్రతిదీ బీభత్సానికి స్థానమౌతుంది; హేయభావ సంకలనంచేత వస్తుతః శుద్ధమైనవస్తువు

కూడా హేయమే అవుతుంది. సంఘ కళ్మలాన్ని బయల్పరచడమే ఈ నాటకకర్త ఉద్దేశం కాబట్టి బీభత్సం ప్రధానమై హాస్యం రెండవస్థానం పొందుతుంది. అంగమే అయినా, 'హాస్యం విజ్ఞాననిలయా' అని పూర్వులన్నట్లు అది వికాసాత్మక మౌతుంది. కాబట్టి "విజ్ఞానం జ్ఞానాన్ని అధిక్షేపిస్తుంది. దీనివల్ల అజ్ఞానంమీద ఏవ కలుగుతుంది. అది బీభత్సక విషయం. ఈ పరిస్థితికి కన్యాశుల్కం ఉదాహరణ గ్రంథం" సా. ఈ బీభత్సమే 'కామెడీలో' దూరిన 'ట్రేజెడీ' లక్షణం. కాబట్టి యీ నాటకానికి శ్రీపాద కామేశ్వరరావు చేసిపోయిన వర్ణనే సరిఅనితోస్తుంది.

ఇప్పటికే పెరిగిన ఈ కన్యాశుల్క నాటక సమీక్ష నిజానికి వెనుకటి సమీక్షల సమీక్ష ఃను ముగించే ముందు, కట్టమంచి రామలింగారెడ్డి ఈ నాటకపు కన్నడ అనువాదానికి రాసిన పీఠికలో కొన్ని భావాలను పేర్కొంటాను.

—అప్పారావు ఆంధ్ర ఆంగ్లభాషాకోవిదుడు; భావనాశక్తి పరిశీలనాశక్తి విశేషంగా ఉన్నవాడు. అయితే మద్రాసు యూనివర్శిటీవారి ధర్మమా అని, ఎలిజబెత్ యుగపు ఇంగ్లీషు నాటక మర్యాదలతోనే ఇతర విద్యార్థులందరివలె ఈయనకూడా ఎక్కువ పరిచయం సంపాదించుకొన్నందుచేత, రంగప్రయోగం దుస్సాధ్యమై పోయేటంతగా ఈ నాటకాన్ని పెంచాడు. అనిమేషనయనులైన దేవతలే దానిని ప్రదర్శించడానికీ తిలకించడానికీ ఓపికగలిగివుంటారు. లేదా ఆ దేవతలకు యీడైన గ్రామీణులకుకూడా అంత ఓపిక ఉంటుంది. ఇది ముఖ్యంగా శ్రవ్య నాటకమేగాని కొన్ని భాగాలను విడకొట్టి ప్రదర్శించుకో వచ్చును. అసలు అప్పారావుకున్న బలహీనతే యిది: ఎక్కడ ఎప్పుడు ముగించాలో తెలియకుండా ఉపన్యాసాలను కూడ యిలాగే సాగదీసుకొంటూ పోయేవాడు. మద్రాసులో 'సెనెట్ హౌస్'లో ఒక మారు ఇలాగే ఒక అనంతమైన లిఖితపత్రాన్ని చదువుకొంటూ పోతూ ఉంటే, పక్కనున్న పెద్దమనుషులు మొదట నైతికమైన ఒత్తిడినీ పిదప శారీరకమైన ఒత్తిడినీ ఉపయోగించి ఆయనను ఆపవలసి వచ్చింది. అది నాకింకా గుర్తు.

...Still with all its defects of technique ... KANYASULAKAM remains a masterpiece in the diffticult realm of social satire. It is aglow with life and humanity; its men and women move about with the graces and kindnesses, oddities and absurditiés, cruelties and chicaneries, sanctities and hypocricies of real life – a life in which nature and custom, reason and tradition, sentiment and superstition are in immeasurable conflict. Lastly, this is the greatest merit of our author, his characters are types...–

# 4

కన్యాశుల్కం రచనోత్సాహ ప్రవాహం పొంగిపొర్లి కొన్ని కెరటాలు వచ్చి కొండుభట్టీయం మడుగున చేరిపోయాయి. మాటలకు మాటలు, వాక్యాలకు వాక్యాలు, ఊహలకు ఊహలే కవల పిల్లల్లాగా రెంటిలోనూ కనిపిస్తాయి. కారణం అనూహ్యంకాదు. రెండో కూర్పు కోసమని కన్యాశుల్క నాటకాన్ని మరో మూసలో కరిగించి పోస్తూ వచ్చిన రోజుల్లోనే, 1906 లో ఈ కొత్త నాటకాన్ని నీలగిరి మకాంలో రాశాడు. సదరు లిఖిత ప్రతి పోయినందుచేత, ఒకటి రెండేళ్ళు తాళి మళ్ళీ రాశాడు.

స్థూలంగా చూచినప్పుడు కనిపించే పై పోలికలు దీన్ని దానికి నకలుగా మార్చవు. కన్యాశుల్కంలో ప్రస్తావనకు రాని సమాజ రుగ్మతలు ఆట్టేలేవు: మత విశ్వాసం, హేతువాదం; దాంపత్యం, సానిరికం; ఛాందసం, అనాచారం; పురుషాధిక్యం, స్త్రీ జనాక్రోశం; గ్రామీణ జనుల బుద్ధిజడిమ, నాగరజనుల బుద్ధి వక్రత; ఆచార పరత్వం, సంస్కారోద్యమ స్పందనం – ఈ విరుద్ధ లక్షణాలమధ్య మరెన్నో మధ్యస్థ స్థానాలు. * ఇన్ని వచ్చి కలిసి దానికి దృశ్యకావ్య యోగ్యతను తగ్గించి వేసినా, యుగసంధిలో ఆంధ్రజాతి జీవిత చరిత్రకు అది చిత్రపటంవంటి వచనేతిహాస గ్రంథం. దాని పరపూ విప్పూ నాటకోచితాలు కావు. అయినా, కొన్ని సమాజ రుగ్మతల నవి తేలికగా తాకి తట్టి, ఊరకే పేర్కొని విడిచిపెట్టి, తృప్తి పడింది. ఈ మిగులు సగులు రోగబీజాలను వెదజల్లకుండ గలందులకై, మరో శస్త్రచికిత్స అవసరమైంది. "రోగికి డాక్టరు శస్త్ర చికిత్స చేసినట్లు సమాజంలోగల రుగ్మతలను కత్తి తీసుకొని దేని కది విడదీసి అన్నీ భాగాలను పరీక్షించి చూడు", అని అప్పారావు తన యువమిత్రుడైన ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి నేర్పుతున్నాడంటే, తా నా పని స్వయంగా చేస్తూ వచ్చాడు గనుకనే. కన్యాశుల్క నాటకంలోని అనేకానేక విషయాలలో ఒకానొకటే అయిన సానిరికం, ఈ రెండో

---

* నియోగి - వైదీకి కొట్లాటలు, వకీళ్ళ దురాచారాలు, పోలీసుల తప్పుడు పద్ధతులు, ఇలాంటివి మరెన్నో. శ్రీశ్రీగారు ఈ కలగా పులగపు నిండుదనాన్నే "విశ్వతోముఖత్వ" మంటున్నారు. ఏకముఖంగా సాగవలసిన దృశ్య కావ్యకథకు ఇన్ని ముఖాలుంటే ఎలా ?

నాటకంలో కేంద్ర స్థానానికి రావడమే కాదు; వెలుపలి నుంచి మాత్రమే సాని బతుకును వర్ణించిన ఆ మొదటి నాటకంలా గాక ఇది లోపలి నుంచి, దగ్గరగా ఉండి, గుట్టూ మట్టూ నెమకి, లోతులకు దిగి తరిచింది. దాని విరివి దీనికి లేనట్లే, దీని లోతు దానికి లేదు. వేశ్యా సమస్యకు ఈ నాటకం a study in depth అనదగింది.

....శూద్రులింట బుట్టిన ఒక అభాగ్యురాలు కరువు కాలాన కన్నకడుపుకు గూడా బరువై, కొండుభట్టనే తైనాతీ పోషణ కిందికి వచ్చి, పెరిగి పెద్దదైంది. కాసుకోసమై ఈ బ్రాహ్మడు రామసాని కా పిల్లను అప్పగించాడు. రామసాని కట్టడిలో ఆ పసిపిల్ల గడిదేరిన వేశ్య – మంజువాణి – అయింది. రామసాని గుటుక్కు మన్నాక, మంజువాణి యజమానురాలే కాగలిగింది. మిరాసీదార్ల మొదలు తోళ్ళ సాయెబులదాకా నానారసికులను తారుస్తూ, మంజువాణి విదిలించిన మెతుకులతో కుటుంబ పోషణ చేసుకొంటూ, మరో వేశ్య రత్నాంగి ఇంట దొంగతనానికి గూడా పాల్పడి దేహశుద్ధి పొందాడు కొండుభట్టు. అతని కొడుకైన రామ్మూర్తికీ, మేనగోడలైన పార్వతి (బాలవితంతువు) పెళ్ళి ప్రయత్నాలు చాటుమాటున గిరీశం ఆధ్వర్యాన జరుగుతూ వచ్చాయి. కొండుభట్లు అన్న కొడుకైన వెంకన్న, అక్కాబత్తునిసాయంతో ఒకఇంటివాడు కాజూస్తున్నాడు. కథాంశా లిలా శుభస్య శీఘ్రమ్ అన్నట్లు సుఖాంతం కాబోతుండగా, అచ్చులోని నాటకకథ ఠపీమని ఆగిపోయింది. అవసరాల సూర్యారావు సమకూర్చి పెట్టిన 'అవతారిక' అప్పారావు చేయబూనిన మార్పులనూ కూర్పులనూ సహేతుకంగా చూపెడుతున్నా, నాటకం అసమగ్రం కావడంవల్ల కథా పర్యవసానం గురించి ఎవ్వరైనా ఊహించుకోవలసిందే....

ఈ నాటకంగురించి భమిడిపాటి కామేశ్వరరావు ముందుచెప్పిన ఉపన్యాసంలో ఇలాగన్నారు :

కన్యాశుల్కం అతిపూర్ణం అయితే, కొండు భట్టీయం అసంపూర్ణం.... కన్యాశుల్కంలో అమాయక వింతతువూ తుంటరి బ్రహ్మచారీవస్తే, ఈ రచనలో అందుకుప్రతిగా తెలిసినవితంతువూ, తెలియనిబ్రహ్మచారీ వస్తారు. సాహేబు పాత్రహిందూస్తానీ మాట్లాడుతాడు. పద్యాన్ని నవ్వుతెప్పించడానికి ఉపయోగించిన చోటుం దిందులో! మంజువాణి మధురవాణికంటె ప్రౌఢ. కొండిభట్లు పాత్ర శర్విలకుణ్ణి స్ఫురింపజేస్తుంది. వెంకన్న పాత్రవల్ల జాలియొక్క సరిహద్దుల్ని ముట్టుగునే హాస్యం కలుగుతుంది....జరిగిపోయిన సంగతి యొక్కకథనం వల్ల హాస్యం కల్పించడం ఈ గ్రంథరలో ఒక విశేషం.

బ్రాహ్మణ వ్యాపారాలను, ఆ నాటకంలో కరటకశాస్త్రుల్లు పరోక్షంగానూ రామప్పంతులు ప్రత్యక్షంగానూ నిరూపించి ఉన్నారు. అగ్నిహోత్రుడూ, లుబ్ధుడూ అడ్డువగిలి బ్రాహ్మణ్యాన్ని ఎంతోకొంత నిలబెట్టుకోగలిగారు. అయినా ఈ దాళ్ళు కూడా తప్పట్టి పోయినట్టవే కొండుభట్టుద్వారా బ్రాహ్మణ్యం కేంద్ర స్థానంనుంచి దురాచారాలమీద అప్పారావు దాడిచేయబూనుకొన్నాడు. కన్యాశుల్కం సప్తమాంకంలో బ్రహ్మద్వేషి డిప్టీకలెక్టరుచేత "బ్రాహ్మల్లో వున్నంత ఖంగాళీ మాలకూడు మరెక్కడాలేదు" అనిపించి పరకుల దూషణ చేయించినంత మాత్రాన, ఈదాడి సత్ఫలితాల నివ్వలేదు. కొండుభట్టు వట్ట్రభష్టుడని అతని కుమారుడు రామ్మూర్తే రోయించుకున్నప్పుడు, లోపలి కీలకస్థానంనుంచే దాడిబయెగింది. కాబట్టి కన్యాశుల్క నాటకానికి మరో తెన్నున జరిగిన విస్తరణమే కొండు భట్టీయం. "పదిరూపాయలు పారేస్తే (పాపంకూడా) పుణ్యంకింద పరిణామం అవుతుంది" అంటున్న కొండుభట్టు, "పాపపుసొమ్ము మా దగ్గరకి రాగానే పవిత్రమైపోతుంది." అన్న రామప్పంతులు కోవలోని మనిషే. అక్కడ కరటకునిలాగే ఆత్మశ్లాఘకు పూనుకొని, "దేవతలు బ్రాహ్మణులు చేసేపనులు తప్పు పట్టగూడదు," అని ఘాసురత్వాన్ని సమర్థించుకొన్నాడు భట్టు. కన్యాశుల్కంలోని హవల్దారు శతాబ్దాలనుంచీ స్థిరపడిఉన్న బ్రాహ్మణ వర్ణాధిక్యాన్ని జీర్ణించుకొన్న శూద్రుడేకాబట్టి బ్రాహ్మలను దేవుళ్లతోనూ గవర్నమెంటుతోనూ కూడగట్టి "వారినేరాలు వాంవి వాటితో మనకు పనిలేదు. మనభక్తి మనకుండాలి" అంటాడు. ఇక్కడ బ్రాహ్మడే తన ఆధిక్యాన్ని చెప్పుకోవడంలోనేఉంది. వెనక ఆమాటలకే లేకుండా పోయిన 'పవురు.'

రక్తం పంచుకు పుట్టిన మేనగోడల్నిగూడా సంసారి-సానిగా మార్చజూసే ధనలుబ్ధుడు, తన నిచవ్యాపారాన్ని మతవైచిత్రితో సమర్థించుకోజూస్తూ "శాక్తేయుణ్ణి, వామాచార తత్పరుణ్ణిసి" అనగలడు. తామసపేశ: కొడుకు పేడపెంట్లలో మొలిచే మొక్కకుపుట్టిన పువ్వు. అతని యోగక్షేమాలకోసమే తను గరిపే నానాగడ్డి. ధనానికిసాధనం తైనాతీ వృత్తి. అది నీచమే కొగాక, ఫలితం దొడ్డది. ఆహారాదేయాల చర్చలో కొండుభట్టు ఫలితాన్నిబట్టి సాధనానికి పవిత్రతను సమకూరుస్తాడు ధనం శక్తి, తాను శాక్తేయుడు, లోకగతితో వికటించే వృత్తిని చేబట్టి, వామాచారపరుడు* అయితే, తనకు లక్ష్మీప్రసన్నంకోసం మంజువాణి రక్తమాంసాలను లోకంలోని

* రామప్పంతులుకూడా "నేను శాక్తేయుణ్ణి యోగసాధనం చేస్తాను; నాకు కర్మతోపని లేదు. లోకంకోసం తద్దినాలు పెడుతున్నాను" అంటాడు కన్యాశుల్కం చతురాంకంలో.

కుళ్లమనుషులకు విక్రయించి, దాని ప్రతీ వరహా రాబడిలోనూ తానొక కాసు మినహా యించుకొంటున్నాడు. పాపం మిగులుతుందేమో తనకు! అంతాపిచ్చి! రక్తపు సొమ్ములో నాలుగురూకలు దానంచేస్తే, పాపం పుణ్యమౌతుంది. దేవుడికి కావలసింది పశ్చాత్తాపమేకదా, అది నిజమైందా నటనా, అని అతడు చూడవచ్చాడా? లోకవంచ నకు పునాదిఅయిన ఆత్మవంచన కొండుభట్టులో గూడుకట్టుకొని, కులమతధర్మాలను లౌక్యానికి బలిపెట్టే ధూర్తులకూ దుష్టులకూ ఈ పాత్రను మచ్చుతునకగా చేసింది.

> జాజిమొక్కకి పేడవగైరా అసుద్ధపదార్థములు వేస్తే మొక్కపెరిగి పరిమళ భరితములగు పుష్పాలు పూస్తుంది. చెట్టుకి పేడవేశామని పుష్పాల కేమయినా అపవిత్రత వచ్చిందా? అవి దేవుడి నెత్తిమీద పెడతాం. అప్పవలెనే యే మాయోపాయం చేతనైనా ద్రవ్యం సంపాదించి పెద్ద అవస్థలోనికి వచ్చిం తరువాత వుచితంగా ధర్మంచేస్తే పాపాలన్నీ దహించుకు పోతాయి....

పెంపుడు తండ్రిలాంటి, పైపెచ్చు "భూసురు" డైన, వాణ్ణి పాదతాడనం చేసిమరీ సరసమాడే మంజువాణి, మధురవాణిలోని "నీతి" మినహా మిగిలిన గుణాల నన్నిటినీ పోదిచేసుకొన్న వేశ్య * పుట్టుకబట్టి గాకున్నా, పెంపుదల, పరి సరాల ప్రభావాన్ని బట్టి మనుషుల శీలాలు కొంతవరకు ఏర్పడతాయని భావించిన అప్పారావు 'సత్శూద్రుల పిల్ల' అయిన మంజువాణికి గల అవలక్షణాలను వేశ్యగానే పుట్టిన మధురవాణిలో లేకుండా చేశాడు. "కాలుజారిన సత్పురుషుడి పిల్లవై ఉంటావు" అని సౌజన్యారావు ఒక యోగ్యతా పత్రం కూడా మధురవాణికి అందించాడు మంజువాణి అనే మ్రరివిత్తనం నుంచి. *సంస్కర్త హృదయం* కథలోని సరళసాయంతోటి, మధురవాణి అనే వటవృక్షాన్ని అప్పారావు సాధించాడని ఆరుద్రగారు చేసిన పరిశోధన, ఈ రచనలకాలాన్ని గణనకు తీసుకొన్నట్లయితే, మంచి ఊహకాగలదు. చివరకు మంజువాణికిగూడా వేశ్యావృత్తి హైన్యత గురించి రోతకలిగి పెళ్ళివైపు మనస్సు మళ్ళిందంటే, మంజువాణి, సరళ, మధురవాణి – ముగ్గురూ ఒక తండ్రి బిడ్డలెనంతగా, ఒక రచయిత సృష్టించిన పాత్రలయ్యారు గనకనే! చమత్కారానికి మధురవాణి ఎంతో మంజువాణీ అంతేనని, పీటసరసం వెల్లడిస్తుంది. సరసులను దాచి కాపాడంలో కూడా మంజువాణీ తక్కువదికాదు. కాకుంటే మధురవాణి మెరుగు పెట్టిన బంగారు నగ.

ఈ నాటకంలో పరీక్షగా చూడవలసిన అంశం, గిరీశం పాత్రలో వచ్చిన ఎదుగుదల గూడా కాదు. ఇక్కడ అతడు యుగంధరరావు పంతులుగారి సుపుత్రుడై

* మధురవాణి "తక్కలంజ" కాగా మంజువాణి "పచ్చిలంజ".

తానూ ఒకపాటి పంతులుగా చలామణీ అవుతున్నాడు. కన్యాశుల్కంలో ఒకొకచోట గిరీశం వల్లెవాటుకింది చొక్కా చిరుగుల్లాగే వాగాడంబరం మాటున అజ్ఞానం దాగుండిపోయింది. ఇక్కడ బి. ఏ. పట్టం పుచ్చుకొని, బట్లేరీ ఇంగిలీషును తోసేసి ఉపనిషత్సూక్తాలనూ, మహావాక్యాలనూ ధాటిగా, ధారాళంగా వల్లించడమే గాదు, వ్యాఖ్యానిస్తున్నాడు కూడా. సంస్కారోద్యమపు 'కెప్తాను' గా. నిశారాత్రి వేళలోనైనా ఒక్కపిలుపుతో రెండువేలమంది బలగాన్ని రప్పించగల కార్యదక్షుడయ్యాడు. దివాన్ బహాదర్ రాజారాంగారి అంతఃపురకాంతపై కన్నువేసి తన గిరీశం గుణాన్ని - గుణరాహిత్యాన్ని - పోనిచ్చుకొన్నాడు కాడు. అయినా స్వార్థపు శ్లేష్మంలో పడిన ఈగలా కొట్టుకోకుండా, రామ్మూర్తికీ-పార్వతికీ పెళ్ళి చేయబోయాడు. అందునిమిత్తమే వేషం మార్చి శంకరశాస్త్రిగా ఒక ప్రతిలోనూ, కొండుభట్ల సాయంతోటి మంజువాణి కొంపకు పోయి దాని విటుడైన పంతుల్నీ, కొండుభట్లనీ కలిపి దేహశుద్ధి జేసి తన్మూలాన హృదయ పరివర్తన కలిగింప జూచే తోళ్ళ సాయెబుగా మరో ప్రతిలోనూ, కనిపిస్తున్నాడు. అయినా తనది గిరీశం జాతి మాత్రమే! "కోటివిద్యలున్నాయి. నాటకాలాడుతాడు. పాడతాడు. గారడీ చేస్తాడు". మోసం? మధ్యే మధ్యే పానీయం సమర్పయామి పద్ధతిలో అదీ చేయకపోతే, గిరీశం పేరెలా చెల్లుతుంది?

అంతకన్నా సార్థకమైన పాత్రలు, దివాన్ బహద్దరు రాజారాం, కేశవరాయడు, పరోక్షంగా మాధవయ్య. ముగ్గురూ ఘరానా వ్యక్తులే; సంస్కారోద్యమ సారథులేగాని, భిన్న పంథాలు. దొరల మెప్పు మొహర్బానీలకోసం సంస్కర్తగా నటిస్తూ మళ్ళీ దివాన్గిరీగానీ కౌన్సిలు సభ్యత్వంగానీ చేజిక్కించుకోవాలని ఈ దివాన్ బహద్దరు ప్రభుత్వ ఆశ్రితుడుగా దర్శన మిస్తాడు. గిరీశాన్నీ, కేశవరాయణ్ణీ బరిలోకి దించి, తాను మాత్రం వెనక నిలిచి, ప్రతిష్ఠలోనూ ప్రఖ్యాతిలోనూ 'సింహంవాటా' కావాలంటాడు. సంస్కరణకు తన ఇంట్లోనే అవకాశమూ అగత్యమూ ఉన్నా, లోకంమీదనే అమలు జరిపే 'పెద్దమనిషి', రాజారాం. ఏ యథార్థ సమకాలిక వ్యక్తికీ సాహిత్య ప్రతిబింబం కాకపోవచ్చుగాని, ఇలాంటి వాళ్ళు ఎందరో ఆ రోజుల్లో ఉండేవాళ్ళని వీరేశలింగంగారి స్వీయచరిత్ర 269 - 270 పుటలలో కనిపిస్తున్న దివాన్ బహద్దరు రఘునాథరావు ఉదంతం తెలుపుతుంది. బరోడా దివానుగా ఉండి ఇప్పుడు మదరాసులో స్థిరపడి విధవా పునర్వివాహోద్యమంలో వేలెట్టి వీరేశలింగం తన ఇంటికి పదే పదే వచ్చి తట్టినా తలుపు దీక్షక లోకులకు వెరచి ఉద్యమం నుండి విరమించుకొన్న ఘనుడు.

మాధవయ్య పాత్రకూ, కేశవరాయడు పాత్రకూ నిజ జీవితంలో వీరేశ లింగంతోటీ, వెంకటరత్నం నాయుడితోటీ చాలా పోలికలున్నట్టు, రచయిత వదలిన సూచనలబట్టి, ఇప్పుడు నిర్ధారణ చేయవచ్చు. మాధవయ్యకున్న రావుబహద్దర్ బిరుదు; బ్రాహ్మ సమాజంలో ఉంటూ కూడా శాస్త్రోక్త పద్ధతిలో హైందవాచారాలకు అనుగుణంగానే సంస్కరణ వివాహాలను జరిపిస్తున్నాడని రాజారాం కేశవరాయణ్ణి, మాధవయ్య మీదికి ఎగదోలడం; మాధవయ్య ఎన్నో గ్రంథాలురాసినట్లుగా, వాటిలో ఉపదేశాత్మక లఘు రచనలూ, హేళనాత్మక గ్రంథాలూ ఖండనాత్మకమైనవీ ఎక్కువన్నట్లుగా ప్రస్తావన రావడం — ఒక్క 'సోలిడ్ బుక్కైనా' ఉంటే ఒట్టు! "పిట్టకథలూ పిచిక కథలు తిట్లూ"; "మాధవయ్యగారిది వైదీకపురస్సా, అందులో వేగినాటి సన్యాసం ఆయనకు దేశాన్ని పట్టి అంటింది" వగైరా మాటలు; ఇవన్నీ వీరేశలింగం ముక్కలే: "వితంతు వివాహ సంస్కారం చెడునని కడచిన యిరువదియైదు సంవత్సరముల నుండి యీశ్వర వంచకుడనయి," అనుష్ఠాన బ్రాహ్మలను నిందించుచున్న వారిలాగానే భ్రమలలో చిక్కుకొని, "మత విషయకములైన నా విశ్వాసములను కార్యములలోజూపక యాత్మవంచకుడనయి"నట్లు వీరేశలింగం స్వయంగానే రాసుకొన్నాడు. (స్వీయచరిత్ర, 136–137)

కేశవరాయడికీ మాధవయ్యకీ జుట్లు పందెం పెడితే "ఈ దేశంలో రిఫారం అమాంతంగా రెండు ముక్కలవుతుంది" అని గిరీశం కూడా తెలుసుకొన్న సత్యాన్ని రాజారాం గ్రహించడో, గ్రహించినా పట్టించుకోడో, ఏదో ఒకటి. 'కేశవరాయడు' ఒకచోట 'కేశవనాయడు'గా ఉండడంఅచ్చుతప్పనుకొనేందుకంటె, ఆ పాత్రకు మూలమైనవ్యక్తిని దాచిపెట్టే తొందరలో రచయిత అజాగ్రతఅని అనుకోవచ్చు * అప్పుడు 'నాయడు' సులువుగా దొరికిపోయి రఘుపతి వేంకటరత్నం నాయుడై కూచుంటాడు. నాటకంలోకూడా ఇతడు బ్రహ్మ సమాజనాయకుడే ....మాధవయ్యలాగే ఒక విద్యా సంస్థాధిపతి. సంస్కరోద్యమంలోనేగాక బ్రహ్మ సమాజంలోనూ మాధవయ్యతో పోటీపడగలిగిన తాహత్తు, ఒక్క కేశవరాయడికే ఉందని గిరీశం అంటాడుకూడా.

దీన్నిబట్టి వీరేశలింగంతో వేంకటరత్నం నాయుడు ఘర్షించాడని నిర్ణయించగూడదు. ఇతర — ఇంకా బలమైన — సాక్ష్యాలు కావాలి. ఈ ఘర్షణ లోకం దృష్టికెక్కకపోయినా, ముసుగులో గుద్దులాటగానైనా ఉండేదేమో తెలుసుకొనేందుకు, ఆ నాటి బ్రహ్మ సామాజికుల రచనల నాశ్రయించాలి. వేంకటరత్నం

---

* కన్యాశుల్కంలో సౌజన్యరావును ఒకచోట సంజీవరావు అని పేర్కొనడంకూడా దీనికి ఇంకొక తార్కాణం. అలాగే రామప్పంతులు "లక్ష్మీ. లక్ష్మీ" అని మధురవాణినిపిలుస్తాడు.

నాయుడు విధవా వివాహాలను మొత్తంగా ఒప్పేసుకోక పోయినట్లే, వీరేశలింగం వేశ్యావృత్తి నిర్మూలన విషయంలో విశ్వాసం కనపరచలేక పోయాడని లోగడే సాక్ష్యాధారాలతో సహా చూపడమైంది*. బ్రాహ్మ ధర్మానుష్ఠాన విషయంలో దేశిరాజు పెదబాపయ్య బాపట్లనుంచి వచ్చి తనకు మార్గంచూపేవరకూ, వీరేశలింగం ఊగిసలాడుతూ వచ్చాడని కూడా తెలిసింది. 1905 నుంచి కాకినాడలో పి. ఆర్. కాలేజి ప్రిన్సిపాలుగా ఉంటూవచ్చిన వేంకటరత్నంనాయుడు ఇతర విషయాలన్నిటిలో వీరేశలింగాన్ని బలపరచినా, ఈ అనిశ్చితవైఖరిని హర్షించి ఉండడు. బ్రహ్మ సమాజంలో ఈ హేమాహేమీలకు ప్రత్యక్ష స్పర్ధఏమీలేదు. పంతులుగారు నాయుడు గారికి 'గురు' తుల్యులే; కుర్రకారు సామాజికులకు 'పెద్ద' గురువు, 'చిన్న'గురువులే వీరిద్దరున్నూ: అయినా మత ధర్మవిషయాలలో నాయుడు గారి వాక్కే వేదవాక్కు. రాయసం వేంకటశివుడు తన *ఆత్మచరిత్రము* (పు. 164)లో ఇలారాశాడు:

—వీరేశలింగముపంతులు లౌకికవిద్యయందువలె పారమార్థిక విషయము లందును నా గురూత్తములే. ఐనను,వారి ప్రజ్ఞానైపుణ్యములు సంఘసంస్కరణ రంగముననే ముఖ్యముగ ప్రదర్శితము లగుచుండెను....యింగ్లీషువిద్యయే పరమావధియైన యాకాలపు విద్యార్థులకు, ఆ విద్యలో నున్నతస్థాన మలంకరించిన నాయడుగారి వంటివారు చేసెడి ధర్మ ప్రసంగములే మత విషయములందు ప్రమాణములు

సమకాలిక మహోద్యమాలలో మత విషయాలు సంఘసంస్కరణ విషయాలు దూరి, తత్ఫలితంగా సంస్కరణోద్యమం 1907 తర్వాత మందగించి పోయిన మాట చారిత్రక సత్యమే. ఆ ధోరణి మొగ్గవిప్పుతున్నప్పుడే ఇది ప్రమాదకరమని గుర్తించి తన నాటకంలో ప్రముఖాంశం చేశాడు లోకపరిశీలకుడైన అప్పారావు. మరో విశేషమేమిటంటే, దివ్యజ్ఞాన సమాజం గురించి విసుర్లు. 1901 నవంబరు 15 నాటి అప్పారావుడైరీని చూస్తే, తన మిత్రుడైన శ్రీనివాస అయ్యంగారులో వచ్చిన మార్పుగురించి అప్పారావు బాధపడినట్లు తెలుస్తుంది. "మొదట ఆయన స్వతంత్రయోచనాపరుడైన సంశయవాదిగా వుంటూ, యిపుడు అసంబద్ధమైన ప్రతి దానినీ, విశ్వసించే,** మూఢవిశ్వాసాలను శాస్త్రీయదృష్ట్యా అసంగతంగా సమర్థింప

---

* వేశ్యావృత్తికిగానీ, భోగం మేళాలకుగానీ వీరేశలింగం సుముఖుడని పొరబాటు పడకూడదు.

**కన్యాశుల్కనాటక ప్రారంభంలోనే గిరీశం తన జంఝూప్పోసను పవ్వినియోగంచేస్తూ థియోసఫిస్టులమీద ఒక చెణుకు విసురుతాడు. (ప్రథమాంకం : 1 వ స్థలం)

జూచే, థియొసోఫిస్టుగా మారిపోయినాడు!* అప్పారావు దృష్టిలో బ్రహ్మ సమాజమైనా మేలు: "రేషనల్ రెలిజన్"! "థియాసఫిస్టు మతము వలె పేడా బెల్లం కలిపి మనవాళ్లు సంతోషించడము కొరకు ప్రతి వెర్రి మొర్రి వ్రాతకు సందర్భార్థము కల్పించడమూ, ప్రతి అవక తవక ఆచారమునకూ రహస్య సవబులు, గుణములు కల్పించడము ..." అని రాజారాం విమర్శిస్తాడు. తానొకవైపు "భగవద్గీతాది మహాగ్రంథముల సాహాయ్యమున ఆర్యమతమునకు చిరకాల మావరించిన త్రుప్పును గడగి ఆచార్య నిర్దిష్టకర్మ. వేదాంత మార్గములను చదువరుల కంటికింపుగ గనపర్చ ప్రయత్నిస్తున్నాను" అంటూనే దివ్యజ్ఞానసమాజాన్ని విమర్శించడం, ఆత్మశ్లాఘ, పరనింద. బ్రహ్మసమాజమొక్కటే నాస్తిక్య ప్రవాహానికి ఆనకట్టవేయలేదు. కొత్తపునాదులమీద శిథిలభవంతిని నిలిపి, దివ్యజ్ఞానసమాజం హైందవమత పునరుజ్జీవనానికి మరింత ఉపకరించింది. ప్రపంచంలో పెచ్చు మీర సాగిన నిరీశ్వర వాదానికీ, భౌతిక వాదానికీ అడ్డుకట్టవేసేందుకే, వివిధమతాలకు సామాన్యమైన ప్రాతిపదికలను సమకూర్చుకుని థియాసఫీ ఒక ఉద్యమ ప్రాయమైనట్లు, ఆనీ బెసెంటే రాసింది.

ఈ సంస్కర్తృత్రయం మూలంగా ప్రత్యేకతను చేకూర్చుకొనికూడా, *కొండుభట్టీయం* అసమగ్రమూ, అవ్యవస్థితమూ అయినందువల్ల లోకందృష్టి నాకర్షించ లేదు. నాటకప్రదర్శనానికంటె చలనచిత్రానికి అనువుగా ఉన్నదృశ్యాలు(రైలుసీను), నాతిదీర్ఘ సంభాషణలు, చకచకానడిచి మారిపోయే చిటిపొటి సన్నివేశాలు – రంగ ప్రయోగానికిగల యోగ్యతను తగ్గించి వేస్తున్నాయి.

ఒకే కవి పరంపరగా రెండు బృహత్ రచనలను సాధించలేడనేందుకుగూడా *కొండుభట్టీయం* సాక్ష్యంగా పనికివస్తుంది. *కన్యాశుల్కం* చదివినప్పుడూ చూచినప్పుడూ రాజుగారి పట్టపుటేనుగు గుర్తుకువస్తుంది. మరి, చెల్లాచెదరై పడి ఉన్న ఏనుగుగున్న ఎముకలవలె కొండుభట్టీయ నాటకదృశ్యాలు కానవస్తాయి. అప్పారావు లోని ప్రతిభాసముద్రజలాన్ని అగస్త్యుడు తాగివేసినట్లుగా *కన్యాశుల్క* నాటకం హరించివేసింది. సృజనాత్మక శక్తిని పీల్చివేసింది. పోగా ఆ పిప్పి *కొండుభట్టీయ* రచనకు సామగ్రి. నీరసించినరోగి ఆరోగ్యంకోలుకొంటూ నడిచేందుకై చేసిన దుర్బల ప్రయత్నంవలె, ఇది దయనీయంగా దర్శన మిస్తున్నది.

---

* తర్వాత కొద్ది కాలానికే దివ్యజ్ఞాన సమాజం వారినుంచి శ్రీనివాసయ్యంగారు తప్పుకొన్నట్లు వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి రాసిన జీవితచరిత్రనుబట్టి తెలుసుకోవచ్చును.

అసమగ్రమే అయినా, అంతకంటె ఆసక్తి గొల్పుతూ తృప్తి పరిచేరచన, రెండంకాలు మాత్రమే అచ్చుపడి నిలిచిపోయిన *బిల్హణీయం*. వ్యావహారిక వచనం ప్రహసన రచనకు తప్ప ఉదాత్త విషయ సంపత్తిగలిగి గంభీర భావ స్ఫోరకమైన రచనలకు పనికిరాదు, అని ఆక్షేపించినవారికి జవాబుగా అప్పారావు బిల్హణుని కథను మూడవ నాటకంగా, కొంతవరకు విషాదాంతంగా రాయ సంకల్పించాడని లేఖలను బట్టి తెలుస్తున్నది. "పరిశుద్ధ" వాదులకు అంగీకారముగా వుండేటట్టు శృంగార ప్రాధాన్యముగల ఇతివృత్తమును నాటకమునుచేసి వ్యావహారిక భాషను వ్రాస్తాను అని సంకల్పించి *బిల్హణీయము* యెత్తుబడిచేశారు." అని *కొండుభట్టీయం* అవతారికలో డా॥ బుర్రా శేషగిరిరావు కూడా రాశాడు.

బిల్హణుని కథ స్వకపోల కల్పితం కాకపోయినా, చరిత్రసత్యం కూడా కాని ఒకానొక పుక్కిటి పురాణాన్ని చేబూని క్షీణ ప్రబంధకవియైన చిత్రకవి సింగరార్యుడు రాసిపోయిన తెలుగు కావ్యంలోని అధమ స్థాయి శృంగార ప్రాచుర్యాన్ని తొలగిస్తూ అప్పారావు దానికి నైతిక ఉదాత్తతను చేకూర్చ జూచాడని ఈ రెండంకాలను చదివినా తెలుస్తుంది. సంస్కృత భాషలోని నూటయాభై శ్లోకాలు తెలుగులో మూడాశ్వాసాలే అయ్యాయి. అప్పారావు ఆ జోలికే వెళ్ళలేదు.

> కాశ్మీరంలో పుట్టి చదువు పూర్తి చేసుకొని దేశ సంచారం చేస్తూ దక్షిణ భారతంమీద కూడా కాలు మోపిన బిల్హణకవి గురించి ఒక కథ ప్రచారం లోకి వచ్చింది. లక్ష్మీనగర పాలకుడు పర్మాంది యామినీ పూర్ణతిలక జనకుడని ఉన్నందుచేత, బిల్హణుని కాలానికీ, ఇతని కాలానికీ నూరేళ్ళ 'వార' ఉండి, ఈ కథకు కాళ్ళు లేవనీ, ఇది చారిత్రకం కాదనీ తేలింది. ఎడ్విన్ ఆర్నాల్డ్ (Edwin Arnold) సేకరించి అనువదించిన ఒక సంస్కృత కావ్యంలో, సౌందవ మహారాజ పుత్రి విద్య ం. విద్య చెప్పేందుకు ఏర్పాటై చోరుడనే కవి ఆమెతో గ్రంథం నడిపిన ఫలితంగా ఒకరినొకరు ప్రేమించుకొని పెళ్ళాడవలచు కొన్నారని; మహారాజు కోపించి కవిని చెరసాలలో తోయించి మరణ దండన విధించాడని; చెరలోనుంచి విద్యమీద కవి ఏభై శ్లోకాలు చెప్పాడని; వాటిని విని మహారాజు మనసు కరిగి, కవిని విడిపించి తన కుమార్తెనిచ్చి పెళ్ళి చేశాడని, ఒక కథ ఉంది. మనకు తెలిసిన బిల్హణుని కథ ఇలాంటిదే.

*సంస్కృత కవి జీవితములో* మల్లాది సూర్యనారాయణశాస్త్రి బిల్హణ కవి గురించి ఈ వర్తమానం యిస్తున్నారు. (పు. 368-374) :

*విక్రమాంకదేవచరిత్ర*మనే తన సంస్కృత కావ్యంలో, కాశ్మీ దేశాన, ప్రవరనగర సమీప గ్రామాన, బ్రాహ్మణ కులాన, పండితవంశాన పుట్టి విద్యాబుద్ధులు నేర్చి యుక్తవయస్సు వచ్చాక, దేశసంచారంచేస్తూ ఉత్తర, దక్షిణ ప్రాంతాలలో తిరిగినట్లు బిల్హణుడే రాసుకొన్నాడు. చాళుక్యరాజు ఆహవమల్లు నాస్థానంలో 'విద్యాపతి' బిరుదుపొంది, అతని కుమారుడైన విక్రమాంకదేవుడు రాజయ్యాక ఆయన చరిత్ర కావ్యస్థం చేశాడు. బిల్హణుడు పుట్టింది, శా. శ 950, చనిపోయింది శా. శ. 1030, సంవత్సరాలలో అయి ఉంటుంది.

ఈ కవిగురించి ఉత్తరదేశంలో ఒకటి, దక్షిణదేశంలో ఒకటి కింవదంతు లున్నాయి. మొదటిది ఘూర్జరరాజు వైరిసింహుని కుమార్తె శశికల, లేక చంద్ర లేఖను కామించి, రాజుకోపానికీ శూలారోపణ శిక్షకూ గురై కొన్ని శ్లోకాలతో రాజును మెప్పించి శిక్ష తప్పించుకొని ప్రియురాలిని పెళ్ళాడాడని; రెండవది యామినీ పూర్ణతిలక అనే రాజపుత్రికకు విద్యాగురువై ఒకరినొకరు ప్రేమించు కొన్నాక పైన చెప్పిన విషయాలవంటివే సంభవించాయని.

ఇది నమ్మదగని కథ. ఇతని నాదరించిన అనిహిల్వాడారాజు కర్ణుడు శా.శ. 980ప్రాంతంవాడు; వైరిసింహు డతనికి నూరేళ్ళ ముందటివాడు. కాబట్టి ఇది పొస గదు. *చోరపంచాశిక*లోని ఒకశ్లోకంమాత్రం బిల్హణుడు వధ్యస్థానంలో ఉండి చెప్పినదిగా వాడుకలో ఉంది. విక్రమాంకదేవుని కోపంవల్ల కష్టాలపాలైనట్లు తన కావ్యంలో ఒక శ్లోకం సూచిస్తుంది. "అసహన శీలురైన రాజసన్నిధాన వర్తులు" ఇతనిపై కొండెములుచెప్పి రాజునకు ద్వేషం పుట్టించి నట్లుంది. ఘూర్జరదేశీయుల పరిచయం తనకు సంతాపం కలిగించినట్లు తన కావ్యంలో బిల్హణుడు రాసుకొన్నాడు.

బిల్హణుడు రాసిన *కర్ణసుందరీ నాటిక* ఇటీవలనే లభించింది.

యౌవనకాలంలో సవిలాస విహారి అయి, వార్ధకంలో వేదాంత జ్ఞాని అయి ఉండవచ్చు. యౌవనకాలంలోకూడా బిల్హణుని జ్ఞానాన్నీ సచ్ఛీ లాన్నీ నిరూపించడానికే అప్పారావు తన నాటకాన్ని అలా రాశాడు.

ప్రబంధంద్వారా ప్రసిద్ధమైన కథలో 'శృంగార' నిర్భరత్వాన్ని అటుంచినా, అది విశ్వసనీయంగా ఉండలేదని కట్టమంచి రామలింగారెడ్డి కూడా భావించాడు. "అనాదరణీయమైన కావ్యము" అయినా, "విషయము మంచిది కాదు" అనితోచినా,

"గురువులు శిష్యురాండ్రను మోహించుట అరుదైనను అసంభము కాదు. అట్టి మోహము నాధారముఁ జేసుకొని యామినీ బిల్హణుల చరిత్రమును, విశుద్ధమును సహజశాగుణసంయుతమును అయినతీరున" నవయామిని పేరున రచింపబూనాడు. తన నాయికా నాయకులలో బిల్హణుడు వయస్సు చెల్లినవాడు కాకున్నా కొంతముదిరిన వాడు ధర్మబుద్ధీ, నిగ్రహశక్తీలేని విషయలోలుడు కాడు; యామిని పరిశుభ్ర మనోగతి కలది, మృదుత్వము స్థిరత్వము కలిసిన హృదయము కలది. "భావములు వెన్న. పలుకులు తేనెలు. ధర్మ సంకల్పము వజ్రము వంటిది...." అని వర్ణించి పోయాడు. 46

.... రామలింగారెడ్డి చేయబూనిందల్లా సుప్రసిద్ధమైన శృంగార కథ యొక్క "పరిష్కృతమైన ప్రతియ". అప్పారావు చేసి చూపింది, స్వతంత్ర సృష్టి. కథను పూర్తిగా మలచుకొన్నాడు. బిల్హణుడు రాజపుత్రికను ప్రేమించే సూచనలే లేవు. కాశ్మీర రాజ్యంనుంచి అనిహిల్వాడా ప్రాంతానికి వచ్చి ఉన్న సంపన్న కుటుంబంలోని రణసింహుడనే యువవీరునికీ అనిహిల్వాడా రాజ పుత్రికకూ ప్రేమను కలిగించి పెళ్ళి నడిపించి మాతృదేశానికి సాయపడడమే, మహాకవి ధ్యేయమని తెలుస్తుంది. అతనివద్ద ఆమెనూ ఆమెవద్ద అతన్నీ అగ్గించి కార్యసాఫల్యం చేసుకో జూచినట్లుంది. అయితే విధి ఈ ఆటకు అనుకూలించలేదు. రాజపుత్రి మహాకవిని ప్రేమిస్తుంది. ఇది తెలుసుకొని, రణసింహునే ప్రేమించమని హితవు చెబుతూ యామినికి జాబురాసి, కవి దేశాంతరం పోతాడు. ఇంతవరకు, అసలు కథలోకి దిగకుండానే దాని అంచుల్లో తిరిగినట్లు, నాయికను ఇంకా ప్రవేశ పెట్టకుండా కర్ణమహారాజు ఆస్థాన విశేషాలకే ఆ రెండంకాలు పరిమితమై పోయాయి. అప్పారావు చిత్తు రాసి పెట్టుకున్న ప్రణాళికనుబట్టి, మీద చెప్పిన కథను నాటకీయం చేయ గోరాడని అనుకోవలసి వస్తున్నది....

రాసినంత వరకైనా ఇది గొప్ప రచన. బిల్హణకవికి పెట్టిన భాష కాస్త డాబుసరిగా కనీసం సులభ గ్రాంథికంలా, ఉన్నా, ఈ నాటకంలో అప్పారావు వ్యావహారిక భాషకు అపూర్వమైన ఉన్నతి, సుస్థితీ కల్పించాడు. భమిడిపాటి కామేశ్వరరావు గమనించి చెప్పిన విధంగా, అప్పారావు భాషా శైలి ఇందులో "అరితేరి గట్టి కట్టింది".

భాషకంటె ముఖ్యమైన అంశం, ఈ రెండంకాల భాగంలో కర్ణ మహారాజు ఆస్థాన విద్వాంసుల చిత్రణమే. ప్రధానకథ ప్రాచీనమైనదైనా, ఈ భాగం పరమ

నవీనం: ఎంత నవీనమంటే అప్పారావుకు సమకాలికమైనంత : "రాజపండితుడు," "రాజర్షి" అయిన కర్తృత్వం, ఆనంద గజపతి తప్ప అన్యుడు కాడు. 'చారిత్రక' కథలో కూడా వాస్తవ చిత్రణ చేసినందుకే అప్పారావును మెచ్చాలి. ఆనంద గజపతి ఆస్థానం సరస్వతీ స్థానమే; జ్ఞాన చైతన్యాలతో స్పందిస్తూ వచ్చిన పండిత గోష్ఠిలో ఆయన స్వయంగా పాల్గొని, చర్చల తీరుతెన్నులను నడిపేవాడు. ఆయన ఆశ్రయాన్నీ ప్రాపకాన్నీ కోరి సమీపవర్తులైన విద్యావంతులవల్ల, అప్పుడప్పుడూ ఆయనకు "మనః క్లేశము" కలిగేదని అప్పారావు ఇంకొకచోట రాసే ఉన్నాడు. కొండెములు దబ్బరలు గురించి ప్రాస్తావిక పద్యాలుకూడా ఆరోజుల్లో రాశాడు.

దబ్బరలుం గొండెమ్ములు
మబ్బువలెం గ్రమ్మ మాయమాటల తీపున్
నిబ్బరపు మొండితనమును
నబ్బురమగు విద్యలిచట యధికారులకున్.

"రాజగృహాంతరంబు"లలో "మహోన్నతికి దారులు :" ఒండొరులకు కీడు చేసుకోవడమూ, నిజంగా లేని భక్తినీ అభిమానాన్నీ మాటల్లో చూపడమూ, నాటక మాడడమూ వగైరాలని పేర్కొన్నాడుకూడా. 47 ఆ పద్యంలోని భావాన్నే వచనంలో అనువదిస్తున్నట్లు 'మాటామంతి'లో (పు.153) అప్పారావు రాజాశ్రితుల గురించి కఠినంగానే రాశాడు. ఇతరులకు నష్టంకలిగినాసరే, తమ కోరికలు ఫలిస్తే చాలు. "కొట్లాటలకూ కుట్రలకూ అంతూపొంతూ వుండదు. ఎత్తుకు పైఎత్తువేసి ఎలాగైనా అధికారాన్ని చేజిక్కించుకోవడమే వాళ్ళకు కావాలి." ఆనందగజపతి ఉపదేశించినా, మందలించినా, వాళ్ళ దారి వాళ్ళదే అయింది. అలాంటి పరిస్థితిలో, నిజంగా సత్తా ఉన్నవాడు భంగపడవలసిందే. అందుచేతనే మహారాజా ఒకసారు ఇలాగన్నాడు ;

— ఆత్మబలమున్న వ్యక్తిని మీరు ఈసడించినా, అవమాన పరచినా, అతను మిమ్మల్ని దూషించడు ; మీకు అపకారం చేయడు. కోపగించడు. మీకేదో ఉపకారం చేసి తన ప్రతీకారాన్ని తీర్చుకుంటాడు. అతని వైఖరివల్ల మీకే జ్ఞానం కలుగుతుంది. సజ్జనుని అనవసరంగా తూలనాడితిమని మీరే గ్రహిస్తారు. అదే అతను మీకు కలిగించే వివేకం.

బిల్హణీయం నాటక వాతావరణ మంతా ఈ ఆనంద జగపతి సుభాషితంలో

ఇమిడి ఉంది. బిల్హణ మహాకవే "ఆత్మబలమున్న" సజ్జనుడైన వ్యక్తి. మరి నానా మంత్రిగా దివాను అనంతరావు, పండితమదవేదండంగా ముడుంబై నరసింహాచార్యులు వైయాకరణిగా మండ లక్ష్మీ నారాయణశాస్త్రి, విదూషకుడుగా * ఆస్థాన సంస్కృత నాటక సమాజంలో విదూష పాత్రధారి కర్రా పాపయ్యశాస్త్రి, అప్పారావుకు పాత్ర కల్పనలో తోడ్పడ్డారు. దుష్టుడూ, ధూర్తుడూ అయిన నానామంత్రి బిల్హణుడిమీద కత్తి గట్టడమేమి. ఛాందసపండితులు కవిని కంటగించుకోవడమేమి, ఆచర్చలు, ఆ వాగ్వాదాలు, ఆ మాపోపమి, ఆ రాజానుగ్రహంకోసం పాకులాటలు, సిగపట్ల గోత్రాలు, ఆ సుతిమెత్తని మాటల రాజపండితుని సంకటావస్థలు-అన్నీ అచ్చుకు మచ్చన్నట్లుగా నాటకంలోకి దిగాయి.

ఈ నాటకంగా ప్రథమంగా పేర్కొనదగింది విదూషక పాత్ర. షేక్స్పి

---

* ఇంగ్లీషు నాటకసంప్రదాయానుసారం. ముఖ్యంగా మధ్యయుగాల Morality plays ప్రభావంవల్ల, విదూషకులు (Court-jesters) కంటె ఎక్కువగా వట్టిహాస్యగాళ్ళు (clowns) అవశ్యం. నాటకపాత్రల్లో ఉండేవాళ్ళు. 'ట్రాజెడీ' నాటకాలలో విదూషకులు 'కామెడీ'లలోని హాస్యగాళ్ళకంటె విద్యాధికులు కావడమేగాక, వాళ్ళహాస్యం మరింత నాజూకుగా ప్రయోజనయుతంగా ఉండేది. రాజులు తమ ఆస్థానాలలో కవులను కొందరిని విదూషకుని ఉద్యోగమిచ్చి ఉంచుకోనేవారని చరిత్ర చెబుతున్నది. నిష్ఠురమైన నిజాన్ని హాస్యంలో రంగరించి రాజుల తలల కెక్కించడానికైనా వీళ్ళు అవసరమయ్యేవాళ్ళు. సంస్కృత నాటకాలలోవలె, ఇందులో కూడా విదూషకులు రాజుల "వయస్యులు".

షేక్స్పియరు నాటకాల విదూషకపాత్ర లన్నింటిలోనూ King Lear లోని విదూషకుడే బిల్హణీయంలోని గౌతముని పాత్రకు దగ్గరగా రాగలడు. అక్కడ రాజుకు సన్మార్గోపదేశం చేస్తే ఇక్కడ రాజాస్థానికులకు - అంతేతేడా. విదూషకుణ్ణి తీసివేస్తే, వర్ణచిత్రంలో ఒకరంగును తుడిచివేసినట్లు అవుతుందని బ్రాడ్లీ (Bradley) అంటాడు. ట్రాజెడీకి ఇతని అక్కర ఎంతో వుంది. నాటకకథలో అతి సహజమైన అంతర్భాగంగా ఈ పాత్రరూపొందుతుంది. వట్టిహాస్యం చమత్కారం మాత్రమేగాక, విషాదచ్ఛాయను అలముకొన్నట్లు, కన్నీళ్ళ పర్యంతమయ్యేట్లు ఎండవాన కలిసినరీతిగా ఉత్తమహాస్యంగా (Humour)గా పరిణమిస్తుంది. వ్యంగ్యం ధ్వనించినప్పటికీ. అది జరిగినా అవతలివాడి లోపాలను మొరటుగా ఖండిస్తూ కూర్చోదు.
(SHAKESPEARE : KING LEAR, Verity Edition.)

పోనుపోను నాటకకర్తలు విదూషకపాత్రను తీసివేయసాగినందుచేత (షేక్స్పియరు నాటకాలన్నింటిలోనూ ఈ పాత్రలేదు) దీనిప్రాముఖ్యం 16 వ శతాబ్ది అంతానికి సన్నగిలి పోయింది.

(SHAKESPEARE AN TRAGEDY, A. C. Bradley, P. 310-312

యర్ నాటకాలలోని విదూషక పాత్రల గురించి విశేషంగా చదివి, స్వయంగా సంస్కృత నాటకాల విదూషకుల గురించి తెలుసుకొని ఉండబట్టే, ఈ పాత్రను ఇంత విశిష్టంగా తీర్చిదిద్దాడు రచయిత. అభిజ్ఞాన శాకుంతల నాటకాన్ని అధ్యయనం చేస్తూ వచ్చిన రోజులలో, అతగాని "హాస్యమేమంత గొప్పగా చెప్పుకోదగింది కాదు," అని డైరీలో (1895 ఏప్రిల్ 19) రాసిపెట్టుకొన్నాడు. సంస్కృత నాటక ప్రభావం మూలంగానే ఏమో, వేదం వేంకటరాయశాస్త్రి సృష్టించిన హాస్యపాత్రలు – ముఖ్యంగా ఉషలో – 'బహూనరీ'కి హాస్య చమత్కారానికీ తేడా నెంచలేవని ఒక లేఖలో రాశాడు. ఒక్క మాళవికాగ్నిమిత్ర నాటకంలోనే విదూషకుడు రాజుగారి "నర్మ సచివుడు"గా ప్రయోజనయుక్తమైన హాస్యాన్ని అందిస్తాడు. విద్యాస్పర్ధలెలా విరసంగా వైపరీత్యంగా పరిణమించాయో తెలపడానికి, కాళిదాసు విదూషకుణ్ణి ఆశ్రయించాడు. అభినయ విద్యాచార్యులైన హరదత్త, గణదాసుల అన్యోన్య జయోద్యోగం రసాభాసగా పరిణమించిన సందర్భంలో, "ఇన్నాళ్ళనుండి దివాణమునంబడి పొట్టనింపుకొనుచున్నారు. వీరికి జీతమిచ్చుట దండుగ. ఎట్లో సంగీతాచార్య పదమును సంపాదించి సరస్వతీ ప్రసాదముల నారగింపుచు సుఖముగాం గాలక్షేపము చేయుచున్నట్టి మీకు యీ దిక్కుమాలిన వాదములెందుకు?" అని బుద్ధి గరపుతాడు. 49

బిల్హణీయ నాటకంలోని విదూషకపాత్ర వికట హాస్యానికిగాక సార్థకమైన హాస్యానికే ఉద్దిష్టమైనట్లు కనిపిస్తుంది. మత్సరగ్రస్తులైన పండితులనేగాక, అధికార పదవీ గర్వదుర్విదగ్ధులైన నానామంత్రిసీ లంచగొండి వుద్యోగులనూ గౌతముడు నొవ్వనాడినతీరు మాళవికాగ్నిమిత్ర నాటక గత విదూషకునికే పాఠాలు చెప్పగలదు. ఈ పాత్రయొక్క అవసరం గురించి కర్ణమహారాజే వివరించాడు:

> హద్దుమీరిన మనిషి ఒక్కొక్కడు ఉంటేగాని హద్దుయొక్క గుణాగుణములు తెలియవు. మనవలె ఉచ్చావస్థలోనున్నవారిని స్వేచ్ఛగా తిట్టగలిగినవారిని వకరిని, అచ్చుబోసి వదిలితేగాని మననుగూర్చి లోకం ఏమనేదీ మనకు తెలియబోదు.

విదూషకు డిలా విమర్శకుడౌతున్నాడు; ఇలా హాస్య సత్ప్రయోజనాన్ని సమకూర్చుకొంటున్నది. లోకులు పెదవి విప్పి చెప్పలేని మాటలను నిర్భయంగా హాస్యం నెపానచెప్పి లోపాలు చూపి పరిపాలనను నిర్వక్రం చేయించగలడు. అంతేకాదు– వ్యాకరణ సూక్ష్మాలు మొదలు రాజోద్యోగుల అర్థసంగ్రహణాపహరణ పద్ధతులవరకు

సాధికారంగా మాట్లాడగలిగి, ఈ నాటకకథా సారస్యానికి విదూషకుడే జీవగర్ర కాగ లుగుతున్నాడు. To be witty himself and to stimulate laughter and wit in others is the business of the clown, అన్న పరిమితులేవీ ఈ విదూషకుని పాత్రకు చెల్లవు. హాస్యం యిక్కడ సాక్షాత్తూ ఒక ఆయుధ విశేషం కాగలిగింది.*

ఏ దృక్కోణంనుంచి చూచినా, ఈ రెండంకాల అసంపూర్ణ నాటక ప్రయత్నం దొడ్డమనసుతో చేసిందని చెప్పవచ్చు. కావ్యంలోగానీ, కథలోగానీ, నాటకంలోగానీ వ్యాసంలోగానీ ప్రయోజనశూన్యమైన హాస్యానికి అప్పారావు యెప్పుడూ పూర్తిగా లొంగిపోలేదు. ఒక్కొక్కసారి దాని గట్టిపూపునబడి కొంతదూరం కొట్టుకొనిపోయి ఉండవచ్చుగాని, హాస్యమే అప్పారావుకు పరమావధికాలేదు. సహజంగా హాస్య ప్రకృతి అనికూడా కాదుగాని, సరసమైన హాస్యవైఖరే, లోకాన్ని బోధపరచుకో డానికీ లోకుల్ని దగ్గరతీయడానికీ మానవజాతి భవిష్యత్తుపట్ల ఆశామయమైన దృక్పథం అలవరచుకోడానికీ ఆయనకు సాధనప్రాయమైంది ; రాజమార్గమైంది ; ఔషధ విశేషమైంది ; లేపనమైంది.

1. కన్యాశుల్కం రచన ఎవరిది ? (వ్యా) ; ఏ. వి. జగన్నాథరావు, ఆంధ్రపత్రిక 20-3 1955.

2. ,, ,, ఎవరు ఈ గోమఠం శ్రీనివాసాచార్యులు ? (వ్యా) : ఆరుద్ర, ఆంధ్రపత్రిక 9-4-1955.

3. గురజాడ సమకాలికులు (వ్యా) : వసంతరావు. బ్రహ్మాజీరావు, గు. శ. జం. హై., పు. 25-26.

4. కన్యాశుల్కం రచన ఎవరిది ? (వ్యా) : వసంతరావు, బ్రహ్మాజీరావు. గిడుగు వేంకట సీతాపతి ఆంధ్రపత్రిక, 27-3-1 55.

5. ,, ,, భావం అప్పారావుగారిది - భాష గోమఠంవారిది : (వ్యా) యామిజాల పద్మనాభస్వామి, ఆంధ్రపత్రిక, 10-4-1955.

6. ,, ,, (వ్యా) : రాపర్తి మాకరాజు ఆంధ్రపత్రిక. 23-4-1955.

---

* ఆంగ్లంలో రాయబూనిన 'చిత్రాంగి' నాటకంలో కనుపించే విదూషకుడు సంస్కృత నాటకాలలోవలె మోదకప్రియుడుగా కనిపిస్తున్నప్పటికీ, చిత్రాంగిపై రాజరాజు మోజు పెంచు కోవడంగురించి మందలించి, రాజ్యానికి స్త్రీమూలంగా రానున్న ప్రమాదం గురించి హెచ్చ రించి, ఈ గౌతమునికి బె త్తెడు తక్కువగా ఉండగలుగుతున్నాడు.

7. భారతి రజతోత్సవ అధ్యక్షోపన్యాసము (ఉ): వేలూరి శివరామశాస్త్రి. భారతి జూన్ 1949.

8. కన్యాశుల్క నాటక విమర్శనము (వ్యా): సంపాదకుడు, అముద్రిత గ్రంథ చింతామణి, మార్చి 1897.

9. Preface to the first Edition of KANYA SULKAM (కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు) *G. V. A. (1897) P*...ii.

10. కన్యాశుల్కము (వ్యా): వేతవరపు వేంకట రామకోటిశాస్త్రి: భారతి జూన్ 1955.

11. కన్యాశుల్క నాటక విమర్శనము (వ్యా): శ్రీపాద కామేశ్వరరావు, భారతి ఆగస్టు 1933.

12. కన్యాశుల్కస్థ గ్రామ్యభాషా వాద విమర్శనము: రాళ్ళభట్ల బ్రహ్మయ్యశాస్త్రి పు.1

13. గురజాడ అప్పారావు (ఉ): భమిడిపాటి కామేశ్వరరావు, ప్రతిభ, నవమ వార్షికోత్సవ సంపుటము.

14. A Short History of English Drama: Ifor Evans. Cit. by డా॥ కొత్తపల్లి వీరభద్రరావు: తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము.

15. వేమన: రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. పు. 203.

16. Shakespearean comedy: *H. B. Charlton, P. 50.*

17. సాహిత్యలేఖలు: నాటకగోష్ఠి: గు. ర. లే., పు. 74-75.

18. కన్యాశుల్కంలో లోపాలు (వ్యా): వారం వారం: శ్రీ శ్రీ. నవోదయ 23-5-1948.

19. కన్యాశుల్కరచన (పూర్వోత్తర ప్రతుల పరిశీలన) (వ్యా)-అబ్బూరి రామకృష్ణరావు. గు. శ. జం. హై; పు. 47-48

20. కన్యాశుల్కము: ప్రదర్శన: ప్రశంస: గు. ర. లే;పు. 19

21. కన్యాశుల్కం సమీక్షణ (వ్యా): సోమయాజుల వెంకటరామమూర్తి. భారతి, జూన్ - సెప్టెంబరు 1940

22. చూడు 11.

23. చూడు 10.

24. బైరాగి (వ్యా): వారం - వారం: శ్రీశ్రీ, నవోదయ, 21-3-1948

25. అప్పారావుగారి పంచదార మాత్రలు (వ్యా): ఆరుద్ర, గు. శ. జం. హై: పు. 50

26. నాటకాలు-నా అనుభవాలు - కన్యాశుల్కము (వ్యా) : డా. జి. వి. సీతాపతి, కళావాణి (నాటక ప్రత్యేక సంచిక)

27. వసంతసేన - చింతామణి - మధురవాణి (వ్యా) సెట్టి ఈశ్వరరావు, పరిశోధన, డిసెంబరు, జనవరి 1956

28. కన్యాశుల్కములో స్త్రీ వ్యక్తులు (వ్యా) : శ్రీ శ్రీనివాసరావు, సమదర్శిని ఉగాదిసంచిక, 1932

29. శృంగార చాటువులు : మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, పు. 49 50

30. KANYASULKAM(A critical Analysis) (వ్యా)*S. M. Y. Sastry*, TRIVENI *October 1939*

31. గిరీశం శిలంలోని కీలకం (వ్యా) శ్రీనివాసచక్రవర్తి గిరీశం శకారుడూ : (వ్యా) రాంభట్ల కృష్ణమూర్తి, పరిశోధన డిసెంబరు, జనవరి 1956

32. మహాకవి - మహాపురుషుడు : సెట్టి ఈశ్వరరావు, పు. 26

33. సాహిత్యంలో దృక్పథాలు : ఆర్. యస్. సుదర్శనం, పు. 34 - 47

34. Social Purpose and Telugu Literature (వ్యా) : *Burra V. Subrahmanyam*, TRIVENI. *October 1958*

35. గురజాడ : షేక్స్పియరు (వ్యా) : ఆర్. యస్. సుదర్శనం, భారతి, అక్టోబరు 1962

36. సాహిత్యలేఖలు ; నాటకగోష్ఠి : గు. ర. లే, పు. 79-81

37. కన్యాశుల్కము భాష (వ్యా) : నిడుదవోలు వెంకటరావు, గు. శ. జం. హై

38. కన్యాశుల్కనాటక విమర్శనము : సంపాదకుడు : అముద్రితగ్రంథ చింతామణి, మార్చి 1897

39. గురజాడ వ్యావహారికభాష (వ్యా) ; తెలికచర్ల వెంకటరత్నం, గు. శ. జం. హై పు. 36-37

40. చూడు 32

41. సెల్యులాయిడ్‌లో కన్యాశుల్కం — "గురజాడ" - శ్రీ శ్రీ, పు. 62

42. Shakespeare : *Walter Raleigh, P. 131-132*

43. కన్యాశుల్కములో రసము బీభత్సమే (వ్యా) : అయల సోమయాజుల నరసింహశర్మ, తెలుగుతల్లి ఏప్రిల్ 1945

44. మధురవాణిపాత్ర- ఒకపరిశీలన, పరిశోధన (వ్యా): ఆప్ర్ద: పరిశోధన డిసెంబరు - జనవరి 1956

45. Theosophy: *Annie Besant, P. 9-15*

46. నవయామిని (వ్యా): కట్టమంచి రామలింగారెడ్డి: భారతి, అక్టోబరు 1947

47. మాటల మబ్బులు : గు. ర. ము. పు. 86

48. గు. ర. లే. పు. 97

49. మాళవికాగ్నిమిత్రము , మల్లంపల్లిశరభయ్య అనువాదం, పు. 14-16

# సప్తాశ్వాలు

## లోకాలోకనం

## నవ్వు నాలుగందాలమేలే ననుకొన్నట్లుంది;

1895 ఏప్రిల్ 15 సాయంకాలం మదరాసు ఈవెనింగ్ బజారులో జరిగిన ఘటన గుర్తుకువచ్చి నవ్వుకొంటూ 17 వ తేదీన డైరీ రాసుకొంటున్నాడు గురజాడ అప్పారావు.

— పదిహేనో తేదీని వొకవింత జరిగింది. తలచుకుంటే యిప్పటికీ నవ్వు వస్తున్నది. పచ్చయప్ప కాలేజీలో మీటింగుకు వెళ్ళి యింకా చాలా వ్యవధి ఉన్నదికదా అని 'యీవినింగు బజారు'లో తచ్చాడుతూ వుంటిని. ఒక పుస్తకాల స్టాలువద్ద ఆగి పుస్తకాలను కొనుక్కొంటూ వుండగా అక్కడికొక బికారివంటివాడు వచ్చి, ఆ అంగడివానికొక కళ్ళజోడు అమ్మజూసినాడు. దానిని షాపువాడు రూపాయిన్నరకు అడగగా, వాడు మూడు రూపాయల కిస్తానన్నాడు. నేను రూపాయిన్నర యిస్తానంటిని; వాడు కొంచెము గొణుగుకొని యిచ్చివేసినాడు. అది వెంటనే కళ్ళకు పెట్టుకొని చూసితిని. సరిపడలేదు. ఎట్లు సరిపడును? నాకప్పటికి చత్వారమూలేదు; హ్రస్వదృష్టిలేదు. బూట్సు, స్పెక్టికల్సుతో యేదో లేనిఘనత వొకటి కొత్తగావచ్చి పడ్డట్లు, మహా దర్జాగా అవి కళ్ళకు అలంకారంగా వుంచుకొని కాలేజీలోకి వెళ్ళబోయినాను. కాని ఆ కళ్ళజోడులో దూరపుచూపున కొకముక్క, చదవడమున కొకముక్క అతికి వుండడముచేత, దృష్టిచెదరి మెట్లమీదనే, ద్వారములోనే జారి చాలా హాస్యాస్పదముగా చతికిలబడి పోయినాను![1]



తన రూపంగురించి నవ్వుకొన్నాడు; తన రచనా పద్ధతి గురించి నవ్వుకొన్నాడు; అలా నవ్వుకొంటూ నవ్వుతూ, నవ్వులమంచి జీవితం గ్రహించే స్వకీయం మని చెప్పదగిన నవ్వతత్వమొకటి రాబట్టుకొన్నాడు. అప్పారావుగారు తానెంత

హాస్య ప్రసన్నుడో, అంత గంభీరుడు - భయంకరుడు కూడాకదామరి! * అణు సన్నిభమైన దేహాన, అజాండ మంతటి మనస్సు. తత్త్వమనే సౌధాంతర్భాగానికి ద్వారబంధా లనదగిన ఆసక్తీ, అద్భుతపూర్వమైన దృష్టి చిన్ననాటినుంచి ఆయనకు ఆస్తిపాస్తులుగా ఉండినట్టివేగాని, తెచ్చి గుచ్చుకొన్న ఈకలుకావు. ఏకొత్తది కనిపించినా, దానిగుట్టుమట్లు తెలుసుకొందామనే కోరికఉండింది కనుకనే, అవలీలగా పరిచిత వస్తువులనుంచి కూడా వింతలు వెలువడేవి దానికితోడు, మహారాజావారి కళాశాలలో ఎఫ్. ఏ. బి. ఏ. తరగతులకు తత్త్వశాస్త్ర పాఠాలుకూడా బోధించ వలసి వచ్చింది. శాస్త్ర పాండిత్యమనేది ఇలాస్వచ్ఛంద తాత్త్విక సిద్ధాంత ప్రతి పాదనకు ప్రాతిపదికగా ఉపకరించింది. ఇక, ఆనందగజపతి సాంగత్యం ఈ విధంగా కూడా ఆయనకు లాభించింది. బేకన్ (Francis Bacon) మొదలు న్యూటన్, లాక్‌లమీదుగా (Newton ; Locke) మిల్ (John stuart Mill) వరకు ప్రవాహ ప్రాయంగాసాగిన ఆంగ్లేయ తాత్త్వికచింతన ; ఓగుస్త్ కోంట్ (Auguste Comte) వంటి ఫ్రెంచి, ఇమ్మాన్యుయల్ కాంట్ (Immanuel kant) వంటి జర్మన్

---

తెలుగు హాస్యము అనేగ్రంథంలో ముట్నూరి సంగమేశం, ఎం. ఏ. గారు గుర జాడ అప్పారావు హాస్య చతురతను ఇలా వర్ణించారు (పు. 160-161)

— నాటకకర్త గురజాడ అప్పారావుగారు లౌక్యులు. వ్యంగ్యహాస్యం అతి సరసంగా ప్రయోగింపగల చతురులు. వీరిలోగలవిశేషం, దోషాన్ని చూపెడతారుగాని దానిపైతీర్పు వ్యాఖ్యా నించరు. దోషాన్ని తిరస్కరించడంకూడ ఎక్కడో ఎప్పుడోగాని చేయరు.... అసలీ రచ యిత వ్యంగ్యప్రయోగంలో జాణ. లోకవృత్త మెరిగిన లౌక్యుడు. వికృతి నెరిగి చిటికలో చూపగల నేర్పరి. మానవ స్వభావాన్ని, తద్గత లోపాల్ని ఎరిగి, తదనుకూలమైన పరిస్థితులు కూర్చి, అనువైన వాతావరణంలో పాత్రల్ని నిలబెట్టి, ప్రపంచాన్నంతటినీ ఓ అద్దంలోకి తెచ్చి, తనకు నచ్చిన వంపులో అద్దాన్ని త్రిప్పి కావలసిన విధంగా వికృతిని ప్రతిఫలింపజేసి చూపగల చతురుడు ... హాస్యం అతిమృదువైన వ్యంగ్యాన్ని ఆశ్రయించి నడిచే రకం. 'అయ్యోపాపం' అనిపించి నవ్వించడమేగాక, పోనీలే, అనిపించి నవ్వించడంకూడ వీరి వ్యంగ్యహాస్యంలో రూపిస్తాయి. పాత్రలను మూర్ఖులుగాజేసి చూపి నవ్వించడంతోబాటు అల్లరి, హంగామ, అసందర్భ ప్రలాపం వగైరాలు చూపి నవ్వించడంకూడ వీరి హాస్యంలో జాగా చేసుకున్నవే...

ఇలా పెంచుకొంటూ పోవచ్చు. సామర్సెట్ మామ్ (Somerset Maugham) చెప్పి నట్లు, హాస్యకారుడు తేనెటీగలాంటివాడు, ఒక పుష్పాన్ని సమీపించి దాని మకరందాన్ని పీల్చి మరొక పుష్పానికి వెళ్ళిపోతాడు; కాస్సేపు ఆగి ఝుంకారంచేసి మరీపోతాడు. అంతేగాని, దాని వద్దనే నిలచి రొదపెట్టి విసుగు కలిగించకూడదు. అప్పారావు హాస్యం ఇలాంటిది.

తాత్త్వికుల భావధార; కడపటికి నార్వేజియన్ నాటక కారుడైన హెన్రిక్ ఇబ్సెన్ (Henrik Ibsen) రచనలనుంచి పిండుకొన్న నూతన భావ పయస్సు-ఇవన్నీకలిసి గురజాడ అప్పారావు అభిప్రాయాలనూ అనుభవాలనూ తీర్చిదిద్దాయి. భారతీయ మైన ముఖ్యంగా హైందవమైన - మత తత్త్వం అస్తినిష్ఠంగానేగాక, అధ్యయన ఫలితంగా కూడా ఆయనకు సంక్రమించి ఉండనేఉంది. బౌద్ధమూ క్రైస్తవమూ ఆయన అభిమానాన్ని చూరగొన్నాయి. సమకాలిక మతోద్యమాలు - బ్రహ్మ సమాజ దివ్యజ్ఞాన సమాజాల ఆశయ, కార్యాచరణలు - ఆయన విమర్శకు అగ్గ మయ్యాయి. నేరుగా వివేకానందస్వామిని కలుసుకోకున్నా, ఆయన శిష్యులలో ముఖ్యులైన వాళ్ళనిద్దరిని మద్రాసులోకలిసి మాట్లాడినట్లు, అప్పారావు డైరీల నుంచి తెలుస్తున్నది ఇలా ప్రాచ్య పాశ్చాత్య, ప్రాచీన నవీన, మత తత్త్వాలను ఆయన ఆకళించుకొన్నాడని నిర్ధారణచేసి చెప్పవచ్చును.

లోక దర్శన మనేది ఏదీలేని రచయిత మాత్రుడైన వ్యక్తి ఎంతటి శిల్ప ప్రావీణ్యంగలవాడైనా అలాంటి వానికీ, తన రచనల కన్నిటికీ పూసలలో దారంలో అలాంటి దర్శనాన్ని మూలకందం చేసుకొన్న అప్పారావుకూ, ప్రధానమైన అంతరం కనిపిస్తుంది. ఆయన వట్టి రచయిత మాత్రమేకాడు. భావనాబలానికి దన్నుగా తాత్త్విక ప్రకర్ష నిలిచి, ఆయనను మహారచయితలకోటిలో చేరుస్తున్నది. "భావించడం నా ముచ్చట, ఆలోచన నా బలం"2 అన్న వ్యక్తి సామాన్యుడు కాడు: 'భావాంబర వీధి'లో రెక్కలు గట్టుకొని ఖేచరుడై సంచరిస్తూనే, గట్టినేలమీద కాలుమోపి పరిసరాలతో కలగలిసి భూచరుడూ కాగలడు. కవీ, తత్త్వవేత్తా కాగలిగాడు అందు చేతనే.

క్రీ. శ. 15వ శతాబ్దినాటికి యూరపులో బయల్వెడలిన 'రినేజాన్సు' ఉద్యమ సత్ఫలితాలను సరిగానే గుర్తించినట్లు, అప్పారావు రచనలే సాక్ష్యం పలుకు తున్నాయి. అది మానవతావాదాన్ని లోకవృత్తంలో పునః ప్రతిష్ఠించింది. గ్రీసు ప్రాభవ కాలాన డెమాక్రిటస్ (Democritus) ప్రభృతి తాత్త్వికులు లేవదీసిన ఈ తాత్త్వికవైఖరి, సృష్టిలో మానవుణ్ణి మకుటధారిని చేసిగానీ విడవలేదు. 'రినేజాన్సు' కాలానికి అది సమగ్రమైన తత్త్వసంప్రదాయమే కాగలిగింది. మానవతావాదం, మాన వీయ ప్రేమకూ ప్రకృతి ప్రియత్వానికీ దారిచూపింది. బస్తీలూ, నగరాలూ ఏర్పడి నాగర మేధావి వర్గం, పారలౌకికమైన మధ్యయుగీన మత భావనకు పెడమొగం పెట్టి, ఐహికమైన ప్రకృతినీ, మనిషినీ తన ఆలోచనలకు కేంద్ర బిందువుగాభావించు

కొన్నది. అది నిరీశ్వరవాదంగానో మత ద్వేషంగానో పరిణమించలేదు గాని, మత వ్యవస్థలోగల లోటుపాట్లను విమర్శింప బూనుకొంది. ధార్మికమైన జీవన విధానాన్ని ఉపదేశిస్తూనే, సర్వతోముఖమైన జీవితాన్ని వరణీయం చేసినందువల్ల, శరీర సంబంధమైన వాంఛలుకూడా సహజమైనవీ, సంతృప్తి పరచదగినవీ అనికూడా బోధించింది. క్రైస్తవ మత వ్యవస్థలో అంతవరకు ఆత్మకిచ్చిన ప్రాముఖ్యం దేహానికి గూడా ఇవ్వదగునని భావించింది. ఇంద్రియ సుఖాలు విడువదగినవికావు. అతిలోలత్వమే గర్హింప దగినది అని అప్పారావు అన్నప్పుడూ, ఇంద్రియోన్మూలము కన్న ఇంద్రియోన్మేషమే మేలని కట్టమంచి రామలింగారెడ్డి అన్నప్పుడూ, ఈ మానవతావాద దృక్పథమే వారినలా అనిపించింది.

అంతేకాదు. మనిషి భగవంతుని బానిసకాదు; మానవ భాగ్యవిధాత మిన్నులలో ఎక్కడో ఉన్నా, మనిషికి తనదని చెప్పుకోదగిన స్వచ్ఛందమైన ఇచ్ఛాశక్తి (Free Will)ఉన్నది. దానితోడ్పాటుతో అతడు బాగుపడనూవచ్చు, చెడిపోనూవచ్చు; అతని భవిష్యత్తు స్వహస్తగతమై ఉన్నది; అతను కీలుబొమ్మకాదు-ఈభావాలుకూడ మానవతావాదంకిందికే వస్తాయి. అందుచేతనే వాల్టర్ పేటర్ (Walter Pater) 'రినేజాన్స్' మహోద్యమాన్ని, A many-sided but yet united movement in which, in various ways, the human mind wins for itself a new kingdom cf feeling and sensation and thought, not opposed to, but beyond and independent of, the spiritual system then actually realized' అని నిర్వచించాడు.[3] ప్రాచీనగ్రీక్, రోమన్ సాహిత్యపఠనంద్వారా ఆధునిక యుగీన యూరపుకు లభించిన లోకదర్శన మిలాంటిది కనకనే, చిత్రకళలోనూ, శిల్పకళలోనూ సాహిత్యంలోనూ, జీవితంలో కూడాను, ఈ ఐహిక దృక్పథానికి అపూర్వమైన ప్రాచుర్యం లభించింది. నాటక రచన విస్తారంగా అభివృద్ధి చెందడానికి తోడ్పడిన భౌతిక, భావ పరిస్థితులు కూడా ఇవే. అలాగే మానవీయ విషయాలకు (Humanities) విద్యాప్రణాళికలలో మేధావుల పథకాలలో ప్రాముఖ్యం వచ్చింది. తర్కంకంటె కవిత్వం ఆదరణీయమైంది. మానవుడి హేతుచింతన, పరతత్వ విషయాలకుగాక, ఐహిక, లౌకిక విషయాలకు అంకితం కావలెననే విపరీతపు బుద్ధికలిగింది. గవేషణ, సాధన, నిత్యనూతనానుభవ తృష్ణ, సాహసికమైన ప్రజ్ఞ, ఉపజ్ఞ, ఈ యుగంలో మహామనస్కులందరి సాధారణ లక్ష్యాలయ్యాయి. హేతువాదం (Rationalism) కొత్తగా తలెత్తింది. ఇలా ఒక నవోషస్సు యూరపుఖండాన్ని అనుగ్రహించిన కాలమది. దాని వెలుగులోనే

యూరపుఖండపు భౌతిక, మానసిక జీవితాలు ఈనాటివరకూ రూపురేఖలు సంతరించు కొంటున్నాయి.

ఇంగ్లీషు చదువుల ధర్మమా అని, ముఖ్యంగా విజ్ఞాన శాస్త్రేతరాలైన మాన వీయ విషయాలకే (Humanities) విద్యా ప్రణాళికలో ప్రాముఖ్యం ఉంటూ వచ్చి నందుచేత, మనదేశంలోకూడా యూరపియన్ 'రినేజాన్సు' లాంటి భావ సంచలనమూ కళాపునరుజ్జీవనమూ కలిగాయి. అయితే దీని ఫలితాలు ఆంగ్ల విద్యాధికుల వరకే పరిమిత మయ్యాయి. వాళ్ళు ఈ జనసముద్రంలో తరంగ ప్రాయులుకూడా కారు, బిందుమాత్రులు. వాళ్ళలోనూ పైపై మెరుగులేగాని ఆ ఉద్యమం అస్థి మూలాల వరకూ చొచ్చుకొని పోకపోయింది. అంతేకాదు. అతి సనాతనమైన హైందవ మతం ఎంత శిథిలావస్థలో ఉండినా, అది ఈ 'మ్లేచ్ఛ' ప్రభావాన్ని తన ఉనికికీ మనికికీ పెను సవాలని గ్రహించి, త్వరలోనే కలదెలుసుకొని ఇల్లు చక్కబెట్టుకో సాగింది. ఆంగ్ల విద్యావంతులలో ఎక్కువమంది, అటు సంపన్న వర్గానికీ ఇటు నిత్య దరిద్రుల కూటానికీ చెందని మధ్యమ వర్గీయులైనందుచేత, పాశ్చాత్య భావాల వైపు వ్యామోహం ఏటికి లాగుతుంటే సాంప్రదాయిక భావాలపట్టు కోటికి లాగి, వాళ్ళచేత తొక్కిసలాట ఆడించి, చివరకు ఆ పరస్పర విరుద్ధ ధోరణులను సమన్వ యింప జూచేట్లు చేసింది. ఫలితం, అదీగాక ఇదీగాక, రెండింటి కలగలుపు ఈ కలగలుపుడు మిశ్రపదార్థంలో ఒద్దిక లోపించింది. భార్యాభర్తల అనుకూల దాంపత్యం వలెగాక పోష్య పోషక భావమో అధిక అల్పవస్తు భావమో మిగి లింది. అవి రెండూ సమవుజ్జీ గాకపోయె: ఒకటి మాదరమాగి కుళ్ళిపోనున్న ఫలంవంటిదికాగా, రెండవది దోరగాయ. అందుచేతనే వేదాలవరకూ ఉపనిషత్తుల వరకూ వెళ్ళి వాటి ప్రాణసారాన్ని ప్రస్తుత శిథిలాంగాల కెక్కించే ప్రయత్నం చేయవలసి వచ్చింది. కాబట్టే ఆధునికకాలాన (1850 తర్వాత) భారతీయ మేధో జీవితంలో సహజ పురోగతి లోపించిందని ఒక ఆధునిక విమర్శకుని తీర్పు.4

అప్పారావు యుక్తవయస్కుడయేనాటి పరిస్థితులివి. "కొత్తపాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా" తూర్పు "బలబల" తెల్లవారుతూన్న వేళలో "యెక్కడో పోక చెట్టుమాటున", "ఆకులందున అణగిమణగి", మేలుకొలుపులు కూస్తూన్న కోడిపుంజుల కొక్కొరోకోల నడుమ "కవితకోవిల"లా గళమెత్తి కలం పట్టిన మనిషి ఈ భావసంఘర్షణ నెలా దర్శించాడనేదే ప్రస్తుతాంశం.

## పొట్టకూటికి నేర్చువిద్యలు
## పుట్టకొట్లు కదల్చెనా ?

....అంటూ ఒక పల్లెటూరి 'ఉత్తమా ఇల్లాలు' తన పెనిమిటిని అధిక్షేపిస్తూ, సగం ఆశ్చర్యం సగం ఆగ్రహంగా ముక్కున వేలేసుకోవడమూ నోరు నొక్కుకోవటమూ ఒక్కుమారే చేసి చూపింది. "కోటపేటల నేల గలరని" వఠి భౌతిక లాభాపేక్షతో పెద్దలు ఇంగిలీషు చదువులు చెప్పించారు. అదేమీ చేకూరకపోగా, పెద్దలయొక్క పెద్దల కాలంనుంచి నిరంతరాయంగా అప్రతిద్వంద్వంగా వస్తూన్న నమ్మకాలనే ఈ చదవరులు తగుదుమమ్మా అని ఎదిరించి ప్రశ్నించి నిగ్గదీస్తున్నారు ఇంగ్లీషువాళ్ళ కల్లనొల్లరుట, వాళ్ళ చదువులు నతికి తాము వస్తుతత్వమేమిటో నేర్చారుట! ఏంపితప కాలమూ ఏంపితప బుద్ధులూ, హుంవ్వ!....

పాశ్చాత్య విద్యవల్ల మేధో జీవిత పరిస్థితిలో కొంత సంచలనం కలిగిన మాట నిజమే. నిలువ నీటి మడుగై కూర్చున్న భారతీయ సాంస్కృతిక జడతలో పొడిరాయిగా అది కొంతైనా కదలిక కలిగించింది విశ్వాసం, అధికారం, అణకువ, సంప్రదాయం, అనుసరణ వగైరా మాటల వెనకనున్న మనస్థితి స్వతంత్రమైన ఆలోచనను ప్రోత్సహించదు సరిగదా, వైరభావంతో పట్టి పల్లార్చ జూస్తుంది. మరి, ఆంగ్ల విద్య ద్వారా కొద్దిమంది, "మేధావుల"కైనా సంక్రమించింది, ప్రశ్నించే ఈ స్వభావమె ననాలి. ఏనాడు ఫ్రాన్సిస్ బేకన్‌లాంటి తాత్త్వికులు De Omnibus Dubitandum అనే లాటిన్ సూక్తిని ఎత్తిపట్టి, ప్రకృతినీ పరిసరాలనూ ప్రతిఒక్కదాన్నీ ప్రశ్నించ మొదలెట్టారో, ఆ నాటినుంచి విజ్ఞానశాస్త్రం అంగలు వేసుకొంటూ మునుసాగిందాయె! అపౌరుషేయమనో 'రెవెలేషన్' అనో మతగ్రంథాలను ఒప్పేసుకొని వట్టి విశ్వాసాన్ని మాత్రమే చూపెట్టే వైఖరికి భిన్నంగా, 18 వ శతాబ్ది యూరపులో 'హేతువాదం' (Rationalism) బయల్దేరి, హేతుబుద్ధి పెట్టే పరీక్షకు నిలవని మత విశ్వాసాలను నిరాకరించేంతవరకూ వెళ్ళిందాయె! ఇంగ్లీషు చదువులద్వారా, దారినబోయే ఈ శని మనఇంట్టికే వచ్చినట్లయింది. "ప్రశ్నించే స్వభావం లేనపుడు గుడ్డినమ్మకాలు కలుగుతూవుంటాయి"[5] అంటున్నాడు అప్పారావు. అలాంటివి ప్రమాదకరమైనవట. అణకువ అనేది సుగుణంగాకపోగా, పిరికితనానికి లక్షణమట. కార్యకారణ సంబంధజ్ఞానం ఈ నమ్మకాలకు

విరుగుడౌతుందట. వ్యక్తిత్వాన్ని పోనాడుకొని ఆలోచనను స్తంభింప జేసుకొని వీటివెంట గతానుగతికంగా నడిచి పోవడం, ఆత్మహననమే కాబట్టి, ఇంగ్లిష విద్య ద్వారా చాలామంది యువకులు మత విశ్వాసాల మితులను మీరి "అభివృద్ధి" ఉప్ప తున్నారని సంతుష్టి పడుతున్నాడు కూడా.

అప్పారావు ప్రత్యేకత అది మాత్రమే కాదు. ఆంగ్ల విద్య భారతీయులకు ఆశించినంత సత్ఫలితాలను సమకూర్చలేక పోతున్నదని, అధ్యాపకుడుగా విద్యా విషయజ్ఞుడుగా ఆయన గ్రహించ గలిగాడు. వేషభాషలూ, పద్ధతులు మారినంత మాత్రాన, ఆంగ్ల విద్యార్థులలో భావ పరివర్తన కలిగిపోయినట్లేనా ? అనుకరణకూ స్వతంత్ర కార్యకరణకూ తేడా ఉంది. విద్య కలిగించగల మార్పు వేషాదికాలలోనే కాదు ; అంతరాంతరాలను అది సంస్కరించ గలగాలి. అప్పుడే అది విద్య అవుతుంది. పాతకొత్తల సంధింపులో పాతంటే రోత, కొత్తంటే రోఁకు కలిగి ఉత్సాహులూ తొందరపాకులూ, ఆత్రగాళ్ళూ అనుకరణప్రియులూ ముందుకు వస్తారు. ఈ తొలి తీవరింపు తగ్గి, స్తిమితం ఏర్పడితేనేగాని, కొత్తలోని సత్తా ఏమిటో తెలిసిరాదు. నిలకడ కలిగి విలువలపై దృష్టి పెరిగేందుకు, కొన్ని తరాల విద్యార్థులు తలా కాస్త తోడ్పడాలి, ఈ ఆలోచన కలిగే, అప్పారావు విద్యా సమస్యలపై గూడా ఆసక్తి చూపెట్ట సాగాడు.

అన్నిటికంటె ఎక్కువగా విద్యా విషయాలే తనకు ముఖ్యమైనవని రవీంద్రుడనేవాడట. అలా అనలేదుగాని అనుకొన్నాడు. అప్పారావు * విద్యాసమస్యలపై ఆయన ఆసక్తి తాటాకు మంట వంటిదికాదు. అధ్యాపకవృత్తిలో ఉండినప్పుడు సరేసరి, తదనంతరకాలంలో ప్రాణావసాన వేళవరకు గూడా _ ఉగవచ్చిన నాటినుంచీ పొగజూరిన నాటివరకున్నూ – అప్పుడప్పుడు జ్వాలాజిహ్వికలు సాచి విద్యారణ్యం వంటి పరిసరాలను సోకి ఉజ్జ్వలమూ నిర్మలమూ చేసిన శాశ్వత దీప్తి.

పాశ్చాత్య సంస్కృతి దిగబారివచ్చిన అర్ధ శతాబ్ది తర్వాత కూడా దేశంలో స్వతంత్రమైన ఉత్తమ సాహిత్య కల్పన బహుళంగానూ అవిరళంగానూ జరగడం లేదంటే, విశ్వవిద్యాలయ విద్య నిష్ఫలమై పోయిందనే అర్థమని అనుకొన్నాడు. ఆంధ్ర సాహిత్య బోధనాపద్ధతులు సరేసరి, ఆంగ్లంలో బోధనా పద్ధతులు కూడా

---

* యూనివర్సిటీ లిచ్చే డిగ్రీలపట్ల అప్పారావుకు పెద్ద సదభిప్రాయం ఉండేదికాదు. The world's best men are not university men అనేవాడట. పండితులలో గూడా ముదిరిన ఈ 'డిగ్రీ'ల పిచ్చిని జ్వరంతో పోల్చేవాడు చెళ్ళపిళ్ళ.

నాసిరికంగానే ఉన్నాయని విమర్శించాడు. విద్యార్థుల విమర్శాశక్తి పెంపొందేట్లుగా 'విమర్శగా' బోధించడం మానివేసినందుచేతనూ, స్వతంత్ర యోచనాశక్తిని పురికొల్పేట్లుగా బోధనాక్రమం రూపొందనందువల్లనూ, స్వదేశీయ సాహిత్యంలో జవసత్వాలు కనిపించడంలేదని, బెంగుళూరులో ప్రొఫెసరు వెయిట్‌కు మనస్సు విప్పిచెప్పాడు.6 'ఒరిజినాలిటీ' లేదు, లేదు అని అంటే, ఆకాశంనుంచి ఊడి ఒడిలో పడుతుందా అది? ఉపాధ్యాయులకున్న ఒరిజినాలిటీ ఏపాటి? పాఠ్యగ్రంథాలకు అర్థ తాత్పర్యాలురాసి 'ఎడిట్' చేసుకోవడమూ, కాంపోజిషన్ పేపర్లు తయారు చేసుకోవడమూ తప్పితే, వీళ్ళు పొడిచిగెలుస్తున్న దేమిటి? ఉపాధ్యాయులను బట్టి విద్యార్థులు: బోధనా క్రమాన్నిబట్టి ఉపాధ్యాయులు: "విద్యా విధానమే దుష్టము, లోపభూయిష్టము"7 అనే తీర్పును మాతృ భాషాబోధనకేగాక ఆంగ్ల సాహిత్యబోధనకు, చరిత్ర బోధనకు గూడా అనువర్తింప జేయవచ్చును. అభిరుచి మరెలా ఏర్పడుతుంది? గొప్ప గొప్ప గ్రంథాలను పాఠ్యాలుగా ఎన్నిక జేయక పోయిరి;వస్తు విన్యాసంలోనూ శిల్పంలోనూ శైలిలోనూ అధమస్థాయికిచెందిన వాటిని విద్యార్థులు చదవవలసివచ్చె; ప్రతిభావంతులకు విద్యాలయాలలో ఏ ఆకర్షణా కనిపించక, గౌరవ ప్రదమైన లాభదాయకమైన వృత్తులకు ఎగబడుతూఉండిరి; పూదోట కావలసిన విద్యారంగం చిట్టడవిగా ఉండక? బాటలు తీర్చేనాథుడూ నాయకుడూ ఏడీ?

ఇలా సాగింది అప్పారావు ఆలోచన. ఉపాధ్యాయులకు తగిన శిక్షణ ఇవ్వాలి. మాతృభాషలకు గూడా ప్రొఫెసరు షిప్పులు ఏర్పాటు చేయాలి. పాఠ్య క్రమాన్ని ఆధునిక యుగావసరాలకు అనుగుణంగా నవీనం చేయాలి. విద్యావిషయిక సమస్యలను చర్చించుకొని 'పబ్లిక్ ఒపినియన్' (Public opinion) సృష్టించి సంస్కరణలకు అనుకూలమైన వాతావరణాన్ని కలిగించేందుకు, పట్టభద్రులు సుసంఘటితం కావాలి. అర్హతలనుబట్టి మాత్రమే విద్యాసంస్థలలో ఉద్యోగావకాశాలుండాలి. విశ్వ విద్యాలయాలలో పరిశోధనను ప్రోత్సహించేందుకై విద్యార్థులకు 'ఫెలోషిప్స్' ఇప్పించాలి.'ప్రైవేటు మేనేజిమెంటు'కు విద్యా సంస్థలను అప్పగించ గూడదు. మాతృభాషా విషయంలో, కృతకమూ, నిరర్థకమూ అయిన గ్రాంథికాన్ని తొలగించి, తద్వారా "రొడ్డ కొట్టుడు" చదువులకు గల అవకాశాలను తీసివేసి, బహుళార్థసాధకమైన వ్యావహారికంలో రచించేందుకు విద్యార్థులకు తరిఫీదు నివ్వందే, సంపన్నమైన స్వతంత్రమైన సాహిత్యం దేశభాషలలో ఫలింపుకు రాబోదు.

ఒకొక్కటీ ఒకొక్క నినాదం లాగా వినిపిస్తున్న ఈ విద్యా సమస్యలు జాతి పురోగతికి బాటలని అప్పారావు ఎంచాడు. పాఠ్యక్రమాన్ని నవీనం చేయడానికి. భాషా సాహిత్యాది మానవీయ విషయాల (Humanities) మీదనే కేంద్రీకరించి, విజ్ఞానశాస్త్ర విషయాలను నిర్లక్ష్యం చేయగూడదని గమనించనైతే గమనించాడు గాని, కట్టమంచి రామలింగారెడ్డి ఆ విషయమై చూపిన తొందరబాటును హర్షించలేకపోయాడు. దేశీయులలో శాస్త్రవిజ్ఞానాన్ని వెదజల్లాలి. నిజమేగాని భాషాసాహిత్య విషయాలకూ శాస్త్ర విషయాలకూ పోటీ బెట్టి వాటి స్థానే ఇవి వచ్చి కూర్చోవాలనడం తగని పనిగా భావించాడు. *విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి* వెలువరిస్తూ వచ్చిన 'శాస్త్ర' గ్రంథాలు ఆ పేరుకే తగవు: ఆయా రంగాలలో పరిణతులైనవారు రాసినవి కావవి; కొన్ని అనువాదాలు; మరికొన్నిటిని రాసినవాళ్లు ఇంకా విద్యార్థిదశల్లోనే ఉండినవాళ్లు: కాబట్టి ఇలాంటి 'శాస్త్ర' గ్రంథాల ద్వారా మేలుకంటె హెచ్చుగా కీడే కలుగవచ్చునని *ఆధునిక ఆంధ్రవచన రచన* అనే విద్యా సంబంధి నివేదికలో అప్పారావు చెప్పాడు. "తెలుగులో వెలువడుతున్న సైన్సు గ్రంథాలను పోషించవలసినది మన దేశ ప్రజలు. వీటిని హెచ్చుగా ఆదరించవలసినదిగా విశ్వవిద్యాలయాన్నే కాక, దేశీయులకు శ్రీ రెడ్డిగారు విజ్ఞప్తి చేయవలసి వుంటుందనుకుంటాను. వెర్నాక్యులర్ టెక్స్టు బుక్కుల ద్వారా ఇస్కూలు విద్యార్థులకు సైన్సును బోధించడంవల్ల. అవి ఎంతవరకు ఉపయోగకారి అనే విషయమై దేశభక్తులకూ, విద్యావేత్తలకూ తీవ్ర అభిప్రాయ భేదాలున్నవి. అయినప్పటికీ వాటి నావిధంగా పిల్లలకు బోధించవలెనని శ్రీ రెడ్డిగారు వాదించవచ్చును. అందులో "తప్పేమీ కనిపించదు" 8. ఎక్కువగా భాషా సాహిత్య విషయాలనే ప్రస్తావించినా, శాస్త్ర విద్యను అప్పారావు చూచింది తక్కువ చూపేమీ కాదు.

ఈ విద్యా సంస్థలనుంచి జీవిత సముద్రంలోకి దిగబారి వచ్చిన మనుషులు, లేవి పోని భేషజాన్ని చూపుతూ సామాన్య ప్రజలనుంచి కేటాపడి స్వాధిక్యభావం పెంచుకొని, ఆంగ్లేయులతో సరితూగ లేకా, దేశీయులతో సమాధానపడలేకా రెంటికీ చెడుతున్నారని, అప్పారావు ఎంతో బాధను ప్రకటించాడు. ఆవుపెయ్యా గాక, గేదెపెయ్యా గాక "చేటపెయ్య" మాత్ర మౌతున్నారు, ఈ విద్యాలవ దుర్విదగ్ధులు. "వీరికి వ్యక్తిత్వమూ, శీలమూ పూజ్యం" 9. యధార్థమైన సంస్కారం కలిగి వ్యక్తిత్వాన్ని సంపన్నం చేసుకొని, శీలాన్ని (Character) పెంపొందించుకొన్న

ప్పుడే వీళ్లు గౌరవ పాత్రులు కాగలరు. ఈ లోపాన్ని డాక్టరు మిల్లర్ ఎత్తి చూపాడు. తర్వాత ఎందరో ఎన్నోమార్లో అనగా అప్పారావు విన్నాడు - అసలు అరువు తెచ్చుకొన్న మాటలు లెమ్మని అనుకొన్నాడు కూడా. తర్వాత, ఆ మాటల నిజానిజాల గురించి ఆలోచించి, వాటి కారణాలను అంతుపట్టించుకోజూచాడు. ఇదివిడి వ్యక్తుల లోపం మాత్రమే కాదు. పాశ్చాత్య విద్యాపద్ధతి హేతువాదాన్నీ, స్వేచ్ఛనూ ప్రోత్సహిస్తున్నా, అది ప్రబోధించే స్వాతంత్ర్యం యధార్థమైనదిగా కనిపించలేదు భారతీయ సామాజిక జీవిత పరిస్థితులతో పాశ్చాత్య విద్యాసారాన్ని సమన్వయం చేయగలశక్తి దానికి ఉన్నట్లు కనిపించదు. వెంకన్న పంతులు అనే పరిచయస్తుడు చనిపోయిన సందర్భంలో అప్పారావు తన డైరీలో రాసిపెట్టుకొన్న దాన్నిచూస్తే, ఆయన ఆలోచనా సరళి తెలుస్తుంది.

— నిన్న రాత్రి వెంకన్న పంతులుగారు చనిపోయినారు. పాశ్చాత్య నాగరికత తెచ్చిపెట్టిన మంచీ, చెడూ ద్విగుణీకృతమై ఆయనలో మూర్తీభ వించినవి.........

....అటువంటి దుర్గుణాలు ప్రస్తుతం మన మేధావివర్గమునకు తప్పని సరిగా వుండక మానవనే విషయాన్ని వీరెవరూ (వెంకన్నను విమర్శిస్తున్న వాళ్ళు - ర. రె.) గుర్తించడం లేదు.

మన మత నమ్మకములు, సాంఘిక అభిప్రాయములు, ఆశయములు అంతో యింతో వ్యక్తిగత జీవితములో నైతిక ప్రమాణమును కలుగజేస్తూనే, ఇంకొక వంక పౌరహిత జీవితములో సద్వర్తనమునూ, నీతినీ కలిగించలేక పోతున్నవి. విద్యాధికులైన భారతీయులపై ఇవి తమ ప్రభావమును నెరపలేక పోతున్నవి. పాశ్చాత్య విద్యావిధానము ముందునకు పోయే గమనశక్తి లేని కేవలము కొన్ని అభిప్రాయములను, ఆశయములను మాత్రమే వుపదేశిస్తున్నది. సామాజిక, మేధోజీవిత పరిస్థితులను సమన్వయముచేసే శక్తి యీ పాశ్చాత్య విద్యకు మృగ్యము; పాశ్చాత్య విద్యాజనిత ఆశయములకట్టి శక్తి పూజ్యము.

శిథిల ప్రాయమైన భారతీయ నాగరకతా సూత్రా లొకవంక, స్వేచ్ఛపేరిట గమ్యమొకటి లేకుండా నిలకడా స్థిమితమూలేకుండా ఆందోళితంగా అనిర్దిష్టంగా రూపొందిన పాశ్చాత్య నాగరకతా ధోరణులింకొక వంక, సంకుచితమై దుర్బలమై సాంఘికమైన ఆధిక్యంలేక ఒకటి, ఆధిక్యం కలిగీ మనిషిలోని అవలక్షణాలనూ

వట్టి భౌతికదృష్టినీ, స్వార్థప్రవృత్తినీ పెంపొందించే దింకొకటీ—రెండింటిలోనూ ఉన్న "ఈ అవలక్షణములను, దోషములను, చెడుగులను, ధోరణిని దిగ్విజయముగా ఎదిరించి పోరాడుట నేటి ప్రథమ సమస్య". 10

ఆంగ్లవిద్యా వ్యామోహితుడని అప్పారావును ఆడిపోసుకునేవారికి, ఆయన ఆంతర్యమే తెలియదనుకోవాలి. విమర్శగా తప్ప దేనినీ శిరోధార్యం చేసుకోడు గనకనే, తన మిత్రుడైన శ్రీనివాస అయ్యంగారితో వచ్చిన క్లైశ్యంగురించి వ్యథచెందాడు. అప్పారావు స్వతంత్రభావుకుడు (Free Thinker).

# 2

"గంధాక్షతలు" ధరించి సంధ్యావందనం చేస్తూఉండేవారని, తమతండ్రి గురించి గురజాడ రామదాసు పంతులుగారొక వ్యాసంలో రాశారు. బ్రాహ్మణ్యాన్ని పదిలంగా కాపాడుకోవడమేమీ మహాపరాధంకాదు. అప్పారావు తండ్రి, రామదాసు నిష్ఠాగరిష్ఠులు. అయితే దేశిరాజు పెదబాపయ్య, కందుకూరి వీరేశలింగం ప్రభృతులు యజ్ఞోపవీతాన్ని తీసివేస్తుండిన కాలమది (1906-7).కాబట్టి కొంచెం ఎబ్బెట్టుగా కనిపించవచ్చునంతే. ఆహార నియమాలలోనూ కుల వర్ణ వివక్ష లోనూ అప్పారావు కాస్త సడలుబాటు వైఖరి ప్రదర్శించే ఉన్నాడు.

మతవిషయాలలో అప్పారావు స్వతంత్ర భావుకుడు మాత్రమేకాదు. సంశయ వాది (agnostic) కూడాను. దానికీ నిరీశ్వర వాదానిక్కీ చాలా గొప్ప తేడాయేఉంది మానవతావాదియైన తాత్వికుడు ప్రతిఒక్కడూ నిరీశ్వరవాది కానక్కరలేదుకూడా. నిరీశ్వరవాదమనేది మానవతా వాదపు చరమార్థమే కావచ్చు; అది మనిషిని మతం నుంచి విముక్తిపరచి, సృష్టిలో యథార్థమైన ప్రభుతకు గల అవరోధాన్ని తొలగించి వేస్తుంది.షడ్దర్శనాలలో కొన్ని నిరీశ్వరవాదాన్ని ఏదోఒక రూపంలో, వాచ్యంగానో వ్యంగ్యంగానో ప్రతిపాదిస్తున్నప్పుడు, నిరీశ్వరవాదానికి కూడా భారతీయ మత సంప్రదాయంలో కాస్తోకూస్తో స్థానం ఉందనుకోవాలి. చార్వాకం ఉండనేఉంది. అప్పారావు అందాకా వెళ్ళలేదు. అయినా మతాన్నీ దేవుణ్ణీ మూపున వేసుకొని కుంగి గూనుపడికూడా పోలేదు. మనిషీదేవుడూ ఒకటే; మనిషిలోనే దైవం ఉన్నాడు: సర్వాంతర్యామిఅనేఅర్థంలోకాదు, మంచితనమనే అర్థంలోనే; ఆమంచి వైయక్తికమే అయినా అది ఫలింపుకు వచ్చేది సంఘంలోనే; దేవుళ్ళని మనుషులు పేరెట్టిన రాయి రప్పలుకావు దేవుళ్లు; దేవుళ్ళ అసలు పేరేమిటో వాళ్ళకే తెలియాలి. మనిషిదేవుణ్ణి చేశాడు; ఆ చెయ్యడంలో దేవుడితో తనకుగల సంబంధాన్ని (కర్త, కర్మ సంబంధం) తిరగదిప్పి దేవుడే తనను చేశాడనుకొంటున్నాడు. తిరగదిప్పిన (Inverted) మానవలోకాన్ని స్వర్గంగా ఎంచుకొంటున్నాడు. ఇంతకూ ఎవరు ఎవరిని చేసినట్టు?

దేవుడుచేసిన మనుషుల్లారా  
మనుషులు చేసిన దేవుళ్లారా  
మీపేరేమిటి ?

ఐహిక సంఘటనలకు కర్తను నిర్ణయించడంలో విధినీ, కర్మాన్నీ, లేక దైవాన్నీ ఆశ్రయించి బరువంతా దానిపై మోపవలసిన అగత్యంలేకున్నా, మనిషి ఇంతవరకూ మతంద్వారా చేస్తున్నదదే. ముఖ్యంగా హైందవం కర్మసిద్ధాంతాన్ని ఆశ్రయించింది. వెనకటి జన్మల్లో చేసుకొన్న పాపపుణ్యాల మంచీ చెడూ ఫలితాలు తరవాతి జన్మల్లో జీవుడికి కలుగుతున్నాయి; ఏ కర్మకూడా ఫలితాలు చూపకుండా రిత్తబోయేదికాదు. ఇదిపాప మిది పుణ్యమని తూచి వాటికి తగిన ఫలితాలను నిర్ణయించేది పారలౌకికమైన శక్తి. అంతా ఈశ్వరేచ్ఛ అనుకొంటూ మనిషి నిజజీవితంలో కనిపిస్తున్న హెచ్చులొచ్చుల గురించి. తన మనస్సును సమాధాన పెట్టుకొంటున్నాడు; తద్వారా అతనికి సంతృప్తిలాంటిది కలుగుతున్నది అప్పారావు ఎంత స్వతంత్ర భావుకుడైనా, కళ్లెదుట కనిపించే మనుషుల ప్రవర్తనను బట్టి కర్మ సిద్ధాంతానికి మన జీవితంలో గల ప్రాముఖ్యాన్ని గుర్తించాడు. ఇతరకాలాల్లో ఇతర దేశాల్లో బయల్వెడలిన మతచింతన ఈ మన కర్మసిద్ధాంతమంత బిటువుగా లేదని భావిస్తూ. "అన్ని విశ్వాసాలకంటే సూత్రాలకంటె కర్మసిద్ధాంతం జీవిత వ్యత్యాసాల హేతువులకు బలమైన సమర్థింపు." అన్నాడుకూడా.11 తర్కదృష్టితో కర్మసిద్ధాంతం సత్తానుచూచి మెచ్చడమేగాని, దాన్ని మొత్తంగా తాను ఒప్పేసుకోవడమేమీ కాదిది.

దేవుడనేవాడు ఉంటే అతని గురించి మనిషైనవాడి కెలా తెలియగలదు? పుట్టుగుడ్డికి రంగులంటే ఏమిటో తెలిసి, వాటి గురించి అతనికొక అభిప్రాయ మంటూ ఏర్పడడ మనేది ఎలాగైతే పొసగని మాటో దైవమనే భావం గురించి ఇతమిత్థంగా మనిషికి తెలిసే వీలులేదు. అతనికేగనక కనుచూపు మొలిస్తే, అంతవరకూ లేని భావాలు సరికొత్తగా ఊరి ప్రవాహ సన్నిభంగా అతన్ని ముంచెత్తగలవు. 12 ఈ మాటలుకూడా అప్పారావువే. వీటి తాత్పర్యమేమిటి? ప్రత్యక్షానుభవం వినా, దైవమనే భావం మనిషికి విశదంగా అంతుచిక్కదనా? 'నేతి' 'నేతి' అంటూ పోగా, చివరకు మిగిలేదే దైవమనా? అందులలో తానూ ఒకడే గనక అస్తి నాస్తి విచికిత్స దండగ పని.

అప్పారావు సాహిత్యంలో పరతత్వంగురించి కొన్నిచోట్ల ప్రస్తావనలున్నాయి. *సంస్కర్త హృదయం* కథలో, ప్రొఫెసరు రంగనాథ అయ్యరుకూ, బోగంపిల్ల సరళకూ, జరిగిన సంభాషణ ఇక్కడ పనికివస్తుంది. దానిసారాంశం ఇది:

....మంచీ చెడూ అనేవి పరస్పర విరుద్ధమైన భావాలు కావచ్చునేమో గాని, అవి ఇరుగుపొరుగులే. ఒకటివినా వేరొకటి బోధపడని అమర

బిడ్డల్లాంటివి. వాటితల్లి, మాయ. అది సృష్టికి తోబుట్టువు. మాయలేక సృష్టి ఉండదు. అయితే మనిషిలో జ్ఞానం అంకురించాక. మంచి పెరగడమూ చెడు విరగడమూ జరుగుతుంది జ్ఞాని అయినవాడు, చెడుగును ఈసడించుకోవడంలో జీవిత యాథార్థ్యాన్ని చూడనొల్లక ఉష్ట్రపక్షిలా ఇసకలో తలదూర్చుకోగూడదు. ఈ మాటలనేది సరళ. ఇందులో మర్క్సివాదచ్ఛాయ లున్నాయి.

"ఈ వేద విజ్ఞానం", లేదా "వేదాంత తత్వం" సామాన్యులకేగాక, కొమ్ములు దిరిగిన పండితులకుగూడా గహనమే, నంటాడు ప్రొఫెసరు అయ్యరు. యథార్థ జీవితంలోని విషమ సమస్యా పరిష్కారానికి ఇది "ఒక్క పిసరు అక్కరకురాదు." పనికిరాని విజ్ఞానంతో మనిషికి పనిలేదు. మరి, ఆ పనికి వచ్చే విజ్ఞానం "యుగయుగాల జీవితానుభవం" మాత్రమే.

ఇలా ధీరత్వంతోటి ఉపక్రమ ప్రాగల్భ్యంతో మొదలైన ప్రొఫెసరుగారి అనుభవవివాదం, జీవిత వాస్తవాల ముందు మంచుపొరలకంటె వేగంగా కరిగి పోయి, ఉపసంహార దౌర్బల్యంతో ముగిసింది. విజ్ఞానశాస్త్రాధ్యయనం సంశయ నివృత్తికి మారు సందేహోత్పత్తికి దారితీసింది. అతని సిద్ధాంతం పుస్తక సిద్ధాంతం మాత్రమే. అతనిలాంటి వాళ్ళెందరో, పుస్తకాలలోని మాటల తత్వ మెరుగక "శుకములగుదురు పట్టి శాస్త్రజ్ఞుల్." సంశయవాది మెట్టు మెట్టుగా ఆస్తిక్యంవైపు పోసాగాడు, "ఆత్మ, పరమాత్మ, జీవుడికి వేరే లోకం ఉన్నాయి; సాజాత్యంవున్న జీవుళ్ళమధ్య అద్భుతాకర్షణ వుండితీరాలి,"అని కొత్తసూత్రాన్ని సాధించుకొన్నాడు.....

జీవులమధ్యగల అద్భుతాకర్షణ పేరు 'ప్రేమ'. అయితే ఇది మొదటి అంతస్తు మట్టుకే; దాని పైవరసలోనే ఉంటుంది. దేవుడికీ జీవుడికీ మధ్య విధిగా వుండవలసిన 'ప్రేమ,'ఇలా ప్లేటో [Plato] ప్రేమ సిద్ధాంతంవైపు పయనించింది. రంగనాథయ్యరు చపలబుద్ధి. స్వాభీష్టాన్ని సమర్థించుకొనేందుకేతప్ప ఇది మనసారా నమ్మి చేసిన సిద్ధాంతంకాదు.

మాయావాదాన్ని చేసిందికూడా అప్పారావు సృష్టించిన ఒకానొకపాత్రే. అప్పారావు ఇహాన్ని దాని సత్యాన్ని తీసివేశాడనేందుకు దాఖలాలేమీ లేవు సరిగదా, ప్రపంచం మాయ, జీవితం బుద్బుదప్రాయం, పారమార్థిక సత్యమొక్కటే సత్యం అనే హైందవ వేదాంత దృక్పథాన్ని అంగీకరించలేదనేందుకు దాఖలాలున్నాయి. ప్రాపంచిక సుఖాలు విడువదగినవని ఆయన భావించలేదు సరిగదా, ఎలాగూ నిత్యం

కావుంటున్న ఈ కొద్దిపాటి జీవితకాలంలో అనుభవించదగిన సుఖాలనన్నిటినీ పూర్తిగా అనుభవించమని ఈ వేదాంతమే మనుషులను పురికొల్పుతుందని భావించాడు. ఇంద్రియానుభూతివాదం అతిలోలత్వానికి (Hedonism) దారితీయ వచ్చుననే విమర్శకు, ప్రపంచం అనిత్యమని చెప్పేవాదమే అతి లోలత్వాన్ని సమర్థించినట్లవుతుందని జవాబు. 13

అలాంటివాదాలన్నీ ఆచరణయోగ్యమై నలిగావు. ఆచరణ యోగ్యత ఒక్కటే ఏ తత్వానికైనా గీటురాయి. మనిషికి ఆదర్శమంటూ ఒకటి ఉండాలి; అది సర్వజన సాధ్యంగా ఉండాలి; మనిషి శీలానికి అది ఒక ప్రమాణాన్ని స్థాపిస్తుంది; కార్యాచరణను ప్రేరేపిస్తుంది. ఆ ఆదర్శం,'మంచితనం'.అదేదైవం. "మంచిని ప్రేమించడమే దైవమును ప్రేమించడము.దుర్గుణములను రోసి, ఆత్మ సుగుణ సంపత్తిని పెంపొందించు కొంటున్నకొద్దీ, అది దివ్యత్వమును పొందుతుంది."14 పుటగడిగిన ముత్యంలా మనుష్య స్వభావం ఆటవికప్రవృత్తినీ క్షుద్రతనూ విడనాడి నీటుదేరి నాజూకు కాగలదనే భావం – Infinite perfectibility of Man –, అప్పారావుకు పాశ్చాత్య తత్వ పరిచయం ద్వారా కలిగింది. మనిషి జీవితం ఇలా నియతంగానూ నీతియుతంగానూ ఉండాలీ అంటే, మనిషికి తనదని చెప్పుకోదగిన ఇచ్ఛ ఒకటీ, అది స్వచ్ఛందమై ఉండడమొకటీ అవసరం. అలాంటప్పుడు, మనిషి దేవునిచాటు బిడ్డకాడు; ఉగ్గ దెలిసిన యువకుడు. బయటనుంచి ఎవరో నూరిస్తే వచ్చింది కాదు మనిషిలోని ఈ నీతిపరత; అది అతనిలో సహజంగానే ఉన్నట్టిది. ఇలా మానవీయ స్వాతంత్ర్యం ప్రతిపాద్యమౌతుంది. స్వతంత్ర కార్యావలంబన, జాతివయః పరిణతికీ, వ్యక్తిమనః పరిణతికీ వ్యక్తీకరణ

కొన్ని కొన్ని అంశాలలో, మానవ మతంగా పరిణమించిన ఓగుస్ట్ కోంట్ (Auguste Comte) సామాజిక శాస్త్ర వైఖరిని కూడా అప్పారావు నిరాకరించ వలసి వచ్చిందిందుచేతనే. ఆధ్యాత్మిక దృక్పథాన్ని కాదని మానవీయ శాస్త్రాల నాధారం చేసుకొని కోంట్ మానవ సామాజిక శాస్త్రాన్ని రూపొందించాడు. తత్వ విచారణ శాస్త్ర పద్ధతులకు ఒదిగే విషయాలలోనే జరగాలి గాని, వాటికి అతీతమని చెప్పే పారలౌకిక విషయాలపట్ల కాదంటూ,(Positivism)అనే నవతత్వాన్ని సాధించాడు. గణితం, జ్యోతిషం, పదార్థవిజ్ఞానశాస్త్రం, రసాయనికశాస్త్రం జీవశాస్త్రం–వీట న్నిటికీ శిఖరాయమానంగా సామాజిక శాస్త్రం, ఇలా పేర్చుగట్టి కార్యకారణ సంబంధ

పరిజ్ఞానం ద్వారానూ, పరిశీలన, అనుమానం, ప్రయోగం అనే శాస్త్రీయ పద్ధతి ద్వారానూ ఈ చిట్టచివరి శాస్త్రాన్ని మిగతా శాస్త్రాల సాహాయ్యాన రాబట్టాడు. అయితే కొన్నాళ్ళకు మత భావనకులోనై మానవ మతమనే కొత్తమతాన్ని స్థాపించాడు (Religion of humanity). మానవ స్వభావంలో పరోపకార బుద్ధి చాలా కొద్దిగానే ఉంటుంది. కాబట్టి దానిని పెంచి పోషించేందుకు మానవుణ్ణే దేవుణ్ణిచేసి, పూజా పురస్కారాలేర్పరచి, పూజారులూ స్తోత్రాలూ నియమాలూ వగైరా హంగులను సమకూర్చాడు కూడా. పాతదేవతలస్థానే మానవ పురోగతికో వీరత్వాన్ని సాధించుకొన్న మహనీయులను నిలుపబూనాడు. క్రైస్తవం వినా, ఇది ఆ పాత 'కేథలిక్' మతమే ననిపించేటట్లు, కోంట్ వెర్రి ముదిరింది. 15

ఈ మానవారాధనకు అప్పారావు చెప్పిన అభ్యంతరం ఇది: "మానవత్వమంటే ఆయన ఏ విధంగా విస్తృతపరిచాడో అదే పద్ధతిని తు. చ. తప్పకుండా నేను దానిని పరిగణించను. ఏ మంటావా, మత విశ్వాసాలనేవి ఆచరణకు అసాధ్యమైనవి; నిరోధకమైనవి. గుదిబండలవంటివి" 16. కొండుభట్టీయం నాటకంలో దివాన్ బహద్దరు రాజారాం పాత్ర బ్రహ్మసమాజాన్నీ దివ్యజ్ఞాన సమాజాన్నీ విమర్శించి "రేషనల్ రెలిజన్" అనే నినాదమివ్వడం విని, గిరీశంపాత్ర మతభావననే విమర్శింప బూనుకొంటుంది. "నిష్కల్మషమయిన మనస్సు అవ్యాజమయిన భూతదయా...."ఇవిలేని మతం మతమేకాదు: ఇవిఉంటే అది ఏ మతమైనా తనకు సమ్మతమేనని గిరీశం అన్నప్పుడు, ఆ మాటలకు అప్పారావు ఆమోదం ఉన్నది.ప్రపంచంలో మతాలు అలాలేవే! "మనస్సుయొక్క శరీరముయొక్క స్థితినిబట్టి" "లంగరులేని నావలాగా" చలిస్తూఉన్న ఈ కోటిన్నొక్కమత నామక వ్యవహారాలు, మత ప్రయోజనాన్నే వమ్ము చేస్తున్నాయి. అందుకోసమే హాస్యమూ వ్యంగ్యమూ రంగరించి గిరీశం ఇలా వేళాకోళంగా అంటాడు :

— యెండవేళ ఒక మతం, చల్లనివేళ ఒక మతం, కడుపు కాల్తూన్నప్పుడు ఒక మతం, కడుపు నిండినప్పుడు ఒక మతం, అందులో అంబలి మతం, పప్పునెయ్యి మతం, గోధుమరొట్టి మతం, మద్య మాంసమతం, యేదుకు తినే వాకపళ్ళమతం, డబ్బిచ్చికొనే మామిడిపళ్ళ మతం, గడవడం గడవక పోవడాన్నిబట్టి అంతర్భేదాలు కలవు! అలిసివున్నప్పు డోమతం, వంటరిగా వున్నప్పు డో మతం, అతివ చెంతనున్నప్పు డోమతం!

మనిషికి ఒకొక్క స్థితిలో ఒకొక్కరీతిగా ఉపకరిస్తూ అతని స్వార్థానికి సాధనోపకరణలు సమకూరుస్తూ, మతవ్యవస్థ మలినమైపోయింది; మాన్యమైన మూలభావనను భ్రష్టపట్టించింది: గిరీశం చెప్పదలచుకొన్న దిదే ననిపిస్తున్నది. విశ్వాసాలు, ఆచారాలు, నీతి సూత్రాలు వగైరా, మనిషి మనస్సును అదిమి ఒత్తి పెట్టే ఉక్కుచక్రాలు కాగూడదు. ఈ మాసి, చివికి, చెడిన వస్త్రాలను అవసరం బట్టి మార్చక తప్పదు. నానాటా ఎదిగే బిడ్డకు అడ్డాలనాటి అరగజం కొలతలతో కుట్టిన బట్టలు ఇరుకైనప్పుడు, అవే చిరిగి మూలబడుతాయిగాని, బిడ్డ భంగపడడు. వ్యవస్థారూపంలో ఘనీభవించి కూర్చున్న ఈ నియమాలనూ సూత్రాలనూ ఎప్పటి కప్పుడు సవాలుజేసి సంస్కరించే ధైర్యం, తాత్వికునికి కావాలి.* అణకువ అనే పేరిటి బుద్ధిమాంద్యం, గతానుగతికత్వమనే బుద్ధిజాడ్యం, మానసికమైన చచ్చుకూ పుచ్చుకూ నిదర్శనం. సంస్థాధర్మ మనేది మనోవృత్తులతో స్పర్థించి, ఎంతో చిత్త క్షోభను కలిగిస్తున్నదంటే, పరిస్థితులలో వచ్చిన మార్పును గమనించి తదను గుణంగా విస్తరించక యథాపూర్వ కాఠిన్య కర్కశత్వాలను అది నిలబెట్టుకోవడమే కారణం. అలాంటప్పుడు మారవలసింది మనోధర్మాలుకావు. సంస్థాధర్మాలు. మనుషులకోసం సంస్థలుగానీ, సంస్థలకోసం మనుషులా? సంస్థలు సాధనప్రాయాలు మట్టుకే. చీటికీ మాటికీ వాటిని ధిక్కరించడం తగదేమోగాని, మానవ సౌఖ్యానికి తీవ్రమైన అంతరాయాన్ని కలిగించినప్పుడు, పితూరీ అనేది కర్తవ్యమేగాక విధ్యుక్త ధర్మమే కాగలదు. ఆదర్శాల లోపలికి చొచ్చుకొని వచ్చిన విషక్రిములను ఎప్పటి కప్పుడు తొలగించుకోవడమే, ఆ ఆదర్శాలకు నిజమైన గౌరవం చూపడమౌతుంది. లోపాలను కప్పిపెట్టి యథాస్థితిని కొనసాగించడమే, ఆదర్శాలకు అపచారమౌతుంది. సంస్థ పటుత్వం కొసమే సంస్కరణం.

మత విద్రోహమనేదానికీ, సంప్రదాయ నిరసనకూ అప్పారావు భావనలో చోటు లేదని ఇప్పటికి తేలింది. ఎవరి మతాన్ని వాళ్లు ఏకైక సత్యమని భావించినా తప్పులేదు. ఇతర మతాలను అసత్యాలుగా ఎంచినప్పుడే కీడు. మూఢుల నాశ్ర యించిన "ప్రపత్తి" రంగాచార్యులవంటి పండితులకు లోపించినా ఫర్వాలేదు, "ప్రపత్తి" పేరుతో తామస వ్యాపారాలకు దిగడమే గాక కత్తులు దూసుకొని

---

* తన భవనాల మరమ్మత్తు గురించి మాట్లాడుతూ ఆనందగజపతి ఈ సంస్థా సాదృశ్యం తెచ్చాడు: కూలిపోతున్న భవనాలను మరమ్మతుచేసి అనవసరంగా డబ్బూ శక్తీ దుబారా చెయ్యడం కంటె, సరికొత్తవాటిని కట్టుకొంటే పోదా? ఈ ప్రశ్న అప్పారావు చేత ఆలోచింప జేసింది.

కలబడడం కూడా జరిగినప్పుడు, మతం తన మూలప్రయోజనానికి విరుద్ధంగా దుష్ఫలితాలను కలిగిస్తుంది. *మీ పేరేమిటి ?*, *పెద్దమనీషి* కథలద్వారా ఈ విపరీత పరిణామాలనే అప్పారావు బయల్పరిచాడు. అంతకంటె నేరుగా *బిల్హణీయం* లో కవిచేత ఇలా ఉపదేశం చేయిస్తాడు.

> కుమార ! నిజమైన జ్ఞానమును సాధించవలెనన్న పండితునికి పరమతముల యెడల అసూయ కూడదు. ఈ భూప్రపంచమందు లెక్కలేని మతాలున్నాయి . . ఏదేశంలో ఏ మతంలో యేమేమి మేలు వుంటే, అదల్లా గ్రహించదగిందే.

అశోక సార్వభౌముని 'సమవాయ' సిద్ధాంతమూ, అక్బర్ పాదుషా దీన్ ఇలాహీ (Din-i-Ilahi) మతమూ ఇలా from each fair plant, a choicest flower ను కోసి మాలగా గుచ్చే మేలి సమన్వయ వైఖరినే చూపెట్టాయి. ఈ వైఖరికి హైందవ మతంలో *భగవద్గీత* కంటె గొప్ప తార్కాణం లేదు. *కన్యాశుల్కం*లో సౌజన్యారావు మధురవాణి చేతబెట్టిందీ *కొండుభట్టీయం* లోనూ, *బిల్హణీయం* లోనూ కొన్ని పాత్రలు ప్రశంసించిందీ దీనినే కాబట్టి అప్పారావుకు దీనిపై ఎంత గురి వుండిందీ తెలుస్తుంది. మధురవాణి చిత్తవృత్తిని మార్చగల మూలికగా ఒకచోట. ఆర్యమతానికి పట్టిన తుప్పును తీసివేసి నిర్మలం చేయగల ద్రావకంగా ఇంకొకచోట. ఇంద్రియ దమనానికైన ముగుదాడుగా మూడోచోట, ఇది సంభావితమైంది. ఏమిటి ఈ గీతాప్రాశస్త్యం?

> The Gita sets out each preceding doctrine in a masterly and sympathetic way without naming or dissecting it and with consummate skill passes smoothly on to another... Thus we have a brilliant(if plagiarist) review-synthesis of many schools of thought, which were in many respects mutually incompatible. The incompatibility is never brought out; all views are simply facets of the one divine mind. The best in each system is derived, naturally, as from the high God...
>
> To put it bluntly, the utility of the Gita derives from its peculiar fundamental defect, namely dexterity in seeming to reconcile the irreconcilable ... This slippery opportunism characterizes the whole book. 17

పొంతనలేని అనేక పూర్వతాత్విక ధోరణులను తెచ్చి గుదిగుచ్చడమే తద్వారా భిన్నతకు మారు సమన్వయదృష్టిని కలిగించడమే, తత్వగ్రంథంగా గీతా

లక్షణమని కోసంబి చెప్పాడు. పై ప్రశ్న కిదే జవాబు. లోపంకూడా గుణంగా పర్యవసించినట్లు, కలగూరగంపే సమన్వయ వాదుల నాకర్షించింది. అప్పారావుకు నచ్చిన అంశంకూడా ఇదే.

జ్ఞానమే పరమ గమ్యమైనప్పుడు మతం వాహనప్రాయం కావచ్చు. గమ్యం దగ్గరయ్యేకొద్దీ వాహనం అవసరం తక్కువౌతుంది. చివరకు అది మూలబడుతుంది.

మతములన్నియు మాసిపోవును.
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును....

పరంకాదు, ఇహమే; స్వర్గంకాదు, భూమే; దేవుడుకాడు, మనిషే; మతం కాదు, జ్ఞానమే: భక్తికాదు, ప్రేమే - అప్పారావు తత్వంలో ప్రథమస్థానాన్ని ఆక్రమించాయి. సర్వజన సాధ్యమైన సౌశీల్య సంపాదనం ఆయన ప్రమేయమైంది. ఆయన తత్వం ప్రధానంగా లోకతత్వంగా (Secularism) పర్యవసించింది. రఘుపతి వేంకటరత్నం తత్వానికి మూలస్తంభాలైన "భగవదాస్తిక్య బుద్ధియు మానవ సేవాసక్తియు," అప్పారావు తత్వంలో స్థానక్రమ విపర్యయం పొందాయి.

# 3

"ఇప్పుడున్న సాంఘిక భావాలు పోయి వాటిస్థానే కొత్తవి రావలసిన అవసరానికీ, అగత్యానికీ మానవ పరిణామ వాదం దారితీస్తున్నది," అని భావించిన అప్పారావు ఆ కొత్త సాంఘిక భావాంకురాలను పొడగట్టసాగాడు కూడా. నిరుపయోగకరమైన ఊహాగానాన్ని తోసివేసి, కళ్ళెదుట కనిపించే లోకవృత్తాన్ని ఆధారం చేసుకొని ఈ పోయే వచ్చే పాత కొత్తభావాలను తాత్వికుడైన వాడు శాస్త్రీయమైన పద్ధతిద్వారా సేకరించి నిగ్గుదేలుస్తాడు.

శాస్త్రీయ పద్ధతిగురించి అప్పారావుకు సదవగాహన ఉండిందనేందుకు, కళాశాలలో పనిచేసిన కాలాన ఆయన రాసి పెట్టుకొన్న తాత్విక చింతన అనేరచన సాక్ష్యంగా పనికివస్తున్నది. యూరపుఖండపు వైజ్ఞానికాభివృద్ధి క్రమంలో. 'ఎంపిరిసిజం' (Empiricism) పేరిటి ప్రత్యక్షానుభవవాదం బయల్పేరదీసిన ప్రయోగాత్మక పద్ధతి (Inductive or Experimental) నీ, అటుతర్వాతి కాలంలో బయల్వెడలిన హేతువాదం (Rationalism) ప్రవేశపెట్టిన ఊహాత్మక పద్ధతి (Deductive Method) నీ ఆయన ఈ రచనలో తారతమ్య పరిశీలన చేశాడు. ప్రకృతిని పరిశీలించి, దానినుంచి కొన్నిసూత్రాలను రాబట్టే పద్ధతి, విశేషంనుంచి సామాన్యానికి పయనిస్తుంది (A Posteriori) ముందుగానే కొన్ని సామాన్య ప్రతిపాదనలను చేసుకొని వాటినుంచి విశేషాంశాలకు పయనించడం A Priori వైఖరి. ఈ రెండవ దానిని హేతువాదం చేబడితే, మొదటిదాన్ని అనుభవవాదం చేబట్టింది. మనిషి మనస్సూ దాని ధర్మాలూ గురించి హేతువాదికి ముందుగానే ఒక అవగాహన ఉంటుంది; తదనుగుణంగా అతను సూత్రీకరణలు చేసుకొంటూ పోతాడుగాని, తాను చేయగల పొరబాట్లను అనుభం దృష్ట్యా సరిదిద్దుకోడు అనుభవవాది అలాకాదు. భ్రమాప్రమాదాలకు లోబడి పోకుండా, తప్పటడుగులను సరిదిద్దుకొంటూ పోతాడు. అయితే కొన్ని విషయాలలో హేతువాదానికిగల సౌకర్యం అనుభవవాదానికి లేదు. ముఖ్యంగా, "అనుభావ వ్యక్తీకరణలో తగినంత నిశ్చయజ్ఞానాన్ని ప్రదర్శించడానికి" హేతువాదం సైతమన్నంతగా, రెండవది అనదు. దానిది అనుమాన పద్ధతి కావడమే ఇందుకు కారణమైనా, "ఈ నిశ్చయజ్ఞానం మానవ విగ్రహాన్ని మలచే శిల్పికి అవయవశాస్త్రం తెలియడంవంటిది." అనిశ్చితంగా

ఉంచి, ఇది కావచ్చునేమో అది కావచ్చునేమోనని సందేహించే వైఖరి చిరాకు కలిగించవచ్చునేమోగాని, అస్పష్టత నుంచి స్పష్టత కలగడానికి ఇదే దారి. "ఈ రెండు తత్వాలలో మనం వొకటి మహత్తర మైనదని పొగుడుతూ యింకొకటి ఎందుకూ అక్కరకు రాదని తెగడుతూ వుంటాము; కాని అది వృథా." 18

భిన్నంగానూ విరుద్ధంగానూ కనిపించే ఈ పద్ధతులు రెండున్నూ శాస్త్రకారునికెలాగో తాత్వికుని కలాగే అవసరమని, అప్పారావు రచనలోని సారాంశం. ఆయన అభీష్టం మాత్రమే కాదది. ఈ రెండు కలిసినప్పుడే వైజ్ఞానికాభివృద్ధి సాధ్యమై, కలియక ఎడపెడలైనప్పుడు ఏకముఖాభివృద్ధి మాత్రమే చేకూరింది. భౌతిక శాస్త్రాలు అభివృద్ధి చెందినంతగా మానవీయ శాస్త్రాలు చెందకపోవడానికి గూడా ఈ రెంటి చేరిక, చీలికలే కారణాలు. కాబట్టి వాటి తారతమ్య పరిశీలనచేసి రెంటి ప్రయోజనాలను గుర్తించడంలో, అప్పారావు యొక్క మనస్విత బయల్పడుతున్న దనాలి.

ఆయన ఆ రచన చేసింది, ముఖ్యంగా మనిషి మనస్సు పనిచేసే రీతులపట్ల తన ఆలోచనలనూ ఊహలనూ రూపొందించుకొనేందుకే. బాహ్యాంతరానుభవాలవల్ల ఉత్పన్నమయ్యే మనోభావాలు, అంతర్నిహితమే ఉన్న భావాలతో కలగలిసిపోవడమో వాటన్నిటి ఘర్షణవల్ల నిగ్గుతేలడమో జరుగుతుంది. ఎప్పుడు పుట్టిన భావవిశేషాన్ని అప్పటికప్పుడే తరచిచూచుకొంటే, దాని మూలం అంతుచిక్కకపోదు."ఒక భావానికి కారణమైన మూలశక్తులు దానికి వెనకవున్న అనుభవంలో యిమిడి వుంటాయి. గతించిన ఆ అనుభంలోని మూలశక్తులను వెదకి పట్టుకోవాలంటే మనకు కలిగిన భావాన్ని వెంటనే మనం వ్రాసి ఉంచడం మంచిది" అని తన భావ విశేషణా పద్ధతిని నిర్వర్ణించుకొన్నాడు.

అప్పారావు రూపొందించుకొన్న జ్ఞాన సిద్ధాంతంలో మనస్సంబంధమైన ఆలోచనల కెంతటి ప్రాముఖ్యం కద్దో హృదయసంబంధమైన అనుభూతులకంత కద్దు. మనస్సునూ హృదయాన్నీ భిన్నవస్తువులుగా ఎంచడమే తప్పు. హృదయోద్రేకాలను తృణీకరిస్తూ అవి హేతు బుద్ధికి బాహ్యాలనీ, భావన భ్రమా పూర్వకమనీ చెప్పి ఆ రెంటికీ గండికొట్టిన తాత్వికుడు డెకార్టె (Descartes) అప్పారావు ఈ రెండింటి వైరాన్నిగాక, సఖ్యాన్ని పాటించాడుగనకనే ఆలోచననూ భావననూ సమసింపజేశాడు. మనోఫలకంమీద చిత్రితమయ్యే ముద్రలు (Impressions) "ఆలోచనలకంటె అభిప్రాయాలకంటె ఎక్కువ శక్తిగలవి." అయినా ఆలోచనలది

అపారమైన సంహారసీమ; అవి నిరవధి; నిజానికి అసీమితాలు. మెదడు జేసేపని, అనుభవజన్యాలైన విషయాలను వివేచించి, నిగ్గుదేల్చి, ఒండొంటితో అనుసంధానించి, క్రమబద్ధతను కలిగించడమే. వీటిని మీరితే అది శూన్యంలోనే సంచరించవలసి ఉంటుంది.

ఈ రచననుబట్టి అప్పారావు తాత్విక ప్రకర్షను నిర్ణయించి వెలకట్టవచ్చును గాని, ఇది ఆయన కట్టుకొన్న సౌధానికి గుణావర్ణనం మాత్రమేనని మరచిపోగూడదు. అనుభవవాదమూ హేతువాదమూ పెనవేసుకొన్నట్లే, ఆయన తత్వంలో ఎందరెందరి తత్వాల అంశలో కనిపిస్తాయి. ఉదాహరణకు, లవణరాజు కల కావ్యంలో లవణుని నోట బెట్టిన మాటలు—

ఎప్పటికి అనుభూత మెద్దియో
అప్పటికి అది నిక్కువంబే.

— ఫ్రాన్సిస్ బేకన్ ప్రతిపాదించిన ప్రత్యక్షానుభవ వాదానికి సన్నిహితంగా ఉన్నట్లు డా॥ సి. నారాయణరెడ్డిగారుచేసిన ఊహ విషయం, లోగడే చెప్పడమైంది. "పారమార్థిక సత్యం"గాకుండా "వ్యావహారిక సత్యమే" అప్పారావు సమ్మతిపొందినట్లుకూడా ఆయన ఊహించారు. అనుభూతివాదానికి ప్రథమాచార్యుడు బేకన్‌కాదు, జాన్‌లాక్ (John Locke) అని మాత్రమే నా సవరణ. జ్ఞానం సమస్తం అనుభవం నుంచి, అందులోనూ ఇంద్రియానుభవంనుంచి మనిషికి చేకూరుతున్నదని చెబుతూ, there is nothing in the mind except what was first in the senses అన్నాడు లాక్. బిడ్డ పుట్టినప్పుడు దాని మనస్సు శుద్ధ ఫలకం (tabula rasa) లాగా ఉంటుంది. ఇంద్రియానుభవం ఆ ఫలకమీద వెయ్యివిధాలుగా ముద్రలు వేస్తుంది; గీతలు గీస్తుంది. ఇలా అనుభూతి క్రమంగా స్ఫురణను కలిగిస్తుంది, అది ధారణ (memory) గా మారుతుంది; ఈ జ్ఞాపకంనుంచి భావాలు ఉత్పన్నమౌతాయి. ఆ కాలానికి (17 వ శతాబ్దం) ఇది చెప్పుకోదగ్గ గొప్ప సిద్ధాంతమే. Sensationalism గా ఇది వ్యాప్తిలోనికి వచ్చింది. కొన్ని సహజభావాలేవో (Innate Ideas) ఉన్నాయని ప్లేటో ప్రతిపాదించగా 'క్రీస్తుపూర్వకాలంనుంచీ వస్తూన్న సిద్ధాంతాలకు ఇది గొడ్డలిపెట్టు. ఆ సహజభావాలు దైవదత్తాలేకావాలి; మనిషి ఈ లోకంలోకి వచ్చిపడేప్పుడు వాటిని వెంటబెట్టుకువస్తాడు; తన జీవితంలో అతడు చెయ్యవలసిందల్లా వాటిని పునఃదర్శించుకోవడమే నని ప్లేటో బోధించాడు. మళ్ళీ (పునః) అనే మాటను

కొట్టివేసి, మనిషి తన జీవితంలో ఓం ప్రథమంగా తన అనుభూతులద్వారా జ్ఞాన సంపాదన చేస్తాడని లాక్ అన్నాడు.

Knowledge then seems to me to be nothing but the perception of the connection, and agreement, or disagreement, and repugnancy, of any of our ideas. In this alone it consists. 19

లోకం మాయ. లోకానికి అతీతంగా ఎక్కడో సచ్చిదానంద స్వరూపం ఉంది. దాని లీల, క్రీడ, నీడ ఈ లోకం: అనుభవాలన్నీ వలలు, లేదా, కలలు – ఈ అభిప్రాయాలను నిరాకరించడానికే లవణుడు అలా అన్నాడనుకోవాలి. ఈ కావ్యానికి మూలమైన సంస్కృత రచనలో వసిష్ఠుడు రాముని కుపదేశించిన మాయావాదానికి యథాశక్త్యా అప్పారావు జవాబు మాత్రమే అది. లాక్ ప్రతిపాదించిన సిద్ధాంతం కూడా ఆధ్యాత్మిక చింతనను దెబ్బతీసి గానీ విడవలేదు. కాంట్ (Kant) వద్దకు పోయేసరికి,పారలౌకికత నడ్డి పూర్తిగానే విరిగింది.అజ్ఞేయమైనది NOUMENON ఇంద్రియానుభవానికి లొంగదు, దాని పరిధిలోకి రాదు కాబట్టి, దాని నటుంచుదామనే వైఖరి బలపడింది. వస్తు సంబంధమైన అనుభవాలనే మనస్సు గ్రహించగలుగుతున్నందుచేత, సహజావబోధాలనేవి ఏవో కొన్ని ఉన్నప్పటికీనీ, మనస్సు కూడా భౌతికమైన పదార్థమే నన్న భావమే తల ఎత్తింది.

అప్పారావు భౌతిక వాదం దాకా దిగి రాలేదు గాని, వస్తు సంబంధమైన దృష్టిని ప్రయత్న పూర్వకంగానే అలవరచుకొన్నట్లు ఆయన రచనా శకలాలను బట్టి తెలుస్తూంది. ఇది వస్తు హృదయ విచికిత్సకు సంబంధించి కొందరు తాత్వికులు చేసిన the thing as it really in itself is అనే అభినవ వేదాంత దృష్టికాదు. మనఃపరమైన దృష్టికి భిన్నంగా వస్తుపరమైన – వాస్తవికమైన – దృష్టి. * సృష్టిలో ఉన్న వస్తురాశిని వెలగట్టు కొని ఉత్తమాధమ భేదాలను బట్టి శ్రేణులుగా తీర్చడానికి, కాలంలోనూ స్థలం లోనూ వాటి సామీప్యమూ పరిచయమూ అడ్డు వస్తాయి. వస్తువులగురించి అప్పటి కప్పుడు ఏర్పడేవి వట్టి ఉరామరిక అంచనాలలాంటివో సొంత ఇష్టా యిష్టాలను

---

*చిన్నతనంలో తాను చూచిన తోలుబొమ్మలాట అప్పారావు కొక తత్వస్ఫురణను కలిగించింది. చీకటిలో అంతా ఏక నలుపేగాని, వెలుగులను వాటిమీదికి తిప్పి చూస్తే వాటి కోటిసొగసులూ బయల్పడుతాయి. అలాగే ద్వేషంలో మంచిచెడ్డల ప్రశ్న లేదు. ప్రేమ, దయలతో గూడిన దృష్టికి ప్రతిదీ మంచే.

బట్టి ఏర్పడిన అపరిణతాభిప్రాయాల లాంటివో కాగలవుగాని, వాటి సత్తా గురించి నిర్మమమైన నికరమైన తీర్పు ల్లాంటివి కాజాలవు. అయితే "బుద్ధిని స్మృతియందు లగ్నము చేసినపుడు ప్రజ్ఞాత్మక దృష్టి ఏర్పడుతుంది. అపుడు వస్తువు ప్రత్యక్షవీక్షణలోవలె, స్వస్వరూపముతో సాక్షాత్కరిస్తుంది". కావచ్చుగాక, అలాంటి పరిస్థితులలో వస్తువుగురించి నీ అభిప్రాయమేగాని, దాని సహజగుణం గురించిన అవగాహన మెలా ఏర్పడుతుంది? ఇంతకూ చేయవలసిం దిది:

"ఏ వస్తువునైనా, దాన్ని దాన్నిగా, వస్తుపరంగా వీక్షించి విలువలు కట్టవలెను."[20] ఈ దృక్పథంనుంచి వెలువడిందే, మానవ స్వభావం గురించీ శీలంగురించీ అప్పారావు రూపొందించుకొన్న అభిప్రాయ సంపుటి.

"అద్దీకాక లోకంలో ఏ వస్తువూ సర్వమూ సుగుణోపేతంగా అత్యంతమూ ఉత్తమోత్తమంగా వుండబోదని ఎవరికైనా తోస్తుంది" అంటూ హరిశ్చంద్ర నాటక పీఠికలో రాశాడు అప్పారావు. సర్వ సుగుణోపేతంగా ఉత్తమోత్తమంగా ఉన్న వస్తువేదైనా ఉంటే, అది భూ ప్రపంచకంలో ఉండదని అనలేదుగాని, అనవలసింది.

మనిషి మనస్సు ఏకశిలలాంటి పదార్థమేమీకాదు. అతని శీలం మంచిచెడ్డల కలగలుపు. ఈ శీలాన్ని నిర్ణయించే శక్తులేమిటి? వంశ పారంపర్యం (Heredity) ఒకటని జీవశాస్త్రం తెగపెరిగిన ఈనాడు ఎవ్వరైనా చెప్పవచ్చు. బిడ్డలో తలిదండ్రుల తాలూకు గుణవిశేషాలు 'జీన్సు' (Genes) ద్వారా భాసిస్తాయని అనవచ్చు. X, Yల మార్పిడిని వివరించవచ్చు. వంశ పారంపర్య మొక్కటే మనిషి గుణాన్నీ శీలాన్నీ మంచికో చెడ్డకో నిర్ణయించలేదు. భౌతిక పారిసర్యం (Environment) కూడా నిర్ణాయక శక్తిగా పనిచేస్తుంది. తలిదండ్రుల ద్వారానూ పరిసరాలద్వారానూ మనుష్యవక్తి సమాజోత్పత్తి వస్తువు. అతని గుణశీలాలకు అత నెంత బాధ్యుడో సమాజం అంతగానో ఇంకా ఎక్కువగానో బాధ్యం కావాలి.

ఈ అభిప్రాయాలను అప్పారావు ఇబ్సెన్ (Ibsen) కు అంటగట్టాడు. ఇబ్సెన్ తత్వవేత్తకాదు; నాటకకర్త మాత్రమే. నేరుగా ఈ సిద్ధాంతాన్ని ఎక్కడా ప్రతిపాదించలేదుగాని, ఆయన నాటక పాత్రలలో కొన్ని దీనికి ఛాయా రూపాలు కల్పించి ఉన్నాయి. ముఖ్యంగా Ghosts అనే నాటకంలో ఆస్వాల్డ్ (Oswald)



పాత్ర ఇలాంటిది. ఆనువంశికమైన ప్రభావం బలిష్ఠమైనదని నిరూపితమౌతుంది. ఇబ్సెన్ శాస్త్రజ్ఞుడు కాడు కాబట్టి ఇది శాస్త్ర సత్యమనుకొనే వీలులేదు. * దీన్ని వివరిస్తూ బెర్నార్డ్‌షా ఇలా వ్రాశాడు.

... His impression of the light thrown by physical and biolo gical science on the facts of life seems to have been the gloomy one of the middle of the Nineteenth century. External nature often plays her most ruthless and destructive part in his works...[21]

మానవుని శీలం బాహ్యప్రకృతీ సమాజమూ నిర్ణయించేట్టిదైతే, మనిషికి స్వతంత్రమైన ఇచ్ఛాబలమే లేదన్నమాట! ఇబ్సెనీయను సిద్ధాంతం హేతుబద్ధంగా శాస్త్రసమ్మతంగా కనిపించినప్పటికీ, అది అప్పారావును పూర్తిగా సంతృప్తి పరచ లేదు. అప్పారావు ఇబ్సెను సిద్ధాంతంతో భేదించింది ఈ స్వతంత్రేచ్ఛా విషయం లోనే (Free will). మనిషి పరిస్థితుల బానిసకాదు; వంశ పారంపర్యానికీ పారి సర్యానికీ సాధనప్రాయుడు కాదు. చైతన్య విస్ఫూర్తితో సంకల్పబలంతో తనను తాను తీర్చిదిద్దుకోగలడు:

— మానవుడు, పరిస్థితులకు కేవలం బానిస అని తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరపాటు. శారీరక మానసిక ధర్మమును నిర్ణయించడంలో ఆనువంశిక, పరిసరాల ప్రభావాలు అధికంగా వున్నా, వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్ద గలుగుతుంది. మానవునికి కావలసినది సంకల్పబలం.[22]

---

* 19 వ శతాబ్ది మధ్యకాలానికి విజ్ఞానశాస్త్రాభ్యుదయ ఫలితంగా సాహిత్యంలోకి మళ్ళీ యాంత్రిక (Mechanistic) భావాలు చొరబారిన ఫలితమే. ఇబ్సెన్ ప్రకృతివాదం (Naturalism). ముఖ్యంగా జీవశాస్త్ర (Biology) ప్రభావంవల్ల, మనిషి అల్పత్వంగురించి ఇబ్సెన్‌కు ఒక అవగాహన ఏర్పడింది. వంశపారంపర్య ప్రభావాలు మానవత్వాన్ని నిర్ణయించి వేస్తాయనిపించింది. దీన్నే సాహిత్యంలో Naturalism అంటారు. క్రితంలో కాల్పనిక వాదులు మనిషిని యావత్ప్రకృతికీ ప్రభుననుకొంటే ప్రకృతివాదులు మనిషిని ప్రకృతికి లోబరచి వేశారు. ఇబ్సెన్‌కూడా ఈ వాదాన్ని అనుసరించినా, తన చివరి నాటక రచనలో దాన్ని విడనాడాడు. But in his later prose plays, the romantic trolls and ghosts of his earlier dramatic poems like BRAND and PEER GYNT crept back into the bourgeois drawing - rooms; the Naturalist had been finally compelled to make cracks; in his mould.

AXEL'S CASTLE : Edmund Wilsons

పాత్ర ఇలాంటిది. అనువంశికమైన ప్రభావం బలిష్ఠమైనదని నిరూపితమౌతుంది. ఇబ్సెన్ శాస్త్రజ్ఞుడు కాడు కాబట్టి ఇది శాస్త్ర సత్యమనుకొనే వీలులేదు. * దీన్ని వివరిస్తూ బెర్నార్డ్‌షా ఇలా వ్రాశాడు.

> ... His impression of the light thrown by physical and biolo gical science on the facts of life seems to have been the gloomy one of the middle of the Nineteenth century. External nature often plays her most ruthless and destructive part in his works...[21]

మానవుని శీలం బాహ్యప్రకృతి సమాజమూ నిర్ణయించేటిదైతే, మనిషికి స్వతంత్రమైన ఇచ్ఛాబలమే లేదన్నమాట ; ఇబ్సెనీయను సిద్ధాంతం హేతుబద్ధంగా శాస్త్రసమ్మతంగా కనిపించినప్పటికీ, అది అప్పారావును పూర్తిగా సంతృప్తి పరచ లేదు. అప్పారావు ఇబ్సెను సిద్ధాంతంతో భేదించింది ఈ స్వతంత్రేచ్ఛా విషయం లోనే (Free will). మనిషి పరిస్థితుల బానిసకాదు; వంశ పారంపర్యానికీ పారి సర్యానికీ సాధనప్రాయుడు కాదు. చైతన్య విస్ఫూర్తితో సంకల్పబలంతో తనను తాను తీర్చిదిద్దుకోగలడు :

> — మానవుడు, పరిస్థితులకు కేవలం బానిస అని తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్పహాయుడని అనుకోవడం పొరపాటు. శారీరక మానసిక ధర్మమును నిర్ణయించడంలో అనువంశిక, పరిసరాల ప్రభావాలు అధికంగా వున్నా, వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్ద గలుగుతుంది. మానవునికి కావలసినది సంకల్పబలం. [22]

---

* 19 వ శతాబ్ది మధ్యకాలానికి విజ్ఞానశాస్త్రాభ్యుదయ ఫలితంగా సాహిత్యంలోకి మళ్ళీ యాంత్రిక (Mechanistic) భావాలు చొరబారిన ఫలితమే, ఇబ్సెన్ ప్రకృతివాదం (Naturalism). ముఖ్యంగా జీవశాస్త్ర (Biology) ప్రభావంవల్ల, మనిషి అల్పత్వంగురించి ఇబ్సెన్‌కు ఒక అవగాహన ఏర్పడింది. వంశపారంపర్య ప్రభావాలు మానవత్వాన్ని నిర్ణయించి వేస్తాయనిపించింది. దీన్నే సాహిత్యంలో Naturalism అంటారు. క్రితంలో కాల్పనిక వాదులు మనిషిని యావత్ప్రకృతికీ ప్రభువనుకొంటే ప్రకృతివాదులు మనిషిని ప్రకృతికి లోబరచి వేశారు. ఇబ్సెన్‌కూడా ఈ వాదాన్ని అనుసరించినా, తన చివరి నాటక రచనలో దాన్ని విడనాడాడు. But in his later prose plays, the romantic trolls and ghosts of his earlier dramatic poems like BRAND and PEER GYNT crept back into the bourgeois drawing - rooms; the Naturalist had been finally compelled to make cracks; in his mould.

AXEL'S CASTLE : Edmund Wilsons

తమ తమ శీలంలోని వంకరలను దిద్దుకొంటూ లోట్లను పూడ్చుకొంటూ ఉండగలందులకు మనుషుల కందరికీ సమాజంలో సమానావకాశాలు లేవు. కాబట్టి ఈ లోపపూరణం తరతమ భేదాలతో జరుగుతూవుంది. అనుకూలమైన వాతావరణాన్ని కలిగించి, లోపాలను పాపాలుగా, పొరబాట్లను నేరాలుగా ఎంచి సంఘంగానీ రాజ్యంగానీ నీతిచట్టాలపేర శాసనాలపేర దండించకుండా, సదయంగానూ సానునయ ధోరణితోనూ ప్రవర్తించినట్లయితే, వ్యక్తులు బాగుపడతారు. ఈ బాగుపడడానికి అడ్డంకి కల్పించే సంస్థలూ సంప్రదాయాలూ ఆ మేరకు గర్హించి సంస్కరింపదగినవే.

యుక్తవయస్సు వచ్చి, తలిదండ్రులనుంచి విడివడిన బిడ్డ, ఈ మనిషి సంకల్పమయుడుకూడా కాబట్టి అతనిది స్వయంనిర్ణయాధికారం కూడా. అది పూర్తిగా అమలు జరగడానికి సంఘసాహాయ్యం కావాలి, అంతే.

# 4

కాకతాళీయంగా జరిగిపోయిన ఒక సాధారణ ఘటన, అప్పారావు హృదయాన్నీ మనస్సునూ కలచి వేసింది.

....ఆనంద గజపతి చేరదీసిన రామస్వామి పెడసరాన్ని సరిదిద్దేందుకూ దారికి తెచ్చేందుకూ వైద్యుడుగా అప్పారావు నియుక్తుడైన సంగతి, లోగడే ప్రస్తావనకు వచ్చింది. తనకు అప్పచెప్పిన ఈ పని గురించి సుముఖత లేక పోయింది. ఎంతో అయిష్టంతో రంగంలోకి దిగాడు.

స్త్రీ శరీర సౌఖ్యాన్ని పొందడం పెద్దపనేమీ కాదు; ఆమె 'మేధాశక్తి'ని గ్రహించి రసానుభూతిని పొందడమే గొప్ప, అని మహారాజా ఒకప్పుడు చెప్పి ఉన్నాడు. ఈ 'ఆమె'లో ఆ మేధాశక్తి చాలా కొద్దిమోతాదులో ఉండటమేగాక, వక్రించి వికటమై మోటుతనం తోటి కలగలిసి ఉంది. మహారాజా స్వయంగా ఆమె చెవి నిల్లుకట్టుకొని బోధించబోయి భంగపడ్డాడు, ఇకతానా? ఆమెగురించి ఎంతో విని ఉండికూడా, ఆమెపట్ల ఏహ్యభావం బదులు విచారం కలుగుతున్నది.

ఒకరోజున ఏం జరిగిందంటే, ఆమెకు సుస్తీచేసింద; ఈ కబురుపట్టుకొని అప్పారావు ఆనందగజపతి వద్దకు వెళ్ళి డాక్టరును పిలిపించమంటారేమో అడిగాడు. ముందు ఆమెకు కాస్త బ్రాందీ ఇప్పించ మన్నాడాయన. 'బ్రాందీకావాలా,' అని అడిగాడు ఆమెను అప్పారావు. వద్దన్నది. వంగి, ఆమెచెయ్యి తనచేతిలోకి తీసుకొని నాడిపరీక్షించి చూశాడు. నిస్సత్తువగా ఉన్నదట. మహారాజా స్వయంగా వచ్చి నీళ్ళలో ఔన్సెడు బ్రాందీకలిపి ఇస్తే పుచ్చుకొని త్వరలో తేరుకొంది.

ఇలా పరిచయం ముదిరేకొద్దీ అయ్యో పాపం అనుపిస్తున్నదేగాని ఛీగొట్టాలనిపించడం లేదు. సానుభూతినుంచి సఖ్యత ఉదయిస్తున్నది. మనస్సులో మథనం మొదలైంది. దానినుంచి బయల్పడిందే, అప్పారావు రచనలలో — ముఖ్యంగా ఎవరిచూపూ ఎక్కువసేపు నిలవని *మాటా - మంతీ, ఆలోచనలు, ప్రకృతి అనే పుస్తకం, ఆనందగజపతి దర్బారు వింతలు* వగైరా — చెల్లా చెదురుగా పడిఉన్న అమృత కలశ శకలాలు వాటినన్నిటినీ ఒకచోటకూర్చి అతికితే, అప్పారావు తనకై సాధించుకొన్న "ప్రేమ" తత్వం పూర్ణకుంభంగా దర్శనమిస్తుంది.

అప్పటికి ఆరేడేళ్ళబట్టీ కలిగిన కొత్తవింత అనుభవాలన్నీ, జీవితంపట్ల తన కొత్త వైఖరిని ఏర్పాటుచేస్తూ వచ్చి, ఇప్పుడీ అపూర్వానుభవం దానికొక్క పూర్ణతను సమకూర్చినట్లు తానే రాసుకొన్నాడు. ఆమెలో మంచికంటె చెడ్డ ఎక్కువగా ఉంవి, నిజమే. ఓర్మి కోల్పోయి కోప్పడి కంటగించుకొంటే ఆమె మంచిగా మారదు సరిగదా, మరింత రాటుదేరి పోతుంది. సాధనద్వారా నిగ్రహాన్ని అలవరచుకొని సానుభూతితో ఏ మనిషినైనా వీక్షించాలి. ముఖ్యంగా రచయిత కాదలచుకొన్న వాడికి ఇది ముఖ్యం. ఇప్పుడీమె ఉంది. ఈమె ఆశయాలేవిటి, ఆశలేవిటి, ఊహలూ, ఉద్రేకాలూ ఎలాంటివి? ఎలా పెరిగింది? పారిశర్యం ఎలా దిద్దిందీమె మనస్సును? వస్తువును వస్తుపరంగా చూడ్డమంటే మరేమిటో కాదు, ఇదే. ఇలా చూచినప్పుడు తన చూపే మారుతున్నది. తన కొత్త తత్వం ఏర్పడుతున్నది.

అన్నింటికంటె, జాలి గొప్పది. మానవులను ప్రాణులను ప్రేమించాలి. ప్రపంచాన్ని ప్రకృతిని కరుణాదృష్టితో వీక్షించాలి. ఇది సాహితీపరునకు అతి ప్రధానం. ఉత్తమ భావుకత్వానికి పరిపోషకం. 22 * ....

జగములను "సుధామయ దృష్టి"తో బ్రోచే మహానుభావులందరికీ వందనాలన్నాడు భక్తుడైన త్యాగరాజు. ఈ ప్రేమదృష్టికూడా అలాంటిదే. స్వానుభవంవల్ల తనలో అంకురించిన ఈ భావ విశేషాన్ని పెంచి నీళ్ళుపోసి పెద్దది చేసుకొన్నాడు అప్పారావు. దానికి దేశదేశాల మేలి ఎరువులు తెచ్చివేసినట్లు, తన గొప్ప రచనలన్నీ ఆ మొక్కకాచిన పళ్లేనన్నట్లు ఆయన రచనలు తెలియజేస్తున్నాయి. మొత్తానికి, ఇది లోకజీవనంలో మనిషికి ప్రవర్తనతత్వంగా రూపొందింది (Code of social conduct).

'ప్రేమ' అనే పేరుతో 1915 తర్వాత – అప్పారావు మరణానంతరం– తెలుగు కవిత్వంలో జడలు విప్పుకొన్న మిథునసంబంధమైన విప్రలంభ శృంగార భావంకాదు, అప్పారావు అంతస్తు అంతస్తుగా కట్టుకొన్న ఈ కమనీయ భావాల సౌధం. మాన్మథానురాగం దీనికి వెలికాదు గాని, ఇది దానిలో పూర్తిగా ఇమిడిపోదు. మానవుల పరస్పర సంబంధాల కంతటికీ ఇది విస్తరించింది. మరులొక్కచే ప్రేమ అనుకొంటే, మరులు వయస్సుతో మరలుతుంది. ఒంటి మిస

---

* ఇంగ్లీషు మూలంలో అప్పారావు వాడిన ఒకే ఒక్క వాక్యాన్ని సూర్యారావు ఇలా సాగదీసిపోయాడు.

మిసలతో పుట్టి అవి వాడగానే ఇది చావదు. దేహాల పరస్పరాకర్షణ వికర్షణలే దీని జనన మరణాలను నిర్ణయించవన్నమాట. ఇది "హత్కమలంపు సౌరభము," "మాయ మర్మములేని నేస్తము", "బతుకు సుకముకు రాజమార్గము", కాబట్టి "పెన్నిధి". కాసులు గేయంలో విస్తరించిన ఉపదేశం ఇదే. దానికి ఎంతో సన్నాహం ఉండినట్లు యాటావంతి తెలియజేస్తుంది.

— నాగరికతతోపాటు ప్రేమభావము పెంపొందుతూ వుంటుంది. ఆటవికుని ప్రేమ తక్కువ స్థితిలో వుంటుంది. కపట వేదాంతులు స్వార్థ ప్రవృత్తిని ప్రోత్సహిస్తారు. ప్రేమ మానవజాతికి స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. దోషములు ప్రేమారాధనవల్ల క్షిణితమౌతవి. షెల్లీ ప్రేమతత్వము ; వేదాంత దృష్టి....ప్రేమ అనే ధర్మమునకు కట్టుబడిన సమాజముమాత్రమే, ఆనంద మును ప్రసాదించగలదు.

* * *

స్వార్థాన్ని విడిచిపెట్టాలి. పరులకు ఉపకారం చేయాలి. మనిషిని ప్రేమించాలి. ఇది నిజమైన తాత్వికదృష్టి. లోకంలోవున్న అన్ని తత్వాలు దీనిని బోధిస్తున్నాయి. ప్రేమ, వ్యక్తి స్వార్థాన్ని పోగొడుతుంది. ప్రేమకన్న పెన్నిధి యింకేముంది ?

* * *

ప్రేమ, హృదయమున పుష్పించిన ఒక కోమల పుష్పం. అది అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టి, ఆత్మను తేజోవంతముచేస్తుంది. ఇది ఉన్మాదావస్థను తెచ్చిపెట్టే మోహము మటుకు కాదు. మనం, స్వచ్ఛమైన నిర్మల మైన లలితమైన పవిత్రమైన ఆత్మలను ప్రేమించడము అలవరచుకోవాలి. ఆత్మ సౌందర్యమును అవలోకించి ఆనందించే స్వభావమును పెంపొందించు కోవాలి. స్వార్థప్రవృత్తిని విడనాడాలి. వాత్సల్యము, దయ, కరుణము అనునవి ఆత్మానందమునకు హేతువులు.

* * *

మంచితనమే దైవము. మంచిని పెరగనివ్వాలి. మంచిని ప్రేమించడమే దైవమును ప్రేమించడము. దుర్గణములను రోసి, ఆత్మ, సుగుణసంపత్తిని పెంపొందించుకొంటున్నకొద్దీ అది దివ్యత్వమును పొందుతుంది. 24

యథార్థమైన స్వేచ్ఛ, ఘోరాటవిలోని నిత్యస్పర్థలో జీవన సంగ్రామంలో, అహమే కేంద్రమైన అరాజక పరిస్థితిలో, చెలరేగే మారణ ఘాతుకం (A war of

each against all) కాదు. దాంపత్యం, కుటుంబం, గణం, తెగ, రాజ్యం, జాతి జాతులకుటుంబం, అనే మెట్లు గలిగిన మానవ సంఘపు నిచ్చెన, వ్యక్తిని సమిష్టికీ 'నా'ను 'మన'కూ లోబరిచాకనే, పైకి లేచింది. అలా లోబడినందువల్ల వ్యక్తి తన స్వేచ్ఛను కోల్పోడు. ఎందుకంటే అంత క్రితం తనకు ఉండినది స్వేచ్ఛ కానే కాదు: అయినా అది ఇతరులకూ తనకూ ప్రయోజనకారిగా ఉండలేదు. ప్రమాద భూయిష్ఠంగా ఉండిన దిన దిన గండపు ఒంటరితనాన్ని వదిలి, సర్వతోభద్రమైన సమిష్టికి చెంది, అది చేకూర్చే యోగ క్షేమాలలో ఒకానొక భాగంగా తన సొంత మేలును పెంపొందించుకొన్నప్పుడే – సమాజ నిర్బంధంలోనే – స్వేచ్ఛనూ సంస్కృతినీ పెంపొందించుకొన్నాడు వ్యక్తి. ఈ ఇచ్చి పుచ్చుకోళ్ళలోనే 'ప్రేమ భావం ఉదయించింది. నాగరికత అంటే ఈ చిత్త సంస్కారమే. సంఘ ప్రయోజనం భద్రతనూ ఆనందాన్నీ కలిగించడమే అయితే, ప్రేమవల్లగాక అది మరి దేని వల్లనూ లభించబోదు. మనిషిని మనిషితో లంకెకలిపి, మనస్సును మనస్సుతో అతికి, విడివిడి అణువులనుండి సంఘాన్ని నిర్మించే హృదయ పదార్థాన్ని, ప్రేమ అని పిలిచాడు అప్పారావు. లోకనిర్వాహక ధర్మసూత్రం ఇది. సమిష్టికి పునాది అయినీ, వ్యష్టిని ఆశ్రయించుకొనింది; లేక, వ్యక్తిని అండగొన్నది గనకనే సమిష్టికి పునాది కాగలిగింది. ప్రతి ఒకడూ అనునిత్యమూ ఆచరించడానికి వీలుగా, నాగరకతా సారంగా, ఇది సర్వజన సాధ్యమౌతున్నది. నీ రూపురేఖలూ, నీ గుణ గణాలూ చూసుకొనే అద్దం, నీ యిరుగు పొరుగు వాడి హృదయమే. వాడికి పడిశంపట్టితే నువ్వు తుమ్మాలి; నీ కంట నలుసు పడితే, వాడి కన్ను కలగాలి.

కోంట్ (Comte) మానవతావాద మతభావన కంటె భిన్నమైనదది; లోక జ్ఞానంతో ఏర్పడి ఆచరణీయమైన ప్రవర్తనా సరళి మాత్రమే. ప్రేమించడమంటే మనిషి తన వ్యక్తిత్వాన్ని విస్తృతం చేసుకోవడన్నమాట. స్వార్థం దృష్టితో చూచినా, ఇతరులను మనం ప్రేమిస్తే, మన నితరులు ప్రేమిస్తారు కాబట్టి ఇది లాభ సాటి వైఖరే (Enlightened self -Interest). తత్వం దృష్టితో చూస్తే, ఇది మాలిన్యాన్ని క్షాళనంచేసి ఔదార్యాన్నీ సౌజన్యాన్నీ సఖ్యాన్నీ సామరస్యాన్నీ పెంపొందించి దివ్యాంశను బలీయం చేస్తుంది. "ఒాకరి నొకరు ప్రేమించుకోవడం ఎంత మహత్తరమైనదని! ఈ భూమి మీదకు స్వర్గం దిగివచ్చినంత! భూలోక స్వర్గమే!"25

మతంకాకున్నా మతస్థాయికి పెరిగిన భావావేశంతోటి మార్మికవాదచ్ఛాయ తోటి ఇబ్సెన్ ప్రభృతులు ప్రేమ గురించి రాసి ఉన్నారు. ఇబ్సెన్ తన భావాలను

ప్లేటో SYMPOSIUM నుంచి, డేంటీ VITA NUOVA నుంచి స్వీకరించి, సమకాలిక 'బూర్జువా' ప్రణయభావననుంచి వేరుపడి, ప్రేమ నొక ఆదర్శవాదంగా పెంపొందింపజేస్తూ, COMEDY OF LOVE నాటంకలో మాన్మథానురాగానికి అతీతమైన మిథున ప్రేమను చిత్రించాడు; ప్రేమకుగల దేవతాస్వభావాన్ని చిత్రించాడు. ప్రేమ పేరిట సన్యాసాన్ని గానీ, బ్రహ్మచర్యాన్ని గానీ నైతిక 'పావిత్ర్యాన్ని' గానీ ఆయన మిన్నుల కెత్తలేదు. యథార్థాన్ని విడిచి ఆదర్శపు సాము చేయలేదు. మనుషుల రక్తమాంసాల ప్రేరణలను దౌర్బల్యాలుగా ఎంచలేదు. కాకుంటే ఆయన కోరింది, సద్వర్తనను మాత్రమే! ఇది 'నీతి'కి సంబంధించిన విషయం కాదు; ఇప్పటికంటే సుఖవంతమైన జీవనరీతికి సంబంధించిన విషయం. ఆయన 'ప్రేమ' భావనకుకూడా కొన్ని మూలాలు లేకపోలేదు. అవి చాలావరకు మత ప్రవక్తల బోధలకు సంబంధించినవే అయినా, మతానికి మాత్రమే సంబంధించినవి కావు. బుద్ధుడుగానీ, ఏసుక్రీస్తుగానీ మత ప్రవక్తలు మాత్రమే కారు: భవ్యమైన జీవిత రీతినికూడా ఉపదేశించిన వాళ్లు. అలాగే షెల్లీ కవిమాత్రుడేకాడు; గాడ్విన్ (Godwin) భావాల ప్రభావం వల్ల కవిత్వంలోనూ జీవిత తత్వాన్ని నిక్షేపించినవాడు. అప్పారావు రాసిన ఒక లేఖలో ఈ ముగ్గురిపేర్లూ కనిపిస్తున్నాయి:

> తనయుగంలో వున్న అవధులలో పోనీ, క్రీస్తు యేది బోధించాడనుకుంటున్నామో, దేన్ని కళావిలాసమని కవితాసత్యమని షెల్లీ ప్రవచించాడో, ఇదీ ఉత్తమమైన రాజమార్గమని దేనిని బుద్ధుడు మనకు ఉపదేశించాడో, అదే నిజమైన ఉన్నతమైన ప్రేమ! మానవ జాతిపై మనకు వుండవలసిన ప్రేమ.[26]

తన పఠనాగారంలో గౌతమబుద్ధుని ప్రతిమకు ప్రతి ఉదయమూ ఒక్కొక్క పుష్పాన్ని అర్పిస్తూ వచ్చిన అప్పారావుకు, వైదికమతం కంటె బౌద్ధమే ఎక్కువగా నచ్చిందని తీర్మానించుకోవడానికి పై వాక్యాల వెనువెంటనే వచ్చే వాక్యంకూడా ("ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో, ఆనాడే భారతదేశం మత విషయక ఆత్మహత్యను చేసుకుంది.") ఆధారమౌతున్నది. బౌద్ధంలో ఆయనకు నచ్చుబాటైన అంశం, కారుణ్య దృష్టితో గూడిన భూతదయ అనుకోవాలి, ఆర్య మతద్వారాలను బార్లాతెరిచి సామాన్యులుకూడా అనుసరింపదగిన ధర్మాన్ని బోధించి బుద్ధుడు మొదట మతప్రవక్తగా గాక సంఘసంస్కర్తగానే కనిపించి ఉంటాడు. బౌద్ధం మత విప్లవంగాకంటె సంఘవిప్లవంగా అనేకులను ఆకర్షించి ఉంటుంది.

> At the root of Buddhism, there is certainly a rigid metaphysical theory, but it is not this that has united people under its

banner. Its friendship, its pity and mercy, and the universal love preached by the Buddha have helped to remove barriers between men and men. 27

బౌద్ధంలో ఆదినుంచీ రెండు ధోరణులుంటూ వచ్చాయి: 'వినయం' ద్వారా అహాన్ని దమించి ఇహాన్ని నిరాకరించే దొకటి; సర్వభూతాల ఎడల సమభావం గలిగి దయను పెంపొందించుకొనే దింకొకటి; మొదటిది ఇహాన్ని తృణీకరించి 'నిర్వాణ' పరమైనది; రెండోది బోధిసత్వ సిద్ధాంతంద్వారా మానవసేవా పరమైనది. ఈ చివరిదే అప్పారావులాంటి కారుణ్యవాదులను విశేషంగా ఆకర్షించింది.

ఏసుక్రీస్తు బోధలు గౌతమబుద్ధుని ప్రవచనాలకంటె భిన్నమైనవికావు. క్రైస్తవం బౌద్ధానికి కొన్ని ముఖ్యవైఖరులలో ఋణపడి ఉందనడంకూడా చారిత్రక వాస్తవమే. అలాగే గ్రీసుదేశపు నాగరికత, సంస్కృతి – ముఖ్యంగా ప్లేటోతత్వం జూడాయిజాన్నీ క్రైస్తవాన్నీ కొంతవరకు స్పృశించిందికూడా. నీతికథలరూపంలో (Parables )నీతి బోధల రూపంలో (Sermons) క్రీస్తుబోధించింది అంతాకలసి 'ప్రేమ' కిందికే వస్తుంది. క్రీస్తు జీవించిందీ శిలువెక్కిందీ అందుకోసమే. 'ఇతరులను నీలాగే చూచుకో' మన్నప్పుడు, 'నీ కితరులేది చేస్తే బాధకలుగుతుందో దానిని ఇతరులకు నీవు చేయకుమీ' అన్నప్పుడు, 'నీ విరోధిని కూడా ప్రేమించు' మన్నప్పుడు క్రీస్తు ఉపదేశించిన నీతి మత పరమైనట్టిదేకాదు. ద్వేషం మనిషిని మృగతుల్యుణ్ణిచేస్తుంది. ప్రేమ దైవతుల్యుణ్ణి చేస్తుంది, ఈశ్వరుడు ప్రేమమయుడు; అందరినొక్కలాగే ప్రేమిస్తాడు: అలా మనిషికూడా చేయగలిగితే మంచిది. క్రైస్తవ ప్రేమకు 'అగేప్' Agape అని పాల్ నామకరణం చేశాడు. ఇది 'ఈరోస్' Eros కంటె భిన్నమైనదే కాక వున్నతమైనది కూడా. ఇది పరిమితమైనది, కొంతవరకు స్వప్రయోజనపరమైనదిన్నీ: ఇవ్వడంకంటె తీసుకోవడమే ఇందులో ఎక్కువ. 'అగేప్' అలాకాదు.

We may understand erotic love as a reaching out to complete one's self, in expression of and response to a deep inner need, and agapic love as a transcendent act of self - sacrifice, a love more outgoing than outreaching, a love that gives with no thought of getting. Eros may be absorbing, and may in mutuality even ground the human community; but *eros* inescapably remains self - fulfilling, self - rewarding, self - possessive. Sacrificial love, or *agape*; on the other hand, in Reinhold Niebuhr's words :

"Completes the incompletensss of natural love (*eros*...")28

ప్రేమ' అనే భావం ఒకొక్క ఛాయనుబట్టి గ్రీక్‌భాషలో ఒకొక్క పదాన్ని ఆశ్రయించిన ఫలితమే, ఈ EROS, AGAPE ల మధ్య గల గుణాత్మకమైన భేదం. ప్లేటో (Plato) మానవ ప్రేమద్వారా, దానికి అంతిమఫలంగా సాఫల్యంగా దైవ ప్రేమను ప్రతిపాదించగా, అదే బైబిలులో ఈ సూక్ష్మార్థాలను సంతరించు కొన్నది. మంచిని మించిన దైవానికి ఆయన భావనలో చోటు లేకపోవడమేగాక, ఆ మంచి ఐహిక జీవన సంబంధి కావడమే విశేషం.*

ఇక, 'ప్రేమ' విద్యా గురువులలో మూడవవాడైన షెల్లీ (Shelley) భావనా క్రమాన్ని కూడా స్థూలంగా పరిశీలించాలి. కవిత్వం మానవజాతికి మేలు చేకూరు స్తుందని ఎంచి, ఆ మేలు నైతికమైనట్టిదేనని విశ్వసించిన అపురూప కవి - వ్యక్తి షెల్లీ. అయితే, కవిత్వాన్ని శుష్కోపదేశాలతో, ధర్మోపన్యాసాలతో నింపివేసినందు వల్ల ఆసత్ఫలితం చేకూరుతుందని ఎన్నడూ ఆయన భావించలేదు. కావ్య సౌందర్యం తన్మూలంగా దెబ్బతినగూడదు. కావ్యం భావనామయం (Inaginative) భావ బంధురంగా ఉండాలి. అలా ఉన్నప్పుడే పైజెప్పిన నైతిక ప్రయోజనం చేకూరు తుంది. మనుషుల నీతి సూత్రాలన్నిటికీ ప్రేమ హృదయపదార్థం కావాలి. అది భావన ద్వారా సాధ్యమౌతుంది. భావన కారణం కాగా, కవిత్వం నైతిక శ్రేయస్సు అనే ఫలాన్ని కలిగిస్తుంది. మరి ఈ 'ప్రేమ' ఎలాంటిది? షెల్లీయే చెప్పినట్లు, అది,

---

* గ్రీక్‌భాషలోకి అనూదితమైన NEW TESTAMENT లో 'ప్రేమ' భావాన్ని వెలిబుచ్చే శబ్దాలు మూడున్నాయి. ఒకటి EROS. ప్లేటోతత్వంలో ఈ మాటకు అర్థం, దివ్యలోకాలకై మానవాత్మ పడే తహతహ. పోనుపోను మిథునానురాగపరమైన శబ్దంగా మారింది. రెండవది PHILIA. ఆప్తమిత్రుల పరస్పరాభిమానాన్ని సూచిస్తుంది. తాను ప్రేమమయుడు గనుకనే ఒకడు మరొకణ్ణి ప్రేమిస్తాడు. మూడవది AGAPE. సమస్త మానవులను సస్నేహంగా సానుభూతితో బోధపరచుకోవడాన్ని ఇది సూచిస్తుంది. ఇది అవ్యాజమైనది, ప్రతిఫలాకాంక్ష లేనిది, సహజోద్భవమయ్యేదిన్నీ, మానవాత్మ పరమాత్మ అంశం గనకనే మనుజులమెడ దేవుని వాత్సల్యభావంలాంటి దౌతున్నది ఈ AGAPE. స్వార్థంగాక, పక్కవాని మంచి దీని సదాశయమౌతున్నది. It springs from the need of the other person-his need for belonging to the best in the human family. It is love, seeking to preserve and create community. It is insistence on community even when one seeks to break it.

కాబట్టి AGAPE అనేది పూర్తిగా పరలోకసంబంధమైన ప్రణయభావానికి చెందిన మాటకాదు. సంఘ సృష్టిస్థితులకు మూలకందమయ్యేంత మేరకు, అప్పారావు 'ప్రేమ' తత్వం దీనికిగూడా సన్నిహితగాం ఉందని అనుకోవచ్చు.

A going out of our nature, and an identification of ourselves with the beautiful which exists in thought, action or person, not our own.

'పరార్థ ప్రాపకత్వమే' కాదు, స్వార్థపరిత్యాగంకూడా ఈ ప్రేమ సిద్ధాంతంలో ఆవశ్యకమౌతున్నది. ప్లేటోకూడా ఆశించిన సత్యమ్ శివమ్ సుందరమ్ తోటి ఇది ముడిబడుతున్నది. మానవజాతి గతాన్ని గురించీ భవిష్యత్తును గురించీ షెల్లీకి కొన్ని సిద్ధాంతా లున్నాయి గాని, వాటికంటె ఆయన ప్రేమ భావనకే నైతిక ప్రాశస్త్యమెక్కువ, అని బ్రాడ్లీ అన్నాడు.

In the end, for him, the truest name of that perfection called Intellectual Beauty, Liberty, spirit of Nature, is love. What ever in the world has any worth is an expression of love. Love sometimes talks. Love talking musically is poetry. 29

గురువైన గాడ్విన్ సూత్రప్రాయంగా నిర్దేశించిన సర్వలోకోపకార శీలత, షెల్లీ కవిలో ఉత్తమ జీవన పథంగా పర్యవసించింది. నైతిక, మానసిక సర్వ సమగ్రత, ఉన్నతాదర్శ ప్రేరితమైన హృదయౌదార్యం, ప్రాణానికి ప్రాణమైన (Life of Life) ప్రేమ – ఇవీ షెల్లీ ఆశించిన విషయాలు. నిజానికి, గురజాడ అప్పారావు మనస్సున చెరగని ముద్రను వేసినవి గూడా ఇవే. ఈ సదావేశ వివశతలో సాధ్యాసాధ్యాలనుకూడా గమనించలేకపోయాడు షెల్లీ. తత్వమనే నికషోపలం లేనందుచేత, సాంఘికాచారాలలో వ్యవస్థలో సంస్థలలో మేలిమి బంగారేదో, కానిదేదో తేల్చుకోలేక, సంస్థల నన్నింటినీ కుప్పగూల్చగోరాడు.

Much that he would fain have destroyed, because he found it customary, was solid, true and beneficial.30

విగ్రహ విధ్వంసనమే ధ్యేయమైపోయింది. ఉద్ధతీ మూకుడూ ఎక్కువైంది. చివరికది ఉన్మత్త విజృంభణమే అయింది. సింహాసనాలు, పూజాపీఠాలు, న్యాయ వేదికలు, కారాగృహాలు – tomes of reasoned wrong, glazed on by ignorance శిథిలమై శకలప్రాయమైపోగా, అసహ్యకరమైన ముఖాచ్ఛాదనం ఊడిపడి

— the man remains
Sceptreless, free, uncircumscribed, but man
Equal, unclassed, tribeless and nationless,
Exempt from awe, worship, degree, the king
Over himself, just, gentle, wise.

ఇలా ఆదర్శ మానవుడు అవతరిస్తాడు. భూమి బాధానిర్ముక్తమౌతుంది. షెల్లీ స్వాప్నికుడు, మహోద్రేక పరవశుడు. అప్పారావు అలాకాదు. కనుకనే సంఘ వ్యవస్థ సంస్థా స్వరూపం వంటి విషయాలలో ఆయన ఆలోచనలూ, పథకాలూ ఎంతో నిదానాన్నీ వివేచననూ చూపెడుతున్నాయి. సంప్రదాయానికీ పుష్కలమైన ఆచారాలకూ ఆయన అంతర మెంచాడు. ఆచరణ యోగ్యత, ఆయన సిద్ధాంతాని కంతటికీ గల ఒకే ఒక్క గీటురాయి; స్తిమితం, దానిబలం; క్రమాభివృద్ధి, దాని మార్గం.

సంస్థా సమాహారమైన మానవ సమాజం తన అభిప్రాయాలనూ ఆలోచనలనూ ఆ సంస్థలలో నిక్షేపించి, వాటిని తనకు స్వల్పాకృతులుగా తీర్చి దిద్దుకొంది. అవసరం చొప్పున సత్ప్రయోజనాపేక్షతో ఏర్పడిన ఈ సంస్థలు నియమాల ద్వారా నిబంధనల ద్వారా సామాజిక జీవనంలో క్రమబద్ధతను కలిగిస్తూ, కాల క్రమంలో మనుష్య వ్యక్తుల కామనలకంటె వెనుకబడిపోయి, పురోగతిని నిరోధించసాగాయి. ఆచారం, సంప్రదాయం, 'నీతి' వగైరా భావాలు గుదిబండలుగానూ సంకెళ్లుగానూ అంకుశాలుగానూ పరిణమించాయి. కాబట్టి సంస్థలను మూలమట్టంగా నిర్మూలించడమా, లోపాలను సవరించి నిర్వక్రంచేసి సంస్కరించడమా, అనేది తాత్త్వికులను ఇరు కూటాలుగా విభజించింది. గాడ్విన్‌వంటి అరాచకవాది శిష్యుడైన షెల్లీకి పనిబెడితే, వీటినన్నిటినీ రద్దుపరచి ఉండేవాడు. మనిషిలోని మంచిని అతకరించి ప్రతిభను శృంఖలాబద్ధం చేస్తున్నాయికాబట్టి, సంస్థల నిర్మూలనం ఆయన ప్రణయభావనలో ఒక భాగమే అయింది.

అప్పారావు షెల్లీలా అరాచకవాదీ కాదు, విధ్వంసాన్ని అపేక్షించనూ లేదు. * సంస్థా ధర్మమనేది రకరకాల డాబుసరిపేర్లు పెట్టుకొని చిత్తవృత్తుల స్వచ్ఛందగతికి ప్రబలాటంకంగా పరిణమించినప్పుడు, ఆ సంస్థల అవసరాన్ని కాదనకుండానే వాటి ఇతోధిక ప్రతిష్ఠతకోసమే ఎదిరించి లొంగదీసి మార్చాలని మాత్రమే, ఆయన చెప్పింది. ఉదాహరణకు, అప్పారావు ఆలోచనకు బాగా పనిబెట్టింది, వివాహసంస్థ. వివాహమూ, వివాహబాహిరమైన వేశ్యావృత్తి, ఆయనదృష్టిని బలంగా

---

* ఈ విషయంలో ఇంగ్లాండులోని utilitiarianism అప్పారావును ప్రభావితుణ్ణిచేసి ఉండవచ్చు. బెంథామ్ (Bentham) జె. యస్. మిల్ వగైరాలు సంస్థా సంస్కరణను మానవ సుఖానుగుణంగా చేయ సంకల్పించినవాళ్లే.

ఆకట్టుకొన్నాయి. సంఘ నిర్మితిలో పునాదిరాయిగా ఉండి, అనేక అభ్యుదయాత్మక పరిణామాలకు తోడ్పడిన వివాహసంస్థకు ఆయన ప్రతికూలుడేమీ కాదు. అయితే అది బండరాతిగోడగా మారింది. నిత్యజీవితంలో అనేకానేక ఉల్లంఘనలను సహిస్తూ, శల్యావశిష్టమైంది. యజమాని, బానిస సంబంధాన్ని దంపతులమధ్య నెల కొల్పేంతవరకు పతనమైంది. యావజ్జీవ కారాగారవాస శిక్షలాంటిదై, మనుషులను బయట బడనీయక, సంఘావసరాలను మత ప్రమేయాలకు లోబరచివేసింది. వివాహబంధం అనేకులకు – ముఖ్యంగా అబలలకు – ఉరితాడో కట్టుదాడో అయినంతగా, మగవాళ్ళకు ముగుదాడు కాలేకపోయింది. "కన్నీటి గాథలకు కారణం" అయింది. పురుషాధిక్యతగల సాంఘిక వ్యవస్థస్థానే స్త్రీ పురుష సమానాధిక్యతగల మరొక వ్యవస్థ ఏర్పడుతున్న రోజులలో, స్త్రీ కలదెలుసు కొని తన 'హక్కు'లకై పోరాడుతున్నది. షెల్లీ సరేసరి. జార్జి ఇలియట్ (George Eliot) వంటి నవలాకారిణికూడా వివాహమనే భావాన్ని తోసివేస్తున్నది. ఈ పరిస్థితిలో "ఆధునిక మహిళలు మానవ చరిత్రను తిరిగి రచిస్తారు."[31] ఇది భావ్యర్థంలో చెప్పిన మాట మాత్రమేకాదు, విధి అర్థంలో చెప్పిందికూడా.

ఇక్కడే మళ్ళీ ఇబ్సెను నాటకాల ప్రభావం అప్పారావుమీద ప్రసరించిందని అనుకోవాలి. అప్పటికే వాటినీ వీటితోబాటు ఇబ్సెను జీవితాన్నీ, బెర్నార్డ్‌షా ఇబ్సెన్ నాటకాలసారం పైరాసినగ్రంథాన్నీఅప్పారావుఅధ్యయనం చేసివున్నాడు. 'ఆడతనం'గా చలామణి అవుతున్న కోమలత్వం, మెతకదనం, అబలాత్వం, లొంగుబాటు వగైరా భావాలకు ఇబ్సెన్ నాటకాలు గొడ్డలిపెట్టయ్యాయి. స్త్రీకి పురోగమనపథం ఈ 'ఆడ తనాన్ని' విడిచిపెట్టడమే. సంస్థలను మీరి, ఆదర్శాలనబడేవాటిని అతిక్రమించి మనిషి మునుసాగుతున్నాడు. స్త్రీకి సంబంధించి, పితూరీ తప్ప మార్గాంతరంలేదు. వివాహ సంస్థగానీ ఇతర సంస్థలుగానీ శిలాశాశ్వతాలుకావు. స్త్రీ జాతి విమోచన మనేది స్త్రీ జాతి చేసుకోవలసిందే. కార్మికులూ స్త్రీలూ మానవజాతికి స్వేచ్ఛా స్వాతంత్ర్య దాతలౌతారని ఇబ్సన్ ప్రవక్తలా చెప్పాడు.[32] ఒకవిధంగా అప్పా రావు ఈ అభిప్రాయాలకు వారసుడే.

స్త్రీ విద్యతో తీరిపోయే బెడద కాదిది. విద్యావంతురాలైన స్త్రీకూడా సాంఘిక అక్రమాలకు బలిపశువౌతున్నది. కనకనే వీరేశలింగం ప్రారంభించిన స్త్రీ జనోద్ధరణ కార్యక్రమానికి ప్రత్యక్ష జీవితంలో స్ఫూర్తిని కలిగించేందు కొక అప్పారావు అవసరమయ్యాడు.

ఒక నవలకు కూర్చిపెట్టుకొన్న సన్నివేశాలలో, దాంపత్యమనేది స్త్రీకి అత్యావశ్యకమని 'కవి' అన్నప్పుడూ, *సంస్కర్త హృదయం* కథలో అలాంటి మాటలనే ప్రొఫెసరు రంగనాథ అయ్యరు అన్నప్పుడూ, అక్కడ సౌదామిని ఇక్కడ సరళ ఉభయులూ వేశ్యా రక్తస్పర్శగలవారే కాబట్టి, ఎల్లకాలమూ ఒక్కడితో పడివుండడానికి తీవ్రమైన విముఖత చూపెడుతారు. భర్త వికలాంగుడైనా రోగిష్టి అయినా దుష్టుడైనా, యావజ్జీవమూ భార్య అతని చెప్పుచేతల్లో ఉండిపోవల సిందేనా? భార్యలు బానిసలు కాబట్టి సరిపెట్టుకు పోతారుగాని ఆ లోపాలే భార్యల్లో ఉంటే భర్తలు సహించి ఊరుకోరు. పబ్లిగ్గా అవినీతికి స్త్రీ పాల్పడలేదంటే ఈ పరాధీనతే కారణం; పురుషుడో? దర్జాగా 'నీతి' సూత్రాలను తెగడెంచి వేస్తాడు. ఈ అసహాయ పరిస్థితిలో స్త్రీకి ఖిన్నత తప్ప మార్గాంతరం లేకుంది. కుమిలి కుమిలి పోవాలి తప్ప ధిక్కరించలేకుంది.

అంత మాత్రాన వివాహ సంస్థను రద్దుపరచడమేనా? తర్వాత ఇష్టారాజ్యమేనా? ఆరణ్య జీవనానికి తిరిగిపో నక్కరలేదు. వైవాహిక విధానం పట్లనే నిరసనంగాని, వివాహ ప్రయోజనం పట్ల కూడదు. స్త్రీ స్వేచ్ఛ వివాహవాహిరమైనది కాబోదు. సంసారికీ, సానికీ అంతర మిక్కడే. మెడవంచి తాళికట్టించుకోనందుచేత ఒక ఆడది నిర్భయంగా లైంగిక స్వేచ్ఛను అనుభవించగలుగుతున్నది. సంసార స్త్రీ లాగా దొంగకూళ్ళు కుడవాల్సిన అక్కర తనకులేదు. కులవృత్తికి తాను బద్ధురాలై ఉంది. సమాజం తమకు కేటాయించిన 'ధర్మం' ఇది. కాబట్టి అవినీతిపరురాలని వేశ్యను నిందించే హక్కు ఎవ్వరికీ లేదు. మధురవాణి పూట కూళ్ళమ్మ వద్ద చాటిన హక్కులు సమాజం తమ కులానికి ఇచ్చి గుర్తిస్తూన్నట్టివే.

> వ్యభిచారమే తన వృత్తిగా 'లేబిల్' వేయబడ్డ భోగం పడుచు సమాజాన్ని మోసగించడం లేదు....ఆమె ఏ వివాహ బంధనాలనూ వైవాహిక సూత్రాలనూ ఉల్లంఘించడం లేదు. [33]

ఇది వేశ్యావృత్తిని సమర్థించడం కాదు. కాదని స్వయంగా అప్పారావే గిడుగు రామమూర్తితో చెప్పినట్లు, క్రితంలో పేర్కొన్న ఒక వ్యాసంలో డా॥ జి.వి. సీతాపతిగారు రాశారు: "ఆ వృత్తిని గర్హించినా ఆ కులంలో పుట్టి సనాతనంగా ఆ వృత్తి ధర్మాన్ని సాగిస్తున్న వేశ్యలను చూచి దుఃఖిస్తాను గాని, వ్యక్తిగతంగా, వారి నెవ్వరినీ నిందించను. పెండ్లిచేసుకొని మగనాలిగా ఉన్న స్త్రీ వ్యభిచరిస్తే గర్హిస్తాను గాని నిందించను."

మధురవాణి, మంజువాణి, సరళ వంటి వేశ్యలపాత్రలు ఎక్కడో ఒక్కచోటనైనా సంసారి స్త్రీల వ్యభిచారాన్ని దుయ్యబట్టి ఆత్మసమర్థన చేసుకొన్నాయి. అయితే వివాహాన్ని అవి తూలనాడలేదు. పైపెచ్చు దానివైపు మొగ్గు చూపాయి కూడా. ఒకభర్తకు ఆమరణదాస్యమంటే రోయింపు: మరోవైపు అనురాగాల నిలకడపై గురి. శృంగారం తగ్గాక, వేశ్యలా, సంసారి స్త్రీ, భర్త ప్రేమానురాగాలకు దూరంకాదు. శరీర సంబంధాలు సన్నగిల్లిపోయినా, వాటిద్వారా, ఏర్పడిన మనోనుబంధం దంపతులను స్నేహితులుగానైనా మారుస్తుంది. వేశ్యకు జీవిత భద్రతలేదు. ఎవరికో ఒకరికి 'చెంది' పోగోరడ మిందుకే. తాత్కాలిక రక్తోద్రేకాల ఉపశమనానికిగాక, మాన్మథానుభవమనేది భవబంధాల స్థైర్యానికి దారితియ్యాలని కోరిక. పిల్లలకూ పాపలకూ తహతహ. ఉండూరిలోనే అమలుజరిగే సాంఘికమైన 'వెలి'ని వదిలించుకొని, నలుగురితో నారాయణత్వం కోసం పాకులాట.

వేశ్యాసంఘ సంస్కరణం మంచిదేగాని, దాని ముసుగున వేశ్యావిధేయులై పోయేవాళ్ళూ లేకపోలేదని అప్పారావు గిడుగు రామమూర్తితో అన్నాడు, "ఫౌజు ఫౌజంతా మాటల్లో యాంటీనాచ్చే"నని కట్టగట్టి విమర్శించినా, సంస్కర్తల సదుద్దేశాన్ని గుర్తించాడుగాని, ఈ సంస్కరణ వేశ్యలలో వేశ్యలద్వారానే జరగాలన్నాడు. బయటినుంచి పెద్దపెద్ద కబుర్లతో ధర్మపన్నాలతో వాళ్ళలో చిత్తసంస్కారాన్ని కలిగించడం సాధ్యంకాదు. పైగా, సంస్కర్తలంటేనే వేశ్యలకు అరికాలిమంట నెత్తికెక్కిన రోజులు, వాళ్ళ జీవనాధారం -'నోటికాడికూడు'- పోతుందేమోనన్న భయం, సంస్కరణకు ప్రతికూల వాతావరణాన్ని కల్పించాయి. ఆదర్శబలంతో, యథార్థ పరిస్థితులలోని సూక్ష్మాల నన్నిటినీ గ్రహించని సంస్కర్తలు వైఫల్యం చెందక తప్పదని అప్పారావు అనుకొన్నాడు.

రథానికి రెండోచక్రమైన స్త్రీని కింద చెయ్యడంవల్ల, రథానికే నష్టం. మానవజాతిలో సగం దాస్యంలో ఉండి మిగిలిన సగం స్వాతంత్ర్యం అనుభవించలేదు; పురుషకూటమి అనుభవించేది స్వాతంత్ర్యంకాదు; వట్టి స్వాధిక్యం, దాష్టీకం. ఈ అన్యాయాన్ని చిత్రించడానికే అప్పారావు కథలూ, నాటకాలూ ఉత్తమమైన స్త్రీపాత్రల నాశ్రయించాయి. స్త్రీజన విమోచన గురించి అప్పారావు ఏర్పరచుకొన్న అభిప్రాయాలు అనన్యాలు.

సంఘ పునర్నిర్మాణం గురించిన అభిప్రాయాల్లో కూడా, అప్పారావు తన సమకాలికులకంటె ముందంజవేశాడు. 'లిబరల్' రాజకీయ సంప్రదాయాన్ని బాగా ఒంటబట్టించుకొని, 'బహుజన సుఖాయ బహుజనహితాయ' సూత్రానికి రూపాంతరం వంటిదైన The greatest good of the greatest number తత్వానికి సుముఖత చూపుతూ వచ్చిన భారతీయ మేధావులలో తానొకానొకడుగా మిగిలిపోలేదు. సంఘ సంస్థలను చూచినవిధంగానే రాజ్యసంస్థలను కూడా పరీక్షాదృష్టితో విమర్శగా చూసి బాగోగులను వెలికి దీయ బూనుకున్నాడు.*

అప్పారావు మనస్సును మలిచింది. పాశ్చాత్య భావజాలమైతే కావచ్చు నేమోగాని. పాశ్చాత్య రాజ్య వ్యవస్థమాత్రం ఆయనను ప్రలోభపెట్టలేదు. సరిగదా భ్రమల పాల్జేసి మభ్యపెట్టే సమస్యే లేదు. ప్రజాతంత్ర జీవనసరళిలో నమ్మిక ఉండింది. తన ప్రేమ తత్వం మనుషులలో పరస్పరం సహిష్ణుతనూ సహకారాన్నీ వృద్ధిచేసి ప్రజాతంత్రం యథార్థమూ బలీయమూ అయేందుకు సాధనమౌతుందని కూడా ఒక చోట రాశాడు. ప్రేమ తత్వానికి మూలకందమని షెల్లీ కవి కూడా పేర్కొన్న భావనాశక్తి మానవ సమానతా దృష్టిని బలపరచి మనుషులను "ప్రజాస్వామిక గుణ సంపన్నులను కావిస్తుంది."34

సదరు ప్రజాతంత్రమే వ్యాప్తిలో ఉంటున్న పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థ వ్యక్తివాదం ద్వారా స్వార్థప్రవృత్తిని ప్రోత్సహించి, మానవీయ మూల్యాలను అడుగుకు నెట్టుతున్నదని కూడా ఆయన గమనించకపోలేదు. పాశ్చాత్య నాగరికత ప్రబోధించే స్వాతంత్ర్యం యావన్మందికీ ఉపయుక్తం కావడంలేదు. నోరు కల వాడిదే ఊరు. ఆరణ్య నీతి (Jungle Law) అమలు జరుగుతున్నది, ఇలాంటి స్వాతంత్ర్యం "సాంఘిక ప్రగతి శూన్యమైనది". ఇది సంపూర్ణ స్వాతంత్ర్యము కాదు" అంటూ, "ఈ అవలక్షణములను, దోషములను, చెడుగులను ఘోరజని దిగ్విజయముగా ఎదిరించి పోరాడుట నేటి ప్రప్రథమ సమస్య"అని ఉద్ఘోషించాడు కూడా. 35 Each one for himself, and the Devil take the hindmost

---

*ఆనంద గజపతి కొలువులోని ఇంగ్లీషు ఉద్యోగులలో స్టీవెన్సు "వట్టి కన్సర్వేటివు"; టర్నరు 'రేడికల్' కాబట్టి ఆయనతోపాటు అప్పారావు కూడా టర్నరును అభిమానించాడు. బ్రిటనులో జరుగుతూవచ్చిన ఎన్నికలలో ఆనాటికి అభ్యుదయవాదులైన 'లిబరల్సు' లోనే ఈ 'రేడికల్సు' మెరుగనిపించారు. ప్రభువూ 'సేవకుడూ' ఈ రాజకీయ పరిణామాలను చాలా జాగ్రత్తగా పరిశీలిస్తూ వచ్చారు.

అనే వైఖరివల్ల సన్నజనాలు ఇబ్బందులపుట్టలో చిక్కుకొనిపోతున్నారు. 'ప్రజా స్వామికం' ఆర్థికంగా లోపభూయిష్ఠమై అనర్థదాయక మౌతున్నదికాబట్టి "పాటకపు జనుల స్థితిగతులను చక్కబరచి, వారిని అభివృద్ధికి తేవడం ప్రజాస్వామికపు లక్షణం" అని ఆయన భావించాడు. 36

వ్యక్తికీ సమష్టికీమధ్య; స్వేచ్ఛకూ సంఘీభావానికీమధ్య; వ్యక్తి స్వాతంత్ర్య పూరితమైన ప్రజాతంత్రానికీ సామాన్య ప్రజాసౌఖ్యాభివృద్ధికీమధ్య: సామరస్యాన్ని కలిగిస్తేనే తప్ప, ఉభయార్థాలూ ఫలించవు. గాలివాలున వచ్చిపడే సిరులకోసమో, పై వారిచ్చేదయా ధర్మభిక్షకోసమో పడిగాపులుపడే ప్రజలున్నంతకాలం, ఏ జాతీ అభివృద్ధిచెందదు. కాయకష్టం అపరిష్ఠ అనే అభిప్రాయంపోవాలి. "పాడిపంటలు" పొంగిపొర్లేవిధంగా ప్రతి వ్యక్తీ శ్రమించినప్పుడు, "నరుల చెమటను తడిసి" దేశం కల్పవృక్షమై "ధనం పంటలు" ప్రసాదిస్తుంది. భౌతిక సంపదకు నిలయమైన వసుంధర, రత్నగర్భ, కావాలిదేశం. అన్నకాటకానికే కాటకం కలిగేంత వస్తు సమృద్ధి ... దేహ దారుఢ్యమూ మానసికోల్లాసమూగల ప్రజ .... సవ్యసాచివలె వ్యవసాయాన్నీ పరిశ్రమలనూ నిర్వహించే నేర్పు.... ముందుకీ మీదికీ సాగే సంకల్పం.... కత్తులు నాగటి కర్రులుకాగా, కళలూ శాస్త్రాలూ పల్లవించి ఫలించే శాంతిప్రియ మనస్కృత.... జాతులమధ్య భావ, వస్తు ఆదాన ప్రదానాలు.... అరమరికలు లేక ప్రేమమయమైన మనుష్యగణం.... సౌహార్దం, సౌజన్యం, అనురాగం అని త్రిముఖాలుగా వెడలే హృదయకుసుమ సుగంధం....ఇదే భూతల స్వర్గం! లోకమంతా ఒక్కలోగిలి .... సముద్రం స్థానంలో అపారమైన ప్రేమ....ఇదే దివ్యత్వం! మానవవ్యక్తినుంచి లోకవ్యక్తి వరకు సాగిన ప్రేమతత్వం, అంతస్తు మీద మరో విశాలతరమైన అంతస్తుగా, భూదివాలను కలిపేట్లుగా మహావాస్తుశిల్పి మనఃప్రాంశుత్వానికి నిదర్శనమైన భావసౌధాన్ని నిర్మించింది.

ఇంతటి కమ్మని కలగంటూ కంటూ గురజాడ అప్పారావు తనజీవిత నౌకను అజ్ఞాత మహాసముద్రం మీదికి విడిచాడు. యుద్ధం దాపురించి లోకం గురించిన తన స్వాప్నిక దర్శనాన్ని బీభత్సమయం చేసింది.

"యుద్ధమా ? ఇకనేమిలోకము !
చాలుచాలును, లంగరెత్తుము."

1. గు. ర. మ. డై : ఏప్రిల్ 17, 1895 ; పు. 72
2. ఆలోచనలు : గు. ర. మా. మం; పు. 29

3. The Renaissance : *Walter Pater, P. 17*
4. The Intellectual in India : *Nirad C. Chaudhury, P. 43*
5. మాటా – మంతీ : గు. ర. మా. మం; పు. 59
6. గు. ర. మ. డై : ఏప్రిల్ 5, 1895 : పు. 38
7. ,, : మే 2, 1895 : పు. 104
8. ఆధునిక ఆంధ్ర వచన రచన : గు. ర. వ్యా., పు. 113
9. గు. ర. మ డై : , పు. 101
10. ,, , పు. 173-174
11. హరిశ్చంద్ర నాటక పీఠిక : గు ర. మా. మం., పు. 115
12. తాత్త్వికచింతన . గు. ర. లే; పు. 117
13. సాహిత్యలేఖలు : నాటకగోష్ఠి – గు. ర. లే ; పు. 84
14. చూడు 5, పు. 46
15. The Story of Philosophy :*Will Durant, P. 351-353*
16. చూడు 13, పు. 95
17. Myth and Reality : *D. D. Kosambi, P. 16-17*
18. చూడు 12, పు. 114-115
19. An Essay Concerning Human Understanding : *John Locke, cit. in* The western Intellectual Tradition :*P. 236*
20. చూడు 5, పు. 62
21. The quintessence of Ibsenism : *George Bernard Shaw*
22. ప్రకృతి అనేపుస్తకం : గు. ర. మా. మం. పు. 40
23. ఆనందగజపతి ; దర్బారువింతలు– గు. ర. మా. మం., పు. 130
24. చూడు 5. పు. 45-46
25. చూడు. 13, పు. 95
26. ,, పు. 86
27. RASER DHARMA: *Rabindranath Tagore Cit.in* MODERN INDIAN THOUGHT: *V. S. Narvane, P. 71*
28. Love : Plato, the Bible and Freud. *Douglas N. Morgan,. 94-95*

29. Shelley's View of Poetry; *DR A. C. Bradley in* MODERN ESSAYS IN CRITICIM, *ED. A. N. Cairnerass, P. 167-170-171*

30. Shelley : *J. A. Symonds, P. 42*

31. చూడు 13, పు. 83

32. చూడు 21

33. చూడు 13, పు. 82

34. చూడు 5, పు. 60

35. గు. ర. మ. డై., పు. 175

36. చూడు 5, పు. 69.

# సప్తాశ్వాలు

సూర్యరశ్మి

## దేవతలతో జోడుకూడితి

రక్కసులతో కూడి ఆడితి
కొత్తమిన్కుల తెలివిపటిమను
మంచిచెడ్డల మార్చితిన్.

చూతునా ! అని చూసితిని ; మరి
చేతునా ! అని చేసితిని ; ఇక
చూడచేయగరాని వింతలు
చూపి కన్నుల కట్టితిన్.

తన అర్ధశతాబ్దకాల జీవితాన్ని ఇలా అజాపజా తేల్చుకొని ఒకానొక సంతృప్తితో గురజాడ వేంకట అప్పారావు పంతులు, బి. ఎ., యఫ్. యమ్. యు., 1915 నవంబరు మాసాంతంలో కన్నుమూశాడు. మళ్ళీ మరో అర్ధశతాబ్దకాలం గడిచిపోయింది. అయినా ఆయన తనసాహిత్యంద్వారా నిత్యహరితంగా జీవిస్తూఉన్నాడు. తన జీవితకాలంలోనూ తదనంతర కాలంలోనూ 'పండిత' జనామోదం పొందలేకపోయాడుగాని, సంస్కృతి పరుల భావపటిమను నమ్ముకొన్నాడు. దేశం పరాధీనమై ఉండిన కాలాన స్వాతంత్ర్య సౌభాగ్యాలను గురించి కలగని, జీవితంలో విశాల ప్రజా సముదయ విద్యా చైతన్యాలను స్వచ్ఛంద కార్యాచరణను అభిమానించినట్లే, సాహిత్యంలో ప్రజా దృక్పథాన్ని చేబూనాడు. మరుగున పడిఉండిన జానపదగేయ భణితులను వెలికిదీసి మకిలికడిగి వాటికి అభినవ జీవనదానంచేస్తూ, కావ్యభాషకూ శిష్టజన వ్యవహారంలోని భాషకూ దోస్తీ కలిపాడు. పురాణాల పాతరలనుంచిగాక. పరిణామ దోలికగాఉండిన యథార్థజీవితంనుంచి ఇతివృత్తాలను స్వీకరించి, మొదటి

తెలుగు సాంఘిక నాటకాన్ని వెలువరించడమేగాక, అపూర్వ మనిపించేవిధంగా గొప్ప కథలను ఆయన లేఖిని ప్రపంచంలోకి రావించింది. జాతి భవిష్యత్తును తీర్చిదిద్దేందుకు విద్య పరమోత్కృష్ట సాధనమని గ్రహించి, విద్యాబోధనలో 'నాగరిక' 'శాస్త్రీయ'పద్ధతులను ప్రవేశపెట్టేందుకు ఒకదశాబ్దకాలంపైగా కష్టించాడు.

జీవితంలోనూ సాహిత్యంలోనూ గురజాడ అప్పారావు, అతిరథులూ అతికాయులైన మహామనస్వుల చాలులో దాదాపు చివరివాడు. 'బలభద్రులు' అని రాయప్రోలు సుబ్బారావుగారు వర్ణించినది అతి ప్రాచీనులనేగాని, ఆ వర్ణన మహోదయులకందరికీ తగినట్టిదే ననిపిస్తుంది. అప్పారావు విశిష్టత, పాండిత్యం లోనూ సాహిత్య సృజనలోనూ యథార్థ కార్యచరణలోనూ తనకంటె గొప్పవారైన వీరేశలింగం, వేంకటరత్నం, లక్ష్మణరావు, రామమూర్తి ప్రభృతులకు కుడి ఎడమలుగా ఉంటూ, వాళ్ళ పనిలోని లోపాలను చూపుతూ, ఆ మహోద్యమాల కన్నిటికీ తద్వారా సమగ్రస్థితి కలిగేందుకు ఉపకరిస్తూ, వాళ్ళకంటె ఆధునికుడు కావడమే ననిపిస్తుంది. వీళ్ళందరికంటె ముందే ఆయన చనిపోయినా; వీళ్ళందరి కంటె ఆయన ఈకాలపు వారికి ఎక్కువ సమీపస్థుడు కాగలిగాడు. నవీన యుగ హృదయజ్ఞుడు కావడ మొక్కటే, దీనికి కారణమనుకోవాలి.

చిత్రం అదికాదు, ఇది: అప్పారావు యాభయ్యో ఏడూ రాయప్రోలు సుబ్బారావు గారి ఇరవయ్యోయేడూ, దాదాపుగా సమసించినట్లు, ఆ ఇద్దరున్నూ నవ్య కవిత్వ బ్రహ్మత్వ పదవికి పోటీ పడుతున్నారు. కాగి చల్లారిన పాలకూ అపుడప్పుడే పొయిమీది కెక్కి కాగసాగిన పాలకూ; పరిణత మనస్కతకూ ప్రారంభ యవ్వనకాల నిర్భరమనస్కతకూ, భేదమెంచలేని విమర్శకులు, ఒకరి నగ్గించి ఇంకొకరిని తగ్గించే వైఖరి నవలంబిస్తున్నారు. సంకల్పం మొదలు సిద్ధివరకు, ఆ ఉభయులవి భిన్నమార్గాలు. కాలాన్నిబట్టి, రాయప్రోలు సుబ్బారావుగారే నవ్యులు. వస్తుతత్వాన్నిబట్టి, ఆయనకు 'సంప్రదాయ'బల మెక్కువైనంతగా ఆధునిక భావబలం ఎక్కువ గాలేదు. 'పండిత' కూటమిలో ఆయన దొకపితూరీ కాగా, ఆ కూటమిని మూలమట్టుగా పెకలించివేసే భావవిప్లవాన్ని అప్పారావు ప్రారంభించాడు. ప్రారంభం మాత్రమే ఆయన చేతనైంది. కాలమనే కృష్ణపక్షి ఆ మిన్నాగును ఎగర దన్నుకుపోయింది. అర్ధాంతరవు ప్రాణం గాకపోయినా, ఆయన చిరంజీవి అయి ఉండలేడుగదా! కాబట్టి ఆయన ప్రారంభించిన దానిని కొన

సాగించి కొనసమున్టించి ఆ విప్లవాన్ని జయప్రదంచేసి ఉండవలసిన బాధ్యత, తదనంతరకాలపు రచయితలదే అవుతుంది. అది అసంపూర్ణ విప్లవం కావడానికి అప్పారావు బాధ్యుడుకాదు. 'నవ' కవులు ఆయన కీర్తికాయానికి పూజాప్రసూనాలనైతే అర్పించారు గాని, ఆయన పంథాను తప్పి రాయప్రోలు సుబ్బారావువేసిన మార్గాన్నే ఎన్నుకొన్నారు. ఇక్కడే సుబ్బారావుగారి 'నవ్య' కవిత్వ బ్రహ్మత్వసిద్ధి, అని కొందరంటున్నారు. సూర్యుడొక్కడా, ఇద్దరు ముగ్గురు నలుగురు సూర్యులా, అని తర్జనభర్జన చేస్తున్నారు. ఇంకా లెక్కతేలలేదు లాగుంది.

ఆ మాటకొస్తే, 'భావ' కవిత్వచ్ఛాయలొకటీ అరా, కందుకూరి వీరేశలింగం రచించిన పత్రిక విలాసములో "గంధవహ విహంగమములు", "నా బుద్ధి.... పక్షముల్విప్పి" వంటి నూతన సాహసిక కవి సమయాలలో కనిపిస్తున్నాయని డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారంటున్నారు. 'భావ' కవిత్వోద్యమంలో ప్రథమ స్థానం పొందిన స్వాతంత్ర్య పిపాసకు సంబంధించి పద్యాలెన్నో అందులో ఉన్నాయట కూడాను. "ఈ భావము లన్నియు క్రమక్రమముగ ఆంగ్ల సాహిత్య ప్రభావమువలన ఆంధ్ర సాహిత్యమందు ప్రతిబింబింప ఆ సాహిత్య స్వరూపమే మారి 'అభినవకవిత' పుట్టినది." 1 ఇంగ్లీషు సాహిత్యంలో ఆలివర్ గోల్డుస్మిత్ (Oliver Goldsmith) కుగల స్థానం కూడా, తెలుగు సాహిత్యంలో వీరేశలింగం స్థానంవలె, కాల్పనిక వాదానికి పూర్వుడై-ఆద్యుడై, అని కాదు - "వేగుచుక్క" కావడమనుకోవచ్చు. ఇంతకూ, మన సాహిత్యంలో 'నవ్య' కవితపేర వ్యాప్తిలోనికి వచ్చింది, ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనికవాదపు శాఖే. గురజాడ అప్పారావు సాహిత్యం మీద వర్డ్సువర్తు, బర్న్సు వంటి ఇంగ్లీషు కవుల ప్రభావం ఉన్నా, అది ఆయనను వారికి అనువక్తగా మాత్రం మార్చలేదు. ఆయన చేసింది ప్రతిసృష్టిగానీ అనుకరణగానీ కాదు, స్వతంత్ర సృష్టి. రాయప్రోలు సుబ్బారావు గారివలె ఆయన 'మార్గ' కవిత్వ మార్గానికి సమాంతరంగా మరొకదారి వెయ్యలేదు; ఆయన తత్పూర్వ కవిత్వమార్గ సంస్కర్త కాదు; సహజ, సులభ, సుందర కవిత్వ మార్గానికి కర్త. కావడానికి ఇద్దరూ నవ్యులేగాని ఒకరు మరొకరికంటె నవ్యులు.

"వైదుష్యారణ్య సీమలలో" నడయాడుతూవుండిన తెలుగు కవిత్వాన్ని జనసంచారంగల మార్గంవైపు మళ్ళించీ,ఆంగ్ల విద్యాధికులు ఈసడిస్తూ వచ్చినదాన్ని పదిమందిచేత మెప్పించీ, "మందగంభీర మందాకినీ నిష్యంద సుందర కవితా ధారలచే ఆంధ్రదేశమును ప్రోక్షించి తెలుగునాట కవిత్వ బీజములను తిరిగి మొసు

లె త్తించి", ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసానికి తిరుపతి వేంకటకవులు "అమోఘ సేవ" చేసినారంటూనే, "కానైతే వీరికృతులందు నవ్యత్వము భవ్యత్వము నంద లేమ. వస్తువులా, పురాతనములు ; ఛందస్సులా, శతథా పరిక్షుణ్ణములు; ధ్యేయమా 'కావ్యం యశసేఽర్థకృతే' యనునంతవరకే" అని మంచి తీర్పుచెప్పారు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. 2 ఛందస్సుల సౌలభ్యమూ, భాషాలాలిత్యమూ, ప్రయోగాల గడసరితనమూ, సమస్యల కాలికత్వమూ, వీరి పద్యరచనలలో కానరాకపోవు. నానారాజాస్థానాలలోనే గాక విద్యావంతుల సదస్సులలోకూడా అవధానాల ద్వారా కవిత్వాభిమానాన్ని ప్రజల్లో విస్తరింప జేశారు. *శ్రావ్యకావ్యనంశం* ఆ కాలానికి నవీనమే. వారి కావ్యభాష తరువాతి కవులకు పెట్టని భిక్ష అయింది. "శ్లేష, బంధ కవితలతో అవరోధ సంచారము చేయుచున్న ఆంధ్రశారదకు క్రొత్త వెలుగును, ధారాళ వాయుప్రసారమును ననుగ్రహించెను" అని తిరుపతికవుల రచనను కాటూరి వేంకటేశ్వరరావు ప్రస్తుతించడంలో అతిశయోక్తిలేదు. 3 అయితే ఒకమాట. అవధాన కవితకు చులకన గలిగించింరికూడా ఈ కవులే! అర్థసంచయం మించి తమ కవిత్వ దీర్ఘసత్రానికి మహత్తరమైన యజ్ఞఫలం వారి దృష్టిలో లేకపోయింది. అంతే గాక వారి రచనల కొత్తదనం పండిత శాలువాలోని ఒకానొక మెరుగుపోగు మాత్రమే. వారి దృక్పథం చాలామట్టుకు ప్రాచీనమే. అందుచేతనే, ఈ జంటకవులు యుగ కవులనడం మాత్రం తానుఆమోదించనని తల్లావఝుల శివశంకర శాస్త్రిగా రన్నారు. 'నవ్య' కవులలో విశ్వనాథ సత్యనారాయణ, పింగళి – కాటూరికవులు, నాయని సుబ్బారావుగార్లు తిరుపతి వేంకట కవుల శిష్యకోటిలోనివారే కాబట్టి గురువులు వేసిన ముద్ర వారిమనస్సులను పూర్తిగా విడిచి పెట్టిందనుకొనే వీలులేదు. ఈ ద్వారా 'నవ్య' కవిత్వం బహుస్వల్పంగానైనా తిరుపతి వేంకటకవులతో జన్యజనక భావం కలిగి ఉంది.

ఇరవయ్యోశతాబ్దానికిముందే విద్యార్థిదశలోనే కట్టమంచి రామలింగారెడ్డి రచించిన *ముసలమ్మ మరణము*కూడా 'నవ్య'కవిత్వానికి తొలిరేఖ అనే వాళ్ళలో ప్రథమ గణ్యులు, పింగళి లక్ష్మీకాంతంగారు. "ఇరువదియవ శతాబ్ది యుద యింపనున్న వేగుబోకలో నక్షత్రము"వలె ఉదయించినదని ఆయన చెప్పిందాన్నీ, "ఇంతవరకువచ్చిన కవితా సంప్రదాయములను, వర్ణన విధానములను కవిసమయము లను పూర్తిగా మార్చి ఒక విప్లవమునకు అంకురార్పణ చేసినది" అని శ్రీవాత్సవ. చెప్పిందాన్నీ ఉద్ధరించిచూపి, ఆ మాటలను కాదనితేల్చారు డా॥ సి. నారాయణరెడ్డి గారు. కావ్యభాష, పదప్రయోగం, వర్ణన, పద్యశిల్పం – ఈ అన్నిటిలోనూ రామ

లింగారెడ్డి ప్రబంధమార్గాన్నే అనుసరించాడని, నవీనతారేఖలు కొద్దిగా ఉన్నంత మాత్రాన ఇది నవ్యకావ్యం కాబోదని, మహా అయితే 'సంధి' కావ్యం కావచ్చునని ఆయన నిర్ణయం చేశారు. 4 వర్ణనా బాహుళ్యంగానీ అసందర్భ వర్ణనలూగానీలేకుండా, మనస్తత్వ నిరూపణ విషయంలో గల శ్రద్ధ రూపవర్ణనపై లేకుండా, సామాన్య కర్షక జనులను కథావ్యక్తులుగాజేసి, శృంగారంలో కూడా దుఃఖాన్నీ, తద్గతమైన ఔదార్యాన్నీ ఔన్నత్యాన్నీ చాలా బటువుగా నిర్వహించిన ఈ రచన, చారిత్రకంగా మాత్రమే 'నవ్య' కవిత్వ సంసారంలో తొలికాన్పులాంటి దౌతున్నది. అంతకంటె కూడా రాములింగారెడ్డి రాసిన *కవిత్వ తత్త్వ విచారము* అనే విమర్శే, నవ్య కవిత్వానికి "కర్ణధారి" అయిందని దువ్వూరి రామిరెడ్డి చెప్పినమాట విలువగలిగినది:

> అప్పారావుగారి ముత్యాల సరములతో అభినవకవితోద్యమము ప్రారంభ మయినది. సంక్షుబ్ధ సాగరకల్లోలములో గాలి వీచిన శెల్ల కొట్టుకొనిపోవుచున్న అభినవ కవితానావకు కట్టమంచి రామలింగారెడ్డిగారు కర్ణధారులై నిలిచిరి. వారు రచించిన *కవిత్వ తత్త్వవిచారము*ను విమర్శనగ్రంథము ఈ నవీనోద్యమము నకు మార్గదర్శకమైనది. ఈ నవయుగ కవితా ప్రభాతముయొక్క ప్రథమరోచులు రాయప్రోలు సుబ్బారావుగారి కుటీర గవాక్షములో ప్రసరించి ఆయనను ప్రబో ధించినవి. సుబ్బారావుగారు అంతకుపూర్వమే కవిత్వమల్లుచుండిరి. ఆయన రచించిన *లలితయను* ప్రథమకావ్యము శబ్దాలంకారయుతమై పూర్వ ప్రబంధ శైలిని తలపించుచున్నను, అందే భావికవితా పరిణామముయొక్క సూచనలు పొడకట్టుచుండినవి. 5

'నవ్య' కవిత్వ జననాదికాలను ముక్తసరిగా చెప్పిన ఈ మాటలలో గమ నించదగింది, *లలిత*కు పూర్వమే రాయప్రోలు సుబ్బారావుగారు కవిత్వం 'అల్లు' చుండిన విషయం. అల్లడమేమో గాని ఆయన దాన్ని అనర్గళంగా "చెబుతూ" వచ్చారు. మేనమామ అవ్వారి సుబ్రహ్మణశాస్త్రితో కలిసి దేశాల వెంటబడి అవధాన విద్యను ప్రదర్శిస్తూ, నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెంలో హఠాత్తుగా మనస్సు మరలిచ్చు కొని ఇకమీదట కవిత్వం "రాయడానికి" ప్రతిజ్ఞ చేశారు; ఆశుకవితా సన్న్యాస మిప్పించమంటూ 'తుషారాహార్యపుత్రి' అనుమతి నర్థించి

రసమో, భావమొ, జీవదర్థ సుకుమార వ్యంజనామంజు శ<br>బ్దసమాసారచనంబొ, సాధుహృదయ స్పంద ప్రతిష్ఠా కథా<br>విసరంబో, సకలార్థ శూన్యమగు నీ వేగాతివేగోక్తి దు<br>ర్వ్యసనం బేటికి, త్రిప్పు మింక జననీ, రమ్యాక్షర క్షోణికిన్.

అని ప్రార్థించారు. ఆమె అనుమతి లభించిందేమో, 'రమ్యాక్షరక్షోణి'కి దిగివచ్చారు. అయినా వెనకటి 'దుర్వ్యసనం' తాలూకు 'ద్రుతవాక్కు' ఆయనను వదల్లేదు. కాకుంటే, పాండిత్యసంభారమంతా లభించింది. ఇలా పండితులింటి బిడ్డగా పుట్టి పెరిగి, యుక్త వయస్సున స్వతంత్రించి వేరే కాపురం పెట్టిన తొలి రోజుల్లో రాజమండ్రిలో చదువుకొంటూ గంటి లక్ష్మన్న పరిచయంవల్ల ప్రోద్బలం వల్ల గోల్డుస్మిత్ కావ్యమైన HERMIT ను *లలిత*గా, మరికొంత కాలానికి టెన్నిసన్ కావ్యమైన DORA ను *అనుమతి*గా అనువదించారు. తర్వాత కొమర్రాజు లక్ష్మణరావు నండగొని మదరాసులో ఉండిన దినాళ్ళలో *తృణ కంకణం* రాశారు. అది 1913 లో అచ్చై వచ్చింది గానీ, అంతకు ముందే పదిమంది కళ్ళా బడింది. అయితే దీన్ని రాయడానికి మునుపే గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, చింతా దీక్షితులు వంటి యువకులను తన కవిత్వంచేత ఆకర్షించి ఉన్నాడు. నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావు మద్రాసు క్రిశ్చియన్ కాలేజీలో చదువుకొంటూ కొత్త గాలుల తాకిడికి మనస్సులు మొగ్గ విప్పుకొంటూ ఉండిన ఆ రోజులను గుర్తు చేసుకొంటూ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ గారి పుస్తకంలో రాయప్రోలు సుబ్బారావుగారు ఆ రోజుల్లో *తృణకంకణం* రాస్తూ ఉండినట్లు స్వయంగా తమతో అన్నారని రాశారు.[6]

ఇంతెందుకు? *తృణకంకణ*మే ఆధునిక కవిత్వానికి "ఆదిగ్రంథ" మని ఆ కావ్య రజతోత్సవ సందర్భంలో చెప్పిన తల్లావఝుల శివశంకర శాస్త్రిగారే తమలో వచ్చిన మార్పును గుర్తుచేసుకొంటూ, మదరాసులో అక్కిరాజు ఉమాకాంతం వద్ద వచ్చిన గురజాడ అప్పారావు ప్రస్తావన దరిమిలా, పెద్దాపురంలో చింతాదీక్షితుల ప్రోత్సాహంవల్ల గురజాడ కృతులన్నీ చదివామని చెప్పారు.[7] అది ఆయనలో మార్పేగాని, సుబ్బారావుగారిలో మార్పుకాదుగదా! సుబ్బారావుగారి *తృణకంకణము*తోనే ఆధునిక కవిత్వం ప్రారంభమైందంటూ, ఆయన ఇలా రాశారు:

> ఆ రోజులలో ఈ కృతివల్ల ఏదో కొత్తలోకంలోకి మార్గము ఏర్పడినట్టయింది. అంతకుముందు ఆధునిక విధానానికి తోవతీసినవారు, అనూరుప్రాయులు; ఈ సూర్యాలోకంవల్ల సాహిత్యసీమలో నూతన రుచి వ్యాపించి కన్నులు మిరుమిట్లుకొలిపింది; కొంతమంది కన్నులు మూతలు పడ్డవి; కొంతమంది నేత్రపటలాలు నీరయి పోయినవి!

.... తరవాత కవికుమారులు కొంతమంది, ఈ నూతనద్యుతిలో స్నపితులై సాహిత్యసీమలో కాంతులీనే కావ్యదీపికలు పెట్టినారు. అంతకంతకు నూతన మార్గము దీపావళీ విరాజమానమై రాజమార్గమయింది. 8

The easiest way to exalt one man is to kick another in the pants అని సామర్సెట్ మామ్ (Somerset Maugham) రాసినట్లు ఈ శివశంకర శాస్త్రిగారు పక్షపాత వైఖరి నవలంబించి, అప్పారావును ఆద్యస్థానంనుంచి లాగి కిందికితోసి సుబ్బారావుగారిని నిలబెడుతున్నారని అనుకోగూడదు. కళ్ళు తెరుచుకొని జరిగిన చరిత్ర నంతటినీ స్వయంగా చూశారుగనుక ఇలా ఉన్నవిషయాన్నే చెప్పి ఉంటారు. "అనూరుప్రాయులు" లాంటి మాట నిందాగర్భితంగూడా కాకపోవచ్చు. శివశంకరశాస్త్రిగారి వాదాన్నే చేబట్టి కురుగంటి సీతారామయ్య ఇలా రాశారు :

అప్పారావు భాషాసంస్కర్త. సుబ్బారావుగారు కవితామార్గ సంస్కర్త.... శ్రీ అప్పారావుగారి కీ కవితామార్గ సంస్కారము ప్రక్కవాద్యము వంటిది. కాని శ్రీ సుబ్బారావుగారి కది ప్రధానసాధన. కాని యీ రెండు (Sic) వ్యక్తులలోను బ్రహ్మత్వము శ్రీ సుబ్బారావుగారికే యిచ్చుట సమంజసమని నా యభిప్రాయము. 9

ఈ మాటల తాత్పర్యంఇది: భాషావిషయక సంస్కారం రాయప్రోలు సుబ్బారావుగారికి పట్టలేదు. సాంస్కృతిక సమాస బాహుళ్యాన్ని తగ్గించినా తెలుగు 'చిలక'కు మనస్సుపడినా, 'మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి'ని అభిలషించినా, ఆయన కావ్యభాష గతానుగతికమే. పైగా ఆయన కవిమాత్రుడేగాని, అప్పారావులా జీవిత సాహిత్యాలు రెంటా ప్రజాతంత్ర దృక్పథంతోటి నాటకాన్ని, కథనూ, కావ్యాన్ని విప్లవీకరించిన మనిషికాదు.

ఇలాంటిదే మరొక విమర్శ పిలకా గణపతి శాస్త్రిగారి ముఖతా వినవచ్చింది. అప్పారావు కావ్యరచన అపరిణతం అవ్యవస్థితం అని అనేకు లనేక విధాలుగా చెప్పినదాన్నే మళ్ళీచెప్పి, కథకుడుగా రూపక రచయితగా వ్యాసకర్తగా అప్పారావు చూపించినంత "నైశిత్యము, ఉన్నతి" కవిత్వంలో కనిపించవని తేల్చారు. "గురజాడ కవి ఆధునిక కవితా ప్రస్థానంలో దేశి మార్గానికి ప్రథమాచార్యుడయితే, రాయప్రోలువారు ఆధునిక కవిత్వంలో మార్గ కవితా ప్రస్థానానికి ఆద్యులయినారు. ఈయన తమ కవితలో ఆంధ్ర కావ్యాలలో అనానూనంగా వస్తున్న కావ్యభాష పరిహరించలేదు."10 డా. కొత్తపల్లి వీరభద్రరావు ప్రభృతులు ఈ మార్గ – దేశి

పంథాలకు ఆ యిద్దరినీ ఆధునిక మార్గదర్శకులుగా పేర్కొన్నారు. ఆంగ్లకవుల భావోద్రేకాన్నీ, పోతనాదుల భాషా మాధుర్యాన్నీ, వంగీయుల మర్మాన్నీ మిళితం చేసి రసికులకు హృదయానందం కలిగించిన భావ కవులలో రాయప్రోలు సుబ్బారావుగారు ముఖ్యులని మరొకరు. ఇంతకూ గురజాడ అప్పారావును తరువాతి తెలుగు కవులందరూ విడనాడారని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. అదే తీర్పు వేరే మాటల్లో డా. శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు. ఇలా ఇప్పటికీ ఈ విషయంలో భిన్నాభిప్రాయాలుంటే, "సమన్వయ" దృక్పథంతో, ఇద్దరూ వేర్వేరు విధాలుగా ఆద్యులేనని డా. సి. నారాయణరెడ్డిగారు. *

ఇందరి అభిప్రాయాలను పేరు పేరునా ఉదహరించాక, 'నవ్యత' అనేదేమిటో, అది ఆ పోటీదారుల్లో ఎవరిలో ఏ మోతాదులో ఉందో, తెలుసుకోవడం అభిలషణీయమేగాక, ఉన్న అపోహల దృష్ట్యా అత్యవసరం కూడాను.

---

* మహాకవి వరణం గురించి పనికివచ్చే మాటలను శ్రీ శ్రీ ఇంకొక సందర్భంలో చెప్పి ఉన్నారు.

> అసలీ ఏకైక మహాకవిని యెన్నుకోవాలనే ఉబలాటం ఒక బుద్ధి జాడ్య జనితోన్మాదం ...ఎందరో మహాకవులు. ఏ ఒక్కణ్ణీ కవిమూర్ధన్యు డనకూడదు.
>
> మహాకవులలోనే రెండు రకాలుంటారు: చెళ్లపిళ్లలాంటి వారొకరు; గురజాడవంటి వారింకొకరు. బాగా చెబితేనే చాలదు; ఏమి చెప్పావనేదికూడా కావలసిందే. పాండిత్యపు జబర్దస్తీ లాభంలేదు.
>
> — టి.యస్. ఇలియట్ శిల్పం (పుస్తక సమీక్ష): కిన్నెర.1950 మే

పదేళ్ళ కొకమారు తెలుగు దేశానికి ఒక మహాకవి దిగివస్తుంటాడని, 'బుద్ధిమీలు' ఆంధ్ర పత్రిక) లో అరుద్రగారు హేళనచేసినా, గొప్పకవులంటూ కొందరి గురించి ఎక్కడైనా చర్చలకు అవకాశం ఉంది. ప్రస్తుత చర్చలో నాకు బాగా నచ్చినట్లు చెప్పింది ఆంధ్ర శేషగిరిరావు. "తెనుగు కైతలో క్రొత్త తెన్నులు' అనే వ్యాసంలో ఆయన యిలా రాశాడు:

> నవ్యాంధ్ర కవితాసతికి గురజాడ అప్పారావు క్రొత్తతెన్నులు రుచిచూపెను. రాయప్రోలు సుబ్బారావు పదశిల్పము నివేదించెను. వేంకటపార్వతీశ్వరులు తేటగీతముల మంజరుల కానుక నిచ్చిరి...వీరలు నవ్యాంధ్ర కవిత్వమునకు సూత్రధారులు.

అంతేగాని, డా. గిడుగు సీతాపతిగారిలా, వయోరీత్యా సాహిత్య సేవదృష్ట్యా అప్పారావు పూర్వులు, కవిత్వప్రచురణ దృష్ట్యా ప్రభావం దృష్ట్యా రాయప్రోలు సుబ్బారావు ఆద్యులు, అని ఎటూ దూకక గోడమీద నిలిచే ఉండే వైఖరి మంచిదికాదు. ఇంతకూ ఆద్యత్వానికీ ఆధిక్యానికీ భేదం ఉంది.

# 2

నవ్యత అనేది తిథివార నక్షత్రాల కిట్టింపు వ్యవహారమేమీ కాదు; అది ప్రధానంగా భావ వైఖరికి సంబంధించిన మాట. అనేంతవరకు ఎవ్వరికీ మరెవ్వరితోటీ పేచీలేదు. ఇతరులైన పదుగురు ఒక తెన్నుబట్టిపోయారు అనేది ఆ తెన్నులోని కొత్తదనాన్ని నిర్ణయించదు. ఒక్కడు ఒక్కతెన్ను బట్టి పోయినా అది నవ్య మనిపించుకొనే వీలుంది. నవ్యత గురించి సరైన అంచనా ఎలాంటిదో చూడడానికి, పాశ్చాత్య దేశీయులైన ఒకరిద్దరు విజ్ఞుల అభిప్రాయాల నిక్కడ పేర్కొన వలసి వస్తున్నది.

సర్ రిచర్డ్ లివింగ్‌స్టన్ (Sir Richard Livingstone) అనే విద్యావేత్త ఇలా రాశాడు:

Modernity is a question not of date but of outlook. 11
దాని ప్రాణపదార్థమంతా సమకాలిక వైఖరేననికూడా అన్నాడు. ఇప్పుడు జి. ఎస్. ఫ్రేజర్ అనే సాహిత్యవేత్త చెప్పేది చూడాలి.

The 'modern' in world literature is simply that which appeals in a troubled time to our troubled hearts. 12

సమకాలికమైన సంఘర్షణలో సతమతమై స్వాస్థ్యం చెడిన మనస్సుల నాకర్షించి ఊరడించేది మాత్రమే 'నవ్యత' అయేట్లుంటే, నిస్సంశయంగా రాయప్రోలు సుబ్బారావుగారి కంటె గురజాడ అప్పారావే నవ్యుడౌతాడు. మత విశ్వాసానికీ హేతువాదానికీ గల విశ్వవ్యాప్తమైన స్పర్థ, సంప్రదాయపరతకూ సాహసిక మనస్కతకూ పోటాపోటీగా పరిణమించిన మన జీవితంలోనూ సాహిత్యంలోనూ, పాండిత్య వృక్షపు చిటారుకొమ్మగా ఒకరు; అనేక రంగాలలో సామాన్య ప్రజాభివృద్ధికర పరిణామాలను కోరి తదనుగుణంగా రచనలుచేసి కొత్తమొలకను నాటిందింకొకరు. అయితే సంప్రదాయ నిరసన మొక్కటే నవ్యతను సిద్ధింపజేస్తుందా, అని ప్రశ్న. దీనికి జవాబుగా, సంప్రదాయమనేది గతానుగతికత్వాన్ని మాత్రమే కలిగించి ప్రాణలక్షణమైన నూతన మార్గ విస్తరణను అడ్డుకోనిదిగా ఉండాలి, అనడమే. అది శిలాక్షరం కాగూడదు; దానిది సుగ్రీవాజ్ఞ కాగూడదు; అది మార్పు చేర్పులేని వట్టిమూస కాగూడదు. అప్పుడది మృతపదార్థం కాక తప్పదు. నిజమైన

సంప్రదాయం నిత్యవివర్ధన శీలమైనదిగానూ, వ్యక్తి విలక్షణతలను తన విశాలమైన ఆవరణంలో ఇముడ్చుకోగలదిగానూ, ప్రయోగ పరత్వానికి అవకాశాల నిచ్చేదిగానూ ఉండాలి. పందొమ్మిదో శతాబ్దివరకు తెలుగుసాహిత్యంలో లోపించిందిదే. అందుచేతనే వట్టి కవితామార్గ సంస్కారంగాక, భావ విప్లవం అవసరమై ఎన్ని లోటుపాట్లున్నా గురజాడ అప్పారావు సాహిత్య వ్యక్తిత్వాన్ని ఆశ్రయించింది. మల్లవరపు విశ్వేశ్వరరావు గారన్నట్లు—

— కాలం ఘనీభవించి, పరిణామ వాహినికి అంతరాయం కలిగి, సజీవతకు నిదర్శనమైన వికాసం నశించినప్పుడు ప్రస్తుతకాలానికి చెందిన కావ్యసృష్టి అయినప్పటికీ అప్రస్తుతమై, నవ్య కవిత్వం అనిపించుకోదు. నవీన కాలంలో అయినా సజీవతలేని కావ్యసృష్టి నవ్య కవిత్వం కాదు....నవ్య కవిత్వంలో నవ్యత అనే గుణం ఆధారము, కవిత్వగుణం జీవము. 13

ఉదాహరణకు, రాయప్రోలు సుబ్బారావుగారి కవిత్వమే కాదు, విశ్వనాథ సత్యనారాయణగారిది కూడాకాదు, ఆయన ప్రశిష్యుల కవిత్వంకూడా దృష్టితో చూస్తే 'నవ్యతా' యోగ్యతకు వెలిబడకతప్పదు. వీరెవరూ పుట్టకముందే గిట్టిన గురజాడ అప్పారావు కవిత్వమే, అంతకంటే అనిగాక, అసలైన నవ్యతాగుణం కలది. ఇక "కవిత్వమహత్త్వ సంపద" అంటే, అక్కడ భిన్నాభిప్రాయాలకు బోలెడంతగా తావు ఉంది. వీళ్ళందరూ అప్పారావు కంటె ఎక్కువ "సంప్రదాయజ్ఞులే" మరి! ఆ వెనకటి కావ్యభాష, ఆ శైలి, ఆ కవిసమయాలు, సంప్రదాయబద్ధుడైన కవికి అనుకూలించినంతగా, సంప్రదాయాన్ని విడనాడి వేరొక మార్గం వేస్తున్న కవికి అనుకూలించవు. ఈ అననుకూల పరిస్థితిలోనే అతని ప్రజ్ఞకూ, ప్రతిభకూ సవాళ్లు ఎదురై కవ్విస్తాయి. అతడు ఘటికుడైతే, ఆ సవాళ్ళను ఎదుర్కోవడంలోనే గొప్పతనాన్ని సాధిస్తాడు; కాకుంటే, వాటి ధాకాకు తట్టుకోలేక బొప్పెలుకట్టిన తలతో బయటపడుతాడు. ఇంకొక విషయమేమంటే, ఒక రచయిత సాంప్రదాయికుడు కావడానికి, చరిత్ర గురించిన అతని స్పృహ కారణమౌతుంది. అది గత చరిత్రకు సంబంధించిన స్పృహగానీ భవిష్యత్తుకు సంబంధించినది గానీ కాదు. తన కాలానికి సంబంధించింది మాత్రమే. అతని భావచేతన, అలాంటప్పుడే ఆధునికతను సమకూర్చుకొంటుంది. ఈ రెండవ అర్థంలో, గురజాడ అప్పారావు నిజంగానే సాంప్రదాయికుడైనకవి. అది ఆయన చేత ఇలా అనిపించింది :

సాహిత్య రంగంలో ఇపుడు నేను కావిస్తున్న కృషికి సమతుల్యమైన కృషి భారతదేశంలో మరెక్కడా కనిపించదు. 14

స్వాతిశయం అని ఇతరులనుకోవచ్చుగాని, ఆత్మవిశ్వాసమూ తన పని విలువ గురించిన అంచనా – ఇవి మాత్రమే ఈ ఉద్ఘాటనలో రచయిత ఉద్దేశాలని పిస్తుంది.

పదంపద్యం పట్టి నిలిచెను
కీర్తు లపకీర్తుల్.

గురజాడ అప్పారావు కీర్తీ అపకీర్తీ ఆయన పదాన్నీ పద్యాన్నీ బట్టే నిలిచిలేవు. నాటకమూ కథానికా విద్యావ్యాసంగమూ భాషాసంస్కరణరణమూ ఇవన్నీ కీర్తిదాయకాలే అయ్యాయి. ఎటొచ్చీ ఆయన పదమూ పద్యమూ విమర్శకులకు లోకువయ్యాయి.*

డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అలాంటి విమర్శకుల కోవకు చెందరనే గాని, ఒక వ్యాసంలో [15] ఆయన గురజాడ అప్పారావును "మార్గదర్శి" అని అంగీకరిస్తూనే, "మహామేధావి"గా గుర్తిస్తూనే, "సంస్కృతి మహోదయు" లంటూనే, అన్ని రచనారంగాలలో నర్తించిన అప్పారావు ప్రతిభకు గల సహజశక్తి ఏ శాఖలో ఉన్నదో తెలిసిరాలేదని రాశారు. వాటన్నిటిలోకీ కవిత్వరంగంలోనే అప్పారావు శక్తి, లోపాలతో కూడుకుని ఉన్నట్లుగా తేల్చారు: భాషపై సంపూర్ణాధికారం లేదు; పుస్తకాలలోగాని, వ్యవహారంలోగాని లేని మాటలు వాడారు; నడక కొన్నిచోట్ల కుంటుబడింది; భాష పెక్కుచోట్ల చితికింది; కొన్నిచోట్ల మాటలు చాలలేదు; మరికొన్ని చోట్ల మాటలు ఎక్కువయ్యాయి. ఈ అన్నికారణాలవల్ల ఆయన "మహాకవి"కాదు; "మహామేధావి" ఔను. "యుగపురుష డన్నమాట అతిశయోక్తి".

*కీ.శే. కుందూరి ఈశ్వరదత్తుగారు ప్రకటించిన ANDHRA SOUVENIR 1953-లో Andhra celebrities శీర్షిక కింద వివిధ రంగాలలో ప్రముఖులైన ఆంధ్రులు రచయిత కోరికపై ఎన్నికచేసిన వారి పేర్లున్నాయి. ఆ వరస యిది:

నాటక కర్తలు:

(1) గురజాడ అప్పారావు (2) వేదం వేంకటరాయశాస్త్రి (3) ధర్మవరం రామకృష్ణమాచార్యులు (4) పానుగంటి లక్ష్మీనరసింహారావు.

కవులు:

(1) చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి (2) గురజాడ అప్పారావు (3) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (4) దువ్వూరి రామిరెడ్డి.

ఆయన తదనంతర కవులు రాయప్రోలు సుబ్బారావుగారి దారిలో నడిచారు కాబట్టి "అడుగు జాడలు" ఆయనవి కావు. ఆయన చూపిన ఉపపత్తు లివి:

1. రాయప్రోలువారూ అబ్బూరివారూ వ్యాకరణబద్ధ భాషలోనే రచనలు చేశారు. 2. బసవరాజు అప్పారావుగారు పలకడమే నేర్చారుగాని దిద్దితీర్చడం "నేర్చనే" లేదు. 3. కవి కొండల వాపిరాజులు ఆంగ్లకవిత్వంలోని "గోప" కావ్యాల్ని విని నోరు విప్పారు. 4. నండూరి సుబ్బారావుగారొక్కరు అప్పారావుగారి నీల గిరి పాటల్లా యెంకిపాటల్ని మాత్రాచ్ఛందో రచనల్లో ఇమిడ్చినా, చివరకు భావకవుల ప్రేమ యోగసాధనలను స్వీకరించి పాటలు రాశారు. 5. గురజాడ వారిది ప్రేమ కవిత్వము కాదు.

రాయప్రోలు సుబ్బారావుగారొ ? శ్రవణసుఖాపాదకమైన శైలిలో మధుర వియోగగాథలను కావ్యాలుగా రచించారు. సంస్కృత శబ్దాల కోమలకాంత పదావళిని ఏరుకొన్నారు. గీత పద్యాలు ఎక్కువగా వాడుక చేశారు. తృణకంకణము ఆ కాలపు పాఠకులలో చాలా అలజడి కలిగించింది. చిన్న కావ్యాలు, ఖండకావ్యాలు వాడుకలోకి తెచ్చారు.

మరొకవ్యాసంలో 16 గోపాల కృష్ణమూర్తిగారే అప్పారావు కవితలోని కొత్త పుంతలను వివరించారు: 1. ఆధునిక కవులలో "అసలైన తిరుగుబాటుదారు" అప్పారావు ఒక్కడే. 2, తెలుగు భాషలోని అందచందాలు మాత్రాచ్ఛందస్సుల లోనే బయల్పడగలవని గ్రహించి మొదట ఆచరణలో పెట్టింది అప్పారావే. 3. పాట లకు గూడా కావ్యత్వసిద్ధిని చేకూర్చాడు. 4. భాషాభేషజాలు చూపకుండా తేలిక తేట మాటలతో కావ్యరచన చేశాడు. 5. పుస్తకాల విన్న సౌందర్యంగాక స్వంతంగా గుర్తించిన సౌందర్యాన్ని రచనల్లో పొదిగాడు. 6. ప్రయోజనపరమూ సందేశా త్మకమూనైన రచనలు చేశాడు.

ఈ రెండు వ్యాసాల్లో మొదట పేర్కొన్నదానిలో గోపాలకృష్ణమూర్తిగారు చెప్పిన ఒక అంశం, రెండవదానిలో చెప్పిన దానితో స్పర్థిస్తుంది. ఈరెండవ దానిలో, ఎంకిపాటలూ, బసవరాజు గేయాలూ, తురగా వెంకట్రామయ్య పాటలూ, కవి కొండల గీతికలూ, గురజాడ అప్పారావు కవిత్వపు కోవకే చెందినవని రాశారు. నిజం కూడాఇదే. అంతేకాదు, రాయప్రోలు సుబ్బారావుగారివంటి కవుల గీతికలు ('చిలక' 'ఏదేశమేగినా' వగైరా) విశ్వనాథ సత్యనారాయణగారి కిన్నెరసానిపాటు, కోకిలమ్మ పెళ్ళి, పాముపాట, వగైరా, దువ్వూరి రామిరెడ్డిరాసిన ఏలపాట

మరికొన్ని ఖండ కావ్యాల గీతికలూ, ఇవన్నీ గురజాడ అప్పారావు పెట్టిన భిక్షా ఫలితాలే. గరళకంఠుడై ఆయన మొదటగా పూని ఈ మేలు చేసి, పండితుల తిట్లూ మొట్లూ, శతావధానుల విసుర్లూ కసుర్లూ తానొక్కడే తినకుండా ఉంటే, ఆనాటి ఈ పిల్లకవులలో ఏ ఒక్కరూ తమంత తామై ఈ సాహసం చేసేవాళ్ళే కాదు. పండిత జనామోదంకోసమే వాళ్లు తహతహలాడేవాళ్లు. ఇంకో సంగతి. ఈ అందరూ కొద్దో గొప్పో మాత్రాఛ్ఛందస్సులలో, అందులోనూ ముత్యాల సరాల నడకలో, లఘు రచనలైనా చేసినవాళ్ళే. ఇంకా ఒక్క సంగతి. గురజాడ అప్పారావు ప్రభావం, దివాకర్ల వేంకటావధానిగారు వర్ణించిన ఈ "నగర" కవుల పైన పడడమటుంచి, "గ్రామ" కవులమీదకూడా ప్రసరించింది. జాతీయ వాదోద్యమ సంరంభాలలో, సహాయ నిరాకరణ, రాట్న ప్రచారం వగైరా ఉద్యమాల లోనే గాకుండా, భావకవిత్వ ప్రాభవకాలానకూడా రైతు కూలీ ఉద్యమాలకు ప్రచార సాధనాలుగా మంచి పాటలే రాసిన శెట్టిపల్లి వెంకటరత్నం, శ్రీ గిరిరాజు రామారావు ప్రభృతులకు పరోక్షంగా దారి చూపి ధైర్యం చెప్పిపోయింది కూడా గురజాడ అప్పారావే. మరి 1930 తర్వాత శ్రీ శ్రీ గారందుకొని ఈ ప్రజాభ్యుదయ దృక్పథానికి సాహిత్య గౌరవాన్ని అపూర్వంగానే సిద్ధింపజేశారు. అక్షర గణచ్ఛందస్సుల యుగం నామమాత్రావశిష్టంగానే ఉన్న యువకవి లోకానికంతటికీ, గురజాడ అప్పారావే ప్రాచార్యుడు.*

---

* 1932 అక్టోబరు 28న రాజమండ్రిలో జరిగిన గురజాడ స్మారకసభలో అధ్యక్షోపన్యాసం చేస్తూ చింతా దీక్షితులు చెప్పిన మాటలు భారతి (1932 డిశంబరు)లో అచ్చుపడి ఉన్నాయి. వాటిలో నవ్యాంధ్ర కవులపై అప్పారావు ప్రభావాన్ని దీక్షితులు పేరుపేరున వివరించారు :

అప్పారావుగారిని మెచ్చుకోనివారు అభినవ ఆంధ్రకవులలో నేనెరిగినమట్టుకు ఎవరూ లేరు. నేడు కావ్యములు రాసే యువకులందరూ ఆయనను మార్గదర్శిగా అంగీకరించిన వారే. కాని ఏ కారణముచేతనో వారు భాషా విషయమునైతేనేమి, రచనా విషయమునైతేనేమి, అప్పారావుకి భిన్నంగా నడుస్తున్నారని అనక తప్పదు.

భాషావిషయమున అప్పారావుగారి మార్గమవలంబించడానికి ప్రయత్నిస్తున్నవారు బసవరాజు అప్పారావుగారు...

గీతానందులు వ్రాసిన కాపు పెండ్లి అనే కావ్యం అప్పారావుగారి పద్యాలను కొంత వరకూ సమీపిస్తున్నది.

కృష్ణశాస్త్రిగారూ, వారిని అనుసరించేవారూ శుద్ధ గ్రాంథికమునే వాడుతున్నారు; కృతక భాషకూడా కొంత వాడుతున్నారు...

ఛందస్సు, భాష, కవిసమయాలు, వంటి కవిత్వపు దినుసులలోనే కాక జీవిత తత్వంలో కూడా గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు గారికంటె నవ్యుడు. ప్రాంతీయ దురభిమానం గాకున్నా ఆంధ్రరాష్ట్రోద్యమ కవితలో ప్రాదేశిక వైమనస్యాలకు ఎంతో వీలు కల్పించారు సుబ్బారావుగారు. "ప్రాదేశిక విభేదాలు వైమనస్యాలు. ఐకమత్యం అవసరం," అని అప్పారావుగారి ఉద్ఘాటన.17జగజ్జనధర్మం మనస్సున నిలిపినప్పటికీ, ఎప్పుడో తప్ప సుబ్బారావుగారి హృదయం ఆంధ్ర దేశపు కల్పితమైన సరిహద్దులను దాటి పోలేదు. "కత్తివైరం" ప్రపంచ మంతటా కాల్చుమని ఒకరి ఉపదేశమైతే, "సమర సేనావ్యూహ జయపతాకల క్రింద" ఆంధ్ర పౌరుషం స్వదేశంలోని ఇరుగు పొరుగుల మీదికి నడవ వలసి ఉంటుందని మరొక్కరి పిలుపు. దేశీయుల నుద్దేశించి అప్పారావుచేసిన ప్రబోధం, భూస్వామ్యం నుండి ధన స్వామ్యానికి ప్రయాణం కట్టసాగిన జాతి సర్వతోముఖ వికాసానికి ఉపకరించేది. ఆచార క్షయాన్నీ, వృత్తి విద్యల క్షైణ్యాన్నీ గురించి బాధపడుతూ యంత్రయుగంలో రాట్నపు దారాన్ని గురించీ, ముగ్గులు పెట్టే మేలిమి గురించీ దారుణ పరితాపం పొందుతూ గడచి పోతున్న యుగానికే ఎక్కువగా తన మనస్సును సుబ్బారావుగా రర్పించుకొన్నారు. కాల్పనిక వాదానికి తగిన వాతావరణ మిదే. యంత్ర నాగరికతలోని చెడుగునే ఆయన చూడగలిగారు. "స్థూల యంత్ర ముఖ దూషితమై" ప్రతీచ్య భావవాతూలం ఎగబోస్తున్నదని శోకిస్తారు. "జ్ఞానకృషి" కొరకుగాక, "శక్తి తంత్ర ప్రయోగ కౌశలము కొరకు" ప్రకృతి గర్భాన్ని కోసి శాస్త్రాలను చీలుస్తున్న పరిశోధకులను గర్హిస్తారు. ఈ "వికృతి"లో "దారి చూపగలా డొక్కఁ తాత్త్వికుండె;" ఆ తత్వమైనా పర తత్వమే. ఈ అన్ని అంశాలలోగూడా, గురజాడ అప్పారావు కంటె సుబ్బారావుగారు వెనకటివారే ననిపిస్తూ, అప్పారావుకంటె ఎక్కువగా ఇంగ్లీషు కాల్పనికోద్యమంలో వర్డ్సువర్తు ప్రకృతి వాదాన్ని చేబడుతారు. పండిత సంప్రదాయంలోనివారే

అప్పారావుగారు వ్రాసిన ప్రేమగీతముల కున్నూ, నేడు యువకులు వ్రాస్తున్న ప్రేమ గీతములకున్నూ శిల్పమునందే భేదమున్నది.

చిన్నపిల్లలకు ప్రత్యేకముగా పనికివచ్చే గీతములు వ్రాస్తున్నవారు...కొందరేవున్నారు. ఏమైనా అప్పారావుగారి ఆడపిల్లల పాటలు వీటి అన్నింటికినీ తలమానికమే అని ఒప్పుకోక తప్పదు.

అప్పారావుగారు రాజకీయవేత్త, పండితుడు, పరిశోధకుడు, సంఘ సంస్కర్త, కవి గ్రామణి. నేటి పలువురు కవులను వారి కావ్యములే కావ్య రచనకు పురిగొల్పినవి.

అయినా, పాశ్చాత్య కవిత్వ సమ్మోహితులై, ప్లేటో ప్రణయ తత్వాన్ని బోలిన 'అమలిన శృంగార' తత్వానికి భారతీయమైన 'ప్రేమో,' 'వత్సల' రసాల ముసుగు తొడుగుతారు. ఇంత చెప్పాకగూడా, కవిగా రాయప్రోలు సుబ్బారావుగారి ప్రభావాన్ని తక్కువ చూపు చూడలేము. ఆయన వైఖరి హేతువాద పరాఙ్ముఖమైనదని చెబితే సరిపోతుంది.

విశ్వనాథ సత్యనారాయణగారొక సందర్భంలో చెప్పినట్లు, "అప్పారాయో పజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగారందుకొన్నారు. ఆయన చేసిన పని చాలాగొప్పది. ఆ రోజులలో పండితులు అప్పారావుగారి కావ్యాలల్లోఉన్న అందం చూడకుండా నిందించారు. సుబ్బారావుగారు వారి గీతి నూత్నత్వం పండితులకు తగిన భాషలో ప్రకటించి భాషను గురించి మాట్లాడడానికి వీలులేకుండాచేసి ఆ మార్గంలో ఉన్న కొత్తదనం పండితులచేతకూడా గొప్పదనమని ఒప్పించారు"18. నవ్య కవిత్వాన్ని పాండిత్యమయం చేయడమే రాయప్రోలు సుబ్బారావుగారి సిద్ధి. నేటికీ ఆయన కావ్యాలలోని భాషను, సంధి కార్యాన్ని, సమాస ఘటనను, అలంకారౌచితిని ప్రశ్నించి, దోష ప్రకరణానికి ఉదాహరణప్రాయాలనుగా జేసే పండితులున్నారు కాబట్టి సుబ్బారావుగారి పని గుడ్డిలో మెల్ల.

ఇద్దరు సూర్యులో, లేక అంగ వైకల్యార్థంలో అప్పారావు "అనూరు ప్రాయుడు" మాత్రమేకాగా, సుబ్బారావుగారు "సాటియుఁబోటిలేని" సూర్యులో చర్చించడం అనవసరం. ఎవరి దారి వారిది: ఎవరి సిద్ధి వారిది. ఒక్క విషయం మాత్రం నిర్వివాదం: నవ్యత్వ మనేది ఏ ఒక్కరి కృషిఫలితం కాదు. పూర్వం ఉదహరించిన ఒక వ్యాసంలో డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారన్నట్లు-

> నవ్య కవిత్వమనేది ఒక్కచోట ఒక్కనాడు ఒక్కవ్యక్తి సృజించిన దాన్ని అనుసరించి వర్తిల్లలేదు. వర్షము పడినప్పుడు సెలయేళ్ళుకలిసి నదియైనట్లు, వ్యక్తులూ, ఉద్యమాలూ, పరిస్థితులూ కలిసిరావడమువల్ల నవ్య కవిత్వము నాలుగుచోట్లా పుట్టి పెరిగింది.... ....
>
> "....అయితే బలరాముని హలముతో యమునవలె అప్పారావుగారి మేధాశక్తితో నవ్యకవితా ధోరణి చైతన్య సరస్వతియై మళ్ళీ ప్రవహించింది."

నవ్య కవిత్వంలో నిగూఢమై ఉన్న అనంతావకాశాలను ఆవిష్కరించి కొత్త దినానికి తొలివెలుగు లందించినందుచేతనే, గురజాడ అప్పారావు అరుణుని వంటి వాడౌతున్నాడు; తపనుని తొలి కిరణాలూ ఆయనవే. నవయుగోదయవేళ

ఆయనదే సూర్యరశ్మి. ఆకుల పచ్చనలో అంతర్గర్భితంగా సౌరశక్తి ఉన్నట్లే, తరువాతి కవులందరి రచనలలోనూ, వచన రచనలన్నింటిలోనూ అవ్యక్తంగా అప్పారావు అంశ ఎంతో కొంత ఉంది. కొత్తయుగపు రచయితృ లోకానికి, నిజంగాకూడా ఆయన శక్తిదాత, విమోచనకర్త, మార్గదర్శి, 'మహర్షి'. వ్యక్తిగానూ రచయితగానూ ఆయన గొప్పవాడు. రచయితగాకంటె మనస్విగా మేధావిగా గొప్పవాడు. ఊహాశాలిగా కంటె తాత్వికుడుగా గొప్పవాడు. *

* "గురజాడ ఆధిక్యానికిగల కారణాలు" అనే వ్యాసంలో శ్రీశ్రీ గారు వ్యక్తిగతమైన అభిరుచులకు అతీతమైన విశేష ప్రామాణ్యాలు ఉన్నాయంటూ, (1) సాంఘిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించడం (2) ఆ పరిణామం పురోగమన దిశలోనే సాగటం (3) జీవద్భాషకు సాహిత్యగౌరవం కల్పించడం, కల్పిస్తూ గొప్పదైన నాటకంలో జీవితాన్ని ఫొటోగ్రాఫ్ మాత్రమేగాక యక్స్‌రే ఫొటోగ్రాఫ్ కూడా తీసినట్లు బాహ్యాభ్యంతర జగత్తులోని సార్థకమైన విశేషాలను చిత్రించడం (4) సార్వజనీనతను సాధించేటట్లు నాటక, కథ, గేయరూపాలలో ఉత్తమ సాహిత్యాన్ని వెలయించడం- అనే ఐదంశాలను పేర్కొన్నారు. "రాయప్రోలుమీద అభిమానంకొద్దీ ఆయన భక్తులతని కాచార్యత్వం ఇచ్చినట్లు గురజాడమీద మూఢ విశ్వాసంతో అభ్యుదయ నాయకునిగా అంగీకరిస్తున్నానా?" అని ప్రశ్నించుకొని, మరీ ఈ ఆధారాలను చూపారు.

ఆదికాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన, నవీన కాలంలో గురజాడ. వీరి మధ్య సామ్యాలను చూపుతూ, శ్రీశ్రీ గారే రాసిన మరొక వ్యాసం, అనేకులకు అతిశయోక్తిగా కనిపించినా, వారి మధ్య సమాన ధర్మాలే లేవని ఎవ్వరూ అనలేక పోయారు. రచనాబాహుళ్యం వల్లగాక, "తెలుగు తనానికి ప్రాతినిధ్యం వహించి, తెలుగు భాషకు గల ప్రత్యేకతను ప్రదర్శించడం వల్లనే" వీరు వంద్యులయ్యారని శ్రీ శ్రీ గారు చెప్పడం, European Poets గురించి టి. యస్. ఇలియట్ చేసిన వర్ణనకు అనువుగా ఉంది. తన జాతిని సమగ్రంగా చిత్రించడం ద్వారా, అలాంటి కవి సాహిత్యం ఇతర జాతులవద్ద స్వదేశానికి ప్రతినిధిగా వుండగలదు. సాహిత్య ప్రమాణాలతోనే గాక, చారిత్రక, సాంఘిక, నైతిక ప్రమాణాలతో గూడా ఈ ప్రాతినిధ్య శక్తిని నిర్ణయించవలసి ఉంటుంది. అయితే అలాంటి వాళ్ళంతా మహాకవులై ఉండాలి. తమ దేశంలోని తదితర కవులపై తమ ఆధిక్యాన్ని బట్టి మాత్రమేగాక, ఇతర కారణాలను పురస్కరించుకొనికూడా ఈ గొప్పతనం సిద్ధిస్తుంది. అంటూ గాథ (Goethe) కవిని వర్ణించే సందర్భంలో ఇలియట్ ఇలా రాసుకొచ్చాడు :

> The true sage is rarer than the true poet ; and when the two gifts, that of wisdom and that of poetic speech, are found in the same man, you have the great poet. It is poets of this kind who belong, not merely to their own people but to the world.
>
> ON POETRY AND POETS, P. 207

గురజాడ అప్పారావులో ఈ రెండు గుణాలూ ప్రస్ఫుటంగా కనిపించి, ఆయనను మహాకవి శబ్ద వాచ్యుణ్ణి చేస్తున్నాయి.

నిజాన్ని గుర్తించి మార్పును ఆహ్వానించి ఆదర్శం స్థాయికి వాస్తవాన్ని పైకెత్తి, ఉన్నది ఉన్నట్లుగా లోకాన్ని ప్రేమిస్తూ, ఉన్నదానిని ఉండవలసినదానితో కొలిచి లోపాలను సవరించి, మేలిమినీ మంచినీ దివ్యాంశనూ పెంపుజేయజూచిన వ్యక్తి, మహావ్యక్తి. కాల్పనిక వాదాన్నీ, వాస్తవవాదాన్నీ ఆదర్శంతోటీ యథార్థాన్ని సంధానించినట్లు అనుసంధానించిన ద్రష్ట, గొప్పద్రష్ట. ఈ గొప్పలన్నీ ఆయన రచనలలోకూడా ప్రతిఫలించి, అవి కస్తూరి ముడిచిన కొంగులై పరిమళిస్తున్నాయి.

.... మహాపురుషుడైన కవే మహాకవి కాదగునని వెనకటికి శెట్టి ఈశ్వరరావుగారొక సిద్ధాంతం చేశారు. మహాపురుషుడుగాక ఏ కవీ మహాకవి కాదగడని నేను ఆయన ననుసరిస్తూ లోగడ రాసిఉన్నాను. ఇప్పుడు గురజాడ అప్పారావు కవితనానికే సవాలు వచ్చింది. మహాకవితనం దాకా ఎందుకు? అయితే జాతి ఎన్నడో అప్పారావును మహాకవిగా అంగీకరించిఉంది కాబట్టి విమర్శకు లౌనన్నా కాదన్నా ఆయన మహాకవిగానే ఉండబోతాడని నమ్ముతూ శ్రీశ్రీగారు రాశారు. విమర్శకులకు ఈ వాదం సమ్మతం కాబోదని నాకు తెలుసు. 'జాతి' అంటే ఎవరు? 'ప్రజలు' అనే మాటలాగే దీనికీ అర్థంపర్థం లేదు. ఎవరిద్వారా జాతి అలా అంగీకారం తెలిపింది? ఎప్పుడు? ఎక్కడ? ఇలాంటి ప్రశ్నల కన్నిటికీ శ్రీశ్రీగారి వాదం తావిస్తుంది. గురజాడ అప్పారావు చని పోయిన వెనువెంటనే వింజమూరి రంగాచార్యులు ఆంధ్రపత్రిక ఉగాది సంచికలోనూ, ఆటుతర్వాత మహాకవి అనే శీర్షికతో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు తమ కృష్ణపక్షంలో నున్నూ అప్పారావు నిలా సంభావించడం మొద లెట్టారు. అది నిలిచిపోయింది. పలువురు పలుమార్లు ఒకకవి కావ్యాలను ఉపహ రించసాగితే ఆ కవి మహాకవిగా గుర్తింపుకు వస్తాడని ఒక ఇంగ్లీషు విమర్శకుడు రాసిన మాటలు ఈ సందర్భంలో నాకు గుర్తుకువస్తున్నాయి. హేళనకు అన్న మాటలు కావివి. అయినా వాటిని పట్టుకొని ఊగులాడ నక్కరలేదు. తన సమకాలిక కవులు నిండుగా గుర్తించి నిబ్బరంగా ప్రకటించలేక పోయిన విషయాలను అలా గుర్తించి ప్రకటించగలిగిన కవి మహాకవి కాదగునని, మరొక అభిప్రాయంకూడా పాశ్చాత్య సాహిత్య విమర్శకలోకాన వ్యాప్తిలో ఉంది. అది సరైనదనుకొంటే గురజాడ అప్పారావు నిస్సంశయంగానే మహాకవి.

.... గట్టి నేలపై కాలుమెట్టి కూడా చుక్కలకు తల నిక్కించే ఊహామతి; శిఖరాలనే గాక అగాధాలను కూడా చూడగలిగిన చూపరి;

నిన్నటి మన్నన వేళ్ళు తన్నుకొన్న మొక్క, నేడువేసిన పూతలో పిందెలో రేపటి పూలను పళ్ళనూ భావించగల మనస్వి; ప్రజల కంటితెరలనూ మనస్సు మురికి పొరలనూ సున్నితమైన హాస్య శస్త్రికతో తొలగించగల నేర్పరి; నేల నాలుగంచులలోని మంచిని, తుంటలై తునకలై చెల్లాచెదురుగా పడి వుండినదాన్ని, తెచ్చి, రేకు రేకూ కూర్చి శతపత్రంగా తీర్చే పనితనంగల వాడూ: 'మంద' గుణాన్నీ మందబుద్ధినీ విరిచి అజ్ఞానాన్నీ అహంభావపూరిత మైన స్వార్థాన్నీ అణగదొక్కగోరిన హితైషి – నిజంగానే గురజాడ అప్పా రావు మహాపురుషుడు....

తన భవిష్యత్తును మన వర్తమానం కావిద్దామనుకొనీ, జాతికిగల ప్రజా వాఙ్మయ సంప్రదాయాన్ని సాహిత్యశాఖగా పూలుపూయించి పళ్ళు కావిద్దామనీ సంకల్పించి అక్షర లోకంలో ప్రవేశించాడు. రేపటిపై పే మనస్సు బరువు సంతతినీ మోపి రాశిలో కొద్దివైనా రామణీయకంలో గొప్పవైన రచనలుచేశాడు. పాండిత్యంతో కవిత్వానికి శిరోభారం కలిగించక, భేషజం భాషలో చూపక, అలంకా రాల గంగిరెద్దు మూపుమీది పాతగుడ్డల పేర్పులతోటి మాత్రమే ఆధిక్యాన్ని ఆపాదించుకోక, భాషలోనేగాక కావ్యచ్ఛందస్సువిషయంలోకూడా జాతిసహజాభిరుచు లకు అనుగుణంగా, సహజతనూ, సరళతనూ, సౌందర్యాన్నీ ఉపలక్షించుకొన్నాడు. గురుత్వం ఇంటిపేరులో జాడతోకలిసివుండే విధంగా, తన సాహిత్య గురుత్వాన్ని కూడా, అక్షర సికతాతలంమీద చెరిగిపోయే జాడలు కానివిధంగా గట్టిగా గాఢంగా ఎదల కెక్కించి పదిలపరుచుకొన్నాడు. తన నాటక గత పాత్రలకు స్వతంత్రమైన సాహిత్యాతీతమైన జీవిక ఏర్పడేటంత ఘనంగా తెలుగుజాతి కళ్ళకద్దుకొనే నాటకాన్ని సృష్టించాడు. అరణ్యం ఉండినచోట ఉద్యానవనాలను నిలుపుతూ మేలైన కథలు ఇచ్చిపోయాడు. అయినా చేయగలిగింది చేసినదానికంటె ఎన్నో అంతస్తు లెక్కు వనిపించేటట్లు భ్రూణప్రాయంగా ఉండిపోయిన రచనా శకలాలను విడిచిపోయాడు. ఒక గొప్ప దేశ చరిత్రకు వేసుకొన్న పథకాన్ని అక్షర నిబద్ధంచేయకముందే దాటు కొన్నాడు. దడబుడలు, నిఘంటు శబ్దజ్ఞాన ప్రయోగాలు వగైరా–ఇవిమట్టుకే గొప్ప కవిత్వానికి లక్షణాలు కానక్కరలేదనుకొంటే, గురజాడ అప్పారావు గొప్ప కవే.

రాయప్రోలు సుబ్బారావుగారి నవ్యత్వం చాలావరకు లౌకికమేగాని భావ సంబంధికాదు. గురజాడ అప్పారావు ఆధునికుడేగాక నవ్యుడున్నూ. ముదిమోడు వేసిన విడి చిగుళ్ళకూ, నవతరువు తొడిగిన తలిరాకు జొంపానికీగల భేదమే, ఆ ఇద్దరి

నవ్యత్వానికి ఉన్నట్టేది. అయితే ఒక్క గురజాడ అప్పారావు మొగాన్నే తెల్లవారిందని అనడం వెర్రి. గతశతాబ్ది చరమదశకానికి, ఎందరో మహానుభావుల వైయక్తిక సాహిత్య వ్యవసాయానికీ, ఎన్నో పత్రికల సమిష్టి కలం కష్టానికీ ఫలితంగా, చీకట్లు వదులై వెలుగురేకులు ఒకొక్కటీ మందమందంగా స్పష్టాస్పష్టంగా విడిగించుకొంటూ మొదలైన ఒక ముప్ఫైయేళ్ళ కాలాన్ని (1890–1920) నవ్యత్వం కమ్మివేసింది. అప్పటికి నూతన విజ్ఞానోదయ కర్తలందరూ గతించారు. ఇదంతా కలసి శుభోదర్కమైన మహోదయ మయ్యేట్లుంటే, అందులో గురజాడ అప్పారావు సూర్యరథసారథి. *

గురజాడ అప్పారావు వ్యష్టిగా స్థాపించిపోయిన కవిత్వసంప్రదాయ మొక్కటిమాత్రమేకాదు. కందుకూరి వీరేశలింగం, రఘుపతి వేంకటరత్నం ప్రభృతి భావనాయకులు ప్రారంభించిన సదుద్యమాలన్నీ అచిరకాలంలోనే మబ్బుచాటున చోటుజేసుకొన్నట్లుగా, మళ్ళీ మన సంప్రదాయం బలాన్ని పుంజుకొని సాహిత్యంలోనూ జీవితంలోను విజృంభించి, ఇప్పటికీ పళ్ళునూఱుతూ కళ్ళురుముతూ తిడుతూ మొడుతూ కట్టుబొట్ల కట్టుదాళ్ళతో నియమాల యమపాశాలతో పైబడుతూ ప్రతిభనూ సాహసిక మనస్కతనూ ప్రయోగపరతనూ దమించ జూస్తున్నది: కళాపునరుజ్జీవనం దక్కించి పోయిన ఫలసాయాన్ని దేశప్రజకు అందకుండా ఉడుమై నిలిచి ఉంది. ఆ మహామహుల కీర్తికాయాలపై అపుడపుడుసాగే మూకుమ్మడి దాడుల అంతరార్థమిదే. ఈ ఆకతాయి సాంప్రదాయికుల నుద్దేశించే అప్పారావు ఇలా చెప్పిపోయాడు:

> మెచ్చనంటా వీవు; నీవిక
> మెచ్చకుంటే మించిపాయెను;
> కొయ్యబొమ్మలె మెచ్చు కళ్ళకు
> కోమలుల సౌరెక్కునా?

---

* 'గురజాడ అప్పారావు పంతులు' అనే శీర్షికతో (భారతి, జనవరి 1953: మొగడ తలకట్లు) రాస్తూ శాస్త్రి (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి) ఇలా చెప్పారు:

...అప్పారావు రచనలను చేతబట్టి శబ్దరూపాలు మాత్రమే పరిశీలించే వాడు రసికుడు కాడు; పండితుడు కాడూ; చివరికి వాఙ్మయం అంటె అభిరుచి కలవాడు కూడా కాడు.

అప్పారావు వాస్తవంగా ఆంధ్ర వాఙ్మయాకాశం మీద ధ్రువతార. అది అనశ్వరం మాత్రమే కాదు. మార్గదర్శకం కూడాను.

*    *    *    *

గురజాడ అప్పారావు పంతులు ఆంధ్ర వాఙ్మయంలో కొత్త పోకడలు చూపిన ధీశాలి. అతన్ని మనం మరచిపోతే అది చాలా దౌర్జన్యంలో చేరిపోతుంది.

1. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము : డా॥ కొత్తపల్లి వీరభద్రరావు. పు. 430-431.

2. తె. భా. చ. సం. విజ్ఞాన సర్వస్వము, పు 621.

3. ,, ,, పు. 825.

4. ఆధునికాంధ్ర కవిత్వము : డా॥ సి. నారాయణరెడ్డి, పు. 149-156.

5. అభినవాంధ్ర సాహిత్యము (వ్యా) : వ్యాసము ౨ : కవికోకిల గ్రంథావళి: దువ్వూరి రామిరెడ్డి, పు. 190.

6. అప్పారావుగారు - నేను : బసవరాజు రాజ్యలక్ష్మమ్మ. పు. 36 - 37, 46.

7. నాలోమూర్పు (వ్యా) : తల్లావఝుల శివశంకరశాస్త్రి, ప్రతిభ 1937 ఫిబ్రవరి.

8. నీరాజనము (వ్యా): తల్లావఝుల శివశంకరశాస్త్రి, తృణకంకణము 1938 పు 38

9. రమ్యాలోక సమీక్ష (వ్యా) : పుటుగంటి సీతారామయ్య. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1939.

10. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి కవిత (వ్యా) : [illegible] శాస్త్రి. భారతి 1952 డిసెంబరు.

11. Some Tasks for Education : Sir Richard Livingstone, P. 3

12. The Modern writer and his world : G. S Fraser, P. 21.

13. నవ్యకవిత్వం (వ్యా) : పుల్లపరపు విశ్వేశ్వరరావు, ప్రతిభ, నవమవార్షికోత్సవ సంపుటము.

14. గు. ర. లే. పు 207.

15. గురజాడ - రాయప్రోలు (వ్యా) : డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, భారతి 1962 నవంబరు.

16. గురజాడ అప్పారావుగారు (సాంప్రదాయంమీద ఆధునిక కవుల తిరుగుబాటు) (వ్యా) : డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి : కిన్నెర.

17. గు. ర. మ. డై. పు. 95.

18. నవ్యసాహిత్య పరిషత్తు సప్తమ వార్షికోత్సవము : అధ్యక్షోపన్యాసము (ఉ) విశ్వనాథ సత్యనారాయణ, భారతి 1940 ఏప్రిల్.

# పునరపి....

అంతేయాం మన మంచికొరకే అన్న సామెత – కథను చిన్నతనంలో మన మంతా చదివే ఉంటాము. మాసం తక్కువ సంవత్సరం క్రితం అచ్చుకువెళ్ళిన ఈ పుస్తకం ఈ మేడేనాటికి వెలువడుతున్నది. ఈ ఆలస్యం కూడా ఒక మంచికే.

ఆలస్యం వల్ల అమృతం విషం కాలేదు సరిగదా తద్వ్యతిరేకమే అయింది నా మట్టుకు నాకు. అదనపు సంగతులెన్నో కొన్ని తెలియవచ్చుటుంది, ఈ మధ్య కాలంలో గురజాడ వాఙ్మయ చరిత్రలోనే ఘటన లనదగినవి ఒకటి రెండు సంఘటిల్లాయి.

ముఖ్యంగా, కన్యాశుల్కం తొలికూర్పు ప్రతికి అంధకార బంధ విమోచనం కలిగింది. తొలిసారి అచ్చుపడిన డెబ్బై అయిదేళ్ళకు మళ్ళీ మిత్రుడు బంగోరె తెంపూ తెగింపూ కారణంగా వివరణలూ వ్యాఖ్యానాలూ కూర్చుకొని దాదాపు సమగ్రరూపంతోటి తెలుగు పాఠకుల ఎదటకు వచ్చింది. ఆ ప్రతిలోని గోప్యాలన్నీ వెల్లడయ్యాయి. మర్మ గ్రంథులన్నీ బద్దలయ్యాయి. ఇది గొప్ప కష్టఫలం. పరిశోధన పరిశ్రమగామారి, పరిశ్రమకూడా పరితోషం కలిగించేట్టుగా, తెలుగు నాటకాలకు దేనికీ లేని హంగులు గురజాడ అప్పారావు నాటకానికి చేకూరడం ఆయన చేసుకొన్న అదృష్టమే అయితే ఇది మంచి ఉపక్రమమేగాని, చిట్టచివరి ఉపసంహారం కాదు. రెండవకూర్పు ప్రతి అసలు నాటకం. అప్పారావు కీర్తి పతాకం కూడా అది కాదు, ఇదే. కాబట్టి అచిరకాలంలోనే దీనికిగూడా వ్యాఖ్యానాదులు అమరితే బాగుంటుంది. బంగోరె కృషి దీనికి ప్రాతిపదిక వేసింది. సోపాన పంక్తిమీదుగా సౌధోపరిభాగాన్ని చేరడమే తరువాయి.

తొలికూర్పు ప్రతి వారం వారం ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో సచిత్రంగా వెలువడుతూ వస్తున్నది. పరుగు పందెంలాంటి వైజ్ఞానిక అహమహమికలో బంగోరె గమ్య స్థానాన్ని చేరుకొని తనను వెనక విడిచినా, ఆరంభించిన దాన్ని ఈ పత్రిక సంపాదకులు కొనసాగిస్తూండడం మెచ్చదగిన సంగతి.

ప్రగతి సచిత్ర వారపత్రిక మరొక తెన్నున గురజాడ వాఙ్మయాన్ని సంపన్నం చేస్తున్నది. కన్యాశుల్కంలోని గిరీశం పాత్రకు గల వన్నెచిన్నెలు,

దాని విశిష్టతకు గల వివిధ కోణాలు బయల్పడేట్లు ఒక చర్చావేదిక మొదలై కొడవటిగంటి కుటుంబరావుగారి వంటి వారిని రాబిలుస్తూన్నది.

విజయనగర వాస్తవ్యులు పేరి సూర్యనారాయణగారు అవసరాల సూర్యారావు కృషినే ఆధారం చేసుకొని ఆంగ్లంలో గురజాడ జీవిత చరిత్రనూ సాహిత్య విమర్శనూ గత సంవత్సరంలో గ్రంథరూపేణా వెలయించారు. ఆ భాషలో గురజాడ జీవిత, సాహిత్య విశేషాలకు సంబంధించి రాశిలో ఇంత పెద్ద ప్రయత్నానికి ఇదే మొదలు.

వీటన్నిటినీ త్రాసున ఒక పళ్ళెన పెట్టి మరొక పళ్ళెంలో ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారి స్వీయ చరిత్ర లిఖిత ప్రతి నొక్కదాన్ని పెట్టవచ్చు. ఇటీవలనే మరణించిన మునిసుబ్రహ్మణ్యంగారు అస్ఖలితాంగ్లంలో తమ విజయనగర జీవితాన్ని, గురజాడ పరిచయాన్ని ఇందులో వర్ణించి పోయారు. కొత్త విషయాలు అట్టేలేకపోయినా, పేదనైన నాకు ఇది పెన్నిధే, చెప్పలేను. అప్పారావు-మునిసుబ్రహ్మణ్యం లేఖా వాఙ్మయంలో ఎదురయ్యే పట్టాభి రామమూర్తి, ఈ రచనలో తెరమరుగు వదిలి పూర్ణకాంతిలోకి వచ్చి నిలుస్తున్నాడు. కన్యాశుల్కంలోని మధురవాణి, మీనాక్షి పాత్రల శీల స్వభావాదుల గురించి నీతి నియమాల గురించి చర్చ వచ్చిన సందర్భంలో, అప్పటికి వయస్సులో నవయువకుడై ఉండిన మునిసుబ్రహ్మణ్యం మనసులో ఛాందసుడై ఉండేవాడని, దానికి పట్టాభి రామమూర్తి ప్రభావమే కారణమై ఉండవచ్చునని అప్పారావు లేఖలు సూచిస్తాయి. అది నిజమేనని ఈ రచన నిరూపిస్తుంది. ఒంగోలు పట్టాభిరామమూర్తిగారి తండ్రి శ్రీనివాసరావు విజయనగరానికి కాపురం వెళ్ళి సర్కారు నౌకరిచేస్తూ, 'శాస్త్ర' విషయాలలో పండితులను కూడా ఒప్పించగలిగిన వాడయ్యాడు. ఆయనకు అన్ని విధాలా వారసుడే ఈ పట్టాభిరామమూర్తి. ప్లీడరుగా వృత్తిలోనూ, వక్తగా పౌర జీవితంలోనూ ప్రఖ్యాతుడై,

He was the leader of the anti-nautch movement.

కాలేజీ జీతానికి వసతిలేని మునిసుబ్రహ్మణ్యంగారిని చేరదీసి తనఇంట పుస్తకాలుచూచి నోట్సు వగైరా రాసే పనిపెట్టి గొంతుమీదికివచ్చి కాలేజీనుంచి అర్ధచంద్ర ప్రయోగం జరగబోయే తరుణంలో చక్రం అడ్డువేస్తూ సంస్థానం కోశాగారం నుంచి డబ్బుపుట్టించి యిస్తూ అప్పారావు పంతులు తన నెలా ఆదుకొని అభయమిచ్చేవాడో, మునిసుబ్రహ్మణ్యం ఈ రచనలో వర్ణించాడు:

The way in which I did the work entrusted to me by that gentleman soon endeared me to him, with the result that very soon, I became at once his friend, companion, clerk and also a member of his family.

ఇంత కొత్తవిషయం బయల్పడ మొదలిడిన కాలంలో, పదేళ్ళకృషి ఫలితమైన ఈ నా గ్రంథం వెలువడుతున్నది. గురజాడ వాఙ్మయానికి ఇది గోపుర కలశమేమీ కాదని నాకు తెలుసు; 'పునరపి' మాత్రమే ! తీర్పుకాదు, అక్షరాలాకూడా బరువైన పుటువైన చేర్పు కాకుండానూ పోదు. సెట్టి ఈశ్వరరావు, అవసరాల సూర్యారావు ప్రారంభించి పరిశ్రమించిన ఫలితంగానే నాకు చాలావరకు కష్టం తప్పింది. అయితే ఇప్పటికే రాశి గణనీయంగా పెరిగిన గురజాడ వాఙ్మయాన్ని సమీకరించి సమీక్షించకుండా నా పుస్తకం ఇలా రూపొంది వుండేది కాదు. వెనకవారి బుజాలమీద ఎక్కి నేను మరింత విపులతలాన్ని కనుగొని కళ్ళకు కట్టించ గలిగాను.

అల్పసంతుష్టి ఆత్మవినాశకమైనది. గురజాడ అప్పారావు ఇంగ్లీషున రాసి పెట్టిన డైరీలూ, లేఖలూ, ఇతర కాగితాలూ ఎక్కువగా చూసి స్వయంగా అనువదించుకోనిదే, నా పుస్తకంలాంటి దానికి దేనికీ సర్వసమగ్రత అంటూ చేకూరదు. విశాలాంధ్ర ప్రచురణాలయం వారి ట్రంకుపెట్టెలలో అసూర్యంపశ్యగా ఉండి దాదాపు శిథిలప్రాయమైన ఈ పత్రసంపదను నేను చూడలేక పోయాను. పుస్తకాలలో పత్రికలలో విడి సేకరణలలో అప్పారావు ఆంగ్లరచనా భాగాలను నేను చూడకపోలేదు. సరికొత్త రచనలనుకూడా మిత్రుల సాయంతో సంపాదించాను. అయినా, ఆ కొరత పెద్ద వెలితిగానే ఉండిపోయింది. ఎట్టకేలకు అవి ఇప్పుడు నార్ల వెంకటేశ్వరరావుగారి చేతికి వచ్చి బరువు దించుకొన్నాయి. ఇటీవల ఇంగ్లీషులో కూడా చేయితిరిగిన రచయితగా పేరు సంపాదించుకొన్న నార్ల వారి పర్యవేక్షణలో, పురాణం సుబ్రహ్మణ్యశర్మ గొల్లపూడి మారుతీరావు ప్రభృతి మిత్రులు శ్రమకోర్చి పాఠనిర్ణయం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. అవసరాల సూర్యారావు ఒక్క చేతిమీదుగా నిర్వహించిన అనువాద మహాయజ్ఞంలో దూరిరాక తప్పని తప్పులనూ పొరబాట్లనూ సవరించి శుద్ధప్రతిలాంటి దానిని త్వరలో అందించబోతారు. శుభం.

మహోత్సాహంతోటి స్వచ్ఛందంగా అప్పారావును సొంత పరచుకొని ఆయన రచనలను అనువదించీ వర్గీకరించీ అవసరాల సూర్యారావు వాటి పాలిటికి సూర్యసన్నిభుడే అయ్యాడు. అయితే ఉత్సాహాతిశయమే ఆ పనికి మొదలు

పెట్టింది. మక్కీకి మక్కీ పద్ధతి పట్టుకొన్నాడేమో, భారతాంధ్రీకరణ పద్ధతిని కూడా చేబట్టాడు కాదు; శ్రీనాథాదుల స్వైరవృత్తి నవలంబించాడని చెప్పకోక తప్పదు.

పోలవరం జమీందారు రాజా కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావు గురజాడ పేర్రాజుగారి జామాత అన్న సంగతి తెలియక, అప్పారావు ఇంగ్లీషు వాక్యాన్ని అనువదించడంలో డి. శివరావు అనే ఆయనకు ఈ బాంధవ్యాన్ని అంటగట్టాడు.

Polite Spoken Speech కి శిష్టవ్యావహారికమని అర్థం కాగా, "లలితమైన సుందరమైన" అనే విశేషణాల నిచ్చాడు.

అనువర్తకు స్వేచ్ఛ అంటే, అసలుకు మోసమే. Omissions అనేవి Commissions అనే దోషాలకంటె తక్కువ దిన్నవేమీ కావు: విడిచివేసిన విషయాలు అల్పిష్ఠమైతే ఎవరి కొంపకూడా మునగదు. ఉదాహరణకు, [illegible] [illegible] లోని

I would have opened my purse strings and have made glad the heart of mataji maharani by contributing largely to the funds of the school.

అనే వాక్యం అనువాదం ఇలా ఉంది :

ఇలాంటి స్కూలుకి వెంటనే పర్సుతీసి ఎంతవుంటే అంతా, విరాళమివ్వడం ఉచితంకాదూ? ఎంత యిచ్చినా అది దండుగకాదు దురదృష్టవంతులైన భర్తలు ఈ స్కూలు నీడను బతికవచ్చును.

అయినా ఈ పద్ధతి చేయగల హాని ఇలాంటి సందర్భాలలో బహుకొద్ది.

ముఖ్యాంశాలలో దీని ననుసరించి తనకు తానై ఘోరంగా అపవారం చేసుకొన్న సూర్యారావుపట్ల జాలి కలుగుతుంది. అప్పారావు వ్యక్తిత్వం కళంకితమౌతుందేమోనన్న తాపత్రయంవల్లనే ఇది జరిగి ఉంటుంది. లోకనిందనుంచి తప్పించబోయి ఒక వ్యక్తికి ఇన్ని తెల్లనీళ్ళు కొట్టవలసినపని, భక్తునికైతే ఫర్వాలేదుగాని జీవితచరిత్రకారునిదీ విమర్శకునిదీ అయినప్పుడే ముప్పు. ముఖాలకు సఫేదా కొట్టడం నాటకాలలోనే తగు; గోడలకు వెల్ల వెయ్యడం పండగ పబ్బాల్లోనే బాగు. ఆదర్శీకరణ అబద్ధీకరణగా మారే ముప్పు జీవిత చరిత్రను hagiography గా మారుస్తుంది. మనిషిని ఋషీ చెయ్యక్కర్లేదు, దోషీ చెయ్యక్కర్లేదు, మనిషిగానే మననిస్తే గుడిలో గుగ్గిలం వేసినంత. ఆకాశ స్వర్గమూ పాతాళ నరకమూ దొందూ దొందే. అవి 'అతి' లోకాలు. ఒకటి అధిలోకం; మరొకటి అధో లోకం. వెరసి, రెండూ రెండు అబద్ధాలు. మంచి చెడ్డల

మిఠాయింపును మించిన కమ్మటి దినుసు మహీతలాన ఎక్కడా లభించదు. ఈ సాధారణ పరిపూర్ణ మానవ మహాలోకమే గురజాడ అప్పారావును తానుదిద్ది, అప్పారావుచేత తనను దిద్దించుకొంది. సామాన్యత్వం మాన్యమయ్యేట్టయితే ఆయన సమ్మాన్యుడు. లోపలేశాలవల్లకూడా, ఆయన వ్యక్తిత్వం మానవాంశను సంతరించు కొంది. మనిషికుండే 'వురవుర'లన్నీ ఆయనకు ఉన్నాయి. మహాపురుషుడు కావ డాని కెవ్వడున్నూ నోరూవాయీకట్టుకు గోచీపెట్టుకు చేతులు ముడుచుకు ఇనప కచ్చడాల మునిముచ్చు కానక్కర్లేదు. నీతినీ రుచినీ హృదయాన నిలుప్తకొని తల మీది కెక్కించుకోబన్లేదు. కాబట్టి గురజాడ అప్పారావు గురుత్వానికి లఘుత్వ మాపాదిస్తాయని కొన్ని విషయాలను బుద్ధిపూర్వకంగావిడిచిఉంటే, సత్యాన్ని అణచి పెట్టిన దోషానికి సూర్యారావు పాల్పడుతాడు. నిజానికి అలాంటిది ఉక్తిదోషంకాదు, నేరమే అవుతుంది. ఆ దురుద్దేశాలేవీ అతనికి లేవని నా నమ్మిక. అయినా, ఎందు కనో కొన్ని అంశాలను అనువదించకుండానే విడిచిపేయడం జరిగింది.

అందులో అత్యంతం ఆసక్తిని కలిగించేది అప్పారావుకు షేర్‌మార్కెట్ గురించిన ఆసక్తి. అది 'పొరలవాటేమో', మహానగరాలకు పోయినప్పుడు, స్టాక్ ఎక్స్చేంజి వ్యవహారాలపై కన్నుంచేవాడని 1898 నవంబరు 28, డిసెంబరు 3, 10 తారీఖుల 'ఎంట్రీ'లు తెలుపుతున్నాయి. ఆ విషయమే సూర్యారావు అనువాదంలో నస్మరంతి. తమ ప్రైవేటుడైరీల్లో ఇలాంటి 'అపరిష్ట' కలిగించే విషయాలను రాసి పెట్టుకొనే వాళ్ళెందరు ? కాపట్యం కొనసీడకూడా ఆయన వ్యక్తిత్వంపై ప్రసరించ లేదన్నమాట : ప్రసరించిఉంటే, డైరీలనిండా ప్రార్థనలూ, కీర్తనలూ, చిన్నపాలూ పాపాల ఒప్పుకోళ్లూ, నీతిసూత్రాలూ, ధర్మపన్నాలూ క్రిక్కిరిసి ఉండేవి. ఇంతకూ అప్పారావు ఆత్మవంచకుడు కాదు. ఈ 'ఎంట్రీ'లనుబట్టి అప్పారావు చట్టావ్యాపారం చేసేవాడని నిర్ణయం ఎలాచేయడం ?

సూర్యారావు విడిచిన మరోవిషయం, గురజాడ శ్యామలరావుకు శంభుచంద్ర ముఖర్జీ రాసిన 1889 అక్టోబరు 8 నాటి లేఖలో పూర్వభాగం. ఇందులో అప్పారావు ప్రసక్తి లేనందుచేత విడిచాడని చెప్పకనే తెలుస్తున్నదిగాని, శ్యామలరావు ఆంగ్ల కవిత్వ గుణదోషాల గురించి ముఖర్జీ చేసిన దీర్ఘవిమర్శ చాలా ముఖ్యమనే విష యాన్ని మరుగు పరిచాడు. అదిగాక, శ్యామలరావు గేయం To the-Magnificient disationists లభ్యమే కానప్పుడు, ఈ లేఖలో ఉల్లిఖితాలైన ఒకటి రెండు చరణాలైనా పదివేలు.

All hail to you my country's faithful friends,
From Britain's isle, on which our ideal depends

And where you worked so well for Bharat-land,
That we can, sure, achieve a success so grand.

ఇలాంటి పసిపిల్లల బొమ్మరిళ్ళ వ్యవహారాన్ని ముఖర్జీ తీవ్రంగా విమర్శించిగాని వదల్లేదు. [illegible] అచ్చు వేసుకొన్న ఈ Heroic Couplet ఎంత చెత్త కవిత్వమో నిర్దాక్షిణ్యంగా చూపెట్టాడు. శ్యామలరావు కవి కాలేడని జోస్యం చెప్పాడు. అన్న కవిత్వాన్ని చూచిన కంటితో తమ్ముడి కవిత్వాన్ని చూచేసరికి మొత్తబుద్ధయినట్లుంది.

I love you and your friend as my country's hope. I love you in special for your connection with Appa Row. I cannot give you better proof than the trouble I have taken in appraising your work and the trouble I had taken in giving judgement.

అప్పారావంటే ముఖర్జీ ఎంత మోజుపడిందీ ఈ జాబు సాక్ష్యం పలుకుతుంది.

అప్పారావు నచ్చీల నిరూపణ కార్యక్రమంలో ఒక భాగంగా, రాజరికం ప్రస్తావనల నన్నిటినీ దాటవెయ్యడమో తగ్గించి వెయ్యడమో జరిగింది. రామానుజాచార్య విద్యాసమితి వారి ప్రచురణలోగల [illegible] అనే అప్పారావు వ్యాసానికీ విశాలాంధ్రవారి వ్యాసచంద్రికలోని [illegible] వ్యాసానికీ తారతమ్య పరీక్షచేస్తే, రాజభక్తి వాసనలు అప్పారావుకు అంటుతాయేమోనని సూర్యారావు జాగ్రత్తపడినట్లు తెలిసి వస్తుంది. డైరీలలో మూలానికి భిన్నంగా రాజులగురించీ రాజరికంగురించీ కనిపిస్తున్న ఖండనాత్మక వాక్యాలు సూర్యారావు వహించిన స్వేచ్ఛకు చూపుడు వేళ్ళు. అప్పారావు ప్రజాతంత్ర వాది కావచ్చుగాని, రాజభక్తుడు కూడా. అట్లని, దాసానుదాసత్వం ఆయనకెన్నడూ అలవడలేదు. కాబట్టి సూర్యారావుగానీ మరొక రెపరైనాగానీ ఆయన తరపున వకాల్తా పుచ్చుకోవడం అనవసర మనిపిస్తుంది.

రామస్వామి, వేంకటస్వామి పేరుగల భోగ కాంతల వ్యవహారం మీద గట్టిమూత పెట్టి నొక్కి-వేయ లేదనేగాని, ఆ పేర్లు బయట పడకుండా జాగరూకత వహించినట్లు సూర్యారావు అనువదించిన డైరీలు బయట పెడుతున్నాయి. ఆనంద గజపతి మహారాజా ఈ విషయంలో ఇతర రాజాలకు తీసిపోడు. రామస్వామి వివాహితే అయినా తీసుకొచ్చి రాణీవాసంలో చేర్చుకొన్నాడు. మచ్చిక పడని గుర్రంలాంటి ఈ మదవతికి కళ్ళెం వేసి జీనువేసి దారిలోకి తెచ్చుకొనేందుకు విశ్వప్రయత్నమే చేయవలసివచ్చింది. ప్రియుడు కావలసి గురు వయ్యాడు. ఆ కృషి

లోనే అప్పారావు సహాయాన్ని అర్థిస్త: లోకనిందగురించి ఆయన అప్పారావును ముందుగానే హెచ్చరించాడు:

People do not understand noble motives - you have bravely exposed yourself to the misconstructions of ignorant and foolish people who might say "he goes to her because he loves the girl or wants to profit himself by her or he wants to carry (curry?) favour of the Rajah."

ఆనందగజపతి భయపడెంది జరిగింది. వేశ్యాలంపటత్వమే గాక. తైనాతీ వృత్తిని కూడా అప్పారావుకు ఆపాదించేందుకు చాలినంత పూర్వరంగం ఏర్పడింది. నిజానికి, అప్పారావుకు, రామస్వామి దోస్తీ మరొక విధంగా లాభించింది. మొదట్లో తన మనస్సును బలవంతం మీద సమాధాన పెట్టుకొన్నాక, మహారాజా శీలంగురించి ఆదుర్దా పడడంపోయి రామస్వామి గురించి జాలిపడసాగాడు.

I saw the good points in R. S., but the bad points over-weighed... Another turning point in my views. (During the last six or seven years my reflectiveness and knowledge of life increased. I schooled myself to control (l) dislike, hatred, ill - will etc., and to be sympathetic - sympathy being the Sine Qua non of a literary aspirant.) I came to con her views, her aims and her feelings - to take account of her training and early influences - ...

సూర్యారావు అనువాదం ఈ మాటలకు చిలవలూ పలవలూ పెట్టిగాని తృప్తి పడలేదు ఒకచిన్న వాక్యానికి నాలుగు వాక్యాల వ్యాఖ్యానం అనువాదమనిపించుకోదు. అత్యుత్సాహమో లేక అప్పారావు ఆశించిన అర్థం ఎక్కడ తప్పిపోతుందోనన్న భయమో, సూర్యారావుచేత ఇన్ని పనులు చేయించింది.

ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం గారికి 1911 ఏప్రిల్ 3 న అప్పారావు రాసిన ఉత్తరంలో Do not enter government service unless you have a god - father. The process of promotion is painfully slow and subordinater Rev. Service grinds all spirit and romance out of a nature like yours అన్నమాటలకు సూర్యారావు అనువాదం చూస్తే, పై ఊహ నిరాధారం కాదని తెలుస్తుంది:

> గవర్నమెంటు నౌకరీలో ప్రవేశించేవు కనుక: క్రేన్‌లాగ నిన్ను మీదకు ఎత్తే చుట్టాలుంటే తప్ప గవర్నమెంటు నౌకరీకి ఎదుగూ బొదుగూ వుండదు. ప్రమోషను వచ్చేసరికి తలప్రాణం తోకకు వస్తుంది. సబార్డినేటు రెవిన్యూ నౌకరీ నీ నెత్తురు తాగేస్తుంది. నీ మార్దవాన్ని, ఉత్తేజాన్ని, ఆహ్లాదాన్ని జలగలా పట్టి పీల్చేస్తుంది.

సూర్యారావు విడిచివేసిన ముఖ్యమైన విషయాలలో ఒకటి, వీరేశలింగంగారి

కవుల చరిత్ర గురించి అప్పారావు రాసిపెట్టిన విమర్శ అటు చరిత్ర, ఇటు విమర్శ కాకుండా రెంటి కింజెడిన చందమైందని.

The book is neither fish nor flesh nor red herring, as the trite saying goes.

అంటూ ప్రారంభిస్తాడు. కవి జీవితమంటూ ఏదీ లేక, కావ్యాన్ని అంచనా వేసే ప్రయత్నం చెయ్యక ఒకటి రెండు విశేషాణాలతో దాన్ని వర్ణించి తృప్తి పడుతూ అశాస్త్రీయమైన పద్ధతుల ననుసరించి కాలనిర్ణయంచేసిన రచన అని వర్ణిస్తాడు. 1904తర్వాత తానే ఇలాంటి రచన చేద్దామని సంకల్పించుకొని ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారి చేత విషయసామగ్రి సేకరింపించినట్లు మనకు తెలుసు కాబట్టి, తాను ఎలా రచించి ఉండే వాడో వీరేశలింగం రచనను విమర్శించే వైఖరినిబట్టి ఊహించవచ్చు.

It would have been historical material of great value if he had published all the historical portions of Telugu poems, and Oriental scholars would have lain under great obligations to him if he had translated them into English. He could have rendered great service to the Telugu reading public, if he had given a choice selection of extracts from classic writers, with a running analysis of the plots of the poems, to help to a proper appreciation of the extracts.

సూర్యారావు కృషిలో ఇవన్నీ పానకంలో పుడకలు మాత్రమే. ఆయనకు వంకలు పెట్టడం కాదిది. అసహాయంగా చేసినపని ఎవరిదైనా ఇలాగే ఉండక తప్పదు. అప్పారావు బ్రహ్మలిపిని బద్దలుగొట్టడమే ఘనమైన విషయం. పాఠ నిర్ణయం చెయ్యడం అంతకంటె గడ్డుపని. ఈనాడు, నలుగురు చేస్తూన్న దాన్ని తానొక్కడు చేసిపోయాడు. అంతేకాదు తెలుగులోనే రాసి ఉంటే అప్పారావు ఈలాగునే రాసి ఉండేవాడేమోనన్నట్లు విజయనగర మాండలికాలను. పదచ్ఛాయలను అనువాదంలోకి దింపాడు. చెల్లా చెదరుగా పడివుండిన విడికాగితపు తుంటలను కలిపి క్రమాన్నిచ్చి అప్పారావు రచనలను శైథిల్యంనుంచి విస్మృతినుంచి కాపాడాడు. ముందుగా నమస్కారబాణం వేసిగానీ, ఆయన మీదికి పోవడానికి నైతికంగా ఎవ్వరికీ యోగ్యత ఉండదు.

పందొమ్మిదో శతాబ్దాన పుట్టి, ఇరవయ్యో శతాబ్ద ప్రథమ పాదంలో గిట్టిన అప్పారావు ఒక ఫలవృక్షం వంటి మనిషి. జీవితఫల స్వాదుత్వాన్ని అనుభవించి అనుభవింపమన్నాడు. ప్రజాతంత్ర యుగం అన్ని అందాలా పరిపూర్ణమైనపుడు, దానికి వైతాళికుడైన అప్పారావును, వీరేశలింగంలా భయభక్తులతోగాక, ప్రేమాభిమానాలతో గుర్తుంచుకొంటుంది చైతన్యవంత మయ్యే మన మహా ప్రజ.

# సప్తాహ్వాలు

## మబ్బుచాటు కిరణాలు

విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ప్రకటించివున్న గురజాడ రచనల సంపుటాలలో చేరకుండా పాత పత్రికలలోనో వ్యక్తులవద్ద లిఖిత పత్రాలుగానో పడివున్న అప్పారావు లేఖలు; తన సొంత పుస్తకాలలో కొన్నిటిలో ఆయన రాసిపెట్టుకొని ఉండిన 'నోట్సు'; వేదము వేంకటరాయ శాస్త్రులవారి జీవిత చరిత్ర సంగ్రహములో అచ్చుపడికూడా బాగా ప్రచారం పొందివుండని అప్పారావు లేఖలు; భాషా వివాద సందర్భంలో ది హిందూ పత్రికకు అప్పారావు రాసిన లేఖలో కొన్ని భాగాలను తీసివేసిన The Gramya Controversy లోని రెండు భాగాలు – ఇవి ఈ పుస్తకానికి అనుబంధాలౌతున్నాయి. విజయనగరం కాలేజీలో సంస్కృత పండితుడు భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి సంస్కృత భాషలో రాసిన శ్రీరామ విజయ వ్యాయోగానికి అప్పారావు చాలా దీర్ఘమైన ఉపోద్ఘాతం ఇంగ్లీషున రాసి ఉన్నాడు; పెద్ద దౌతుందని దాని నీ గ్రంథంలో చేర్చడంలేదు.

మొదటి అనుబంధంగా వేదం వేంకటరాయ శాస్త్రికి అప్పారావు రాసిన లేఖలను యథామూలంగా ఇస్తున్నాను.

## I. వేదం వేంకటరాయశాస్త్రికి అప్పారావు లేఖలు

Fort Vizianagaram,

31—4--12.

Dear friend,

Many thanks for your kind note of the 19th instant. I am sorry to learn that you resigned the secretaryship of the T. A. I am glad to learn that your health has improved.

I shall feel obliged if you can furnish me a brief note on the admissibility of విసంధి and the laws which do or should govern it.

With kind regards,

I remain,

Yours sincerely,

G. V. APPA RAO

2nd June, 1912.

Dear and respected friend,

I was very much gratified when you told me at the Madras Conference that you went with me a long way though you differed with me on some points. Though there may be difference of opinion on the practical solution of prose diction, it would be impossible for us to differ on questions of authority. We go to the same original sources. That is why I admire you. You generally exhaust any subject which you discuss. But I can not say the same thing of Pandits generally. Judgements are, in their case, a matter purely of sentiment, and they do not take the trouble to examine the genuine Sanskrit tradition. I was amused to read in దేశమాత (.........'s paper) a sentence whose meaning I put into English.

"One or two persons advocated the use of గ్రామ్య in Dramas, but Pandits have condemned the practice." Where are the Pandits, I should like to see them. Of the persons who assembled at Pachayappa's I wonder how many deserve that name.

It appears you spoke at length at the Nidadavolu Conference. I am anxious to learn what you said, at least your Chief arguments and general conclusions. Unfortunately your speeches are not reported in the Madras Papers. Only ఆంధ్రప్రకాశిక gave a report of the meeting at which you spoke of సంధి. The one or two sentences in which your views were given, were written in a Telugu which I did not understand.* I shall feel obliged if you publish your Nidadavolu speech in some Telugu weekly — at least the gist of it. I value your opinions highly. Sir, please take time for my sake and the sake of Telugu and write to me briefly what your views are, how far we concur, and where we differ.

Your very sincerely,

G. V. APPA RAO,

---

* విస్సంధి విశేషము.

P. S.

2nd June, 1912.

Dear and respected friend,

In continuation of my letter of this morning :

Which prose works and poems of the present day do you offer as standards? May we take your కథా సరిత్సాగరము as a standard? and your dramatic verse for poetry, say *Usha*?

How far have you deviated from the rules and precedents of the language of the older poets? What is your test of correctness? Do you think it possible, I mean, is it a practical measure, to secure a fairly common standard of correctness among prose writers? What is your opinion of the solution of Mr. Veeresalingam Pantulu of a prose diction for Telugu? Do his followers follow any intelligble, fairly uniform standard? Granting that to scholars accustomed to literary forms, serious writing in the spoken dialect sounds undignified, does not the popular prose of the present day with Veeresalingam at its head, offend the sense of propriety of both the Pandit and the western scholar?

Yours very sincerely,

G. V. APPARAO.

12th June, 1912.

Dear friend,

Please accept my sincere thanks for your kind note of the 9th inst. I have the first edition of *Kathasaritsagara* at home. Please order your publisher to send me a copy of the new edition when it is out, by V. P. P. I have not yet received the booklet which you promised to send as a specimen.

Your remarks about yourself show your modesty. None of us can altogether shake off the habits and sentiments of a life time, but original thinkers like you who combine real scholarship with literary power are able to chalk out new paths to meet new conditio:.s and to save the literature from stagnation. So I want to study your writings. Your poetry is quite in the grammar and diction of the old poets. In prose you have certainly deviated, but what I fail to understand is how you can make common cause with persons like Mr. Vavilakolanu Subba Rao who takes on the one hand an extreme position in prose and reflects a decadent taste in poetry and with writers of the Viresalingam School on the other from whom there is greater danger to the old literary dialect than from persons who advocate cultivation of of spoken dialects. I think as a leader it is your duty to examine the merits and defects of the school of prose which is in greater vogue than the classical style that you advocate.

I await with interest your pamphlet on Gramya * ... I hope you have recovered from the fatigue of the journey to Nidadavolu.

Yours very sincerely,

G. V. APPA RAO.

---

* గ్రామ్యాదేశ నిరసనము.

P. S.

I just now received your pamphlet. Please accept my best thanks for it. I wanted to read the best presentation of the opposite views. I shall try to meet your objections. We differ little on questions of authority. I am afraid I did not make myself sufficiently intelligible at the conference. You meet contentions in a shape in which I did not raise them.

I admire you for many things especially for the atmosphere of historical romance and literary patriotism with which you have developed the story of Prataparudra. Perhaps those times were as prosaic as ours as all present is for a present generation, but you have succeeded in idealising characters and institutions. Few so-called critics understand the merits of the drama. Telugu critics grovel in the mud of grammatical accuracy and the minutae of articifical art. Admiring you as I do, I should be loth to cross swords with you. But you have left us no alternative. Therefore I crave your permission, as Pandavas craved that of Bhishma. If I succeed in convincing you even to less than least extent, it can only be with your help.

With kind regards,

I remain,

Yours sincerely,

G. V. APPA RAO.

The Highlands
COONOOR,
8th Jan., 1914.

Dear friend,

I am glad you passed one more student. How happy he must feel! We had to send away the B. A. text lists at once. We did not prescribe any prose. Texts for the other examinations will be settled latter on. For intermediate (I) propose your నాగానందము and ఉష. Also *Harischandra Dvipada*. About non-detailed study for intermediate Venkataranga Rao and myself could not agree. Please send me at your earliest convenience a copy of your prose *Dasakumara Charitha* and any other prose work except కథా సరిత్సాగరము.

I have to ask you one question. You used in your plays various class dialects on the ground of ఔచిత్యము. Why did you omit the best of them, i. e. the language of the cultured Brahmins? Is there no use for it anywhere? Does not the same ఔచిత్యము require that the characters of a certain social status should use it?

I hope you are keeping excellent health.

Yours very sincerely,

G. V. APPA RAO.

శృంగార నైషధం is also
prescribed for F. A.

*Confidential.*

The Highlands
COONOOR,
9th May, 1914.

Dear and respected friend,

Since arriving here I have been busy valuing the M. A answer books. I had to value S. S. L. C. Composition papers. So I had to keep the *M.* A. Papers to the last. Mr. Ramayya has notified that he will hold the meeting of examiners in Madras on the 21st inst. But I should be glad to avoid a journey to and fro. Travel in summer between Ooty and Madras is always unpleasant. The cars will be crammed in May and the confusion at Mettapoliam and the heat one must only experience to realise. So, I proposed to Mr. Ramayya to pass the results by circulation, so far at least as I am concerned. He wired back to say that such a course was impossible. You sent in your results, and Mr. Ramayya can send the results to me so that I may help any deserving *lame duck over stile* (to use a metaphor employed by a judge of the High Court when speaking to the late V. Krishnaswami Iyer about the bad results of the apprentices examination.) The marks which I assigned to any deserving candidate cannot be raised without my approval. And then there is the difficulty about the valuation of dissertations. It was a mistake to have divided the valuation of dissertation between three examiners. All the dissertations must be examined by only two examiners, to secure uniformity of valuation - You and I or Mr. Ramayya and either of us. Since that is not to be, I shall tell you my views. Out of the 9 candidates, you may pass 8 - You told me, If I remember rightly, that one or two failed in your subjects. The same was the case in mine. Two or three students have good knowledge of grammar - one of them did splendidly. Two or three students have poor knowledge of grammar - one is very poor. His యు and న augments beat record. Wrong use of these augments is found in other papers, too, but the candidates in the latter case show ability in other directions and even critical acumen. Barring that one student, I think the others may be passed. This is the last year for M. A., and since no college is affiliated for Honours in Telugu, we shall have to wait long for the next batch.

I shall return to Madras when the monsoon sets in. I shall stay for a month and enjoy the pleasure of your company.

Yours Sincerely,

G. V. APPA RAO

*Confidential* *

The Highlands,
COONOOR,
18th May, 1914.

Dear friend,

Many thanks for your kind letter of the 16th inst. I am sure you will excuse me if I have decided not to attend the meeting. No doubt, the fate of poor candidates may depend on a few marks and when they are deserving, all, the examiner may have to help them a bit. Otherwise they may fail. That is the one consideration in favour of my going to Madras to attend the meeting. But you must excuse me when selfishness points the other ways. For the first few days after arrival on the hills one undergoes a process of acclimatisation. If one goes back to Madras after a fortnight's stay, the benefit of that stay is wiped out. I can leave the case of the candidates very safely in your hands. I was long a teacher. I started life as a teacher. I loved my boys. I know you love them too. You have an enthusiastic following. It would be presumptuous on my part to preach consideration to you.

It is, no doubt, very desirable that candidates for M. A. should possess a good knowledge of grammar, at least a good practical knowledge of it. But in the vast majority of cases grammar is learnt by an extensive study of good literature and not by a process of getting up rules. From the infant standard upwards our students read Telugu prose whose chief characteristic is ungrammaticality, if I may use the word. How can we expect a high standard of knowledge of grammar from our students? The real culprits are bad prose writers, whom poor examiners cannot reach and punish. This reminds me of the necessity to

---

* ఇదే తేదీన వేంకటరాయశాస్త్రికి అప్పారావు రాసిన లేఖ గు. ర. వే. పు. 215-219 మధ్య అచ్చుపడి వుంది.

recommend as text books good prose works written correctly by real scholars. It appears that Mr. R. K. Pillai proposes to hold a meeting of the Board of Studies for recommending the text books on the 20th instant. I had no notice and I asked him to postpone the meeting to some day in July. If he accedes to my request I should trouble you to send me a batch of your prose works. I know your dramas and can recommend them. But in respect of prose we must omit portions which are too amorous. (After ?) I hear Mr. Pillai, I (shall write ?) to you. I have your *Harischandra Dvipada* with me and your *Naishadham.* I did not bring your other works and editions.

To return to the M. A. results, I hope you will excuse me if I do not attend the meeting. I am sure yourself and Mr. Ramayya will show the candidates all possible consideration.

I hope you are keeping excellent health.

Yours very sincerely,

G. V. APPA RAO.

<u>*Confidential.*</u>

Admiralty House,
Mylapore,
17th July, 1914.

Dear friend,

I owe you an apology for delay in answering your last letter and for not having seen you yet. Until three days back it was very hot in Madras and a journey to Mallikeswara Street was out of the question. Before I leave Madras, I shall see you and spend an hour or two in your pleasant company. I have recommended a good part of your ఆంధ్ర దశకుమార చరితము for the Intermediate Examination and at the suggestion of Mr. Venkata Ranga Rao హితోపదేశము for Matric.

I wish we had more of your prose books – your కథాసరిత్సాగరము is full of love intrigues. Nor is *Dasakumara* free. Why don't you give your imagination full play as in ప్రతాపరుద్రీయము and write some prose stories? or even adaptations from the Puranas.

I could have prescribed your prose with an easy conscience if you had dropped విసంధి or used it more sparingly and with some method. I like your దశ కుమార style better than your కథాసరిత్సాగర style.

About your projected play on the siege of Bobbili – it is a pity you did not complete it. I hope you have not said anything derogatory to Vizianagaram. I have got much material for a history of the period, and I shall gladly place it at your disposal, if you will complete the play. That material will prove that Viziaram Raj was a patriot. He wanted to drive the French out of the Circars and asked Bobbili to cooperate. Bobbili did not.

I have a personal favour to ask of you. Please attend the meeting of the academy Senate tomorrow evening at 4 P. M. I want to propose a division of work and responsibility.

Yours very sincerely,
G. V. APPA RAO.

Mr. Ramayya – Derivation
Yourself – the vocabulary of the classics
Mr. G. V. Ramamurti-spoken Telugu
Each to have a separate establishment and remuneration.

## II. ది హిందూ పత్రికకు సంపాదకీయ లేఖలు

THE HINDU
1 February, 1911.

### An Undeciphered Inscription

Sir,

In a letter under the above heading published in your issue of the 26th inst, Mr. D. V. Prakasa Row asks for information about a grant of the Eastern Chalukya King Vishnuvardhana V (A. D. 843–844) published by Dr. Burgess and Pandit Natesa Sastri in Vol. IV of the Archaeological survey of India. The inscription was published by Dr. Fleet in Vol. XIII of the "Indian Antiquary". Impressions of the plates will be found facing page 86. The donative part of the inscription is in Telugu of which Dr. Fleet could not obtain a translation for obvious reasons. What Dr. Fleet could make of it, will be found in his paper on Eastern Chalukya Chronology (Indian Antiquary" Vol. XX P. 102). I intend dealing with that inscription in a series of articles in Telugu which I am contributing to the columns of the KRISHNA PATRIKA, Masula. The second article deals with the date of Yuddhamalla inscription at Bezwada, and I think that there can be little room for doubt as to its priority to Ramayya Bhatta. * I do not quite understand what Mr. Prakasa Row means by "a recognised Telugu language prior to Ramayya Bhatta". Does he mean " a Telugu literary dialect"? If so, certainly, there was. The Bezwada inscription of Yuddhamalla furnishes forms which are not to be found in Ramayya Bhatta, and if we go farther back to the Chalukya inscription which is puzzling Mr. Prakasa Row, and similar but shorter records, we shall have to admit that like Canarese, Telugu had older literary dialects. The true significance of this fact does not lie in its bearing on academic discussions on the position of the first poet whose work is extant but in the light which it throws on the history of South Indian Literary dialect and on the question of the formation of a popular Literary dialectical Telugu.

Fort, Vizianagaram,
January, 28.

G. V. APPA ROW.

* ఈ లేఖలో 'రామయ్యభట్ట' అనేది అచ్చుతప్పు. నన్నయభట్టు అని ఉండాలి. ఈ తప్పును చూపిస్తూ, లేఖలో పేర్కొన్న శాసనంగురించి వివరిస్తూ మళ్ళీ 'ది హిందూ' పత్రికకు అప్పారావు వ్రాసిన లేఖ గు.ర.లే. 193-199 పుటల్లో అచ్చుపడిఉంది. రచనాకాలం ఫిబ్రవరి 6. 1911.

[The Gramya Controversy అనే పుస్తకంలో 1912 డిసెంబరులో ది హిందూ పత్రికా సంపాదకునికి అప్పారావు రాసిన లేఖలోని రెండు విడిభాగాలను చేర్చి వున్నారు.]

... The general complaint is that spoken Telugu is not grammatical. To prove this writers misquote and misapply standard authors. If spoken Telugu is not grammatical it is the fault of the grammarians: rules of grammar have no value except as statements of fact: respectable expressions can never be ungrammatical if in general use. ...

... The old literary dialect in Telugu corresponds more or less to Chaucer's English and it would be as absurd to write in this dialect in the 20th century as it would be if an English writer of the present Century were to adopt the language of chaucer. In fact, the spoken and written dialects in Telugu are two different languages practically. Owing to this Telugu literature is stunted and few educated Indians care to write books in Telugu. The contest in Telugu is between a dead dialect and a living dialect and if the educated classes of the Telugu people would be impartial and rational they should prefer the latter. ...

## III. బెర్నార్డ్ షా రాసిన Dramatic Opinions & Critical Essays పుస్తకంలో మొదటి పుటపై అప్పారావు రాసిన నోట్సు.

How to manage the introduction of the story and the characters in the opening of a play without giving explanations? In the case of popular stories, a Dramatic author has an advantage and this probably accounts for the superior technique of Shakespeare.

The devices which may help a dramatist are, the construction of the past by relevant statements which characters speak with sincerity, because they believe in these statements or because the statements affect them. Statements should describe the past in brief but clear allusions. Incidents of the past should be such as effect (ing) the present and future. The drama should open with sincerity, conviction and action. The essential characters should be brought out by bold touches. The significance of incidents in the plot scheme should be apparent. Contrasts help to (bring out) boldness of outline. The motives should be felt in every word and act.

---

## ఇతర పుస్తకాలలో అప్పారావు రాసిన నోట్సు

One school of dramatists in Telugu develop (the) moral artificially ; no note of sincerity.

* * *

Much of modern Telugu drama is independent of the stage. That is, it is not meant for acting. This is an advantage on the side of literature but no such advantage is (traceable ?) ..,,
(Incomplete)

# గురజాడ వాఙ్మయ దర్శిని*

## I A జీవితకాలంలో అచ్చుపడిన పుస్తకాలు

కన్యాశుల్కం (తొలికూర్పు): 1897. ముద్రాపకుడు: కొటికిపూడి భద్రయ్య. విజయరామ ముద్రాక్షరశాల, విజయనగరం.

నీలగిరి పాటలు: 1909.

కన్యాశుల్కం (రెండవకూర్పు): 1909. ముద్రాపకుడు: జి. రామస్వామిచెట్టి** మద్రాసు.

*The Prabandham Pedigrees* *** 1910 తర్వాత 1912 లోపల.

*The Annals of Handeh* : Anantapuram **** 1913 - 14. ప్రచురణకర్త: The Telugu Literary Society, Vizianagaram. పునర్ముద్రణ: వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు. 1920.

*The Minute of Dissent to the Telugu Composition Sub-Committee Report 1914.* ప్రచురణకర్త: వావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్సు, మద్రాసు.

---

* దీని తయారింపులో సూచనలిచ్చిన డా. పర్వతనేని గంగాధరరావు గారికి కృతజ్ఞుణ్ణి.

** 1917 లో రాజమండ్రి వాస్తవ్యుడైన గున్నేశ్వరరావుకు ఇచ్చిన కాపీ రైటు ఆయన సోదరుడు బంగారురాజు ద్వారా కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్సుకు దఖలు పడ్డాయి. కాపీ రైట్ యాక్ట్ ననుసరించి ఇప్పుడెవరైనా వేసుకోవచ్చు.

*** పెద్ద దావాలో ఇది Court Exhibit అయింది.

**** బ్రౌన్ పరిష్కరించిన THE WARS OF THE RAJAHS ను అప్పారావు ఎడిట్ చేశాడు.

## I. B. జీవిత కాలాన అచ్చుపడిన వివిధ రచనలు

సారంగధర (ఆంగ్ల పద్యకావ్యం): 1883 The Indian Leisure - Hour అనే విజయనగర పత్రికలో అచ్చయిన దాన్ని కలకత్తా పత్రిక REIS AND Rayyet పునర్ముద్రించుకొంది. 1963 లో Unilit దాన్ని పునరుద్ధరించింది.

హరిశ్చంద్ర నాటక పీఠిక (ఆంగ్లం): 1897. జి సి వి. శ్రీనివాసాచార్యుల ఆంగ్ల నాటకానికి ఉపోద్ఘాతం.

శ్రీరామ విజయ వ్యాయోగ పీఠిక (ఆంగ్లం): 1901. భాగవతుల లక్ష్మీ నారాయణశాస్త్రి సంస్కృత నాటకానికి ఉపోద్ఘాతం.

కవిత్వము - వర్ణువర్తు (వ్యాసం): 1909 *

మద్రాసు కాంగ్రెసు మహాసభ (ఆంగ్లవ్యాసం): 1909—10 MAIL ?

దిద్దుబాటు (కథ): 1910 ఫిబ్రవరి, ఆంధ్రభారతి, బందరు.

పూటకూళ్ళ మేమిచెప్పును(పాట): 1910 మార్చి. ,, ,,

మీ పేరేమిటి? (కథ): 1910 ఏప్రిల్, మే, జూన్. ,, ,,

బిల్హణీయం(నాటకం): ప్రథమాంకం. 1910 ఏప్రిల్, ఆంధ్రపత్రిక (బొంబాయి)

తోకచుక్క** (గేయం): 1910 జూలై, ఆంధ్రభారతి.

కాసులు (గేయం): 1910 ఆగస్టు ,,

డామన్ - పితియస్ (గేయం): 1910 సెప్టెంబరు ,,

గ్రామ్యశబ్ద విచారణము (వ్యాసం): రచనాకాలం 1910 నవంబరు 24.

వాడుకభాషలు – గ్రామ్యము (వ్యాసం): 1910—1911

ఆకాశరామన్న ఉత్తరాలు (వ్యాసం): 1910 డిసెంబరు 21

---

* ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, కేసరి, శశిలేఖ, ఆంధ్ర ప్రకాశిక పత్రికలలో తన వ్యాసాలు అచ్చుపడుతూ వచ్చినట్లు 1911 నవంబరు 22 న ఒక లేఖలో అప్పారావు రాశాడు. ఆ పత్రికలలో ఎక్కువ భాగం లభించడం లేదు.

** 'తోకచుక్క' పేరుగల గేయమే ఇప్పుడు "ముత్యాలసరాలు"గా ప్రసిద్ధికెక్కి ఉన్నది.

ముత్యాల సరాల లక్షణం (వ్యాసం) : 1910–1911

లవణరాజు కల (గేయం) : 1911 జనవరి, ఆంధ్రభారతి.

బిల్హణీయం (నాటకం) : ద్వితీయాంకం 1911 ఏప్రిల్, ఆంధ్రపత్రిక.

ఉమాపతి అప్పన (పాట) : 1911 ఆగస్టు, ఆంధ్రభారతి.

కన్యక (గేయం) : 1911 అక్టోబరు ఆంధ్రభారతి.

కన్యక (గేయం) : 1912 నవంబరు, శశిరేఖ

కావ్యాలలో శృంగారం (వ్యాసం) : రచనాకాలం 1912.

వంగీయ సాహిత్య పరిషత్తు (వ్యాసం) : 23-1-1912 తర్వాత.

రవీంద్రకవి* (వ్యాసం) : 1912 డిసెంబరు తర్వాత.

విశ్వవిద్యాలయాలు-సంస్కృత, మాతృభాషలు (విశ్వవిద్యాలయ నివేదిక) : రచనాకాలం 1913.

ఆధునిక ఆంధ్ర వచన రచన (విశ్వవిద్యాలయ నివేదిక) : రచనా కాలం: 1913

దించు లంగరు (గేయం) : 1915 అక్టోబరు 30. కృష్ణాపత్రిక.

---

* రామానుజాచార్య విద్యా సమితి (విజయనగరం) ప్రచురణలో ఈ వ్యాసం "యిద్దరు రాజులు" అనే శీర్షికతో ఉంది.

## II మరణానంతరం అచ్చుపడిన రచనలు

### A గురజాడ వెంకటరామదాసు వెలువరించినవి - 1929

ముత్యాలసరములు : చిన్న కథలు *

సుభద్ర (పద్యకావ్యం) : కొన్ని వ్యాసాలు

### B. మహారాజాస్ కాలేజి (విజయనగరం) వజ్రోత్సవ సందర్భాన వెలువడినవి * *

### 1936

గురజాడ అప్పారావుగారి డైరీలు

మాటా - మంతి

### C. రామానుజాచార్య విద్యా సమితి (విజయనగరం) ప్రచురణలు * * *

### 1939

ముత్యాల సరాలు

సుభద్ర - మాటా - మంతి

కొండుభట్టీయము ****

---

* ఇటీవలి కూర్పులలో కనిపించని రెండు గేయాలు ఇందులో ఉన్నాయి : (1) 'ముత్యాల సరము' (2) కోరుకొండ.

** వీటిని నే నింతవరకు చూడలేదుగాని డా. బుర్రా శేషగిరిరావు ఉపోద్ఘాతంనుంచి విడిభాగాలు చదివి ఉన్నాను.

*** కిళాంబి రంగాచార్యులు రాసిన ఉపోద్ఘాతంలోని భాగాలు విడిగా మాత్రమే చూచి ఉన్నాను.

**** 1934 లో ఈ నాటకాన్ని ముద్దుకృష్ణ సంపాదకత్వాన వెలువడే 'జ్వాల' (బెజవాడ)కు రామదాసుగారు పంపి అచ్చువేయించారు. దీనికి శివశంకర శాస్త్రి పరిచయ వాక్యాలు రాశారు.

## D. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు (మద్రాసు) ప్రచురణలు

### 1950

గురజాడ అప్పారావుగారి గేయములు *
గురజాడ అప్పారావుగారి చిన్న కథలు

## E ప్రజాశక్తి ప్రచురణాలయం (బెజవాడ) ప్రచురణలు **

### 1947

ముత్యాలసరాలు, **కొన్ని కథలు ;** (వాసిరెడ్డి భాస్కరరావు పరిచయం)

## F. విశాలాంధ్ర ప్రచురణాలయం (విజయవాడ) ప్రచురణలు ***

ముత్యాల సరాలు ప్రథమ ముద్రణ : 1953 (వాసిరెడ్డి భాస్కరరావు పరిచయం)
ద్వితీయ ముద్రణ : 1955
తృతీయ ముద్రణ : 1958 (దానికితోడు శ్రీశ్రీ పరిచయం)
చతుర్థ ముద్రణ : 1961.
పంచమముద్రణ : 1965

వ్యాసచంద్రిక ప్రథమముద్రణ : 1953
ద్వితీయ ముద్రణ : 1955
తృతీయ ముద్రణ : 1962

---

* జి. సి. వి. శ్రీనివాసాచార్యులు రాసిన మూడు పాటలను నిడుదవోలు వేంకటరావు గారు ఈ సంపుటిలో చేర్చి, పాద దీపికైనా ఇవ్వలేదు. కాబట్టి ఇవి అప్పారావు రచనలకిందే చలామణి అయ్యాయి :

** శ్రీ సెట్టి ఈశ్వరరావు చొరవవల్ల కృషివల్ల 1946 జూన్ 22న ప్రజాశక్తి ప్రచురణాలయం వారికి గురజాడ రామదాసు పంతులు రాసిచ్చిన ఖరార్నామా ఫలితంగా 'కన్యాశుల్కం' మినహా తతిమ్మా గురజాడ రచనలన్నీ అచ్చువేసి అనుభవించే హక్కు ప్రజాశక్తి ప్రచురణాలయానికీ, దానినుంచి విశాలాంధ్ర ప్రచురణాలయంవారికీ చెందిపోయింది.

*** వీటన్నిటికీ కీ॥శే॥ అవసరాల సూర్యారావు అసమాన కృషి మూలాధారంగా ఉంది. గొప్ప ప్రయత్నమేగాని చాలా తప్పులు కూడ దూరి కూర్చుని ఉన్నాయి.

అన్ని ముత్యాలు (కథలు) అవసరాల సూర్యారావు 'పీఠిక'
ప్రథమ ముద్రణ : 1953
ద్వితీయ ముద్రణ : 1955
తృతీయ ముద్రణ : 1959
చతుర్థ ముద్రణ : 1963

కొండుభట్టీయం - బిల్హణీయం, 1951. అవసరాల సూర్యారావు 'అవతారిక'.
ద్వితీయ ముద్రణ 1957.
తృతీయ ముద్రణ 1966.

మహాకవి డైరీలు ప్రథమ ముద్రణ 1954. అవసరాల 'ముందుమాట'
ద్వితీయ ముద్రణ 1961. ,,

మాటామంతీ, అవీ-ఇవీ 1958. ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం 'పీఠిక'

లేఖలు 1958.

డిసెంటు పత్రం 1968 పోరంకి దక్షిణామూర్తి అనువాదం.

## III జీవితచరిత్రలు - విమర్శలు

మహాకవి - మహాపురుషుడు గురజాడ అప్పారావు.
సెట్టి ఈశ్వరరావు, 1945.
ముద్దుకృష్ణ 'పరిచయం'
సంపాదకులు : ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం.
ముద్రాపకులు : ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ.

మన గురజాడ *
అవసరాల సూర్యారావు, 1954.
సాహిణీ పబ్లికేషన్సు, విజయవాడ.

గురజాడ ( వ్యాససంకలనం ) :
శ్రీశ్రీ, 1959.
మనసాహితి, హైదరాబాదు.
విశాలాంధ్ర ప్రచురణాలయం 1967.

---

* ఇది పిల్లలకోసం చేసిన రచన. జనసాహిణి 1 గా వెలువడింది.

ముత్యాలసరాలు - మహాకవి గురజాడ

చిట్టిమల్లె శంకరయ్య (రుద్రశ్రీ) 1962.
సాహిత్య సంసత్ జనగామ.

గురజాడ వెలుగుజాడ

కె. వి. రమణారెడ్డి 1963
విశాలాంధ్ర ప్రచురణాలయం.

మహాకవి గురజాడ *

దేవులపల్లి ప్రభాకరరావు, 1968.

Life and Greatness of Gurajada
Peri Suryanarayana, B. A. L. T. 1968
Vijnana Sahiti Publications,
Vijayawada.

A critical estimate of Sri Gurajada Venkata Appa Rao's works
Peri Suryanarayana, B A. L. T. 1968
Vijnana Sahiti Publications,
Vijayawada.

## IV అ ను వా దా లు

### A. గ్ర ం థా లు

కన్యాశుల్కం ** (కన్నడ అనువాదం) 1927
కె. కృష్ణయ్యంగారు
సి. ఆర్. రెడ్డి, ఆంగ్ల పీఠిక.

---

* కొత్తగా అక్షరాస్యులైనవారికోసం చేసిన ఈ లఘురచన అముద్రితం. యునెస్కో వారి బహుమతి పొందింది.

** ఈ అనువాదంలో బుచ్చమ్మ సీతమ్మగానూ, వెంకటేశం వెంకటేశయ్యగానూ, రామప్పంతులు రామయ్యగానూ, సౌజన్యరావు సదాశివలాయపుగానూ, మార్పుచెందారు. ప్రథమాంకంలోని ప్రథమస్థలం విజయనగరం బొంకుల దిబ్బకాదు, విశాఖపట్నంలోని రాజవీధి.

కన్యాశుల్కం (రష్యన్ అనువాదం) * : Z- N. Petrunicheva. 1962
Eastern Literature Publishing House, Moscow.

కన్యాశుల్కం (ఇంగ్లీషు అనువాదం) : S. N. Jayanty, 1964
Gurazada Memorial Research Centre, HYDERABAD.

కన్యాశుల్కం (తమిళ అనువాదం) : ముదునూరు జగన్నాథరాజు 1964
పారి నిలయం, మద్రాసు.

## B. విడి రచనలు **

| | | |
|---|---|---|
| *Strings of Pearls or Halley's Comet* | : | R. Appalaswamy |
| *Purnamma* | : | ,, |
| *Desabhakti* | : | Sri Sri |
| ,, | : | Srinivas Rayaprol |
| ,, | : | Muralidhar |
| *I rose and fell* | : | Sri Sri |
| *Bon Jour Bon Voyage* | : | ,, |

అచ్చుపడని విడిరచనల అనువాదాలు కొన్ని ఉన్నాయి.

## V గురజాడ స్మారకపత్రికా సంచికలు

| | |
|---|---|
| తెలుగుతల్లి | 1944 డిసెంబరు |
| ,, | 1945 నవంబరు |
| అభ్యుదయ | ? |
| పరిశోధన | 1956 డిసెంబరు – జనవరి. |

* దీని లోపలి పుటలో GURAJADA APPARAO–SELECTED WORKS అని ఉంది. నాటకానువాదం తర్వాత, దేశభక్తి. ముత్యాల సరాలు గేయాలూ, సంస్కర్త హృదయం కథ అనూదితాలయ్యాయి.

** ఈ విడి రచనలన్నీ UNILIT : HOMAGE TO GURAZADA లో అచ్చుపడి ఉన్నాయి.

Indian Express 1962 సెప్టెంబరు 21.

కృష్ణా పత్రిక 1962 సెప్టెంబరు 22.

గురజాడ శత వార్షిక జయంతి సంచిక, (ఇంగ్లీషు, తెలుగు, హైదరాబాదు) 1962

పుస్తక ప్రపంచం 1962 జనవరి.

గురజాడ శత వార్షిక జయంతి విశాఖ సంచిక 1963

మహాకవి గురజాడ శత జయంతి ఉత్సవసంచిక (ఖమ్మం) 1963

*Unilit :* Homage to Gurazada 1963.

Mahakavi Gurazada Centenary Souvenir, Delhi. 1963.

## VI. గురజాడ సాహిత్య విమర్శ వాఙ్మయము

### A. సాధారణాంశాలపై

శ్రీ గురజాడ అప్పారాయకవి * (ఉ) చింతా దీక్షితులు
భారతి 1932 డిసెంబరు

గురజాడ అప్పారావు పంతులు : 'శాస్త్రి' **
భారతి (మీగడ తరకలు) 1933 జనవరి.

*Late Apparao Pantulu :* Reminiscences of a great Telugu Writer
O. M. Subrahmanyam.
సుబోధిని 1936 ఫిబ్రవరి 29.

గురజాడ అప్పారావు (ఉ) ఘంటిడిపాటి కామేశ్వరరావు ***
ప్రతిభ, నవమ వార్షికోత్సవ సంపుటం 1944 ?

---

* ఆంధ్రదేశంలో ఓం ప్రథమంగా గురజాడ స్మారక సభ రాజమండ్రిలో జరిపి, చేసిన ఉపన్యాసం.

** 'శాస్త్రి' బహుశా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

*** నవ్యసాహిత్య పరిషత్సమావేశం (ఏలూరు)లో చేసిన ఉపన్యాసం.

మార్గదర్శి గురజాడ అప్పారావుగారు : శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
నవోదయం 1946 డిసెంబరు

వెగుచుక్క : శ్రీనివాస చక్రవర్తి, తెలుగుదేశం 1948 డిసెంబరు 2

సాహిత్యప్రవక్త గురజాడ : అబ్బూరి వరదేశ్వరరావు
నాట్యకళ 1957 డిసెంబరు

ఆంధ్ర ప్రదర్శనకాసంలో గురజాడ : ఆర్వియార్
విశాలాంధ్ర 1962 జనవరి 14

గురజాడ-సంస్కృతియు : ఆర్. యస్. సుదర్శనం
భారతి, 1962 అక్టోబరు

అంతర్యం గలవ్యక్తి శ్రీ గురజాడ : డా॥ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి
(సమీక్షణ) 1963 జనవరి

గురజాడకు మార్గదర్శి వేమన : నూతలపాటి గంగాధరం
భారతి, 1965 జనవరి

*Gurazada* (*Traditional Indian culture and other Essays*)
V. R. Narla, 1969.

## B. గేయాల పై

*New currents in Telugu song :* P. Seshadri.
EDUCATIONAL REVIEW, MADRAS 1913 july.

గురజాడ వాల్మీకి (వ్యాసావళి) : ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 1933

గురజాడ అప్పారావుగారు : డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి
కిన్నెర, 1949 జూలై.

లవణరాజు కథ (కల) విమర్శ : వసంతరావు బ్రహ్మాజీరావు
ఆంధ్రపత్రిక, 1955 మార్చి .... ?

ఆంధ్రసాహితీ రంగ పై గురజాడ అవతరించకపోతే .... ?
ఆంధ్రప్రభ, 1962 సెప్టెంబరు 21.

వ్యావహారిక సత్యమే జీవిత సత్యమని ప్రతిపాదించిన 'లవణరాజు కల' : సి. నారాయణ రెడ్డి. విశాలాంధ్ర 1962 సెప్టెంబరు 23

గురజాడ - రాయప్రోలు : డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి
భారతి, 1962 నవంబరు.

అడుగుజాడ గురజాడదా ? : డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి
భారతి, (గ్రంథ సమీక్ష) 1962 డిసెంబరు

ఆధునికాంధ్ర కవిత్వము * : డా. సి. నారాయణరెడ్డి 1967,

'పూర్ణమ్మకథ' లో గురజాడవారి కవితా శిల్ప వైభవం : పి. వి. రామశర్మ 1968 డిసెంబరు

'పూర్ణమ్మకథ' లోని విషాదాంశపరిపుష్టి : అద్దేపల్లి రామమోహనరావు
ఆంధ్రప్రభ .... ఆగస్టు 11

## C కన్యాశుల్కంపై

కన్యాశుల్కం (తొలికూర్పు) నాటక ప్రదర్శన సమీక్ష :
The Telugu Harp
1892 ఆగస్టు 26.

కన్యాశుల్కం (తొలికూర్పు) నాటక సమీక్ష :
The People's Friend
1897 జనవరి 21

,, ,, ప్రదర్శన సమీక్ష :
The weekly Review
1897 మార్చి 17

* ఈ పరిశోధన గ్రంథములో కొన్ని పెద్ద అధ్యాయాలు గురజాడ సాహిత్య చర్చ సంబంధించినవి.

కన్యాశుల్కస్థ గ్రామ్యభాషా విచారము* : కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి
ఆర్యమతబోధిని 1910

కన్యాశుల్కము (నాటక ప్రదర్శన సమీక్ష) శారద, 1924 జూన్

కన్యాశుల్క నాటక విమర్శనము : శ్రీపాద కామేశ్వరరావు
భారతి, 1933 ఆగస్టు

అప్పారాయకవి నాటకాలు : తల్లావఝుల శివశంకరశాస్త్రి
జ్వాల, 1934 సెప్టెంబరు 16

'కన్యాశుల్కము'లో స్త్రీ వ్యక్తులు : శ్రీ శ్రీనివాసరావు (శ్రీ శ్రీ)
సమదర్శిని 1939 సంవత్సరాదిసంచిక

*KANYASULKAM:* A critical Analysis : S. M. Y. Sastry
TRIVENI 1939. అక్టోబరు

కన్యాశుల్కం సమీక్షలు : సోమయాజుల వెంకటరామమూర్తి
భారతి 1940 జూన్, ఆగస్టు, సెప్టెంబరు

కన్యాశుల్కములో రసమేది ? అ. న. శర్మ
తెలుగుతల్లి, 1945 ఏప్రిల్

బైరాగి : శ్రీ శ్రీ
నవోదయ, 1948 మే 23

మధురవాణి : డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి
భారతి, 1950 జూన్

కన్యాశుల్కము ; కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి
భారతి, 1955 జూన్.

కన్యాశుల్కం (సౌందర్యసమీక్ష) : వేమూరి వేంకటరామనాథం 1955

*Social Purpose in Telugu Literature:* Burra V. Subrahmanyam
(TRIVENI) 1958 అక్టోబరు

* ఈ వ్యాసం ఒక చిన్న పుస్తక రూపంలో ఆ తర్వాత అచ్చు పడింది.

గిరీశం పాత్ర చిత్రణం : యస్. టి. నరసింహాచారి
భారతి, 1968 డిసెంబరు

గురజాడ అప్పారావు - కన్యాశుల్కము : నిడదవోలు వెంకటరావు
తెలుగు మహాజన సమాజం 6 వ వార్షిక సంచిక, 1961 మార్చి

గురజాడవారి మధురవాణి : తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి
రచన- 1963 మార్చి 21

గురజాడవారి గిరీశం : బూర్గుల రంగనాథరావు
ఆనందవాణి.... ?

కన్యాశుల్కము : ఒక పరిశీలన : పి. హనుమయ్య
సంస్కృతి 1964 మార్చి

గురజాడవారి గిరీశం : పోలంరాజు రాధాకృష్ణమూర్తి
స్రవంతి, 1965 ఫిబ్రవరి

కన్యాశుల్కము (తెలుగు నాటక వికాసము) : పి. యస్. ఆర్. అప్పారావు,
1967 డిసెంబరు

గురజాడ (సాహిత్యంలో దృక్పథాలు) : ఆర్. యస్. సుదర్శనం 1968

గురజాడ అప్పారావు (తెలుగు నాటక కవులు) : శ్రీనివాస చక్రవర్తి 1968

కన్యాశుల్కంలో కాలిక, స్థానిక విశేషాలు : కె. వి. రమణారెడ్డి
భారతి, 1968 డిసెంబరు

మొట్టమొదటి కన్యాశుల్కము : సంపాదకులు : బంగోరె
1969 మార్చి

కన్యాశుల్కం (తొలికూర్పు) : ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో
(21-3-1969 నుంచి వరుసగా వస్తూంది)

గిరీశం ది పాయట్ * : కె. వి. రమణారెడ్డి
ప్రగతి, 19-3 1969

* ఈ వ్యాసం వెలువడిన తర్వాత: 'ప్రగతి' సచిత్రవారపత్రిక సంపాదకులు గిరీశం పాత్రగురించి చర్చావేదిక నిర్వహిస్తున్నారు. ఇప్పటికి పాల్గొన్నవారు కొడవటిగంటి కుటుంబరావు, పార్కర్, చక్రి, బొల్లిముంత నాగేశ్వరరావు, జి. సి. జీవి; ఆరుద్రగారలు.

# VII గురజాడ సాహిత్యం - వివాద వాఙ్మయం

## A. వ్యాసచంద్రిక పై

గురజాడవారి రచనలు : వీరేశలింగంగారిపై దాడి
పారనంది జగన్నాథస్వామి
భారతి, 1954 సెప్టెంబరు

గురజాడవారి రచనలు : పారనంది వారి విమర్శ
అవసరాల సూర్యారావు
భారతి, 1954 అక్టోబరు

గురజాడవారి వ్యాసచంద్రిక : పారనంది జగన్నాథస్వామి
కిన్నెర 1954 ఆగస్టు

గురజాడవారి వ్యాసచంద్రిక : విమర్శకులకు సమాధానం
అవసరాల సూర్యారావు
కిన్నెర. 1954 అక్టోబరు

## B. కన్యాశుల్క నాటక కర్తృత్వంపై

| | | | |
|---|---|---|---|
| కన్యాశుల్కం రచన ఎవరిది? | జయంతి కుమారస్వామి, ఆంధ్ర పత్రిక | | 13-3-1955 |
| ,, | ఎ. వి. జగన్నాథరావు | ,, | 20-3-1955 |
| ,, | ఆరుద్ర | ,, | 25-3-1965 |
| ,, | కొత్తపల్లి వీరభద్రరావు | ,, | ,, |
| ,, | నిడుదవోలు వేంకటరావు | ,, | ,, |
| ,, | వసంతరావు బ్రహ్మాజీరావు | ,, | 27-3-1955 |
| ,, | గిడుగు వేంకట సీతాపతి | ,, | ,, |
| ,, | 'భాగవతుల' | ,, | 30-3-1955 |

కన్యాశుల్క కర్తృత్వం<br>అపోహలకు సమాధానం } అవసరాల సూర్యారావు ,, 5-4-1955

,, ,, ,, 6-4-1955

,, ,, ,, 7-4-1955

ఎవరు ఈ గోమఠం శ్రీనివాసాచార్యులుగారు - ఆరుద్ర ,, 9-4-1955

'కన్యాశుల్కము' రచయిత నిస్సందేహంగా :<br>అప్పారావుగారె గురజాడ రామదాసు ,, 10-4-1955

భావం అప్పారావుగారిది<br>భాష గోమఠంగారిది } ? ,, 10-4-1955

కన్యాశుల్కము రచన ఎవరిది ? :<br>ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం ,, 12-4-1955

,, ఎం. వి. జగన్నాథరావు ,, ,,

ప్రాణమిత్రునికి ప్రముఖ గ్రంథ<br>ప్రకాశకులు చేసిన అపచారం } : ఆరుద్ర ,, 14-4-1955

మహాకవికి ప్రాణమిత్రుని మహాపచారం : ఆరుద్ర ,, 16-4-1955

'కమలాపహరణం పెంకిపంతుల<br>ఫార్సు వ్రాసిందీ అప్పారావుగారే } : వి. లింగమూర్తి ,, 16-4-1955

శ్రీ వావిళ్ళవారికి అభివందనములు : గురజాడ రామదాసు ,, 19-4 1955

'కన్యాశుల్కం' రచన : వంగోలు మునిసుబ్రహ్మణ్యం ,, 19-4-1955

'కన్యాశుల్కం' రచన ఎవరిది ? బిరుదు శ్రీరామమూర్తి ,, 19-4-1955

'కన్యాశుల్కం' రచన ; తెలుగు మహా<br>జన సభ ఆధ్వర్యాన బహిరంగ సభ } గి. వె. రామమూర్తి (సంపాదక లేఖ) ,, 21-4-1955

'కన్యాశుల్కము ఎవరిది ?' సంకర్షణరావు ,, 22-4-1955

'కన్యాశుల్కము రచన ఎవరిది ? రాపర్తి నూకరాజు ,, 23-4-1955

చిన్నమాట : 'ఉపాధ్యాయుల' ,, 23-4-1955

బహిరంగ సభలు అనవసరం :
గణపవరపు కనకలింగేశ్వరరావు ,, 23-4-1955

వేంకటేశ్వర శాస్త్రులుగారి ఒప్పుకోలు : సాహిత్య విలేఖరి ,, 24-4-1955

కన్యాశుల్కము: యమిజాల పద్మనాభస్వామి ,, ,,

బహిరంగసభ అత్యవసరం : గి. వె. రామమూర్తి ,, ,,

కన్యాశుల్కము ఆద్యంతము
ఆంధ్ర సారస్వత సామ్రాట్
అప్పారావుగారిపై : భమిడిపాటి కామేశ్వరరావు ,, ,,

కన్యాశుల్కము కర్తృత్వంపైగాని తగాదా :
సాహిత్య విలేఖరి ,, 1-5-1955

## C. 'కవి - అకవి' వివాదం

గురజాడ అప్పారావుగారు : పొట్లపల్లి సీతారామరావు
జయంతి 1959 జనవరి

గురజాడ 'కవి' కాదా ? కె. వి. రమణారెడ్డి
అభ్యుదయ 1959 జనవరి

లవణరాజు కల; శాంతశృంగారరసాలు : అభ్యుదయ 1959 మార్చి

గురజాడ 'అకవి' ? హనుమ
జయంతి 1959 మార్చి
,, 1959 ఏప్రిల్

గురజాడ - వేమన : శ్రీ శ్రీ : కె. వి. రమణారెడ్డి
జయంతి 1959 మే

గురజాడ కవి ? : జువ్వాడి రామేశ్వరరావు
జయంతి 1959 మే

గురజాడ అకవి : కావూరి పూర్ణచంద్రరావు
జయంతి 1959 జూన్

గురజాడ రసచర్చ ; కోటగిరి విశ్వనాథరావు
జయంతి 1959 జూలై

గురజాడవారి అవతారికల రసచర్చ : కో. వా
విశాలాంధ్ర 1959 నవంబరు29

## VIII భాషావివాదకాలం (1910-1914) లో

గ్రీకుపురాణ కథలు : సెట్టి లక్ష్మీనరసింహం 1910

లాంగ్మన్సు అరిథ్మెటిక్ : పి. టి. శ్రీనివాసయ్యంగారు 1910

*The Modern Telugu prose* : A Review, V. Subbarao 1911

*Life or Death* : A Plea for Vernaculars
P. T. Srinivasa Aiyangar 1912?

*Memorandum on Modern Telugu* ,, ,, 1912

గ్రామ్యాదేశ నిరసనము : వేదం వేంకటరాయశాస్త్రి 1912

*A memorandum on Modern Telugu* : G. V. Ramamurti 1913

గ్రామ్యవాద విమర్శనము : పానుగంటి లక్ష్మీనరసింహారావు 1913

*The Gramya Controversy* : Ed. P. Surisastry 1913

*A Defence of Literary Telugu* : J. Ramayya pantulu 1913

నిజమయిన సంప్రదాయము : గిడుగు వేంకటరామమూర్తి 1914

*Modern Telugu* : ఆంధ్రభాషా సంరక్షక సమాజము 1914

క్రొత్తతెలుగు - మంచి తెలుగు
పులులదండులు-పూలదండలు } ,, 1914

*Minute of Dissent to the Report of the Telugu composition sub - committee* : } G. V. Appa rao 1914

*University of Madras* : Report of the Intermediate Telugu composition committee together with a Minute of Dissent there to signed by four members and remarks thereon by Mr. G. V. Appa Row. 1914

# గురజాడకు సెట్టి లక్ష్మీనరసింహంగారి కృతి అంకితం

---

అంకిత మిచ్చెద

అధిక మద్గౌరవమునకు సూచకముగా

బుద్ధిని సురగురు జాడ నొప్పు

శ్రీ

గురజాడ వెంకటప్పారావు పంతులుగారికి

మృదు గీర్వాణభాషలో పూర్వ మపూర్వవైఖరి దోఁప

శూద్రక కవి వరుండు

నవరసభరితమున్ వ్యవహారధర్మ బోధకమును నైన కథంగయికొని

కల్పితంబు చేసిన

మృచ్ఛకటిక నాటకము

ననుసరించి నా నేర్చుకరణి తెలుఁగుబాసలో క్రొత్తగా

నేను వ్రాసినట్టి

నవలయైన

వసంతసేన

యను కృతిని.

సెట్టి లక్ష్మీనరసింహం.

గురజాడ అప్పారావుగారి కథలు

# 'చదువుకున్న వాడికంటె .... మేలు'

### శ్రీరంగం నారాయణబాబు

సంపాదక మహాశయా, మీకు నేనిప్పుడు ఒక కథ చెప్తున్నాను. కథంటే నిజం కాబట్టి నిజాన్నే చెపుతున్నాను. ఏది కథా ఏది కథకాదు అని తేల్చుకోవడం సాహిత్యంలో బహుకష్టమైన పని, చాలా సంకుచితం కూడాను అలాగాలోచించడం, ఈ వ్యాసంవల్ల పరిశ్రమించదు సాహిత్యం సంఘం ఎలాగున్నాయో, నేను సాహిత్యంలో సంఘంలో కూడా ఎటువంటి చైతన్యం వచ్చిందో, ఇది ఎంత మోసాపహమైనదో చదుకే వ్యక్తం అవుతుంది. ఒకప్పుడు ఒక పత్రికారాజము దీనిని ప్రకటించనుంది. ఒక పత్రిక ప్రకటించని వ్యాసాన్ని మరొక పత్రిక కియ్యడం దోషం అని నాకు తెలుసు. దీంట్లో ఒక మహాపురుషుని జీవితంలో వుండే ఔన్నత్యమైన సాహిత్యజీవన శిఖర సందేశములు ద్యోతక మవడమే కాకుండా మన పూర్వులు ఒక నిర్వచనం చేశారు. చదువుకున్నవాడికన్న చాకలివాడు మేలని, ఈ సామెత ఎన్నోమార్లు నాకు వేదన కలిగించింది. పొత్తిగా సాహిత్యం తెలియనటువంటి పల్లెమనుష్యుల అనాలోచిత హృదయం నుంచి చప్పటి రసంనుంచి జారిపడిందని అనుకునేవాణ్ణి. కాని జీవితంలో ఈ అనుభూతి ఆస్వాదించాక ఎంతటి దూరదృష్టితో ఈ సామెత ప్రజలమధ్య కొచ్చిందో నా కవగతమైంది.

విజయనగరంలో నా చిన్నతనంలో పండితులంతా కలిసి గురజాడ అప్పారావుగారి సంచిక ప్రకటించేందుకు ఒక నిర్ణయాని కొచ్చారు. అందుకు తగిన ఏర్పాట్లు చేసేందుకు కొంత సభకూడా చేశారు. ఆ సభలో పండితులు నిర్ణయించుకొన్న దేమిటంటే, ఆంధ్రదేశంలో వుండే ప్రముఖులందరికీ తమ సత్సంకల్పాన్ని తెలియజేస్తూ, అప్పారావుగారి రచనలతో సంబంధంకంటె అప్పారావుగారి జీవితం రచన సమన్వయం చేయగలిగే ఉత్కృష్ట వ్యాసరాజాలే ప్రకటిద్దామని. అప్పారావుగారి రచనలే కాకుండా యథార్థ జీవితం తెలిసిన పండితులకు కూడా జాబులు రాశారు వ్యాసాలు పంపమని. విశిష్టులు కానివారు అప్పారావు జీవిత యథార్థాన్ని తెలిసినా చెప్పే అర్హత ఉండదు. ఇది సంఘంలో విజ్ఞానం కలిగినవారని పేరు తెచ్చుకొన్న వారి అజ్ఞానము సుజ్ఞానమని నమ్ముతున్న ఈ లోకానికి గౌరవస్తు లనుకొంటున్న

తగు మనుష్యులకు వో పెట్ట జోహారు. ఎవడు తగుమనిషి అని మనం దీర్ఘంగా ఆలోచిస్తే యథార్థం ఎప్పుడూ చెప్పనివాడు అని తేలుతుంది. లేదా వాడు చెప్పిన యథార్థంకంటె పెద్దలు చెప్పిన అబద్ధాలకు ఎక్కువ విలువిచ్చే.

అందరూ — అంటే గొప్ప గొప్ప వాళ్ళు మహామహుల కందరికీ గురజాడ అప్పారావుగారిని గురించి తెలిసిన విషయాలు రాయమని ఉత్తరాలు బనాయించారు. నాకు గురజాడ అప్పారావుమీద ఎంతో మమకారం. నా హృదయంలో ముగ్గుపెట్టి దీపం పెట్టిన మహానుభావుడు. అప్పారావుగారి జీవిత విశేషాలు ఎలాగైనా కష్టపడి సంపాదించి, వారు వేయబోయే సంచికలో ప్రకటించి నా జీవితం చరితార్థం చేసుకొందా మనుకొన్నా, వయస్సుచేత చిన్నవాణ్ణి, పేరు ప్రఖ్యాతుల్లేవు. కాని అప్పారావుగారికి ఎట్లాగైనా నా ఋణం తీర్చుకొనే సంకల్పం కలిగింది. కాపురస్థలం విజయనగరమే అవడంవల్ల కనబడిన వాళ్ళనల్లా అప్పారావుగారిని గురించి మీకేం తెలుసు అని కాకిలాగ అరిచేవాణ్ణి. ఒక్కరు కూడా జవాబు చెప్పలేదు. సరికదా అప్పారావుగారు గొప్పవారా అని అడ్డు సవాళ్ళు వేస్తూ అప్పారావు వెర్రి ఇతనికీ పట్టిందని ఏవగించుకొని నన్ను తప్పించుకొనేవారు. నా గురజాడ అరసిచెప్పి నన్ను కృతార్థుణ్ణి చేసిన ఒక చాకలి వానికి నా కృతజ్ఞత.

విజయనగరంలో మా యిల్లు కస్పాలో ఉంది. మా తల్లిదండ్రులు గౌరవ మైన కుటుంబానికి చెందినవారు. నేను చదువు కూడా మాని సాహిత్యంలోనే కాల మంతా గడుపుతానని నాటకాల్లో వేషాలు వేస్తానని నా ఎడల సుముఖంగా వుండే వారు కారు. చిన్నప్పటి దగ్గరనుంచి నా ఆశయం జీవితంలో ఏమిటంటే నా జీవి తాన్ని సంగీత సాహిత్యాలకి మీదుకట్టి నిరాడంబరంగా జీవించుదామని. అనేక వూళ్ళ నుంచి అప్పారావుగారికి చెందిన విషయాలు, ఉత్తరాల మూలకంగా వచ్చి పడుతున్నాయి. సంచిక అతి త్వరలోనే ప్రకటించే ఏర్పాట్లు పండితసభ చేస్తున్నారు. నాకు తహతహ జాస్తి అయింది. నా ప్రయత్నాలన్నీ విఫలం అవుతున్నాయి. సంచిక ప్రకటించే కాలం ఆసన్నమయింది. నేను ఏమీ తోచక, దిగులుపడి ఇంట్లో యీజీ ఛైరులో పండుకొని ఏవిటి సాధనమని మీనమేషాలు లెక్కపెడుతున్నాను.

మా అమ్మ నా కెదురుగుండా ఉన్న వసారాలో కూచుని చాకలిదానికి బట్టలు వేస్తూ, పద్దు రాసుకుంటున్నది, బట్టలు బాగా ఉతకలేదని, డబ్బు ముందు తీసు కొని కనిపించకుండా తిరుగుతున్నాదని చాకలిదాన్ని తిడుతున్నది, చాకలది విని విని, "ఏటమ్మా దొంగలమా దొసుకులమా, మా తాత గురజాడవారింట్లో, పాతికేళ్ళ

పనిచేశాడు. ఒక్కమాట తినలేదు. నాకే బట్టలుతకడం కావమ్మొచ్చి, బంట్రోతుగా పనిచేశాడు. పల్లెత్తుమాట తినలేదు, అప్పారావుబాబు సచ్చిపోబట్టి, ఇట్టా ఊరివాళ్ళ బట్టలుతుకుతున్నాం, లేకపోతే మహారాజులా బతుకుదుం" అంది. నాకు దాని మాటలు సంగీతంలా వినిపించాయి. నేను చాకలిదగ్గరకు వచ్చి, "మీ తాత బతికున్నాడా చచ్చిపోయాడా" అని అడిగా.

'నిచ్చేపం నాగున్నాడు. కాని కళ్ళులేంపే నడవలేడు, రేవుకు రాడు. ముసిలి పండైపోయాడు' అంది. 'మీ యిల్లు ఎక్కడ'న్నా. 'గోపుల శాల దగ్గ' రంది. 'ఇప్పుడు నీతో మీ ఇంటికొస్తే మీ తాతను చూపుతావా' అన్నా. 'ఎందుకు బాబు' అంది. 'పనుం'దన్నా. 'కాని గొప్పోళ్ళు మీరు మా యింటి కొస్తారా' అంది. 'నీ వెంటే వస్తా' నన్నా. బట్టలేనా వేసుకోకుండా పైమీద తువ్వాలు వేసుకొని బయలుదేరా. వయస్సులో ఉన్న చాకెత మాసిన బట్టల మూట భుజాన్ని వేసి ముందు నడుస్తూ ఉంటే దానివెంట గళ్ళ లుంగీ, నెట్టు బనీను, పైమీద టర్కీ తువ్వాలుతోనే నడుస్తున్నా. లోకం నా పక్క వింతగా చూస్తున్నాది.

గోపులశాల మా యింటికి రెండు ఫర్లాంగులుంటుంది. పది నిముషాలలో, చాకలిపేట చేరుకొన్నాది. 'ఇదే బాబు మా యిల్లు' అని లోపలి కెళుతూ, 'తాతా నీ కోసం చిన్నబాబు వచ్చినార్రోయి' అంది. లోపలనుంచి 'దొంగనంజ, బాబులు నాకోసంయెందుకొస్తారే, నీకోసమే' అని హాస్యంగా జవాబు చెప్పాడు. లోపలికి చాకెత వెళ్ళి 'నిజంగా యెవరో వచ్చారు' అని చెప్పేసరికి, వయోవృద్ధు, ముసలి పండు, వంగిపోయిన నడుం, ముడతలు పడిన శరీరం. బోసినోరు. కఱ్ఱ నానుకొని పైకొచ్చి 'దండం బాబు దయసెయ్యండి ఏటిల్లాగొచ్చారు' అని అన్నాడు. వీధిలోకి ఉన్న ఒక అరుగుమీద కూర్చున్నా. కిందని అరుగునానుకొని చాకలి కూర్చున్నాడు

నేను చాకలివానితో, 'నీకు అప్పారావుగారిని తెలుసునా? వారింట్లో ఎన్ని రోజులు పనిచేశావు? అతను గ్రంథాలు రచించడం నీకు తెలుసా?' అన్నా. 'ఏటో. బాబయ్యా, సదువా, సంజా, చాకలాళ్ళం. ఆ బాబు నౌకరు చేసుకోని పాతికేళ్ళు బతికా, మా రాజుతండ్రి సచ్చి సర్గాన్ని ఉన్నారు. బాబు గంథాలమాట నాకు తెలియదు కాని, నేను బాబుగారి నౌకరు సేస్తున్నప్పుడు ఓ తమాసా జరిగిందిబాబు, అది సెప్తా వినండి' అని కథను ప్రారంభించాడు. "నేను ఆనంద గజపతివోరి దగ్గర శాటాబర్దారు పనిసేసీవాణ్ణి. ఆరు సచ్చిపోయాక రాజులోరు అప్పల కొండయాంబగారు, సర్కారు అయారుబాబు. ఆరికి సంకా నాగేవాణ్ణి. నాకు కాస్త

